యుగువాఁడు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములలో దేనితో నేపనిఁజేయుచుండినను, ఇంద్రియములు విషయములయందుఁ బ్రవర్తింపుచున్నవేగాని తానేమియుఁ జేయుటలేదని తలఁచుచున్నాఁ డనుటకు (5. 8-9)
యోగి—చిత్తశుద్ధికొఱకు ఫలాసక్తిరహితుఁడై కర్మనాచరించు ననుటకు (5. 11)
కర్మఫలమునందాసక్తిని విడిచి చిత్తశాంతిని బొందు ననుటకు (5. 12)
కానివాఁడు కర్మఫలమునందాసక్తచిత్తుఁడై బద్ధుఁడగు ననుటకు (5. 12)
సమస్తకర్మలను మనస్సుచే సన్న్యసించి సుఖించు ననుటకు (5. 13)
బాహ్యవిషయములయందాసక్తిలేనివాఁడై యక్షయమగు సం[illegible]సుఖము ననుభవించు ననుటకు (5. 21)
విషయసుఖము లాద్యంతములుగలవియు, దుఃఖాస్పదములును గనుక వాని యందాసక్తచిత్తుఁడు గాఁ డనుటకు (5. 22)
కామక్రోధములయొక్క వేగమును సహించు ననుటకు (5. 23)
అంతస్సుఖియు, అంతరారాముఁడును, అంతఃప్రకాశుండునై యుండు ననుటకు (5. 24)
కిని, సన్న్యాసికిని, భేదములే దనుటకు (6. 1)
యుక్తుఁడు, అనఁగా, కర్మసన్న్యాసమునకుఁ దగినవాఁడెప్పుడగుచున్నాఁ డనుటకు (6. 8-18)
యొక్క లక్షణములలో శ్రేష్ఠతరమైనవి యెట్లుండు ననుటకు (6. 9)
రజోగుణము—చేఁ గామక్రోధము లుద్భవించు ననుటకు (3. 37)
వలనఁగలిగెడు బంధము రాగాదియుక్తమగు కర్మస్వరూపమైన దనుటకు (14. 7)
కర్మయందుఁ బ్రవేశింపజేయు ననుటకు (14. 9)
సత్త్వతమోగుణములనడఁచుచున్న దనుటకు 14. 10)
ప్రధానముగాఁగలవాని లక్షణము లెట్లుండు ననుటకు (14. 12)
ప్రధానముగాఁగల వాఁడెట్టి జన్మములఁ బొందు ననుటకు (14. 15)
యొక్క ఫలము దుఃఖ మనుటకు (14. 16)
వలనలోభగుణము త్పన్నమగుచున్న దనుటకు (14. 17)
గలవారు మనుష్యలోకమున జన్మింతు రనుటకు (14. 18)
రాక్షసగణము—నందుఁబుట్టినవారి లక్షణము లెట్లుండు ననుటకు (16. 4)
రాగద్వేషములు—లేనివాఁడు, విషయముల ననుభవింపుచుండినను చిత్తశాంతిని బొందు ననుటకు (2. 64)
విషయములలోఁ బ్రతిదానియందుండు ననుటకు (3. 34)

జ్ఞానికి శత్రువు లనుటకు (3. 34)

పాపమునుజేయునట్లు ప్రేరేపించు ననుటకు (3. 37)

లేనివారు భగవత్స్వరూపులగుచున్నా రనుటకు (4. 10)

లచే, సమస్తజంతువులును జనన కాలమునందే మోహమును జెందు ననుటకు (7. 27)

రాజస—కర్తయనఁగా. ఫలాపేక్షయుఁ ద్రవ్యాపేక్షయుఁగలిగి, పరహింసాస్పదములును, సుఖదుఃఖాన్వితములు నగుకర్మలఁ జేయువాఁ డనుటకు (18. 27)

కర్మయనఁగా, కామాహంకారయుక్తమును, చేయుటకు మిగులప్రయాసకరమునగు కర్మయనుటకు (18. 24)

జ్ఞానము అనఁగా, సమస్తభూతములయందుండెడు పరమాత్మను పృథగ్విధముగాఁ దెలిసికొను జ్ఞాన మనుటకు (18 21)

తపస్సు అనఁగా నితరులవలనఁ బూజింప బడుటకును, గౌరవింపఁబడుటకును, డంబముకొఱకును జేయఁబడునది యనుటకు (17. 18)

త్యాగము, అనఁగా, కాయక్లేశభయముచేఁ గర్మనాచరింపక త్యజించుటకుఁ జేరు (18. 8)

దానము, అనఁగాఁ ఫలము నుద్దేశించి గాని, ప్రత్యుపకారార్థముగాని, అనిష్టముతో గాని, చేయఁబడు దాన మనుటకు (17. 21)

ధైర్యము అనఁగా, ధర్మార్థకామములనుగోరుచు, ఫలాకాంక్షి యగువాని ధైర్యమునకుఁ జేరనుటకు (18. 34)

బుద్ధి యనఁగా ధర్మాధర్మములను, కార్యాకార్యములను దెలియనేరని బుద్ధికిఁ జేరనుటకు (18. 31)

యజ్ఞము, అనఁగా, ఫలకాంక్షతోఁ బ్రతిష్ఠకొఱకుఁ జేయఁబడు యజ్ఞమునకుఁ జేరనుటకు (17. 12)

శ్రద్ధగలవారలు యక్షరాక్షసుల నారాధింతు రనుటకు (17. 4)

సుఖము, అనఁగా, ఇంద్రియవిషయ సంయోగము వలనఁగలిగి. ఆదియందు సుఖకరముగను, అంతమందు దుఃఖకరముగను నుండునట్టిది యనుటకు (18. 38)

ఆహారమనఁగా, కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణ రూక్షవిదాహకములును, అనారోగ్యములునైయుండు ననుటకు (17. 9)

రుద్రులలో—శంకరుఁడు భగవత్స్వరూపుఁ డనుటకు (10. 23)

లోకసంగ్రహము—ఎట్టిదనఁగా (3. 21)

కొఱకు నిష్కామకర్మ నాచరింపవలసిన దనుటకు (3. 20)

కొఱకు ననాసక్త చిత్తుఁడైన జ్ఞానియు, నాసక్తచిత్తుఁడగు పామరునివలెఁ గర్మ నాచరింపవలె ననుటకు (3. 25)

కొఱకే, భగవంతుఁడును శరీర పరిగ్రహుఁడై కర్మ నాచరించుచున్నాఁ డనుటకు (3. 22-23-24)

వరుణుఁడు—జలదేవతలలో భగవత్స్వరూపుం డనుటకు (10. 29)

వాచికతపస్సు—అనఁగా నితరులమనస్సు నొప్పింపక, ప్రియము, విశ్వాసమును, గలుగఁజేయునట్టి సత్యవాక్యములు పలుకుటయు, వేదాధ్యయనముఁ జేయు ననుటకు (17. 15)

వాదము—వాదజల్పవితండములలో భగవత్స్వరూప మనుటకు (10. 32)

వాయువు—ఆకాశమునం దెట్లు వ్యాపించుచున్నదో, అట్లే, సమస్తభూతములు పరబ్రహ్మమునందు వ్యాపించియున్న వనుటకు (9. 6)

వాసుకి—సర్పములలో భగవత్స్వరూప మనుటకు (10. 28)

వికర్మ—(నిషిద్ధకర్మ) ఇట్టిదని తెలిసికొనవలయు ననుటకు (4. 17)

విరాట్పురుషుడు—ఎట్టివాఁ డనఁగా (8. 9)

విశ్వతోముఖుఁడు—అనుబ్రహ్మ, భగవత్స్వరూపుం డనుటకు (10. 23)

విషయము—లను స్మరింపఁగూడ దనుటకు (2. 62)

లయందలి యాసక్తివలనఁ గామాది దుర్గుణములు గలుగు ననుటకు (2. 62)

ల ననుభవించుచుండినను, రాగద్వేషములు లేనివాఁడు చిత్తశాంతిని బొందు ననుటకు (2. 64)

లను మనస్సుచే స్మరించుచుఁ గర్మను మాత్ర మాచరింపని వాఁడు మిథ్యాచారుఁ డనుటకు (3. 6)

లయెడల రాగద్వేషముల నుంచగూడ దనుటకు (3. 34)

విష్ణువు—అనెడు సూర్యుఁడు, ద్వాదశాదిత్యులలో భగవత్స్వరూపుఁ డనుటకు (10. 21)

వృక్షములలో—అశ్వత్థము భగవత్స్వరూపమనుటకు (10. 26)

వేదములు—త్రిగుణాత్మకములగు విషయములను దెలుపునట్టి వనుటకు (2. 45)

తటాకమువంటి వనుటకు (2. 46)

లయందుఁ జెప్పఁబడియుండు యజ్ఞములుచేసి సోమపానముఁజేయువారు, స్వర్గాదిసుఖముల ననుభవించి మరల నీలోకమున జన్మింతు రనుటకు (9-20. 21)

వేదములలో—సామవేదము, భగవత్స్వరూప మనుటకు (10. 22)

వేదవాదరతులు—ఎట్టివా రనఁగా (2. 42-43)

వైశ్యులు—అయినను, భగవద్భక్తి గలవారైనయెడల, సద్గతిని బొందుచున్నా రనుటకు (9. 32)

కృషి గోరక్షణ-వాణిజ్యాదులు స్వభావకర్మలుగా గలిగియుందురనుటకు (18-44)

శమదమాదులు——బ్రాహ్మణులకు స్వభావకర్మ లనుటకు (18. 42)

శాస్త్రవిధి——ననుసరించి కర్మ నాచరింపనివాఁడు, సుఖమును గాని, మోక్షమును గాని పొందజాలఁ డనుటకు (16. 23)

ననుసరించియే కర్మ నాచరింపవలసిన దనుటకు (16. 24)

శీతోష్ణాదులు——ఇంద్రియ నిగ్రహముగలవారిని బాధించ వనుటకు (6. 7)

కృష్ణశుక్లమార్గముల నెఱింగిన యోగి మోసపోవఁ డనుటకు (8. 27)

శుక్లమార్గమున——పునరావర్తరహితమగు మోక్షమునకుఁబోయెడు యోగులు, పోదురనుటకు (8. 24)

శూద్రులైనను——భగవద్భక్తి గలవారైనయెడల సద్గతినిఁ జెందుచున్నా రనుటకు (9. 32)

శూద్రులకు——పరిచర్యాదులు స్వభావకర్మ లనుటకు (18. 44)

శౌర్యాదులు——క్షత్రియులకు స్వభావకర్మ లనుటకు (18. 43.)

శ్రద్ధతోటి——యెవఁ డెవఁడే యేయన్య దేవత నారాధించుచున్నాఁడో, వానివానికాయా దేవత యందట్టిశ్రద్ధను, భగవంతుఁడు స్థిరపరచుచున్నాఁ డనుటకు (7. 21)

శ్రద్ధ——సాత్త్వికమనియు, రాజసమనియు తామసమనియు, మూడు విధములుఁగలది (యనుటకు 17. 2)

జనులకు వారివారి పూర్వజన్మ కృతానుసారముగఁగలుగుచున్న దనుటకు (17. 3)

సంకల్పము——ఏవిషయమునందును లేనివాఁడు, యోగారూఢుం డనుటకు (6. 4)

సంపద్యుక్తమగు——ప్రతివస్తువును భగవదంశసంభూత మనుటకు (10. 41)

సంశయము——అజ్ఞాన సంభూతమైనదిగాన దానిని జ్ఞానమనెడు కత్తితో, ఛేధింపవలయు ననుటకు (4. 42)

సంశయాత్మకుఁడు——ఇహపరములకు రెంటికిని జెడు ననుటకు (4. 40)

కాకదృఢమైన మనస్సుతో యోగామునభ్యసించువాఁడు, కర్మబద్ధుఁడు కానేరఁ డనుటకు (4. 41)

సంసారము——అశ్వత్థవృక్షమువంటి దనుటకు (15, 1-2)

ఆనెడు వృక్షమును వైరాగ్యమనెడు ఖడ్గముతో ఛేదింపవలయు ననుటకు (15. 3-4)

ఆనెడువృక్షమును, అట్లుఛేదించి మానమోహాకాలమాదులచే విముక్తుఁడును, ద్వంద్వరహితుడునగువాడు పరమపదమును జెందు ననుటకు (15. 5-6)

సగుణోపాసకులు—భగవంతునికి నత్యంతప్రియు లనుటకు (12. 2)
సులభముగ సంసారసాగరమును దరింపఁగల రనుటకు (12. 6-7)
సగుణోపాసన—చేయలేనివాఁడు, యోగాభ్యాసముచేఁ దరింపవచ్చు ననుటకు (12. 9)
సత్—అనుశబ్దము ప్రశస్తమైన కర్మల నారంభించు నపు డుచ్చరింపఁబడు ననుటకు (17. 26)
సత్—అనుశబ్దము యజ్ఞదాన తపస్సులయందలి నిష్ఠను నన్వయింపుచున్న దనుటకు (17. 27)
సత్కర్మాచరణము—చేయలేకపోయినను సర్వకర్మపరిత్యాగము చేయువలయు ననుటకు (12. 11)
సత్త్వగుణము—వలనఁగలిగెడు బంధము నిరుపద్రవకరమైనదియు, జ్ఞానస్వరూపమైనదియు ననుటకు (14. 6)
సుఖమునందుఁ బ్రవర్తింపఁజేయు ననుటకు (14. 9)
రజస్తమోగుణములనడఁచుచున్న దనుటకు (14. 10)
ప్రధానముగాఁగలవాని లక్షణము లెట్లుండు ననుటకు (14. 11)
ప్రధానముగాఁగలవాఁడెట్టిలోకమునుబొందు ననుటకు (14. 14)
యొక్కఫలము నిర్మలమైన చిత్తశాంతియే యనుటకు (14. 16)
వలన జ్ఞానముత్పన్నమగుచున్న దనుటకు (14. 17)
గలవారలు, ఉత్తమములగు దేవాదిలోకములను బొందు రనుటకు (14. 18)
సత్త్వయుక్తమగు—ప్రతివస్తువును భగవదంశసంభూత మనుటకు (10. 41)
సన్యాసము—నకును యోగమునకును భేదములే దనుటకు (6. 2)
ను యోగమును మోక్షప్రదాయకము లనుటకు (5. 2)
అనఁగా కామ్య కర్మపరిత్యాగమునకుఁ బే రనుటకు (18. 2)
సన్యాసి—ఎట్టివాఁ డనుటకు (5. 3)
కిని, యోగికిని, భేదములే దనుటకు (6. 1)
సమభావము—జ్ఞానికి నందఱియెడల నుండు ననుటకు (5. 18)
గలవాఁడు, జీవన్ముక్తుఁడును, పరబ్రహ్మస్వరూపుఁడును ననుటకు (5. 19)
సముద్రము—సరస్సులలో భగవత్స్వరూప మనుటకు (10. 24)
సర్వధర్మంబులఁ—బరిత్యజించి భగవంతునొక్కనినే శరణునొందెడు వాఁడు సమస్త పాపములనుండి విముక్తుడగు ననుటకు (18. 66)
సహజకర్మ—దోషయుక్తమైనదైనను త్యజింపఁగూడ దనుటకు (18. 48)
సాంఖ్యము —నకును యోగమునకును భేదములే దనుటకు (4. 5)

సాంఖ్యులు—జ్ఞానయోగము నవలంబింప వలయు ననుటకు (3. 3.)

సాత్త్విక కర్త—యనగా, విషయములయం దనురాగము లేనివాఁడును, అహంకార రహితుఁడును, సిద్ధ్యసిద్ధులయందును సముఁడును నై ధైర్యోత్సాహములతోఁ గూడి కర్మ నాచరించు వానికిఁ బే రనుటకు (18. 26)

కర్మ—యనగా, రాగద్వేషములు లేక ఫలాపేక్షవదలి యాచరింపఁబడు నియతకర్మకుఁ బే రనుటకు (18 23)

సాత్త్విక జ్ఞానము—అనఁగా, వివిధములును, స్థావరజంగమాత్మకములునగు సమస్త భూతములయందుండు నాత్మయొక్కటియేయని యెఱుఁగుట యనుటకు (18. 20)

తపస్సు—అనఁగా, ఫలాపేక్ష లేక చేయఁబడు కాయిక-వాచిక-మానసిక తపస్సులకుఁ బే రనుటకు (17. 17)

త్యాగము—అనఁగా నియతకర్మలాచరణీయములే యనెడు తలంపుతో నాచరింపుచు నాకర్మలఫలాసక్తిని త్యజించుటకు బే రనుటకు (18. 9)

గలవాఁడు, కష్టతరములగు కర్మలను ద్వేషించుటయు, సుఖకరములగు కర్మల యందాసక్తిఁగొనుటయు లే దనుటకు (18. 10)

దానము—దేశకాలపాత్రముల నెఱిఁగి చేయఁబడు దానమునకుఁ బే రనుటకు (17. 20)

ధైర్యము—అనఁగా, మనఃప్రాణేంద్రియములయొక్క వ్యాపారములనుదృఢమైన యోగముతో నియమించువాని ధైర్యమునకుఁ బే రనుటకు (18. 33)

బుద్ధి—యనఁగా, ప్రవృత్తినివృత్తిమార్గములను, కార్యాకార్యములను, భయాభయములను, బంధమోక్షములను, దెలిసికొనెడు బుద్ధికిఁ బే రనుటకు (18. 30)

యజ్ఞము—అనఁగా ఫలాకాంక్ష లేక విధ్యుక్తముగఁ జేయఁబడు యజ్ఞమునకు బే రనుటకు (17. 11)

శ్రద్ధగలవారలు—దేవతలనారాధింతు రనుటకు (17. 4)

సుఖము—అనఁగా. ఆదియందు దుఃఖకరముగను అంతమందు సుఖకరముగను, ఉండునట్టి సుఖమునకు బే రనుటకు (18. 37)

ఆహారము—అనఁగా, ఆయుస్సత్త్వబలారోగ్యాదుల నిచ్చునట్టిదియు, రుచ్యమును, మనోహరమునైయుండునట్టి యాహారమునకు బే రనుటకు (17. 8)

సాత్త్వికులయందలి—సత్త్వగుణము భగవత్స్వరూప మనుటకు (10—36)

లోబృహత్సామము భగవత్స్వరూప మనుటకు (10. 35)

సుఖదుఃఖములు—ఇంద్రియనిగ్రహముగలవానిని బాధింప వనుటకు (6. 7)

సుఖము—సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు, మూఁడువిధము లనుటకు (18. 36)

సూర్యచంద్రాగ్నులయందుండెడు తేజస్సు భగవత్సంబంధమైన దనుటకు (15. 12)

సూర్యమార్గమునందు—పునరావృత్తిరహితమగు మోక్షమునకుంబోయెడు యోగులుం బోవుదు రనుటకు (8. 24-26)

సూర్యుడు—ఎట్లైతే యొక్కండె యయ్యును నీలోకమునంతటిని బ్రకాశింపజేయుచున్నాండో, అట్లే క్షేత్రజ్ఞుండగు నాత్మ క్షేత్రమగు సమస్తచరాచర ప్రపంచమును బ్రకాశింపజేయుచున్నాం డనుటకు (13. 34)

సృష్టికర్మకు—పరమాత్ముండు కర్తయైనను నాకర్మచే బద్ధుండుగాం డనుటకు (9. 9)

సృష్టిలో—ఆదిమధ్యాంతములు భగవత్స్వరూపము లనుటకు (10. 32)

స్కందుడు—(కుమారస్వామి) సేనానాయకులలో భగవత్స్వరూపుం డనుటకు (10. 24)

స్వధర్మము—పరధర్మముకంటె శ్రేష్ఠ మనుటకు (3. 35). (18. 47)

నాచరించువానికిం బాపమంటనేర దనుటకు (18. 47)

హీనంబైనను దానినే యాచరించుటమే లనుటకు (18. 48)

స్వభావగుణముచేం గర్మములన్నియు నవశముగానైనను జేయింపంబడు ననుటకు (18. 60)

స్వభావము—జనులచేత సమస్తకర్మములనుజేయించుచున్న దనుటకు (5. 14)

అధ్యాత్మమనంబడుచున్న దనుటకు (8. 3)

స్థావరములలో—హిమాచలము భగవత్స్వరూప మనుటకు (10. 25)

స్థితప్రజ్ఞుండు—సమస్తకోరికలను వదలి తృప్తాత్ముండైయుండు ననుటకు (2. 55)

సుఖదుఃఖములు, రాగద్వేషములు, లేనివాం డనుటకు (2. 56)

దేనియందు నభిలాషలేనివాండును, శుభాశుభములయందుం బ్రియాప్రియములు లేనివాం డనుటకు (2. 57)

ఇంద్రియములను విషయములనుండి కూర్మాంగములవలె మగలించు ననుటకు (2. 58)

ఇంద్రియములను వశపఱచుకొని, భగవంతునియం దాశక్తి గలిగియుండు ననుటకు (2. 61)

ఇంద్రియములను విషయములనుండి మరలించు ననుటకు (2. 68)

స్త్రీలు—అయినను, భగవద్భక్తిగలవారైనయెడల సద్గతిని బొందుచున్నా రనుటకు (9. 32)

స్త్రీలయందలి—కీర్తి-లక్ష్మి-వాక్కు-తెలివి-బుద్ధి-ధైర్యము-ఓర్పు. ఇవి భగవత్స్వరూపము లనుటకు (10. 34)

హర్షామర్షభయోద్వేగములులేనివాండు భగవంతునికిం బ్రియుం డనుటకు (12. 15)

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతాగర్భితభావబోధిని

## ప్రథమాధ్యాయము

### అర్జునవిషాదయోగము

ధృతరాష్ట్ర ఉవాచ

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవా శ్చైవ కి మకుర్వత సఞ్జయ!

అర్థము: హేసఞ్జయ ! = ఓసంజయుడా !, యుయుత్సవః + ఏవ = యుద్ధము చేయుటకే పూనుకొన్నవారై , ధర్మక్షేత్రే = పుణ్యభూమియగు, కురుక్షేత్రే = కురుక్షేత్రమునందు, సమవేతాః = కూడుకొనిన, మామకాః* = నావారలును, పాణ్డవాః + చ = పాండవులును, కిమ్ = ఏమి, అకుర్వత = చేసిరి ?

సంభాషణ

ధృతరాష్ట్రుడు — ఓసంజయుండా ! "క॥ మానుగధర్మక్షేత్రం । బైనకురుక్షేత్రమున మ - హాహవమునకుం । బూనిమనబలముఁ బాండవ । సేనయునిటువచ్చి యేమి సేసెంజెపుమా॥" నావారలైన దుర్యోధనాదులును, పాండురాజుపుత్రులగు ధర్మరాజాదులును, సంధిపొసఁగమిచే యుద్ధము చేయుటకే పూనుకొన్నవారలై పుణ్యభూమియగు కురుక్షేత్రమునకుఁబోయిరిగదా, అచ్చటఁ జేరినపిమ్మట వారేమిచేసిరి ? అనఁగా, ఆక్షేత్రమహిమనుబట్టియైన వారలు మంచిబుద్ధిపుట్టి సంధికొడఁబడిరా ? లేక యుద్ధమునే చేసిరా ?

---

* ధృతరాష్ట్రుడు సంజయుని బ్రశ్నచేయుటలో (మామకాః) అనుపదము తనపుత్రులగు దుర్యోధనాదులకును, తనతమ్ముని పుత్రులగు ధర్మరాజాదులకును సమముగా నన్వయింపఁదగియుండఁగా నట్లు చెప్పక ధర్మరాజాదులను, (పాణ్డవాః) అని ప్రత్యేకించి చెప్పుటవలన నతనికిఁ బాండవులయెడల భేదబుద్ధియే కలిగియున్నట్లు

సఞ్జయ ఉవాచ

శ్లో॥ దృష్ట్వా తు పాణ్డవానీకం। వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్య ముపసఙ్గమ్య। రాజా వచన మబ్రవీత్ ॥ 2

అర్థము: రాజా = రాజైన, దుర్యోధనః + తు = దుర్యోధనుఁడైననో, తదా = అప్పుడు, వ్యూఢమ్* = వ్యూహాకారముగా నమర్పఁబడియున్న, పాణ్డవానీకమ్ = పాండవసైన్యమును, దృష్ట్వా = చూచి, ఆచార్యమ్ = ద్రోణాచార్యుని, ఉపసఙ్గమ్య = సమీపించి, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

సంజయుఁడు — ఓధృతరాష్ట్రమహారాజా! మీవారల యొక్కయుఁ బాండవులయొక్కయు నుభయసైన్యములవారును గురుక్షేత్రమునఁజేరినపిమ్మట యుద్ధసన్నద్ధులై యందున కనుగుణ్యములగు వ్యూహములుగఁ దమతమసైన్యముల నేర్పఱచుకొని యుద్ధమునకుఁ దలపడి నిలిచియుండునట్టి సమయమున నీపుత్రుఁడును రాజును నగు దుర్యోధనుఁడట్లు వ్యూహాకారముగ నేర్పఱుపఁబడియుండు పాండవసైన్యమును బొడఁజూచి తనకు గురువగుద్రోణాచార్యునొద్దకుఁబోయి యాయనతో నొకమాటఁ జెప్పెను. అదేమనఁగా!

---

హింపఁదగియున్నది. ఇట్లూహించుటకుఁ బ్రమాణములనేకములు భారతమున నచ్చటచ్చటఁ గనఁబడుచున్నవి. అయినను వానిలో నొకటిమాత్రము, ఏదనఁగా, పాండవులు ద్రౌపదిని వివాహమై ద్రుపదునిరాజ్యమున నుండుసమయమున దుర్యోధనునకును ధృతరాష్ట్రునకును పాండవులవిషయమై జరిగిన సంభాషణరూపకముగు భారతమునందలి పద్యమీక్రిందఁ బొందుపఱుపఁ బడుచున్నది. ఆపద్యమువలన ధృతరాష్ట్రునకుఁ బాండవులయెడల నెట్టి దురభిప్రాయము గలియుండె నదియు స్పష్టము కాఁగలదు, "సీ॥ పలుకులఁ జెయ్యుల - బాండవులకుఁ బ్రీతిగలిగినట్లుండుము గాని నాదు। హృదయంబు విదురున-కెన్నఁడు నెఱిఁగింప, నేనుమీతలఁచిన యిష్టార్థంబు। తలఁచుచునుండుదు - దైవసంపదగల, వారలఁబాండవ - వరుల నేమి। చేయఁగఁగలుగు నెద్ది-చెప్పుఁడిష్టం బింక, ననినవిచిత్రవీ-ర్యాత్మజునకు॥ గీ॥ దుష్టచేష్టితుండు-దుర్యోధనుఁడిట్లు। లనియెఁ జిత్తగింపు-మవనినాథ। పాండురాజసుతులు-పాంచాలపతియొద్ద। [illegible] జేయుటుచితమిపుడు॥"

* (వ్యూఢమ్.) వ్యూహము, అనఁగా యుద్ధరంగమునందు సైన్యములను, దండవ్యూహము, శకటవ్యూహము, వరాహవ్యూహము, మకరవ్యూహము, సూచికావ్యూహము, గారుడవ్యూహము, పద్మవ్యూహము, అను నీ మొదలగు ననేకరూపములుగఁ బన్నుదురు. అందు దండవ్యూహమెట్టిదనఁగా, ముందు సేనానాయకుఁడును,

శ్లో॥ పశ్యైతాం పాణ్డుపుత్రాణా। మాచార్య! మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ। తవ శిష్యేణ ధీమతా॥ 3

అర్థము : హే ఆచార్య! = ఓ ద్రోణాచార్యుఁడా! తవ = నీ యొక్క, శిష్యేణ = శిష్యుఁడును, ధీమతా = నేర్పరియునగు, ద్రుపదపుత్రేణ = ద్రుపదరాజు కొమారుఁడైన ధృష్టద్యుమ్నునిచేత, వ్యూఢామ్ = వ్యూహాకారముగా నేర్పఱుపఁబడినదియు, మహతీమ్ = గొప్పదియునగు, పాణ్డుపుత్రాణామ్ = పాండవులయొక్క, ఏతామ్ + చమూమ్ = ఈ సైన్యమును, పశ్య = చూడుము.

దుర్యోధనుడు — ఓ ద్రోణాచార్యుఁడా! మనయెదుట నుండునట్టి యీ పాండవసైన్య మెంత గొప్పదిగా నున్నదో చూడుము. ఇది గొప్పదియగుట మాత్రమే గాక యనేక విధములగు వ్యూహములుగ నమర్పఁబడియున్నది. ఈవ్యూహములను బన్నినవాఁ డెవఁడనఁగా, నీశిష్యుఁడును, ద్రుపదరాజు పుత్రుఁడును, పాండవ సైన్యమునకు నాయకుఁడును నగు ధృష్టద్యుమ్నుఁడు. ఇతఁడు వ్యూహములు పన్నుటయందు మిగుల నిపుణతగలవాఁడు కనుకనే యితనిని పాండవులు తమసైన్యమునకు నాయకునిగ నభిషిక్తుని జేసిరి.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా। భీమార్జునసమాయుధి।
యుయుధానో విరాటశ్చ। ద్రుపదశ్చ మహారథః॥ 4

---

నడుమరాజును, వెనుక సేనాధిపతియును, రెండుప్రక్కల నేనుంగులును గుఱ్ఱములును, వీనికి నావలఁబదాతులును, నుండునట్లేఱుపఁబడినది, శకటవ్యూహ మనఁగా, ముందు సైన్యము కొంచెముగను, వెనుకసైన్యము దట్టముగను, నుండునట్టిది. వరాహవ్యూహ మనఁగా, ముందు వెనుకల స్వల్పసేనలును, నడుమ మిక్కిలి సేనలుగ నుండునది. మకరవ్యూహ మనఁగా, ముందుసైన్యము మెండుగను వెనుకఁ గొద్దిగను నుండునది. సూచికావ్యూహ మనఁగా, చీమలబారువలె నొక్కవరుసగా నుండునది. గారుడ వ్యూహ మనఁగా, ముందు సన్నముగను, వెనుక వెడల్పుగను సేనలనమర్చుట. పద్మ వ్యూహ మనఁగా, పద్మాకారముగ నుండునట్లు సేనల నమర్చుట.

3. ౧. "తే॥ చూడుమాచార్య నీదు శి-ష్యుండు ద్రుపద। సుతుఁ డమర్చిన యది పాండు-సుతులసేన। పెంపుబలుపునుగలిగియొ-ప్పినదియందు। భీమునర్జునుఁ బోలిన-బిరుదుమగలు॥"

శ్లో॥ ధృష్టకేతు శ్చేకితానః । కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజి త్కున్తిభోజశ్చ । శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ 5

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాన్త । ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ । సర్వ ఏవ మహారథాః ॥ 6

అర్థము: అత్ర = ఈపాండవసైన్యమందు, శూరాః = పరాక్రమవంతులును, మహేష్వాసాః = గొప్పవిలుకాండ్రును, యుధి = యుద్ధమునందు, భీమార్జునసమాః = భీమార్జునులతో సరిపోలినవారును నగు, యుయుధానః = సాత్యకియు, విరాటః + చ = విరటుఁడును, మహారథః = మహారథుఁడగు, ద్రుపదః + చ = ద్రుపదుఁడును, ధృష్టకేతుః = ధృష్టకేతువును, చేకితానః = చేకితానుఁడును, వీర్యవాన్ = పరాక్రమవంతుఁడగు, కాశీరాజః + చ = కాశీరాజును, పురుజిత్ = పురుజిత్తును, కున్తిభోజః + చ = కుంతిభోజుఁడును, నరపుఙ్గవః = పురుషశ్రేష్ఠుఁడగు, శైబ్యః + చ = శైబ్యుఁడును, విక్రాన్తః = పరాక్రమశాలియగు, యుధామన్యుః + చ = యుధామన్యుఁడును, వీర్యవాన్ = పరాక్రమవంతుఁడగు, ఉత్తమౌజాః + చ = ఉత్తమౌజుఁడును, సౌభద్రః = సుభద్రాపుత్రుఁడగు నభిమన్యుఁడును, ద్రౌపదేయాః + చ = ఉపపాండవులును, సర్వే = వీరందఱును, మహారథాః + ఏవ = మహారథులే.

ఇదిగాక. ఈపాండవసైన్యమునందు మిగులశూరులును, గొప్పవిలుకాండ్రును, యుద్ధమున భీమార్జునులతో సమానులునైన వారనేకులున్నారు. అట్టివారెవరనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

౧. యుయుధానుఁడు – ఇతఁడత్యధికముగ యుద్ధముచేయువాఁడు. కనుకనే యుయుధానుఁడనుపేరితనికిఁ గలిగెను. ఇతఁడు మరుత్తులయంశమున సత్యకకుఁ బుట్టినవాఁడు. కనుకనే సాత్యకియను నామాంతరమును గలవాఁడై యున్నాఁడు. మఱియు నితఁడు శ్రీకృష్ణునకుఁ దమ్ముఁడు.

౨. విరటుఁడు – ఇతఁడు మత్స్యదేశాధిపతియు, నభిమన్యునకు మామయునై యున్నాఁడు. ఇతఁడును మరుత్తులయంశమునఁ బుట్టినవాఁడే. ఇతఁడు శత్రువులను విశేషముగ నేడిపించువాఁడు. కనుకనే యితనికి విరటుఁడను పేరుగలిగెను. కాఁబట్టి యితఁడును బరాక్రమశాలియే.

3. ద్రుపదుఁడు – ఇతఁడు పాంచాల దేశాధిపతియు, ద్రౌపదికిఁ దండ్రియు, నిన్నుఁ జంపుటకై యగ్నిగుండమునఁ బుత్రుని, అనఁగా నిపుడు పాండవసైన్యమునకు

నాయకుఁడైన ధృష్టద్యుమ్నుని బడసినవాఁడును, మరుత్తులయంశమునఁబుట్టినవాఁడునై యున్నాఁడు. ఇతఁడు (దు)) అనఁగా, వృక్షము చిహ్నముగా, పెక్కుమునఁ గలవాఁడు. కావున నితనికి ద్రుపదుఁడను నామము గలిగెను.

౪. ధృష్టకేతువు – ఇతం డసంహ్లాదుని యంశమునఁ జేదిదేశాధిపతి యగు శిశుపాలునకుఁ బుట్టినవాఁడు. శత్రువులకు భయంకరమైన ధ్వజముగలవాఁడు గనుక ధృష్టకేతువను నామము గలిగెను.

౫. చేకితానుఁడు – చంద్రవినాశుఁడను వాని యంశమునఁ జికితానుఁ డను వానికిఁ బుట్టినవాఁడు.

౬. కాశీరాజు – ఇతఁడు దీర్ఘజిహ్వుఁడను వానియంశమునఁ బుట్టినవాఁడు.

౭. పురుజిత్తు – ఇతఁడు వసుదేవుని తమ్ముఁడైన కంకుఁడనువానికి, గంకయను భార్యయందుఁ బుట్టినవాఁడు, పురువంశజుల జయించినవాఁడు గనుకఁ బురుజిత్తను నామము గలిగెను.

౮. కుంతిభోజుఁడు – ఇతఁడు వసుదేవుని తండ్రియగు శూరునకు మేనత్తకొడుకును, కుంతీదేవికిఁ బెంపుడు తండ్రియునై యున్నాఁడు.

౯. శైబ్యుఁడు – ఇతఁడు పూర్వము మహాప్రసిద్ధుఁడైన శిబిచక్రవర్తి యొక్క వంశమందుఁ బుట్టినవాఁడు.

౧౦. యుధామన్యుఁడు – ఇతఁడు యుద్ధమునందు మిగులఁ గోపోద్దీపితుఁడు గాన నీతనికీపేరు గలిగెను.

౧౧. ఉత్తమౌజుఁడు – ఇతఁడు శ్రేష్ఠమైన తేజోబలములు గలవాఁడు గావున నీపేరు గలిగెను.

౧౨. సౌభద్రుఁడు, – అనఁగా సుభద్రాతనయుఁ డగు నభిమన్యుఁడు. ఇతఁడు తన తండ్రియగు నర్జునునికంటె నెక్కుడు పరాక్రమము గలవాఁడు.

౧౩. ద్రౌపదేయులు – అనఁగా ద్రౌపదియందు, ధర్మరాజునకుఁ బుట్టిన ప్రతివింధ్యుండును, భీమునకుఁబుట్టిన శ్రుతసోముఁడును, అర్జునునకుఁ బుట్టిన శ్రుతకీర్తియు, నకులునకుఁ బుట్టిన శతానీకుఁడును, సహదేవునకుఁ బుట్టిన శ్రుతసేనుఁడును — వీరే యుపపాండవులు.

ఇపుడు నేఁజెప్పిన వారందఱును మహారథులేయైయున్నారు. అనఁగా వీరిలో నొక్కొకఁడు ధనుర్విద్యయందు మిగుల నేర్పరియుఁ బదివేల విలుకాండ్రతో యుద్ధముచేయు శక్తిగలవాఁడునై యున్నాడు.

శ్లో॥ అస్మాకంతు విశిష్టా యే । తా న్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య । సంజ్ఞార్థం తా న్బ్రవీమి తే ॥ 7

అర్థము : హేద్విజోత్తమ ! = ఓవిప్రవర్యా ! అస్మాకమ్ + తు = మన వారలలోనైననో, యే = ఎవరు, విశిష్టాః = శ్రేష్ఠులో, మమ = నాయొక్క, సైన్యస్య = సైన్యమునకు, నాయకాః = అధిపతులో, తాన్ = వారిని, తే = నీకు, సంజ్ఞార్థమ్ = తెలియుటకొఱకు, బ్రవీమి = చెప్పుచున్నాను, తాన్ = వారిని, నిబోధ = తెలిసికొనుము.

స్వామీ ! పాండవసైన్యమునందలి వీరులను నేనిట్లు వర్ణించుటవలన వారలఁ జూచి భయపడుచున్నానని నీవెంచెదవేమో, అట్లెంచవలదు. ఏలయనఁగా, వారల కంటె శ్రేష్ఠులైనవారలే మన సైన్యమునందు సేనానాయకులుగ నున్నారు. అట్టివా రెవరైనదియు, వారి బలపరాక్రమము లెట్టివైనవియు, నీకుఁ దెలిసియేయుండవచ్చును. అయినను మరలనీకు జ్ఞాపకార్థము విన్నవించుచున్నాను. అవధరింపుము.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ । కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ । సోమదత్తి స్తథైవచ ॥ 8

శ్లో॥ అన్యేచ బహవ శ్శూరా । మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణా । స్సర్వే యుద్ధవిశారదాః ॥ 9

అర్థము : భవాన్ = నీవును, భీష్మః + చ = భీష్ముఁడును, కర్ణః + చ = కర్ణుఁడును, సమితింజయః = యుద్ధమున జయశీలుఁడైన, కృపః + చ = కృపాచార్యుఁడును, అశ్వత్థామా = అశ్వత్థామయు, వికర్ణః + చ = వికర్ణుఁడును, తథా + ఏవ = అలాగుననే, సోమదత్తిః + చ = సోమదత్తుని కొమారుఁడగు భూరిశ్రవుఁడును, బహవః = అనేకులగు, అన్యే = ఇతరులైన, శూరాః + చ = శూరులును, మదర్థే = నాకొఱకు, త్యక్తజీవితాః = విడువఁబడిన ప్రాణములు గలవారు, అనఁగాఁ బ్రాణములు విడుచుటకుఁ దెగించియున్నవారు, సర్వే = ( వీరు ) అందఱును, నానాశస్త్రప్రహరణాః = బహువిధములగు శస్త్రాస్త్రములు గలిగి యున్నవారును, యుద్ధవిశారదాః = యుద్ధమున నేర్పరులును ( అయియున్నారు. )

వారిలో మొదటివాఁడవు నీవేయైయున్నావు. నీయొక్క ప్రభావమెట్టి దనఁగా, నీవయోనిసంభవుఁడవుగదా ? ఇదిగాక కౌరవులమగు మాకును, పాండవు

లగు ధర్మరాజాదులకును, విలువిద్యఁ గఱపినయాచార్యుఁడ వీవే కదా? ఇట్టి నీవు మా యుభయసైన్యములయందలి యోధులకంటె శ్రేష్ఠుఁడవని వేఱె చెప్పనేల? ఇఁకను భీష్ముఁడెట్టివాఁడనఁగా, ప్రభాసుఁడను నెనిమిదవ వసువు నంశమున శంతనమహారాజునకు గంగయందుఁ బుట్టినవాఁడు. కనుకనే యితనికి శాంతనవుఁడనియు, గాంగేయుఁడనియు, నామాంతరములు గలవుగదా—మఱియు నితనిప్రభావ మెట్టిదనఁగా, నవతారపురుషుఁడగు పరశురాముని జయించిన బలవంతుఁడు. ఇఁకను కర్ణుఁడెట్టివాఁడనఁగా, సహజకుండలమండితుఁడును, శౌర్యధుర్యుండును, సముద్దీర్ణ బాహుబలుండును నైనవాఁడు. ఇఁకను కృపాచార్యుఁ డెట్టివాఁడనఁగా నితఁడు నయోనిసంభవుఁడేగదా? మాకందఱకును ధనురాచార్యుఁడుగా నుండినవాఁడుగదా? ఇతని మేనల్లుఁడును, నీపుత్త్రుఁడునగు నశ్వత్థామయన్ననో, అసమానబలపరాక్రమశాలియైన సంగతినీకుఁ దెలిసియే యున్నదిగదా? ఇదిగాక నానావిధశస్త్రాస్త్రములు గలిగి యుద్ధవిశారదులగు భూరిశ్రవుఁడు వికర్ణుఁడు మొదలగు ననేకశూరులు నాకొఱకుఁ దమప్రాణములనైన గోల్పోవ సిద్ధపడియుండుట నీవెఱుఁగుదువుగదా?

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం। బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విద మేతేషాం। బలం భీమాభిరక్షితమ్ ॥ 10

అర్థము: తత్ = అట్టి (పైఁజెప్పఁబడిన యోధవీరులు గలిగినట్టి), అస్మాకమ్ = మనయొక్క, బలమ్ = సైన్యము, అపర్యాప్తమ్ * = అపరిమితమైనదియుఁ అనఁగా లెక్కింప నశక్యమైనదియు, భీష్మాభిరక్షితమ్ = భీష్మునిచే రక్షింపఁబడుచున్నదియునై యున్నది. ఏతేషామ్ = ఈపాండవులయొక్క, ఇదమ్ = ఈ (మనయెదుట

---

10. ఈ శ్లోకమునందలి పర్యాప్తాపర్యాప్త పదములకు నర్థమును వివరించుటయందు వ్యాఖ్యాతలు గొందఱొకవిధముగను, మఱికొందరు మఱియొక విధముగను వివరించియున్నారు. అనఁగా గొందఱు వ్యాఖ్యాతలు, భీష్మునిచే రక్షింపఁబడుచున్న తన సైన్యము (అపర్యాప్తమ్) పరిమితిలేనిది, అనఁగా—లెక్కించుటకు నశక్యమగు నంతటి గొప్పదిగ నున్నదనియు, భీమునిచే రక్షింపఁబడుచున్న పాండవసైన్యము (పర్యాప్తమ్) పరిమితమైనది, అనఁగా – లెక్కింపఁదగినంత కొద్దిపాటిదనియు వ్యాఖ్యానము చేసియున్నారు. మఱికొందఱు వ్యాఖ్యాతలు, భీష్మునిచే రక్షింపఁబడుచున్న తనసైన్యము, భీమునిచే రక్షింపబడుచున్న పాండవసైన్యమును జయించుటకు (అపర్యాప్తమ్) చాలినది కాదనియు, భీమునిచే రక్షింపఁబడుచున్న పాండవసైన్యము భీష్మునిచే రక్షింపఁబడుచున్న తన సైన్యమును

నున్న), బలమ్+తు = సైన్యమన్ననో, పర్యాప్తమ్† = పరిమితమైనదియు, అనఁగా లెక్కింపశక్యమైనదియు, భీమాభిరక్షితమ్=భీమునిచే రక్షింపఁబడినదియునై యున్నది.

అట్టి మనసైన్యము భీష్మునిచే సంరక్షింపఁ బడుచున్నది – భీష్ముఁడెట్టివాఁడనఁగా, "గీ॥ పరశురాముజయించిన – బల్లిదుండు। భీష్ముఁడవనీశులీతని – పేరువినినఁ। బాఱుచుండుట యెఱుఁగవే – పాండుపుత్రు। లనఁగ నెంతటివారితం –డలిగె నేని॥ (భారతం – ఉద్యో – ప – ౨–ఆ.) మఱియు మనబలము పదునొకండక్షౌహిణులు

---

జయించుటకు (పర్యాప్తమ్) చాలియున్నదనియు, వ్యాఖ్యానము చేసి యున్నారు. ఇందెవరి యభిప్రాయము సరియైనదిగా నుండవచ్చునని యోచించిచూడఁగా, భారతమున నుద్యోగపర్వము రెండవయాశ్వాసమున, దుర్యోధనుఁడు తనతండ్రితో – స్వపక్షవీరుల సామర్థ్యమునుగుఱించి చెప్పునపుడు తమ యుభయసైన్యములయొక్క పర్యాప్తాపర్యాప్తతలను గుఱించి చెప్పియుండెడు నొకవచన మీక్రిందఁ బొందుపఱుపఁబడియున్నది. దీనింబట్టి చూడఁగా, మొదటివ్యాఖ్యాతలు కనఁబఱచిన యభిప్రాయమే, అనఁగాఁ దనసైన్యము మిగుల గొప్పదనియుఁ, బాండవసైన్యము మిగులఁ గొద్దిపాటిదనియు, దుర్యోధనుఁడు చెప్పినట్లూహించుటయే, సరియైన యభిప్రాయముగ నున్నట్లు తోఁచుచున్నది. "వ॥ దుశ్శాసన దుస్సహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదులగు నీకొడుకులొకండొకండ జగంబులెల్లఁ జయింపఁజాలుదురు. అట్లుగాన భయంపడవలవ దవధరింపుము. సహజకుండలమండితుండును, శౌర్యధుర్యుండును, సముదీర్ణబాహుబలుండునునగు కర్ణుండును, వీరునొక్క మొగంబై త్రోఁచినడచిన, సవ్యసాచియొక్కరునిన కాదు పాండవులనెల్ల నొక్కుత్తున వైచికొననోపుదు రదియునుంగాక, మాకు నక్షౌహిణులు పదునొకండు, వారికి నేడు. మాసైన్యంబు సాగరంబు, వారి బలంబు నిస్సారంబు, మమ్మువ్విధంబున జయింతు రీ యెక్కువతక్కువలు విచారింపక

---

వలవని వెఱపుగట్టుకొని ముక్కారి యూరక వగచుచున్నవాఁడవు; నిన్ను వగవకుండ నుడుపంజాల మంత్రియుగాని తక్కిల్లపనులకుం జాలుదుమని సంజయుదెసఁ గనుంగొని సుయోధనుం డిట్లనియె॥"

† ఇదియునుంగాక భారతమును దెనుగించిన తిక్కనకవి గూడ, భీష్మపర్వము ౧. ఆశ్వాసమున నీక్రింద బొందుపఱచఁబడిన వచనములో నీపర్యాప్తాపర్యాప్త పదముల యర్థమును వివరించి వ్రాయుటలో, పాండవసైన్యముకంటెఁ దనబలమే మిగులసమర్థమైనదని దుర్యోధనుం డభిప్రాయమును గనఁబఱచినట్లు వ్రాసి యున్నాఁడు. "వ॥ సాత్యకి విరాటుండు ద్రుపదుండు ధృష్టకేతుండు చేకితానుండు గాశీరాజు

గలిగి మిగులగొప్పదిగ నున్నది. ఇఁకను పాండవసైన్యమన్ననో భీమునిచే సంరక్షింపఁబడినదై యున్నది. అనఁగా వారిసైన్యమునకు ధృష్టద్యుమ్నుఁడు నామకార్థము సేనానాయకుఁడుగ నుండినను నీభీముఁడే మిగుల బలశాలియనియుఁ, గౌరవులనందఱ వధించుటకు శపథముఁజేసినవాఁడనియు, దామితనిసహాయము వలననే జయముఁ బొందఁగలమనియు, పాండవులు నమ్మియున్నారు గనుక వారిసైన్యమితనిచే రక్షింపఁబడుచున్నదని చెప్పుటకుఁ గారణమైనది. అయితే, ఆభీము డెట్టివాఁడనఁగా, దేహబలము గలవాఁడేగాని ధనుర్విద్యయం దెంతమాత్రమును నేర్పరిగాఁడు సరేగదా, మిగుల మోటుతనముగఁ బనిచేయువాఁడుగాని నేర్పరితనముతోఁ బనిచేయువాఁడు గాఁడు గాన నతనిబలపరాక్రమములు పనికిరావు.

ద్రోణాచార్యుఁడు – ఓయిదుర్యోధనా! భీముఁడు సామాన్యుఁడని నీవెంచుచున్నావేమో యటులెంచవలదు; అతనికి ధనుర్విద్యయందు నేర్పరితనములేక పోయినను మిగుల బాహుబలము గలవాఁడును, గదాయుద్ధమున మిక్కిలి నేర్పరియు, నైయున్నాఁడు. అతఁడు గదఁబూని మనసేనమీఁద కుఱికినయెడల మనసేనయందలి రథగజతురగ పదాతులనెల్ల నుగ్గునుగ్గుగఁగొట్టి పాఱవేయఁగల శక్తిగలవాఁడు గాన నతని సామాన్యునిఁగఁ దలంపకుము.

దుర్యోధనుఁడు – ఓహో నీవట్లెంచి యున్నావా యేమి? అతఁడు గదాయుద్ధమున మాత్రమే నేర్పరియై యున్నాఁడు గదా? అట్టి గదాయుద్ధమున నైనను నాతో

పురుజిత్తుకుంతిభోజుఁడు శైబ్యుండు యుధామన్యుండు నుత్తమౌజుండు నభిమన్యుఁడు ద్రౌపదేయులు నారలంగనరుం జాలు మానుసులు నానాస్త్రకోవిదులు వివిధయుద్ధవిశారదులు నిట్లుగూడి భీమాభిరక్షితంబగు నబ్బలంబు సాల సమర్థంబై మెఱసె. మన సేనానాయకులం జెప్పెద. నిన్నును భీష్ముని నెన్న నేల, కృపాచార్యుం డశ్వత్థామ శల్యుండు వికర్ణుండు భూరిశ్రవసుండు మఱియుం బెక్కండ్రు రథికవరులు గలరు. పరాక్రమ సంపన్నులు యుద్ధవిశారదులు వీరందఱు నాకయి ప్రాణంబుల విడిచెదమని యున్న వారిట్లు బెరసి భీష్మపరిపాలితంబైన యీసైన్యంబు పెద్దయు సమర్థంబై తోఁచుచున్న యది. మీరెల్లరును వలయు నెడల నిలిచి భీష్మునకుఁ గావలి గావలయుననిన ద్రోణుం డట్లగాక యింత సెప్ప నేమిటికనియె నప్పలుకులు విని యమ్మహీపతికిఁ బ్రియంబుపుట్ట శాంతనవుండు సింహనాదంబు సేసి శంఖంబుపూరించిన॥" కాన నీయంశముల నన్నింటినిఁ బట్టిచూడఁగా మొదటఁ జెప్పఁబడిన వ్యాఖ్యాతల యభిప్రాయమే సరియైనదిగాఁ దోఁచుచున్న యది.

సమానుఁడుగాఁడని నీవెఱుంగవు గాఁబోలును జెప్పెదవినుము. "మ॥ గద నాతో సరి మూఁడులోకములనేఁ - గానంజలంబెత్తియు। న్మదుఁడా భీముఁడునన్ను నిం దొడరిన-। న్వ్రజప్రహారంబుచే। ట్టిదమైతాఁకినఁ గూలుపర్వతముమా - డ్కిన్గుంభినిఁగూలఁద్రే సెద నాకోర్కి గదా గదారణమువ - చ్చెంబెద్దకాలంబునన్॥ గీ॥ అతఁడువడిన వెండి-యా సేనఁ గొల్లల। నేయఁనొకఁడు లేమిసిద్ధమింత। యెఱిఁగిపెఱచికాఁజ - యెనూళు లైనను। దనకుఁ జాలుననియె ధర్మసుతుఁడు"॥ (భార-ఉద్యో - ౨-ఆ). ఇది యిట్లుండఁగా వారిసేన మనసేనకంటె మిగులఁగొద్దిపాటిదై యున్నది. అదెట్లనఁగా, మనసేన పదునొకండక్షౌహిణులు గలదిగదా ? వారిసేన యన్ననో యేడక్షౌహిణులు మాత్రమే గలదిగానున్నది. గనుక మనసేన యపరిమితమైనదియు, (Unlimited) వారిసేన పరిమితమైనదియు (Limited), గనున్నవి. కాన నట్టి విషయమునఁ గూడ మనము భయపడఁబనిలేదు.

శ్లో॥ అయనేషుచ సర్వేషు। యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభిరక్షన్తు। భవన్త స్సర్వ ఏవహి॥ 11

అర్థము : హి = కాఁబట్టి, భవన్తః + సర్వే + చ = మీరందఱును, సర్వేషు = సమస్తములైన, అయనేషు + ఏవ = మార్గములయందే (వ్యూహముల మొగాళ్ళముల యందే యనిభావము), యథాభాగమ్ = మీమీస్థానములను విడువక, అవస్థితాః + (సన్తః) = ఉన్నవారై, భీష్మమ్ + ఏవ = భీష్మునే, అభిరక్షన్తు = కాపాడుదురుగాక.

అయినను మన మొక్క విషయమున మాత్రము భయముగలిగి జాగ్రత్తతోఁ బ్రవర్తింప వలసియుంచున్నది. అదెద్దియనఁగా, భీష్ముని బలపరాక్రమములను గుఱించి యింతకుముందు చెప్పియున్నానుగదా ? అట్టి భీష్ముఁడిపుడు మనసైన్యమున కంతటికిని నాయకుఁడును సంరక్షణకర్తయునైయున్నాఁడు. గనుకను, ఆయనకేదైన నపాయము గలిగినయెడల మనసైన్యమున కంతటికిని హానిసంభవించును గనుకను మీరందఱు నన్ని దిక్కుల వ్యూహ మార్గముల యందు శత్రులఁ జొరనీక భద్రముగనుండి భీష్మునే కాపాడు చుండవలయును. ఏలయనఁగా - "క॥ కన్నాకు మనకుభీష్ముం। డిన్నర వరుఁ గావవలయు - నెమ్మెయినైనం। దన్నుం గాచిననితఁడుజ। గన్నుతముగ రణము ననుబ-గఱనడఁగించున్॥" (భార - భీష్మ - ౧ ఆ). అయితే, భీష్ముఁడు మనకందఱ కును మొనగాఁడుగను, మనల నందఱఁ గాపాడుటకుఁ దగిన భుజబలపరాక్రమములు గలవాఁడునై యుండఁగా నట్టిభీష్ముని మనము గాపాడవలయునాయని యెంచెద వేమో యందునకుఁ గారణమగు భీష్ముని సొంతవచనములనే చెప్పెదవినుము. క॥ విసుఁడన్యు లెవ్వరునువా। మునుమునఁబడి బ్రదుకరాల - ములనేనుశిఖం। డినినోర్వఁ జాలఁజాండీ।

యనిమన యుద్యోగి వేళ - యప్పుడచెప్పెన్ ॥" (భార - భీష్మ - ౧ ఆ). కావున మనమెంతమాత్రమేమఱియుండఁగూడదు. అశ్లేమఱి యుండినయెడల మనకుఁ గలిగెడు కీడెట్టిదనఁగా - "ఉ॥ ఏమఱిరక్షచాలనిమ్ము - శేంద్రుని నక్కయుఁ గోలు పుచ్చుసం। గ్రామములోనఁ గన్కలిగి - కావకతక్కిన నాశిఖండిచే। నీ మనుజేంద్రుఁ గోల్పడమె - యిట్టిదిగోల్పులి నిద్రవోవను। ద్దామబలంబునన్గొఱియ - దాఁకివధించిన యట్టులుండదే ॥క॥ కావుననీ యుద్భటరథి। కావలియివ్విభునిగాచు - నట్లుగఁ బనుపం। గావలయు మీరలందఱు। నేవలఁజూచిన శిఖండి। కెదురుండెపుడున్॥"
(భార - భీష్మ - ౧-ఆ).

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ తస్య సంజనయ న్హర్షం। కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చై। శ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

అర్థము : ప్రతాపవాన్ = పరాక్రమవంతుఁడును, కురువృద్ధః = కౌరవులలో వృద్ధుఁడును, పితామహః = తాతయునగు భీష్ముఁడు, తస్య = ఆదుర్యోధనునకు, హర్షమ్ = సంతోషమును, సఞ్జనయన్ = పుట్టించువాఁడై, ఉచ్చైః = గట్టిగా, సింహనాదమ్ = సింహపుఱంకెవంటి, కంఠధ్వనిని, వినద్య = చేసి, శఙ్ఖమ్=శంఖమునుఁ దధ్మౌ = పూరించెను.

సంజయుఁడు - అయ్యా! ధృతరాష్ట్ర మహారాజా! నీపుత్రుఁడగు దుర్యోధను, డిట్లు ద్రోణాచార్యునితోఁ జెప్పుచుండిన సంగతులను వినుచుండిన భీష్ముఁడు తన యందే దుర్యోధనుఁడు యావద్భారము నుంచి యున్నాఁడని తెలిసికొన్నవాఁడై యట్టియతని నమ్మకమును స్థిరపఱచి యందువలన నతని మనస్సునకు సంతోషమును గలుగఁజేయఁదలచినవాఁడై తనకు యుద్ధవిషయమునఁ గలిగి యుండెడు నుత్సాహము నతనికిఁ దెలుపుటకై యెలుఁగెత్తి సింహపుఱంకెవంటి పెద్దకేక వేసి తన శంఖమును బూరించెను.

శ్లో॥ తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ। పణవానకగోముఖాః।
సహసై వాభ్యహన్యన్త। సశబ్ద స్తుములో భవత్॥ 13

12 ౧. శమయతి దుష్టానితిశంఖమ్ = దుష్టులను శమింపఁజేయునది.

13 "క॥ తనతనశంఖంబునఁ ద।క్కనుగలదొరలెల్ల ననికి - గొనకొనిపూరిం।చిన వివిధతూర్యనాదం। బునుజెలఁగె నభంబుదిశలుఁ - బూర్ణంబులుగాఁ ॥"

అర్థము: తతః = పిమ్మట, శఙ్ఖాః + చ = శంఖములును, భేర్యః + చ = దుందుభులును, పణవానకగోముఖాః = ఉడుకలును, తప్పెటలును, కొమ్ములును, సహసా + ఏవ = శీఘ్రముగానే, అభ్యహన్యన్త = వాయింపఁబడెను, సః + శబ్దః = ఆవాద్యములవలనిధ్వని, తుములః = అంతట వ్యాపించినదిగా, అభవత్ = ఆయెను.

భీష్ముండట్లు శంఖంబును బూరించినవెంటనే కౌరవసైన్యమునందలి తక్కిన వారు తమసేనానాయకుఁడగు భీష్ముఁడు శంఖమును బూరించుటయే యుద్ధమును బ్రారంభించుటకు ననుజ్ఞఁగాఁగొని తమతమ శంఖములు, భేరులు, ఉడుకలు, తప్పెటలు, కొమ్ములు, మొదలగు యుద్ధవాద్యములను బ్రోయించిరి. అప్పుడాధ్వని యాకసము నందును, దిక్కులయందును, అంతటఁ బర్వినదాయెను.

శ్లో॥ తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే । మహతి స్యన్దనే స్థితౌ ।
మాధవః పాణ్డవ శ్చైవ । దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః ॥ 14

అర్థము: తతః = పిమ్మట, శ్వేతైః = తెల్లని, హయైః = గుఱ్ఱములతోడ, యుక్తే = కూడినదియు, మహతి = గొప్పదియు నగు, స్యన్దనే = రథము నందు, స్థితౌ = కూర్చుండి యున్న, మాధవః = కృష్ణుఁడును, పాణ్డవః + చ + ఏవ = అర్జునుఁడును, దివ్యౌ = దివ్యములగు, శఙ్ఖౌ = శంఖములను, ప్రదధ్మతుః = పూరించిరి.

అట్లుకౌరవసైన్యమున వాద్యములు మ్రోఁగినవెంటనే పాండవ సైన్యమునందును శ్వేతాశ్వములఁ బూన్పఁబడిన గొప్పరథమునందుఁ గూర్చుండియున్న కృష్ణార్జును లిరువురును దామును యుద్ధమునకు సిద్ధముగ నున్నామని తెలుపుటకుఁగాను దివ్యము లగు తమశంఖములను బూరించిరి.

శ్లో॥ పాఞ్చజన్యం హృషీకేశో । దేవదత్తం ధనఞ్జయః ।
పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం । భీమకర్మా వృకోదరః॥ 15

శ్లో॥ అనన్తవిజయం రాజా । కున్తీపుత్రో యుధిష్ఠిరః ।
నకుల స్సహదేవశ్చ । సుఘోషమణిపుష్పకౌ ॥ 16

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస । శ్శిఖణ్డీచ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ । సాత్యకి శ్చాపరాజితః ॥ 17

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ । సర్వశః పృథివీపతే ! ।
సౌభద్రశ్చ మహాబాహుః । శ్శఙ్ఖా న్దధ్ముః పృథక్పృథక్ ॥ 18

అర్థము : హేపృథివీపతే ! = ఓ ధృతరాష్ట్ర మహారాజా !, హృషీకేశః = కృష్ణుఁడు, పాఞ్చజన్యమ్ = పాంచజన్యమను శంఖమును, దధ్మౌ = పూరించెను. ధనఞ్జయః = అర్జునుఁడు, దేవదత్తమ్ = దేవదత్తమను శంఖమును, (దధ్మౌ) = పూరించెను, భీమకర్మా = భయంకరవ్యాపారము గల, వృకోదరః = భీముఁడు, పౌణ్డ్రమ్ = పౌణ్డ్రమనియెడు, మహాశఙ్ఖమ్ = గొప్పశంఖమును, (దధ్మౌ) = పూరించెను. కున్తీపుత్త్రః = కుంతీదేవికిఁ బుత్త్రుఁడైన, యుధిష్ఠిరః = యుధిష్ఠిరుఁ డను పేరుగల, రాజా = ధర్మరాజు, అనన్తవిజయమ్ = అనంతవిజయమను శంఖమును, (దధ్మౌ) = పూరించెను. నకులః = నకులుఁడును, సహదేవః + చ = సహదేవుఁడును, సుఘోష మణిపుష్పకౌ = సుఘోషమును మణిపుష్పకము ననెడుశంఖములను, దధ్మతుః = పూరించిరి. పరమేష్వాసః = గొప్పధనుస్సుగల, కాశ్యః + చ = కాశీరాజును, ధృష్టద్యుమ్నుఁడును, విరాటః + చ = విరటుండును, అపరాజితః = అపజయమునొందని, సాత్యకిః + చ = సాత్యకియు, ద్రుపదః = ద్రుపదుఁడును, ద్రౌపదేయాః + చ = ద్రౌపదీపుత్త్రులగు ప్రతివింద్యాదులును, మహాబాహుః = గొప్ప భుజములుఁగల, సౌభద్రః + చ = సుభద్రాపుత్త్రుఁడగు నభిమన్యుఁడును, సర్వశః = అంతట (అన్నిదిక్కులయందు), పృథక్ + పృథక్ = వెవ్వేఱుగా, శఙ్ఖాన్ = (తమతమ) శంఖములను, దధ్ముః = పూరించిరి.

అనఁగా శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుఁడు దేవదత్తమును బూరించిరి. ఇట్లువారు పూరించినవెంటనే యుద్ధరంగమున మిగులఁ గ్రూరకార్యములఁ జేయువాఁ డగు భీముఁడు విజృంభించి గొప్పదియగు పౌండ్రమను పేరుగల తనశంఖము నెత్తి పూరించెను. అంతటఁ గుంతీదేవికి జ్యేష్ఠపుత్త్రుఁడును, పాండవ సైన్యమునకు రాజునగు యుధిష్ఠిరుఁ డనంతవిజయమను పేరుగల తనశంఖమును బూరించెను. అప్పుడే నకులుఁడు తనదియగు సుఘోషమను శంఖమును, సహదేవుఁడు తనదగు మణిపుష్పకమను శంఖమును బూరించిరి. వారట్లు పూరింపుచుండఁగా వారలకుసహాయముగా వచ్చియుండెడు రాజులలో గొప్ప విలుకాఁడగు కాశీదేశపురాజును, మహారథుఁడగు శిఖండియు. ధృష్టద్యుమ్నుఁడును, విరటుఁడును, జయశీలుఁడగు సాత్యకియు, ద్రుపదుఁడును, ద్రౌపదీ పుత్త్రులగు ప్రతివింద్యుఁడు, శ్రుతసోముఁడు, శ్రుతకీర్తి, శతానీకుఁడు, శ్రుతసేనుఁడు నను పేర్లుగల యుపపాండవు లైదుగురును, సుభద్రాపుత్త్రుఁడును నాజానుబాహువునగు నభిమన్యుఁడును, వీరందఱును వేఱువేఱుగాఁ దమతమ శంఖములను బూరించిరి.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం । హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ । తుములో వ్యనునాదయన్ ॥ 19

అర్థము: తుములః = సంకులమైన, సః + ఘోషః = ఆధ్వని, నభః + చ = ఆకాశమును, పృథివీమ్ + చ + ఏవ = భూమినిని, వ్యనునాదయన్ = ప్రతిధ్వనులీనునట్లుచేయుచు, ధార్తరాష్ట్రాణామ్ = దుర్యోధనాదులయొక్క, హృదయాని = గుండెలను, వ్యదారయత్ = పగులఁగొట్టెను.

"క॥ అనయము నుగ్రంబగుత । ద్ధ్వనిగాంధారేయ హృదయ - దారణమై పాం। డునరేంద్రపుత్రసైనిక । మనోహరంబగుచుఁ జెలఁగె-మనుజాధీశా ।" (భార-భీష్మ - ౧ - అ.)

అట్లు పాండవసైన్యమునఁ బూరింపఁబడిన యన్ని శంఖముల యొక్కయు ధ్వనులొకటిగాఁజేరి భూమ్యాకాశములయం దంతట నిండినదై కౌరవసైన్యమునందలి యోధవరులగు దుర్యోధనాదులయొక్క గుండియలను బ్రద్దలుచేసెను.

శ్లో॥ అథ వ్యవస్థితా న్దృష్ట్వా । ధార్తరాష్ట్రా న్కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసమ్పాతే । ధను రుద్యమ్య పాణ్డవః ॥ 20

శ్లో॥ హృషీకేశంతదావాక్య । మిదమాహమహీపతే ॥ 20-ఎ

అర్థము: హేమహీపతే! = ఓధృతరాష్ట్ర మహారాజా!, అథ = పిమ్మట, శస్త్రసమ్పాతే * = యుద్ధము, ప్రవృత్తే + (సతి) = ప్రారంభ మగుచుండఁగా వ్యవస్థితాన్ = (యుద్ధరంగమున) నిల్చియున్న, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, దృష్ట్వా = చూచి, కపిధ్వజః = హనుమచ్చిహ్నితమగు జెండాము గల, పాణ్డవః = అర్జునుఁడు, ధనుః = వింటిని (గాండీవమును) ఉద్యమ్య = ఎత్తిపట్టి,

20 * (శస్త్రసమ్పాతే). ఈశ్లోకమునందు "శస్త్రసమ్పాతే ప్రవృత్తేసతి" అను పదములకు సరియయిన యర్థము "బాణములుపడుట జరుగుచుండఁగా" అని చెప్పవలసి వచ్చుచున్నది. అయితే, అట్లుచెప్పినయెడల నుభయసైన్యముల వారు నొకరిమీఁద నొకరు బాణములువిడుచుట ప్రారంభించినపిదప నర్జునుఁడును గృష్ణుఁడును, ఉభయసైన్యములమధ్యమున నిలిచి యీభగవద్గీతయందలి పదునెనిమిది యధ్యాయములలోని విషయములను గుఱించి సంభాషించినట్లూహింప వలసియుంచున్నది. అట్టిసమయమున నంతసావకాశముగ వార లుభయులు మాటలాడుట కవకాశముండదు గనుక నట్లూహించుట యసంగతమైనపనిగా నుంచున్నది. కాఁబట్టి పైపదములకు శస్త్రసంపాతమే స్వరూపముగాఁగలయుద్ధము ప్రారంభింపఁబడఁ బోవుచుండఁగానని కవిహృదయమై నట్లూహింపఁదగియున్నది.

తదా = అప్పుడు, హృషీకేశమ్ = కృష్ణునిఁగూర్చి, ఇదమ్ + వాక్యమ్ = ఈక్రిందఁ జెప్పఁబోయెడుమాటను, ఆహ = జెప్పెను.

ఓధృతరాష్ట్రమహారాజా! అట్లుభయసైన్యములవారును దమతమ శంఖములను బూరించియయినపిమ్మటఁ గపిధ్వజుఁడగు నర్జునుఁడు యుద్ధరంగమున సన్నద్ధుఁడై నిలిచియుండు నీపుత్రులు మొదలగు వారలఁజూచి యుభయసైన్యముల వారు నొకరిపై నొకరుబాణములఁ బ్రయోగింప నుద్యుక్తులగుటంగని తన ధనుస్సగు గాండీవమును జేతనెత్తుకొని తనసారథియగు శ్రీకృష్ణునవలోకించి యిట్లనియె.

అర్జున ఉవాచ:

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే। రథం స్థాపయ మేచ్యుత!। 21

శ్లో॥ యావ దేతా న్నిరీక్షేహం। యోద్ధుకామా నవస్థితాన్।
కై ర్మయాసహ యోద్ధవ్య। మస్మిన్ రణసముద్యమే॥ 22

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేహం। యఏతేత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే। ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ 23

అర్థము: హేఅచ్యుత! = ఓకృష్ణమూర్తి!, యుద్ధే = యుద్ధమునందు, దుర్బుద్ధేః = దుష్టబుద్ధియయిన, ధార్తరాష్ట్రస్య = దుర్యోధనునకు, ప్రియచికీర్షవః + (సన్తః) = ప్రియమునుజేయ నిచ్చగించినవారై, అత్ర = ఈ (కౌరవసైన్యమందు) యే + ఏతే = ఏవీరలు, సమాగతాః = వచ్చియున్నారో, (తాన్) + యోత్స్యమానాన్ = అట్టి యుద్ధముచేయఁ గోరిన వారిని, అహమ్ = నేను, అవేక్షే = చూచుచున్నాను. (చూడఁ గోరుచున్నాను.) (తతః) = కనుక, కైః = ఎవరిచేత, మయా + సహ = నాతోఁగూడ, యోద్ధవ్యమ్ = యుద్ధము చేయఁదగియున్నదో., అస్మిన్ + రణ సముద్యమే = ఈయుద్ధోద్యోగమందు, యోద్ధుకామాన్ = యుద్ధము చేయ నిచ్ఛగలవారై, అవస్థితాన్ = నిలిచియున్నట్టి. ఏతాన్ = వీరిని, అహమ్ = నేను, యావత్ = ఎంతపర్యంతము, నిరీక్షే = చూచుచున్నానో, (తావత్) = అంతపర్యంతము, మే = నాయొక్క, రథమ్ = రథమును, ఉభయోః = రెండైన, సేనయోః = సైన్యములయొక్క, మధ్యే = మధ్యప్రదేశమునందు, స్థాపయ = నిలుపుము.

"తే॥ గీ॥ కౌరవులలోన నిప్పుడె - వ్వారితోడ। ననికిఁగడఁగుదునో చూచి - కొనఁగవలయు। నరదమల్లనయుభయసై - న్యములనడిమి। నేలకటువోవఁగా నిచ్చి - నిలుపుమచట॥" (భార - భీష్మ - ౧ - అ)

అర్జు – ఓకృష్ణమూర్తీ! పాండవులమైన మాకు న్యాయముగా నివ్వవలసిన యర్ధ రాజ్యము నివ్వక చిక్కులఁబెట్టి తుదకు యుద్ధమునకుఁ బూనుకొన్న దుర్యోధనుఁడెంత దుర్బుద్ధి యనవచ్చును. ఇట్టి దుర్బుద్ధియగు దుర్యోధనునకు సహాయులై, యతనికిఁ బ్రియమును, మాకు నప్రియమును జేయఁబూనినవారై మాతోడ యుద్ధమునకుఁ దల పడిన వారెంత పెద్దమనుష్యులనవచ్చును. అట్లు మాతోడ యుద్ధముఁ జేయఁబూని యెవరెవరిచటవచ్చి యుద్ధసన్నద్ధులై నిలిచియున్నారో, యట్టివారల సంఘమును నేను జూడవలసి యున్నదిగనుక వారలనందర నేను జక్కఁగా బరికించి చూచునంత వఱకు నారథమును నుభయసైన్యముల మధ్యమున నిలిపి యుంచుము.

సఞ్జయఉవాచ :

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో । గుడాకేశేన భారత ।
సేనయో రుభయో ర్మధ్యే । స్థాపయిత్వా రథోత్తమమ్ ॥24

శ్లో॥ భీష్మద్రోణప్రముఖత । స్సర్వేషాంచ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ । సమవేతాన్ కురూ నితి ॥ 25

అర్థము : హేభారత! = భరతవంశజుఁడవగు నోధృతరాష్ట్ర మహారాజా! హృషీకేశః = శ్రీకృష్ణుఁడు, గుడాకేశేన = అర్జునునిచేత, ఏవమ్ = ఇట్లు (పై 21-22-23 శ్లోకములయందుఁ జెప్పఁబడిన ప్రకారముగా), ఉక్తః+(సన్) = చెప్పఁ బడినవాఁడై, ఉభయోః=రెండైన, సేనయోః = సైన్యములయొక్క. మధ్యే = మధ్య ప్రదేశమునందు, భీష్మద్రోణప్రముఖతః = భీష్మద్రోణుల యెదుటను, సర్వేషామ్+ మహీక్షితామ్ = సమస్తరాజుల యొక్కయు, (ప్రముఖతః)+చ = ఎదుటనున్న, రథోత్తమమ్ = రథశ్రేష్టమును, స్థాపయిత్వా = నిలిపి, హేపార్థ = ఓయియర్జునా! సమవేతాన్ = (ఇచట) చేరియున్న, ఏతాన్+కురూన్ = ఈకౌరవులను, పశ్య= చూడుము, ఇతి+ఉవాచ = అనిపలికెను.

సంజయుఁడు — ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జునుఁడిట్లు చెప్పిన వెంటనే శ్రీకృష్ణుఁ డదేప్రకారముగా నారథశ్రేష్ఠమును నుభయసైన్యములమధ్య ప్రదేశమునందు భీష్మద్రోణుల యొక్కయుఁ దక్కిన సమస్తరాజులయొక్కయు నెదుటనిలిపినవాఁడై యర్జునునిఁజూచి యోయి యర్జునా! ఇదిగో నిచట యుద్ధసన్నద్ధులై నిలిచి యున్న యీకౌరవ సైనికులను జూడుమని పలికెను.

శ్లో॥ తత్రాపశ్య త్స్థితా న్పార్థః । పితౄ నథ పితామహాన్ ।
ఆచార్యా న్మాతులా న్భ్రాతౄ । న్పుత్రా న్పౌత్రా న్సఖీం స్తదా॥ 26

శ్లో॥ శ్వశురాన్సుహృదశ్చైవ। సేనయో రుభయో రపి।
తాన్సమీక్ష్య స కౌన్తేయ। స్సర్వా న్బన్ధూ నవస్థితాన్ ॥ 27

శ్లో॥ కృపయా పరయా విష్టో। విషీద న్నిద మబ్రవీత్ ॥ 27-ఎ

అర్థము: అథ = పిమ్మట, పార్థః = అర్జునుఁడు, తత్ర = అచ్చట, ఉభయోః + సేనయోః + అపి = ఉభయసైన్యముల యందును, స్థితాన్ = ఉన్నట్టి, పితౄన్ = తండ్రులను, పితమహాన్ = తాతలను, ఆచార్యాన్ = గురువులను, మాతులాన్ = మేనమామలను, భ్రాతౄన్ = అన్నదమ్ములను, పుత్రాన్ = కొమారులను, పౌత్రాన్ = మనుమలను, సఖీన్ = స్నేహితులను, తత = అలాగుననే, శ్వశురాన్ = మామలను, సుహృదః + చ + ఏవ = మేలు గోరెడు స్నేహితులను, అపశ్యత్ = చూచెను, సః + కౌన్తేయః = ఆయర్జునుఁడు, అవస్థితాన్ = (యుద్ధరంగమందు) నిలిచియున్న, సర్వాన్ = సమస్తమైన, తాన్ + బన్ధూన్ = ఆబంధువులను, సమీక్ష్య = జూచి, పరయా + కృపయా = అధికమైన కరుణచే, ఆవిష్టః + (సన్) = ఆవేశింపఁ బడినవాఁడై, విషీదన్ = వ్యసనపడుచు, ఇదమ్ = ఈక్రిందఁ జెప్పఁబోయెడు, [వాక్యమును.] అబ్రవీత్ = పలికెను.

అప్పుడర్జునుఁడా యుభయసైన్యముల యందలి వారలనందఱను బాఱఁ జూచి వారలలోఁ గౌరవసైన్య మందుండెడు వారాకౌరవుల కేలాటి బంధుత్వము గలవారై యుండిరో పాండవులగు తమకును, నట్టి బంధుత్వము గలవారుగనే యుండుటచేతను, తమసైన్యమునఁ దుండెడువారు తమకెలాటి బంధువులుగ నుండిరో, కౌరవులకును వారలలాటి బంధువులే యైయుండుటచేతను, ఆయుభయసైన్యములయందును, దనకు వరుసకుఁ దండ్రులును, తాతలును, గురువులును, మేనమామలును, అన్నదమ్ములును, కొమాళ్ళును, మనుమలుఁను, మామలును, లోనగు బంధుజనులను, అట్టి బాంధవ్యము లేకయే తనమేలుఁగోరు వారగు నితర సుహృజ్జనులను గనుఁగొనెను. అట్లుభయసైన్యములయందును యుద్ధసన్నద్ధులై నిలిచియుండు బంధుజనుల నందఱను జూచిన తోడనే యర్జునుఁడు మిగులఁ గృపాపరవశుఁడై వీరలఁజంపవలసి వచ్చెనేయని వ్యసనపడుచుఁ గృష్ణునితో నిట్లుపలికెను.

అర్జునఉవాచ:

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ!। యుయుత్సుం సముపస్థితమ్। 28

శ్లో॥ సీదన్తి మమ గాత్రాణి। ముఖంచ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే। రోమహర్షశ్చ జాయతే॥ 29

అర్థము: హేకృష్ణ! = ఓకృష్ణమూర్తీ! యుయుత్సుమ్ = యుద్ధముఁజేయు నిచ్ఛగించినదియు, సముపస్థితమ్ = (ఇచట) నిలిచియుండునట్టిదియునగు. ఇమమ్ + స్వజనమ్ = ఈ బంధుజనమును, దృష్ట్వా = చూచి, మమ = నాయొక్క, గాత్రాణి = అవయవములు, సీదన్తి = శిథిలములగుచున్నవి, ముఖమ్ + చ = నోరును, పరిశుష్యతి = ఎండుచున్నది, మే + శరీరే = నాదేహము నందు, వేపథుః + చ = కంపమును, రోమహర్షః + చ = గగుర్పాటును, జాయతే = గలుగుచున్నది.

అర్జునుఁడు - ఓకృష్ణమూర్తీ! ఇప్పుడీ యుభయసైన్యములయం దుండెడు వారు తండ్రులు, తాతలు, అన్నదమ్ములు, కొమాళ్ళు, మనుమలు మామలు, బావలు. మఱఁదులు, లోనగు వరుసలుగల బంధుజనులై యున్నారు. ఇట్టి వారందఱు నొకటిగాఁగూడి యితరులగు శత్రురాజులపైకి యుద్ధమునకుఁ బోవుట సహజమైన పద్ధతియై యుండఁగా నట్లుగాక తమలోఁదామే యుద్ధమునకుఁ బూనుకొని యొకరి నొకరు చంపుటకును జచ్చుటకును సిద్ధపడి యుద్ధరంగమున వచ్చి నిలిచి యున్నారు గదా, ఆహా యేమియాశ్చర్యము!! ఎంతదుఃఖకరమైన పనిగానున్నది, ఇది చూడఁగా నాకాళ్ళు చేతులు విలవిలఁబాఱుటయేగాక నోరుబొత్తిగఁ దడిలేక యెండుచున్నది. నాదేహమంతటను గంపమునుగగుర్పాటును గూడఁ గలుగుచున్నది.

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తా । త్త్వక్చైవ పరిదహ్యతే ।
నచ శక్నో మ్యవస్థాతుం । భ్రమతీవచ మే మనః ॥ 30

అర్థము: మే = నాయొక్క, హస్తాత్ = చేతినుండి, గాణ్డీవమ్ = గాండీవము స్రంసతే = జాఱుచున్నది. త్వక్ + చ + ఏవ = చర్మముగూడ, పరిదహ్యతే = మండు చున్నది. అవస్థాతుమ్ + చ = నిలుచుటకైనను, న + శక్నోమి = శక్తిలేకున్నాను, మనః + చ = మనస్సుగూడ, భ్రమతి + ఇవ = భ్రమించునట్లున్నది.

మఱియు నాచేతనుండెడు గాండీవము తనంతటజాఱిపోవుచున్నది. నాదేహము మీఁది చర్మమున మంటలువొడమి యారాట మెత్తుచున్నది, నేనీరథముపైని నిలుచుట కైనను శక్తిలేనివాఁడనై యున్నాను. నాకుఁ జిత్తభ్రమమును గలుగుచున్నది.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి । విపరీతాని కేశవ ।
నచ శ్రేయోనుపశ్యామి । హత్వా స్వజన మాహవే ॥ 31

హేకేశవ! = ఓకృష్ణమూర్తీ, విపరీతాని = అనర్థసూచకములగు, నిమిత్తాని + చ = శకునములనుగూడ, పశ్యామి = చూచుచున్నాను, ఆహవే = యుద్ధమునందు,

స్వజనమ్ = బంధుజనమును, హత్వా = చంపి, అను = పిమ్మట, శ్రేయః + చ = మేలునుగూడ, న + పశ్యామి = చూడను.

ఓకేశవా! నాయొక్క స్థితి యిట్లుండఁగా ననర్థసూచకములగు ననేక దుశ్శకునములుగూడ నాకగుపడుచున్నవి. వీనినన్నిటినిబట్టి చూడఁగా బంధుజన వధోద్యోగమగు నీయుద్ధ మర్హకృత్యము గాదని తోఁచుచున్నది. పోనిమ్ము, అట్లు తోఁచినను గొదువలేదు, అందువలన మనకు ముందు మేలు గలుగవచ్చును గనుక నీపని చేసెదమని యెంచెద మన్ననో, యట్లెంచుటకును వీలులేనిదై యున్నది. ఏల యనఁగా బంధుజనుల నందఱను జంపిన పిమ్మట జయము నొందియు మనకు మేలొనఁగూడు నట్లగపడదు.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖాని చ।
కింనో రాజ్యేన గోవిన్ద! కింభోగైర్జీవితేన వా॥ 32

అర్థము: హేకృష్ణ = ఓకృష్ణమూర్తీ!, (అహమ్) = (నేను), విజయమ్ = విజయమును, న + కాంక్షే = కోరను, రాజ్యం + చ = రాజ్యమును, సుఖాని + చ = సుఖములనుగూడ, (న కాంక్షే) = కోరను, హేగోవిన్ద! = ఓకృష్ణమూర్తీ! నః = మనకు, రాజ్యేన = రాజ్యముతో, కిమ్ = ఏమి (ప్రయోజనము?) భోగైః = భోగములతోడను, జీవితేన + వా = బ్రదికియుండుటతోడను, కిమ్ = ఏమి ప్రయోజనము?

కాఁబట్టి యోకృష్ణమూర్తీ! నాకు జయము నొందవలయునని గాని, రాజ్యమును సంపాదింప వలయునని గాని, యట్టి రాజ్యమువలన సుఖముల ననుభవింపవలెనని గాని, యిచ్ఛలేదు. అయితే, అట్టి యిచ్ఛలేకయే యీ యుద్ధమునకేల ప్రయత్నము చేసి వచ్చితివని యెవ్వడవో చెప్పుచున్నాను వినుము. నాకింతకు ముందట్టి యిచ్ఛగలిగి యుండినది నిజమే గాని యిప్పుడీయుద్ధరంగమునఁ జేరియుండు నీబంధుజనుల నందఱ నేక కాలమందుఁ జూచినతోడనే యాయిచ్ఛ తొలఁగిపోయినది. కారణమేమనఁగా నింత మంది బంధుజనులను వధించినపిమ్మట మనము జీవించి యుండుటయే వ్యర్థమై యుండఁగా నట్టి క్రూరకృత్యమువలన సంపాదింపఁబడిన రాజ్యమువలనఁ గాని, యట్టి రాజ్యమువలనఁ గలిగెడు భోగముల వలనఁ గాని, మనకేమి ప్రయోజనము గలుగఁబోవుచున్నది?

శ్లో॥ యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ।
తఇమేవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ। 33

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా । స్తథైవచ పితామహాః
మాతులా శ్శ్వశురాః పౌత్రా । స్స్యాలా స్సమ్బన్ధిన స్తథా॥

అర్థము : యేషామ్ + అర్థే = ఎవరినిమిత్తము, నః = మనకు, రాజ్యమ్ = రాజ్యము, కాంక్షితమ్ = కోరఁబడఁదగినదో, భోగాః=భోగములను, సుఖాని + చ=సుఖములును,(కాంక్షితాని)=కోరఁబడదగినవో, తే=అట్టివారలైన, ఆచార్యాః= గురువులును, పితరః = తండ్రులును, పుత్రాః = కొడుకులును, తథా + ఏవ + చ = ఆలాగుననే, పితామహాః = తాతలును, మాతులాః=మేనమామలును, శ్వశురాః = మామలును, పౌత్రాః = మనుమలును, స్యాలాః= బావమఱఁదులును, తథా=అట్లు, సమ్బన్ధినః = వియ్యంకులును, ఇమే = మనయెదుటనుండు వీరు, యుద్ధే = యుద్ధమునందు, ప్రాణాన్ = జీవనములను, ధనాని + చ = ధనములను, త్యక్త్వా = వదలి (విడుచుటకుఁ దెగించి), అవస్థితాః = నిలిచియున్నారు.

అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము ; లోకములోన నెవరైన రాజ్యమును, ధనకనక వస్తువాహనాదులను, సంపాదింపఁగోరుట తనదారపుత్రబంధుమిత్రాదులతోఁ గూడి యనుభవింపుచు సుఖించుటకేకదా ? అట్టివారలు లేక యొంటరిగ నుండువానికి నట్టిభోగభాగ్యములవలన నేమి సుఖము గలుగును ? ఆలాగుననే మనమును, ఈరాజ్యమును సంపాదింపఁ గోరుట, బంధుమిత్రాదులతోఁగూడి యనుభవించుటకే కదా ? అట్లుండ, నేబంధుమిత్రాదులతోఁగూడి మనమట్టి రాజ్యసుఖము ననుభవింపఁ దగియున్నదో యట్టివారలందఱు, అనఁగా నాచార్యులును, దండ్రులును, గొడుకులును, తాతలును, మేనమామలును, మామలును, మనుమలును, బావమఱఁదులును, వియ్యంకులును, ఇదిగో యిప్పుడు మనయెదుటనే యుద్ధమునకువచ్చి ప్రాణములకుఁ దెగించియీయుభయసైన్యములయందును నిలిచియున్నారు చూడుము. ఇఁకను యుద్ధమును బ్రారంభించితిమేని యీసైన్యములోని వారలాసైన్యములోని వారలను, ఆసైన్యములోని వారలీసైన్యములోని వారిని, గొట్టి చంపుదురుగదా ? అట్లుయుద్ధము ముగియు నప్పటికి వీరందఱును మడియువారేకదా ? వీరందఱును అట్లు మడిసినపిమ్మట మనము మాత్రమేకాకులమై నిలిచి యుండిన యెడల నప్పుడీ రాజ్యమువలన మనకేమి ప్రయోజనము గలుగును ? ఇందున కొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఒకపురుషుఁడు తనగృహమునందుఁ దల్లిదండ్రులును, నన్నదమ్ములును, బ్రియురాలగు భార్యయుఁ గొడుకులును, గోడండ్రును, గూతుండ్రును, అల్లుండ్రును, మనుమలును, మనుమరాండ్రును, మొదలగు బంధుజనులతోఁ గలిసి సిరిసంపదలు గలిగి యనేక విధములైన సౌఖ్యముల ననుభవింపుచున్నాఁడు, అట్టివాని కొకనాఁడు ధనపిశాచి సాక్షాత్క-

రించి యొకచోట నొక గొప్ప ధననిక్షేపము, అనఁగా ననేకకోట్ల ద్రవ్యము భూస్థాపితమై యున్నది, దానికొఱకు నీయింటనుండు దారపుత్రాదుల నందఱను బలియిచ్చిన యెడల నది నీకు లభించు చున్నది. అందువలన నీవు కోటీశ్వరుఁడవగుదు వని చెప్పుచున్నది. అపుడు వాఁడేమి సేయును? ఆధనముకై యాసపడి, తన జనుల నందఱను జేతులార బలియిచ్చుట కొప్పుకొనునా? మంచిది, ఒకవేళ దుర్బుద్ధియై యఁదున కొప్పుకొని యాలాగున నందఱను బలియిచ్చి యానిక్షేపమును బొందినయెడల దానివలన వాఁడు తనయింట నొంటరిగనుండి యేమిసుఖమనుభవింపఁగలఁడు? అందు నకు బదులుగ నింటినిండఁ గిలకిలలాడుచుఁ దనకనేక సౌఖ్యములకు నుపకరించు చుండు నట్టి స్వజనము నంతయుఁ జంపి వేసితినే యనెడు గొప్పదుఃఖమునే యనుభవించు చుండునుగదా? అట్లే మనమును నీబంధుజనము నెల్లను వధించి రాజ్యమునుబొందియు దుఃఖమునకే పాత్రులము గావలసివచ్చును.

శ్లో॥ ఏతాన్న హంతు మిచ్ఛామి । ఘ్నతోఽపి మధుసూధన!!
అపి త్రైలోక్యరాజ్యస్య । హేతోః కిన్ను మహీకృతే॥　35

అర్థము: హేమధుసూదన! = ఓకృష్ణమూర్తీ!, ఘ్నతః + అపి = నన్నుఁ జంపువారలైనను, త్రైలోక్యరాజస్య + హేతోః + అపి = (వారలఁ జంపుటవలన నాకు) ముల్లోకముల ప్రభుత్వము లభింపఁ దగియున్నను, ఏతాన్ + (ఈ) కౌరవ సైన్యములోని వారలను, హన్తుమ్ = చంపుటకు, న + ఇచ్ఛామి = ఇష్టపడను, మహీకృతే = భూరాజ్యవిషయమై, కిన్ను = చెప్పవలసినదేమి?

కావుననో మధుసూదనా! యీకౌరవ సైన్యమునందలి వారలఁ జంపుట వలన నాకు స్వర్గమర్త్య పాతాళములనెడు మూఁడులోకముల యొక్క ప్రభుత్వ మబ్బినను వీరింజంపుటకు నాకిష్టపడక యున్నది. ఇట్టివిషయములో నీమూఁడు లోకములలో నొకటియగు మర్త్యలోకమునందొక స్వల్పభాగమైన యీ రాజ్యము కొఱకు వీరిని జంపుటకు నాకెట్లు మనసొప్పును?

కృష్ణుఁడు – మంచిది, ఓయి యర్జునా! నీవు కనికరముతోఁ గూడిన హృదయము గలవాఁడవుగనుక నిట్లుచెప్పితివి సరే, ఇందుచేతనే గదా మీయన్న యగు ధర్మరాజుగూడ యుద్ధముఁ జేయనొల్లక మీయైదుగురి కైదూళ్ళనైన నిచ్చినఁ జాలునని యుదిష్ఠిరులో రాయబారమంపియుండెను, అందునకుఁ గూడఁ గౌరవులొప్పక యుద్ధమునే చేయఁబూనుకొనుట వలన బంధుజనవధను గ్రహించిన కనికరము వారికి లేకపోవుట సరేకదా, ఇంతకు ముందు మిమ్ము లక్కయింటఁ గాఁపురముం చేర్చి యాయింటఁ జిచ్చుపెట్టుటయు, మీకువిషముఁ బెట్టుటయు, మొదలగు క్రౌర్యము

లనుబట్టి యోచించినను, నేలాగుననైన మిమ్ము వధించియే నిశ్చింతగా రాజ్యము చేయవలె ననియెడి దుష్టతలంపు దుర్యోధనాదులకుఁ గలిగియున్నట్లు స్పష్టమగుచున్నదిగదా? ఇట్టివిషయములో నిప్పుడీ యుభయసైన్యముల వారు యుద్ధమునకుఁ దలపడి సిద్ధముగనుండఁగా నీవుమాత్రము కనికరముచేత యుద్ధము మానినను వారలు నిట్లే కనికరించి మానెదరని యెంచెదవా? అందునకు బదులుగా వారు నిన్ను వధించుటకు మిగుల సులభోపాయమును గలుగఁజేసినవాఁడ వగుచున్నావుగదా?

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రా న్నః। కా ప్రీతి స్స్యా జ్జనార్దన!।
పాప మేవాశ్రయే దస్మా। న్హత్వైతా నాతతాయినః॥ 36

అర్థము: హేజనార్దన! = ఓకృష్ణమూర్తీ!, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, నిహత్య = చంపి (చంపుటవలన), నః = మనకు, కా + ప్రీతిః = ఏమి సంతోషము, స్యాత్ = అగును? ఆతతాయినః * = దుర్మార్గులైన, ఏతాన్ = ఈ (దుర్యోధనాదులను), హత్వా = చంపి (చంపినయెడల), అస్మాన్ = మనలను, పాపమ్ + ఏవ = దోషమే, ఆశ్రయేత్ = చెందును.

అర్జు – అట్లునన్ను వారలు చంపినను సరే, గాని, వారలఁజంపుటకునాకిష్టము లేదు. ఏలయనఁగా, వారలను జంపితిమిపో, అందువలన మనము గొంచెమైన నైహికసుఖము ననుభవింపఁ గలమా? ఎంతమాత్రమట్టిసుఖము ననుభవింపఁ జాలము. ఏలయనఁగా, మనకుఁ బరమశత్రువును, నీయుక్తమున కంతటికిఁ గారణభూతుఁడుననగు దుర్యోధనుని వానికిఁ బ్రోత్సాహకర్తలను, వాని దుష్టవర్తనులుగ నున్నట్టి వారలను మాత్రము చంపినయెడలఁ దక్కిన యావద్బంధు మిత్రాదులతోఁగూడి రాజ్యసుఖము ననుభవించుటకు నవకాశము గలుగును. అయితే, అట్లుచేయుటకు మనకు సాధ్యపడునా? దుర్యోధనుఁడు రారాజుగదా? వానికి సహాయముగా వచ్చియుండు తక్కిన రాజులందఱును జచ్చినపిమ్మటఁగదా వానిఁజంపుటకు సాధ్యపడును, వాని సైన్యమందలి యీరాజులందఱు మనసైన్యమునందుండు బంధుమిత్రుల నందఱినిగాని,

* (ఆతతాయినః). "శ్లో॥ అగ్నిదోగరదశ్చైవశస్త్రపాణిర్ధనాపహః। క్షేత్రదారహరశ్చైవషడేతేహ్యాతతాయినః॥" ఇల్లు మొదలగు వానిని దగులఁబెట్టువాఁడును, విషముబెట్టి చంపువాఁడును, ఆయుధపాణియై దోపిడి మొదలగునేరములఁ జేయువాడును, పరుల ధనము నపహరించు వాడును, పరులభూమి నాక్రమించు వాఁడును, పరుల భార్యల నపహరించు వాఁడును, ఈయాఱుగురును ఆతతాయు లనఁబడుదురు.

కొందఱినిఁగాని చంపక వారుచావరుగదా? ఇట్లుభయసైన్యముల యందుండు బంధుమిత్రాదులందఱు చచ్చినపిమ్మట దుర్యోధనుని మనముచంపియు నేమిప్రయోజనము? ఒకవేళ మనకుఁ బరమశత్రువుగ నుండెడు దుర్యోధనుని జంపితిమిగదా యనెడు సంతోషము గలుగవచ్చుఁగదా యంటివేని, మనకుఁ బరమమిత్రులుగను, బంధువులుగను, నుండుననేకులు మడిసినపిమ్మట నందువలనఁ గలిగెడు గొప్ప దుఃఖమును బొందిన పిమ్మట గదా యిట్టి సంతోషము గలుగఁదగియుంచున్నది, అప్పటికి స్వల్పముగు నాసంతోష మీగొప్పదుఃఖము నంతటిని శమింపఁ జేయఁదగినదిగా నుండునా? ఉండఁజాలదుగదా? అప్పటికి దుర్యోధనుఁడు చచ్చి రాజ్యము మనపరమైనను దుఃఖమునే యనుభవింపవలసిన వారమై యున్నాము గదా? అయిన నొకవేళ దుర్యోధనుఁడును, వాని యనుచరులును, మిగుల దుర్మార్గులును, మనలఁ వధింపఁ దలఁచినవారును, గనుక నట్టివారల వధించుటవలనఁ బరమంబైనను మేలు కలుగవచ్చునని యెంతువేమో, యదియును గలుగఁ జాలదు సుమా, ఎట్లనఁగా, దుర్యోధనాది దుష్టులగు కొద్దిమంది నిమిత్తమై నిరపరాధులును, బరమ మిత్రులును. బంధులునగు ననేకులు గనికరములేక చంపుటవలనఁ గలిగెడుగొప్ప పాపము నాదుష్టులగు కొద్దిమందిని జంపుటవలనఁ గలిగెడు సుకృతము హరింపఁ జాలదు. కనుకఁ బరలోకమందును మనకుఁ బాపమే గలుగవచ్చును.

శ్లో॥ తస్మాన్నార్హా వయం హన్తుం। ధార్తరాష్ట్రాన్ సబాన్ధవాన్ ।
స్వజనం హి కథం హత్వా। సుఖిన స్స్యామ మాధవ ! ॥ 37

అర్థము: తస్మాత్ = ఆ కారణము వలన; (పైశ్లోకమునఁ జెప్పఁబడిన ప్రకారము పాతకమే కలుగుచున్నది. (గనుక), హేమాధవ ! = ఓకృష్ణమూర్తీ, వయమ్ = మనము, సబాన్ధవాన్ = బంధులతోఁగూడియుండు, ధార్తరాష్ట్రాన్ = దుర్యోధనాదులను, హన్తుమ్ = చంపుటకు, న + అర్హాః = అర్హులముగాము, హి = ఏల యనఁగా, స్వజనమ్ = బంధుజనమును, హత్వా = చంపి, కథమ్ = ఎట్లు, సుఖినః = సుఖించువారలము, స్యామ = కాగలము ?

కావుననో మాధవా ! మనము సాధ్యమైనయెడల మన కహితులగు దుర్యోధనాదులను మాత్రమే చంపఁగలిగిన యెడల నట్లు చేయవచ్చునేగాని తక్కిన బంధుజనులతోఁగూడ వారలఁ జంపవలసి వచ్చినయెడల నట్లుచేయుట కెంత మాత్రమును దగదు. ఏలయనఁగా, అట్లు బంధుజనులఁగూడఁ జంపినపక్షమున నింతకుముందు నేను జెప్పిన ప్రకారము వారలఁ జంపుటవలనఁ గలిగెడు మహాపాతక మీదుష్టులను జంపుటవలనఁ గలిగెడు సుకృతముకంటె నధికమగుటవలన మనకు సుఖమెట్లు కల్గును ?

కృ - ఓయియర్జునా! ఈయుభయసైన్యముల యందునుండు రాజులు మన కెట్లు బంధుమిత్రులుగ నున్నారో దుర్యోధనాదులకు నట్టిబంధుమిత్రులేయైయున్నారు గదా? అట్లుండియు వారలకులేని యీయోచన నీకుమాత్రమేల కలిగెను?

శ్లో॥ యద్య ప్యేతే న పశ్యన్తి। లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం। మిత్రద్రోహేచ పాతకమ్॥ 38

శ్లో॥ కథం నజ్ఞేయ మస్మాభిః। పాపా దస్మా న్నివర్తితుమ్।
కులక్షయకృతం దోషం। ప్రపశ్యద్భి ర్జనార్దన॥ 39

అర్థము: హేజనార్దన! = ఓ కృష్ణమూర్తీ!, కులక్షయ కృతమ్ = వంశ నాశముచేతఁ జేయఁబడిన, దోషమ్ = పాపమును, మిత్రద్రోహే = మిత్రద్రోహ మందలి, పాతకమ్ + చ = పాపమును, లోభోపహతచేతసః = అత్యాశచేఁ గొట్టఁ వడిన మనస్సుగలవారైన, ఏతే = ఈదుర్యోధనాదులు, న + పశ్యన్తి + యది + అపి = చూడకున్నారైనను (తెలిసికొనఁ జాలకున్నను), కులక్షయకృతమ్ + వంశనాశముచేఁ జేయఁబడిన (అనఁగాఁ గలిగెడు), దోషమ్ = పాతకమును, ప్రపశ్యద్భిః = చూచు చున్న (తెలిసికొనఁ జాలిన), అస్మాభిః = మనచేత, అస్మాత్ + పాపాత్ = ఈదోషమునుండి. నివర్తితుమ్ = మరలుటకొఱకు, కథమ్ = ఎట్లు, న + జ్ఞేయమ్ = తెలియఁదగినది గాదు? (తెలియఁదగినదే యనుట).

అర్జునుఁడు – ఓజనార్దనా! దుర్యోధనాదుల కిట్టియోచన గలుగ కుండుటకుఁ గారణమేమనఁగా, వారు మా యర్ధరాజ్యమును మాకివ్వక తామే యంతయు ననుభ వింపవలెనను పేరాసగలవారై యున్నారు గనుక, "అర్థాతురాణాం నగురుర్న బన్ధుః" అనునట్లుగా, వారలకు గురువులును, బంధువులును, మిత్రులును, మొదలగు వారిందువలన నశించుచున్నారే, మనకుఁ బాపము సంభవించునే, యనెడియోచన లేశ మాత్రమైనను జేయకున్నారు. మఱియు వారలు మిత్రద్రోహులై యున్నారు. ఎట్లనఁగా, పూర్వము మమ్ముఁగొంతకాలము సౌఖ్యమనుభవించుట కనిచెడు మిష మీఁద మంచితనముగ వారణావతపురమునకుఁ బోవంబనిచి యచ్చట రహస్య కృతముగాఁ బురోచనుఁడను వానిచే లక్కయిల్లు గట్టించి యందు మమ్ముఁ బ్రవేశ పెట్టించి చంపఁదలఁచిరిగదా? అప్పుడు విదురుని సహాయమువలన నాకుట్రను దెలిసి కొన్నవారలమై యా యాపదను దప్పించుకొంటిమిగదా? ఇదిగాక మేము మయునిచే నిర్మింపఁబడిన సభయందు నివసించి రాజసూయయాగ మొనరించి సుఖించియుండఁగా వీదుర్యోధనాదులందున కోర్వఁజాలక మంచితనముగా ధర్మరాజును దమనగరికిరప్పించి

వినోదార్థమను మిషమీఁద శకునితో జూదమాడించి యాకృత్రిమద్యూతమున మాకుఁగల సర్వస్వము నోడించి యడవికి వెడలంబంపిరిగదా? ఇదిగాక నీవు మాపక్షమున రాయబార మొనరింపఁ గౌరవసభకుఁ బోయినపుడు నీతోడ నందునకుఁ దగిన సంభాషణలు సేయుచునేయుండి లోలోపల రహస్యకృతముగా నిన్నుఁబట్టి బంధించుటకుఁ బ్రయత్నించియుండిరిగదా? ఈ మొదలైన కార్యము లనేకములు చేసియుండిరిగదా? ఇట్టి కార్యము లన్నియు మిత్రద్రోహములేగదా? కాఁబట్టి యిట్టి లుబ్ధులను, మిత్రద్రోహులునగు నీదుర్యోధనాదులకు, నిదియుక్తము. ఇదియయుక్తము, ఇదిపుణ్యము ఇదిపాపము, ఇదిచేయఁదగినది, ఇదిచేయఁగూడనిది, యనియెడి వివేచన యెట్లు గలుగును? అయితే వంశనాశము చేయుట వలనను, మిత్రద్రోహము చేయుటవలనను, గలిగెడు పాపమిట్టిదని లోభరతులగు నీదుర్యోధనాదులు తెలిసికొనఁజాలక పోయినను, కులక్షయమువలనఁ గలిగెడు దోషమిట్టిదని తెలిసికొనఁజాలిన మనమేల యిట్టి పాపకార్యమునుండి మరలఁగూడదు?

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత॥ 40

శ్లో॥ అధర్మాభిభవాత్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసఙ్కరః॥ 41

శ్లో॥ సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః॥ 42

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః॥
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన! ।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ॥ 44

అర్థము: కులక్షయే+(సతి)=కులముక్షీణించిన దగుచుండఁగా, సనాతనాః= పూర్వికములైన, కులధర్మాః=కులాచారములు, ప్రణశ్యన్తి = బొత్తిగ నశించుచున్నవి, ధర్మే=కులాచారము, నష్టే+(సతి) = నశించిన దగుచుండఁగా, కృత్స్నమ్+కులమ్ = కులమునంతటిని, అధర్మః = అనాచారము, అభిభవతి+ఉత = ఆక్రమించుచున్నది, హేకృష్ణ! = ఓకృష్ణమూర్తీ!, అధర్మాభిభవాత్ =

అనాచారము వ్యాపించుటవలన, కులస్త్రియః = కులాంగనలు, ప్రదుష్యన్తి = చెడుచున్నారు, హేవార్ష్ణేయ ! = ఓకృష్ణమూర్తీ!, స్త్రీషు = కులస్త్రీలు, దుష్టాసు + (సతీషు) = చెడినవారగుచుండఁగా, వర్ణసఙ్కరః = కులసాంకర్యము, జాయతే = కలుగుచున్నది, సఙ్కరః = కులసాంకర్యము, కులఘ్నానామ్ = కులనాశకులకును, కులస్య + చ = కులమునకును, నరకాయ + ఏవ = నరకముకొఱకే, హి = ఏలయనఁగా, ఏతేషామ్ = ఈ కులనాశకుల యొక్కయు నట్టికులమునఁ బుట్టినవారి యొక్కయు, పితరః = పితృదేవతలు, లుప్తపిణ్డోదకక్రియాః + (సన్తః) = లోపించిన శ్రాద్ధతర్పణాదులుగలవారై, పతన్తి = అధోగతులగుచున్నారు, కులఘ్నానామ్ = కులనాశకులయొక్క, వర్ణసఙ్కరకారకైః = వర్ణసంకరముఁ జేయునట్టి, ఏతైః = ఈ (పైఁ జెప్పఁబడిన), దోషైః = అకృత్యములచేత, శాశ్వతాః = శాశ్వతములైన (వంశపరంపరగా జరుగుచుండిన), కులధర్మాః = కులాచారములును, జాతిధర్మాః + చ = (ఆయాకులాచారముల ననుసరించి) స్త్రీపురుషు లాచరింపవలసిన ధర్మములును! ఉత్సాద్యన్తే = నశింపఁజేయఁ బడుచున్నవి. హేజనార్దన ! = ఓకృష్ణమూర్తీ ఉత్సన్నకులధర్మాణామ్ = నశించిన కులాచారములుగల, మనుష్యాణామ్ = జనులకు, నరకే = నరకమునందు, వాసః = ఉనికి, నియతమ్ = నిత్యముగా, భవతి = అగుచున్నది, ఇతి = అని, అనుశుశ్రుమ = వినియున్నాము.

కులక్షయమువలనఁ గలిగెడిదోష మెట్టిదనఁగా, నీలోకమునందలి జనులలో ననేక కులములు (తెగలు) ఏర్పడి యాయా కులమునకుఁదగినట్లు కొన్ని యాచారములు (కట్టుపాట్లు) ఏర్పడి యాయా కులముల వారాయాకట్టుపాట్లకు లోఁబడినడుచుకొనుచు వచ్చుచున్నారుగదా? అందేదైన నొకకులమునందలి తలకట్టు మనుష్యులు (వంశోద్ధారకులుగా నుండెడి ముఖ్యులందఱు) నేదైననొక కారణముచేత నేకకాలమున నశించినయెడల నప్పుడా కులము క్షీణించుచున్నది, అనఁగా నాకులమునకు నియమితమైయుండు నాచారములను యథావిధిగ జరుగునట్లు తగు కట్టుదిట్టములు చేయదగిన మొనగాండ్రు లేనిదగుచున్నది. అట్టి మొనగాండ్రెప్పుడు లేకపోవుచున్నారో, యప్పుడా కులమునందలి వారందఱును దల తల పెత్తనము వహించి యెవరియిష్టము వచ్చినట్లు వారు ప్రవర్తించుటచే నదివఱకు ననాదిగా నాకులమందు జరుగుచుండిన యాచారములు చెడుటకుఁ గారణమగుచున్నది; అట్టి యాచారము లెప్పుడుచెడెనో యప్పుడు వెంటనే యాకులమునందు ననాచారములు (అనగా నదివఱకాకులమునందు లేని నూతనపద్ధతులు) గలుగుచున్నవి. అట్టి యనాచారము లెప్పుడు గలుగుచున్నవో, యప్పుడు కుల బందుకట్టుచెడి యందలి స్త్రీపురుషులు

వావివరుసలు లేక ప్రవర్తించుటకుఁ గారణమగుచున్నది. అందుచే స్త్రీలు, హద్దును భయమును లేనివారై తమ యిష్టమువచ్చినట్లు పరపురుష గమనాది దుష్కృత్యములు సేయుచు భ్రష్టు లగుచున్నారు, అట్టి భ్రష్టురాండ్రకుఁ గలిగెడు సంతానమువలన వర్ణసంకర మగుచున్నది. అనఁగా నొకనికిఁ బుట్టినవాఁడు మఱియొకనిని దండ్రిగా భావించుటయు, నొకపురుషుఁడు తనభార్య మఱియొకనికిఁ గన్నపుత్రునిఁ దన పుత్రునిఁగ భావించుటయు, నీమొదలగు సంకరములు గలిగినదగుచున్నది. ఇట్టి వర్ణసంకరులగు పుత్రులచేఁ జేయఁబడు శ్రాద్ధతర్పణాదులు వారి పితృదేవతలకుఁ జెందక వ్యర్థములగుచున్నవి. ఎట్లనఁగా, రామయ్యయను వానిభార్య భీమయ్య యనువానితో వ్యభిచరించుట వలనఁగలిగిన సోమయ్య యనుపుత్రుఁడు భీమయ్య తన నిజమైనతండ్రి యని యెఱుఁగక తనతల్లికి భర్తయగురామయ్యయే తన తండ్రియని యెంచికొని యారామయ్య మృతుడైన పిమ్మట నతనికిఁ బిండోదకాది క్రియలను జరిగించుచున్నాడు. అట్టి పిండోదకాది క్రియలా రామయ్య కెట్లుచెందఁగలవు? గాన నట్టి పితృదేవతలుగూడఁ బిండోదకాదిక్రియలు లేనివారై నరకముననఁబడుదురు. కనుకఁ గులక్షయమువలన నిన్నియనర్థములు గలుగుటకుఁ గారణమగుచున్నది. ఇట్టి కులక్షయమున కెవరు కారణభూతులగుచున్నారో, వారనాదిగా జరుగుచుండెడి యాకులాచారములను జెఱుచుటయగాక, యాకులమునందలి స్త్రీపురుషు లవలంబింప వలసిన పద్ధతులనుగూడఁ జెఱిచినవా రగుదురు. కాఁబట్టియేగదా, ఓజనార్దనా? నశించిన యాచారములుగల కులమునందలి మనుష్యులకు నరకవాసము తప్పక కలుగుచున్నదని పెద్దలుచెప్పఁగా వినుచున్నారము.

శ్లో॥ అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః ॥ 45

అర్థము: వయమ్=మనము. యత్=ఎప్పుడు, రాజ్యసుఖలోభేన=రాజ్యమునందలి యాసచేత, స్వజనమ్=బంధుజనమును, హన్తుమ్=చంపుటకు, ఉద్యతాః=ఉద్యుక్తులమైతిమో, (తదైవ)=అప్పుడే, మహత్=గొప్పదియైన, పాపమ్=దోషమును. కర్తుమ్=చేయుటకొఱకు. వ్యవసితాః=పూనుకొన్నవార మైతిమి, అహో=ఆశ్చర్యము, బత=అయ్యయ్యో!!

కనుక మనమిట్టి కులక్షయ కారణమగు బంధుజనవధ నెప్పుడుచేయ నుద్యుక్తులమైతిమో యప్పుడే మహాపాతకమును జేయఁబూనుకొన్నవారమైతిమిగదా? మంచిది, యిట్టి మహాపాతకమున కొడిగట్టుటకుఁ గారణమేమన్ననో. రాజ్యమునందలి యాసయేగదా! ఈ రాజ్యసుఖ మెంతకాల మనుభవింపఁ గలము? స్వల్పకాలమే

గదా? తదనంతరమీ మహాపాతకమువలనఁ గలిగెడు శాశ్వత నరకబాధ ననుభవింప వలసియున్నదిగదా? ఇంతమాత్రము యోచింపక యిట్టికార్యమునకుఁ బూనుకొంటిమే, అయ్యయ్యో యిదియేమి యాశ్చర్యము !!

శ్లో॥ యది మా మ ప్రతీకార । మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు । స్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46

అర్థము : రణే = యుద్ధమునందు, అప్రతీకారమ్ = ఎదిరించి యుద్ధముచేయ నట్టియు, అశస్త్రమ్ = నిరాయుధుఁడ నైనట్టియు, మామ్ = నన్ను, శస్త్రపాణయః = ఆయుధపాణులగు, ధార్తరాష్ట్రాః = దుర్యోధనాదులు, హన్యుః + యది = చంపువారైరేని. తత్ = అది (నిరాయుధుడ నగునన్ను నాయుధపాణులగువారు చంపుట), మే = నాకు. క్షేమతరమ్ = మిక్కిలి క్షేమకరమైనది, భవేత్ = కాఁగలదు,

ఇట్టి మహాపాతకమునకు నేనొడిఁగట్టఁ జాలనుగనుక నేను యుద్ధముఁజేయుట లేదు సరేగదా, ఆయుధమునుగూడఁ జేతఁబట్టుటలేదు. అయితే, ఒకవేళ నేను నిరాయుధుఁడనై యుద్ధము మానుకొన్నను, దుర్యోధనాదులు దుర్బుద్ధి గలవారగుటచే నిట్టి పారమార్థిక చింతఁ జేయక యాయుధపాణులై నన్ను వధింతురేని యట్లు వారు చేయుటవలన నాకు గతియు మేలే కలుగునుగాని కీడు కలుగ నేరదు. ఎట్లనఁగా నేను యుద్ధము మానుకొనుటవలనఁ గల క్షయ హేతుభూతమగు సకలబంధు జనవధచేఁ గలిగెడు మహాపాతకమునకుఁ దప్పినవాఁడనగుట మొదటమేలుగదా? ఇదివఱకనేక పర్యాయములు నేనీ దుర్యోధనాదులతో నొంటరిగ యుద్ధముఁజేసి గెలిచినవాఁడ నిప్పుడేడక్షౌహిణులసైన్య ముపబలముగా నుండఁగా నట్లుచేయుట పారమార్థిక చింతచేతనేగాని పిఱికితనముచేత గాదని నీకుఁదెలిసియున్నది గదా? ఇందుచే, “గీ॥ చెల్లియుండియు సైరణ సేయునతఁడు । పేదవడియును నర్థికీఁ బ్రియ ముతోడఁ । దనకుఁగల భంగినిచ్చునతఁడును బుణ్య । పురుషులని చెప్ప రార్యులు బుధవరేణ్య ॥” అనునట్లు నాయర్ధరాజ్యమును గోలుపోవుటకైన నొప్పుకొని బంధుజన వధకు సహింపక యుద్ధము మానుకొనుటచేత మాత్రమే పుణ్యము లభింపఁదగియుండఁగా నాప్రాణమును గోయిపోవునప్పుడు గూడ నట్టి సైరణ సేయుటచే నాపుణ్య మధికరింపఁ దగియున్నదిగదా? నాస్థితి యిట్లుండఁగా నిఁక వారలగతి యేమగుచున్నదనిన, వార లిదివఱకే మాయెడల జరిగించియుండెడు మిత్రద్రోహమువలనను, రాజ్యాపహారము వలనను, బాపమునకుఁ బాత్రులైయుండఁగా నిపుడుమీదుమి

క్కాలి యుద్ధరంగమున నిరాయుధుఁడను, ప్రతియుద్ధము చేయఁబూనని వాఁడను నగు నన్ను జంపిరేని, "క॥ పడినం బాఱినఁ గైమువు । వడినను వాహనము వడినఁ-బార్థివ ముఖ్యా । పొడువఁదగదు శత్రుని నె । య్యెడల నహింసనముఁబోల - వేసుకృత ములున్" (భార-శాంతి-౧-౫.) అని పెద్దలు చెప్పియున్నారుగనుక నిదిమతియుఁ గేవలము ధర్మవిరుద్ధముగనుక నిందువలన వారలపాపము మిగుల నతిశయించి శాశ్వత నరకవాసమునకుఁ బాత్రులగుదురు. కాఁబట్టి, నన్ను వారలు చంపుదురను విషయములో నాకు భయమునకు బదులుగా సంతోషమే కలుగుచున్నది.

సఞ్జయఉవాచ :

శ్లో॥ ఏవ ముక్త్వార్జున స్సఙ్ఖ్యే । రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం । శోకసంవిగ్నమానసః॥ 47

అర్థము : అర్జునః = అర్జునుఁడు. ఏవమ్ + ఉక్త్వా ఇట్లు చెప్పి, శోకసంవిగ్న మానసః = వ్యసనముచేఁ జలింపఁబడిన మనస్సుగలవాఁడై, సశరమ్ = బాణముతోఁ గూడియున్న, చాపమ్ = ధనుస్సును, విసృజ్య = విడిచి, సఙ్ఖ్యే = యుద్ధభూమి యందు, రథోపస్థే = రథమునందు, ఉపావిశత్ = కూరుచుండెను.

సంజయుఁడు — ఓ ధృతరాష్ట్రమహారాజా! అర్జునుఁ డీవిధముగాఁ గృష్ణ మూర్తితోఁ జెప్పి దుఃఖాక్రాంతమైన మనస్సుగలవాఁడై తన చేతనుండెడు ధనుర్బా ణములను గ్రిందికి జాఱవిడిచి యుద్ధరంగమున నుభయ సైన్యములమధ్యను నిలిచి యుండు తన రథముమీఁద నుస్సురనుచుఁ జతికిలఁబడెను.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునునియుద్ధమునకుఁ బురికొల్పెడు వ్యాజమున
లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుపనిషదర్థ ప్రతిపాదకంబగు
భగవద్గీతా శాస్త్రమునందలి యర్జునవిషాదయోగంబను

ప్రథమాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావబోధిని

## ద్వితీయాధ్యాయము

### సాఙ్ఖ్యయోగము

సఞ్జయఉవాచ :

శ్లో॥ తం తథా కృపయావిష్ట । మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదన్త మిదం వాక్య । మువాచ మధుసూదనః॥ 1

అర్థము : మధుసూదనః = శ్రీకృష్ణమూర్తి, తథా = అట్లు, (పైయధ్యాయములోఁ జెప్పఁబడిన ప్రకారము), కృపయా = కనికరముతోడ, ఆవిష్టమ్ = కూడుకొన్న వాఁడును, అశ్రుపూర్ణాకులేక్షణమ్ = కన్నీటితోనిండుకొని కలఁకఁ బాఱిన నేత్రములు గలవాఁడును, విషీదన్తమ్ = వ్యసనపడుచున్న వాఁడునగు, తమ్ = అర్జునునిగూర్చి, ఇదమ్ = ఈ (క్రిందఁ జెప్పఁబోయెడు), వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

సంజయుఁడు — ఓధృతరాష్ట్రమహారాజా! ఇదివఱకు నేను (I- 28 మొదలు 47 వఱకు) చెప్పినప్రకార మర్జునుఁడు బంధుజనము నెడలఁగనికరము గలవాఁడై వారలఁజంపవలసి వచ్చెనే యనెడు దుఃఖముచేఁ బొరలివచ్చెడు కన్నీటితో నింపఁబడిన నేత్రములు గలవాఁడై వ్యసనపడుచు (యుద్ధము సేయనొల్లక) తన చేతి ధనుర్బాణములఁ గ్రిందపైచి రథముపైఁ జతికిలఁబడియుండఁగా నతనిఁ జూచి మధుసూదనుం డిట్లనియె.

శ్రీభగవానువాచ :

శ్లో॥ కుత స్త్వా కశ్మల మిదం । విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య । మకీర్తికర మర్జున ॥ 2

అర్థము : హే అర్జున! ఓయియర్జునుఁడా! అనార్యజుష్టమ్ = పామరులచే నవలంబింపఁబడఁదగినదియు, అస్వర్గ్యమ్ (పరమందు) స్వర్గలోకప్రాప్తికి భంగకరమైనదియు, అకీర్తికరమ్ = (ఇహమందు) అపయశస్సును గలుగఁజేయునదియునగు, ఇదమ్ + కశ్మలమ్ = ఈమాలిన్యము (ఈమనోవ్యాకులము), విషమే = వ్యత్యస్తకాలమందు (యుద్ధమును బ్రారంభింపఁబోయెడు నిట్టియొడుదుడుకు సమయమందు), కుతః = ఏ కారణమువలన, త్వా = నిన్ను, సముపస్థితమ్ = పొందినదాయెను.

కృ — ఓయియర్జునా! నీవిప్పుడు పొందెడు మనోవ్యాకుల మెట్టిదనఁగా, నిహలోకమున నపకీర్తిని గలుగఁజేయునట్టిదియుఁ, బరలోకమున స్వర్గాది భోగములకు హానిగలుగఁజేయునట్టిదియునై యుంచున్నది; గాననిట్టిమనోవ్యాకులము కేవల మూఢులుగను, పామరులుగను నుండెడు జనులచేఁబొందఁబడఁదగినదిగాని, నీవంటి శూరునిచేఁ బొందఁబడఁదగినదిగాదు; అట్లుండ, నీకిప్పుడీ యుభయసైన్యములు యుద్ధమునకుఁ దలపడి యొకరిపై నొకరు బాణములఁ బ్రయోగింపఁబోయెడు సమయమున నిట్టి మనోవ్యాకులము గలుగుటచూడఁగా మిక్కిలి వింతగానున్నది; అట్లు కలుగుటకుఁ గారణ మేమైనదియుఁ దెలియఁజాలకున్నాను.

శ్లో॥ క్లైబ్యం మా స్మ గమః పార్థ! । నైత త్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం । త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥ 3

అర్థము : హే పార్థ! = ఓయి యర్జునా! క్లైబ్యమ్ = అధైర్యమును, మా + స్మ + గమః = పొందకుము; త్వయి = నీయందు, ఏతత్ = ఈ (యధైర్యము), న + ఉపపద్యతే పొందఁదగినది గాదు, హే పరంతప! = శత్రువులఁ దపింపఁజేయునో యర్జునా!, క్షుద్రమ్ = తుచ్ఛమైన హృదయదౌర్బల్యం = పిరికితనమును, త్యక్త్వా = విడిచి, ఉత్తిష్ఠ = లెమ్ము.

కృ — ఓయిపార్థా! ఇట్టి మనోదౌర్బల్య మల్పులకేగాని నీకుఁదగినదిగాదు. ఏలయనఁగా, నీవు పరంతపుఁడవు, అనఁగా, శత్రువులఁ దపింపఁజేయువాఁడవని మిగుల ఖ్యాతిఁజెందినవాఁడవై యున్నావు; కావున నీకిట్టిసమయమున నిట్టి పేద మనస్సుగలుగుట యర్హముగాదు. కనుక నీవీతుచ్ఛమైన పిరికితనమును విడిచి యుద్ధమునకు లెమ్ము.

అర్జున ఉవాచ :

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే । ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి । పూజార్హా వరిసూదన!॥

అర్థము : అరినూదన = శత్రుసంహారకుఁడవగు, మధుసూదన ! = ఓకృష్ణమూర్తీ కథమ్ = ఎట్లు, అహమ్ = నేను, సఙ్ఖ్యే = యుద్ధమందు, పూజార్హౌ = పూజనీయులగు, భీష్మమ్ = భీష్మునిని, ద్రోణమ్ + చ ద్రోణాచార్యులనున్ను, ఇషుభిః = బాణములతోడ, ప్రతియోత్స్యామి = ఎదిరించి యుద్ధముచేయఁగలను.

అర్జు—ఓమధుసూదనా ! నీవు చెప్పినదానినిబట్టి యోచింపఁగా నేనిదివఱకు (1-28 మొ.-46 వఱకు) చెప్పినమాటలన్నియు శత్రుసైన్యమును జూచి భయపడి యుద్ధమును మానుకొన దలచితినని నీవభిప్రాయపడినట్లుకనఁబడుచున్నది. అట్లెంతమాత్ర మెంచవలదు ; బంధుజనుల నెట్లు చంపుదునా యనెడు కనికరముచేతనే గాని యితరకారణ మేమియు లేదు. అయితే దుష్టులగు దుర్యోధనాదులు బంధువులైనను వారలను, వారలకు సహాయభూతులగు వారలను వధించుట న్యాయమే గదా యని యందువేమో, పోనిమ్ము, వారియందలి విషయములో నేనిట్లు యోచనజేయఁ బనిలేదు గాని, వారిలోఁజేరియుండు భీష్మద్రోణులను గుఱించిమాత్రము యోచించితిని ; అందు భీష్ముఁడెట్టివాఁడనఁగా, మాకుఁదాతయు, మొదటినుండి మమ్ము మిగులఁ బ్రేమతో సాఁకినవాఁడును, నెప్పుడును మాక్షేమముఁ గోరువాఁడునై యున్నాఁడు. ఇఁకను, ద్రోణుఁడన్ననో మాకు ధనుర్విద్యనేర్పిన యాచార్యుఁడును, తనశిష్యులగు నందఱిలోఁ దక్కినవారికంటె నాయందుఁ బ్రేమాధిక్యము గలవాడునైయున్నాడు. వీరలుభయులు పాండవులమైన మాయెడల ద్వేషులుగారు సరే గదా, యెప్పుడును మాయెడలఁ బక్షపాతము గలవారయే యుంటున్నారు. గాన వీర లుభయులును పూజనీయులుగాని ద్వేషింప దగినవారు కారు. ఇట్టివీరల నేను యుద్ధమున నెదిరించి వీరిదేహములకు నాబాణములచేత నొప్పించుటకు నెట్లు చేతులాడును ?

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే ।
హత్వా ర్థకామాం స్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగా న్రుధిరప్రదిగ్ధాన్॥ 5

అర్థము : మహానుభావాన్ = పూజ్యులైన, గురూన్ = పెద్దలను, హత్వా + తు చంపినయెడల, ఇహ = ఈలోకమునందు, అర్థకామాన్ = అర్థకామాత్మకములైనట్టియుఁ, రుధిరప్రదిగ్ధాన్ = రక్తసిక్తములైనట్టియు, భోగాన్ = (రాజ్యాది) భోగములను, భుఞ్జీయ = అనుభవింపఁ గలవాడను; (తస్మాత్) = ఆకారణమువలన,

తాన్)+గురూన్ = అట్టిపెద్దలను, అహత్వా+ఏవ = చంపకయే, ఇహ+లోకే, ఈలోకమునందు, భోక్తుమ్ = భుజించుటకొఱకు, భైక్షమ్+అపి = భిక్షాన్నమైనను, శ్రేయః+హి = మేలైనదిగదా.

మంచిది, వీరు గురువులును బూజనీయులునైనను గానిమ్ము, వీరలఁ జంపుటవలన రాజ్యసుఖము ననుభవింప వచ్చునుగదా యందువేమో, యాసుఖము లర్థకామాత్మకములైనవియు, నశాశ్వతము లైనవియునేగాని, శాశ్వతముగ ననుభవింపఁ దగినవి కావుగదా ? అవియును మనమీలోకమున జీవించియుండు నంతవఱకే యనుభవింపఁ దగినవిగాన క్షణభంగురములే యగుచున్నవి. ఇట్టి తుచ్ఛభోగముల ననుభవించుటకై మహానుభావులగు వీరియొక్క రక్తమునుజిందించి యందువలనఁ బరలోకమున శాశ్వత నరకవాసమునకుఁ బాత్రులమగుటకంటె వారలఁజంపక యుండుట మేలు గదా ? అయితే, వారలఁజంపనియెడల మనకు రాజ్యము లభింపనేరదంటివేని, పోనిమ్ము, ఇట్టి క్రూరకృత్యమున కొడిగట్టుటకంటె రాజ్యమును గోలుపోయి భిక్షాన్నముఁ దినియైన బ్రతుకుట మేలుగదా ?

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
　　యద్వాజయేమ యది వా నో జయేయుః ।
　　యానేవ హత్వా న జిజీవిషామ
　　స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥　　6

అర్థము : యాన్ = ఎవరిని, హత్వా=వధించి, న+జిజీవిషామః(మనము) జీవించుటకు నిచ్ఛగింపమో, తే = అట్టి, ధార్తరాష్ట్రాః+ఏవ = ధృతరాష్ట్రుని సంబంధులగు భీష్మాదులే, ప్రముఖే = అనిమొనయందు, అవస్థితాః = నిలిచియున్నారు, (కించ) = ఇంతియగాక, (వయమ్) = మనము, జయేమ+యత్+వా = జయింతుమో, (ధార్తరాష్ట్రాః) = ధృతరాష్ట్ర సంబంధులగు భీష్మాదులు, నః = మనలను, జయేయుః+యది+వా = జయింతురో యేమో, ఏతత్+చ= ఇదియును, న+విద్మః = ఎఱుఁగఁజాలకున్నాము. (తతః) = ఆ కారణమువలన, నః = మనకు, కతరత్ = ఏది (అనఁగాయుద్ధముఁ జేయఁబూనుట, లేక, మాను కొనుట, యను నీరెంటిలో నేదియనిభావము), గరీయః = శ్రేష్ఠమైనది ?

అట్లుగాక మాయెడల నింత ప్రేమాతిశయము గలిగినట్టియు, మహానుభావులైనట్టియు, నీభీష్మద్రోణుల వధించితిమేని వారు మడిసినపిమ్మట మనము జీవించియుండుటవలనఁ బ్రయోజనమేమి ? పోనిమ్ము, వారలను మాత్రము వధింపక విడిచి

పెట్టి తక్కినవారినే వధింతమని యనుకొంటిమా, యట్లు చేయుటకును సాధ్యపడ నేరదు. ఏలయనఁగా, నాభీష్మద్రోణులే యీకౌరవ సైన్యమునకు నాయకులుగ నుండి యనిమొనయందుఁ జేరియున్నారు, గాన ముందు వారల వధించిననేగాని తక్కినవారిని వధించుటకు సాధ్యపడదుగదా? మంచిది. యొకవేళ వారియెడల నిట్టి యభిమానమును బొత్తిగ వదలినవారమై వారలనుగూడ వధించుటకే తెగింతమన్ననో, యట్లుచేయుటవలనను మనకుఁ బ్రయోజనము గలుగుచున్నదని నిశ్చయముగఁ జెప్పఁ జాలను. ఏలయనగా, వారలుభయులును మహాబలపరాక్రమశాలులు గదా? అనఁగా, భీష్ముఁడు పరశురాముని జయించినవాఁడుగను, ద్రోణుఁడు పాండవులమైన మాకును, కౌరవులైన దుర్యోధనాదులకును గూడ నస్త్రగురువైనవాఁడుగను, నున్నారుగదా? ఇట్టివారలను వధింపఁగలమనిగాని, లేక, జయింపఁగలమనిగాని, మనమెట్లు లనుకొనవచ్చును? మనకంటె వారలు మిగుల బలపరాక్రమ శాలులగనుక వారలే మనలను జయింతురేమో. కావున నీ యన్ని విషయములనుబట్టి యోచింపఁగా, నిప్పుడు మనము యుద్ధము చేయఁ బూనుకొనుట, లేక, మానుకొనుట, యను నీరెంటిలో నేది శ్రేష్ఠతరమైనదనియు తెలియఁగఁజాలకున్నాముగదా?

కృ — ఓయియర్జునా! భీష్మద్రోణులు మహానుభావులైనదియు, మిగుల బల పరాక్రమ శాలులైనదియుఁ, బాండవ పక్షపాతులైనదియుఁ, గౌరవులతో యుద్ధము నకుఁ బూనుకొన్నయెడల నాసైన్యమున వారు మొనగాండ్రుగనుక వారలవధింప వలసివచ్చుననియు, నీవిదివఱకే యెఱిఁగియుండవచ్చునుగదా? అట్లుండ నిట్టియోచన లన్నియు యుద్ధమునకుఁ బ్రయత్నింపకమునుపే చేయక, యిప్పుడుభయసైన్యములవా రును యుద్ధసన్నద్ధులై నిలిచి బాణములఁ బ్రయోగింపఁబోయెడు సమయమునఁ జేయు టకుఁ గారణమేమి?

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితంబ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్॥ 7

అర్థము : కార్పణ్యదోషోపహతస్వభావః = కృపణత్వమువలనఁ గలిగిన దోషముచేతఁ గొట్టువడిన నైజగుణము గలవాఁడను, (గనుక) ధర్మసమ్మూఢచేతాః + (సన్) = యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాఁడనై, త్వామ్ = నిన్ను, పృచ్ఛామి= అడుగుచున్నాను, యత్ = ఏది (అనఁగా, యుద్ధముఁజేయుట, మానుట, అను

నీరెంటిలో నేదియని భావము), శ్రేయః = శ్రేయస్కరము, స్యాత్ = అగును, (ఇతి) = అని, (త్వయా) = నీచేత, నిశ్చితమ్ = నిశ్చయింపఁబడుచున్నదో, తత్ = దానిని, మే = నాకు, బ్రూహి = చెప్పుము, అహమ్ = నేను, తే = నీకు, శిష్యః = శిష్యుఁడను. (తతః) = ఆ కారణమువలన, త్వామ్ = నిన్ను, ప్రపన్నమ్ = శరణునొందిన, మామ్ = నన్ను, శాధి = శాసింపుము, (అనఁగా నే నెట్లు నడుచుకొనవలెనో దాని నియమింపుము).

అర్జునుఁడు — అవును, వాస్తవమే; నీవు చెప్పినట్లు భీష్మద్రోణులు పూజ్యులనియు, పాండవపక్షపాతులనియు, నేనిదివఱకే యెఱుఁగుదును; అయినను, గౌరవులు దుర్ణయులై మారాజ్య మపహరించుటవలనఁ గలిగిన కార్పణ్యముచే నాకు గురుబంధు మిత్రాదులయెడ నైజముగాఁ గలిగియుండెడు భక్తివిశ్వాసములను మఱచి, వాఁడనై దూరపుయోచన సేయక యుద్ధమునకుఁ బూనుకొన్నవాఁడనైతిని. అయితే యిప్పుడు వారలనందఱ నేకకాలమున యుద్ధరంగమునఁ జూచుటచేత స్వల్పరాజ్యసుఖముకై వీరలనందఱ వధింపవలసివచ్చెనే యనెడు కనికరముచే నామనస్సు మిగుల నాందోళితమగుచున్నది; గాన నిపుడేమి సేయవచ్చునో యెఱుఁగజాలకున్నాను. నీవు సర్వజ్ఞమూర్తివిగనుక నీయభిప్రాయమును దెలియఁ గోరుచున్నాను. కావున నన్ను నీశిష్యునిగ భావించి చక్కఁగా యోచించి మనమిప్పుడేమిచేయుట యుక్తమో దాని నిశ్చయించి యట్లుచేయ నాజ్ఞాపింపుము.

శ్లో॥ నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోకముచ్ఛోషణ మిన్ద్రియాణాం ।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్॥ 8

అర్థము : మమ = నాయొక్క, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములను, ఉచ్ఛోషణమ్ = శోషింపఁజేయుచున్న, శోకమ్ = దుఃఖమును, యత్ = యేది, అపనుద్యాత్ = తొలఁగఁజేయునో, (తత్) దానిని, భూమౌ = భూలోకమునందు, అసపత్నమ్ = నిష్కంటకమైనదియు (శత్రువులు లేనిదియు), ఋద్ధం = సమృద్ధియైనదియునగు, రాజ్యమ్ = రాజ్యమును, (గాని) సురాణామ్ = దేవతలకు, ఆధిపత్యమ్ + చ = అధిపతిగానుండునట్టి యింద్రపదవినిగాని, అవాప్య + అపి = పొందినదైనను, న + ప్రపశ్యామి + హి = చూడఁజాలకున్నానుగదా.

అయితే, ఆజ్ఞాపించెడి విషయములో నీవొకవిషయము మాత్రము చక్కఁగా నాలోచింపవలసి యున్నది. అదేమనఁగా, గురుబంధుమిత్రులఁ జంపవలసివచ్చెనుగదా యని నాకిప్పుడు గలిగియుండెడు దుఃఖము మహత్తరమైనదగాని, సామాన్యమైనదిగాదు; గనుక నీదుఃఖమువలన నాకు నింద్రియపటుత్వమును గూడఁ దప్పిపోవుచున్నది. అయితే ఇప్పుడు జయాపజయముల నిర్ణయము తెలియకున్నందున నిట్టిదుఃఖమును బొందుచున్నాననియు, నొకవేళ యుద్ధమునందు నేనే జయించి ధనకనకవస్తువాహనాది సమస్తైశ్వర్యములచే నిండియున్నట్టి రాజ్యమును సంపాదించి నిష్కంటకముగా నేలఁగలిగినప్పు డీదుఃఖ ముపశమింప వచ్చుననియు నెంచెదవేమో అట్లెంతమాత్ర మెంచఁదగదు. నాదుఃఖమీ రాజ్యముగాను సరేగదా, యింతకంటె నెక్కుడగు దేవేంద్రపదవి లభించినను, నుపశమిల్లనేరదు సుమీ.

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం। గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవిన్ద। ముక్త్వా తూష్ణీంబభూవహ॥ 9

అర్థము : పరంతపః = శత్రులను దపింపఁజేయువాఁడగు, గుడాకేశః = అర్జునుఁడు, హృషీకేశమ్ = శ్రీకృష్ణునిగూర్చి, ఏవమ్ = ఈ (పైఁజెప్పఁబడినరీతిగా), ఉక్త్వా = చెప్పి, (తతః) = పిమ్మట, న + యోత్స్య + ఇతి = యుద్ధము చేయనని (పునః) = మరల, గోవిన్దమ్ = కృష్ణమూర్తినిగూర్చి, ఉక్త్వా = పలికి, తూష్ణీంబభూవ = ఊరకుండెను, హ = ఆశ్చర్యము.

సంజ — ఓ ధృతరాష్ట్రమహారాజా ! శత్రుభయంకరుఁడగు నర్జునుం డిదివఱకు నేఁజెప్పినప్రకార ముభయసైన్యముల మధ్యను రథముపైని జతికిలఁబడి ధనుర్బాణములఁ గ్రిందపైచినపిమ్మట శ్రీకృష్ణునిగూర్చి యిప్పుడు (II-4 మొ, 8 వఱకు) నేజెప్పినప్రకారము చెప్పినవాఁడై మరల గోవిందునిజూచి నేను యుద్ధముచేయనని తీర్మానముగఁజెప్పి యూరకుండెను. ఆహా యిదియేమి యాశ్చర్యము !!

శ్లో॥ తమువాచహృషీకేశః। ప్రహసన్నివ భారత !
సేనయోరుభయోర్మధ్యే। విషీదన్తమిదం వచః॥ 10

అర్థము : హే భారత ! = భరతవంశజుఁడగునో ధృతరాష్ట్ర మహారాజా !, ఉభయోః = రెండైన, సేనయోః = సైన్యములయొక్క, మధ్యే = నడుమను, విషీదన్తమ్ = వ్యసనపడుచున్న, తమ్ = అర్జుమనునిగూర్చి, హృషీకేశః = కృష్ణమూర్తి,

ప్రహసన్ + ఇవ = నవ్వుచున్నవానివలె, ఇదమ్ = ఈ (క్రిందఁ జెప్పఁబోయెడు), వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

ఇట్లుభయసైన్యముల మధ్యను వ్యసనపడుచున్న యర్జునుంజూచి శ్రీకృష్ణమూర్తి యతని దయార్ద్రహృదయమును, భుజబలపరాక్రమములను, నెఱిఁగినవాఁడు గాన నతఁడు పిఱికితనముచే నిట్లు వ్యసనపడుచున్నవాఁడు గాఁడనియు, గురుబంధుమిత్ర జనాదులయందుఁ గలిగియుండు భక్తివిశ్వాసములనుబట్టి వారల వధించుటకుఁ జేతు లాడక వ్యసనపడుచున్నాఁడనియు, దెలిసికొన్నవాఁడైనను, దాను భూభార నివారణార్థమై యవతరించిన శ్రీమన్నారాయణమూర్తి గనుకఁ, దానవతరించిన కార్యము నెఱవేఱుటకుఁగా నర్జునుని యుద్ధమునకుఁ బురిగొల్ప సమకట్టినవాఁడై, యర్జునునిజూచి పరిహసించువానివలె నభినయింపుచు వెడవెడ నగుచు నిట్లనియె.

## శ్రీభగవానువాచ :

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం । ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూంశ్చ । నానుశోచన్తి పణ్డితాః॥　　　　11

అర్థము : (హేఅర్జున)! = ఓయి యర్జునుఁడా! త్వమ్ = నీవు, అశోచ్యాన్ = దుఃఖపడఁదగని వారినిగూర్చి, అన్వశోచః = వ్యసనపడితివి, ప్రజ్ఞావాదాన్ + చ = పండితులు పలుకునట్టి మాటలనుగూడ, భాషసే = పలుకుచున్నావు, పణ్డితాః = పండితులు (సదసద్వివేకము గలవారు), గతాసూన్ = చచ్చినవారలను గూర్చియు, అగతాసూన్ + చ = బ్రదికియుండువారిని గూర్చియు, న + అనుశోచన్తి = వ్యసనపడరు.

కృష్ణుఁడు - ఓయి యర్జునా! నీచర్యలుచూడఁగా మిగుల వింతలుగనున్నవి; ఏలయనఁగా, నీవు చెప్పెడుమాటలు సమస్తధర్మముల నెఱిఁగిన పండితుని మాటల వలె నున్నవి. అయితే, నీవు భీష్మాదుల మరణమునుగుఱించి దుఃఖించుటచూడఁగా నీధర్మము నెఱుఁగని పామరునివలె నగపడుచున్నావు.

ఎట్లనఁగా "చ॥ వగవఁగ నేమియుండదని వారికినై హృదయంబు గుందఁగా। వగచెదు బుద్ధిమాటలను వావిరి నాడెదు నీవు పండితుల్। వగతురె యున్నవారికి న వశ్యవిధేయతఁ జన్నవారికిం। దగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వమొంది నన్" (భార - భీష్మ ౧ - ఆ. ౧౯౩ ప.)

"సీ॥ తారు గొందఱకు బాధకులయి నడచుట, పరులచే బాధలఁబడుట గలుగు। నివి కాలభావ్యంబు లెఱుక గల్గిన వారుఁ, బఱచితి మొదలచేఁ బడితిమనుచుఁ।

బుధుఁడు ప్రియశోక ములఁబొందఁ డెద్దదా, రాపత్యబాంధవ హానికాత్మఁ | గుందఁగ నడుచుట నుందబుద్ధిత్వంబు, వగ గీడుమాను నే వలవ దడల.

తే. గీ. శోకభయ కారణంబులు లోకమునన | నేకములుదానఁ వలనూపు శోకములకు | భయములకు బుద్ధిచెడియాఁడు పండితుండు | మూఢుఁ డని త్రోవ నేరండు మునుఁగు పగల|| (భార-శాంతి ౧-౧౭౭.) ఒకవేళ భీష్మద్రోణు లిరువురను పెద్దలనియుఁ బూజ్యులనియు, వారలవధించుట ధర్మముగాదనియు, నెంచెద వేమో, అది సహజమే, యొప్పకొనఁ దగియేయున్నది. అయితే, వారలిప్పుడు నీకుశత్రువులగు కౌరవుల సైన్యమున కధిపతులుగా నేర్పడి, నీ మొదలగువారితో యుద్ధముఁ జేయఁబూని, యాయుధపాణులై వచ్చియున్నారు గదా? "క|| సురమునఁ గైదువుఁ గొనితనుఁ | బోరిగొన నేతెంచునట్టి పురుషుని వేదాం | తరహస్యవేది సైనం | బోరఁగొనినం బాతకంబు వొందదు వత్సా||" (భార. శాంతి ౧. ౨౭౫) యుద్ధమున నాయుధపాణియై తన్ను వధించుటకు వచ్చినవాఁడు బ్రహ్మజ్ఞాన సంపన్నుడైనను వాని వధించుటవలన బాతకము లేదని ధర్మశాస్త్రము మొఱపెట్టుచుండ నిప్పుడీయుద్ధమున నిన్నుఁ జంపుటకు నాయుధపాణులై వచ్చియున్న యీభీష్మద్రోణులెట్టి మహానుభావులైనను, వీరలను వధించుట యధర్మమని తలఁచుట యయుక్తమే గదా?

అర్జు -- అయితే, ఓకృష్ణమూర్తీ! వీరలఁజంపుట యధర్మముగాదని చెప్పితివి గదా? వీరిరువురిలో భీష్మునిసంగతి యటుండనిమ్ము, ద్రోణాచార్యుఁడు బ్రాహ్మణోత్తముఁడుగదా! "క|| శిలఁద్రెంపఁబోయి యనుమను | జలములఁ గొని కాల్పఁ గడఁగి చని యనలంబుఁ | బొలియును దాజాను విప్రుల | కలిగి చెఱుపఁబోయి తాన యనయంబుఁ జెడున్|| (భార - శాంతి అ - ౨. ౧౭౨.)" అని ధర్మశాస్త్రమునఁ జెప్పియున్న దే, ఈద్రోణుఁడు సామాన్యవిప్రుఁడుగానున్నను నతనిఁజంపుట పాతకమైయుండఁగా, విప్రోత్తముఁడును, మాకు గురువును, నైయున్న యీయనను వధించుట మఱియుఁ బాపహేతువేగదా?

కృ — ఓహో! నీవడ్లించుచున్నావారేమి? అందలి ధర్మసూక్ష్మము నెఱుఁగవు గాఁబోలును; నీవుచెప్పినట్లు విప్రుల వధించుట పాపకార్యమైనది నిజమే; వారియందు దండార్హులగు విప్రులును గొందఱున్నారు; ఎట్లనఁగా "క|| శాంతుఁడు గాకని నాయుధ | వంతుండై కవియువి ప్రపవసు ధేశుఁడు వే | దాంతినయిన హింసించుట | చెంతము ధర్మంబు శ్రుతులు నిట్లని చెప్పున్||" (భార - శాంతి-౨. అ. ప. ౧౭౫,) యుద్ధమున నాయుధమునుబూని తన్నుఁ జంపవచ్చెడువాఁడు విప్రుఁడైనను గురే, వేదాంతిద్రోణునుసరే, యట్టివానిఁ జంపుట ధర్మమేయని ధర్మశాస్త్రములును, వేదము

లును, గూడఁజెప్పుచున్నవి గాన నిప్పుడీ ద్రోణాచార్యుఁడాయుధపాణియై నీతో యుద్ధముఁజేయ వచ్చియున్నాఁడు గదా! ఇట్టివానిఁజంపుట యధర్మ మెట్లగును?

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! ఇప్పుడు నీవుచెప్పినదానిని బట్టిచూడఁగా, నీభీష్మద్రోణుల వధించుట పాపకార్యము గాదనియే తోఁచుచున్నది. అట్లుండ, నిఁక దుష్టులగు దుర్యోధనాదుల వధిఁచుటవలనఁ బాపముగలుగునని యెట్లు యోచింప నగును? అయినను, నిపుడు నాకుఁ గలిగియుండెడు దుఃఖమునకదియే ముఖ్య కారణము గాదు. మఱియేమన్న, నాకు గురువులుగాను, బంధువులుగాను, నుండునట్టి వారలఁ జంపనొల్లకయే వ్యసనపడుచున్నాను.

కృ — అట్లువ్యసనపడుటయు నవ్యక్తముగానేయున్నది. ఇందువలన నీకాత్మానాత్మవివేకము గలిగియున్నట్లు కనఁబడదు. ఆట్టియాత్మానాత్మవివేకము గలిగి యుండెడు పండితులైననో, బ్రదికియుండెడు వారలను గుఱించియుఁ, జచ్చినవారిని గుఱించియు, నట్లువ్యసనపడరుగదా? అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము. నీవింతకు ముందు చెప్పుచుండినమాటలలోఁ గులక్షయమునకుఁ గారణభూతులగు వారలు నరక లోకమునకుఁ బోదురనియు, దుర్యోధనాదులు మిత్రద్రోహాది పాపకార్యములు చేసిన వారగుటచే నరకప్రాప్తిఁ జెందుదురనియు, నీవు సహనముచేసి వారల వధింప కుండుటచే నీకుఁ బుణ్యలోకప్రాప్తి గలుగుననియు, నీమొదలగు సంగతులు చెప్పు చుంటివిగదా, వీరలిచట యుద్ధరంగమునఁ జచ్చినపిమ్మట నెట్లు పుణ్యలోకమునకుఁ గాని, పాపలోకమునకుఁగాని పోఁగలరు?

అర్జు — వీరలదేహములు మాత్రమే చచ్చుచున్నవిగాని యాత్మలు చావవుగనుక నిచట నీదేహములు చాలించినపిమ్మట వీరియాత్మలు పుణ్యలోకమునకుఁగాని, పాప లోకమునకుఁగాని పోవుచున్నవి.

కృ — అయితే, అప్పటికీదేహములే యాత్మలుగావనియు, దేహము వేఱు, ఆత్మ వేఱు, ననియేగదా నీభావము.

అర్జు — అవును, ఈదేహము వేఱు, ఆత్మ వేఱు, దేహమింటివంటిది, ఆత్మయా యింటఁ గాఁపురముచేయువాని వంటివాఁడు, ఒకయింటఁగాపురము చేయువాఁడా యిల్లువిడిచి మఱియొక యింటికెట్లు పోవుచున్నాఁడో యట్లే యీయాత్మయు నీదేహ మును విడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించుచున్నది.

కృ — మంచిది, యట్లైనయెడల నిప్పుడీయుద్ధరంగమున నీభీష్మద్రోణులు చచ్చిన యెడల వారియాత్మలేమగును?

అర్జు — వారియాత్మలు పరలోకమునకుఁ బోవును.

కృ — అనఁగాఁ బుణ్యలోకమునకా? పాపలోకమునకా?

అర్జు — పుణ్యలోకమునకే పోవును; ఏలయనఁగా వారలు మహనీయులు, ఎప్పుడును బుణ్యకార్యములనే గాని పాపకార్యములఁ జేసినవారుగారు; గనుక వారికి స్వర్గాది పుణ్యలోకములే లభించునని తోఁచుచున్నది.

కృ — మంచిది. వారియాత్మలు పుణ్యలోకమునకే పోఁగలరంటివిగదా, అట్లా లోకమునకుఁ బోయినపిమ్మట నచట, వారీలోకమున ననుభవించుచుండిన దానికంటె నెక్కుడుసుఖము ననుభవింతురా? లేక, కష్టము ననుభవింతురా?

అర్జు — వారాలోకమున నిక్కడికంటె నెక్కుడు సుఖమునే యనుభవింతురు గాని దుఃఖము ననుభవింపరనియే తోఁచుచున్నది.

కృ — మంచిది, వారుమోక్షమును బొందఁదగినంత యోగ్యత గలవారైన యెడల నెప్పుడును మోక్షసామ్రాజ్యము ననుభవించుచున్నారుగదా? అట్లుకాని యెడల వారల పుణ్యమునకుఁ దగినసౌఖ్యమునచట ననుభవించి యైనపిమ్మట, "క్షీణే పుణ్యేమర్త్యలోకం విశన్తి –" అను ప్రమాణానుసారముగ వారలు మరల నీలోకమునకు రావలసి యుందురుగదా? అప్పుడు వారికిప్పటికంటె మేలైన జన్మము గలుగునని యెంచెదవా, లేక, యిప్పటికంటెఁ దక్కువైన జన్మముగలుగునని యెంచెదవా?

అర్జు — వారలు పుణ్యపురుషులు గనుక వారలకప్పుడిప్పటి కంటె మేలైన జన్మయే కలుగవచ్చునని తోఁచుచున్నది.

కృ — అవునుగదా? అప్పటికి నీవుచెప్పెడు మాటలవలననే యేమియేర్పడుచున్నదనఁగా నీవిపుడెవరినిగుఱించి వ్యసనపడుచున్నావో యట్టి భీష్మద్రోణాదీ యుద్ధరంగమున మరణమునొందినయెడలఁ బరలోకమున నింతకంటె నెక్కుడు సుఖముల ననుభవింతురనియు, వారలు మరల నీలోకమున జన్మింపవలసి వచ్చినయెడల నింతకంటె నెక్కుడుజన్మల నెత్తుదురనియు, నేర్పడుచున్నదిగదా? అట్టివీరిని గుఱించి నీవు వ్యసనపడుట యుక్తమేగదా! మంచిది, వీరిసంగతి యటుండనిమ్ము; నీకు శత్రులగు దుర్యోధనాదులు మరణమునొందినయెడల వారలకుఁ బరలోకమున నెట్టిగతి గలుగునని యెంచెదవు?

అర్జు — వారలు రాజ్యాపహారులును, మిత్రద్రోహులును, పాపాత్ములును, గనుక వారికి నరకలోకప్రాప్తి గలుగుననియు, మరల వారలీలోకమున జన్మింపవలసి వచ్చినపుడింతకంటెఁ దక్కువజన్మయే కలుగుననియుఁ దోఁచుచున్నది.

కృ — వారలకట్లు కలుగుటనుగుఱించి నీకేమైన వ్యసనము గలుగుచున్నాదా?

అర్జు — వారు నాకపకారముఁజేసిన వారు గాన వారలకుఁ గలిగెడు దుర్గతిని గుఱించి నాకు వ్యసనము గలుగ నేరదు సరేగదా, వారలకట్లు గలుగుటవలన నాకు దుఃఖమునకు బదులుగా సంతోషమే గలుగఁ దగియున్నది.

కృ — అవునుగదా? ఇఁకను నీవెవరిని గుఱించి యెందునిమిత్తము వ్యసనపడ వలసినది?

అర్జు — భీష్మాదులు మృతులైనయెడల వారలకు సద్గతియే కలుగుచున్నదని నే నెఱుఁగుదును గాన నావిషయమై నాకేమియుఁ జింతలేదు గాని మనయెదుట లేకపోవు చున్నారే యనియే చింతించుచున్నాను.

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం। న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామ। స్సర్వే వయమతఃపరమ్॥ 12

అర్థము: అహమ్ = నేను, జాతు = ఒకప్పుడును, నాసమ్ = లేకుంటిని, ఇతి = అనునది, న + ఏవ = లేనేలేదు, త్వమ్ + తు = నీవైతేనో, (న + అసీః) = లేకుంటివి, (ఇతి) = అనునది, న = లేదు, ఇమే = (ఈయుద్ధరంగమందున్న), జనాధిపాః = రాజులు, (న + ఆసన్) = లేకపోయిరి, (ఇతి) = అనునది, న = లేదు, వయమ్ + సర్వే = మనమందఱము, అతఃపరమ్ = ఇఁకమీఁదను, (ఈ శరీరములు నశించినపిమ్మట), న + భవిష్యామః + ఏవ = లేకపోయెదమే, (ఇతి) + చ = అనునదియు, న = లేదు.

కృ — ఓయియర్జునా! నేనింతదూరము చెప్పియు, నీవుమరల నట్టియవ్యక్తము నే కనఁబఱచుచున్నావు. నీవుగాని, నేనుగాని, మనయెదుటనున్న యీరాజులు గాని మఱియెవరుగాని, యొకప్పుడుండి మఱియొకప్పుడు లేకపోవుటగలదా? నీవిది వఱకెన్నియో జన్మములెత్తియుండి యిపుడీజన్మము నెత్తియున్నావుగదా? ఈదేహము విడిచి మఱియు నెన్నియో జన్మములెత్తవలసిన వాఁడవై యున్నావుగదా? ఇట్టి విషయములో నీవిదివఱకు లేకపోయినావనియు, నిపుడు మాత్ర మున్నావనియు, నిఁకముందునకు లేకపోయెదవనియు నెంచవచ్చునా?

అర్జు — అట్లెంచఁదగదు; నేను మునుపుండినవాఁడనే; ఇప్పుడీ దేహముతో నున్నాను; ఇఁక ముందుగూడ నేదియో యొకజన్మ మెత్తవలసినవాఁడనైయే యున్నాను. గాని, భూతభవిష్యద్వర్తమాన కాలములలో నెప్పుడును లేకపోయెడి వాఁడనుగాను.

కృ — సరిగదా, అలాగుననే నేనును, మనయెదుట నుండు నీరాజులందఱును, భూతభవిష్యద్వర్తమాన కాలములయందుండు వారలేగదా ? అట్లుండ నీభీష్మాదులు లేకపోయెదరే యను దుఃఖము నీకేల గలిగెను ?

అర్జు — నాయభిప్రాయమును నీవు సరిగాగ్రహించినట్లు కనఁబడదు. భీష్మాదులు బొత్తిగా స్వరూపనాశనమై పోవుచున్నారని కాదు నేను దుఃఖించుట; మఱియే మనిన, వారలీజన్మమున, నేదేహములతో నాకుఁదాతగను, గురువుగను, నేర్పడి నాయెడల నెంతయో ప్రేమాతిశయము గలవారై సదా నాక్షేమమును గోరుచుండిరో, అట్టి యీదేహములను విడిచిపెట్టినయెడల వారలు మహనీయు లగుటవలన వారల మట్టునకు వారలు కృతార్థులైనను నాకట్టి వారిసాంగత్యము నాదరణయుఁ దప్పిపోవు చున్నవిగదా యని చింతింపుచున్నాఁడను.

కృ — ఓహో, అదియా నీవ్యసనమునకుఁ గారణము ? అట్లుచింతించుటగూడఁ దెలివిలేని పనిగానేయున్నది.

శ్లో॥ దేహినోఽస్మిన్యథా దేహే । కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తి । ర్ధీరస్తత్ర న ముహ్యతి॥ 13

అర్థము: దేహినః = దేహధారియగుజీవునికి, అస్మిన్ + దేహే = ఈశరీరమునందు, కౌమారమ్ = బాల్యదశయును, యౌవనమ్ = యౌవనదశయును, జరా = ముదిమిదశయును, యథా = ఏప్రకారము, (భవన్తి) = అగుచున్నవో, తథా = అప్రకారమే, దేహాన్తరప్రాప్తిః = మఱియొకదేహమును బొందుట, (భవతి) = అగుచున్నది, (తతః) = ఆకారణమువలన, ధీరః = జ్ఞాని, అనఁగా దేహధర్మములిట్టివని చక్కఁగాఁ దెలిసికొని వానివలనఁజలింపఁబడని మనస్స్థైర్యము గలవాఁడని భావము), న + ముహ్యతి = మోహమును జెందఁడు. (ఖేదమోదములను జెందఁడని భావము.)

ఎట్లనఁగాఁ జెప్పెదవినుము. ఈప్రపంచమునందొక నరుఁడు జన్మించునపు డేమియు నెఱుఁగని శిశువుగనుండి పిమ్మటఁ గొన్నాళ్ళకుఁ గౌమారదశ నొంది యాటపాటలచేఁ బ్రొద్దుపుచ్చుచు, నటుపిమ్మటఁ గొంత కాలమునకు యౌవనదశనొంది స్రక్చందన వనితాది భోగముల ననుభవింపుచుఁ గాలముఁగడపి, యావలఁ గొన్నాళ్ళకు ముదిమి సంప్రాప్తమై, చక్షురాదీంద్రియములయొక్కయుఁ, గరచరణాద్యవయవముల యొక్కయుఁ, బటుత్వముతప్పి తుదకొక యూఁతకఱ్ఱయైనను జేతలేక నడువఁజాలని వాఁడై, పిమ్మట మృతినొందుచున్నాఁడుగదా ? ఇట్లగుటకుఁ గారణ

ష్టేమి? ఆత్మయెప్పటికి నొకటేరీతిగా నుండువాఁడుగదా? అట్లుండ, మొదటఁ బుట్టినపుడెట్లుండెనో యట్లేయుండక దేహమిన్ని మార్పులఁ బొందుటకుఁ గారణమేమి?

అర్జు — అవును, ఒక నరునకేగాదు ప్రతిజీవజంతువునకు నిట్లే మార్పులు గలుగు చుండుటను జూచుచున్నాము; గాన దీనింబట్టిచూడఁగా నిది దేహధర్మమని తోఁచు చున్నది.

కృ — అవును, నీవు చెప్పునదిసరే, ఇట్లుమార్పులు గలుగుట దేహధర్మమే గాని, యాత్మస్వభావముగాదు గనుకనే యొకనరుఁడు మృతినొంది నపుడు దేహధర్మము నొందినాఁడని చెప్పుటకుఁ గారణమైనది. గాన దేహధారియగు నాత్మ యాదేహము నందెట్లు బాల్య కౌమార యౌవన వార్ధక్యదశలను బొందు చున్నాఁడో, యట్లే యాదేహమునువిడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించుటయు నాత్మ కనివార్యమైన పనిగా నుంచున్నది; గాన భీష్మాదులయందలి యాత్మలును, దేహధర్మానుగుణ్య ముగ నాదేహముల విడుచుట సహజమై యుంచున్నది గాన, జ్ఞానియగు వాఁడిట్టి విషయమున వ్యసనమునొందఁడు. అయితే, నీకిట్టి జ్ఞానము లేదుగనుక నీవు దుఃఖపడు చున్నావు.

అర్జు — అవును, నీవిపుడు చెప్పినదంతయు నిజమే. అయినను, నిట్టి బంధు జనుల దేహములు మృతినొందునపుడెట్టి వైరాగ్యశీలునకైన గొంచెమైనను వ్యసనము గలుగకుండునా?

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! । శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాః । స్తాం స్తితిక్షస్వ భారత! ॥ 14

అర్థము: హేభారత! = భరతవంశమునఁబుట్టినవాఁడవును, కౌన్తేయ! = కుంతీ పుత్రుఁడవునగు నోయర్జునా!, మాత్రాస్పర్శాః + తు = ఇంద్రియములకు విషయ ములతోఁడఁ గలిగెడు సంయోగము లైతేనో, శీతోష్ణసుఖదుఃఖదాః = శీతోష్ణము లను, దన్మూలకముగ సుఖదుఃఖములను గలుగఁజేయు నట్టివియు, ఆగమాపాయినః = రాకపోకలు గలిగినవియు, అనిత్యాః = అశాశ్వతములును (అయి యున్నవి), (తస్మాత్) = ఆ కారణమువలన, తాన్ = వానిని (ఆయింద్రియవిషయ సంయోగము వలనఁగలిగెడు సుఖదుఃఖములను), తితిక్షస్వ = ఓర్చుకొనుము.

కృ — ఓయియర్జునా! నీవు చెప్పునది వాస్తవమే. బంధుమిత్రాదులు మృతి నొందునపుడెట్టివానికైనను వ్యసనము గలుగవచ్చును. అయితే, ఆవ్యసనము క్షణ భంగురమైనదిగాని నిత్యమైనది గాదు. ఎట్లనిన, ఇంద్రియములకు విషయములు

గోచరించినపుడు శీతోష్ణాది సుఖదుఃఖములు గలుగును. అయితే, అట్టిసుఖదుఃఖములు ఇంద్రియములకు విషయసంయోగము గలిగియుండు నంతవఱకే యుండును గాని యటుపిమ్మట నుండనేరవు ; విషయ సంయోగ మెట్టిదనఁగా, కంటికేదైన నొక వస్తువు కనఁబడినపుడు చక్షురింద్రియమునకు విషయ సంయోగము గలుగుచున్నది, అయితే, ఆకనఁబడినవస్తువు మంచిరూపము గలదిగా నున్నయెడల నేత్రోత్సవమును జేయుచున్నది, తద్వారా మనస్సునకు నానందము గలుగుచున్నది, లేక, ఆ వస్తువు ఘోరరూపముగలదిగఁ గాని, వికారరూపముగలదిగాఁగాని, యుండినయెడల నప్పుడావస్తువును దృష్టించుటకు భయముగాని, యసహ్యముగాని కలుగుచున్నది ; అప్పుడు మనస్సునకు నిట్టివస్తువును జూడవలసివచ్చెనేయని దుఃఖము గలుగుచున్నది.

ఇదేతీరుగాఁ జెవులకు సంగీతము మొదలగు మంచిశబ్దములు వినఁబడినపుడు మనసునకు సుఖమును, రోదనము మొదలగు దుశ్శబ్దములు వినఁబడినపుడు దుఃఖమును, గలుగుచుండును. జిహ్వకుఁ దీపి మొదలగు రుచికరమైన పదార్థములు దగిలినప్పుడు సుఖమును, చేఁదు మొదలగు పదార్థములు దగిలినప్పుడు కష్టమును గలుగును. ముక్కునకు సువాసనదగిలినప్పుడు సుఖమును, దుర్గంధము దగిలినప్పు డసహ్యమును గలుగును. మఱియుఁ ద్వక్కునకు (చర్మమునకు) విశేషముగా వేఁడిమిగాని, చలిమిరిగాని, సోఁకినప్పుడు బాధగలుగును. హితవుగానుండునట్టి మితమైన శీతోష్ణములు సోఁకినపుడు సుఖముగా నుండును. ఇట్టి యింద్రియవిషయ సంయోగములకే మాత్రాస్పర్శములని పేరు. గాన నిట్టి మాత్రాస్పర్శములవలన శీతోష్ణాదులును, తద్వారమున సుఖదుఃఖములును గలుగుచుండును. అయితే, ఇట్టిమాత్రాస్పర్శముల వలనఁగలిగెడు సుఖదుఃఖములు క్షణభంగురములని చెప్పుటకుఁ గారణమేమనఁగా, " సీ॥ శ్రోత్ర మధ్యాత్మంబు నాఁ బె శబ్దం బధిభూతంబు దిక్కుఁబు పురుషముఖ్య। సుధిదైవముల్ చర్మమధ్యాత్మమందలి సంస్పర్శ మధిభూతసంజ్ఞికంబు। దానికి నధిదైవతంబు మరుత్తు నేత్రంబు దానధ్యాత్మకంబు గాప। మధిభూతమాదిత్యుఁ డధిదైవతము జిహ్వ యధ్యాత్మకము రస మారయంగ ॥తే॥ వానియధిభూత ముదకము దదధిదైవ। తంబుఘ్రాణ మధ్యాత్మంబు దలఁపగంధ। మనఘ యధిభూత మగుఁ దదీయాధిదైవ। తంబు మేదిని యంద్రదు విద్వజ్జనమ్ము॥ (భార - అనుశా-౧. 330) పంచేంద్రియములగు శ్రోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా, ఘ్రాణము లధ్యాత్మికములు. వానికిఁ గ్రమముగా, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడు విషయము లాధిభౌతికములుగా నుంచున్నవి ; వానికి, దిక్కు, మరుత్తు, సూర్యుఁడు, ఉదకము, భూమియు, ననునవి యధిదైవికములుగా నుంచున్నవి ; అనఁగా. శ్రోత్రేంద్రియమునకు శబ్దము దిక్కువలనను, చర్మమునకు

స్పర్శము వాయువువలనను, నేత్రేంద్రియమునకు రూపము సూర్యునివలనను, జిహ్వేంద్రియమునకు రసముదకమువలనను, ఘ్రాణేంద్రియమునకు గంధము భూమివలనను, సంబంధపడుచున్నవనుట. అనఁగా పైఁజెప్పఁబడిన యధ్యాత్మికాధి భౌతికాధిదైవికములుమూఁడును సమకూడిననేగాని యాయాయింద్రియముల కాయావిషయములు గోచరింపనేరవనుట. ఇట్టిసంయోగములే మాత్రాస్పర్శములనఁబడుచున్నవి. ఆమూఁటిలో నేదేనియొకటి కొఱఁతపడినయెడల నట్టికొఱఁత గలిగియుండునంతవఱకు నాయావిషయమాయా యింద్రియమునకు గోచరింపనేరదనుట. అదెట్లనఁగా, కంటికెదుట నొక వస్తువుంచున్నది. ఆవస్తువు సూర్యరశ్మిలేనియెడలఁ జీకటియందుఁ గంటికగపడదు గదా? అట్లే, వస్తువును సూర్యరశ్మియు, నుండి నేత్రేంద్రియములేనియెడల నప్పుడును సూర్యరశ్మియు నేత్రేంద్రియమును నుండి వస్తువులేనియప్పుడును, నేత్రేంద్రియమునకు విషయము గోచరింపనేరదుగదా? కావుననే యీవిషయ సంయోగములు క్షణభంగురములని చెప్పఁబడుచున్నవి. అందునకు దృష్టాంతమేమనఁగా, నొకపురుషుఁడేదైన నొక శృంగార వస్తువును జూచినపు డానందమును బొందుచున్నాఁడు గదా? అట్టి వస్తువును జూచిన కొంతసేపటికి నొక ఘోర రూపమును అనఁగా నొకఁడు కాలో, చెయ్యియో, తెగి రక్తములో బొరలుచు మిగుల బాధపడుచుండుటను జూచుచున్నాఁడు. అప్పుడు మొదట శృంగారవస్తువును జూచినపుడు గలిగిన యానందముపోయి వ్యసనము గలుగుచున్నదిగదా? అటుపిమ్మట నచ్చటినుండి యావలికిఁబోవుచున్నాఁడు, అపుడాతనికంటికి మంచిరూపముగాని, చెడురూపముగాని, గోచరింపక పోవుటచేత నదివఱకుఁ గలిగియుండిన యానందముగాని, వ్యసనముగాని, యుండనేరదుగదా! ఇట్లే తక్కినయన్ని యింద్రియములకును, మంచివిషయములతో సబంధము గలిగినపు డట్టి సంబంధము గలిగియుండు నంతవఱకు మనస్సునకు సుఖమును, చెడువిషయములతో సంబంధముగలిగినపుడట్టి సంబంధము గలిగియుండునంతవఱకు మనస్సునకు దుఃఖమును, గలుగుచుండును. ఆయావిషయముల సంబంధము వదలినవెంటనే యట్టి సుఖదుఃఖములును నుండనేరవు. కనుకనే మాత్రాస్పర్శములు వచ్చుచుఁ బోవుచు నుండునవి యనియు, క్షణభంగురములనియుఁ, జెప్పుటకుఁ గారణమైనది. కాఁబట్టి, యీభీష్మాదుల మృతకళేబరములు నీదృష్టికి గోచరించుచుండునంతవఱకే నీకు వ్యసనముండును, గాన, క్షణమాత్ర మోర్చియుంటివేని యావల నీకీవ్యసన ముండనేరదు.

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే। పురుషం పురుషర్షభ!
సమదుఃఖసుఖం ధీరం। సోఽమృతత్వాయ కల్పతే॥ 15

అర్థము : హేపురుషర్షభ! = పురుషశ్రేష్ఠుఁడవగు నోయియర్జునా!, హి = ఏల యనఁగా (పైశ్లోకమునఁ జెప్పఁబడిన ప్రకారము మాత్రాస్పర్శములను సహించుకొమ్మని చెప్పుట యేలయనఁగా,), సమదుఃఖసుఖమ్ = దుఃఖసుఖములయందు సమభావము గలవాఁడును, ధీరమ్ = దృఢచిత్తముగలవాఁడునైన, యమ్ + పురుషమ్ = ఏపురుషునైతే, ఏతే = (ఈమాత్రాస్పర్శములు), న + వ్యథయన్తి = బాధింపవో, సః = ఆపురుషుఁడు, అమృతత్వాయ = మోక్షము కొఱకు, కల్పతే = అర్హుఁడగుచున్నాఁడు.

అయితే, అట్లోర్చియుండుట యందఱకును సులభసాధ్యము గాదు. సుఖము గలిగినపుడుపొంగకయు, దుఃఖముగలిగినపుడు క్రుంగకయు, నిబ్బరముగ నుండఁదగినంత దృఢచిత్తముగలవానికేగాని యితరులకు, అనఁగాఁ జెదమనస్సుగలవారల కట్లు చేయ సాధ్యపడదు. అయితే, ఇట్టి కష్టసాధ్యమగుపని నన్నుఁజేయుమని చెప్పుటకుఁ గారణమేమనఁగా నీవు పురుషశ్రేష్ఠుఁడవుగాని సామాన్యుఁడవుగావు; గాన నీకిట్లు చేయుట సాధ్యపడఁగలదు. అయితే, ఇట్టి కష్టసాధ్యమగుపని నేలచేయవలెనందువేని, వినుము. ఎవఁడైతే, యీమాత్రాస్పర్శముల వలనఁగలిగెడు సుఖదుఃఖముల చేఁ జలింపక యుంచున్నాఁడో యట్టివానికే దృఢమైన జ్ఞానము, అనగా సదసద్వివేకము గలుగును. అట్టి సదసద్వివేకము గలిగిననేగాని మోక్షార్హుఁడుగా నేరఁడు. సదసద్వివేక మెట్టిదనఁగా,

శ్లో॥ నాఽసతో విద్యతే భావో । నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్త । స్త్వనయో స్తత్త్వదర్శిభిః 16

అర్థము : అసతః = అసత్తైన (దేహమునకు) భావః = ఉనికి (నిత్యత్వము,) న + విద్యతే = లేదు, సతః = సత్తైన యాత్మకు, అభావః = లేమి (అనిత్యత్వము), న + విద్యతే = లేదు. అనయోః = ఈ, ఉభయోః + అపి = రెంటియొక్కయు, అన్తః + తు = నిశ్చయమైతేనో, తత్త్వదర్శిభిః = తత్త్వజ్ఞానులచేత, దృష్టః = తెలిసికొనఁబడినది.

"సత్" అనఁగా నిత్యమైన (చెడని పదార్థము), "అసత్" అనఁగా అనిత్యమైన (ఎప్పటికైన నశింపదగిన పదార్థము) గాన సత్పదార్థమునకు ననిత్యత్వమును, అసత్పదార్థమునకు నిత్యత్వమును నెప్పటికిఁ గలుగనేరవు. ఈ రెంటియొక్క యాథార్థ్యమును దత్త్వవేత్తలే యెఱుంగుదురు గాని యితరు లెఱుంగఁ జాలరు. నాతత్త్వవేత్తలకుఁ దత్త్వదర్శులనియు, సదసద్వివేకులనియు నామాంతరములు గలవు.

అర్జు — "(సత్) అనఁగా నేది? "అసత్" అనఁగా నేది?

కృ - నాయందుండెడు పరమాత్మయు, నీయందును, మనయెదుటనుండెడు నీరాజులయందును, మఱియు నీప్రపంచమందు నుండు పిపీలికాది బ్రహ్మపర్యంతమగు సమస్తజంతువులయందును నుండెడు జీవాత్మయును నెప్పటికిని నశించునట్టివి కావు. గనుక వీనికినసఁగా నీ పరమాత్మజీవాత్మలకు సత్తనియుఁ దక్కిన దృశ్య ప్రపంచ మంతయు నశించునదియే గనుక దానికి నసత్తనియుఁ బేరు.

అర్జు - నీయఁదుండునది పరమాత్మయనియు, నేను మొదలగుతక్కినజంతువుల యందుండునది జీవాత్మయనియుఁ జెప్పితివిగదా, అట్లుచెప్పుటకుఁ గారణమేమి? పరమాత్మయు జీవాత్మయు వేఱువేఱువస్తువులా? అట్లయినయెడల నారెంటికిఁగల భేదమేమి? మఱియు నేను మొదలగు సమస్తజంతువులయందు వ్యాపించియుండునది జీవాత్మయంటివిగదా, ఆజీవాత్మయొక్కటియే యన్నిజంతువులయందు వ్యాపించి యున్నదా, లేక ఆయాజంతువులయందు వేఱువేఱుజీవాత్మలున్నవా? ఈజీవాత్మపర మాత్మలుమాత్రము నాశములేని కెట్లగుచున్నవి?

కృ — పరమాత్మయనఁగా నీప్రపంచమునకంతటికిని సృష్టిస్థితిలయహేతుభూత మగు పరబ్రహ్మమునకుఁ బేరు. జీవాత్మయనఁగా నాపరబ్రహ్మముయొక్క యంశమే (భాగమే) గాని వేఱుగాదు; అదియే యన్నిజంతువులయందును వ్యాపించియున్నది; అయితే యది ప్రకృతి సంబంధముగలిగియుండుటచే జీవాత్మ యనఁబడుచున్నది: ప్రకృతియనఁగా మాయ; దీనికే యవిద్యయనియు, నజ్ఞానమనియు, నామాంతరములు గలవు. పరమాత్మయట్టి యజ్ఞానసంబంధమేమియులేక స్వయంప్రకాశమైయుండును. కనుకనే యది (పరమాత్మ) అనఁగా నుత్కృష్టమైన యాత్మయనఁబడుచున్నది. ఆపరమాత్మపుట్టుట, చచ్చుట, హెచ్చుట, తగ్గుట, మాఱుట, మొదలగు వికారము లెవ్వియు లేనిదై యెల్లప్పుడు నొకటేతీరుననుండును. అట్టిపరమాత్మయే నేను. నీవు మొదలగువారలయందుండు నాత్మయన్ననో ప్రకృతిసంబంధమగు నజ్ఞానముతోఁగూడి యుండునది గనుక నట్లజ్ఞానముతోఁ గూడియుండునంతవఱకు పుట్టుట, చచ్చుట, అనఁగా నొకదేహమును విడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించుట, మొదలగు వికార ములనుబొందుచు జీవాత్మయనియే చెప్పఁబడుచున్నది. ఈజీవాత్మకు నజ్ఞానమెప్పుడు విడిచిపోవుచున్నదో యప్పుడదియుఁ బరయాత్మలోఁగలియును. అట్లు గలిసినపిమ్మట దానికిని జనన మరణాది వికారములు కలుగనేరవు. గనుక నట్లు పరమాత్మలోఁ గలి యుటయే మోక్షమనఁబడును. ఇందునకొక దృష్టాంతమును జెప్పెద వినుము.

ఈలోకమున స్వచ్ఛమైన స్వర్ణమునకు నపరంజియనియు వెండిమొదలగునితర లోహములతో మిశ్రమైయుండెడు స్వర్ణమునకు బంగారమనియు వ్యవహారనామములు గలిగియున్నవిగదా ? అట్లు నామభేదములు గలిగియుండుటకుఁ గారణమేమో తెలియునా ? ఆరెంటికినుండు భేదమెట్టిదైనదియు నెఱుఁగుదువా ?

అర్జు — అవును, తెలియును. అపరంజి స్వచ్ఛమైనది. అనఁగా నితరమగు నేలోహముతోను మిశ్రమముగాకయుండునది ; గనుక దాని నెన్నిమాఱులు కరఁగినను లేక పుటములువేసినను, వన్నెతగ్గుటగాని, హెచ్చుటగాని, లేక ఎత్తుతగ్గుటగాని కలుగనేరదు, బంగారమున్ననో దానినిబుటములు వేసినయెడల వన్నెహెచ్చుచు, నెత్తుతగ్గుచు వచ్చును. అట్లు పుటములు వేయనువేయను దానియందుండెడు మాలిన్యము యావత్తు విడిచిపోయి యదియును స్వచ్ఛమైన స్వర్ణమగును. అటుపిమ్మట నెన్ని పుటములువేసినను, దానికి వన్నెతగ్గుటగాని, హెచ్చుటకాని, లేక యెత్తుతగ్గుటగాని, కలుగనేరదు; గనుక నదియు నప్పు డపరంజి యనఁబడును.

కృ — అవునుగదా, జీవాత్మపరమాత్మలకుఁగలభేదము నిట్టిదియేయని గ్రహింపుము. అనగా జీవాత్మ బంగారముతోడను బరమాత్మ యపరంజితోడను, బోల్పఁదగియున్నవి. అపరంజి యెన్నిపుటములు వేసినప్పటికిని వన్నెయందునుగాని, యెత్తునందునుగాని, యెట్లు మాఱుటలేదో యట్లేపరమాత్మయు నెప్పటికిని నేలాటి వికారములను బొందక యొకటేతీరుగ నుండును. ఇఁకను బంగారము పుటములచే నెత్తుతగ్గుచు వన్నెహెచ్చుచు రాఁగాఁదుదకు దానియందుండెడు మాలిన్యము యావత్తు విడిచి స్వచ్ఛమైన స్వర్ణమై పిమ్మట నపరంజితో నెట్లుగలియునో యట్లే జీవాత్మయు ననేకజన్మసంస్కారములవలన నజ్ఞానమునువిడుచుచు రాఁగారాఁగాఁ దుదకు నజ్ఞానము పూర్తిగ విడిచిపోయిన పిమ్మటఁ బరమాత్మలోఁ గలియుచున్నది. మఱియు, బంగారముతోఁ జేయఁబడిన యాభరణము లనేకవిధములుగను ననేక రూపములుగను, నిండినను నట్టియాభరణము లన్నిటియం దుండెడుబంగార మొక్కటియే యెట్లు యున్నదో యట్లే యనేకరూపములగు జంతువులయం దుండెడు జీవాత్మయొక్కటియేగాని ప్రత్యేకమైనదిగాదు.

అర్జు — అయితే, అయ్యా! ఇట్లుచెప్పితివిగదా అన్నిజంతువులయం దుండెడు జీవాత్మయొక్కటియేయైన యెడల నొకజంతువునకేదియైన నొకబాధ గలిగినపు డట్టి బాధ తక్కిన జంతువులకును గలుగవలెను గదా, అనఁగా, నొకనికిఁ దలనొప్పి, జ్వరము, మొదలగుబాధలు గలిగినపుడు తక్కినవారలకందఱకును నట్లే కలుగవలెను గదా, యట్లుగలుగుటలేదే, యిందునకుఁ గారణమేమి ?

కృ — అట్టిబాధలు దేహమునకేగాని యాత్మకు లేవు. శరీరభేదములే గాని యాత్మభేదములేదు. గాన నొకశరీరమునకుఁ గలిగినబాధ మఱియొకశరీరమున కుండవలసిన కారణములేదు. అదెట్లనఁగా నొకపురుషుఁడు పదివన్నెబంగారము నొకసేరు కొనితెచ్చి దానితోఁ బదివిధములగు నాభరణములను (నగలను) జేయించుచున్నాఁడు. అందుఁగొన్ని యాభరణములు గట్టివి, అనఁగా, టంకముతో నతుకులేనివిగను, మఱి కొన్ని బోలువిగను, అనఁగా, టంకముతో నతుకఁబడినవిగ నున్నవి. ఈ నగలలో నన్నిటియందును నా సేరుబంగారమే యిమిడియున్నదిగదా? మరల నాయాభరణములను వేఱువేఱుగాఁ గరఁగించి కడ్డీలుగాఁ బోసినయెడల నాకడ్డీలన్నియు నొకటే వన్నెగలవైయుండునా? అనఁగా మొదటఁదేబడిన సేరుబంగారమునకుఁ గలిగియుండిన పదివన్నెయే కలిగియుండునా?

అర్జు — అట్లుండనేరదు. టంకముపెట్టక చేయఁబడిన గట్టినగలు కరఁగిపోసిన కడ్డీలు మొదటిబంగారమువలెఁ బదివన్నెగలవియుఁ, దక్కిన యనఁగా, టంకము కలసిన నగలు గరఁగిపోసినకడ్డీలా యానగలయందుఁ జేరియున్న టంకముయొక్క పరిమితిని బట్టి తగ్గువన్నె, అనఁగా, తొమ్మిది, ఎనిమిది, ఏడు, మొదలగువన్నెలు గలవిగా నుండును.

కృ — మంచిది, యిప్పుడిట్టివన్నెల భేదముగల కడ్డీలయందు మొదటి బంగారమున్నదా లేదా?

అర్జు — ఉన్నది.

కృ — మంచిది, ఇది యిట్లుండనిమ్ము, మఱియొక సంగతిఁ జెప్పెదను. మొదటఁజెప్పిన సేరుబంగారముతోఁ జేయఁబడిన పదినగలలో నొకటియేదియో ప్రమాదముచేతఁ జేయిజాఱి క్రిందఁబడి విఱిగిగాని, నలఁగిగానిపోవుచున్నది. అపుడు తక్కినతొమ్మిదినగలయందును దీనియందుండుబంగారమే యగుటచే నవియు విఱిగిగాని, నలఁగిగాని పోవలెనుగదా, అట్లు పోవుచున్నవా?

అర్జు — అట్లగుటలేదు-ఏలయనఁగా, ఆపదినగలయందుండెడి బంగారమొక్కటియేయైనను, దానిచేఁ జేయఁబడియుండెడు నగలుమాత్రము ప్రత్యేకములైనవిగ నుండుటవలన వానిలోనొకదానికిఁ గలిగెడు వికారము మఱియొకదానికిఁ గలుగనేరదు.

కృ - మంచిది, అదియటుండనిమ్ము, క్రిందఁబడినలఁగిన నగయందుండెడు బంగారమట్లు నలఁగుటవలనఁ దక్కినయాభరణములయందుండెడు బంగారముకంటె నేమైనభేదముగలదియగుచున్నదా?

అర్జు — అట్లు కానేరదు. ఆయాభరణము క్రిందఁబడుట వలనఁగలిగెడు వికారము, అనఁగా విఱుగుట, నలఁగుట, యనెడు వికారమాయాభరణమునకే చెందుచున్నదిగాని, అనఁగా, నాభూషణముయొక్క రూపుచెడుట, లేక, మారుట యానగకే కలుగుచున్నదిగాని, దానియందుండెడు బంగారమునకు నందువలన నేలాటి మార్పును, అనఁగా వన్నె హెచ్చుటగాని, తగ్గుటగాని లేకయొత్తు తగ్గుటగాని, ఈ మొదలగుమార్పులేవియుఁ గలుగనేరవు. ఏలయనఁగా, అట్లురూపుచెడిన యాభరణమును గరఁగినయెడల దానికి మొదట నేవన్నెగలబంగారమెంత యొత్తుగలదిపెట్టఁబడెనో యావన్నెగల బంగారమంతయొత్తుగలది తేలుచున్నది. గాన నాయాభరణమునకుఁగలిగెడు వికారములేవియు నందున్నబంగారమున కంటనేరవని యెంచఁదగియున్నది.

కృ — కాన నట్లే యీజీవజంతువులయందుండెడు నాత్మ యొక్కటియేయైనను నాజంతువులకుఁగలిగెడు బాధలు వానిదేహములకేగాని యాత్మలకు నంటనేరవనియు, నొకదేహమునకుఁ గలిగినబాధ మఱియొకదేహమునకుఁ గలుగనేరదనియు, నూహింపఁదగియున్నది.

అర్జు — అయితే దేహమచేతనముగదా? ఆదేహమునందు జీవాత్మయున్నంతవఱకేగదా యేసుఖదుఃఖములనైన ననుభవింపఁదగియుంచున్నది. నిర్జీవమగు దేహమున కట్టిసుఖదుఃఖములేవియుఁ గలుగనేరవుగదా? అనగాఁ నొకఁడు బ్రదికియుండఁగా వానిదేహమునకేదైన దెబ్బతగిలినయెడల బాధనొందుటయు, వాఁడు మృతినొందిన పిమ్మట వానికళేబరము నేమిచేసినను, అనఁగాఁ గత్తితోఁగోసినను, నిప్పుతోఁ గాల్చినను, నేమియుఁజలింపక యుండుటయుఁ జూచుచున్నాముగదా? దీనింబట్టిచూడఁగా నీదేహములకుఁ గలిగెడు సుఖదుఃఖముల ననుభవించెడువాఁడు జీవుఁడేగాని దేహముగాదని స్పష్టముగ నూహింపఁదగియుండఁగా నట్టిసుఖదుఃఖములు దేహమునకుఁజెందుచున్నవేగాని యాత్మకుఁజెందనేరవని చెప్పుటచూడఁగాఁ గేవలవిరుద్ధముగా నున్నదే. అట్లుచెప్పుటకుఁగారణమేమి?

కృ — ఓయర్జునా! నీవడుగునది సయుక్తికముగనే యున్నది. అయినను జక్కఁగా యోచించిచూచినయెడల నట్టి సుఖదుఃఖములు దేహమునకు సంబంధించినవేగాని, యాత్మకు సంబంధించినవిగావని తెలిసికొనవచ్చును. అదెట్లనిన నిందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

"సీ॥ పావకశిఖలచే భాండంబు దాఁ దప్త, మగుఁ దప్తఘటముచే నందు నున్న జలము తపించు నా జలముచేఁ దండులం, బులు తప్తమొంది యప్పుడు విశిష్ట। మైన

యెన్నం బగు నాచందమునను దా, దేహేంద్రియంబుల దెలివితోడ । నాశ్రయించుక యున్న యట్టిజీవునకు దే, హంబునఁ బ్రాణేంద్రి యాదికమున ॥అ॥ జరుగుచుండు నిట్లు సంసారఘటశిక్ష । రక్షకుండునైనరాజు దుష్ట । కర్మములకుఁబాసి కంజాక్షు పదసేవఁ । జేసెనేని భవముఁ జెందకుండు॥" (భాగ. ౫. ౧.) అనునట్లు, ఓయి యర్జునా ! ఒకఁడొక సేరుబియ్యముదెచ్చి యందుసగమొక కుండయందుంచి దానిలో నుదకముపోసి పొయిమీఁదఁబెట్టి మంటవేయుచున్నాఁడు ; తక్కిన బియ్యమును మఱి యొకకుండలోఁబోసి యూరకయే యుంచుచున్నాఁడు. అప్పుడేమి జరుగుచున్నది ?

అర్జు — అట్లు పొయిమీఁదఁబెట్టిన కుండలోని బియ్యముడికి యన్నమగుచున్నది. ఊరకయుంచినకుండలోని బియ్యము, బియ్యముగానే యుంచున్నది.

కృ — అవునుగదా ; అట్లగుటకుఁగారణమేమి ? రెండవకుండలో నుంచిన బియ్యమువలెనే పొయిమీఁది కుండలోని బియ్యముగూడ బియ్యముగనే యేలయుండఁ గూడదు ?

అర్జు — అదెట్లగును ; పొయిమీఁదఁ బెట్టినకుండ పొయిలో నుండెడు నిప్పుచేఁ గాలుచున్నదిగదా ? అందువలన నందుండెడు జలము వెచ్చనయగుచున్నదిగదా ? ఆవేఁడిమివలన నందలి బియ్యముడుకక యెట్లుండఁగలదు ?

కృ — మంచిది, పొయిమీఁదఁబెట్టక యూరకయుంచిన కుండలోని బియ్యము గూడ నట్లే యుడుకుచున్నదా ?

అర్జు — లేదు ; అందులోని బియ్యమట్లే, అనఁగా, బియ్యముగానే యుంచున్నది.

కృ — అవునుగదా, అప్పటికి దీనివలన నేమియేర్పడుచున్నదనఁగా, పొయి మీఁద నుండెడు కుండ కాలుటవలన దానియందుండెడు బియ్యమున కావేఁడిమి దగిలి యుడుకుటయుఁ దక్కినకుండ యట్లు కాలకుండుటచే నందలి బియ్యముడుకకుండు టయుఁ గలుగుచున్నదిగదా ?

అర్జు — అవును.

కృ — కనుకనట్లే, యేఘటమునందుండెడు జీవుఁడా ఘటమునందుండునంత వఱకు నాఘటమునకుఁ బ్రారబ్ధవశమునఁ గలిగెడు సుఖదుఃఖముల ననుభవింపుచు నాఘటమును విడిచినపిమ్మట నట్టిసుఖదుఃఖములతో సంబంధములేకయుండును ; గాన నట్టి సుఖదుఃఖములు దేహమునకు సంబంధించినవే యగుచున్నవి గాని జీవునకు సంబంధించినవి కానేరవు.

అరు — అయ్యా ! ఏఘటమునకైనను బ్రారబ్ధవశమునఁగలిగెడు సుఖదుఃఖముల నాఘటమున నందుండెడు జీవుఁ డనుభవించునని యంటివిగదా ! ఆఘట మచేతన పదా

రహితమైయుండగాఁ దానికిఁ బ్రారబ్ధమెట్లు గలుగును ? దానియందుండెడు జీవుఁడు గదా యేదైన పుణ్యపాపములు సేయుచున్నాఁడు ; అట్లుండ నాప్రారబ్ధమా జీవునకుఁ గాక ఘటమునకెట్లు గలుగును !

కృ — ఏ కార్యము యొక్క యైనను సరే కర్తృత్వము జీవునకుఁ గాని యాజీవుఁడుండు ఘటమునకుఁ గాని లేదు. మఱియు, జీవుఁడనఁగాఁ బ్రకృతిసంబంధముఁ గలిగిన యాత్మయని యిదివఱకే నీకుఁ జెప్పియుంటినిగదా, ఆప్రకృతియే స్వభావమనఁబడుచున్నది. అది త్రిగుణాత్మకమైనదిగ, అనఁగా, సత్త్వరజస్తమోగుణములతోఁ గూడినదిగ నుండుచున్నది. గాన నాయాగుణములకుఁ దగిన పనులనది (అప్రకృతి) చేయుచుండును ; గాని, దానితో సంబంధపడియుండెడు జీవుఁడుగాని, యాజీవుఁడు ధరించియుండెడు శరీరముగాని యేమియుఁ జేయుట లేదు ; అయితే ఆజీవుఁ డాప్రకృతితో సంబంధించి యుండుటచేత నాప్రకృతిచేఁ జేయఁబడు సుకృత దుష్కృతముల యొక్క ఫలములగు పుణ్యపాపములను జీవుఁ డనుభవించుచున్నాఁడు. కనుకనే "శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే । పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥" (13 -.21). అనునట్లు కార్యముల యొక్క కర్తృత్వము ప్రకృతిది యనియు, దానిఫలముల యనుభవము జీవునిదనియుఁ బెద్దలు సెప్పియున్నారు. అయితే ప్రకృతిచేఁజేయబడుఁ కర్మలఫలము జీవుఁడెట్లనుభవించుచున్నాఁడనఁగా నిందునకుఁదగిన దేహమునుధరించి యాదేహమునందుండి యిపుడు నేఁజెప్పిన దృష్టాంతములోని కుండలోనుండు బియ్యమువలె ననుభవించుచున్నాఁడు. అదెట్లనఁగా, సుకృతఫలము ననుభవింపవలసిన జీవుఁడన్నిజన్మములలో నుత్తమమగు మానవజన్మమెత్తి యాయురారోగ్యైశ్వర్యసహితమగు దేహమున వసించుచు, సమస్త సుఖముల ననుభవింపుచుండును. దుష్కృతఫలము ననుభవింపవలసిన జీవుఁడు, మానుషజన్మలో నతినీచమగు జన్మనుగాని, లేక, పశుపక్ష్యాదితిర్యగ్జంతువులలో నొకజన్మను గానియెత్తి దారిద్ర్యము, వ్యాధి, మొదలగువానిచేఁ బీడింపఁబడుచు నాధ్యాత్మికాధిభౌతికాధిదైవికములనెడు తాపత్రయముచేఁ గలిగెడు సమస్త దుఃఖముల ననుభవింపుచుండును ; గనుక నాదేహములు ప్రారబ్ధవశమునఁ గలిగినదేహములై యట్టిప్రారబ్ధమున కనుగుణ్యములగు సుఖదుఃఖములకుఁ బాత్రములగుచు వానియందుండెడు జీవాత్మలయొక్క యనుభవములకు సాధనములగుచున్నవి. అట్టిసాధనములచే జీవుఁడు తనకు సంబంధించియుండు ప్రకృతిచేఁజేయఁబడు సుకృతదుష్కృతములయొక్క ఫలములననుభవింపుచున్నాఁడు. కావున "కర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షి యగుటంజేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులుఁ ప్రకృత్యధీనంబులనియు సుఖ

దుఃఖభోక్తృత్వంబులు ప్రకృతివిలక్షణుండైన పురుషునివనియు నెఱుంగుము." ఇందునకొక దృష్టాంతముఁ జెప్పుచున్నాను వినుము. ఎవఁడైననొకఁడు చౌర్యము మొదలగు నేరములఁజేసినయెడల వాఁడు రాజదండనను బొంది చెఱసాలయందుంచఁబడి యందనారోగ్యకరమగు నాహారమువలనను, దోమలు, చీమలు, నల్లులు, మొదలగు కీటకములవలనను, మలమూత్రాదులవలనఁగలిగెడు దుర్గంధమువలనను మిగులబాధపడు చున్నాఁడుగదా ? అట్టిబాధను నాచెఱసాలయందుండునంతవఱకే పొందుచు నందు నుండి విడుదలయైనపిమ్మట నాబాధను వాఁడెట్లుపొందుటలేదో, యట్లేజీవుఁడును బుణ్యపాపముల కనుగుణ్యములగు దేహములఁ బొంది వానియందుండు నంతవఱకుఁ దదనుగుణ్యములగు సుఖదుఃఖముల ననుభవింపుచు నాదేహములను విడిచిన పిమ్మట నట్టియనుభవమునకుఁ దప్పినవాఁడగును. కనుకనే యట్టిసుఖదుఃఖములు దేహమునకు సంబంధించినవేగాని యాత్మకుసంబంధించినవి గావనియు, దేహము క్షేత్రమనియు, దేహి క్షేత్రజ్ఞుఁడనియుఁ జెప్పుటకుఁగారణమైనది. కాన నోయర్జునా ! శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః । యః పశ్యతి తదాత్మాన మకర్తారం స పశ్యతి!" (13 – 30). అనునట్లు సమస్త కార్యములును బ్రకృతిచేఁ జేయఁబడుచున్నవే గాని యాత్మయేమియుఁ జేయుటలేదని యెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే జ్ఞాని యనఁబడును.

అరు — అయితే అయ్యా! నీవుపరమాత్మవనియు, నేను జీవాత్మననియుఁజెప్పితివిగదా, నావలెనేనీవును మాతృగర్భమున జనించి కరచరణాద్యవయవములుగల దేహముతోఁగూడి సంసారసంబంధమగు కర్మలను జేయుచున్నావే, ఇట్లుండఁబరమాత్మకు జీవాత్మకువలె జననమరణాదివికారములేవియులేవని నీవు చెప్పినమాటలెట్లు నమ్మవచ్చును !

కృ — ఇందునకు నొకదృష్టాంతమును జెప్పెదవినుము–ఇంతకుముం దపరంజి స్వచ్ఛమైనదనియు, బంగారమితర లోహములతో మిశ్రమైన యపరంజి యేయనియుఁ జెప్పియుంటివిగదా; ఒకపురుషుడుఁ జోడుహస్తకంకణములు చేయింపుచున్నాఁడు ; అందొకటి బంగారుతోడను, మఱియొకటి యపరంజితోడను, జేయించి రెండుహస్తములయందు ధరించుకొనుచున్నాఁడు. అప్పుడీరెండు కంకణములును గొంచెమించుమించుగా నొక్కపోలిక నేయుంచున్నవి. వానినిజూచి యితరజనులు రెండును బంగారుకంకణములేయని భ్రమించుచున్నారుగదా ? అట్లేస్వర్ణకారుఁడును మొదట నాకారమునుబట్టి రెండును బంగారమేయని భ్రమించినను, వానిని నొరపులుపెట్టి చూచినపిమ్మటఁగూడ నట్లేయెంచునా ?

అర్జు — ఎంచఁడు. ఒరసిచూచినపిమ్మట నిది బంగారు కంకణమనియు, నిది యపరంజికంకణమనియుఁ దెలిసికొనఁగలఁడు.

కృ — మంచిది. అదియట్లుండనిమ్ము. ఆరెండుకంకణములను బ్రత్యేకముగఁ గరగించి పుటమువేసినయెడల నేమిగలుగుచున్నది.

అర్జు — అపరంజి కంకణమునందు మొదట నెంతయెత్తును నేవన్నెయుండెనో దానిఁబుటము పెట్టిన పిమ్మటఁగూడ నంతయెత్తును, వన్నెయుఁ గలిగియుండును. బంగారు కంకణమన్ననో మొదటఁ గంకణమునకుఁ బెట్టినబంగారుముకంటెఁ దక్కువ యెత్తుగలదిగను, హెచ్చువన్నెగలదిగను నేర్పడును.

కృ — కావునన్లే పరమాత్మనగు నేనును లోకవిడంబనార్థమై భూలోకమున నవతరించి జీవాత్మలరగు మీతోపాటు నటించుచుండినను నేను ధరించియుండినది లీలా మానుష విగ్రహమనియు, అనఁగా చూచెడువారికి మానుషరూపముగ నగపడు చుండుటయగాని యితర మనుష్యులయొక్క దేహములవలె బాధలు, అనఁగా శోక మోహాదులు, ఆధివ్యాధులు, భయవిభ్రాంతులు మొదలగునవి లేనిదనియు, మఱియు నప్రాకృతశరీరమనియు, అనఁగాఁ, బ్రకృతిసంబంధమగు నజ్ఞానముచే నావరింపఁబడక యుండుననియు, నెఱుంగవలెను. అపరంజి, కంకణరూపముగ నుండునపుడు, ఆరూపు చెడఁగొట్టఁబడి కరఁగి కడ్డీగా జేయఁబడినపుడు, దానియందుండెడు, నెత్తు గాని, వన్నెగాని మాఱక యొకటేరీతిగ నెట్లుండునో యట్లే నాయందుండెడి పరమాత్మయు నిప్పుడు నీవుచూచుచుండు నీదేహమునందుండినను లేక యీదేహము విడిచి నను బ్రకృతిసంబంధమగు నజ్ఞానముచే నాదరింపఁ బడకయుంచున్నది.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి । యేన సర్వమిదం తతమ్
వినాశమవ్యయస్యాస్య । నకశ్చిత్కర్తుమర్హతి॥ 17

అర్థము: యేన = ఏ (పరమాత్మ) చేత, ఇదమ్ + సర్వమ్ = ఈ సమస్త (ప్రపంచము,) తతమ్ = వ్యాపింపఁబడియున్నదో, తత్ + తు = ఆయాత్మనె తేనో, అవినాశి = నాశరహితమైన దానినిగా, విద్ధి = ఎఱుఁగుము, అవ్యయస్య = నాశము లేని, అస్య = ఈ(యాత్మకు), వినాశమ్ = నాశమును, కర్తుమ్ = చేయుట కొఱకు, కః + చిత్ = ఎవఁడును, న + అర్హతి = తగియుండఁడు.

నేనింతవఱకుఁ జెప్పిన విషయములవలనఁ బాంచభౌతిక దేహములు నశించినను ఆదేహములను ధరించియుండిన యాత్మకుమాత్ర మెప్పటికిని నాశము గలుగ నేరదని తెలియఁదగి యుంచున్నదిగదా? అట్టినాశరహితమైన స్వభావముగల యీయాత్మకు

నాశముగలుగఁ జేయుటకెవనికైనను నెట్లు సాధ్యపడును? అదెట్లనఁగా, నిదివఱకునేఁ జెప్పిన దృష్టాంతములో స్వర్ణాభరణముల రూపుమాసినను, అస్వర్ణములోఁగల పడముగానుండెడు నితరలోహము పుటములచే నశించినను, దానియం దుండెడు నపరంజిమాత్ర మెట్లు వన్నెయందును, ఎత్తునందును, తగ్గకయు నెచ్చకయు నొకటే రీతిగనుండునో, యట్లే, ప్రపంచమునందలి సమస్తజంతువు లయందును వ్యాపించి యుండెడు నీ యాత్మయు నాయాదేహములకుఁ బెరుఁగుట, తగ్గుట, మొదలగు మార్పులు గలిగినను, లేక, యవి మాఱురూపము నొందినను, వానియం దుండెడు నాత్మమాత్ర మట్టి పెరుఁగుట, తగ్గుట, మొదలగు వికారములనుగాని, యాశరీరముతో పాటు మరణమునొందుటగాని, లేకయుండును. అయితే, ఒక దేహము మరణమునొందినపుడు దానియందు నాత్మనుండదు గదా, కనుక నాదేహముతో పాటాయాత్మయు మృతిఁబొందుచున్నదని తలఁచెదవేమా, యట్లెంతమాత్రము తలఁపఁగూడదు.

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా। నిత్యస్యోక్తాశ్శరీరిణః.
ఆనాశినోఽప్రమేయస్య। తస్మాద్యుధ్యస్వ భారత!॥ 18

నిత్యస్య = శాశ్వతముగా నుండువాఁడును, అనాశినః = నాశరహితుఁడును, అప్రమేయస్య = ప్రత్యక్షాదిషట్ప్రమాణములచే నెఱుఁగఁ బడఁదగని వాఁడును, శరీరిణః — దేహధారియగు జీవునియొక్క, ఇమే + దేహాః = ఈశరీరములు దృష్టికి గోచరించు జడములగు నీస్థూల దేహములు, అన్తవన్తః = నశించునట్టివి, ఇతి = అని ఉక్తాః = (తత్త్వవేత్తలచేఁ) జెప్పఁబడినవి, తస్మాత్ = కావున, హేభారత! = ఓయియర్జునా!, యుధ్యస్వ = యుద్ధముఁజేయుము.

కారణమేమనఁగా జెప్పుచున్నాను వినుము — (మరణముఁ జెందుట), అనఁగా నీయాత్మయొక దేహమునువిడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించుట గనుక; ఏదేహమునుండి యాత్మ లేచిపోవుచున్నదో యాదేహము మాత్రమే మృతినొందిన దగుచున్నది. అయితే దానియందుండిన యాత్మయన్ననో; యాదేహమును విడిచి మఱియొక దేహములోఁ బ్రవేశించి దాని నిట్లే యాడించుచు నటుపిమ్మటఁ గొంత కాలమునకు నాదేహమునుగూడ విడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించుచు నిట్లే యెల్లప్పుడును దేనినోయొక శరీరము నాశ్రయించియే యుండును. ఒకవేళ నాయాత్మయొక్క సుకృతమువలన మోక్షము; అనఁగా జననమరణాది రూపమగు దేహధారణ విసర్జనలు లేనియవస్థను బొందినయెడల నప్పుడును నాయాత్మ పరమాత్మలో నైక్యమైపోయియుండునుగాని; యెప్పటికిని నీపాంచభౌతిక దేహాధుల

వలె స్వరూపనాశనమగునట్టిది కాదు. గాన నీపాంచభౌతిక దేహములు మాత్రమే యంతమొందునవి యనియు, నాత్మ నిత్యమైనవస్తువనియు నెఱుంగ వలయును. అట్లగుటవలన భీష్మాదుల దేహములు మాత్రమే నశించునవిగాని, యాత్మలు నశించునవి గావు గనుక నీవు యుద్ధముఁజేయుము.

అర్జు — ఈయాత్మ, దేహముతోపాటు నాశనమొందునట్టిది కాదనియు; నొకదేహమువిడిచి వెంబడే మరియొకదేహమునఁ బ్రవేశించుచున్నదనియుఁ జెప్పితివి గదా! అట్లు దేహమునువిడిచి పోవునపుడుగాని, లేక మఱియొకదేహమునఁ బ్రవేశించునపుడుగాని, మన కగుపడుటలేదే? ఇట్టివిషయములో, నాత్మ నున్నదానిఁగా నెట్లు భావింపవచ్చును.

కృ — ఈయాత్మ యప్రమేయమైనవస్తువు – అనఁగాఁ బ్రత్యక్షాదిషట్ప్రమాణములచే యథార్థముగా నెరుగఁబడఁదగని పదార్థము, షట్ప్రమాణము లెవ్వి యనఁగా, ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధియు, నని ప్రమాణము లాఱువిధములు. అందుఁబ్రత్యక్ష ప్రమాణమనఁగాఁ దాను స్వయముగా నొకవస్తువును నేత్రముతోఁజూచుట వలనఁగాని, యొకశబ్దమును శ్రోత్రములతో వినుటవలనఁగాని, యొకవస్తువును దేహముతో స్పృశించుటవలనఁగాని, యొక పరిమళవస్తువును ఘ్రాణముతో మూర్కొనుటవలనఁగాని యొకవస్తువును జిహ్వతో రుచిచూచుట వలనఁగాని, యావస్తువిట్టిదని తెలుసుకొనుట. అనుమాన ప్రమాణమనఁగా, పొగనుజూచి యగ్నియున్నదని తెలిసికొనినట్లొక వస్తువును జూచుటచే దానికి సంబంధించిన మఱియొకవస్తువున్నదని తెలిసికొనుట. ఉపమానప్రమాణమనఁగా నొక వస్తువునుబోలి యుండు మఱియొక వస్తువునుజూచి యావస్తువునట్లే యుండునని తెలిసికొనుట. శబ్దప్రమాణమనఁగా, తానెఱుఁగని యొకవస్తువు దాని నెఱిఁగిన మఱియొకరు చెప్పఁగావిని యావస్తువున్నదని తెలిసికొనుట. అర్థాపత్తి ప్రమాణమనఁగాఁ గార్యమునుబట్టి కారణమునూహించుట, అనఁగా, బ్రోదిగాఁ బెరిఁగిన వృక్షమునుజూచి భూమి సారవంతమైనదని తెలుసుకొనుట. అనుపలబ్ధి ప్రమాణమనఁగా నొకవస్తువొకచోట లేకపోయినను, ఆ వస్తువచట నుండినపుడేర్పడిన యొకగుర్తునుజూచి, యావస్తువచట నుండినట్లు దెలిసికొనుట. ఆత్మ యిట్టి ప్రమాణములలో దేనిచేతను నెఱుఁగఁబడఁ దగినవాఁడు కాఁడు. గనుక నప్రమేయుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం, యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో, నాయం హన్తి న హన్యతే॥ 19

అర్థము :— యః = ఎవఁడు, ఏనమ్ = ఈయాత్మను, హన్తారమ్ = చంపువానినిగా, వేత్తి = ఎఱుఁగుచున్నాఁడో, (తలఁచుచున్నాఁడో), యః + చ = ఎవఁడైతే, ఏనమ్ = ఈయాత్మను, హతమ్ = చంపఁబడువానినిగా, మన్యతే = తలఁచుచున్నాఁడో, తౌ + ఉభౌ = వారిరువురును, న + విజానీతః = తత్త్వమును దెలిసినవారు గారు, అయమ్ = ఈయాత్మ, న + హన్తి = (తానొరులను) జంపువాఁడుగాఁడు, న + హన్యతే = (ఇతరులచేఁ దాను) జంపఁబడువాఁడును గాఁడు.

ఇట్టి యప్రమేయమగు నాత్మయొకనిచే నెట్లు చంపఁబడఁగలదు? లేక, తానెట్లు మఱియొకనిని జంపగలదు? ఈలోకమున నొకఁడు మఱియొకనిచేఁ జంపఁబడునపుడు వీనిశరీరము వానిశరీరముచే హతము చేయఁబడుచున్నదేగాని, వీనిలోనుండు నాత్మ, వానిలోనుండునాత్మచే హతముచేయఁబడుట యెప్పటికిని గలుగనేరదు. అయితే, సాధారణముగ నట్టివిషయములలో లోకులేమనుచున్నారనఁగా, వీనియందలి యాత్మను వానియందలి యాత్మచంపెనని యనుకొనుచున్నారు. అట్లొకయాత్మ మఱియొకయాత్మను జంపుచున్నదని కాని, యొకయాత్మ, మఱియొకయాత్మచేఁజంపఁబడుచున్నదని కాని, తలఁచెడువార లుభయులును, దత్త్వమును దెలిసినవారు కానేరరు గాన నీవు కౌరవులను జంపుచున్నావనిగాని, లేక, వారలచే నీవు చచ్చుచున్నావని గాని యెంచుట తెలివిలేనిపనిగా నుంచున్నది.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 20

అర్థము :— అయమ్ = ఈయాత్మ, కదా + చిత్ = ఎప్పటికిని, న + జాయతే = పుట్టువాఁడు కాఁడు, (న) + మ్రియతే + వా = చచ్చువాఁడును గాఁడు, న + భూత్వా = ఇదివఱకు లేకుండి, భూయః = మరల, భవితా + వా + న = కలుగువాఁడును గాఁడు, (కించ) = మఱియేమనిన, అజః = పుట్టుకలేనివాఁడును, నిత్యః = నిత్యుఁడును, శాశ్వతః = ఎల్లప్పుడునుండువాఁడును, పురాణః = పురాణపురుషుఁడును (నైయున్నాఁడు), (తస్మాత్) = ఆకారణమువలన, శరీరే = దేహము, హన్యమానే + (సత్యపి) = హతముచేయఁబడినదైనను, అయమ్ = ఈయాత్మ, న + హన్యతే = హతము చేయఁబడఁడు.

ఏలయనఁగా, ఈయాత్మ, యొకప్పుడు పుట్టుటయు, నొకప్పుడు చచ్చుటయు, లేదు. అనఁగా, సృష్టికాలమునఁ బుట్టుటయుఁ, బ్రళయకాలమునఁ జచ్చుటయు లేదు. మునుపులేకుండి యిప్పుడు నూతనముగాఁ గలుగుటయు లేదు. అనఁగా సృష్టికాలమునఁ గలుగునదియుఁ గాదు అయితే, మఱియెట్టివాఁడనఁగా జన్మరహితుఁడును, శాశ్వతముగా నుండువాఁడును బురాణపురుషుఁడునై యున్నాఁడు. గాన, సృష్టిస్థితిలయములయందుఁబుట్టుట, పెరుఁగుట, చచ్చుట, యనెడుమార్పులను బొందునది దేహమే గాని, యాత్మగాదు. దేహము నశించినను, ఆత్మ నశించువాఁడు గాఁడు.

శ్లో॥ వేదావినాశినం నిత్యం । య ఏనమజమవ్యయమ్
కథం స పురుషః పార్థ! । కం ఘాతయతి హన్తి కమ్॥ 21

అర్థము :— హేపార్థ! = ఓయియర్జునా! ఏనమ్ = ఈ(యాత్మను), అజమ్ = జన్మలేనివానిఁగాను, నిత్యమ్ — నిత్యునిఁగాను (ఎల్లప్పుడు నొకరీతిగానుండు వానిఁగాను), అవ్యయమ్ = క్షీణతలేనివానిఁగాను, అవినాశినమ్ = నాశములేని వానిఁగాను, యః = ఎవఁడు, వేద = తెలిసికొనుచున్నాఁడో, కథమ్ = ఎట్లు సః + పురుషః = అట్టిపురుషుఁడు, ఘాతయతి = చంపించుచున్నాఁడు, (కథమ్) = ఎట్లు, కమ్ = ఎవని, హన్తి = చంపుచున్నాఁడు.

కనుక నోయి యర్జునా! ఇట్టియాత్మను జన్మలేనివానిఁగను, నిత్యునిగను, అనఁగా నెల్లప్పుడు నొకరీతిగనుండువానిఁగను, అవ్యయునిగను, అనఁగా క్షీణింపనివానిఁగను, నాశరహితునిగను, ఎవఁడెఱుఁగుచున్నాడో యట్టిపురుషుఁడు మఱియొకనిఁ దాను జంపుచున్నాననిగాని లేక చంపించుచున్నాననిగాని యెట్లుతలఁ పఁగలఁడు ? అయితే-ఓయియర్జునా ! లోకమున వ్యాధులచేతను, నాయుధములు మొదలగువానిచేతను, జనులు చచ్చుచుండుటను జూచి, వారలయాత్మలు చచ్చినవని భ్రమించుచున్నావుఁ గాబోలును. చెప్పెద వినుము.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ 22

అర్థము. :— నరః = మనుష్యుఁడు, యథా = ఏప్రకారము, జీర్ణాని = చినిగి పోయిన, వాసాంసి = వస్త్రములను, విహాయ = విడిచి, నవాని = నూతనములైన,

అపరాణి = ఇతర(వస్త్రములను), గృహ్ణాతి = గ్రహించుచున్నాఁడో, తథా = ఆ ప్రకారము, దేహీ = ఆత్మ, జీర్ణాని = శిథిలములైన, శరీరాణి = దేహములను, విహాయ = విడిచి, నవాని = నూతనములైన, అన్యాని — ఇతరదేహములను, సంయాతి = పొందుచున్నాఁడు.

ఒకపురుషుఁడు చినిఁగిపోయిన ప్రాతవస్త్రములను విడిచి, నూతనవస్త్రములనెట్లు ధరించుచున్నాఁడో, యట్లే యీయాత్మయు, దేహమువ్యాధులు మొదలగువానిచే శిథిలమైనపిమ్మట నాశరీరమునువిడిచి మఱియొక శరీరమును ధరించుచున్నాడుగాన మృతిఁనొందినది దేహమేగాని యాత్మగాదు. అదెట్లనిన, దీనికొకదృష్టాంతము జెప్పుచున్నానువినుము. ఒకచోటఁ గొందఱుజనులు చేరియుండఁగా నీవు చూచుచున్నావు. అట్లు నీవు చూచునపుడాజనులలో నొకఁడగు రామయ్యయనువాఁడు తెల్లగుడ్డను గట్టుకొనియున్నాఁడు; మఱియొక తడవ నీ వాస్థలమునకుఁ బోయి, యాజనులను జూచునపు డా రామయ్య యనువాఁ డదివఱకు ధరించియున్న తెల్లగుడ్డను విడిచి మఱియొక యెఱ్ఱగుడ్డను ధరించియున్నాఁడు; అపుడు నీవేమని యెంచుచున్నావు ? రామయ్య వారిలో నున్నాఁడనియా ? లేఁడనియా ?

అర్జు — లేఁడని యెట్లెంచఁగలను ? ఉన్నాఁడనియే యెంచవలెను. ఏలయనఁగా, నారామయ్య మొదట నేనుజూచినపుడు గట్టుకొనియున్న వస్త్రమును మాత్రమే మార్చియున్నాఁడుగాని, తాను మాఱియుండలేదుగదా, ఆమనుష్యుఁడే లేనియెడలఁగదా రామయ్య లేఁడని తలఁచవలెను ?

కృ — కనుక నట్లే యీయాత్మయు, నొకదేహమునువిడిచి మఱియొక దేహమునఁ బ్రవేశించినపుడు దేహము మాఱుచున్నదేగాని, యాత్మ మాఱుటగాని, నశించుటగాని లేదు.

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి । నైనం దహతి పావకః
న చైనం క్లేదయన్త్యాపో । నశోషయతి మారుతః॥ 23

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ । మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్యస్సర్వగత స్థాణు । రచలోఽయం సనాతనః॥ 24

శ్లో॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయ । మవికార్యోఽయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం । నానుశోచితుమర్హసి॥ 25

అర్థము :— శస్త్రాణి=ఆయుధములు, ఏనమ్ =(ఈ)యాత్మను, న+ఛిన్దన్తి= ఛేదింపఁజాలవు, పావకః = అగ్ని, ఏనమ్ = ఈయాత్మను, న+దహతి = దహిం

పఁజాలదు, ఆపః + చ = ఉదకములును,ఏనమ్ =ఈ(యాత్మను,) న + క్లేదయన్తి= తడుపఁజాలవు, మారుతః = వాయువు, (ఏనమ్) = ఈయాత్మను, న + శోష యతి = ఎండిఁపఁజాలదు, అయమ్ = ఈ(యాత్మ), అచ్ఛేద్యః =(ఆయుధములచే) ఛేదించుటకు సాధ్యుఁడు కాఁడు, అయమ్ = ఈ(యాత్మ), అదాహ్యః = (అగ్నిచే) దహించుటకు సాధ్యపడెడువాఁడు కాఁడు, అక్లేద్యః = (నీటిచేఁ) వడుపుటను సాధ్య పడెడువాఁడు కాఁడు, అశోష్యః + ఏవ + చ = ( ఎండచేఁగాని గాలిచేగాని ) శోషింపఁజేయుటకును సాధ్యపడెడువాఁడుగాఁడు. అయమ్ = ఈయాత్మ, నిత్యః= నిత్యుఁడును (ఎల్లప్పుడునుండువాఁడును), సర్వగతః=సర్వవ్యాపకుఁడును, స్థాణుః = నిశ్చలత్వముగలవాఁడును,అచలః=చలింపనివాడును. సనాతనః=అనాదియైనవాడును అయమ్ = ఈ (యాత్మ,) అవ్యక్తః = వ్యక్తుఁడు కానివాఁడు (చక్షురాదీంద్రియముల వలనఁ దెలిసికొనఁదగనివాఁడని భావము). అయమ్ = ఈయాత్మ, అచిన్త్యః = మనస్సుచేతఁ జింతింపశక్యుఁడు కానివాఁడు, అయమ్ = ఈయాత్మ, అవికార్యః = వికారరహితుఁడు, (ఇతి) = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు, తస్మాత్ = ఆ కారణమువలన, ఏవమ్ = ఈ చెప్పఁబడినప్రకారముగా ఏనమ్ = ఈయాత్మను, విదిత్వా = తెలిసికొని, అనుశోచితుమ్ = దుఃఖించుటకు, న + అర్హసి = తగవు.

అట్లుగాన నేదేహమైన శస్త్రములచే ఛేదింపఁబడినపుడుగాని, యగ్నిచే దహింపఁ బడినపుడుగాని, నీటిచే ముంచఁబడినపుడుగాని, గాలిచే శోషింపఁబడి నపుడుగాని, యాదేహమునందుండెడు నాత్మ యాదేహమును విడిచి మఱియొక దేహమునం బ్రవేశించుచున్నదిగాని యా దేహముతోఁగూడ నశింపదుగాన నట్లు ఛేదింపఁబడుటయు, దహింపఁబడుటయు, తడుపఁబడుటయు, నిందింపఁబడుటయు శరీరమునకుమాత్రమే సంబంధించుచున్నవిగాని యాత్మకు సంబంధింపనేరవు. కాబట్టి యీ శరీర మప్పుడప్పుడు మాఱుచుండినను, ఆత్మ తాను మాత్రముమాఱక యెప్ప టికి నొకరీతిరుగనుండునది. ఈయాత్మ, ఆయుధములు, అగ్ని, ఉదకము, వాయువు మొదలగువానిలో దేనిచేతను, నశింపఁజేయఁబడనేరదు. అయితే, ఈయాత్మ మఱి యెట్టిదంటివేని, చెప్పెదవినుము. ఇది, (నిత్యః) నిత్యమైనది. అనఁగా నొకప్పు డుండి మఱియొకప్పుడు లేకపోవునది కాదు ; సర్వదా యేదియో యొకదేహము నాశ్రయించియుంచున్నది. మఱియు నెట్టిదనఁగా, (సర్వగతః) సమస్తమును బొంది యుండునది, అనఁగా, పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్త జంతుజాలముల దేహములయందు వ్యాపించియుండునట్టిది. మఱియు నెట్టిదనఁగా (స్థాణుః) నిశ్చల

మైనది. అనఁగా, తాను ధరించినదేహము లప్పుడప్పుడు మాఱుచుండినను, దాను మాత్రము మాఱక యెప్పటికి నొకటే తీరుగనుండునది.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం । నిత్యం వా మన్యసే మృతమ్
తథాపి త్వం మహాబాహో । నైనం శోచితుమర్హసి॥ 26

అర్థము : హేమహాబాహో ! = ఓయర్జునా !, అథ + చ = పిమ్మటను(అనఁగా నింతదూరము నేఁజెప్పిన పిమ్మటఁ గూడననిభావము), ఏనమ్ = ఈ (యాత్మను), నిత్యజాతమ్ = సదాపుట్టుచుండెడు వానిఁగాఁగాని, నిత్యమ్ + మృతమ్ + వా = సదాచచ్చుచుండెడు వానిఁగాఁగాని, మన్యసే = తలఁతువేమో, తథా + అపి = అటైనను, త్వమ్ = నీవు, ఏనమ్ = ఈయాత్మనుగూర్చి, శోచితుమ్ = దుఃఖించుటకు, న + అర్హసి = తగవు.

ఓయియర్జునా ! ఆత్మతత్త్వమిట్టిదని నేనింత దూరమునీకుఁ దెలియఁ జెప్పిన పిమ్మటఁగూడ నీవీ యాత్మనెల్లప్పుడు పుట్టుచుండెడువానిఁగను, సదా చచ్చుచుండెడు వానిఁగాను దలంతువేమో, యట్లుతలంచినను, నీవీయాత్మను గుఱించి దుఃఖించుట తగదు. కారణమేమనఁగా ; –

పుట్టినవాఁడు చచ్చుటయుఁ, జచ్చినవాఁడు మరలఁ బుట్టుటయు, నిశ్చయమౌనుగదా ?

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు । ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేఽర్థే । న త్వం శోచితుమర్హసి॥ 27

అర్థము : జాతస్య = జననమునొందినవానికి, మృత్యుః = మరణము, ధ్రువః = నిశ్చయము, మృతస్య = మరణము నొందినవానికి, జన్మ + చ = (మరల) జననమొందుటయు, ధ్రువమ్ + హి = నిశ్చయమేగదా, తస్మాత్ = కాఁబట్టి, అపరిహార్యే = నివారింపఁగూడని, అర్థే = విషయమునందు, త్వమ్ = నీవు, శోచితుమ్ = దుఃఖించుటకొఱకు, న + అర్హసి = తగవు.

అర్జు — అవును నిశ్చయమే. ఇది యనివార్యమైన సంగతియే.

కృ — మంచిది, అట్లైతే, ఈభీష్మాదులును నెప్పటికైనను జావవలసినవారలే గదా ?

అర్జు — అవును.

కృ — అప్పటికి వారివిషయమై నీవు దుఃఖింపవలసిన కారణమేమి ?

అర్జు — అవును, వారును నితరులవలెనే యెప్పటికైనను మృతినొందవలసిన వారైయే యున్నారుగాన దుఃఖించి ప్రయోజనములేదు; అయినను వారిలోఁ గొందఱు నాకు సమీపబంధువులని యిదివఱకే చెప్పియున్నాను గదా ? (చూ-I-36), అట్టి బంధుజనుల మరణమునుగుఱించి దుఃఖముగలుగుట సహజముగదా ?

కృ — ఓహో ! బంధువులనెడు నాశాపాశము నిన్ను బాధించుచున్నదో, అట్లైనయెడల నావిషయమునుగుఱించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని, వ్యక్తమధ్యాని భారత! ।
అవ్యక్తనిధనాన్యేవ, తత్ర కా పరివేదనా ॥ 28

అర్థము : హేభారత !=ఓయియర్జునా !, భూతాని =(పంచభూతాత్మకములగు) శరీరములు, అవ్యక్తాదీని =కనఁబడని మొదలుగలవియు (జన్మింపకముందుఁ జక్షురాదీంద్రియములకు గోచరింపనివని భావము.) వ్యక్తమధ్యాని =కనఁబడుచున్న మధ్యభాగము గలవియు, అవ్యక్తనిధనాని+ఏవ= కనఁబడని నాశముగలవియునే, తత్ర =అట్టిశరీరములవిషయమై పరివేదనా =దుఃఖము, కా= ఏల.

ఓయి యర్జునా ! ఈభీష్మాదులు నీకు బంధువులగుటచే వీరిమరణమునుగుఱించి దుఃఖించుచున్నావుగదా ? మంచిది, వీరిలోఁ గొందఱు నీకంటె ముందుపుట్టినవారును, గొందఱు నీకు వెనుకబుట్టినవారునై యున్నారుగదా ? నీకు ముందుపుట్టినవారికి నీవు పుట్టకమునుపేలాటిబంధువై యుంటివి ?

అర్జు — అదియేమోస్వామీ ! నేనెట్లు చెప్పఁగలను ! నేనుగాని, వారుగాని, పుట్టకమునుపెక్కడనుంటిమో, ఏమిగానుంటిమో, నాకెట్లు తెలియును ?

కృ — పోనిమ్ము వారుచచ్చినపిమ్మట నైనను, నెచ్చటనేమిగా నుండఁగలరో, తెలియునా ?

అర్జు — అదియును నాకుఁదెలియదు. వారు బ్రతికియుండునంతవఱకే నాకగపడుచుందురుగాని, పుట్టకముందును, గిట్టినవెనుకను, నేమిగా నుందురో నాకుఁ దెలియదు సరేకదా, వారికిని నాకును నేలాటిసంబంధమునునుండుననియు, దోఁచలేదు.

కృ — మంచిది, అట్టివారలవిషయమై నీవు వ్యసనపడవలసిన కారణమేమి ;

అర్జు — వాస్తవమే. తరిచిచూచిన, వ్యసనపడవలసిన కారణమేమియు నున్నట్లు కనఁబడదు. ఈయాత్మలు పుట్టకముం దెక్కడనేమిగానుండెనో, గిట్టిన వెనుక నేమగుచున్నవో తెలియకున్నది. మధ్యకాలముననమాత్రము కంటికిఁ గనఁబడుచు,

మనవారని భ్రమింపజేయుచున్నవి. అహా! ఇదియేమి చిత్రము? ఈ యాత్మతత్త్వమగమ్యాగోచరముగా నున్నది స్వామీ?

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవచాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవకశ్చిత్॥　　29

అర్థము :— కః + చిత్ = ఒకానొకఁడు, ఏనమ్ = ఈయాత్మను, ఆశ్చర్యవత్ = అద్భుతమైనదానినిగా, పశ్యతి = చూచుచున్నాఁడు, అన్యం = మఱియొకఁడు, తథా + ఏవ = అలాగుననే, ఆశ్చర్యవత్ = అద్భుతమైనదానినిగా, వదతి + చ = చెప్పుచున్నాఁడు, అన్యః = ఇంకొకఁడు, ఏనమ్=ఈ(యాత్మను), ఆశ్చర్యవత్ = అద్భుతమైన దానినిగానే, శృణోతి = వినుచున్నాఁడు, శ్రుత్వా + చ = విని, కని, నుడివియు, (ఈ పదమునందలి చకారము, పైఁజెప్పఁబడిన పశ్యతి, వదతి, అనుపదములకుఁగూడ అన్వయించుచున్నది), కః + చిత్ + అపి = ఎవఁడును, ఏనమ్ = ఈ ఆత్మతత్త్వముయొక్క యాథార్థ్యమును, న + వేద + ఏవ = ఎఱుఁగనే రెుఱుఁగఁడు.

కృ — ఓయి యర్జునా! ఈయద్భుతము నీకుమాత్రమే గాదు. చెప్పెద వినుము — ఆత్మయొక్క స్వభావమిట్టిదని నిర్ణయించుటకు నలవిగానట్టి యద్భుతమగు వస్తువని నీకిప్పుడు దోఁచుచున్నదిగదా? మంచిది, ఇట్లుతోఁచుట నీకేకాదుసుమీ, ఈప్రపంచమునం దనేకులకు నిట్లేతోఁచుచుండును. అందులో నాత్మయద్భుతవస్తువని తనులోఁదామూహించుకొనెడువారు గొందఱును, ఇతరులకుఁ జెప్పెడువారు గొందఱును, అట్లుచెప్పుచుండగా వినుచుండెడువారు గొందఱునైయున్నారేగాని, దాని నిజస్థితి యిట్టిదని వారిలో నొకరైనను దెలియఁజాలరు.

అర్జు — అయితే, దాని నిజస్థితిని దెలిసికొనువాఁడెవఁడు?

కృ — బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడుమాత్రము తెలిసికొనును.

అర్జు — అయితే, ఆత్మతత్త్వమెట్టిదియో చెప్పుము.

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం, దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని, న త్వం శోచితుమర్హసి॥　　30

అర్థము :— హేభారత! = భరతవంశజుఁడవగు నోయర్జునా, సర్వస్య = పిపీలికాది బ్రహ్మపర్యంతమగు సమస్తజంతు సమూహముయొక్క, దేహే = శరీరము

నందలి, అయమ్ + దేహీ = ఈజీవాత్మ, నిత్యమ్ = ఎప్పుడును, అవధ్యః = వధ్యుడుగాఁడు (నశింపఁజేయఁబడఁ దగినవాఁడుగాఁడు), తస్మాత్ = ఆకారణము వలన, త్వమ్ = నీవు, సర్వాణి = సమస్తములైన, భూతాని = జీవాత్మలనుగూర్చి శోచితుమ్ = దుఃఖించుటకొఱకు, న + అర్హసి = తగవు.

కృ — చెప్పుచున్నాను వినుము. ఆత్మతత్త్వమిట్టిదని సమగ్రముగా నిదివఱకే నీకుఁ జెప్పియున్నాను - (II - 20 - నజాయతే—) అయితే, అదిమఱచి కాఁబోలును మరల నన్నడుగుచున్నావు! అయిన నాసంగతిని మఱల సంగ్రహముగాఁ జెప్పెద వినుము. ఏమనఁగా, ఈప్రపంచమునందుఁ బిపీలికాదిబ్రహ్మపర్యంతమగు సమస్తజంతువులయందుండెడు జీవాత్మ యెప్పటికిని నశించువాఁడుగాఁడు. దేహములుమాత్రమే నశించునుగాని యాత్మలకెప్పటికిని నాశనములేదు. గనుక నీయాత్మతత్త్వమును దెలిపిన పిమ్మట, భీష్మాదులయొక్కగాని, మఱియెవరియొక్కగాని, జీవాత్మలను గుఱించి నీవు చింతింపవలసిన పనిలేదు. ఓయియర్జునా! ఈయాత్మతత్త్వ మింతకుముందు నేను జెప్పినప్రకారము బ్రహ్మజ్ఞానికేగాని, తదితరులకు బోధపడదుగనుక నొకవేళ నింత దూరముచెప్పియు, నీమనస్సున కాత్మతత్త్వమిట్టిదని బోధపడక దుఃఖోపశమనము గాకపోయినయెడలఁ బోనిమ్ము; ఆత్మవిషయమైనయోచన యటుండనిమ్ము.

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య । న వికమ్పితుమర్హసి ।
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ । క్షత్రియస్యనవిద్యతే॥31

అర్థము — స్వధర్మమ్ + అపి = స్వకీయమగు క్షత్రియధర్మమునైనను, అవేక్ష్య=ఆలోచించినప్పటికిని, వికమ్పితుమ్ = చలించుటకొఱకు, న+అర్హసి= అర్హుఁడవుగావు, హి = ఏలయనఁగా, క్షత్రియస్య = క్షత్రియునకు, ధర్మ్యాత్ = ధర్మమైన, యుద్ధాత్ = యుద్ధమునకంటె, శ్రేయః = శ్రేయస్కరమైనది, అన్యత్ = మఱియొకటి, న + విద్యతే = లేదు.

నీప్రస్తుతపుచర్య యీలోకమునందుఁగల వర్ణాశ్రమాచారధర్మములనుబట్టియైన నొప్పికొనదగినదిగా నున్నదాయని యాలోచింతమన్ననో, యట్లుగూడనుండలేదు. ఏలయనఁగా, ధర్మయుద్ధముకంటె శ్రేయస్కరమైనది మఱియొకటి క్షత్రియులకు లేదుగదా ? ఎట్లనగాఁ, క్షత్రియుఁడు యుద్ధమున శత్రురాజుల జయించి తన రాజ్యమును నిష్కంటకముగాఁ జేసికొననియెడల నట్టిశత్రులవలనఁ దనకనేకోపద్రవములు గలుగుటయేగాక తన రాజ్యమునందలి ప్రజలకుఁగూడ ననేకోపద్రవములు గలుగుచుండును, గాన క్షత్రియునకు యుద్ధముచేయుటే ముఖ్యధర్మముగా నుంచున్నది. గాన నట్టియుద్ధముఁజేయుటకు నీవు వెనుకఁదీయరాదు. అయితే, అది ధర్మయుద్ధ

ముగానుండవలయును. ధర్మ్యయుద్ధమనఁగా, న్యాయమైన కారణముగలిగి చేయఁబడు, నది; గాననిపుడు నీకుఁదటస్థించియుండునదియే ధర్మ్యయుద్ధము. అదెట్లనఁగా, నితరులచే దుర్ణయముగా నపహరింపఁబడిన నీరాజ్యమును మరల సంపాదించుకొనుటకై చేయఁబడునదిగాన నిది ధర్మ్యయుద్ధ మనఁబడుచున్నది.

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం । స్వర్గద్వారమపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ! ! లభన్తే యుద్ధమీదృశమ్॥ 32

అర్థము :- హేపార్థ! = ఓయియర్జునా! యదృచ్ఛయా=అప్రయత్నముగా, ఉపపన్నమ్ — లభించినదియు, అపావృతమ్ = తెఱవఁబడిన, స్వర్గద్వారమ్+చ= స్వర్గద్వారరూపమైనదియునగు, ఈదృశమ్ = ఇట్టి, యుద్ధమ్ = యుద్ధమును (యే)+క్షత్రియాః = ఏరాజులు, లభన్తే = పొందుచున్నారో, (తే) = వారలు, సుఖినః = ధన్యులు, (భవన్తి) = అగుచున్నారు.

ఇట్టియుద్ధము క్షత్రియు లవశ్యము చేయవలసినవారై యుంచున్నారు. అందువలన వారలకు జయముఁగలిగినయెడల నిహలోకమున రాజ్యసుఖమును, ద్రవ్యసంపాదనమును, దానిచే దానాదిసుకృతముల నొనరించి తద్ద్వారా పరలోకసౌఖ్యమును, బొందఁగలరు. లేక యట్టి యుద్ధమున మృతులైనయెడల, వీరస్వర్గము ననుభవింపఁగలరు. గాననట్టియుద్ధమును క్షత్రియులు ప్రయత్నపూర్వకముగనైనఁ జేయవలసినవారైయుండఁగా, నట్టియుద్ధ మప్రయత్నముగఁ దనంతటఁదానే తటస్థించినయెడల వారల యదృష్ట మేమని చెప్పవచ్చును ? నీకిప్పుడు తటస్థించియుండు యుద్ధమన్ననో, యట్లప్రయత్నముగ దటస్థించియున్నదిగదా? ఎట్లనఁగా, దుర్యోధనాదులు దుర్ణయముగా మీరాజ్యము నపహరించియుండుటచే నట్టిరాజ్యమును మరల సంపాదించుకొనుటకై మీయంతటమీరే యుద్ధమునకుఁ బ్రయత్నముచేయవలసినవారై యుండఁగా, నట్లు చేయుటమాని తుదకైదూళ్ళిచ్చినఁ జాలునని రాయబారము జరిపితిరిగదా? అందునకును వారలొడంబడక కయ్యమునకే కాలుద్రువ్విరిగదా? కనుక నిట్టియుద్ధము తటస్థపడుట తెఱవఁబడిన స్వర్గద్వారమువంటిదైయున్నది. గాన నిట్టియుద్ధమునుజేయుటకు నీవెంతమాత్రము వెనుకఁ దీయరాదు.

శ్లో॥ అథ చేత్త్వంధర్మ్యమిమం । సఙ్గ్రామం న కరిష్యసి
తతస్స్వధర్మం కీర్తిం చ । హిత్వా పాపమవాప్స్యసి॥ 33

అర్థము :— అథ = పిమ్మట త్వమ్ = నీవు, ధర్మ్యమ్ = స్వధర్మయుక్తమైన, ఇమమ్+సఙ్గ్రామమ్ = ఈయుద్ధమును, న+కరిష్యసి+చేత్ = చేయకపోతివేని,

తతః = అట్లుచేయకపోవుటవలన, స్వధర్మమ్ = (నీదు) క్షత్రియకులధర్మమును, కీర్తిమ్ + చ = కీర్తినిని, హిత్వా = వదలి, పాపమ్ = దోషమును, అవాప్స్యసి = పొందగలవు.

అట్లుగాక యాదృచ్ఛికముగా లభించిన యిట్టిధర్మయుద్ధమును నీవుచేయుటమాని తివేని, యందువలన నీవు రాజ్యపదభ్రష్టుఁడవగుటయేగాక, మఱియుననేకానర్థములకును పాత్రుఁడవగుదువు. అదెట్లనిన, నీవు క్షత్రియుండవైయుండియు నట్టికులమునకు ముఖ్య ధర్మముగను నప్రయత్నముగ లభించునదిగను నుండు నీయుద్ధము నాచరింపక పోవుటవలన నీ కులధర్మమును వదలినవాడవగుచున్నావుగదా? అట్లగుటవలన నీకుఁ బరలోకమున స్వకులధర్మమునాచరింపని పాపాత్ములకు లభింపఁదగిన నరకము సంప్రాప్తించుటయేగాక, ఇహమునందు వీరుఁడవని నీకుఁగలిగియుండు ప్రఖ్యాతి పోయి, యందునకు బదులుగాఁ బిఱికివాఁడవనెడు నపఖ్యాతిగలుగును.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని । కథయిష్యన్తి తేఽవ్యయామ్
సమ్భావితస్య చాకీర్తి । ర్మరణాదతిరిచ్యతే॥ 34

అర్థము: అపి + చ = మఱియును, భూతాని = ప్రాణులు, (జనులు), తే = నీయొక్క, అవ్యయామ్ = చిరకాలమువఱకు మాయకుండునట్టి, అకీర్తిమ్ = అపయశస్సును, కథయిష్యన్తి = చెప్పుకొందురు, సమ్భావితస్య = గౌరవస్థునికి, అకీర్తిః = అపయశస్సు, మరణాత్ + చ = మరణము కంటెను, అతిరిచ్యతే = అధికమైనదగుచున్నది.

(నూఱునోములోక ఱంకునఁబోయినటు), కష్టసాధ్యముగ సంపాదింపఁబడి సులభముగఁ బోవునట్టిదికీర్తియు, సులభముగ సంపాదింపఁబడి కష్టసాధ్యముగఁ బోవునట్టిది యపకీర్తియుఁగనుక, నట్టి నీయపకీర్తి త్వరలోమాసిపోనేరదు, అనఁగాఁ జాల కాలమువఱకు లోకులు నీయపకీర్తినిగుఱించి వాడుకొనుచుందురు. కాఁబట్టి, యింతదనుక బహుభుజబలపరాక్రమశాలివనియు, శూరుఁడవనియుఁ గీర్తినొందిన నీవిఁకనిట్టి యపకీర్తిని వహించి జీవించుటకంటె మరణము నొందుట మేలుగదా?

శ్లో॥ భయాద్రణాదుపరతం
మన్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్ ॥ 35

అర్థము :— యేషామ్ = ఎవరికి, త్వమ్ = నీవు, బహుమతః = సన్మానింపఁబడఁదగినవాఁడవుగానుంటివో, (తే) = అట్టి, మహారథాః + చ* = మహారథులగు భీష్మద్రోణాదులుగూడ త్వామ్ = నిన్ను, భయాత్ = భయమువలన, (పిఱికితనమువలన), రణాత్ = యుద్ధ(రంగము)నుండి, ఉపరతమ్ = మరలినవానిఁగా, మన్యన్తే = తలంతురు, భూత్వా = అట్లుతలఁపఁబడినవాఁడవై, లాఘవమ్ = చులకనదనమును, యాస్యసి = పొందఁగలవు.

ఇంతే కాదు సుమా ; నీశక్తినెఱుఁగని పామరజనులాడికొనుట సరేగదా, నీయెడల నిదివఱకు గౌరవాభిప్రాయము గలిగియుండిన భీష్మద్రోణాది మహారథుల, సయితమట్లే తలఁపఁ దగియుంచున్నది – వారలకిదివఱకు నీయందుఁ గలిగి యుండు నభిప్రాయ మెట్టిదనఁగా, నుత్తరగోగ్రహణ కాలమందు నీవుమాఱువేషముతో నుత్తరుని సారథిగఁజేసికొని, యొంటరిగ గౌరవసైన్యమును దాఁకఁబోయినపుడు భీష్మాదులు నిన్ను దూరమునఁజూచి నీవనియూహించి యపుడు తమలోఁ దామట్లనుకొనిరి—అందు,

* 35 వశ్లోకమునందలి "మహారథాః" అనుపదమును దుర్యోధనాదుల కన్వయించునట్లు కొందఱు వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. అయితే, ఆపదమునకు (యేషాంత్వంబహుమతః = ఎవరికినీవు సన్మానింపఁ బడఁదగిన వాఁడవై యుంటివో) అని విశేషణము వ్రాయఁబడియున్నది. ఆవిశేషణము భీష్మాదుల కన్వయింపఁ దగియు డదు. ఏలయనఁగా, ఇంతకుముందు, అనఁగా నీయుద్ధప్రారంభమునకుముందు, ఎప్పుడునునర్జునుని సామర్థ్యమును గుఱించి భీష్మాదులు శ్లాఘించుటయును, దుర్యోధనాదులు నిందించుటయును గలిగియుండినట్లు భారతమునందనేకచోట్ల గనుచున్నాము. అట్లుండనిప్పుడీ విశేషణము దుర్యోధనాదుల కన్వయించుట సరిగానున్నట్లు గనఁబడదు. ఇంతేగాక, దీని యుపతలిశ్లోకము, అనఁగా, 36 వశ్లోకమునందు (నిందంతః + తవ + అహితాః = ఇదివఱకే నిందించుచున్న నీశత్రువులు) అని చెప్పఁబడియున్నది. అదియును దుర్యోధనాదులకే యన్వయింపఁబడియున్నది. గనుకఁగేవల విరుద్ధములుగానుండెడు నీ రెండువిశేషణములును నొకరికే – అనఁగా దుర్యోధనాదులకే యన్వయించుట సరిగానున్నట్లుగనఁబడదు. భీష్మాదులర్జునుని బలపరాక్రమములను గుఱించి శ్లాఘించుచున్నవారును, దుర్యోధనాదు లతనిబలపరాక్రమములను గుఱించి నిందించుచుండి వారునైనట్లు భారతమునందనేకచోట్లఁ గనుచున్నాము. గనుకను నిచటనుండెడు పూర్వోత్తర సందర్భములనుబట్టి చూడఁగా నీశ్లోకమునందలి "మహారథాః" అను పదమువలన భీష్మాదులనియును, దీనిపెనుకటి శ్లోకమునందలి "అహితాః" అను పదమువలన దుర్యోధనాదులనియును నే కవియుద్దేశ్యమై యున్నట్లగపడు చున్నది.

భీష్మునివచనము - "వచ్చినవాఁడు ఫల్గునుఁడవశ్యము గెల్తుమనంగరాదు" - అనియును. క. చిరకాలమునకుఁ గంటిమి। నరు నకిరీటివీఁడు సజ్జ, నప్రియుఁడు సుహృ। త్పరతంత్రుఁడు బాంధవహితుఁ। డరిభీకరుఁ డిట్టివార, లవనింగలరే. ద్రోణాచార్యుని వచనము - మ. విలసద్గాండివ చాప నోర్ధటకన ద్విద్యుల్లతాలీలగా। నలఘుస్ఫారకపిధ్వజధ్వని సము ద్యద్గర్జ చండంబుగా। బలదాకారపు నొప్పెఁ దేరితఁడు పర్జన్యాకృతిం బోల్చెదో। ర్బలతీవ్రార్తి నిదాఘ దుర్విషహ గర్వస్ఫూర్తి నిరస్త్రవృష్టిగాన్. క. ఇదుములఁ బదమూఁడేడులు। వడి కడుఁ గోపించివచ్చి, బలువిడి నీక। వ్వడి దఱియ మఱువడిని ని। ప్పడ యిమ్ముత్రిప్పోవు నెల్లఁ బొరిగొనెడు బలే. గీ. విపినవాసంబునజ్ఞాత విధము వర్త। నంబుగడపి నవాభ్యుదయంబునొంది। రాత్రిఁ బుచ్చితోతెంచు మా, ర్తాండుమాడ్కిఁ। జూపనుజ్జ్వలుఁడగుచు నర్జునుఁడువోలె" (భార. విరా. 4. ఆ) అనియును బలికియున్నారు. మఱికొన్ని సమయములయందు దుర్యోధనుని తోడ నశ్వత్థామ, "దేవదానవులకైనను దుర్జయుండగు నర్జునునకుఁ బలచూప వచ్చునే" అనియును, భీష్ముఁడు కౌరవుల నుద్దేశించి, "వీరలర్జునుతోడఁ బెనంగి మానప్రాణంబులు దక్కించుకొను వారే" అనియును, ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునితో - "గీ. బవరములఁగానె విఱిగిన, బారసాప వచ్చునే యొకరుండువి, వ్వచ్చుఁడపరి। పసులఁబెట్టించునపుడు నీ, బలము విఱుగ। దయ్యెనే నీవుఁగర్ణుండు నచట లేర?" (భార. ఉద్యో. 2. ఆ.) అనియును, కృపాచార్యుఁడు కర్ణునితో, "సీ. శక్రాది సురులతో, సంగ్రామమొనరించి, ఖాండవంబేర్చెనో, క్రూరుఁడ కాఁడె। యాదవబలమెల్ల, నాఁగిత్రోచి సుభద్ర గడిమిమైఁ దెచ్చెనో, క్రూరుఁడ కాఁడె! దిగ్విజయంబునఁ. దేజంబెసేసెని కురువంశమునకునో, క్రూరుఁడ కాఁడె! బలముతో గంధర్వ, పతినోర్చి విడిపించెఁ గౌరవేశ్వరుని నొక్రూరుఁడ కాఁడె! గీ. యని నివాతకవచు, లను దానవులనాతఁ। డొక్రూరుండ కాఁడె, యుక్కుమడఁచె। నమరులకు నజేయు, లగు కాలకేయుల। నొక్రూరుండ కాఁడె, యొడిచె కర్ణ!" (భార. విరా. ౪. ఆ) అనియు నిట్లుచెప్పియున్నారుగదా! ఇందువలన వీరలకు నీయెడలఁ గలిగియుండెడు గౌరవాభిప్రాయ మెట్టిదైనదియు నెఱుంగుదువుగదా? ఇట్టి వీరలు నయిత మిప్పుడు నీవు యుద్ధముచేయక మరలినయెడల, నోహో! ఇదివఱకు నర్జునుఁడు మహాశూరుఁడని యనుకొనుచుంటిమిగదా? ఇప్పుడితనిసంగతి తెలిసెను. ఇదివఱకు నుత్తరగోగ్రహణము మొదలగు సమయములయందుఁ గొంచెముగనుండు కౌరవసైన్యమునుజూచి విజృంభించుచువచ్చుటచే మనమాతని మహాశౌర్యవంతునిగా నెంచియుంటిమి. ఇపుడు కౌరవసైన్యమునంతటిని జూచినతోడనే యీయర్జునుఁడు భయపడి

పరుగెత్తిపోవుచున్నాఁడుగదా – ఇంతేనా యితనిమగఁటిమియని తలఁపఁగలరు. ఇదివఱకు నీయందట్టిగౌరవాభిప్రాయముగలవార లిప్పుడిటు తలఁచుటవలన నిది నీకెంతటి యవమానకరముగానుండునో నీవే యోచించుకొనుము.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూ । న్వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం । తతో దుఃఖతరమ్ ను కిమ్ ॥ 36

అర్థము :— తవ = నీయొక్క, సామర్థ్యమ్ = శక్తిని, నిన్దన్తః = (ఇదివఱకే) నిందింపుచున్న, తవ = నీయొక్క, అహితాః + చ = శత్రువులును, బహూన్ = అనేకములైన, అవాచ్యవాదాన్ = వచింపరాని దుర్భాషణములను, వదిష్యన్తి = వదరుకొందురు, తతః = అంతకంటె, దుఃఖతరమ్ = మిక్కిలి వ్యసనకరమైనది, కిమ్ + ను = ఏమియున్నది.

నీయెడల గౌరవతాత్పర్యముగలవారును నీకు హితమును గోరువారునగు భీష్మాదులే యిట్లు శత్రుసైన్యమునుజూచి భయపడి మరలిపోతివని తలఁపఁదగియుండఁగా నిఁక నీశత్రులగు దుర్యోధనాదులాడికొందురని చెప్పనేల ? వారలు నీ సామర్థ్యము నిదివఱకే, అనఁగా ననేకసమయములయందు నీ భుజబలపరాక్రమమును గనులఁజూచియుండియే మిగులఁజాలకనగానెంచి నిందింపుచున్నారుగదా ? అట్టివారలిప్పుడు లగ్గలకెక్కి నీదౌర్బల్యమును గుఱించి వారికిష్టమువచ్చినట్లెల్ల నోటవచింపరానిమాటల వదరుచు గేలిసేయరా ? నీకింతకంటె నెక్కుడగు నవమానకరమైనసంగతి మఱియొకటి యేమియున్నది ?

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం । జిత్వా వా భోక్ష్యసే మహీమ్।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ ! యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37

అర్థము :— హేకౌన్తేయ ! = ఓయియర్జునా !, హతః + వా = చంపఁబడితివేని, స్వర్గమ్ = స్వర్గ (భోగమును), ప్రాప్స్యసే = పొందఁగలవు, జిత్వా + వా = జయించితివేని, మహీమ్ = భూమిని (రాజ్యసుఖమును), భోక్ష్యసే=అనుభవింపఁగలవు, తస్మాత్ = కాఁబట్టి, యుద్ధాయ = యుద్ధముకొఱకు, కృతనిశ్చయః + (సన్) = చేయఁబడిన నిశ్చయము (పూనిక) గలవాఁడవై, ఉత్తిష్ఠ = లెమ్ము.

ఓయి యర్జునా ! ఈ కారణములనుబట్టి యుద్ధము మానుట యెంతమాత్రమును నీకుఁదగినపనిగానుండదు. గానఁ గృతనిశ్చయుఁడవై యుద్ధమునకు లెమ్ము. అయితే, బంధుమిత్రాదుల హింసింపవలసివచ్చునని యోచించెదవేమో “క. దురమున

జయముఁగొనుటకై, నరపతులకు వలయుహింస, నంటెట్టును" (భార. శాంతి. ౨. ఆ) అని ధర్మశాస్త్రము చెప్పుచున్నది గాన నట్లెంతమాత్రము యోచింపఁబనిలేదు. ఒకవేళ, నీవే చత్తునని భయపడుదువేమో, అట్లును భయపడనక్కఱలేదు. ఏలయనఁగా నిట్టి యుద్ధము, అపావృతస్వర్గద్వారమని యిదివఱకే (32) చెప్పియున్నానుగదా, అందునకనుగుణ్యముగా "క. న్యాయమున సంగరంబుం। జేయఁగ శస్త్రాగ్ని తన్నుఁజెందిన దానం। గాయంబువిడుచు పురుషుఁడు। వేయేటికి మోక్షలక్ష్మి, విభుఁడగు నధిపా!" (భార. శాంతి. ౨. ఆ.) అని ధర్మశాస్త్రమును జెప్పుచున్నది. కావున ధర్మయుద్ధముఁజేసి శత్రులచేఁజంపఁబడితివేని నీవు పరలోకమున నింతకంటె మేలగు స్వర్గాదిభోగముల ననుభవింపఁగలవు. లేక, నీవే శత్రులను జంపితివేని యిహమునందు రాజ్యసుఖము ననుభవించుటయే గాక "క. తనతోఁ దుల్యుండైనను। మనుజాధిప యధికబలసమగ్రత్వముగ। ల్గిన నని శత్రుని వధియించిన నరపతి పుణ్యలోక సిద్ధిం బొందున్!" (భార. శాంతి. ౨. ఆ.) అని ధర్మశాస్త్రము చెప్పుచున్నది గనుక నీతో సమానులగు కర్ణాదులనేమి, నీకంటె నధికులగు భీష్మద్రోణాదులనేమి, వధించుటవలనఁ బరమునందును నీకుఁబుణ్యలోకమే సిద్ధింపఁగలదు. గాన నీవిఁక నేలాటి సందియము నుంచుకొనక కృతనిశ్చయుఁడవై యుద్ధమునకు లెమ్ము.

శ్లో॥ సుఖదుఃఖే సమేకృత్వా। లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ। నైవం పాపమవాప్స్యసి॥ 38

అర్థము:— జయాజయౌ = జయాపజయములను, లాభాలాభౌ = లాభనష్టములను, సుఖదుఃఖే = సుఖదుఃఖములను, సమే + కృత్వా = సమములుగఁజేసి (భావించి), తతః = అటుపిమ్మట, యుద్ధాయ = యుద్ధముకొఱకు, యుజ్యస్వ = ఆయత్తపడుము, ఏవమ్ + (చేత్) = ఇట్లు (చేసితి)వేని, పాపమ్ = దోషమును, న + అవాప్స్యసి = పొందవు.

ఓయి యర్జునా! నేనింతవఱకు చెప్పినను, నీవిదివఱకుఁదలఁచిన ప్రకారమీధార్తరాష్ట్రులు మహాత్ములైనను, వారలఁజంపుటవలనఁ బాపమే గలుగుననియు, నితర ప్రయోజనమేదియుఁ గలుగనేరదనియునే, యెంచితివేని, (చూ. 1. 36) అందునకుఁగూడ నొకయుపాయముఁ జెప్పెద వినుము. అదేమనఁగా, నీవీ యుద్ధముఁ జేయుటలో జయాపజయములయందును, లాభాలాభములయందును, సుఖదుఃఖములయందును, సమబుద్ధి గలవాఁడవై యుండుము. ఎట్లనఁగా; నీకు జయముగలిగిన యెడల దానివలనఁగలిగెడు లాభమును గుఱించి సంతోషించుటగాని, అపజయము గలిగిన యెడల దానివలనఁగలిగెడు నష్టమును గుఱించి దుఃఖించుటగాని లేక, దైవము

మీదఁభారముమోపి (చూ. 4. 20) ఎట్లైనను సరియే యనెడు సమబుద్ధితో యుద్ధముఁజేయుము. అట్లుచేసితివేని నీకందలిపాపమంటనేరదు. అందునకుఁగారణ మేమంటివేని చెప్పెదవినుము. "చ॥ మనుజులుసేయునెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెల్లెడు। న్వినుము కుఠారిపాణిధరణీరుహముల్ నఱుకంగఁ బాపమెంఁ। గనొకో కుఠారమున్ జనులుదోసముఁబొందరు కర్త యీశ్వరుం। డనియెడినిశ్చయంబు దృఢమైమదినిల్చినఁజాలు భూవరా॥" (భార. శాంతి. ౧. అ) అనునట్లుగా సమస్తకార్యములను భగవదాజ్ఞానుసారముగ జరుగుచున్నవనియు, వృక్షమునఱికెడు వానిచేతి గొడ్డటికి నావృక్షమును నఱికినిపాపమెట్లంటనేరదో యట్లే "భగవంతుఁడు నాచేత నీకార్యమును జేయించుచున్నాఁడు, నే నాయనచేతి యాయుధమువంటి వాఁడనేకాని కర్తనుగాను" అనెడు మనోనిశ్చయముతో విధ్యుక్తకర్మల నాచరించు వానికి వానివలని పుణ్యపాపములంటనేరవు. ఇదియే "యోగము" - అనఁగా "నిష్కామకర్మయోగము" అనఁబడుచున్నది.

శ్లో॥ ఏషా తేఽభిహితా సాఙ్ఖ్యే। బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి॥ 39

అర్థము :— హేపార్థ! = ఓయి యర్జునా!, ఏషా = ఈ (ఇంతవఱకుఁజెప్పిన), బుద్ధిః = బుద్ధి, తే = నీకు, సాఙ్ఖ్యే = సాంఖ్యయోగమునందు (ఆత్మస్వరూపవిచారవిషయమై), అభిహితా = చెప్పఁబడినది, (కింతు) = ఇకనైననో, యయా + బుద్ధ్యా = ఏబుద్ధితోడ, యుక్తః = కూడినవాఁడవై, కర్మబన్ధమ్ = సంసారబంధమును, ప్రహాస్యసి = విడువఁగలవో, ఇమామ్ = ఈ (బుద్ధిని) (ఇకఁ ముందు చెప్పబోయెడుబుద్ధిని), యోగే = యోగమునందు (కర్మానుష్ఠానవిషయమై), శృణు = వినుము).

ఓయిపార్థా! ఇదివఱకు నీదుఃఖోపశమనము చేయుటకుఁగాను నేనాత్మస్వరూపజ్ఞానబోధకములగు సాంఖ్యయోగవిషయములను (చూ. 2. 12. మొదలు 30 వఱకు.) చెప్పియుంటినిగదా! దానివలన నీకు దుఃఖోపశమనము గలిగినట్లు కనఁబడకపోవుటచే నేను కులధర్మసంబంధమైన లౌకికన్యాయములనుగూడఁ గొన్నిటిని (చూ. 2. 31. మొ. 37. వఱకు) చెప్పితినిగదా? అట్లు చెప్పినను నీకు బంధుజనులయెడఁగల పామరత్వమును, వారలఁజంపుటచేతఁబాపము సంభవించు ననుభీతియు, విడిచినట్లుగనఁబడదు గాన నిపుడీయోగమును జెప్పఁబూనితిని. ఏల యనఁగా, ఈయోగమార్గము నవలంబించి యేపనిచేసినను, దానివలనఁగలిగెడు పుణ్యపాపము లాపనిఁజేయువాని నంటనేరవు. కావున, నీవాపద్ధతి నవలంబించి యుద్ధము

చేసినయెడల సంభవిలిపాపమువలని భయము నీకుఁ జేనేరదు. గాన నీయోగమార్గమును నీకుఁ జెప్పఁ బూనితిని. దీనిఁ జక్కఁగా వినుము.

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి । ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య । త్రాయతే మహతో భయాత్ ॥ 40

అర్థము : ఇహ = దీనియందు (ఇదిఁ జెప్పఁబోయెడు కర్మయోగమునందు) అభిక్రమనాశః = ప్రారంభనాశము, న+అస్తి = లేదు, ప్రత్యవాయః=దోషము, న+విద్యతే=కలుగదు, అస్య+ధర్మస్య=ఈకర్మయోగముయొక్క, స్వల్పమ్+అపి = అల్పమాత్రమైనను, మహతః = అధికమైన, భయాత్ = భయమునుండి, త్రాయతే=రక్షించుచున్నది.

ఇపుడు నేఁజెప్పఁబోయెడు కర్మయోగమెట్టిదనఁగా, దీని నెవరైనఁ బ్రారంభించిన వెంటనే వదలుకొన్నను దానికిఁ దగుమాత్రమైన ఫలమునిచ్చునేగాని, పోత్తిగానది నిష్ప్రయోజనముగానేరదు. ఒకవేళఁ గొంతమట్టున కీయోగము ననుష్ఠించిన పిమ్మట దానియందేవైన లోపములు సంభవించినను, నట్టిలోపములవలన దోషములు గలుగనేరవు సరేగదా, ఈకర్మయోగమును స్వల్పముగ నాచరించినను, మహత్తరమైన సంసారభయమునుండి కాపాడును.

అర్జు :— ఈకర్మయోగమునకుఁ బ్రారంభనాశములేదని చెప్పుటకుఁ గారణ మేమి ? ఎవరైన నేదేనియొక కార్యమును బ్రారంభించి వెంటనే వదలుకొన్నయెడల, దానివలన నెట్టిప్రయోజనముగలుగును ?

కృ — ఈకర్మయోగము తక్కిన యన్ని కార్యముల వంటిదిగాదు. మఱియెట్టి దనఁగా, చిత్తశుద్ధిగలిగి ఫలాపేక్షలేనివాఁడై భగవదర్పితముగఁ జేసెడు కార్యముగా నుంచున్నదిగాన, "ఆ-గీ. చిత్తశుద్ధిగల్గి, చేసినపుణ్యంబు । గొంచమైననదియుఁ, గొదువగాదు । విత్తనంబుమఱ్ఱి, వృక్షంబునకునెంత । విశ్వదాభిరామ, వినురవేమ యనునట్లుగా నెప్పుడు భగవదర్పితముగాఁ జేయఁబడునో యప్పుడే యీ కార్యమున కత్యుత్కృష్టత గలుగుచున్నది. గాన నదిస్వల్పమైనను గాలక్రమమున సంసారబంధవిముక్తియనెడు గొప్పఫలమునిచ్చుటకు నదియే కారణమగుచున్నది.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి । రేకేహ కురునన్దన !
బహుశాఖా హ్యనన్తాశ్చ । బుద్ధయోఽవ్యవసాయినామ్॥ 41

అర్థము : హే కురునన్దన ! ఓయియర్జునా ! ఇహ = ఈ (కర్మయోగమునందు వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మకమైన, బుద్ధిః = బుద్ధి (మనోవ్యాపారము)

ఏకా = ఏకరీతిగా నుండునట్టివి, అవ్యవసాయినామ్ = నిశ్చయరహితులయొక్క, బుద్ధయః = మనోవ్యాపారములు, బహుశాఖాః = పరిపరివిధములుగ వ్యాపించునట్టివిగను, అనన్తాః + చ=అసంఖ్యాకములుగను, (భవన్తి) + హి=అగుచున్నవిగదా.

కావున నెవఁడైతే విధ్యుక్తముగ, గర్మానుష్ఠానము సేయునెడల నందలి ఫలాఫలములను దాను గోరక భగవదర్పణముచేసి వానివలనఁ గలుగు సుఖదుఃఖముల యెడల సమభావము గలవాఁడై యుంచున్నాఁడో యట్టివానియొక్క మనస్సు మోక్షేతర విషయములయందుఁ బ్రవర్తింపక యామోక్షమునందే గురియుంచి వికారములను జెందక యెల్లప్పుడు నొకటీరుగ నుండును. తదితరులయొక్క, అనగాఁ నట్టి నిశ్చితబుద్ధి లేనివారలయొక్క మనోవ్యాపారములన్నో, యనేకవిధములైన కోరికలు శాఖోపశాఖలుగ నుప్పతిల్లుచుండుటంజేసి, అనఁగా నిహమునందు దారేషణ పుత్రేషణ ధనేషణముల చేతను, బరమునందు స్వర్గాదిభోగాపేక్ష చేతను, బీడింపఁబడుచున్నవారగుటంజేసి యట్టివార లనేకవిధములగు మనోవికారములఁ జెందుచు ముక్తినిధానమును గనఁజాలనివా రగుచున్నారు.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ ! నీవిట్లు చెప్పుచున్నావుగదా, ఈలోకమునఁ బండితులగు ననేకు లిహపరముల రెంటియందును ఫలము నిచ్చునట్టి కర్మలను, అనగా నగ్నిష్టోమము, అశ్వమేధము, పుత్రకామేష్టి మొదలగు క్రతువులను, అన్నదానాద్యనేక ధర్మములను, జేయుమని చెప్పుటయేగాక, యందున కనుగుణ్యములగు వేదవాక్యములనుగూడఁ బ్రమాణములుగఁ జెప్పుచుఁ బ్రేరేపించుచున్నారుగదా ; దీనింబట్టి చూడ నేదేనియొకఫలము నాశ్రయించియేకదా యేకర్మనైన నాచరించవలసినట్లు వేదప్రమాణములవలనఁ దెలియుచున్నది ? అట్లుండ నేఫలము నాశ్రయింపకఁ గర్మ నాచరింపవలయునని నీవు చెప్పుటకుఁ గారణమేమి ?

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం । ప్రవదన్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ । నాన్యదస్తీతి వాదినః ॥　　42

శ్లో॥ కామాత్మానస్స్వర్గపరా । జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహుళాం । భోగైశ్వర్యగతిం ప్రతి ॥　　43

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం । తయాపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధి । స్సమాధౌ న విధీయతే ॥　　44

అర్థము :— హేపార్థ=ఓయి యర్జునా, కామాత్మనః = కోరికలతోఁ గూడుకొనిన మనస్సుగలవారును, స్వర్గపరాః = స్వర్గమే యుత్తమపురుషార్థమని

యెంచియుండువారును, అన్యత్ = (ఆ స్వర్గముకంటె మేలైనపురుషార్థము) మఱి యొకటి, న + అస్తి + ఇతి = లేదని, వాదినః = వాదించువారును, వేదవాదరతాః = వేదమునందలి పదముల యన్వయమునుగూర్చి తమయభిప్రాయమునకు ననుగుణ్యముగ నుండునట్లు వాదించుటయందు దాసక్తిగలవారునగు, అవిపశ్చితః = అవివేకులు, క్రియా విశేషబహుళామ్ = కర్మభేదములచేత విస్తారమైనట్టిదియు, జన్మకర్మఫలప్రదామ్ = (మరల) జన్మమును, కర్మమును, కర్మఫలమును నిచ్చునట్టిదియు, పుష్పితామ్ = పూఁతమాత్రము పూఁచి, కాఁపు కాయని చెట్టువలె వినుటకుమాత్రము రమ్యముగనుండి మోక్షమునుగలుగఁజేయనదియు నగు, యామ్ + ఇమామ్ + వాచమ్ = ఏయీమాటను, భోగైశ్వర్యగతిమ్ + ప్రతి = (తుచ్ఛములగు) నైశ్వర్యభోగములను బొందుటను గురించి, ప్రవదన్తి = చెప్పుచున్నారో, భోగైశ్వర్యప్రసక్తానామ్ = (తుచ్ఛములగు) భోగైశ్వర్యములయందు దాసక్తులైనట్టి (వారగుటచేత), తయా = అట్టి (మాట) చేత, అపహృతచేతసామ్ = ఆక్రమింపఁబడిన మనస్సుగలవారలకు, వ్యవసాయాత్మికా = నిశ్చయాత్మకమైన (కర్మఫలాపేక్షలేక నిశ్చింతగానుండునట్టి), బుద్ధిః = బుద్ధి, సమాధౌ = సమాధియందు (మనోలయమునందు), న + విధీయతే = విధింపఁబడదు (అనఁగాఁ గలుగనేరదని భావము).

కృ — అవును. అనేకులట్లు చెప్పుట వాస్తవమే; నేనును వినియున్నాను; అయితే, అట్లు చెప్పెడివారు నిజమైనపండితులు గానేరరు. మఱెట్టివారనఁగా. (కామాత్మకులు) అనఁగా, దారేషణ, పుత్రేషణ, ధనేషణములనెడు కోరికలచేఁ బీడింపఁబడు మనస్సుగల వారును, (స్వర్గపరులును), అనఁగా స్వర్గభోగమే మేలైన పురుషార్థమని యెంచియుండువారును, గనుక నట్టివారు స్వర్గాదిభోగములకంటె మేలగు పురుషార్థము మఱియొకటిలేదని చెప్పుటయేగాక, తాముచెప్పెడుమాటలు నమ్మించుటకొఱకు భగవత్ప్రీతిసాధకంబులగు శ్రుతులను గర్మపరముగ నన్వయించునట్లా వేదవాక్యములకుఁ దదనుగుణ్యములగు నర్థములఁ గల్పనఁజేసి చెప్పుచుందురు. గాన నట్టికర్మనిష్ఠులు వేదవాదరతులేగాని వేదజ్ఞులనఁ దగువారుగారు. మఱియు, వేద పాఠమునందలి వారిపాండిత్య మెట్టిదనఁగా, "క. విను వేద వేద్యము నెఱుఁగని యాతని వేదపాఠ కలనంబు సుధీ। ధన వేదభారవహనం। బనఁ జను నింతియ నిరర్థ కాయాసంబై." (భార. శాంతి. ౧౪౩) అనునట్లుగా, వేదములచేఁ దెలిసికొనఁ దగిన పరబ్రహ్మము నెఱుఁగని యధ్యాపకులయొక్క వేదపాఠము, ఆవేదపుస్తకములఁ జదువక యూరక మోయువాని కెట్టిప్రయోజనకారియో యట్టిప్రయోజనకారిగనే యుండును. మఱియు నట్టివారి యుద్దేశము లెట్టివనఁగా — "ఉ. అదటఁ

బూర్వశాస్త్రముల యర్థములారఁగఁ గ్రోలి తత్త్వసం । వేదసుధారసంబునఁ జవిం జిరసౌఖ్యముఁ బొందనేర కి । మ్మేదిని నెంయనుందిఁగి మే లని కర్మము యూదిఁ చెప్పుచుం । గాదని శాంతి యొప్పనిదిగాఁ జెప నాఁకుదు రల్పబోధనుల్." (భార - శాంతి - ౧౮౧) కాన నట్టియవివేకులు తాము సంభావనాది రూపకమగు భోగైశ్వర్యములఁ బొందఁ గోరి యందున కనుగుణ్యముగునట్టియు, జన్మకర్మ ఫలప్రదములగునట్టియు, అనఁగా, పునర్జన్మమును, ఆజన్మమున ముందటిజన్మ మందలి కర్మానుగుణ్యములగు ఫలముల నిచ్చునట్టిదియునగు పశువధాద్యనేక విధములగు క్రియాకలాపములఁ గల్పించి చెప్పుచుందురు. అట్టివారలు "క. కొందఱు కర్మకరణ మశేష । నందింతురు వారలకు జననమరణములం । బొందక పోరాదు మహా । నందముఁ బొందుదురు నిత్య నైష్కర్మ్యపరుల్ ॥" (భార.శాంతి.౫౪.౧-౫౬.) అను నట్లుగా జననమరణాది రూపకమగు సంసారబద్ధులే గాని, యాత్మతత్త్వము నెఱిఁగిన వారు గారు సరేగదా, యెఱిఁగిరేనియు నుపదేశింపరు. అట్లుచెప్పుటయు వినెడి వారల కానందకరముగ నుండునట్టి సొగసైన వాక్యములతోడను వాక్యార్థములతోడను జెప్పుచుందురు గాన నవియన్నియుఁ బూచినమాటలే గాని ప్రయోజనకరములు గావు. అనఁగా గంటికింపుగా నుండునట్లు పుష్పించి ఫలమునివ్వని వృక్షమెట్లు నిష్ప్రయోజనకారియో యట్లే నిష్ప్రయోజనములైన మాటలుగా నుంచున్నవి. గాన నట్టి వారలమాటలు నమ్మఁదగదు. ఒకవేళ భోగైశ్వర్యములనుగోరెడు వారెవరైన నట్టివారల తియ్యనిమాటలచే తేలుపోయి వారుచెప్పెడు క్రియాకలాపముల ననువర్తింపుచు నింద్రాదిదేవతా ప్రీత్యర్థమై పశువధాది నానావిధములగు క్రతువులు మొదలగువాని నాచరింపుచు నిహమాత్రఫలభోగములను గోరుచుండినయెడల నట్టివారి కట్టిమనోనిశ్చయము గలుగనేరదు. ఇందునకు నిదర్శనముగఁ బూర్వకాలమునఁ గర్మాసక్తచిత్తుండై యనేక యజ్ఞములనొనరించియున్న ప్రాచీనబర్హికడకు నధ్యాత్మవేదియు కృపాళుండునైన నారదుండు సనుదెంచి యారాజునకు జ్ఞానబోధంబుసేయు కొఱకు నతనితో సంభాషించిన విధంబుఁ జెప్పెద నాకర్ణింపుము.

"వ. రాజా! యీకర్మంబునంజేసి యెట్టిశ్రేయస్సు నభిలషించుచున్నవాఁడవట్టి యనిష్టనిరసనంబు నభీష్టప్రాప్తికరంబు నైన శ్రేయం బీకర్మంబువలన లభింపదనినం బ్రాచీనబర్హి నారదున కిట్లనియె.

సీ. అనఘ మునీంద్ర మహాభాగ యేను గర్మాపవిద్ధజ్ఞాని నగుచు మోక్ష । మెఱుఁగంగ లేనైతి, నట్టినా కిప్పుడు గడువిమలంబును, గర్మబంధ । నాశకంబును నగు జ్ఞానోపదేశంబు గావింపు మతిదయా కారహూట । ధర్మంబు లగుగేహ, తతు

లందుఁ జేరి జాయా తనూజాత ధనాదికములె గీ. భూరిపురుషార్థములు గాఁగ బుద్ధిఁ దలఁచు । మతివిహీనుండు సంసారమార్గములను । దగఁబరిభ్రామ్యమాణుఁడై నొగిలి మోక్ష । పదమునొందఁగఁజాలఁడు భవ్యచరిత ! క. ఘనవృదు నతనికి నతఁడను।ననఘా యీయధ్వరంబు లందును గృప మా । లినసీచేవిశసింపఁ । జని కూలిన పసుల వేల సంఖ్యలఁ గనుమా. వ. కావునం బశువ్రాతంబులు త్వదీయ వైశసనంబును స్మరించుచున్నవై లోహమయంత్రమయశృంగంబుల చేత నెప్పుడు నీవు పరలోకంబు నొందెద వప్పుడ నిన్ను హింసింతుమని భవదీయమృతికి నెదురుచూచుచున్నయవి. (గాన) మ. ఘనవిస్తార మపార మవ్యయ మనంగా నొప్పునీవేదము । న్ననువర్తించుమ మంత్రయుక్తి వివిధంబైనట్టిదేవాఖ్యలో । ధనసామర్థ్యము చేత నింద్రముఖరూపంబిష్టదైవంబుగా గనివేఁకన్ భజియించువారలు గనంగా నేర్తురే యీశ్వరున్. క. విను మాత్మ భావితుం డన । నెనసిన భగవంతుఁ డెప్పు డెవ్వనిఁగరుణ । న్ననయము ననుగ్రహించును । మను జేశ్వర యపుడె వాఁడు మహాత్ముఁడై. క. ధీరత నీలోకవ్యవ । హారంబును వైదికంబు ననఁదగుకర్మా । చారములందు వినిష్ఠిత । మైరూఢిఁ దనర్చు బుద్ధినర్పివిడుచున్. సీ॥ కావున రాజేంద్ర, నీవును బరమార్థ రూపంబులగుచుఁ బ్రరోచమాన । ములును గర్ణప్రియంబులు నగు నస్పృష్ట వస్తువులను దగ వలుకకర్మ । ములయందుఁ బురుషార్థబుద్ధిఁగావింపకు మతిఘనస్వాంతులైనట్టివారు । పరఁగుజనార్దన ప్రతిపాదకంబైన శ్రుతిఁ గర్మపరమని చూపుచుండు తే. వారువేదజ్ఞులనఁదగువారు గారు । రూఢి మఱి వారు నిత్యస్వరూపభూత । మైన యీ యాత్మతత్త్వంబు నలరువేదకలితతాత్పర్యమునియాత్మ నెఱియలేరు. వ. కావునఁ బ్రాగగ్రంబులైన దర్భల చేత సకలక్షితిమండలాస్తరణంబు గావించి యహంకారయుక్తుండవు నవినీతుండవునై యెన్ని పశువుల జంపనే కాని కర్మస్వరూపంబును విద్యాస్వరూపంబును నెఱుంగవు. ఆకర్మవిద్యాస్వరూపంబు లెట్టివనిన సర్వేశ్వరపరితోషకం బేది యదియ కర్మంబు. ఆసర్వేశ్వరునియందు నేమిట మతి సంభవించు నదియ విద్య. అతండే దేహులకు నాత్మయు నీశ్వరుండును నగు మండుఁ గావునఁ బురుషులకు క్షేమకరంబైన యాశ్రయంబు శ్రీహరిపదమూలంబు. అతండు ప్రియతముండును సేవ్యమానుండు నగుచుండెనణుమాత్రంబైన దుఃఖంబులేదు. అట్టిహరి భగవత్స్వరూపంబెవ్వండెఱుంగును వాఁడు విద్వాంసుండును, గురుండును, హరియును నని చెప్పందగు.” (భాగ. ౪. స్కంధము)

మఱియు నోయియర్జునా! శ్రీరామచంద్రు నంతరంగ భక్తుండగు నాంజనేయునకు శ్రీసీతాదేవి తత్త్వబోధఁజేయునపుడు, ఇట్టి వేదవాదరతులను గుఱించి చెప్పిన వాక్యములనుగూడఁ జెప్పుచున్నాను వినుము. “క. తారకయోగముఁ దెలియఁగ । నేక

వేదాంతవాక్య నికురుంబముచే। నూరక వాదించుచుఁ జెడు। వారికి మోక్షంబుగలదె వాయుకుమారా? తే. రాజయోగంబుఁ బూని నిరంతరంబు। పట్టుగా నభ్యసించకఁ బ్రాలుమాలి। కొన్ని వేదాంతయుక్తులు గూడఁబెట్టి।పలుకనేర్చిన బ్రహ్మానుభవముగలదె! సీ. దాగుణగాఢాంధకారం బడంగునే వసుధపైఁ గృతదీపవార్తవలన। నాకొన్న మను జుని యాకలి దీరునే ఘనసరసాన్న వర్ణనమువలన। నెతిపేదవాని పేదతికంబు వోవునే ద్రవ్యస్వభావకీర్తనమువలన। రోగపీడితునిబల్ రోగఁబుదీరునే కలితౌష ధప్రసంగంబువలనఁ, గీ. జండిపడిబుద్ధిలోవెలి నిండి మిగుల।దట్టమైనట్టి యజ్ఞానతమము దెగునె। తర్కితవిచిత్రశబ్దబోధంబువలన। ఫలితయోగానుభవదృష్టివలనఁ గాక! తే. రాజితానందతారకరాజయోగ। పావనసమాధిలేనిప్రోఁ బరమశుష్క। తర్కవేదాంత వాదతత్పరులచేత। నింద్రియమనంబులు విని గ్రహింపఁబడునె?" (సీ - రా.)

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! నీవిప్పుడు చెప్పినమాటలను బట్టిచూడఁగా, నట్టివేదవాదరతులుగా నుండెడువారు సెప్పెడిమాటలను విశ్వసింపఁగూడదని తెలియుచున్నది గదా! అయితే వారలు తాము చెప్పెడిమాటల కనుగుణ్యములగు వేదవాక్యములను బ్రమాణముగఁ జూపుచున్నారే, యట్టి వేదవాక్యములు వ్యర్థములైనవేనా?

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున!
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమఆత్మవాన్॥　45

అర్థము: హే అర్జున! = ఓయి యర్జునుఁడా! వేదాః=శ్రుతులు, త్రైగుణ్యవిషయాః = త్రిగుణాత్మకములగు (అనఁగా మిశ్రములగు సత్త్వ రజస్తమోగుణముల వలనఁగలిగిన) విషయములను దెలుపునవిగా నున్నవి, (తస్మాత్) ఆ కారణమువలన, (త్వమ్) = నీవు, నిస్త్రైగుణ్యః = (అట్టి) త్రిగుణాత్మకములగు విషయములవలని వాంఛ వదలినవాఁడవుగను, నిత్యసత్త్వస్థః = కేవల సత్త్వగుణవిశిష్టుఁడవును (అనఁగా రజోగుణ తమోగుణములతో మిశ్రముగాకయుండునట్టి సత్త్వగుణమును గ్రహించినవాడవని భావము.) నిర్ద్వన్ద్వః = సుఖదుఃఖాదిద్వంద్వములు లేనివాడవును, నిర్యోగక్షేమః = యోగక్షేమరహితుఁడవును, ఆత్మవాన్ = ఆత్మజ్ఞానము గలవాఁడవును, భవ = అగుము,

కృ — ఓ యర్జునా! వేదవాక్యములు వ్యర్థములని యెప్పటికిని జెప్పరాదు. అయితే, అందుఁ ద్రిగుణాత్మకములగు సమస్తవిషయములును జేరియున్నవి. అనఁగా "తే. స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు మతియు। నీదృశములగు సత్త్వగుణోదితములు। రాగలోభ రోషాదులు, రాజసములు। దర్పశోక ప్రముఖములు తామ

సములు.” (భార. శాంతి. ౪. ఆ.) — సత్త్వగుణప్రధానములగు తెలివియు, సంప్రీతియుఁ, బ్రసన్నత్వమును రజోగుణప్రధానములగు రాగ లోభ రోషాదులను, తమోగుణ ప్రధానములగు దర్పశోకాదులను, ఈ మొదలగు నన్నివిషయములను, నావేదములయందు మిశ్రమములుగఁ జెప్పఁబడియుండుచున్నవిగాన “క. జ్ఞానమునకు సద్గుణసం। తానంబద్దంబు గానఁ దత్ప్రతిహతికై। పూనిమను సాత్త్వికమునను। మానస ముంపంగవలయు మహనీయధృతిన్.” (భార. శాంతి. ౪. ఆ.) అట్టి త్రిగుణాత్మకములగు వేదవాక్యముల ననువర్తించినయెడల నది జ్ఞానోత్పత్తికి విరోధమొనరించును గావున నట్టి చెడుగు గలుగకుండుటకుఁగా బుద్ధిమంతుఁడగు వాఁడేమిచేయవలయుననిన నా వేదవాక్యముల యందలి కేవల సత్త్వగుణ ప్రధానములగు విషయములనుమాత్రమే యనుసరింపవలయును. అట్లు చేయుటవలనఁ బ్రయోజనమేమనఁగా, “క. విను సాత్త్వికములు మదిదెల। కొని రాజస తామసములకును విగతత్వం బొనరించుఁ బదంపడిన। త్త్వనిరూఢత బోధసంపదకు హేతువగున్.” (భార. శాంతి.౪.ఆ.) కేవల సత్త్వగుణ ప్రధానములగు విషయములను బోధించునట్టి వేదవాక్యములనే యనువర్తించుచు వచ్చినయెడల నందుచే నాపురుషునియందు పదివఱకుఁ గలిగియుండిన రజోగుణ తమోగుణములు క్రమక్రమముగ క్షీణించి నానాట సత్త్వగుణమే వృద్ధినొందుచువచ్చి తుదకు వానియందుండు రాజస తామస గుణములు పొత్తిగ నశించినపై కేవలసాత్త్విక గుణమే ప్రధానమైనదిగా నిల్చియుండును. అట్లెప్పుడగుచున్నదో యప్పుడు వాఁడు బ్రహ్మజ్ఞానసంపన్నతకుఁ బాత్రుఁడగును. గాన నోయి యర్జునా! నీవు నట్లుచేయుము. అనఁగాఁ ద్రిగుణాత్మకములగు వేదవాక్యముల నన్నిటిని ననువర్తింపక వానిలోఁ గొన్నిటినిమాత్రము,అనఁగాఁ గేవలసత్త్వగుణప్రధానములగు వానినిమాత్రమే యవలంబింపుము. అట్లుచేసితివేని నీవు కేవలము సత్త్వగుణ ప్రధానుఁడవై (నిర్ద్వంద్వుఁడవును అనఁగా సుఖదుఃఖములు శీతోష్ణములు, జయాపజయములు, మానావమానములు, మొదలగు ద్వంద్వములయందు సమబుద్ధిగలవాఁడవును, యోగక్షేమరహితుఁడవును) అనగా లేనిదాని సంపాదింపవలయునను కోరికయు, నున్నదానిఁగాపాడుకొనవలయుననియెడు నాసక్తియు లేనివాఁడవు నగుదువు. అటెపుడగుచున్నావో యపు డాత్మజ్ఞానసంపన్నుఁడవు గాఁగలవు.

అర్జు—అయ్యా కృష్ణమూర్తీ! వేదములు భగవద్వాక్యములని పెద్దలు చెప్పుచున్నారుగదా? అట్లైనయెడల, దానియం దాభగవత్స్వరూపమునే ప్రతిపాదించునట్టి విషయములు మాత్రమే యుండవలెనుగదా? అట్లుగాక, తదితరములగునట్టియు తుచ్ఛ

ములను నశాశ్వతములను నగు నిహపరసౌఖ్యములకుఁ గారణములగునట్టియు, విషయ లేల యున్నవి ?

శ్లో॥ యావానర్థ ఉదాపానే* సర్వతస్సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46

అర్థము. ఉదాపానే = స్నానపానాదికముల విషయమై (అనఁగా నవిచేయుటకు) సర్వతః = అంతటను, సంప్లుతోదకే = నిండియున్న యుదకముగల తటాకమునందు, యావాన్ = ఎట్టిదియైన అర్థః = ప్రయోజనమో, తావాన్ = అట్టి (ప్రయోజనము) సర్వేషు = సమస్తములైన, వేదేషు = వేదములయందు, విజానతః = మిక్కిలి తెలిసిన, (అనఁగా, ఆత్మానుభవముగల), బ్రాహ్మణస్య = బ్రహ్మజ్ఞాన సంపన్నునకు, భవతి = అగుచున్నది.

కృ — అవును, అవి భగవద్వాక్యములే యైయున్నవి. అయినను ఈలోకమున జనులు త్రిగుణాత్మక స్వభావముగల వారగుటచే, అనఁగా, సత్త్వరజస్తమో గుణములనెడు మూడును మిశ్రమముగఁ గలవారై యందుఁ గొందఱీ మూడుగుణములు సమత్వముగఁ గలిగియుండువారును, గొందఱు సత్త్వగుణమెక్కువగను రజస్తమో గుణములు తక్కువగను గలిగియుండు వారుగను, కొందఱు రజోగుణప్రధానులుగను, అనఁగా రజోగుణమెక్కువగను, సత్త్వతమోగుణములు తక్కువగను గలవారుగను, మఱికొందఱు తమోగుణప్రధానులుగను, అనఁగాఁ దమోగుణమెక్కువగను,సత్త్వరజో

---

* (ఉదాపానే) ఈ రెండవ శ్లోకమునందు గొందఱు వ్యాఖ్యాతలు "యావానర్థఉదపానే సర్వతస్సంప్లుతోదకే" అని మూలమునందువ్రాసి "(ఉదపానే=బావియందును, సర్వతస్సంప్లుతోదకే=తటాకమునందును)" అని యర్థము వ్రాసియున్నారు. ఇందువలన మూలశ్లోకమునందలి మొదటిపాదమున గణభంగమున్నట్లు కనఁబడుటయే గాక, యర్థముగూడ సమన్వయముగానున్నట్లగపడదు. అట్లుగాక "యావానర్థ ఉదాపానే సర్వతస్సంప్లుతోదకే" అని యున్నయెడల నట్టి గణభంగము లేకుండుటయేగాక (సర్వతస్సంప్లుతోదకే = అంతటనిండియుండు తటాకమునందు; ఉదాపానే - ఉద=ఉదకముయొక్క, ఆపానే=పానాదికవిషయమై, అనఁగా - పానము స్నానము, మొదలగు కార్యములు చేయుటకు.) అని యర్థము చేయుట సమన్వయముగ నున్నట్లగపడుచున్నది. గాన నిచట నిట్లువ్రాయుటకుఁ గారణమైనది. కనుక నీరెండువిధములయందు నెవరికేది యనుకూలముగఁ దోచుచున్నదో వారు వారాయా యర్థమును గ్రహింపవచ్చును.

గుణములు తక్కువగను, గలవారుగను, నుంచున్నారు. గాన నట్టివారల కందఱు కును నుపయోగించునట్లు వారివారిగుణముల కనుగుణ్యముగఁ గావలసినవిషయము లావేదములయందుఁ జెప్పఁబడియున్నవి; గాన నందెవరెవరి కేయే విషయము గావలయునో వారు వారాయా విషయమును గ్రహించుచున్నారు. అదెట్లనఁగా, నంతట నుదకముచే నిండియుండు నొకగొప్పతటాకమున ననేకములగు రేవులుంచున్న విగదా? అందొకరేవున విశేషముగఁ బాఁచితీగలును, నొకరేవున విశేషముగఁ దామరయును, నొకరేవున విశేషముగ మత్స్యములును, నొకరేవున విశేషముగ ముండ్లకంపయు, నొకరేవున విశేషముగ నడుసును, నొకరేవున నగాధమగు పల్లమును మఱియొక యిసుకతెరరేవున నిర్మలోదకమును, నుంచున్నవిగదా! అతటాకమున కనేక లనేక కార్యములకొఱకుఁ బోవుచున్నారుగదా, అనఁగాఁ గొందఱు, మత్స్యములకొఱకును, గొందఱు తామరాకులు, పద్మములు, మొదలగువానికొఱకును గొందఱు పాఁచితీగలకొఱకును, గొందఱు నత్తలకొఱకును. గొందఱు గిట్టిగడ్డలు గొట్టిగడ్డలు మొదలగువానికొఱకును, మఱికొందఱు స్నానపానాదుల కుపయోగించెడు నిర్మలోదకముకొఱకును బోవుచున్నారుగదా? అట్టివారలందఱు నొకటేరేవునకుఁ బోవుదురని యెంచెదవా? లేక, వేఱువేఱు రేవులకుఁ బోవుదురని తలఁచెదవా?

అర్జు — ఇన్నివిధములగు పనులకుఁబోయెడు వారందఱు నొకటేరేవునకెట్లు పోవుదురు? వారలట్లుపోయినను వారలకుఁ గార్యసిద్ధి యెట్లుకాఁగలదు? గాన దేనిఁ గోరిపోయెడు వారలది లభ్యపడఁదగిన రేవునకుఁ బోవుదురే గాని తదితరములగు రేవుల కేలపోవుదురు?

కృ — అవునుగదా, ఈవేదములును నట్టితటాకమువంటి వేయని యెంచికొనుము. అనఁగాఁ దటాకమునం దెన్నివిధములగు వస్తువు లెట్లు కలిసియున్నవో, యట్లే వేదములయందును సత్త్వరజస్తమములనెడు త్రిగుణాత్మకములగు విషయములన్నియుఁ జేరియే యుంచున్నవి. అనఁగా, నైహికములగు దారపుత్రధనధాన్యాది సంపదలను గోరువారికి వానిని లభింపఁ జేయఁదగిన పుత్రకామేష్టి మొదలగు యజ్ఞమంత్రములును, నాముష్మికములగు రంభాసంభోగాది స్వర్గసుఖములఁ గోరువారలకు వానిని లభింపఁజేయఁదగిన యగ్నిష్టోమాది క్రతుమంత్రములును, పితృతర్పణాదులఁ జేయువారికి వానికిఁదగుమంత్రములును, వివాహాది శుభకార్యములఁజేయువారికిఁ దదనుగుణ్యములగు మంత్రములును, భూతభేతాళ పిశాచాదుల నుపాసించువారికి నందునకుఁ దగినమంత్రములును, శక్తిపూజఁజేయువారికి నందునకుఁ దగినమంత్రములును మఱియు నిట్టి యనేకవిధములగు మంత్ర తంత్రాదులును, కేవల నిర్గుణ పరబ్రహ్మము నుపాసించువారికి నందునకుఁదగిన తత్త్వబోధయును, నిట్టి విషయములన్నియుఁ జేరియుం

చున్నవి ; గాన నందెవరెవరికి దేనియందిష్టమో వారువా రా విషయములకుఁ దగిన మంత్రములను గ్రహించుచుఁ దమతమ యిష్టసిద్ధులఁ బడయుచుందురు. అయితే, "మ. శ్రుతివాక్యంబులు కర్మనిష్ఠ వినుతించు న్నిష్క్రియత్వంబును । దగఁ గావించుట యూఁదిచెప్పు నిటుచిత్తప్రక్రియన్ రెండుబో । ధితముల్ వానిని వింటిమన్నఁ గలఁచుం దీపించునే తత్త్వసంగతబోధంబు సుకర్మతంగలుగు నాకంబాప్తవీరవ్రతా!" (భార. శాంతి. ౧. ఆ.) అనునట్లీ వేదములు జననమరణాది సంసారకారణంబగు కామ్యకర్మాచరణమున ననుసరించి చెప్పుచున్నవేగాని, యదియే శ్రేష్ఠమనియు, నందఱిచే నాచరింపఁబడదగినదే యనియు నూఁదిచెప్పుటలేదు ; గాని నైష్కర్మ్యసిద్ధిని బొందఁదగిన తత్త్వబోధను గుఱించి మాత్ర మాని చెప్పుచున్నవి. గాన నీరెండును నాచరింపఁబూనినయెడల నందువలన చిత్తభ్రమగలుగునేగాని తత్త్వజ్ఞానోదయము గలుగనేరదుగదా? ఒకవేళ నావేదముల యందలి కర్మకాండము నందనేక సుకర్మలుగూడఁ జెప్పఁబడియున్నవే యంటివేని యట్టి సుకర్మల స్వర్గాద్యశాశ్వతములగు భోగములే లభించునుగాని శాశ్వతమగు మోక్షసామ్రాజ్యము గలుగనేరదు. గనుకనే "గీ. క్షరము నక్షరంబు గానంగఁబోలువే । దార్థచింతనమున నమ్మిథునము । నందుఁ బూర్వముడిగి యపరంబుచేపట్టి।నిలుపవలయు నధిక నిష్ఠగలిగి" (భార. శాంతి. ౬. ఆ) అనునట్లు వేదార్థచింతనమువలన నశాశ్వతములగు భోగములను, శాశ్వతమగు మోక్షపదవియుఁ దెలిసికొనఁదగియుంచున్నవి ; అరెంటియందును, మొదటిదియగు నశాశ్వతములైన భోగములఁ బరిహరించి శాశ్వతమోక్షపదవినే యాశ్రయింప వలయునని పెద్దలుచెప్పియున్నారు. కాఁబట్టి "క. విమలజ్ఞానముఁదపమును।దమమును ద్యాగంబు శాశ్వతప్రచురానం । దమునకు మూలములంద్రుని । జముగాఁ గైకొంద్రవి యప్రసన్నవివేకుల్." (భార. శాంతి. ౧. ఆ.) అనునట్లాత్మానుభవముగల బ్రహ్మజ్ఞాని వేదములయందలి సమస్తవిషయములనుండి తమకుఁ గావలసిన నిత్యానందపదవికి (మోక్షమునకు) మూలములగు నిర్మలజ్ఞానమును, తపస్సును, దమమును, సర్వసంగపరిత్యాగమును మాత్రమే గ్రహించి తక్కినవిషయముల నన్నిటిని విసర్జించును.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥ 47

అర్థము :— తే=నీకు, కర్మణి+ఏవ=కర్మమునందే (నిత్యనైమిత్తికాది కర్మమును జేయుటయందు మాత్రమే), అధికారః = అధికారము (ఆసక్తి), (అస్తు) = కలుగుఁగాక, కదాచన = ఒకప్పుడును (ఎప్పటికిని), ఫలేషు=కర్మఫలములయందు (అధికారః) = నధికారము (ఆసక్తి), మా+అస్తు= కలుగకుండునుగాక, కర్మఫల

హేతుః = కర్మఫలమునకుఁ గారణమైనవాఁడవు, మా + భూః = కాకుము, అకర్మణి + (తే) = కర్మను జేయక మానుకొనుటయందును, తే = నీకు, సఙ్గః = ఆసక్తి, మా + అస్తు = కలుగకుండుగాక.

కావున నోయియర్జునా! నీవునట్టి వేదోక్తములును, నీ కులాచార ధర్మములు నగునట్టి నిత్యనైమిత్తికాది సమస్తకర్మల నాచరించుటమాత్రమే నీపనిగానుంచున్నది కాని, దానివలనఁగలిగెడు ఫలాఫలములకు నీవు కర్తవుగానేరవు. ఏలయనఁగా, "క. నేర్పరి పెక్కువిధంబుల । నార్పఁగ బొమ్మలుగ వంగి యాడెడిచందం। బేర్పడఁగాస్త్రము కలస । మర్పిత కార్యకరులైన మానవుల దెసన్" (భార. శాంతి. ౧. ౨౭౩) అనునట్లు సూత్రధారుఁడాడింప నాడెడు బొమ్మలవలె నీలోకమునందలి జనులు భగవదాజ్ఞానుసారముగఁ గాలానుగుణ్యములగు కర్మల నాచరింపుచుందురని తెలిసికొనుము. ఇట్లుగాక నీయందే కర్తృత్వముంచుకొంటివేని, అనఁగా, నీవే స్వేచ్ఛగ నీకార్యములఁ జేయుచున్నట్లు తలఁచితివేని యట్లాచరించెడు కర్మలయొక్క పుణ్యాపాపములు నీకు జననమరణాది రూపమగు సంసారమునకు హేతువులగును; గాన నీవు ఫలములను గోరకయే సమస్తకర్మల నాచరింపుచుండవలయును. అయితే, ఒకవేళ ఫలాపేక్ష లేని వాఁడేకర్మనైన నేలయాచరింపవలయును, ఏకర్మ చేయనివాని కెట్లు ఫలప్రాప్తి యుండదో యట్లే నిష్కాముఁడై కర్మల నాచరించెడువానికిఁగూడ ఫలప్రాప్తి యుండనేరదుగదా, అట్టివిషయములోఁ గాయక్లేశాదులకోర్చి కష్టపడి కర్మలనాచరించి యట్టి కష్టములేమియుఁ బడక యూరకయుండువానితో పాటేమియు ఫలమును బొందకయుండుటకంటె, వానివలెనే యేకర్మము నాచరింపక హాయిగ నూరకుండుటయే మేలని యెంచెదవేమో; యట్లెంతమాత్ర మెంచఁదగదు.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ !
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48

అర్థము:— హే ధనంజయ! = ఓయి యర్జునా, సిద్ధ్యసిద్ధ్యోః = ప్రాప్తాప్రాప్తములయందు (కర్మానుష్ఠానమువలనఁ గలిగెడు ఫలములయొక్క కలిమిలేములయందు) సమత్వమ్ = సమబుద్ధి కలిగియుండుట, యోగః + (ఇతి) = యోగమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, (తతః) = అందువలన, త్వమ్ = నీవు, సమః = (కర్మఫల ప్రాప్తాప్రాప్తములయెడల) సమబుద్ధిగలవాఁడవు, భూత్వా = అయి, సఙ్గమ్ = (అట్టి కర్మఫలమునందలి) ఆసక్తిని, త్యక్త్వా = విడిచి, యోగస్థః + (సన్) = యోగమునందున్నవాఁడవై, కర్మాణి = కర్మలను, కురు = చేయుము.

అయితే, ఏమిచేయవలయుననఁగా, నిదివఱకు నేఁ జెప్పినప్రకారము ఫలాఫలములయందు సమబుద్ధి గలవాఁడవై అనగా, నీవు విధ్యుక్తప్రకార మాచరించెడు కర్మవలన మేలుగలిగినయెడల సంతసించుటగాని, కీడుగలిగినపుడు దుఃఖించుటగాని లేక, "వ. కర్మఫలం బీశ్వరునియదియ, తదర్పణబుద్ధి సహితంబుగాఁ బ్రబుద్ధులు వేదచోదిత కర్మంబు లనుష్ఠింతురు." (భార. శాంతి. ౧) కావున నాకర్మల యొక్క ఫలాఫలములు భగవదధీనములుచేసి, అనగాఁ భగవదిచ్ఛాను సారముగను నీప్రాప్తాప్రాప్తముల కనుగుణ్యములుగను, జరుగుచున్నవేగాని, నీ యిచ్ఛాను సారముగ జరుగనేరవనియెడు నిశ్చయబుద్ధితో నట్టిఫలముల యందాసక్తి వదలినవాఁడవై సమస్త విధ్యుక్తకర్మల నాచరింపుము. అట్లు ఫలాపేక్షవదలి సమబుద్ధితోఁ గర్మల నాచరించుటయే యోగమనఁబడుచున్నది. గాన నీవట్టియోగము నవలంబించి నిరపేక్షుఁడవై కర్మనాచరింపుము.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ!
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49

అర్థము :— హేధనంజయ! = ఓయర్జునుఁడా, ఫలహేతవః = ఫలము నపేక్షించి యందుకుఁగాను గర్మలనాచరించువారు, కృపణాః = నీచులు, (తస్మాత్)= ఆకారణమువలన, బుద్ధియోగాత్ = చిత్తశుద్ధిగలిగి చేసెడు నిష్కామకర్మయోగము కంటె, కర్మ = కామ్యకర్మము, దూరేణ=మిక్కిలి, అవరమ్ + హి=నీచమైనది గదా, (అతః) = కాబట్టి, (త్వమ్) = నీవు, బుద్ధౌ=నిష్కామకర్మానుష్ఠాన బుద్ధి యందు, శరణమ్=రక్షకత్వమును, అన్విచ్ఛ=కోరుము.

ఓయి ధనంజయా! నే నింతదూరము నీకు చెప్పుటకుఁ గారణ మేమనఁగా నీలోకమున ఫలమునుగోరి కర్మనాచరించెడువారు కృపణులనఁబడుచున్నారు; గాన ఫలాపేక్షలేక యాచరింపఁబడు నిష్కామ కర్మముకంటె ఫలాపేక్షతోఁ జేయఁబడు కామ్యకర్మము మిగుల నీచమైనదగుచున్నదిగదా? కాఁబట్టి యట్టినీచకర్మము నాచరింపకుము. మఱేమిచేయవలయుననఁగా నెప్పుడును నిష్కామకర్మము నాచరించుట యందే నీబుద్ధి నిలుపుము.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభేసుకృతదుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50

అర్థము :- బుద్ధియుక్తః = చిత్తశుద్ధిగలవాఁడు ఉభే = రెండైన సుకృతదుష్కృతే = పుణ్యపాపములను, ఇహ = ఈ(లోకమునందే), జహాతి = విడుచు

చున్నాడు, తస్మాత్ = ఆ కారణమువలన, యోగాయ = యోగముకొఱకు, యుజ్యస్వ = ఆయత్తపడుము, కర్మసు = కర్మములయందు, యోగః = యోగము, కౌశలమ్ = కుశలత్వము (నేర్పరితనము).

ఏలయనఁగా సత్త్వచిత్తశుద్ధిగలవాఁడై నిష్కామకర్మ నెవఁడాచరించుచున్నాఁడో వాని నట్టి కర్మలవలని పుణ్యపాపములు అనఁగా సుకృతముఁ జేసినయెడల దానివలనఁ గలిగెడు పుణ్యమును, దుష్కృతముఁ జేసినయెడల దానివలన గలిగెడు పాపమును, అంటనేరవు. అనఁగా నట్టి పుణ్యపాప ఫలములను వాఁడు పరలోకమున ననుభవింపవలసియుండదు; గాన నట్టి పుణ్యపాపములను దనదేహముతో పాటుగ నీలోకముననే విడిచిపెట్టి పోయినవాఁడగుచున్నాఁడు; కాఁబట్టి కర్మానుష్ఠానమునఁ దే నేర్పరియనఁబడుచున్నాఁడు; గనుక నోయి యర్జునా! నీవునునట్లే నిష్కామకర్మానుష్ఠానమునకుఁ దొడఁగుము.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ 51

అర్థము :— హి = ఏలయనఁగా మనీషిణః = బుద్ధిమంతులైనవారు. బుద్ధియుక్తాః (సన్తః) = నిష్కామకర్మానుష్ఠానపరులై, కర్మజమ్ = కర్మమువలనఁ గలిగెడు, ఫలమ్ = ఫలమును, త్యక్త్వా = విడిచి, జన్మబన్ధవినిర్ముక్తాః (సన్తః) = జన్మమనెడు బంధమునుండి విడువఁబడినవారై, అనామయమ్ = సర్వోపద్రవరహితమైన, పదమ్ = స్థానమును, గచ్ఛన్తి = పొందుచున్నారు.

అయితే అట్లు నిష్కామకర్మనాచరించుటయే నేర్పరితనమని చెప్పుటకుఁ గారణమేమనఁగా, నెవ్వరైతే బుద్ధిమంతులైన నిష్కామకర్మ నాచరించుచున్నారో వారి నాకర్మవలని పుణ్యపాపములంటనేరవుగదా? పుణ్యపాపములెప్పుడు లేకపోయెనో యప్పుడా పుణ్యపాపములవలనఁ గలిగెడు పునర్జన్మ వారలకు లేకపోవుచున్నదిగదా? అట్లు జన్మరాహిత్యమగుటయే మోక్షమనఁబడుచున్నది. గాన నట్టి నిష్కామకర్మానుష్ఠానపరులు సర్వోపద్రవరహితమగు పరమ పదమును బొందుచున్నారనుట. కానవోయి యర్జునా! నే నిదివఱకుఁ జెప్పిన ప్రకారము నీవు జయాపజయములయందు సమబుద్ధిగలవాఁడవును, నిష్కాముఁడవును నై యుద్ధముఁ జేయుము.

శ్లో. యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి
తదా గన్తాఽసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ 52

శ్లో. శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి॥ 53

అర్థము :— శ్రుతివిప్రతిపన్నా = (పెక్కు కారణములచే సంశయయుక్తమైన వేదవాక్య) శ్రవణము చేతఁ గలఁతజెందఁబడిన, తే = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, యదా = ఎప్పుడు. మోహకలిలమ్ = అజ్ఞానమూలమైన కలఁతను, వ్యతితరిష్యతి = మీఱుచున్నదో, తదా = అప్పుడు. అచలా + (సతీ) = చలింపనిదగుచుండఁగా, (త్వమ్) = నీవు, శ్రోతవ్యస్య = వినఁదగిన దానియొక్కయు, శ్రుతస్య + చ = విన్న దానియొక్కయు, నిర్వేదమ్ = వైరాగ్యమును, గన్తాసి = పొందఁగలవు. తే = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, యదా = ఎప్పుడు, సమాధౌ = సమాధియందు (చిత్తైకాగ్ర్యమునందు). నిశ్చలా = చలింపనిదగుచు, స్థాస్యతి = నిలుచుచున్నదో. తదా = అప్పుడు, త్వమ్ = నీవు, యోగమ్ = యోగమును, (తత్త్వజ్ఞానప్రాప్తిని), అవాప్స్యసి = పొందఁగలవు.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! నీ వింతమాటలు చెప్పుచున్నను, నాబుద్ధి యుద్ధము నకుఁ జొరకున్నది. ఏమి సేయుదును!

కృ — అవును. ఇప్పుడు నేఁ జెప్పినదంతయు నీబుద్ధికి నెక్కకపోవుట సహజమే; ఏలయనఁగా, నీవిదివఱకు వేదములయందలి కర్మకాండవిషయమై యనేకులగు వేదవాదరతులచేఁ బలువిధములగు ననేకవిషయముల వినియుండుటచేత నీబుద్ధి కలఁతవాఱియున్నది; కాన నేఁ జెప్పెడు వాక్యముల యాథార్థ్యము నీకు బోధపడుట కష్టమే. అయినను, "క. వినుమానస ప్రసన్నత । దనరఁ గనుపట్టుచుండుఁ గలుషితతం । గానఁబడదు జేసి । వనీట బొడసూపనిగ । వను వైకల్యక సవిశేష యట్లైనఁబోలెన్." (భార. శాంతి. ర. ౧౫–౨) అనునట్లు నీరు తేటగానుండునప్పుడు ప్రతిబింబము గనఁబడు చుండును; మురికివారి నీరు కలఁతబాఱియుండునప్పుడు కనఁబడనేరదుగదా! అట్లే నేఁ జెప్పెడివిషయములు నీమనస్సు కలఁతబాఱియుండుటచే బోధపడకపోయినను, నజ్ఞానమువలన నీ కిపుడు గలిగియుండునట్టి యీ కలఁత యెప్పుడు నశింపఁగుచున్నదో యప్పుడు నీమనస్సు నిశ్చలమైనదగును; కాన నప్పుడిదివఱకు నీవు విన్నవిషయముల యందును, ఇఁక వినఁబోయెడు విషయములయందును, నీకు వైరాగ్యము గలుగఁగలదు. అట్టి వైరాగ్యమెప్పుడు చెందుచున్నావో యప్పుడు బుద్ధి చలింపనిదై చిత్తైకాగ్ర్య సమాధి యందు నిలుచును. అట్లెప్పుడు నిలుచుచున్నదో యప్పుడు నీకు యోగము సిద్ధించును. అనఁగా నీవు స్థితప్రజ్ఞుఁడవగుదువు. కనుక నప్పుడు నీకీ విషయము చక్కఁగ బోధపడఁగలదు.

అర్జున ఉవాచ :

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా ? సమాధిస్థస్య కేశవ !
స్థితధీః కిం ప్రభాషేత ? కిమాసీత వ్రజేతకిమ్ ? 54

అర్థము :— హే కేశవ! = ఓ కృష్ణమూర్తీ!, సమాధిస్థస్య=సమాధియందుండు నట్టి, స్థితప్రజ్ఞస్య = నిశ్చలమైన తత్త్వజ్ఞానముగలవానియొక్క, భాషా =లక్షణము, కిం = ఎట్టిది, స్థితధీః = (అట్టి) నిశ్చయజ్ఞానముగలవాఁడు, కిమ్+ప్రభాషేత=ఏమి పలుకును, కిమ్+ఆసీత = ఏరీతిగానుండును, కిమ్+వ్రజేత = ఎట్లు నడుచుకొనును.

అర్జు — అయ్యా ! కృష్ణమూర్తీ ! సమాధియందు బుద్ధి నిశ్చలముగా నెప్పుడు నిలుచునో యప్పుడు యోగసిద్ధిగలుగునని చెప్పితివిగదా ! సమాధియందు బుద్ధి నిశ్చలముగా నిలుచుట యనఁగా నెట్టిది ! అనఁగా నట్టి నిశ్చలబుద్ధిగలవాని లక్షణమెట్టిది? వాఁడేవిధముగ మాటలాడును ? ఏవిధముగనుండును ? వాని నడత యెట్టిది? అనఁగా నేలాటి లక్షణములుగలవాఁడు యోగియనఁబడును ? ఇది యంతయు సవిస్తరముగాఁ దెలుపుము.

శ్రీభగవానువాచ :

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥ 55

అర్థము :— హే పార్థ! = ఓయియర్జునా! మనోగతాన్ = మనోగతములగు, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = కోరికలను, యదా=ఎప్పుడు, ప్రజహాతి= విడుచుచున్నాఁడో, తదా = అప్పుడు, ఆత్మనా = తనచేత, ఆత్మని+ఏవ = తనయందే. తుష్టః+(సన్) = సంతసించినవాఁడగుచు, స్థితప్రజ్ఞః+(ఇతి) = నిశ్చల జ్ఞానముగలవాఁడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాఁడు.

కృ — ఓయి యర్జునా ! యోగసిద్ధిని బొందినవాని లక్షణమెట్టిదియో చెప్పుచున్నాను వినుము. ఒక పురుషుఁ డెప్పుడు కామాద్యరిషడ్వర్గమును, దారాదికమగు నీషణత్రయమును, స్వర్గాదిభోగాపేక్షను, మఱియు నితరములగు నన్ని కోరికలను దన మనస్సునుండి విడుచుచున్నాఁడో, యప్పుడు వానిమనస్సు దేనియందును నంటక సమస్తవాంఛితములను బొందినవానివలెనే తృప్తుఁడై తనలోఁ దా నానందమును బొందుచుండును. అట్టిస్థితి కెప్పుడు వచ్చుచున్నాఁడో యప్పుడు స్థితప్రజ్ఞుఁడనఁ బడును.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ 56

అర్థము :— దుఃఖేషు = దుఃఖములయందు (ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనెడు తాపత్రయమువలనఁ గలిగెడు దుఃఖముల ననుభవించుటయందు), అనుద్విగ్నమనాః = దిగులుఁజెందని మనస్సుగలవాఁడును, సుఖేషు = సుఖములయందు, (స్రక్చందన వనితాది భోగములవలనఁ గలిగెడు సుఖములయందు), విగతస్పృహః = ఆశలేనివాఁడును, వీతరాగభయక్రోధః = పోయిన యనురాగమును, భయమును, క్రోధమును గలవాఁడునైన, మునిః = మననశీలుఁడు, స్థితధీః = స్థితప్రజ్ఞుఁడు, (ఇతి) = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

అట్టి స్థితప్రజ్ఞుని లక్షణములు మఱియు నెట్టివనఁగా : “తే. గీ. ప్రాప్త దుఃఖంబులకు భయపడక యోర్చి, కోసరి యప్రాప్త సుఖములఁ గోరికొనక, వీతరాగ భయక్రోధుఁడై తనర్చు, నాతఁ డాత్మస్థితప్రజ్ఞుఁ డగుఁ గపీంద్ర” (సీతారా–3–౧౭౮) అనునట్లు, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనెడు దుఃఖములలో నేది సంభవించినను మనస్సున దిగులుఁజెందనివాఁడును, స్రక్చందనవనితాది భోగములవలనఁ గలిగెడు సుఖములయందాశలేనివాఁడును, వీతరాగభయక్రోధుఁడును, అనగాఁ దేనియందు ననురాగముగాని, దేనియందును ద్వేషబుద్ధిగాని, దేనియెడలను భయముగాని, లేనివాఁడును, మననశీలుఁడును, అనఁగా నెప్పుడును భగవద్విషయికమైన చింతనఁ జేయువాఁడును, ఇట్టి లక్షణములుగలవాఁడు స్థితప్రజ్ఞుఁడనఁబడును.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! దుఃఖములు, ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికములని మూఁడు విధములుగఁ జెప్పితివిగదా, యవియెట్టివి? వివరించిచెప్పుము.

కృ — ఈలోకమున జనులకుఁ గలిగెడు దుఃఖములు, ఆధ్యాత్మికములనియు, అధిభౌతికములనియు, మూఁడు విధములుగ నుంచున్నవి. ఎట్లనఁగా ; “మ. తగనాధ్యాత్మిక తాపమొప్పు జ్వరముం దగ్గుల్శిరోభారమా, దిగనొప్పారు శరీరజన్యరుజయై ద్వీపీభసర్పాదిగా, నెగడుం బ్రాణిజమాధిభౌతికమగు న్నిర్ఘాతవర్షాతపా, శుగబాధాదికమాధిదైవికమునా శోభిల్లుదైవత్యమై” అందాధ్యాత్మికము లెట్టివనఁగా ; శరీరమునందు వాతపిత్తశ్లేష్మాదులవలనఁ గలిగెడు జ్వరము, దగ్గు, తలనొప్పి మొదలగు జాడ్యములవలనఁ గలిగెడు దుఃఖములు ; అధిభౌతికదుఃఖము లెట్టివనఁగా, జంతువులవలనఁ గలిగెడు బాధలు ; అవి యెట్టివనిన, నొకఁడు పాముగఱచి చనిపోవుచున్నాఁడు, మఱియొకఁడు తేలుగుట్టి బాధపడుచున్నాఁడు, ఇంకొకఁడుఁ బులిచేతఁ జంపఁబడుచున్నాఁడు, ఒకఁడు పశువుచేఁ బొడువఁబడి బాధనొందుచున్నాఁడు,

ఈ మొదలగునవి (భూతములు) అనఁగా జంతువులచేఁ గలిగెడు దుఃఖములు గనుక నివి, ఆధిభౌతిక దుఃఖములనఁబడుచున్నవి. ఆధిదైవిక దుఃఖము లెట్టివనఁగా, ఎండ, వాన, గాలి, పిడుగు, అగ్ని, జలము, మొదలగు వానివలనఁ గలిగెడు దుఃఖములు; అవి యెట్టివనిన, ఒకఁడు మిక్కిలి యెండ తగులుటచే శోషవోవుచున్నాఁడు. మఱియొకఁడు విశేషవర్షముచేఁ దడిసి చలిపట్టి బాధనొందుచున్నాఁడు. ఇంకొకడుఁ గాలిదెబ్బ(?)దగిలి విశేష బాధనొందుచున్నాఁడు. ఒకఁడు పిడుగుపడి యకస్మాత్తుగాఁ జనిపోవుచున్నాఁడు, మఱియొకఁడు నిప్పులోఁబడి యొపలుగాలి బాధనొందుచున్నాఁడు. ఇంకొకఁడు కాలుజాఱి బావిలో లేక ప్రవాహములోఁబడి చనిపోవుచున్నాఁడు. ఈలాటివి దైవసంకల్పమువలనఁ గలిగినవగుటచే నాధిదైవికములని చెప్పఁబడుచున్నవి. గాన నిట్టిదుఃఖములలో నేవి తనకు తటస్థించినను మనోవికారమును జెందనివాఁడే యోగి యనఁబడును.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

అర్థము :— యః = ఎవఁడు, తత్తత్ = ఆయా, శుభాశుభమ్ = మంచిచెడుగులను, ప్రాప్య = పొంది, సర్వత్ర = అంతట (అట్టి శుభాశుభములన్నిటియందును), అనభిస్నేహః + (సన్) = అభిమానములేనివాఁడై, న + అభినన్దతి = ఆనందింపఁడో, న + ద్వేష్టి = ద్వేషింపఁడో, తస్య = అట్టివానియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = మిక్కిలిస్థిరమైనది.

అట్టి యోగసిద్ధిని బొందినవాని లక్షణములు మఱియు నెట్లుండుననఁగా — "తే. గీ. అఖిలవిషయానభిస్నేహుఁ డగుచు శుభము నొంది మురియక యశుభంబు నొందికినియ, కుందు నెవ్వాఁడు సమమైన ప్పుండితుండు, సంస్థిత ప్రజ్ఞుఁ డగు వాఁడె జనవరేణ్య" (సీ - రా - 3 - ౧౮౫) అనునట్లు, సుఖములకుఁ గారణభూతములగు శుభములలో, అనఁగా నేదియైన లోకవ్యాపారమువలన విశేష ధనలాభముగలుగుట, సభలయందు సన్మానముగలుగుట, గృహమునందు వివాహము, పుత్రలాభము మొదలగు మంచి కార్యములు జరుగుట, తాను జేయఁబూనిన పని నిర్విఘ్నముగ నెఱవేఱుట, ఈ మొదలగు ననేక శుభములలో నెప్పుడేదియొనఁగూడినను దానివలన నుప్పొంగకయు, లేక దుఃఖకారణములగు నశుభములు, అనగా నేదైన లోకవ్యాపారమువలన విశేష నష్టముగలుగుట, సభలయందవమానము గలుగుట, గృహమునందు దారపుత్రాదులలో నెవరైన మృతినొందుట, లేక, వారలకు దేహపీడగలుగుట, ఈ మొదలగు నశుభములలో నెప్పుడేది సంభవించినను దానివలనఁ గ్రుంగకయు, నట్టి శుభాశుభము

లన్నియుఁ గాలానుగుణ్యములుగ భగవదిచ్ఛానుసారమున జరుగుచున్నవని యెడ్డు మనోనిశ్చయముగలవాఁడై నిశ్చింతముగ నుండువాఁడెవఁడో యట్టివాఁడు స్థిరమైన జ్ఞానముగల యోగియనఁబడును.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

అర్థము :-- కూర్మః = తాబేలు, అంగాని + ఇవ = అవయవములను (ముడుచునట్లు) వలె, అయమ్ = ఈ(పురుషుఁడు), యదా = ఎప్పుడు, సర్వశః = సమస్తములైన, ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, సంహరతే = మరలించుకొనుచున్నాఁడో, తదా = అప్పుడు, తస్య = ఆపురుషునియొక్క. ప్రజ్ఞా + చ = జ్ఞానమును, ప్రతిష్ఠితా = మిక్కిలిస్థిరమైనది, (భవతి) = అగుచున్నది.

అట్టి యోగిలక్షణములు మఱియు నెట్టివనఁగా,

“ తే. గీ. కూర్మ మఖిలావయవములఁ గుదియముడుచు
మాడ్కి నే యోగి యింద్రియ మానసములఁ
దనర మరలించు నింద్రియార్థములవలన
నాతఁ డాత్మ స్థితప్రజ్ఞుఁ డగు మహాత్మ.” (సీ. రా. 3. ౧౪౬.)

తాఁబేలు తనయవయవముల నిరపాయములగు స్థలములయందుఁ బ్రసరింపఁ జేయుచు నపాయకరమగు వస్తుసంపర్కము గలిగినచో నెట్లు లోనికి ముడుచుకొనునో యట్లే యీపురుషుఁ డింద్రియములను విషయములనుండి మరలించుకొనుచుండును. తాఁబేటియొక్క స్వభావమెట్టిదనఁగా, జలమం దీదునపుడుగాని, నేలనడుచునపుడుగాని, యేదైన నపాయకరమగు వస్తువు తనకాళ్లకుఁగాని, తలకుఁగాని తగిలిన యెడల నేయవయవమునకుఁ దగులుచున్నదో యాయవయవమును దక్షణమే ముడుచుకొనును. ఆవిధముననే. యోగియనువాఁడు తనయింద్రియములు విషయములయందుఁ బ్రవర్తించునపుడు, అందేదైన నొకవిషయము చెడుగైనదని తోఁచినయెడల నట్టివిషయమునుండి యాయింద్రియమును మరలించుకొనును. అదెట్లనఁగా, నేత్రేంద్రియమునకు నెదుట నుండు నన్నివస్తువులను జూచుట సహజముగదా! ఒకఁడు తనయెదుటనుండు వస్తువులఁ జూచునపు డొక సౌందర్యవతియగు స్త్రీ దృష్టికి గోచరించుటచే బుద్ధిచలించునట్లుగపడుచున్నది. అప్పుడు బుద్ధిమంతుఁడగు వాఁడా స్త్రీని దృష్టించిచూచుట సరికాదనియెంచి వెంటనే తనదృష్టిని మరలించు కొనుచున్నాఁడు. అప్పుడు తన మనస్సున నంకురించిన వికార మణఁగిపోవుచున్నది. అట్లుచేయక యాస్త్రీని, దనకు

మనోవికారమంకురించిన పిమ్మట మఱికొంతసేపు చూచుచుండిన యెడల దాని యంగసౌష్ఠవమును జూడఁజూడఁ గ్రమక్రమముగఁ గామోద్రేకము గలుగఁదగియుంచున్నది. అందువలన దుర్విషయములయందుఁ బ్రవర్తించుటకుఁ బ్రేరణగలుగుచున్నది. కనుక నట్టి మనోవికారముగలిగిన వెంటనే యా స్త్రీని దృష్టించి చూచుటను మానుటచే నేత్రేంద్రియమును దాని విషయమునుండి మరలించినవాఁడగుచున్నాఁడు. ఇట్లే తక్కిన యింద్రియములకును నుదాహరణము లూహింపఁదగును. కనుకనే, శ్రీవ్యాసులవారు తనపుత్రుఁడగు శ్రీశుకులకు జ్ఞానోపదేశము చేయునపుడు, ఇంద్రియనిగ్రహమును గుఱించి,

"తే. గీ. ఎల్లకడలకు వెలువడు నింద్రియముల
బాలపుత్రులఁ దండ్రియుఁ బోలె నాఁగు
మవియు మనమును నిశ్చలౌ కాగ్రభావ
మొందు టుత్తమతపమదియుజ్జ్వ లాత్మ!

క. అది ధర్మంబుల కెల్లం
దుదియగు ధర్మంబు మనసులో దానిఁ దగం
గుదియించి మేధతోడం
గదియింపుము నియతిఁ బుత్ర కడు గాఢముగన్.

తే. ఇంద్రియంబుల నాఱింటి నిట్లు విషయ
ములకు నొలయక యుండంగ నిలువరించి
తలఁపులుడిగి తే నాత్మమోదమును నాను
భంగిఁ దృప్తుఁడవై యుండు పరమశాంతు" (భార.శాంతి.౫.౧౭౯–౧౮౧)

అని చెప్పియున్నాఁడు గావున నోయియర్జునా! నీవును నట్లు చేయుము.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! ఇపుడు నీవుచెప్పిన ప్రకారము మనస్సునకు వికారమును బుట్టించునట్టి విషయములనుండి యింద్రియముల నాగలించిన యెడల నంత మాత్రముచే నట్టి వికారమడఁగిపోవునా? అనఁగా నొక సౌందర్యవతియగు స్త్రీని జూచినపుడు మనోవికారముగలిగిన వెంటనే యా స్త్రీనుండి దృష్టిని మరలించిన యెడల నావెంటనే యదివఱ కంకురించియుండు మనోవికారముగూడ నడఁగి పోఁగలదా?

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 59

అర్థము :— నిరాహారస్య = ఇంద్రియవిషయానుభవములేని (అనగాఁ బైశ్లోకమునఁ జెప్పఁబడిన ప్రకారము విషయములయందు నింద్రియములను బ్రవర్తింపనీక మరలించుకొనినయట్టి), దేహినః=పురుషునకు, విషయాః=విషయములు, రసవర్జమ్=రాగముతప్ప, వినివర్తన్తే = మరలిపోవుచున్నవి, అస్య = వీనికి (విషయములనుండి యింద్రియములను మరలించినను నాశమాత్రము కొట్టుకొనుచుండెడువానికి). పరమ్=ఆత్మస్వరూపమును, దృష్ట్వా=చూచి (తెలిసికొనినపిమ్మట), రసః + అపి = రాగమును (అదివఱకు మనసునఁగొట్టుకొనుచుండిన యాశయును), నివర్తతే=విడిచిపోవుచున్నది.

కృ — లేదు. ఆమనోవికారము వెంటనే యడఁగి పోనేరదు.

"క. వినుటకును గనుటకును సా
ధనములయిన చెవియుఁ గన్ను దనదనయంతన్
వినను గానను నేర్చునె
మనఃప్రభావమునఁ గాక మనుజాధీశా!"

"తే. గీ. ఇంద్రియములెల్లనట్టివి యెలసియొంటు
వలన మనసున్నఁ దమతమ వర్తనముల
నిగుడ నేరమి దెల్లఁబు నృపవరేణ్య!
యిట్టులగుట యజ్ఞానకైన నెఱుఁగవచ్చు."

"తే. గీ. మనసుచేతివ యింద్రియములెను లెల్ల
నుపరతంబైన మనసుతో నుడిగి మఱఁగు
నింద్రియము లుపరతినొందె నేని దాన
మనసు మగుడదు విషయతృష్ణన చరించు." (భార. శాంతి. ౬. ౨౪-౨౬)

అనునట్లు, ఇంద్రియములకు మనసే ప్రధానముగ నుంచున్నది గాన, మనస్సునందలి వికారమడఁగినయెడల నింద్రియములేమియుఁ జేయనేరవు. అదెట్లనఁగా, నొక పురుషుఁడు మనస్సున నేదైనయొక విషయమును జింతించుచుఁ బరధ్యానముగ నుండినది యెడల వానియెదుట నప్పుడుండెడు నేదైన నొకవస్తువును జూచుచుండియు నన యిట్టివస్తువని తెలిసికొనుటగాని, తన సమీపమున నుండెడు వారలాడుచుండెడు మాటల వినుచుండియు నాసంభాషణ మిట్టిదని యెఱుంగుటగాని, లేకుండుట మన మందఱము చూచుచున్నాముగదా, మఱియు నెవఁడైన నొకవస్తువునుజూచి దానియందాసఁ గొన్నయెడలఁ దదనంతర మావస్తువు వాని యెదుట లేకపోయినను, దానియందే వానిమనస్సుదగిలి కొట్టుకొనుచుండుటయునుగూడఁ జూచుచున్నాము

గదా? కావున నింద్రియములను విషయములనుండి మరలించుట మాత్రముచేతనే మనస్సునకట్టివిషయములయందుండెడు వాంఛ యడఁగిపోనేరదు. గనుక విషయములయందు నింద్రియములను బ్రవర్తింపనీక, మరలించుకొనువాని కావిషయముల యొక్క యనుభవముమాత్రము లేకపోవునేగాని వానియందలి యపేక్షమాత్రము విడువఁబడదు. అయిన నాప్రకారమింద్రియములను విషయములనుండి మరలించుకొనుచు రాఁగరాఁగ నట్టివిషయవాంఛ సయితము క్రమక్రమముగ నశించుచు వచ్చును. అందువలన నాత్మస్వరూపజ్ఞానము క్రమక్రమముగా హెచ్చుచువచ్చును. ఇట్లు కాఁగాఁగాఁ గొంతకాలమున కాత్మజ్ఞానము పూర్తిగఁగలిగి విషయవాంఛ బొత్తిగ నశించిపోఁగలదు.

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60

అర్థము :— హేకౌన్తేయ! = ఓయర్జునా!, యతతః = (ఇంద్రియములను విషయములనుండి మరలించుటకు) యత్నించుచున్న, విపశ్చితః = విద్వాంసుఁడైన, పురుషస్య = పురుషునియొక్క, మనః + అపి = మనస్సునుగూడ, ప్రమాథీని = క్షోభమునుగలుగఁజేయునట్టి, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, ప్రసభమ్ = బలాత్కారముగ, హరన్తి + హి = హరించుచున్నవి గదా?

అయిన నోయియర్జునా! అట్లెవఁడైనఁ దెలివిగలవాఁడై తనయింద్రియములను విషయములమీఁదఁ బ్రవర్తింపకుండ మరలించుచు వచ్చినను, ఆయింద్రియములు బలవత్తరములుగాన నట్టివాని మనస్సునుగూడనవి బలాత్కారముగ లాఁగుచుండును. కాన, నట్టివానికి సయితము విషయములమీఁది యాశ సులభముగ విడువనేరదు. అదెట్లనఁగా ;

“సీ. వేదశాస్త్రంబులు వివరించి బుధులచేఁ, జదివింపవచ్చుఁ దాఁజదువవచ్చు.
యజ్ఞదాన తపంబు లధికారి జనులచేఁ, జేయింపవచ్చుఁ దాఁ జేయవచ్చు.
నిలలోనఁ గలతీర్థ ములకేగ నన్యుల. బోధింపవచ్చుఁ దాఁ బోవవచ్చు.
నష్టాంగయోగవిద్యల నార్యులకు నుపదేశింపవచ్చు సాధింపవచ్చుఁ

తే. గీ. గాని యెవ్వారికైన విజ్ఞానయోగ
గతిని దేహేంద్రియము లరికట్టి మనము
నాఁగి యంతర్ముఖముఁజేసి యనవరతము
నిశ్చల సమాధి నిష్ఠనే నిలుపరాదు.” (సీ. రా. 3. ౧౩౪)

అనునట్లుగా, నెంతవివేకియైన నిట్టి కార్యము లెన్ని చేయఁగలిగినను మనస్సును మాత్ర మింద్రియ వ్యాపారముల వెంబడిఁ బోనీక యాఁగిపట్టుట కష్టసాధ్యము.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! యిపుడు నీవు చెప్పెడు విషయముల నాలోచింపఁగా, మనసుకంటె నింద్రియముచే బలవత్తరములైనట్లు కనఁబడుచున్నవే, యట్లుండఁగా, మనస్సును నింద్రియములు సులభముగ లాఁగఁదగి యుండఁగా బలాత్కారముగ లాఁగునని చెప్పుటకుఁ గారణమేమి. ?

కృ — అవును. అవి బలవత్తరములుగా నుండునవియైనను, వివేకియగు వాఁడవి పోవుమార్గములయందు దనమనస్సును బోనీక మరలించుచువచ్చును. అట్టివాని ప్రయత్నమును భంగపఱచి, వానిమనస్సును హరింపవలసియుండును. గనుక వానియింద్రియముల కట్టుచేయుట సులభసాధ్యము కాదు. అయినను, వానిశక్తికంటె నాయింద్రియములశక్తియే బలవత్తరమైనది కాఁబట్టి యట్టివాని మనస్సును గష్టముతోనైనను హరింపఁగలవు. కావున బలాత్కారముగ హరించునని చెప్పుటకుఁ గారణమైనది. ఇందున కొక దృష్టాంతముఁ జెప్పెదవినుము. ఒకబండికి గుఱ్ఱములఁగట్టి తోలఁగా నాగుఱ్ఱములాబండిని లాఁగుకొని పోవునుగదా. అట్లుపోవుచుండు బండిని వెనుకటి ప్రక్క నిద్దరుముగ్గురు మనుష్యులుపట్టి వెనుక కీడ్చుచుండినయెడల నాగుఱ్ఱములు మొదటలాఁగినంత సులభముగ నాబండిని లాఁగఁగలుగునా? అలాగుననే మనస్సనెడు బండిని నింద్రియములనెడి గుఱ్ఱములు లాఁగుచుండఁగా వివేకియగువాఁడు తన బుద్ధిచే నామనస్సును నీడ్చిపట్టుచున్నాఁడు, కాఁబట్టి యట్లీడ్చిపట్టఁబడిన మనస్సును లాఁగుట యింద్రియములకు సులభసాధ్యముగానేరదు.

అర్జు — వివేకియగువాని మనస్సును ఇంద్రియములు బలవంతముగలాఁగునని చెప్పితివిగదా, వివేకశూన్యుని మనస్సునుగూడ నట్లే బలాత్కారముగ లాఁగవలసి యుండునా ?

కృ — అక్కఱలేదు. తొలుతనేఁ జెప్పిన దృష్టాంతము ప్రకారము బండిని వెనుక కీడ్చిపట్టకుండి నపుడా బండినిలాఁగుట గుఱ్ఱములకెట్లు కష్టసాధ్యముగానేరదో, యట్లే వివేకశూన్యుని మనస్సునువాఁడు తనబుద్ధిచేత నీడ్చిపట్టఁడు గనుక నట్టివాని మనసును నింద్రియములు బహుసులభముగ లాఁగఁగలవు.

అర్జు — ఆట్లైనయెడల వివేకియై యింద్రియముల నీడ్చిపట్టినవాని మనస్సును గూడ నింద్రియములు బలాత్కారముగ లాఁగుచుండినయెడల నట్టి యింద్రియములను వాఁడెప్పటికైన జయింపఁగలఁడా ?

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

అర్థము :-- యుక్తః = యోగాభ్యాసపరుఁడు, సర్వాణి = సమస్తములైన, తాని = అట్టియింద్రియములను, సంయమ్య = చక్కఁగావశపఱచుకొని, మత్పరః + (సన్) = నాయందే యాసక్తుఁడైన, (చిత్తముఁజేర్చినవాఁడై), ఆసీత = ఉండవలెను. హి = ఏలయనఁగా, యస్య — ఎవనియొక్క, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, వశే = అధీనమునందు, (వర్తన్తే) = ఉంచున్నావో, తస్య = వానియొక్క, ప్రజ్ఞా = జ్ఞానము, ప్రతిష్ఠితా = స్థిరమైనది.

కృ — ఆహా, జయింపవచ్చును. అందునకొక సదుపాయముగలదు చెప్పెద వినుము. ఇంద్రియములు యోగాభ్యాసకుని మనస్సునైనను బలవంతముగ లాఁగుటయు, నందువలన వానిని స్వాధీనపఱచుకొనుట యతనికిఁ గష్టసాధ్యముగనుండుటయు, నిజమే. అయినను,

“ క. అనఘుండింద్రియ హయభృత
మనోరథరథంబు నాఁగు మహితజ్ఞాన
త్వనిరూఢరశ్మిశక్తిని
జననాయక మప్పథమునఁ జనకుండంగన్.” (భార. శాంతి. ౨. ౪౩౯)

అనునట్లు, ఆయోగాభ్యాసకుఁడు, ఇంద్రియములనెడు గుఱ్ఱములచే లాఁగఁ బడుచుండెడు తన మనస్సనెడు రథమును దుర్మార్గులయందుఁ జొరనీక బుద్ధియనెడు పగ్గములతో లాఁగిపట్టి సన్మార్గమునకుఁ ద్రిప్పుకొనుచుండవలయును. నట్లు చేయుటలో,

“ తే. గీ. ఇంద్రియములలో నొక్కటి యేనిపట్టు
వడక వెడలిన నాఁగంటి ప్రజ్ఞ గాఱు
నట్లుగావున మనసు ము న్నాఁగి వినికి
యాదియగునైదు గ్రమమున నాఁగవలయు.” (భార. శాంతి. ౨. ౭)

అనునట్లు, కట్టులేని నాఁగేలెట్లు దున్ననేరదో యట్లే మనస్సులేని యేయింద్రియమును బ్రయోజనకారి గానేరదు గాన, నింద్రియములలో నేదియేని తప్పుమార్గమునఁ బ్రవర్తించినయెడల నది మనస్సుయొక్క తప్పు గానే యుంచున్నదిగాన, నట్టి మనస్సును ముందు వశపఱచుకొని యటుపిమ్మట నింద్రియముల వశపఱచుకొనుటకు యత్నింపవలయును. అట్లు మనస్సును వశపఱచుకొనుటకు సాధనము బుద్ధియేగనుక,

" ఆ. బుద్ధి గొని మనంబు పోనీక నిలిపి మ
నోభియుక్తి నింద్రియముల నాఁగి
విషయసమితి నెడల విడిచినవానికి
ననిమిషులు ప్రసన్నులగుదు రనఘ. " (భార. శాంతి. ౪. ౩౧౪)

అనునట్లు, ఎవఁడైతే, తనబుద్ధిచేత యుక్తాయుక్తను నాలోచించి తనమనస్సు నింద్రియముల వెంబడి తప్పుమార్గమునఁ బోనీక యాఁగి పట్టుచున్నాఁడో యట్టివానికి దేవతలు ప్రసన్నులగుదురు. అనఁగా నట్టివానికి ముక్తి సులభసాధ్యమగును.

అర్జు — అయితే, బుద్ధిచేత మనస్సును నాఁగవలయునని చెప్పితివిగదా? అది యెట్లు చేయవలయునో యా సదుపాయమును వివరించి చెప్పుము.

కృ — మంచిది, చెప్పుచున్నాను వినుము. ఒక పురుషునిదృష్టికి నొక సౌందర్యవతియగు స్త్రీ గోచరించునపుడా స్త్రీయందు మనస్సు దగులుచున్నది గదా? అప్పుడు వివేకియగువాఁ డేమి చేయుననఁగా,

" క. విను మాంసాస్థిమయంబని
వనితాంగము సద్వివేకవైభవమునఁ గాం
చిన నందు నది దగుల దా
పనికిని నాడీవిశుద్ధి ప్రాపగుఁ బుత్రా. " (భార. శాంతి. ౪. ౩౦౧)

అనునట్లు, స్త్రీయొక్క శరీరము మాంసము నెముకలు, మొదలగు హేయపదార్థములతోఁ గూడినదే గదా. దీనిఁజూచి యేల భ్రమింపవలెనని యాలోచించి యందువలన మనస్సున కసహ్యము గలుగఁ జేసికొనును. అట్లెప్పుడు చేయునో యప్పుడు వానిమనస్సునందుఁ దగిలిన వాంఛ తత్క్షణమే విడిచిపోఁగలదు. అప్పుడా స్త్రీయను విషయమును వాఁడు నేత్రేంద్రియముతోఁ జూచుచుండినను మనస్సు చలింపక యుండఁగలదు. గనుక,

" నారీ స్తనభరనాభీదేశం, దృష్ట్వా మాగా మోహావేశమ్
ఏతన్మాంస వసాది వికారం, మనసివిచింతయ వారంవారమ్. "

అనునట్లు, బుద్ధిమంతులగువారు స్త్రీల యంగములను గుఱించి "చన్నులు మాంసపుముద్దలు, కన్నులు పుసిగాఱు తొఱ్ఱలు" అను మొదలగు హేయపదార్థములుగఁ దలఁచుచు వచ్చినయెడల నట్టివారి దృష్టికిఁ బరస్త్రీలు గోచరించినను, వ్యామోహమును జెందక యుండఁగలరు. అట్లే, తక్కిన యన్ని యింద్రియ విషయములను గుఱించి యోచించునపుడు వానియందుఁ గొన్ని సుగుణము లున్నను,

వాని నాలోచింపక దుర్గుణములను, నస్థిరత్వమును, గుణించిరయే యాలోచింపుచు వచ్చినయెడల, వానియం దట్టివానిమనస్సు తగులము నొందనేరదు ఒకవేళ మొదట నట్టి విషయములయందు వానిమనస్సు తగులము నొందినను, నావిషయముల యందలి హేయగుణములను బలుమాఱు స్మరించుటచే వానియం దసహ్యత గలిగి యా తగులము విడిచిపోవును. అయినను, వాని యింద్రియము లప్పుడప్పుడు మరల దుర్విషయములయందుఁ బ్రవర్తింపఁ దొడఁగుచునే యుండును; అట్లుగాకుండు టకుఁగా యోగాభ్యాసియగువాఁడు తన చిత్తమును భగవంతునియందుఁ జేర్చి, అనఁగా నోయి యర్జునా! భగవంతుఁడనఁగా నెవరనుకొన్నావో ఈ భూభార హరణార్థమై యవతరించిన నేనేసుమా! గాన యోగాభ్యాసియగువాఁడు తన చిత్త మును నాయందుఁజేర్చి, గట్టిగా నన్నే యాశ్రయించి యుండినయెడల నప్పుడాతని చిత్తము నాయింద్రియములు తప్పుమార్గమునకుఁ ద్రిప్పఁజాలక నిల్చిపోవును. అదెట్ల నఁగా నిదివఱకు మనసు బండివంటిదనియు, నింద్రియములు గుఱ్ఱములవంటి వనియు, వెనుక నీడ్చిపట్టువాఁడు యోగివంటివాఁడనియు, నట్లీడ్చిపట్టుచుండఁగా నాగుఱ్ఱములు కష్టముతోనైనను లాగుచుండుననియుఁ జెప్పియుంటిని గదా, అట్లు వెనుక నీడ్చిపట్టు నంతవఱకు నాబండిని నాగుఱ్ఱములు కష్టతరముగానైనను లాగుచునే యుండునుగదా! అయితే, ఆబండిని వెనుక మనుష్యుఁడీడ్చిపట్టుటకు బదులుగా గట్టిత్రాటితో నొక వృక్షమునకు గట్టివేసినయెడల నప్పుడును నాబండి నాగుఱ్ఱములు లాఁగఁ గలుగునా?

అర్జు — అట్లు కట్టివేసినపిమ్మట నాబండిని లాఁగుట కాగుఱ్ఱములెంత బలము గలవైనను బొత్తిగా సాధ్యపడక నిల్చిపోవును.

కృ — అవునుగదా, అదేతీరుగా యోగాభ్యాసకుఁడు తనచిత్తమనెడు బండిని నేననెడు వృక్షమునకుఁ గట్టివేసినయెడలఁ అనఁగాఁ దనచిత్తమును నాయందుఁ జేర్చిన యెడల, అనఁగాఁ దనదృష్టిని నాయందేనిలిపి నాగుణానుభవమునే చేయుచు, సదా నన్నే ధ్యానింపుచు, నితర విషయములనొల్లని వానియొక్క యింద్రియములు విషయ ములయందుఁ బ్రవర్తింపనేరవు. ఇందున కనుగుణ్యముగ నొక కథగలదు - అదెట్ల నఁగా; ఒకపట్టణమునం దొక చోరుఁడుగలడు. వాఁడొకనాటిరాత్రి యాపట్టణ మేలెడు రాజుయొక్క శయ్యాగృహమునందు రహస్యముగఁ బ్రవేశించి రాజును భార్య యు గాఢనిద్రఁజెందెడు సమయమున వారిరువురు ధరించియుండు నాభరణములను దస్కరింపఁదలఁచి యందునకుఁదగిన సమయమును వేఁచియుండెను. అట్లుండఁగా, వారిరువురు శయ్యాసీనులై యిష్టాలాపము లాడుకొనుచుండు సమయమున యుక్త వయస్సు వచ్చియుండెడు తమకొమార్తెకుఁదగిన వరుని నిర్ణయించు విషయమైన

సంభాషణ జరుగుచుండెను. ఆసమయమందారాజు తన కొమార్తెను నొక భాగవతోత్తమునకు, అనఁగా సదా భగవన్నామముఁ జేయుచుండెడు వానికి వాని కులగోత్రము లెట్టివైనను విచారింపక యిచ్చి పెండ్లిచేసి, వానికిఁ దనరాజ్యములో నర్ధరాజ్యమివ్వఁదలఁచియున్నట్లు దృఢముగాఁ జెప్పెను. ఇది వినిన తోడనే యాచోరుఁడు తానప్పు డుద్దేశించియుండిన చోరకృత్యమును జేసినయెడల నది నిర్విఘ్నముగా నెఱవేఱినను, కొద్దిఫలమే లభించుననియు, నొకవేళ గ్రహచారము చాలక పట్టువడిన యెడల గొప్ప రాజదండనకు బాత్రుఁడు గావలసివచ్చు ననియు, నిట్టి సందిగ్ధమగు కార్యమును జేయుటకంటెఁ గొంత కాలము వఱకు భగవద్భక్తుని వేషముధరించి సదా భగవద్గుణానుభవమును జేయుచుండిన యెడలఁ దనకు రాజకుమార్తెయు, నర్ధరాజ్యమును లభించునని యెంచి యాప్రకారము సేయ నిశ్చయించినవాఁడై తానేరీతిగాఁ బ్రవేశించెనో యారీతిగానే రహస్యముగా బయిటకువెళ్ళిపోయినవాఁడై మఱునాఁడు మొదలుకొని యరుణోదయముననే నదికిఁబోయి స్నానముచేసికొని ద్వాదశోర్ధ్వపుండ్రములు మొదలగు భగవద్భక్తుని చిహ్నములధరించి, సర్వకాల సర్వావస్థలయందును భగవన్నామమునే జపించుచుండెను. ఇది యిట్లుండఁగా నచట రాజగృహమందారాజు మఱునాటి యుదయమున నిదురలేచి కాలోచిత కృత్యములు దీర్చుకొని యాస్థానమంటపమునఁ గూరుచున్నప్పుడు తనమంత్రులంజూచి తనకొమార్తెయొక్క వరనిర్ణయమును గుఱించి తన మనోనిశ్చయమును దెలిపినవాఁడై యట్టిపురుషుఁడెచ్చటనైనఁ గనఁబడినయెడల వానిని నాఱుమాసముల వఱకుఁ గనిపెట్టి యుండి యంతవఱకు నెడతెగక భగవన్నామమును జేయుచుండినయెడల వానిఁ దనయెదుటికిఁ దీసికొనివచ్చునటుల నాజ్ఞాపించి, తగినభటుల నియమింపుఁడని యుత్తరవు చేసెను ఆలాగుననే యామంత్రులును దగిన భటులనేర్పఱచి నియమించిరి. ఆభటులా పట్టణమంతటను వెదకఁగా నీవేషధారుఁడు వారలకుఁ గనఁబడుటచే వీనిని వెంబడించి తిఱుఁగుచు, వాఁడెక్కడికిఁబోయిన నక్కడికిఁ బ్రచ్ఛన్నముఁగా బోవుచు గనిపెట్టుచుండిరి. వీరలు తన్ను గనిపెట్టి తిఱుగుచుండెడు సంగతి సడిగట్టినవాఁడై యాదొంగ దన మనోరథము సిద్ధించు ననియెడు నమ్మకముతో నొక తీక్ష్ణమైన నేమఱక భగవన్నామముఁ జేయుచుండెను. ఇట్లు సేయుచు రాఁగ రాఁగ నభ్యాసవశమున నాభగవన్నామమందలి నిజమైనరుచిగలిగి వానికి మొదటిదురుద్దేశ్యము క్రమక్రమముగ నశించి భగవద్భక్తియు విషయములయందలి విరక్తియు, నానాటహెచ్చుచు వచ్చెను. ఇట్లుండగా, నాఱుమాసములు కాఁగానే వానినిఁ గనిపెట్టుచుండిన భటులువచ్చి వానిని రాజసభకుఁ దోడ్కొనిపోయిరి. అప్పుడు రాజు, భటులవలన వాని సవిస్తారమును విని

వాని నాలోచింపక దుర్గుణములను, నస్థిరత్వమును, గుఱించియే యాలోచింపుచు వచ్చినయెడల, వానియం దట్టివానిమనస్సు తగులము నొందనేరదు ఒకవేళ మొదట నట్టి విషయములయందు వానిమనస్సు తగులము నొందినను, నావిషయముల యందలి హేయగుణములను బలుమాఱు స్మరించుటచే వానియం దసహ్యత గలిగి యా తగులము విడిచిపోవును. అయినను, వాని యింద్రియము లప్పుడప్పుడు మరల దుర్విషయములయందుఁ బ్రవర్తింపఁ దొడఁగుచునే యుండును; అట్లుగాకుండు టకుఁగా యోగాభ్యాసియగువాఁడు తన చిత్తమును భగవంతునియందుఁ జేర్చి, అనఁగా నోయి యర్జునా! భగవంతుఁడనఁగా నెవరనుకొన్నావో ఈ భూభార హరణార్థమై యవతరించిన నేనేసుమా! గాన యోగాభ్యాసియగువాఁడు తన చిత్త మును నాయందుఁజేర్చి, గట్టిగా నన్నే యాశ్రయించి యుండినయెడల నప్పుడాతని చిత్తము నాయింద్రియములు తప్పుమార్గమునకుఁ ద్రిప్పఁజాలక నిల్చిపోవును. అదెట్ల నఁగా నిదివఱకు మనసు బండివంటిదనియు, నింద్రియములు గుఱ్ఱములవంటి వనియు, వెనుక నీడ్చిపట్టువాఁడు యోగివంటివాఁడనియు, నట్లీడ్చిపట్టుచుండఁగా నాగుఱ్ఱములు కష్టముతోనైనను లాగుచుండుననియుఁ జెప్పియుంటిని గదా, అట్లు వెనుక నీడ్చిపట్టు నంతవఱకు నాబండిని నాగుఱ్ఱములు కష్టతరముగానైనను లాగుచునే యుండునుగదా! అయితే, ఆబండిని వెనుక మనుష్యుఁడీడ్చిపట్టుటకు బదులుగా గట్టిత్రాటితో నొక వృక్షమునకు గట్టివేసినయెడల నప్పుడును నాబండి నాగుఱ్ఱములు లాఁగఁ గలుగునా?

అర్జు — అట్లు కట్టివేసినపిమ్మట నాబండిని లాఁగుట కాగుఱ్ఱములెంత బలము గలవైనను బొత్తిగా సాధ్యపడక నిల్చిపోవును.

కృ — అవునుగదా, అదేతీరుగా యోగాభ్యాసకుఁడు తనచిత్తమనెడు బండిని నేననెడు వృక్షమునకుఁ గట్టివేసినయెడలఁ అనఁగాఁ దనచిత్తమును నాయందుఁ జేర్చిన యెడల, అనఁగాఁ దనదృష్టిని నాయందేనిలిపి నాగుణానుభవమునే చేయుచు, సదా నన్నే ధ్యానింపుచు, నితర విషయములనొల్లని వానియొక్క యింద్రియములు విషయ ములయందుఁ బ్రవర్తింపనేరవు. ఇందున కనుగుణ్యముగ నొక కథగలదు — అదెట్ల నఁగా; ఒకపట్టణమునం దొక చోరుఁడుగలడు. వాఁడొకనాటిరాత్రి యాపట్టణ మేలెడు రాజుయొక్క శయ్యాగృహమునందు రహస్యముగఁ బ్రవేశించి రాజును భార్య యు గాఢనిద్రఁజెందెడు సమయమున వారిరువురు ధరించియుండు నాభరణములను దస్కరింపఁదలఁచి యందునకుఁదగిన సమయమును వేఁచియుండెను. అట్లుండఁగా, వారిరువురు శయ్యాసీనులై యిష్టాలాపము లాడుకొనుచుండు సమయమున యుక్త వయస్సు వచ్చియుండెడు తమకొమార్తెకుఁదగిన వరుని నిర్ణయించు విషయమైన

సంభాషణ జరుగుచుండెను. ఆసమయమందారాజు తన కొమార్తెను నొక భాగవతోత్తమునకు, అనఁగా సదా భగవన్నామముఁ జేయుచుండెడు వానికి వాని కులగోత్రములెట్టివైనను విచారింపక యిచ్చి పెండ్లిచేసి, వానికిఁ దనరాజ్యములో నర్ధరాజ్యమివ్వఁదలఁచియున్నట్లు దృఢముగాఁ జెప్పెను. ఇది వినిన తోడనే యాచోరుఁడు తానప్పు డుద్దేశించియుండిన చోరకృత్యమును జేసినయెడల నది నిర్విఘ్నముగా నెఱవేఱినను, కొద్దిఫలమే లభించుననియు, నొకవేళ గ్రహచారము చాలక పట్టుపడినయెడల గొప్ప రాజదండనకు బాత్రుఁడు గావలసివచ్చు ననియు, నిట్టి సందిగ్ధమగు కార్యమును జేయుటకంటెఁ గొంత కాలము వఱకు భగవద్భక్తుని వేషముధరించి సదా భగవద్గుణానుభవమును జేయుచుండిన యెడలఁ దనకు రాజకుమార్తెయు, నర్ధరాజ్యమును లభించునని యెంచి యాప్రకారము సేయ నిశ్చయించినవాఁడై తానేరీతిగాఁ బ్రవేశించెనో యారీతిగానే రహస్యముగా బయిటకు వెళ్ళిపోయినవాఁడై మఱునాఁడు మొదలుకొని యరుణోదయముననే నదికిఁబోయి స్నానముచేసికొని ద్వాదశోర్ధ్వపుండ్రములు మొదలగు భగవద్భక్తుని చిహ్నములధరించి, సర్వకాల సర్వావస్థలయందును భగవన్నామమునే జపించుచుండెను. ఇది యిట్లుండఁగా నచట రాజగృహమందారాజు మఱునాటి యుదయమున నిదురలేచి కాలోచిత కృత్యములు దీర్చుకొని యాస్థానమంటపమునఁ గూరుచున్నప్పుడు తనమంత్రులంజూచి తనకొమార్తెయొక్క వరనిర్ణయమును గుఱించి తన మనోనిశ్చయమును దెలిపినవాఁడై యట్టిపురుషుఁడెచ్చటనైనఁ గనఁబడినయెడల వానిని నాఱుమాసముల వఱకుఁ కనిపెట్టి యుండి యంతవఱకు నెడతెగక భగవన్నామమును జేయుచుండినయెడల వానిఁ దనయెదుటికిఁ దీసికొనివచ్చునటుల నాజ్ఞాపించి, తగినభటుల నియమింపుఁడని యుత్తరవు చేసెను ఆలాగుననే యామంత్రులును దగిన భటులనేర్పఱచి నియమించిరి. అభటులా పట్టణమంతటను వెదుకఁగా నీవేషధారుఁడు వారలకుఁ గనఁబడుటచే వీనిని వెంబడించి తిఱుఁగుచు, వాఁడెక్కడికిఁబోయిన నక్కడికిఁ బ్రచ్ఛన్నముఁగా బోవుచు గనిపెట్టుచుండిరి. వీరలు తన్నుగనిపెట్టి తిఱుగుచుండెడు సంగతి సడిగట్టినవాఁడై యాదొంగ దన మనోరథము సిద్ధించు ననియెడు నమ్మకముతో నొక క్షణమైన నేమఱక భగవన్నామముఁ జేయుచుండెను. ఇట్లు సేయుచు రాఁగ రాఁగ నభ్యాసవశమున నాభగవన్నామమందలి నిజమైనరుచిగలిగి వానికి మొదటిదురుద్దేశ్యము క్రమక్రమముగ నశించి భగవద్భక్తియు విషయములయందలి విరక్తియు, నానాట హెచ్చుచు వచ్చెను. ఇట్లుండగా, నాఱుమాసములు కాఁగానే వానినిఁ గనిపెట్టుచుండిన భటులువచ్చి వానిని రాజసభకుఁ దోడ్కొనిపోయిరి. అప్పుడు రాజు, భటులవలన వాని సవిస్తారమును విని

యుఁడే. తన యుద్దేశ్యప్రకారము తనకుమార్తెకుఁ దగినవరుఁడని నిశ్చయించి తన కూఁతును బాణిగ్రహణముఁ జేయవలయుననియు, దనయర్ధరాజ్యము నంగీకరింపవలయు ననియుఁ బ్రార్థించెను. అయితే, అతఁడదివఱకే యభ్యాసవశమున భగవద్విషయము నందలి చవిగన్నవాఁడగుటచే, మొదటి దురుద్దేశ్యము నశించి విషయవాంఛ బొత్తిగా విడిచినవాఁడై యుండుటంబట్టి యారాజు చెప్పిన మాటలయం దసహ్యము కలిగిన వాఁడై యతని ప్రార్థన నంగీకరింపనొల్లక చివాలునలేచి వెళ్ళిపోయెను కావున,

" క. ఆచూపు మరిగి చిత్తం
బేచవికింజొరదు చొచ్చెనేని మరలుపం
గోచర మగు వెలిచవులం
బాచిన లోచవిన నిలిచి పరమాత్మఁ గనున్. " (భార. శాంతి. ౪. ౩౦౪)

అనునట్లు భగవద్గుణానుభవమునందు రుచిమరగి తదేకనిష్ఠుఁడై యాత్మావలోకనముఁ జేయుచుండు వానికైహిక విషయములయందు రుచికనఁబడనేరదు. అనఁగా మనస్సుచొరనేరదు. ఒకవేళ నేదైన నొకవిషయమునం దట్టివాని మనస్సు చొచ్చినను దానిని వెంటనే మరలించుకొనగలఁడు గానఁబై జెప్పినరీతిగా నెవఁడైనఁ దన చిత్తమును సదా భగవద్విషయమున నలవఱచుచు వచ్చినయెడల వానికిఁ గ్రమక్రమముగ నింద్రియములు వశపడఁగలవు. అట్లన్నియింద్రియము లెప్పుడు చక్కఁగా వశపడుచున్నవో యప్పుడు స్థిరమైన జ్ఞానము గలవాఁడగును.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస స్సఙ్గస్తేషూపజాయతే ।
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥ 62

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహా త్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ 63

అర్థము :— విషయాన్ = (ఇంద్రియ) విషయములను, ధ్యాయతః = చింతించుచున్న, పుంసః పురుషునకు, తేషు = ఆవిషయములయందు, సఙ్గ = ఆసక్తి, ఉపజాయతే = పుట్టుచున్నది. సఙ్గా = ఆసక్తివలన, కామః = కోరిక. సంజాయతే = పుట్టుచున్నది. కామాత్ = కోరికవలన, క్రోధః = కోపము, అభిజాయతే = పుట్టుచున్నది, క్రోధాత్ = కోపమువలన, సమ్మోహః = అవివేకము (యుక్తాయుక్తవివేచనము లేకుండుట.) భవతి = అగుచున్నది, సమ్మోహాత్ = అవివేకమువలన, స్మృతిభ్రంశః = మతిమఱపు, (భవతి) = అగుచున్నది, స్మృతిభ్రంశాత్ = మతిమ

ఱపువలన, బుద్ధినాశః = తెలివిహీనత, (భవతి) = అగుచున్నది, బుద్ధినాశాత్ = తెలివిహీనతవలన, ప్రణశ్యతి = నశించుచున్నాఁడు.

అట్లుగాక యెవఁడేని యింద్రియవిషయములయందే మనస్సును బ్రవర్తింప నిచ్చినయెడల నట్టివానికిఁ గలిగెడు గతి యేమనఁగా నట్లు విషయములయందు మనస్సెప్పుడు ప్రవర్తింపుచున్నదో, అనఁగా, నావిషయములను మనస్సునెప్పుడు స్మరించుచున్నాఁడో, యప్పుడే

“క. విషయంబులు నశ్వరములు
విషసన్నిభములు సమగ్రవికృతిజనకముల్
ధిషణాగుణములనెల్లఁ గ
లుషములుగాఁ జేయు మోహలోభకరములై” భార. అశ్వ. ౧. ౧౩౯

అనునట్లు, విషయములు నశించునవియును, విషతుల్యములును, మనోవికారములనుబుట్టించి యందువలన బుద్ధిని జెఱపఁగొట్టునవియుఁ గనుక వానియందు (సంగము) ఆసక్తి, అనఁగా, నావిషయములు మంచివౌనా, కావా, తనకుపయోగించునట్టివి యౌనా, కావా, అనునీమొదలగు గుణాగుణములను గుఱించిన పర్యాలోచన గలుగును. అట్టి పర్యాలోచన యెప్పుడుగలుగుచున్నదో, యప్పుడావిషయములు దన కుపయోగించునవి యని తోఁచినయెడల వానియందు (కామము) అనఁగా వానిని లభింపఁజేసికొనవలెననెడు కోరిక పుట్టును. అట్టికోరిక యెప్పుడు పుట్టుచున్నదో యప్పుడా కోరికప్రకార మావిషయము తనకు సిద్ధించినయెడల సరే, లేనియెడల నట్టిసిద్ధికి నంతరాయములుగా నుండువిషయములయెడల (క్రోధము) అనఁగాఁగోపము గలుగును. కోప మెప్పుడుత్పన్నమగుచున్నదో యప్పుడేవిధమునైన నావిషయమును లభింపఁజేసికొనవలయుననెడు పట్టుదలగలుగును. అట్టి పట్టుదల యెప్పుడుగలుగుచున్నదో యప్పుడు (సమ్మోహము) అనఁగాన వివేకము, అనఁగా (అందుకుఁగానుపయోగించెడు సాధనములు యుక్తములైనవా లేక యయుక్తములైనవా యని యోచించుట కవకాశములేకుండుట) కలుగును. అట్టి యవివేక మెప్పుడు కలుగుచున్నదో, యప్పుడు (స్మృతిభ్రంశము) అనఁగా మతిమఱపు, అనఁగా (అదివఱకు శృతిస్మృతిపురాణేతిహాసములఁ జదువుటవలననేమి, ఆచార్యోపదేశమువలననేమి, తెలిసికొనియుండు సద్విషయములను మఱచుట) కలుగును. అట్టిమఱ పెప్పుడు గలుగుచున్నదో యప్పుడే వానికి, (బుద్ధినాశము) గలుగును. అనఁగా తెలివిహీనుఁడగుచున్నాఁడు. అట్లు తెలివిహీనుఁ డెప్పుడగుచున్నాఁడో, యప్పుడు వాఁడు నశించును. అనఁగా, నిహమునకును బరమునకును, జెడినవాఁడగును. అనఁగా నిహమునందు రాజదండన, అపయశస్సు,

మొదలగువానికిని, పరమునందు నరకమునకును, బాత్రుఁడగుననుట. కాన నోయి యర్జునా! ఎవఁడైతే విషయములయం దింద్రియములు ప్రవర్తించునపుడు తనమనస్సు నావిషయముల యందాసతో నిలుపుచున్నాఁడో. యట్టివాని కిట్టి మర్గుణములన్నియు నొకదానిననుసరించి మఱియొకటి కలుగక మానవు. ఈవిషయము నీమనస్సునకుఁ జక్కఁగ బోధపడున ట్లందున కొకదృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఇద్దఱు నొకమార్గమునఁ బోవుచుండఁగా వారికెదుట సౌందర్యవతియగు నొక స్త్రీకనబడు చున్నది. దాని నుభయులును జూచుచున్నారు. వారిలో నొకఁడు వివేకియు, మఱి యొకఁ డవివేకియునై యుండుటచే, వివేకియగువాఁడా స్త్రీని జూచినవెంటనే, దాని రూపలావణ్యాతిశయములను గురించి గమనింపక యది పర స్త్రీకనుక దానిదృష్టించి చూచుట తనకు సరిగాదని యెంచి దృష్టిని మళ్లించుకొని తనదారిని దాను వెళ్ళిపోవు చున్నాఁడు. అవివేకియగు రెండవవాఁడట్లు చేయక యా స్త్రీనిజూచినవెంటనే దాని రూపలావణ్యాతిశయములనుగుఱించి తనమనస్సులో వర్ణించుకొనుచు, అనఁగా, ఆహా యిది యెంత చక్కని స్త్రీగానున్నది. దీనిముఖమెంత సుందరముగనున్నది. దీని కుచములెంత వర్తులములైయున్నవి, నడుమెంత సన్నగనున్నది, పిఱుఁదులెంత గొప్ప లుగనున్నవి. అని దాని యంగసౌష్ఠవమును గుఱించి తనమస్సులో వర్ణించుకొనుచు దృష్టించి చూచుచున్నాఁడు. ఇట్లు చూచుటచే వాఁ డాసక్తితోఁ జూచుచున్నవాఁ డగుచున్నాఁడు; ఇట్టియాసక్తితో నెప్పుడుచూచుచున్నాఁడో యప్పుడే యా స్త్రీని దానుపొందవలెననియెడు కోరికగలుగుట సహజముగదా? అట్టికోరిక గలిగినవెంటనే దానికి దన యభీష్టమును దెలుపుచున్నాఁడు. అందున కాపె యొప్పికొనిన సరే, లేనియెడల దానియందు వానికి గోపముగలుచున్నది. ఆకోపము గలిగినవెంటనే యాబిడ నేవిధముననైన వశపరచుకొనవలెననెడు పట్టుదలగలుగుచున్నది. అట్టి పట్టుదల యెప్పుడుకలిగెనో, యప్పు డిది చేయవచ్చునా, చేయఁగూడదా, యనెడు యుక్తా యుక్తవివేచనలేనివాఁడై, దానిని చెయిపట్టిలాఁగుచున్నాఁడు. అట్లు లాఁగునపుడు వాఁ డదివరకుఁ దా ననేక గ్రంథములు చదువుటవలననేమి, గురూపదేశమువలననేమి పర స్త్రీ గమనము పాపకార్యమని తెలిసికొనియుండిన సంగతిని మఱచినవాఁ డగు చున్నాఁడు. అట్టి మఱచుటయే యిట్టి బుద్ధిహీనపుకార్యముఁ జేయుటకుఁ గారణముగ నేర్పడుచున్నది. ఇట్టి బుద్ధిహీనపుకార్యమెప్పుడు చేసెనో, అప్పుడే యా స్త్రీ యఱ చుటమొదలగు నల్లరి జరిగించుచున్నది. అందుపై నిరుగుపొరుగు వారలందఱుగూడి వానినిఁబట్టుకొని వానికి రాజదండనఁ గలుగఁజేయుచున్నారు. అందువలన వానికీ లోకమునఁ బ్రతికియుండునంతవఱకు నవమానమును, జచ్చినపిమ్మటఁ బరలోకమున

నరకబాధయు గలుగుచున్నవి. ఇశ్లోకక్కిన యింద్రియవిషయములను గుఱించియు నుదాహరణము లూహింపఁదగియుంచున్నవి. కాన విషయములయందు మనస్సును నాసక్తితో బ్రవర్తింపఁ జేయువాని కిట్టి చెడుగులు సంభవింపఁదగియుంచున్నవి.

శ్లో॥ రాగద్వేషనియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥ 64

అర్థము :— విధేయాత్మా + తు = మనస్సును స్వాధీనమందుంచుకొన్నవాఁడైనచో, ఆత్మవశ్యైః = తనకు వశవర్తులుగానుండునట్టియు, రాగద్వేషవియుక్తైః = రాగద్వేషాదులులేనట్టియునైన, ఇన్ద్రియైః=ఇంద్రియములచేత, విషయాన్=విషయములను, చరన్ +(అపి)=అనుభవించుచున్నవాఁడైనను, ప్రసాదమ్=చిత్తశాంతిని, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు.

అట్లుగాక, యెవఁడైతే తన మనస్సును స్వాధీనమం దుంచుకొనుచున్నాఁడో, వానికి నింద్రియములును స్వాధీనములుగానే యుంచున్నవి. కనుకనట్టివాని యింద్రియములు విషయములయందుఁ బ్రవర్తింపుచున్నను, వానివలన రాగద్వేషాదులు జనింపవు. రాగద్వేషము లెప్పుడు లేకపోయినవో యప్పుడు,

"క. కోరికయు నొల్లమియు లే
కేరూపున భూతములకు నెగ్గు తెలఁగుం
జేరక యకామవృత్తి ద
పోరతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపించున్." (భార. శాంతి. ౬. ౨౧౭)

అనునట్లు, వానికిఁ జిత్తశాంతి గలుగుచున్నది. అనఁగా, వాని మనస్సు నెమ్మదిగా నుంచున్నది. అదెట్లనఁగా నింతకుముందు మనస్సును స్వాధీనమందుంచుకొనక యింద్రియములవెంబడిఁ బోనిచ్చిన యవివేకియొక్క దృష్టికి నొకసౌందర్యవతి గోచరించినపుడు జరుగఁదగు చర్యనుగుఱించి చెప్పితినిగదా! ఇపుడట్టిస్త్రీయే యింద్రియములను స్వాధీనమం దుంచుకొనియుండెడు వివేకియగువాని దృష్టికగపడుచున్నదని యెంచికొనుము. అప్పుడు వాఁడేమి సేయుననఁగా, అట్టి స్త్రీని జూచిన వెంటనే దానియంగసౌష్ఠవము తన మనస్సునకు గోచరించినను, ఆమె పరస్త్రీయగుటచే దాని సౌందర్యాదులు తన మనస్సున స్మరించుట సరిగాదనియెంచి యాబిడనుండి తనదృష్టిని మఱలించుకొనును. లేదా యామెను చూచుచుండినను, నాబిడయందుఁ దన మనస్సును దగులనీక భద్రముగనుంచుకొనును. అట్లెప్పుడు చేయుచున్నాడోయప్పుడు, ఇదివఱకుఁజెప్పఁబడిన యవివేకివలె నా స్త్రీయెడలఁ గామోద్రే

కము గలుగకుండును. కామోద్రేక మెప్పుడు లేకపోయెనో యప్పుడు తక్కిన దుర్గుణములగు క్రోధాదు లెవ్వియుఁ దలసూపుటకుఁ గారణము లేకపోవును. ఇట్టి మనోవికారము లెప్పుడు కలుగకుండునో యప్పుడు

"క. వినఁజూడం బడునంటె
ల్లను సమతం బరముఁ గనుచు లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాదిద్వం
ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁగమన్."
(భార. శాంతి. ౬ – ౨౦౫)

"తే. గీ. వినుమొకరహస్య మెఱిఁగింతు వేయునేల
యేమహాప్రాజ్ఞునకుమాన సేంద్రియములు
పంచినట్లాత్మలోనిల్చి పనులు సేయు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుడగు బుధేంద్ర" (సీ. రా. 3. ఆ.)

అనునట్లు, వానిమనస్సు నెమ్మదిగలదిగానుండును, అనఁగా చిత్తశాంతి గలుగుచున్నది.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ 65

అర్థము :— ప్రసాదే + (సతి) = చిత్తశాంతిగలుగుచుండఁగా, అస్య = ఈ(చిత్తశాంతిగలవానికి), సర్వదుఃఖామ్ = సమస్తదుఃఖములయొక్క, హానిః = నాశము, ఉపజాయతే = కలుగుచున్నది, ప్రసన్నచేతసః = స్వాస్థచిత్తముగలవానికి, ఆశు = శీఘ్రముగా, బుద్ధిః = మతి, పర్యవతిష్ఠతి + హి = నిలకడగానుంచున్నదిగదా.

అట్టి చిత్తశాంతిగలిగినవానికి సమస్తదుఃఖములు నశించును. దుఃఖము లెప్పుడు లేకపోవుచున్నవో, యప్పుడు వెంటనే వానిజ్ఞానము స్థిరమైనదగుచున్నది. చిత్తశాంతి గలవానికి దుఃఖము లెట్లు నశించుననఁగా, నట్టివాఁడైహికసుఖములయం దాసక్తచిత్తుఁడై యుండఁడుగాన నతఁడా సుఖములననుభవించు నప్పుడానందించుటయు, వాసుఖములు తొలఁగినప్పుడు దుఃఖించుటయు నుండనేరదు. అదెట్లనఁగా :—

"తే. గీ. అర్థవంతుఁడై భోగంబు లనుభవించు
చున్నయప్పుడ యిది యిట్టు లుండ నేర
దస్థిరము తాను లోనుగా ననియెఱుంగు
నతఁడు దుఃఖంబొందఁడేదియైన నధిప! (భార. శాంతి. 3–౨౭.)

క. జననీజనకులును సుహృ
జ్జనులును జెగునపుడుగావఁ జనమి తెలియజే
ధనములు వారలకంటెక్
మనుజేశ్వర ! వగపుహాని మగిడించునొకో. (భార.శాంతి. 3-౭౯.)

క. వెరవును లావును గలిగిన
పురుషులు లేరెట్లులోక మెవ్వరికిన్
సిరిశాశ్వతంబెయనివగఁ
బొరయుఁడు ధీరుండు గలిమి పోకకు నధిపా !

క. సారపుసిరి చేటునరుఁడు
గోరకయేవచ్చునట్ల గోరకయుండన్
శ్రీరాక గలుగు దైవము
కారుణ్యముగలిగెనేని గాఢవివేకా !

క. సిరివిడుచును బురుషుని విను
పురుషుఁడు సిరిఁదొలఁగు నిదియపూర్వమె ఫలమూ
లరతుండై వాజ్నియతిం
బొరసియునికి యట్టిపోటఁ బురుషన కమరున్. (భార.శాంతి.3అ.3౧-33)

అనునట్లు, చిత్తశాంతిగలవాఁడు సమస్తభోగముల ననుభవింపుచుండియు, నాభోగ ములు శాశ్వతములుగావనియు, తల్లిదండ్రులు మొదలగు బంధుజనులును, మిత్రులును, గతించిపోవునపుడు వారలనుగురించి దుఃఖించి ప్రయోజనములేనపుడు, ధనములను గుఱించిమాత్రము దుఃఖించియుఁ బ్రయోజనమేమనియు, నీలోకమునఁ దనకంటె నధికులగువారి యైశ్వర్యమే శాశ్వతముగాకుండినపుడు తన యైశ్వర్యమెట్లునిల్చు ననియు, నీలోకమున నైశ్వర్యముఁ గోరకయేకలుగుటయు, గోరకయేపోవుటయు, సాధారణముగ దైవానుగ్రహ నిగ్రహములవలనఁ గలుగుచున్నవని దనమనస్సున నిశ్చయించుకొన్నవాఁడై,

"క. గతమునకును వగవక యా
గతమునకును నోరుజెఱచి కడుగోరక దీ
నతఁబొందక దైవంబే
గతిఁబంచిన దానఁబొదు గాకనఘలయున్॥" (భార. శాంతి. 3.అ.3౦.)

అనునట్లు, గతించిపోయిన మేలునుగుఱించి దుఃఖింపకయు, రాబోయెడు మేలునుగుఱించి యెదురుచూడకయు, దైవమెప్పుడేది సంఘటింపఁజేసిన నదియే

కము గలుగకుండును. కామోద్రేక మెప్పుడు లేకపోయెనో యప్పుడు తక్కిన దుర్గుణములగు క్రోధాదు లెవ్వియుఁ దలసూపుటకుఁ గారణము లేకపోవును. ఇట్టి మనోవికారము లెప్పుడు కలుగకుండునో యప్పుడు

"క. వినఁజూడఁ బడునం దె
ల్లను సమతం బరముఁ గనుచు లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాదిద్వం
ద్వనిరూఢుండు గాక యున్నతఁడు ముక్తిఁగనున్."
(భార. శాంతి. ౬ - ౨౦౫)

"తే. గీ. వినుమొకరహస్య మెఱిఁగింతు వేయునేల
యేమహాప్రాజ్ఞ నకుమాన సేంద్రియములు
పంచినట్లాత్మలోనిల్చి పనులు సేయు
నాతఁ డాత్మస్థితప్రజ్ఞుడగు బుధేంద్ర" (సీ. రా. 3. అ.)

అనునట్లు, వానిమనస్సు నెమ్మదిగలదిగానుండును, అనఁగా జిత్తశాంతి గలుగుచున్నది.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ 65

అర్థము :— ప్రసాదే + (సతి) = చిత్తశాంతిగలుగుచుండఁగా, అస్య = ఈ(చిత్తశాంతిగలవానికి), సర్వదుఃఖామ్ = సమస్తదుఃఖములయొక్క, హానిః = నాశము, ఉపజాయతే = కలుగుచున్నది, ప్రసన్నచేతసః = స్వస్థచిత్తముగలవానికి, ఆశు = శీఘ్రముగా, బుద్ధిః = మతి, పర్యవతిష్ఠతి + హి = నిలకడగానుంచున్నదిగదా.

అట్టి చిత్తశాంతిగలిగినవానికి సమస్తదుఃఖములు నశించును. దుఃఖము లెప్పుడు లేకపోవుచున్నవో, యప్పుడు వెంటనే వానిజ్ఞానము స్థిరమైనదగుచున్నది. చిత్తశాంతి గలవానికి దుఃఖము లెట్లు నశించుననఁగా, నట్టివాఁడైహికసుఖములయం దాసక్తచిత్తుఁడై యుండఁడుగాన నతఁడా సుఖములననుభవించు నప్పుడానందించుటయు, నాసుఖములు తొలఁగినప్పుడు దుఃఖించుటయు నుండనేరదు. అదెట్లనఁగా :—

"తే. గీ. అర్థవంతుఁడై భోగంబు లనుభవించు
చున్నయప్పుడ యిది యిట్లు లుండనేర
దస్థిరము తాను లోనుగా ననియెఱుంగు
నతఁడు వగఁబొందఁడేదియో ల్లైన నధిప! (భార.శాంతి. 3—౨౭.)

క. జననీజనకులును సుహృ
జ్జనులును జెగునపుడుగావఁ జనమి తెలియదే
ధనములు వారలకంటెఁ
మనుజేశ్వర! వగపువాని మగిడించునొకో. (భార.శాంతి. 3-౭౯.)

క. వెరవును లావును గలిగిన
పురుషులు లేరెట్లులోక సెవ్వరికిన్
సిరిశాశ్వతంబెయనివగఁ
బొరయుఁడు ధీరుండు గలిమి పోకకు నధిపా!

క. సారపుసిరి చేటునరుఁడు
గోరకయేవచ్చునట్లు గోరకయుండన్
శ్రీరాక గలుగు దైవము
కారుణ్యముగలిగెనేని గాఢవివేకా!

క. సిరివిడుచును బురుషుని విను
పురుషుఁడు సిరిఁదొలఁగు నిదియపూర్వమె ఫలమా
లరతుండై వాజ్ఞియతిం
బొరసియునికి యట్టిపోటఁ బురుషన కమరున్. (భార.శాంతి.3అ.30-33)

అనునట్లు, చిత్తశాంతిగలవాఁడు సమస్తభోగముల ననుభవింపుచుండియు, నాభోగములు శాశ్వతములుగావనియు, తల్లిదండ్రులు మొదలగు బంధుజనులును, మిత్రులును, గతించిపోవునపుడు వారలనుగురించి దుఃఖించి ప్రయోజనములేనపుడు, ధనములను గుఱించిమాత్రము దుఃఖించియుఁ బ్రయోజనమేమనియు, నీలోకమునఁ దనకంటె నధికులగువారి యైశ్వర్యమే శాశ్వతముగాకుండినపుడు తన యైశ్వర్యమెట్లునిల్చుననియు, నీలోకమున నైశ్వర్యముఁ గోరకయేకలుగుటయు, గోరకయేపోవుటయు, సాధారణముగ దైవానుగ్రహ నిగ్రహములవలనఁ గలుగుచున్నవని దనమనస్సున నిశ్చయించుకొన్నవాఁడై,

"క. గతమునకును వగవక యా
గతమునకును నోరుజెఱచి కడుగోరక దీ
నతఁబొందక దైవంబే
గతిఁబంచిన దానఁబోదు గాకనవలయున్॥" (భార. శాంతి. 3.అ.30.)

అనునట్లు, గతించిపోయిన మేలునుగుఱించి దుఃఖింపకయు, రాబోయెడు మేలునుగుఱించి యెదురుచూడకయు, దైవమెప్పుడేది సంఘటింపఁజేసిన నదియే

తనకు మేలనియెంచి నిశ్చింతుఁడై యుండును. అట్లుగాక యొకవేళ నట్టివానికి సంభవించెడు నాపదవలన నేదైన కొంతదుఃఖము గలిగినను, నాదుఃఖము విశేషకాల ముండనేరదు. అదెట్లనఁగా,

"క. కలఁగిన పెద్దమడుగు విను
తెలివిఁ బొరయునట్లు దానధీరుండయి య
గ్గలములయిన దురితంబులఁ
గలఁగియు, దనయంతఁదేఱు గౌరవ మొప్పన్ ॥" (భార.శాంతి. 3ఆ3౪.)

అనునట్లు, విశేషజలముగల పెద్దమడుఁగులోని యుదకమేదైన నొక కారణముచేఁ గలఁకఁబాఱినను, దత్క్షణమే యాయుదకము మరలఁ దేఱినిర్మలముగ నెట్లగునో యట్లే, శాంతిచిత్తుఁడగు వానిమనస్సును నేదైన యొక గొప్పయాపదచే దుఃఖమును జెందినను, నాదుఃఖము వెంటనే తనంతటనే యుపశమించును. దీర్ఘకాల ముండనేరదు.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్॥ 66

అర్థము :— అయుక్తస్య = మనోనిగ్రహము లేనివానికి, బుద్ధిః = వివేకము, న + అస్తి = లేదు, అయుక్తస్య = మనోనిగ్రహము లేనివానికి, భావనా + చ = ఆవాసనసైతము (ఇది వివేక మిది యవివేక మని తెలిసికొనఁదగిన శక్తిసయితము,) న = లేదు. అభావయతః = అట్టి వాసనసయితము లేనివానికి, శాన్తిః + చ = చిత్తశాంతియు (విషయవాంఛానివృత్తియును,) న = లేదు. అశాన్తస్య = విషయవాంఛను విడువనివానికి, సుఖమ్ = మనస్సౌఖ్యము, కుతః = ఎక్కడిది? (ఎట్లు కలుగును?)

చిత్తశాంతిగలవాని లక్షణమిట్లుండఁగా నిఁకనట్టి చిత్తశాంతిలేని వానిలక్షణ మెట్టిదని యడిగితివేని చెప్పెదవినుము. అట్టి చిత్తశాంతి లేనివాఁడింద్రియ నిగ్రహముఁ జేయఁజాలఁడు ; అట్లింద్రియ నిగ్రహ మెప్పుడు చేయలేక పోవుచున్నాఁడో యప్పుడు వానిబుద్ధి యుక్తాయుక్త వివేచనచేయఁజాలదు ; అట్టియుక్తాయుక్తపరిజ్ఞాన మెప్పుడు లేకపోవుచున్నదో యప్పుడువానికి విషయవాంఛా నివృత్తి గలుగనేరదు అనఁగా వానిమనస్సు విషయములయందే ప్రవర్తించు చుండును. అట్లు విషయములయందుఁ బ్రవర్తించుచుండెడు మనస్సు గలవానికి సుఖమెట్లుగలుగును? అనఁగాఁ గలుగనేరదనుట.

శ్లో॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥ 67

అర్థము :— హి=ఏలయనఁగాఁ (పైశ్లోకమునఁ జెప్పఁబడిన ప్రకారము మనోనిగ్రహములేనివానికి సుఖము కలుగకపోవుటకుఁ గారణమేమనఁగా,) చరతామ్=(విషయములయందు) ప్రవర్తింపుచున్న, ఇన్ద్రియాణామ్ = ఇంద్రియములలో, యత్=ఏ(యింద్రియమును) మనః=మనస్సు, అనువిధీయతే=అనుసరించి ప్రవర్తించుచున్నదో, తత్=అ(యింద్రియము), అస్య=ఈ(మనోనిగ్రహము లేనివానియొక్క), ప్రజ్ఞామ్=వివేకమును, వాయుః=గాలి (తప్పుగాలి), అంభసి=ఉదకమునందు (తేలుచుండెడు), నావమ్+ఇవ=ఓడనువలె, హరతి=హరించుచున్నది. (తప్పుదారికి లాఁగుచున్నది).

ఏలయనఁగా, నెవఁడైన తనమనస్సును జంచలములగు నింద్రియములలో దేని వెంటనైనఁబోనిచ్చినయెడల, అనఁగా నేయింద్రియమైన దాని విషయమునఁదు బ్రవర్తించునపుడట్టి విషయమున నాసక్తచిత్తుఁడైనయెడల

“ తే. గీ. జ్ఞానవిజ్ఞానయుతుఁడయ్యు సంతతంబు
నాత్మభావనలేకున్న యతనియింద్రి
యంబులు మనంబు తమకు వశంబుఁజేసి
విషయసుఖముల చవిఁజూపి వెతలఁబెట్టు. ” (సి. రా. 3 అ. ౧౬౧)

“ తే.గీ. ఇంద్రియంబులు పమయిచ్చు నిట్టునట్టు
కరిగనేని దుఃఖంబులఁ దెచ్చు నవియు
కట్టుపడి సుఖమొనరించుఁ గాన నాత్మఁ
గావవలయు నింద్రియద్వారగణమువలన. ” (భార. శాం. ౭.౧౩౬)

అనునట్లు యింద్రియము వాని మనస్సును వశపఱచుకొని దాని విషయమునందలి రుచిమఱపి తప్పుమార్గమునకీడ్చును. అదెట్లనఁగా—నీటిమీఁదఁ దేలుచుండెడు నొక యోడ నడుపువాఁడు చుక్కానిచే నాయోడపోవలసిన మార్గమునకుఁ బోవునట్లు త్రిప్పకొనక యుండినయెడల నాయోడను గాలి తప్పుమార్గమున కెట్లీడ్చునో యట్లే పురుషుఁడును దన మనస్సనెడునోడను సన్మార్గమునఁ బ్రవర్తించునట్లు బుద్ధియనెడు చుక్కానిచేఁ ద్రిప్పకొనక యుపేక్షించినయెడల నట్టివాని మనస్సును నింద్రియమనెడు నాయువు తప్పుమార్గమునకుఁ దీయుటకు సందియములేదు.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

అర్థము :— తస్మాత్=అందువలన, హేమహాబాహో=ఓయర్జునా!, యస్య=ఎవనియొక్క, ఇన్ద్రియాణి=ఇంద్రియములు, ఇన్ద్రియార్థేభ్యః = విషయములనుండి, సర్వశః=సమస్తవిధములచేత, నిగృహీతాని=మరలింపఁబడుచున్నవో, తస్య=అతని యొక్క, ప్రజ్ఞా=జ్ఞానము, ప్రతిష్ఠితా=మిక్కిలిస్థిరమైనది.

గాన నోయియర్జునా !

"సీ. అట్లు గావున నింద్రియమనంబుల నజస్ర మాత్మభావనచేత నాఁగఁ బట్టి
యంతర్ముఖములుగా నలరించి యామీఁదఁ గామాది శత్రువర్గము నడంచి
విమలబోధాకార వృత్తిచేఁ గేవల పరిపూర్ణతత్త్వరూపంబుఁ గాంచి
యానందమూర్తియై యఖిలంబుఁ దనయందు సమయించి చిత్త
విశ్రాంతినొంది

తే. గీ. యెఱుకమఱపులఁ బొరయని యెఱుకయైన
పరమపురుషుండు సుస్థిత ప్రజ్ఞుఁడన గు
ణత్రయాతీతుఁడన నమనస్కరాజ
యోగనిద్రాసమేతుఁడై యుండు ననఘ" (సీ. రా. 3 ఆ. ౧౪౨)

అనునట్లు, ఎవఁడైతే తన యింద్రియములను విషయములనుండి మరలించుకొనుచుఁ దనమనస్సును దప్పుమార్గమునఁ బ్రవర్తింపనీక కాపాడుకొనుచున్నాఁడో యట్టివాని జ్ఞానము స్థిరమైనదగుచున్నది. అట్టివాఁడే యోగనిద్రను జెందినవాఁడనఁ బడుచున్నాఁడు.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69

అర్థము :— సర్వభూతానామ్=సమస్తప్రాణులకు (పామరులకు), యా=ఏ (యాత్మానాత్మవివేకము), నిశా = రాత్రియగుచున్నదో (మనోదృష్టికి గోచరింపక యుండునో), తస్యామ్=అట్టి యాత్మానాత్మవివేకమునందు, సంయమీ=ఇంద్రియనిగ్రహుఁడగుయోగి, జాగర్తి = జాగరూకుడైయుండును (ఆత్మాలోకనముఁజేయుచుండును), యస్యామ్=దేనియందు (ఏయింద్రియవ్యాపారమునందు), భూతాని=ప్రాణులు (పామరులు), జాగ్రతి=జాగరూకులగుచున్నారో (విషయాసక్తితోఁబ్రవర్తించుచున్నారో), సా = ఆ (యింద్రియవ్యాపారము), పశ్యతః = ఆత్మావలోకనముఁజేయుచున్న, మునేః=మననశీలునకు, నిశా=రాత్రిగానుండును (రాత్రివలె నుపయోగములేనిదిగ నుండును).

అట్లు యోగనిద్రం జెందిన వానిలక్షణ మెట్టిదనగా :

"ఆ. ఎల్లభూతములకు నెద్ది శర్వరి దాని
యందు మేలుకొనినమహాత్ముడలరు
నఖిలజనము దేనియందు మేల్కనియుండు
నదియె నిశి జితేంద్రియాత్మునకును" (సీ. 3 ఆ. ౧౪౫)

అనునట్లు, ఆత్మానాత్మ విచారమునందుఁ బామరజనులు నిద్రవోయిన వారగు చుండఁగా, యోగియగువాఁడు మేలుకొనియుంచున్నాఁడు, ఇంద్రియవ్యాపారములయందుఁ బామరులు మేలుకొనియుండఁగా, యోగి నిద్రవోయినవాఁడగు చున్నాఁడు. అదెట్లనఁగా, దీనికొకదృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

ఒక గృహమునందుఁ గొందఱు జనులు నివసించుచున్నారు – వారిలో నొక్కఁడుమాత్ర మాత్మానాత్మ వివేకముగల యోగియైయుంచున్నాఁడు, తక్కిన వారలందఱు నట్టియాత్మానాత్మ వివేక శూన్యులై కేవల విషయానుభవమునందే యాసక్తిగలవారై యుంచున్నారని యెంచుకొనుము. అట్టివారలలో జరిగెడి చర్యల భేద మెట్లుండుననఁగా, పామరులుగా నుండెడు వారొకప్పుడు మంచి రుచికరమైన భక్ష్యములు, ఫలములు మొదలగువానిని, దినుచు నానందించుచున్నారు. మఱి యొకప్పుడు స్రక్చందనవనితాది భోగముల ననుభవింపుచున్నారు. మఱియొకప్పుడు కొందఱు చీట్లాడుట, కొందఱు పాచికలాడుట, ఇఁకఁ గొందఱు చదరంగమాడుట, మొదలగువానితోఁ బ్రొద్దుపుచ్చుచున్నారు. ఇంకొకప్పుడు మంచి సంగీత పాఠకుని గానమువినుచు నానందించు చున్నారు. మఱియొకప్పుడు వేశ్యను రప్పించి నాట్యమాడించి చూచి యానందించు చున్నారు. మఱియొకప్పు డందుఁ గొందఱు మద్యపానముఁజేసి సొక్కి సోలుచు నుంచున్నారు. మఱికొందఱు పర స్త్రీగమనము చేయుచుఁ, బరధనము నపహరింపుచుఁ గాలక్షేపముఁ జేయుచున్నారు. ఇట్లు వారందఱనేక విధములుగ విషయానుభవమునం దాసక్తులై ప్రవర్తింపుచుండఁగా, యోగిగానుండెడు నతఁడుమాత్ర మట్టి విషయానుభవములలో దేనియందును నాసక్తిలేనివాఁడై, తక్కిన వారితోఁ జేరక తన దేహయాత్రకుఁ గావలసిన యన్నపానాది నిత్య కృత్యములను మాత్రము జరుపుకొనుచు విషయములలో వారలను గలియక ప్రత్యేకించి యొక విజనస్థలము నందుండి భగవద్ధ్యానముఁ జేసికొనుచున్నాఁడు. ఇట్లుండ, నీయోగియగు వాఁడు, తక్కినవారలం జూచి వీరీ ప్రపంచము మిధ్యయని యెఱుంగరు ; దేహములును, తుచ్ఛములగు నీభోగములును, శాశ్వతములని విఱ్ఱవీఁగుచు భగవద్విముఖులై యనేక దుష్కృత్యములందుఁ బ్రవర్తింపుచు

నజ్ఞానాంధకారమునఁ బడి పారమార్థిక విషయమునఁ గొంచెమైనను జాగ్రతలేక నిద్రపోవువారివలెఁ బ్రజ్ఞలేనివారై యుంచున్నారు గదా యని తలచుచున్నాఁడు. అట్లు తలంచుటచే నట్టి పారమార్థిక విషయమునఁ దాను మాత్రము మేలుకొని, అనఁగా జాగరూకుఁడై యున్నట్లు తలఁచినవాఁ డగుచున్నాఁడుగదా! ఇకను పామరులుగా నుండెడు తక్కిన వారి తన విషయములో నేమనుకొనుచున్నారనఁగా మనమందఱ మిట్లనేక విధములైన భోగముల ననుభవింపుచుండఁగా నితఁడు మాత్రము మనలోఁగలియక ప్రత్యేకముగానుండి యెప్పుడుచూచిన మౌనముగఁ నుంచున్నాఁడు; దీనింబట్టి చూడఁగా, వీనికి స్త్రీలోలత్వము లేకుండుటచే నపుంసకుఁడుగా నుండవచ్చునని కొందఱును, స్రక్చందనాది భోగములయందాసక్తిలేకుండుటచే వీఁడు పిచ్చివాఁడనియు, రుచికరమైన పదార్థములను గోరమిచే వీనికిఁ బేడయు బెల్లము నొకటిగనే యున్నదని కొందఱును, సంగీతము నందభిరుచి లేమిచే వీనికా పొందేమియుఁ దెలియదు 'చెవిటికి శంఖూఁది నట్లని' కొందఱును, ఇట్లు పరిపరి విధములఁ దలఁచుచు నిట్టి సమస్త భోగములందు మనము జాగరూకులమై ప్రవర్తింపుచు నానందింపుచుండఁగా, వీఁడట్టియానందము లేనివాఁడై నిద్రపోవుచున్న వానివలెఁ దెలివి హీనుఁడై యుంచున్నాఁడని యనుకొనుచున్నారు. కావున నీయుభయుల చర్యలను బరస్పర విరుద్ధములుగా నుంచున్నవని గ్రహింపవలయును. ఇందునకు నిదర్శనముగ నొకయితిహాసముఁ జెప్పుచున్నాను వినుము. తొల్లి యవతారపురుషుండగు ఋషభుని పుత్రుండగు భరతుడు పంచజని యనుభార్యయందు సుమతి మొదలగు నేవురుపుత్రులం బడసి యేకచ్ఛత్రాధిపత్యంబుగ రాజ్యంబుఁజేసి పరమపురుషుండగు వాసుదేవునియం దధిక భక్తిగలవాఁడై తన రాజ్యంబును బుత్రులకు బంచియిచ్చి గృహంబు వెడలి పులహాశ్రమంబున కరిగి యచటఁ దపంబాచరించుచుండె.

"వ. అంతనా భరతుండొక్కనాడు చక్రతీర్థంబునం గృతాభిషేకుండై ముహూర్తత్రయం బంతర్జలంబులందుఁ బ్రణవోచ్చారణంబు సేయుచుండు సమయంబున నిర్భరగర్భిణి యగు నొక్కహరిణి జలార్థినియై యొంటి జలాశయసమీపంబునకు వచ్చి జలపానంబు సేయునెడ నాసమీపంబున మృగపతి గర్జించి లోకభయంకరంబుగ నాదంబు సేయ నాహరిణి స్వభావంబున భీత యగుటంజేసి బెగ్గడిల్లి హరివిలోకన వ్యాకులచిత్తయై దిగ్గనుదరి గగనంబునకు నెగిరి యపగత తృషయగుచు నది నుల్లంఘించునెడ నధికభయంబునం జేసి యాగర్భంబు యోనిద్వారంబున గళితంబై జలంబులం బడియె. ఆహరిణియుఁ దత్తీరంబున నుండు గిరి దరింబడి శరీరంబుఁ బాసె. అంతనా హరిణపోతంబు జలంబులం దేలుచుండ నంత భరతుఁడు గనువిచ్చి చూచి

కరుణార్ద్రచిత్తుండై మృతజననియగు నాహరిణ పోతంబును దన యాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి ప్రీతి సేసి యుపలాలనంబు సేయుచుఁ బోషణ పాలన ప్రీణనలాలనానుధ్యానంబులం దగులుటం జేసి భరతునకు నాత్మనియమంబులైన యష్టాంగయోగంబులును, బరమపురుష పూజాపరిచర్యాదులుఁ నొక్కొక్కటిగఁ గ్రమ క్రమంబునం గొన్ని దినంబులకు సమస్తంబును నుత్సన్నంబయ్యె నంత." (భాగ. ౫: ౧౧౧)

ఇట్లు కొంత కాలమున నాభరతున కంత్య కాలము సమీపించునప్పుడా హరిణంబును దన యాత్మలో నిలిపి దేహము చాలించుటచే హరిణ జన్మమునొంది తనపూర్వ జన్మమునందలి భగవదారాధన సామర్థ్యంబువలనఁ బూర్వజన్మ సంస్మృతిగల వాడై చింతించుచుండి కొంత కాలమున నాదేహము విడిచి యంగిరసుఁడను తపస్స్వాధ్యాయనిరతుఁడగు బ్రాహ్మణోత్తమునకుఁ బుత్రుఁడై జన్మించి యాజన్మయందును బూర్వ జన్మ సంస్మృతి గలవాఁడై యుండుటంజేసి సర్వసంగపరిత్యాగియై యేకర్మంబులఁ జేయనొల్లక యెప్పుడును దనలో భగవద్ధ్యానముఁ జేసికొనుచు లోకులకు నున్మత్త జడాంధ బధిరుండునుంబోలెఁ గన్పట్టుచుండె. అంతఁ గొంత కాలమునకు నతని జనకుండు దేహంబు సాలింప నతని తల్లి యగ్నిప్రవేశంబు సేసె. అట్లు జననీజనకు లుభయులును గతించిన పిదప నతని సవతి తల్లికొడుకు లతని ప్రభావము నెఱుంగని వారగుటంజేసి యతని జడునిగ భావించి యతనిని వేదవిద్యలవలనం బాపి, గృహకర్మంబుల నియమించుచుండిరి. అట్లుండ

" క. ధరణీసురోత్తముఁడు దా
నరుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే
మఱకుండఁ బ్రీతి సేయక
నిరతము గృహకర్మమట్లు నెఱపుచు నుండెన్.

వ. ఇట్లు గృహకర్మప్రవర్తనుండగుచు నుండ మూఢులగు ద్విపాత్పశువులచే నున్మత్త జడ బధిర యని యాహూయమానుం డగునపుడు తదనురూపంబులగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలంజేసి విష్టివేతనయాఞ్చాదులవలన నియుక్త కర్మంబులం బ్రవర్తించుచు,

తే. అతులదివ్యాన్నమైన శుష్కాన్నమైన
నెద్దిపెట్టిన జిహ్వకు హితముగాను
తలఁచి భక్షించుఁగాకొండు దలఁచి మిగులఁ
బ్రీతి సేయఁడు రుచులందుఁ బెంపుతోడ.

వ. మఱియు నావిప్రుండాత్మ నిత్యానందసుఖలాభంబుగలిగి యిహసుఖదుఃఖం బులయందు దేహాభిమానంబునుంచక శీతోష్ణవాతవర్షాతపంబులకు నోడి పైచీరగప్పక వృషభంబునుంబోలెఁ బీనుండును, గతినాంగుండుననగుచు స్థండిలశాయియై రజఃపట లంబునంగప్పంబడిన దివ్యమాణిక్యంబునుంబోలె ననభివ్యక్తబ్రహ్మవర్చసుండై మలి నాంబరపరీతకటితటుండును, నతిమషీలిప్తయజ్ఞోపవీతుండును నగుటంజేసి, యజ్ఞజనంబు లతండు బ్రాహ్మణాభాసుండు, మందుండు, ననిపలుక సంచరించుచుండం గర్మమూ లంబునం బగులవలన నాహారంబుఁగొనునపుడు దమవారును నియమించిన వ్యాస్థాయ కర్మంబునందు క్షేత్రవిహితసమవిషమన్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తిల్లుచు నూఁక, తవుడు, తెలకపిండి, పొట్టు, మాఁడుద్రబ్బెడ, యాదిగాఁ గల ద్రవ్యంబులయందు నరుచిసేయక నమృతసమానంబుగా భక్షించుచుం జేని కావలియుండు.”

(భాగ. ౫. ౧. అ. ౧౨౩—౧౨౮)

ఇట్లుండ నొక్కనాఁడు సింధుదేశాధిపతి యగు రహూగణుండను రాజు ఇక్షుమతీ తీరముననున్న కపిలమహామునివలనఁ దత్త్వబోధ నొందఁగోరినవాఁడై పల్లకి నెక్కి యామార్గమునంబోవుచుండ నాపల్లకి మోయువారచటఁజేరి కావలియుండు భరతునిఁజూచి యతనింబట్టితెచ్చి తమతోఁగూడ నాపల్లకిని మోయించిరి. “అప్పుడా విప్రవరుండు తనకుంగడపటి శరీరంబైన కళేబరమునందు నహంకార మమకారంబులం బొందనీక మిథ్యాజ్ఞాన రహితుండై బ్రహ్మభూతుండై మౌనవ్రతంబున నాశిబిక మోయుచున్న విషమగమనంబుఁ జూచి యతికుపితుఁడగుచు నాభూవరుండు (భాగ. ౫. ౧. ౧౪౬) దుర్భాషలాడిన, వానికి నుత్తరంబుగఁ గొన్ని తత్త్వజ్ఞాన బోధకంబు లును, హృదయగ్రంధి విమోచకంబులు నగు వాక్యంబులఁ జెప్పిన విని యారాజు, అతని బ్రహ్మజ్ఞానసంపన్నునిగా నెఱింగి యాశిబిక దిగ్గనడిగ్గనుఱికి, యావిప్రునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ముకుళితకరకమలుండై తనతప్పుసైరించి రక్షింపుమని వేఁడిన నపుడావిప్రుండు గరుణార్ద్ర హృదయుండై యారాజునకు సంసారమసారమని బోధించి తత్త్వజ్ఞానం బుపదేసించె, నంత నా రాజు

“క. ధరణీసురవర యుష్మ
చ్చరణాంబుజ యుగళరేణు సంస్పర్శము నా
దురితంబు లడఁచె నింతట
హరిభక్తియు నంతకంత కధికంబయ్యెన్.” (భాగ. ౫. స్క—౦.౧. అ.౧౭౬

అనిచెప్పి పునః పునః ప్రణామంబులాచరించి చనియె. కాన నోయి యర్జునా!) బ్రహ్మజ్ఞానసంపన్నులగు మహానుభావులిట్టి గూఢవృత్తిని నివుఱు గప్పిన నిప్పువలె

నుందురు. కాఁబట్టి వారల ప్రభావంబుఁ దెలియనేరని పామరజనులుఁ దాము ప్రవర్తింపు చుండెడు సంసారవిషయములయందట్టివారిని నిద్రితులనుగాను, జడోన్మత్తులుగాను, భావించుచు వారలు జాగరూకులై యుండెడు నాత్మావలోకన విషయమునఁ దాము నిద్రితులుగ నుండుట నెఱుఁగఁజాలరు.

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! ఇట్లు కష్టసుఖములకును, దూషణ భూషణ తిరస్కారములకును, నోర్చియుండుట బహుకష్టముగదా? మిక్కిలిగొప్ప మనస్సు గల్లవానికేగాని యిట్లోర్చియుండుట యితరులకు సాధ్యపడదుగదా?

శ్లో॥ ఆపూర్యమాణమచలప్రతిష్ఠమ్‌సముద్రమాపఃప్రవిశన్తియద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి న
కామకామీ॥ 70

అర్థము :— ఆపూర్యమాణమ్=అంతటనిండియుండినదియు, అచలప్రతిష్ఠమ్= స్థిరమైనయునికిగలది (అనఁగా హద్దునుమించుటగాని, తగ్గుటగానిలేక, యెల్లప్పుడు నొకటేరీతిగ నుండునట్టిదియునైన), సముద్రమ్ = సాగరమును, ఆపః=ఉదకములు (నదులు మొదలగునవి), యద్వత్ =ఏవిధముగా, ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవో, తద్వత్=ఆవిధముగా, సర్వే=సమస్తములైన, కామాః=కోరికలు, యమ్=ఎవనిని (ఎవని మనస్సునందు), ప్రవిశన్తి=ప్రవేశించుచున్నవో, సః=అట్టివాఁడు, శాన్తిమ్= చిత్తశాంతిని, ఆప్నోతి=పొందుచున్నాఁడు. కామకామీ=విషయాసక్తుఁడగువాఁడు, న+(ఆప్నోతి)=పొందఁజాలఁడు.

కృ — అవును వాస్తవమే - గొప్పమనస్సు, అనఁగా సముద్రమువంటి మనస్సు గలవాఁడైననే తప్ప, నల్పమనస్సు గలవాని కట్లుచేయుట సాధ్యపడదు. అదెట్లనఁగా, ఎండకాలమున సూర్యకిరణములచేఁ జెఱువులు, గుంటలు, మొదలగు జలాశయముల లోని నీరు, ఆవిరి రూపముగఁ బీల్చఁబడి నానాఁటఁ గ్రమక్రమముగాఁ దగ్గిపోవు టయు, వానిలోఁగొన్ని జలాశయములలోనినీరు బొత్తిగా నింకిపోవుటయుఁ జూచు చున్నాముగదా! అట్లే, సముద్రమునందలి జలమునయిత మావిరిరూపముగఁ బోవు టను జూచుచున్నాముగదా? తక్కిన జలాశయములలోని నీరింకిపోయినట్లు సముద్ర ములోని నీరింకిపోవుచున్నదా?

అర్జు — లేదు. సముద్రములోని నీరెప్పుడు నింకినట్లగపడుటలేదు.

కృ — మంచిది, వర్షకాలమున వానలు మిక్కుటముగఁ గురిసినచోట్ల వెల్లు వలు పాఱి చెఱువులు మొదలగు జలాశయములు నిండి కట్టలమీఁదినుండి పారలి

పొంగుటయుఁ, గట్టులు తెగుటయుఁ, జూచుచున్నాముగదా! ఇట్టివెల్లవ లనేకములు చేరి యొక్కొకనదియై యట్టినదులు వేలతరఁబడిగ సముద్రముఁ బ్రవేశించుటయుఁ జూచుచున్నాముగదా! అప్పుడాసముద్రము తక్కినజలాశయములవలెనే నిండి పొరలుచున్నదా?

అర్జు — లేదు. అట్లు సముద్రమే పొరలినయెడలఁ జుట్టుప్రక్కలనుండు దేశ మెట్లునిలుచును? ఇన్నినదులు దానిలోఁ బ్రవేశించినను, మొదటనున్న యంతకంటె సముద్ర మణుమాత్రమైనను బొంగిపొరలిన ట్లెప్పుడును గని విని యెఱుఁగము.

కృ — మంచిది, అదియటుండనిమ్ము సముద్రములోనికి నదులజలమెట్లు ప్రవేసించుచున్నవోయట్లే, యాసముద్రతీరముననుండు పట్టణములయందలి జలదారుల లోని కశ్మలపునీరును బ్రవేశించుచున్నదిగదా, అట్టినీరు ప్రవేశించుటవలన నాసము ద్రోదకమేమైనఁజెడుటయు, దుర్గంధముగలిగియుండుటయుఁగలదా!

అర్జు — లేదు. సముద్రోదకమున నదులయందలి నిర్మలోదకము గలిసినప్పుడు గాని, కలఁకఁబాఱిన బురదనీరు ప్రవేశించినప్పుడుగాని, లేక, జలదారులలోని మఱికినీరు ప్రవేశించినప్పుడుగాని, ఆయాయుదకములయందలి సుగుణ దుర్గుణముల కనుగుణ్యములగు నైర్మల్యమాలిన్యముల నొందక యెప్పుడు నొకటేతీరుగనుంచున్నది.

కృ — అవునుగదా! అట్లే, పామరుల మనస్సులు చెఱువులు మొదలగు జలాశయములవంటివనియు, యోగియొక్క మనస్సు సముద్రమువంటిదనియుఁ జెప్పఁ దగియుంచున్నది. ఏలయనఁగా, పామరజనులు తమ కోరికలు లభించినపుడు, అనఁగాఁ దమయిచ్ఛానుసారముగ సుఖములబ్బినపుడు విశేషముగ నానందించి యుప్పొంగుచున్నారు. అట్టికోరికలలో నేదైన విఫలమైనపుడును, లేక మఱియేదైన కష్టము సంభవించినప్పుడును, విశేషముగఁ జింతాక్రాంతులై కూలుచున్నారు. మఱియు వారలనెవరైన భూషించునపుడుప్పొంగుటయు, దూషించునపుడాగ్రహ పడుటయు నిట్టియనేకవిధములగు మనోవికారములను బొందుచున్నారు. జ్ఞానియై తేనో, యట్లుచేయక సుఖములు గలిగినపుడు కాలానుగుణ్యముగ భగవదిచ్ఛాను సార మునఁగలిగినవనియు, శాశ్వతములుగ నుండునట్టివి కావనియుఁ, దలచినవాఁడై విశేషముగ నుప్పొంగుటగాని, దుఃఖములు గలిగినపుడవియును సుఖములవలెనే కాలానుగుణ్యముగ భగవదిచ్ఛానుసారమునఁ గలిగినవనియు, శాశ్వతములుగావనియుఁ దలఁచినవాఁడై, వ్యసనపడుటగానిలేక యెల్లప్పుడు నొకటేరీతిగనుంచున్నాఁడు.

“వ. అట్లుగావున నింద్రియమనంబులు ననాత్మనిషేధపూర్వకాత్మాలోక నంబుచేత జయించి వశీకృత మానసేంద్రియుండైన పుణ్యపురుషుండు, సర్వభూతాత్మ

ష్టయు, సకలలోక మిత్రుండును, పరమ కారుణికుండును, నిర్మముఁడును, నిరహంకారుండును, సమదుఃఖసుఖుండును, క్షమావంతుండును, నిత్యసంతుష్టుండును, యోగారూఢుండును, నియతాత్ముండును, దృఢాత్మనిశ్చయుండును, నిఖిలజనాభయప్రదుండును, అఖిలలోకభయరహితుండును, ముక్తహర్షామర్షభయోద్వేగుండును, నిరపేక్షుఁడును, శుచియు, దక్షుండును, ఉదాసీనుఁడును, గతవ్యథుండును, పరిత్యక్తసర్వారంభుఁడును, ఇష్టానిష్టప్రాప్తహర్షద్వేషవిహీనుండును, సంప్రాప్తేష్టవియోగదుఃఖవిరహితుఁడును, అప్రాప్తార్థకామశూన్యుండును, యదృచ్ఛాలాభసంతుష్టుండును, శుభాశుభపరిత్యాగియు, సమశత్రుమిత్రుండును, సమలోష్టాశ్మకాంచనుండును, సమశీతోష్ణసుఖదుఃఖుఁడును, తుల్యప్రియాప్రియుండును, తుల్యనిందాస్తవుండును, మానావమానతుల్యుఁడును, మౌనశీలుఁడును, అనికేతనుండును, సుస్థితప్రజ్ఞుఁడును, గుణాతీతుఁడును, మద్భక్తుఁడును, మదర్పితమనోబుద్ధియు, మత్పరాయణుఁడును నై ప్రకాశించు యోగీంద్రుండు సంతతసహజామనస్కరాజయోగసమాధియుండు సూర్యుండు సమస్తరసంబులం బీల్చిన తెఱంగున, బడబానలంబు జలరాశిం బానంబుఁజేసినక్రైవడి, మహాదవానలం బరణ్యంబునంగల తృణాదిసర్వపదార్థంబులం గబళించిన తెఱంగున, నావిద్యాకంబులైన యనంతగుణంబుల నశేషంబుగాఁ బ్రమింగి కేవలపరిపూర్ణశుద్ధచిన్మాత్రస్వరూపకుండైయుండు'' (సీ.రా.౩.ఆ.౧౪౯)

గాన నట్టివాఁడే మోక్షమును బొందుటకుఁదగిన చిత్తశాంతిని బొందఁగలవాఁడగును గాని, విషయాసక్తుం డట్టి చిత్తశాంతిని బొందనేరఁడు.

శ్లో॥ విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారస్స శాన్తిమధిగచ్ఛతి॥ 71

అర్థము :— యః + పుమాన్ = ఏపురుషుఁడు, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = కోరికలను. విహాయ = విడిచి, నిస్పృహః = ఆశలేనివాఁడును, నిర్మమః = మమకారములేనివాఁడును. నిరహఙ్కారః = అహంకారము లేనివాఁడునునై, చరతి = సంచరించుచున్నాఁడో, సః = వాఁడు, శాన్తిమ్ = చిత్తశాంతిని అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

కాన నోయి యర్జునా! ఎవఁడైతే సమస్తకోరికలను విడిచి విషయములయం దాశలేనివాఁడును, అహంకార మమకారరహితుఁడునునై, యుంచున్నాఁడో, యట్టివాఁడే చిత్తశాంతినిఁ బొందఁగలఁడని తెలిసికొనుము.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! అహంకారమమకారములనఁగా నెట్టివో, వానినెట్లు విడుచుటకు సాధ్యపడునో యావిషయము కొంతవివరించి చెప్పుము,

కృ — అహంకారము ఉత్తమము, మధ్యమము, అధమము, నని మూఁడు విధములు అందు

"తే. గీ. అతులమమలంబు విశ్వమచ్యుతమఁబరము
నైనపరమాత్మ రూపంబు నేనెకాని
యన్యమొక్కటిలేదని యాత్మఁదలఁచు
నదియ యుత్తమాహంకృతి యనఁగఁబరఁగు.

"తే. గీ. అరయ నన్నిట వ్యతిరిక్తమై వెలుంగు
తానయాలోన శతకలిప్తంబునగుచు
నెసఁగుపరమాణురూపంబునేనె యనెడు
నాయహంకార మది ద్వితీయంబుశుభము.

వ. ఇవి మోక్షణ కారణంబులు, బంధనిరసనంబులునై జీవన్ముక్తినొసఱ్చుమఱియును

"క. కరచరణాద్యవయవములు
నిరతౌ చరియించుదేహ మేనని మదిలోఁ
విరముననిలుపు నహంకృతి
యరయఁదృతీయాఖ్యమధమ మగురాజేంద్రా" (వా. రా. 3 ఆ.)

ఈయహంకార మెట్టిదనఁగా ; ఇది యిప్పుడు నాశక్తి చేత లభించినది. ఈకోరికను నేనుబొందఁబోవుచున్నాను. ఈధనము మరలనాకురాఁబోవుచున్నది. యనియు, (చూ. 16 – 13) ఈశత్రువును నేను జంపితిని. ఇంక నితరశత్రువులను జంపఁబోవుచున్నాను. నేను స్వతంత్రశక్తిగలవాఁడను. నేను భోగిని. నేను సంపన్నుఁడను, నేను బలవంతుఁడను. నేను సుఖిని. అనియు, (చూ. 16 – 14.) నేను ధనవంతుఁడను. నేను గులీనుఁడను. నాకు సమానుఁడెవఁడునుఁలేఁడు. నేను యాగమును జేయుచున్నాను. నేను దానముఁజేయుచున్నాను. నేనానందించుచున్నాను. అనియు, (చూ. 16 – 15.) ఈమొదలగు ననేక విధములైన చిత్తభ్రమలను బొందియుండెడు నజ్ఞానమైయుంచున్నది. కానవెవఁడేని తాను జేయుచుండెడు సమస్తకార్యములు నీశ్వరుఁడు తనచేఁజేయించుచున్నాఁడనియు, సూత్రధారునిచే నాడింపఁబడు బొమ్మవలెఁదాను గార్యములఁజేయుచున్నాననియు, నెంచుచున్నాఁడో యట్టివాఁ డహంకార రహితుఁడగుచున్నాఁడు. ఇఁకను, మమకార మెట్టిదనఁగా,

"క. ఇదినాయది యనునూఁత
నృది నెయ్యది పట్టుకొల్పినను వానికతమై
తుదిఁ జేటునొంది వానికి
నది శోకము నావహించు నత్యంతంబున్." (భార. శాంతి. ౪. అ. ౧౩)

అనునట్లు, ఇది నాయిల్లు, ఇది నా వాకిలి, ఇది నాతోఁట, ఇదినాభార్య, వీరు నాపుత్రులు, ఇది నా ధనము, ఇది నాపశువు అను మొదలగు భ్రాంతిజన్య మనోవికారమై యుంచున్నది. తెలివిగలిగి పర్యాలోచించి చూచినయెడల నిట్టి మనోవికారమునకవకాశముండనేరదు. ఎట్లనఁగా, ఇందునకనుగుణ్యముగఁ దొల్లి జనకచక్రవర్తి మాండవ్యమహామునితో

"సీ. అర్థముల్ దుఃఖదోపాకరఁబులు విను మేమిటిపై నాశ లేమిఁజేసి
పొరయవు నను దుఃఖములఁ మునినాయక మిథిల గాలంగ నేమియును నాకుఁ
గాలనియట్లుండెఁ గామసుఖంబును దివ్యసుఖంబును దృష్టివిడుచు
సుఖముఁ బోలంగ యర్థసులభతతోడన గోవుతోఁ బెరిఁగెడు కొమ్ములట్లు
తే. గీ. తృష్ణదానును బెరిఁగుఁ దదీయశక్తి
మమతగలుగు మాబంధులు మాధనములు
మానివాసంబులనఁగ మమత్వమెదఁ ది
రంబుగాకున్న నింకఁ దృష్ణాంబురాశి
క. దొరకొన్న ననుభవించుచు
దొరకొనమికిఁ జింత నొంది దురపిల్లక ని
ర్భరుఁడై యున్నను దృష్ణకుఁ
జొరవచ్చునె యతనిమనసు సువ్రతశీలా!
తే. గీ. విడువరాదు దుర్మతులకు నొడలు ముదియఁ
దాను ముదియదు ప్రాణాంతమైనఁదోఁగ
మనఘ తృష్ణవర్జిత కాముఁడైనయతఁడు
దానిఁబోఁద్రోచి సౌఖ్యసాంద్రత్వమొందు"

(భార. శాంతి. ౫. ఆ. ౩౭౫, ౩౭౭)

అని చెప్పియున్నాఁడు. గానసట్లు గృహక్షేత్రారామధనకనకవస్తువాహనాదులయందును, జననీజనకదారపుత్రబంధుమిత్రాదులయందును, ఇది నాది, వీరు నావారు, అనియెడు భ్రాంతిని విడిచినయెడల నట్టివాఁడు మమకారరహితుఁడగుచున్నాఁడు. అట్లుగాక,

"ఆ. ఆత్మశానగమను లంతియు చుట్టంబు
లగ్నిఁ గలిపి మరలు నఖిలమైన
జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందఱు
యందు మమతఁ బెనుచు నజ్ఞుఁ డనఘ" (భార. శాంతి. ౬. ఆ. ౨౩౫)

అనునట్లైవఁడైనఁ దనబంధుమిత్రాదులు, దేహసంబంధులుమాత్రమేయనియు, నాత్మసంబంధులు గారనియుఁ, దానీదేహముఁజాలించి వెళ్ళునపుడు తనకళేబరము వెంట శ్మశానమువఱకుఁబోయి యగ్నింజొనిపి మరలివచ్చెడువారలేగాని తనతోఁ గూడఁ బరలోకమునకు వచ్చెడువారుగాని; తన పుణ్యపాపములలో భాగమును బంచుకొనెడువారుగాని, కారనియుఁ, జరించపనేరక యట్టివారలయెడల విశేష మమకారముంచెడు నజ్ఞానియగువాఁడు

ఆ. పుత్రదారబంధు మిత్రసక్తుఁడు రొంపిఁ
బడిన గజమునట్ల యెడరు నొందు
భోగజాలపరుఁడు వాగురాజాలసం
పతితమృగఝషముల భంగిఁ దలరు. (భార. శాంతి. ౬ అ. ౩౧౮)

అనునట్లు బంధుమిత్రాదులయెడల నాసక్తచిత్తుఁడగువాఁడు, రొంపిలోదిగఁ బడిన యేనుఁగువలె దుఃఖించును. స్రక్చందన వనితాదివిషయముల యందాసక్తుఁడగు వాఁడురియందును, వలయందును, జిక్కువడిన మృగమువలెను, మత్స్యమువలెను, జెడుచున్నాఁడు; గాన, బుద్ధిమంతుఁడగువాఁడు

"క. ఆలును బిడ్డలు బంధులు
నై లీలఁ జరింపఁగను గృహస్థుఁడు తత్త
ల్లోలత్వరహితచిత్త త
మేలుగ నలవఱుపవలయు మీఁ దెఱిఁగినృపా" (భార. శాం. ౧.అ.౩౭౪)

అనునట్లు, గృహస్థాశ్రమముననుండువాఁడు, భార్యాపుత్రబంధుమిత్రాదులను, ధనధాన్యాదులును, ఋణానుబంధరూపములనియు, నశాశ్వతములనియు, నెఱిఁగిన వాఁడై, వానియందాసక్తచిత్తుఁడుగాక, మెలఁకువగలిగి చరించుచుండవలయును.

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి । బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 72

హేపార్థ! = ఓయియర్జునా! ఏషా = ఇది (ఇంతవఱకుఁజెప్పబడినది), బ్రాహ్మీ = బ్రహ్మసంబంధమైన; (బ్రహ్మపదప్రాప్తికి సాధనమైన), స్థితిః = నిష్ఠ, ఏనామ్ = ఈ (నిష్ఠను), ప్రాప్య = పొంది, న + విముహ్యతి = మోహమును జెందఁడు, అస్యామ్ = ఈ (నిష్ఠయందు), అన్తకాలే + అపి = మరణకాలమందైనను, స్థిత్వా = ఉండి(ఉండినయెడల), బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మైక్యమును (బ్రహ్మ లోఁగలియుట, అనఁగా మోక్షమును), ఋచ్ఛతి = పొందుచున్నాఁడు.

గాననోయి యర్జునా! ఇట్లహంకారమమకారరహితుఁడును సర్వకామవర్జితుఁ డును నైయుండుటచే బ్రహ్మనిష్ఠయనఁబడుచున్నది. ఇట్టి నిష్ఠయందెవఁడుంచు

న్నాఁడో యట్టివాఁడజ్ఞానసంబంధమగు మోహమునొందక ముక్తిని జెందుచున్నాడు. సరేకదా, ఒకవేళ నెవఁడైనఁ దనజీవితకాలమంతయు నజ్ఞానాంధకారమునఁబడియుం డుదకు మరణకాలమందైన నిశ్చయాత్మకబుద్ధితో నిట్టినిష్ఠనవలంబించినయెడల నట్టి వాఁడుసయితము బ్రహ్మైక్యమును, అనఁగా మోక్షమును జెందఁగలఁడు. అదెట్లనఁగా,

"తరల. హరి నెఱుంగక యింటిలో బహు హాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడు వెట్టిముక్తికిఁ బోవనేర్చునె వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్య మాహరినామసం
స్మరణ మొక్క ముహూర్తమాత్రము చాలు ముక్తిదమౌ నృపా.

సీ. కౌరవేశ్వర తొల్లి ఖట్వాంగుఁ డనువిభుం డిల నేఁడు దీవుల నేలుచుండి
శక్రాదిదివిజులు సంగ్రామభూముల నుగ్రదానవులకు నోడి వచ్చి
తమకుఁ దోడడిగిన ధరనుండి దివికేగి దానవవిభుల నందఱవధింప
వర మిత్తు మనుచుదేవతలు భాషింపంగ జీవితకాలంబు సెప్పు డిదియ

ఆ. వరము నాకునొందు వరమొల్ల ననవుడు
నాయువొక ముహూర్తమంతదడవు
గలదటంచుఁబలుక గగనయానమున న
మ్మానవేశ్వరుండు మహికి వచ్చి

క. గిరులంబోలెడి కరులను
హరులం దన ప్రాణదయిత లై మనియెడు సుం
దరులను హితవరులను బుధ
వరులను వర్జించి గాఢవైరాగ్యమునన్

"క. గోవిందనామకీర్తనఁ
గావించి భయంబుదక్కి ఖట్వాంగధరి
త్రీవిభుఁడు సూఱగొనియెను
గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్." (భాగ. ౨. స్క. ౦. ౧౧-౧౦)

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే సాఙ్ఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః.

ఇది శ్రీకృష్ణభగవాను లర్జుననియుద్ధమునకుఁ బురికొల్పెడు వ్యాజమున
లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుపనిషదర్థప్రతిపాదకంబగు
భగవద్గీతాశాస్త్రమునందలి సాంఖ్యయోగంబను
ద్వితీయాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావ బోధిని

## తృతీయాధ్యాయము

### కర్మయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ!॥ 1

అర్థము :— హేజనార్దన = ఓకృష్ణమూర్తీ! కర్మణః=కర్మయోగముకంటె, బుద్ధిః = జ్ఞానయోగము, జ్యాయసీ = మేలైనది, (ఇతి) = అని, తే = నీకు, మతా + చేత్ = అభిప్రాయమైనయెడల, హేకేశవ = ఓకృష్ణమూర్తీ! మామ్ = నన్ను, ఘోరే =క్రూరమైన. కర్మణి = (యుద్ధ) కర్మమునందు, నియోజయసి = నియమించుచున్నావే, తత్ + కిమ్ = అదేమి ?

అర్జునుడు — అయ్యా, జనార్దనా! నీవిదివఱకుఁ జెప్పిన విషయములన్నియు నాలోచించి చూడఁగాఁ గొంతమట్టునకుఁ గర్మానుష్ఠానము శ్లాఘనీయముగఁ జెప్పుచు వచ్చి మరల నట్టి కర్మతో నగత్యములేని జ్ఞానయోగమును నంతకంటె నెక్కువైన దానిగ శ్లాఘించి చెప్పుచున్నావు. నిజముగా నీయభిప్రాయమున జ్ఞానయోగమే శ్రేష్ఠతరమైనదిగా నుండినయెడల, దానినే యాచరింపుమని నాకుఁ జెప్పవలసియుండఁగా, నట్లుచెప్పక కర్మనాచరింపుమని చెప్పుచున్నావు. ఆకర్మ యన్ననో, సాధారణమైన కర్మగాదు. మఱెట్టిదనిన, కర్మలన్నింటిలో వధారూపమగు యుద్ధకర్మ క్రూరమైనది గదా ! అట్టిక్రూరకర్మలలో బంధుజనవధారూపమగు యుద్ధము మఱియు నెక్కుడు క్రూరమగు కర్మముగదా! ఇట్టి మహాక్రూరమగు కర్మముఁ జేయుమని నన్నుఁ బ్రేరేపించుచున్నావేల ?

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥ 2

అర్థము :— వ్యామిశ్రేణ+ఇవ=మిశ్రమమైనదానివలెనున్న, వాక్యేన=వాక్యముచేత, మే+బుద్ధిమ్ = నాబుద్ధిని, మోహయసి+ఇవ = కలవరపెట్టువానివలెనున్నావు, అహమ్ = నేను, యేన = దేనిచేత (జ్ఞానయోగకర్మయోగములరెంటిలోదేనిచేత), శ్రేయః మేలును, ఆప్నుయామ్ = పొందుదునో, తత్+ఏకమ్ = అట్టియొకదానిని, నిశ్చిత్య+వద = నిర్ణయించిచెప్పుము.

నీవిట్లొకప్పుడు కర్మయోగము శ్రేష్ఠమనియు నొకప్పుడు జ్ఞానయోగము శ్రేష్ఠమనియు మిశ్రమముగఁ జెప్పుటవలన నాబుద్ధిని గలవరపెట్టఁగలఁచి యిట్లుచెప్పుచున్నవానివలెఁ గనఁబడుచున్నావేగాని, నేను గడతేఱవలెననెడు నుద్దేశముతోఁ జెప్పుచున్నట్లగపడవు. గాన నో కృష్ణమూర్తీ! నీవు నాశ్రేయస్సును గోరినవాఁడవైతివేని యీరెంటిలో, అనఁగా జ్ఞానయోగకర్మయోగముల రెంటిలో, దేని నాచరించిన యెడల నాకు మేలు గలుగఁదగియుంచున్నదో దానినిఁ జక్కఁగ నాలోచించి నీలో నీవు నిశ్చయించుకొని ఆయొక్కయోగమును మాత్రమే నిర్ణయించి నాకుఁ జెప్పుము.

శ్రీభగవానువాచ :

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥ 3

అర్థము :— హేఅనఘ=పాపరహితుఁడవగునో యర్జునా!, అస్మిన్+లోకే=ఈలోకమందు, సాఙ్ఖ్యానామ్ = సాంఖ్యులకు (ఆత్మానాత్మ వస్తువివేకముగలవారలకు), జ్ఞానయోగేన = జ్ఞానయోగముచేతను, యోగినామ్ = యోగులకు (అట్టియాత్మానాత్మవివేకమును బొందుటకు యత్నించుచుండెడువారలకు), కర్మయోగేన = (నిష్కామ) కర్మయోగముచేతను, ద్వివిధా = రెండువిధములుగల, నిష్ఠా= అనుష్ఠానము, పురా = (ఇంతకు) ముందు (రెండవయధ్యాయమందు), మయా = నాచేత, ప్రోక్తా = చెప్పఁబడినది.

కృ — ఓయియర్జునా! నేనిదివఱకుఁ జెప్పినమాటలన్నియు సరియైనవేగాని పరస్పర విరుద్ధము లేమియులేవు. అయితే, వానిని నీవు చక్కఁగా నవగాహనము చేసికొనఁజాలక యిట్లు కలవర పడుచున్నట్లు కనఁబడుచున్నది. కాన దానినిప్పుడు నీబుద్ధికిఁ జక్కఁగ బోధపడునట్లు విశదీకరించి చెప్పుచున్నాను వినుము. ఈ లోకము

వందలి జనులు తరించుటకు, అనఁగా మోక్ష ప్రాప్తినొందుటకుఁ జేయుప్రయత్నమే యోగమనఁబడును.

" తే. గీ. ప్రత్యగాత్మ స్వరూపుఁడై పరఁగు తనకు
రమణ పరమాత్ముఁడైన శ్రీరామునకును
సమరసైక్యాను సంధాన సరణి యొద్ది
యదియ యోగంబు సదుపాయ మాంజనేయ ! "

(సీ.రా.౧ అ. ౨౬.)

అనునట్లు, జీవాత్ముఁడగు తనకును బరమాత్ముఁడగు భగవంతునకును (ఐక్యానుసంధానము) అనఁగాఁ దనయాత్మకును బరమాత్మకును భేదములేదని యెఱుఁగుటయే యోగము.

" క. ఆమృతం బచ్యుత మమలం
బమేయ మవ్యయ మనంత మవ్వేలుఁగు యమా
ద్యముల నలవడిన చిత్తము
శమాతిరేకమును బొంద సంవేద్యమగున్ " (భార. శాంతి. ౪ అ. ౨౦౧)

అనునట్లు, యమాద్యష్టాఁగములు, అనఁగా యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, మనన, సమాధు లనెడు నామములుగల యెనిమిది మెట్లు గలవు. అందు, యమమనఁగా శరీరమే సాధనముగాఁగలది. ఇది సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచము, అని దశవిధములు. నియమమనఁగా శరీరముకంటె భిన్నములైన మృజ్జలాదులు సాధనములుగాఁగలిగి నిత్యముగా నాచరింపఁదగినది. ఇది తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము అని దశవిధములు. ప్రాణాయామమనఁగా నాసికాముఖములయందు సంచరించెడు వాయువును మంత్రపూర్వకముగ నిరోధించుట. ప్రత్యాహారమనఁగా విషయములనుండి యింద్రియములను మరలించుట. ధ్యానమనగా చాంచల్యములేక భగవంతుని దలఁచుట. ధారణయనఁగా భగవంతుని దప్ప మఱియొకటి నెఱుఁగకుండుట. మనన మనఁగా చింతనము, అనఁగా సదాభగవన్నామమునే జపింపుచుండుట. సమాధియనఁగా మనోలయము, అనఁగా మనస్సు భగవంతునియందు నైక్యమునొందుటచేఁ దదితరములగు నెవ్వియు నింద్రియములకు గోచరింపకుండుట. గాన యోగము నభ్యసించెడువాఁడు పైఁజెప్పఁబడిన యెనిమిది మెట్లను గ్రమక్రమముగా నెక్కుచుఁ గడపటి మెట్టగు సమాధియందుఁజేరినయెడల నపుడు మోక్షమున కర్హుఁడగుచున్నాడు.

"తే. గీ. యోగధర్మంబుకంటెను నుత్తమంబు
కలుగనేరదు ధర్మమెక్కుటియు నపున
రాగమంబగు పదమున కరయ నిదియ
మేటినిచ్చెన సంయమికోటి కెల్ల" (భార. అను. ౪ ఆ. ౨౧౬)

అనునట్లీయోగము నిచ్చెనవంటిది. ఈయోగము మెట్ల నెక్కుటలో, మొదటి నాలుగు మెట్లు, అనఁగా యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహారముల నెడు నాలుగు మెట్లను దాటి యైదవమెట్టగు ధ్యానమును జేరునంతవఱకు యోగాభ్యాసకులు కర్మనాచరింపవలసినది యావశ్యకముగ నుంచున్నది. అటుపిమ్మట, అనఁగా ధ్యానావస్థను బొందినపిమ్మటఁ దక్కిన మెట్లగు ధారణ, మనన, సమాధులను బొందుటకుఁ గేవలము మనస్సుతో మాత్రమే పనిచేయవలసియుంచున్నదిగాని కర్మతో నిమిత్తమెంతమాత్రము నుండదు. కనుక మొదటి నాలుగుమెట్లవఱకు, అనఁగా యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహారముల వఱకుఁ గర్మయోగమనియు, నావలివియైన ధ్యాన, ధారణ, మనన, సమాధులకు నిష్కర్మయోగమనియుఁ బేళ్ళు చెప్పఁబడుచున్నవి. ఈ నిష్కర్మయోగమే జ్ఞానయోగమనియు, సాంఖ్యయోగమనియుఁగూడఁ జెప్పఁబడుచున్నది. కనుక యోగముయొక్క ప్రారంభదశయందుండు వారికిఁగర్మయోగమును, ఆయోగముయొక్క యైదవమెట్టగు ధ్యానాది దశలను బొందినవారికి నిష్కర్మయోగమును, సాధనములుగానుంచున్నవి. యోగాభ్యాసకుఁడు యోగముయొక్క మొదటి నాలుగుదశలు, అనఁగా యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహారములయందుఁ బ్రవర్తించువఱకుఁ గర్మయోగియనియు, తదనంతరము, అనఁగా కడపటి నాలుగు దశలు అనఁగా ధ్యాన, ధారణ, మనన, సమాధులయందుఁ బ్రవర్తించువఱకు నిష్కర్మయోగియనియుఁ జెప్పఁబడుచున్నాఁడు. ఈ నిష్కర్మయోగికే జ్ఞానియనియు, సాంఖ్యుఁడనియు నామాంతరములుగలవు. కాఁబట్టి నేనిదివఱకుఁ జెప్పినవిషయములలోఁ గర్మయోగమెక్కడెక్కడఁ జెప్పబడినదో, యావిషయములన్నియు నారంభదశయందుండెడు కర్మయోగికిని, జ్ఞానయోగమెక్కడెక్కడఁ జెప్పఁబడినదో యావిషయములన్నియు ధ్యానాదికమగు కడపటి దశయందుండెడు నిష్కర్మయోగికి (సాంఖ్యునకును) నన్వయించుకొనవలెను. అట్లన్వయించుకొన్నయెడల నీకట్టికలవరము గలుగనేరదు.

శ్లో॥ న కర్మణామనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥　　4

అర్థము :— పురుషః = పురుషుఁడు, కర్మణామ్ = కర్మలయొక్క, అనారమ్భాత్ = ఆరంభింపకపోవుటవలన, నైష్కర్మ్యమ్ = కర్మతోనిమిత్తములేనిస్థితిని (ఆత్మానుభవమును), న+అశ్నుతే=పొందఁడు, సన్న్యసనాత్+ఏవ+చ= ఆచరింపుచుండిన కర్మను వదలుటవలననైనను, సిద్ధిమ్ = నైష్కర్మ్యసిద్ధిని, న+సమధిగచ్ఛతి=పొందఁడు.

ఇంతకుముందు నేఁజెప్పినప్రకారము యోగముయొక్క మొదటినాలుగు మెట్లు, అనఁగా యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహారములనెడు మెట్ల నెక్కిననేగాని యైదవదియగు ధ్యానమనెడు మెట్టు నెక్కనేరఁడుగదా? ఆయైదవ మెట్టునెక్కిననేగాని నిష్కర్మయోగమునఁ బ్రవేశించినవాఁడు గాఁడుగదా? మొదటి నాల్గుమెట్ల నెక్కునంతవఱకును గర్మాచరణమావశ్యకమని యిదివఱకు వివరించియుంటిని గదా? కనుకఁ గర్మయోగము నాచరింపకయే నిష్కర్మయోగమునఁ బ్రవేశించుటకు వల్లపడదని తెలిసికొనుము. ఒకవేళఁ గర్మయోగము నారంభించి కొంతవఱకాచరించి పూర్తిగా నాచరింపకయే నడుమ విడిచిపెట్టిన వానికినైన నట్టి నిష్కర్మయోగము సిద్ధింపవచ్చునని యెంచెదవేమో యట్లెంచగూడదు సుమీ! ఏలయనఁగా, ఒక మిద్దెను బడికట్లగుండ నెక్కఁదలఁచినవాఁడు మొదటి యొకటి రెండు మెట్లనెక్కి యటుపిమ్మట మూడు నాల్గుమెట్లనెక్కకయే యైదవమెట్టునెక్క గల్గునా? ఎక్కఁజాలఁడు గదా? అట్లే యోగమెట్లను గూడఁ గ్రమముగ నెక్కియే తీరవలెను. అనఁగా, యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహారములనెడు మెట్లను గ్రమముగ నెక్కినఁగాని జ్ఞానోదయము గలుగనేరదు. అట్లుజ్ఞానోదయమైనపిమ్మటనే గాని నిష్కర్మయోగమునకు నర్హుఁడుగానేరఁడు.

అర్జు—అయ్యా! మంచిది. ఇట్లుచెప్పితివిగదా, శ్రీశుకులు, జడభరతుఁడు, మొదలగువారలు కొందఱు, జన్మాదిగాజ్ఞానయోగులుగానే యుండినట్లు వినుచున్నామే! వారలేకర్మయోగము నాచరించి యీజ్ఞానయోగ సిద్ధిని బొంది యుండవచ్చును?

కృ — వారలకు జన్మము తోడనే జ్ఞానసిద్ధిగలుగుటకుఁ గారణమేమనఁగా,

"తే.గీ. అందుఁ దుద ముట్ట నడఁచిన నందవచ్చు
ముక్తి బహుజన్మసంసిద్ధమోక్షకార
ణముల శుద్ధుఁడై ప్రథమాశ్రమమునయంద
కాంచుమోక్షమెందేని నొక్కరుఁడు మునిప!" (భార.శాంతి.౫—౨౩౯)

అనునట్లు, వారలంతకు ముందటి యనేక జన్మములలో యోగము నాచరించి యోగము పండి, జ్ఞానము పడసి మోక్షప్రాప్తికి నర్హులైయుండఁగా నేదియో

యొక యంతరాయమువలన యోగభ్రష్టులై తిరుగ జన్మమెత్తినవారుగ నుంచున్నారు. కాన వారి పూర్వజన్మవాసనావశమున వారికీ జన్మమున మొదటనే యట్లు జ్ఞానోదయము గలుగుటకుఁ గారణమైనది. అయితే, అట్టివారలు మిక్కిలి యరుదు. ఏల యనఁగా గర్మయోగ జ్ఞానయోగములరెంటియందును జక్కఁగాఁ దేఱిన వారలను మోక్షసిద్ధిని బొందఁ బోవు తరుణమందు నంతరాయము గలుగుట మిక్కిలి యరుదు. అట్టిసమయమున నంతరాయము గలిగి యోగభ్రష్టులైన వారికేగాని యిట్టి జన్మము గలుగనేరదు. (చూ. 4. 42)

శ్లో॥ న హి కశ్చి త్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః ॥ 5

అర్థము:— హి = ఏలయనఁగా, కః + చిత్ = ఎవఁడును, జాతు = ఒకప్పుడును, క్షణమ్ + అపి = క్షణకాలమైనను, అకర్మకృత్ = కర్మము నాచరింపనివాఁడై, న + తిష్ఠతి = ఉండఁడు, సర్వః = ప్రతివాఁడును, ప్రకృతిజైః = స్వభావజన్యములైన, గుణైః = సత్త్వరజస్తమోగుణములచేత, అవశః + (సన్) = అస్వతంత్రుఁడై, కర్మ = కర్మమును, కార్యతే + హి = చేయింపబడుచున్నాఁడుగదా.

లోకమునందుఁ బ్రతిమనుష్యునకును వాని వాని పూర్వజన్మ సంస్కారానుసారముగ సత్త్వరజస్తమోగుణములు గలుగుచున్నవిగదా! అవియే వానికి స్వభావగుణములనఁబడుచున్నవి. అటి స్వభావగుణములచే, వాఁ డాయాగుణముల కనుగుణ్యములగు చేష్టలఁ జేయుచునేయుండును గాని, యొకప్పుడైన నూరకుండఁజాలఁడు. అదె ట్లనగా, సత్త్వగుణస్వభావముగల వాఁడొకఁడు కేవలము నిఱుపేదగానుండి, తనకే కడుపునిండ భుజించుటకుఁ దగిన యాహారము లేకుండు నపుడు కేవల క్షుత్పిపాసా పీడితుఁడగు నొక యతిథి వచ్చినయెడలఁ దనకుఁ జాలిచాలకుండునట్టి యాహారములోనే వానికిఁ గొంతయిచ్చి సత్కరించునేగాని, నాకే లేనియపుడు వీని కెట్లుపచరింతునని నిరాకరింపఁజాలఁడు. ఏలయనఁగా, వాఁడు స్వభావసిద్ధమగు సత్త్వగుణము వలనఁ దనయాఁకలి యని దయార్ద్రహృదయుఁడై తనకడుపుఁ గట్టుకొనియైనను నాయతిథిని దృప్తి పఱచవలెనని తలఁచుచున్నాఁడు. కనుక వాఁడు తనకుఁ గలిగియుండు సత్త్వగుణముచేతఁ దనకు బాధకరమగు పనినైనను జేయునట్లు ప్రేరేపింపఁబడిన వాఁ డగుచున్నాఁడు గదా? మంచిది, ఇఁకను రజోగుణము గలవాని సంగతి నాలోచింతము. అట్టి గుణముగలవాఁడొకఁడు విశేష ధనవంతుఁడుగ నున్నాఁడు. వానికిఁగల ద్రవ్యము, ఏవ్యాపారమును జేయకయే బిడ్డ బిడ్డ తరమనుభవింపఁ దగినదై యుంచున్నది. అట్లుండియు నింకను ద్రవ్యమార్జింప వలెనను కోరికగలవాఁడై

యనేక విధములగు వ్యాపారములను జేయుచు, వానివలన నష్టమును బొందుచు, నెక్కుడ్రవ్యము నార్జించుటకు బదులుగాఁ దనయొద్ద నదివఱకుండునట్టి ద్రవ్యమే నానాట క్షీణించి పోవుటను గనుచున్నాఁడు. అట్లు గనుచుండియు, మానుకొనక మరల నట్టి వ్యాపారములనే చేయుచున్నాఁడు. దీనింబట్టి చూడఁగా నేవిధముననైనను ద్రవ్యము నార్జింపవలెనని యెడు నాసయే వానిని బీడింపుచుండుటచే నాయాశవలనఁ దనకుఁ బ్రతికూలమైనను నావ్యాపారములనే మరల మరల జేయునట్లు ప్రేరేపింపఁ బడిన వాఁడగుచున్నాఁడు గదా ? కానఁ బ్రతిపురుషుఁడును వానివాని స్వభావజన్యములగు సత్త్వరజస్తమోగుణములచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై, ఆయాగుణముల కనుగుణ్యములగు కర్మల నస్వతంత్రుఁడై చేయుచునేయుండునుగాని యొకప్పుడును క్షణకాలమైన నూరకుండఁడు.

అర్జు — అయితే, ఈలోకమున ననేకులు సన్న్యసించి కాషాయ దండకమండలములు ధరించి యేకర్మయు నాచరింపక భిక్షాశనమును, గ్రామైకరాత్ర నివాసమును జేయుచుండుటఁ జూచుచున్నాము గదా! అట్టి వారలందఱు నైష్కర్మ్యసిద్ధిని బొందినవారేగదా! అట్లుండ నెవఁడును క్షణమాత్రమైనను గర్మ నాచరింపక యుండఁజాలఁడని చెప్పుటకుఁ గారణమేమి ?

శ్లో॥ కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥ 6

అర్థము :—యః=ఏ, విమూఢాత్మా=మూఢబుద్ధిగలవాఁడు, కర్మేన్ద్రియాణి=కర్మేంద్రియములను (వాక్పాణిపాదపాయూపస్థలను), సంయమ్య = అడఁచిపట్టి, ఇన్ద్రియార్థాన్ = ఇంద్రియవిషయములను, మనసా = మనస్సుచేత, స్మరన్ = స్మరింపుచు, ఆస్తే = ఉంచున్నాఁడో, సః=వాఁడు, మిథ్యాచారః=కపటాచారముగలవాఁడు,(ఇతి)=అని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాఁడు.

కృ — ఓయియర్జునా ! నీవు చెప్పినది నిజమే అట్టి సన్న్యాసులనేకులను మన మీలోకమునఁ బ్రతిదినమును జూచుచున్నాము. వీరందఱును నిజముగా నాత్మజ్ఞానోదయము గలిగి విషయవాంఛానివృత్తిబొంది సన్న్యసించినవారుగారు. మఱేమనిన, ఏదియోయొక కారణముచేత, అనఁగా దారపుత్రాదులను బోషించుటకు శక్తిలేకయో, వారలతోఁ గలఁతపడియో, యేదైన నొకవ్యాపారమున గొప్పనష్టమును బొందియో సోమరితనముచేతఁ బాటుపడలేకయో, లోకులను మోసపుచ్చి వారలచే భిక్షగొని యుదరపోషణఁ జేసికొనవచ్చుననియో, యీలాటి కారణములలో నేదియో

యొకదానివలనఁ గర్మనాచరించుట మానుచున్నారు. ఇట్టివారలు బాహ్యమందుఁ గర్మనాచరింపకపోయినను, మనస్సుమాత్ర మింద్రియ విషయములయందుఁ బ్రవర్తింపుచునేయుండును. అనఁగా మంచిరుచికరమైన పదార్థమును జూచినపుడు దానిం దినవలెననియు, మంచిసంగీతము మొదలగునవి వినఁబడునపుడు వానిని వినవలెననియు, మంచియౌవన స్త్రీలను జూచినపుడు వారితో రమింపవలెననియు, మంచి పరిమళ వస్తువులఁ జూచినపుడు వాని నాఘ్రాణింపవలెననియు, నపేక్షింపుచునే యుందురు. ఇట్టియపేక్షలు మనస్సులోఁ గొట్టుకొనుచుండఁగా నట్టియపేక్ష లేమియు లేనివానివలె లోకులకగపడుటకై కరచరణాద్యవయవములతో నేపనియుఁ జేయకుండువాఁడు కపటసన్న్యాసిగాని, నిజమైన సన్న్యాసిగాఁడు. కనుక నట్టివాఁడు మూఢుఁడును, పాపాత్ముఁడునని చెప్పవలసియుంచున్నది. అయినను, నట్టివారలలో సకృత్తుగా నొకానొకఁడు మాత్రము నిజమైన సన్న్యాసిగనే యుండవచ్చును, అట్టివానిలక్షణము లెట్లుండుననఁగా

"సీ. ...... నిరాలంబమతి నిలు వెడలి కోర్కుల కెల్ల విముఖుఁడగుచు
జనముల కీడు వా క్చిత్తకర్మనోవర్తనములఁగూర్పక మైత్రి సమతఁ గరుణ
గలిగి నిందా ప్రశంసల ఖేదమును నుబ్బు లేక పాడింటను నేకతంపు
గుడిమ్రాని పొంతను గుహాలోన నుండుచు డాంబికములకు వంటలకు జోరక"

తే. గీ. భోజనములకుఁ దటియైన ప్రొద్దుగడపి
భిక్షగొనుఁ బ్రీతి మన్నన పెద్దపెట్టు
నట్టియెడఁ దక్క క్రొత్తగా నరుగు యతి ని
రంతరంబు నాత్మారాముఁడై చరించు." (భార. శాంతి. ౨ ఆ. ౩౯౩.)

అనునట్లు, సమస్తకోరికలను విడిచినవాఁడై యిల్లువెడలి సమస్త జనులకుఁ గీడేమాత్రమును జేయక వారు తన్ను భూషించునపుడు సంతోషించుటయు, దూషించునపుడు దుఃఖించుటయు లేక, యొంటరిగ నొక విజనస్థలమున, అనఁగా నొక పాడువడిన యింటియందుఁగాని, దేవాలయమందుఁగాని, చెట్టునీడను గాని, పర్వత గుహాయందుఁగాని, నివసింపుచు, దంభయుక్తముగాఁ బలుకక, తనకై వంటచేసికొనక, భోజనవేళయైనపుడు గృహస్థులయిండ్లకుఁ బోయి భిక్షఁగొనుచు నట్టి గృహస్థులలో నెవరైనఁ దనయెడల మిగుల భక్తిశ్రద్ధలతో నాదరించినను గూడ వారల యిండ్లకు మరలఁ బోక నూతనస్థలములకుఁ బోవుచు, సతతము నాత్మానుభవము సేయుచు నానందించుచుండును. ఇట్టిలక్షణములు గలవాఁడు మనమిపుడీలోకమునఁ జూచుచుండు సన్న్యాసుల వేయింటిలో నొకఁడైన నుండుట యరుదు.

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున!
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే॥ 7

అర్థము :— హేఅర్జున! = ఓయియర్జునుఁడా, యః + తు = ఎవఁడైతే, మనసా = మనస్సుచేత, ఇన్ద్రియాణి = (త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడు) జ్ఞానేంద్రియములను, నియమ్య = అడఁచిపట్టి, కర్మేన్ద్రియైః = (వాక్పాణిపాద పాయూపస్థలనెడు) కర్మేంద్రియములచేత, కర్మయోగమ్ = కర్మాచరణమును, అసక్తః + (సన్) = నిష్కాముఁడగుచు, ఆరభతే = ప్రారంభించుచున్నాఁడో, సః = వాఁడు, విశిష్యతే = శ్రేష్ఠుఁడగుచున్నాఁడు.

అట్లింద్రియములయందు మనస్సు గోట్టుకొనుచుండఁగాఁ గరచరణాద్యవయవములతోఁ గర్మనాచరింపక బిగఁబట్టికొని యుండు కపటసన్న్యాసికంటె గృహస్థాశ్రమముననుండి తనకు నియమితమైయుండు కర్మల నన్నిటిని ఫలాసక్తి లేక కరచరణాద్యవయవములతోఁ జేయుచుండువాఁడే శ్రేష్ఠుఁడు. ఏలయనఁగా, విషయముల నుండి యింద్రియములను మరలించుటకు వీనికి సాధ్యపడిన ట్లాకపటసన్న్యాసికి సాధ్యపడనేరదు. అదెట్లనిన, గృహస్థాశ్రమముననుండి యోగ్యతా వృత్తితోఁ బ్రవర్తింపుచుఁ గర్మయోగము నాచరించువాఁడు న్యాయపథము దప్పక తన కులోచిత వృత్తితో ద్రవ్యమార్జించి దానిచేఁ దనజననీజనకులను బూజింపుచు, దారపుత్రాదులను బోషింపుచు, నతిథ్యభ్యాగతులను సత్కరింపుచు, నేయే కాలమునకుఁ దగినట్లాయా యింద్రియ వ్యాపారములయందు యుక్తిమార్గమునఁ బ్రవర్తింపుచు వానివలని సుఖముల ననుభవించి తృప్తిఁబొందుచు నుండుటయేగాక యివియన్నియు దనకు భగవదనుగ్రహముచేఁ గలిగినవనియు, భగవదాజ్ఞానుసారముగఁ దాను నడచికొనుచున్నాఁడననియు, నెంచి భగవంతునియెడలఁ గృతజ్ఞుఁడై తదర్చన సేయుచుఁ తద్వారా భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడగుచు, సంతుష్టినొంది యుంచున్నాఁడు. వీఁడిట్టి స్థితి యందుండ నికనాఁకపటసన్న్యాసియొక్క స్థితి యెట్లుండు నంటివేని పైఁజెప్పిన ప్రకారము జననీజనకుల ఋణముఁ దీర్పనివాఁడును, దారపుత్రాదులను బోషింపనివాఁడును, అతిథ్యభ్యాగతుల నుపచరింపని వాఁడును, నగుటయేగాక, తానైనను సుఖపడువాఁడా యనిన నదియును లేక మోసవిధముగాఁ బరాన్నమును భుజింపుచు, విషయవాంఛలు వదలమిచే వానివలన మనస్సున నెప్పుడుఁ బీడింపఁ బడుచు, భగవద్ధ్యానమునకు బదులుగ నాయింద్రియ విషయముల నెల్లప్పుడు స్మరింపుచుండును. కావున నట్టివాఁ డిహమునకును, పరమునకును జెడినవాఁడగుచున్నాఁడు. ఇందునకు దృష్టాంతముగ నొకకథగలదు చెప్పుచున్నాను వినుము.

ఒక సన్న్యాసి వర్షకాలమున నొకనాఁడు సాయంసమయమం దొకగ్రామముఁజేరి యాగ్రామమున దేవాలయము మొదలగు విజనస్థలములుగాని, బ్రాహ్మణ గృహముగాని, లేనందున నచటఁ దనకు నాఁడు భిక్షజరుగకయు, నివసించుటకుఁ దగిన స్థలము దొరకకయు, నుండుటచేత వర్షము విడువక కురియుచుండుటచే మఱియొక గ్రామమునకుఁ బోవుటకు వీలులేనందున క్షుద్బాధచేఁ బీడింపఁబడుచు నొక కాఁపువాని యింటిపంచటరుఁగుపై నివసించియుండెను. అట్లుండ నాటి సాయంకాలమున నాయింటి యజమాని పొలమునుండి వర్షములోఁ దడియుచుఁ బశువులఁ దోలుకొని యింటికి వచ్చి యాపశువుల నన్నింటిని వాని వాని స్థలములలోఁ గట్టివేయుచు, నాపశువుల కొట్టమునను౦డెడి యసహ్యకరములగు, పేఁడ, రొంపి, మొదలగు పెంట నెత్తివేసి శుభ్రపఱచుచు, నాపశువులను జక్కఁగఁ దుడిచి వానికిఁ గావలసిన గడ్డి మొదలగు మేతల నమర్చుచు, కుడితి మొదలగు పానీయములఁ ద్రాగించుచు, వానికి దోమకాటు లేకుండుటకై పొగవేయుచు, నీపనులఁ జేయుటలోఁ దానటు నిటు రొంపిలోఁ దిరుగుచు వర్షములోఁ దడియుచుఁ గష్టపడుచుండెను. ఇది యంతయుఁ గంటితోఁ జూచుచుండిన యాసన్న్యాసి, ఆహా! వీఁడు గృహస్థుఁడు గనుకఁగదా యిట్టికష్టములన్నియుఁ బడవలసి వచ్చెను? నేను సన్న్యాసిని గనుకఁగదా యిట్టికష్టములు తగులాటము లేవియులేక హాయిగనుంచున్నానని తలఁచినవాఁడై యాకాఁపువాఁడు వినుచుండ, "సంసారీకష్టీ సన్న్యాసీ సుఖీ" యనెను. అటుపిమ్మటఁ గొంతసేపటికి, అనఁగా నీపనులన్నియుఁ దీరినపిమ్మట నాకాఁపువాని భార్య యుష్ణోదకము నమర్చి దానితో వానిదేహమంతయుఁ జక్కఁగఁదోమి స్నానముఁజేయించి, చలవపొడివస్త్రములఁ గట్టనిచ్చి గట్టుకొనివచ్చిన పిమ్మట వానికి షడ్రసోపేతముగా నుష్ణాన్నమును వడ్డించెను. వాఁడా యన్నమును దృప్తిగ భుజించి తాంబూలముచేసి భార్యచే నమర్పఁబడిన మృదుశయ్యపైఁ బవ్వళించెను. ఇవియన్నియుఁ గూడఁ జూచుచుండిన యాసన్న్యాసి, ఆహా! వీఁడు మొదటఁ గొంచెముసేపు కష్టపడినను, నిప్పుడెట్టి భోగము ననుభవింపుచున్నాఁడనియుఁ, దనకట్టిభోగములెట్లుకలుగఁగలవనియు, నెంచి, "సన్న్యాసీకష్టీ సంసారీసుఖీ", యని మరల బిగరఁగఁజెప్పెను. ఈరెండు వార్తలను రెండుమార్లు వినినయాఁకాపువాఁడా సన్న్యాసినిజూచి, అయ్యా! మీరిట్లు రెండుపర్యాయములు రెండు విధములుగఁ జెప్పుటకుఁ గారణమేమని యడిగెను. అప్పుడా సన్న్యాసి తన యావద్వృత్తాంతమును జెప్పి క్షుత్పిపాసా పీడితుఁడై కష్టపడుచుండుటను దెలిపెను. అప్పుడా కాఁపువాఁడు కనికరించి తనయింటఁ గాఁగుచుండెడు చిక్కనిపాలలో నాసన్న్యాసికిఁ దృప్తియగు

నంతవఱకుఁ బ్రాగనిచ్చెను. అందుపై నా సన్యాసి క్షుద్బాధదీఱి సుఖముగ నిద్రించెను. గాన నోయర్జునా! ఎట్టి యెదురుదుడుకు సమయములయందును, నెట్టికష్టములు సంభవించినను, జలింపకయుండఁ దగినంత దృఢచిత్తముగలవాఁడే సన్న్యాసమున కర్హుఁడుగాని, యిప్పుడు నేఁ జెప్పిన కథలోని వాని వంటివాఁడర్హుఁడు గానేరడు.

శ్లో॥ నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥ 8

అర్థము:— అకర్మణః = కర్మనుఁజేయకుండుటకంటె, కర్మ=కర్మాచరణము; జ్యాయః = శ్రేష్ఠమైనది; తస్మాత్ = కాఁబట్టి; త్వమ్ = నీవు; నియతమ్=నియమితమైన, కర్మ = కర్మమును, కురు =చేయుము, హి = ఏలయనఁగాః అకర్మణః= కర్మముఁజేయకుండునట్టి (చేయకుంటివేని), తే = నీకు శరీరయాత్రా + అపి + చ= దేహయాత్రయు (జీవించుటగూడ), న + ప్రసిద్ధ్యేత్ = సిద్ధింపఁజాలదు.

కాననోయియర్జునా! నీమనస్సట్టి పరిపాకదశను బొందియుండలేదు గనుక నీకులాచారప్రకారమాచరింపఁదగిన యీయుద్ధమునుజేయుము (చూ. 2. 31) అట్లీ నియతమైనకర్మను జేయవైతివేని యందువలన నిదివఱకు నేఁ జెప్పినప్రకారము రాజ్యభ్రష్టుఁడవును, నందఱిలో నవమానితుఁడవును, నగుదువు. (చూ. 2. 33. 34. 35. 36) అట్లగుటవలన నీవు జీవించుట గూడఁ గష్టముగానేయుండును. కావున యుద్ధకర్మము నాచరింపుము. అయితే, అట్లాచరించినపుడు నీవు గమనింపవలసిన పద్ధతి యొకటి గలదు దానిం జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గస్సమాచర॥ 9

అర్థము :— హేకౌన్తేయ! = ఓయియర్జునా! యజ్ఞార్థాత్=యజ్ఞార్థమైన (భగవత్ప్రీత్యర్థమైన), కర్మణః = కర్మముకంటె, అన్యత్ర = ఇతరమగు కామ్యకర్మమందు, అయమ్ + లోకః = ఈజనము; కర్మబన్ధనః = కర్మముచేఁ గట్టువడియున్నది, (తస్మాత్) = కనుక, తదర్థమ్ = భగవత్ప్రీత్యర్థమైన, కర్మ = కర్మమును, ముక్తసఙ్గః + (సన్) = నిరపేక్షకుండవై, సమాచర = ఆచరింపుము.

లోకమునఁ బ్రతిపురుషుఁడును దానుజేయుచుండు కర్మమును భగవన్నియమానుసారముగఁ జేయుచున్నావని తలఁచి, తత్ప్రీత్యర్థముగఁ జేయక యాత్మార్థమై చేసిన యెడల నట్టికర్మమువలన వాఁడు బద్ధుఁడై జననమరణాది రూపమగు సంసారబంధమునఁ జిక్కువడుచున్నాఁడు. కాననీవును నీయుద్ధమును జేయునపుడు నీశత్రువులను

వధించి రాజ్యమును బొంది దారపుత్త్రాదులతో రాజ్యసుఖము ననుభవింపవలెనని యెడు నపేక్షతో యుద్ధముఁ జేసితివేని యందువలనఁ గలిగెడు పుణ్యపాపములను నీవనుభవింపవలసివచ్చును. అట్లుగాక యీయుద్ధము రాజధర్మముగా భగవంతునిచే నియమింపఁబడినదై యుంచున్నది. అదియునుగాక యిది మనమైకోరక శత్రువుల ప్రయత్నమునఁ దనంతట దటస్థపడినది. భగవదిచ్ఛ యిట్లున్నదిగాన మనమీయుద్ధము నాచరించియే తీరవలెను. ఇందువలన జయము గలిగినను, నపజయముగలిగినను, భగవదిచ్ఛానుసారముగఁ గలుగనిమ్ము. నాకులాచారధర్మమునుబట్టి నేను జేయవలసిన కార్యమును జేయుచున్నానని తలంచినవాఁడవై యీ కార్యము నాచరించితివేని నీకీకర్మమువలని పుణ్యపాపము లంటనేరవు. కనుక ఫలాసక్తిని విడిచి భగవంతుని యందు భారము వేసి యుద్ధము జేయుము. ఇట్లు భగవన్నియమానుసారముగఁ బ్రతి కార్యము భగవత్ప్రీత్యర్థముగఁ జేయుటయే యజ్ఞమనఁబడును.

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! ఈయుద్ధము నిట్లు చేయుటయే యజ్ఞమని చెప్పితివిగదా, గృహస్థుఁడగు వాఁడు ప్రతిదినమును దన యాశ్రమ ధర్మమును బట్టి చేయవలసిన కార్యములనేకము లుంచున్నవిగదా, అనఁగా జననీ జనకుల యొక్కయు, దారపుత్త్రాదుల యొక్కయుఁ బోషణయు, నతిథ్యభ్యాగతిపూజనమును, ఇట్టిపనులకుఁ గావలసిన ద్రవ్యసంపాదనమును, నీమొదలగు ననేక కార్యములు చేయవలసినవాఁడై యుంచున్నాఁడుగదా, ఇవియన్నియు యజ్ఞార్థమైన (భగవద్విషయమైన) కర్మలుగానే యుంచున్నవా? అట్లు కానియెడల నీపనులవలనఁ గర్మబద్ధుండగుచున్నాఁడుగదా?

కృ — ఇవియన్నియుఁగూడ ననాసక్తచిత్తుఁడై భగవన్నియమానుసారమునఁ జేయుచున్నాననెడు నిశ్చయబుద్ధితోఁ జేసినయెడల యజ్ఞార్థమైనకర్మలుగానే యుంచున్నవి. గానవట్టి కర్మలవలన వాఁడు బద్ధుఁడు గానేరఁడు. అదెట్లనఁగా, నొకఁడు తన జననీజనకుల విషయమున వారలు తన్నుఁగని పెంచిన వారనియు, వారిల సంరక్షణార్థమై తన్ను భగవంతుఁడు వారలకుఁ బుత్త్రునిగ జన్మింపఁజేసెననియుఁ, గాన వారలను బోషించుట భగవన్నియమనమును జరిగించుటయనియు, భార్యా విషయమున నీ స్త్రీ, తనకు గృహిణిగానుండి తనకుఁ గావలసిన సమస్తోపచారములను జేయుటకును సమస్తసుఖముల నిచ్చుటకును, దనచేఁ బోషింపఁబడుటకును, భగవంతునిచే నియమింపబడి జన్మించినదనియుఁ. గాన, నా స్త్రీని బోషించుట భగవన్నియమనమనియుఁ. బుత్త్రుల విషయములోఁ దన్ను వార్ధక్యదశయందుఁ బోషించి కాపాడుట మొదలగు కార్యములకు గా వీరల భగవంతుఁడు దనకుఁ బుత్త్రులనుగ జన్మింపఁజేసెననియుఁ, గాననిట్టి వీరలసంరక్షించుట తనకు భగవన్నియమన మనియు, నతిథ్యభ్యాగతుల విష

యములో భగవంతుఁడీ రూపమునం దనవలస నాతిథ్యమును బొంది సంతోషింపఁ దలఁచి సాక్షాత్కరించినాఁడనియుఁ, గాన నిట్టి వారలఁ బూజించుట తనకు విధికృతమనియు నీ మొదలగు సమస్త గృహస్థాశ్రమధర్మముల జరుపుటకుఁగా ద్రవ్యోపపత్తి కావలసియుంచున్నది. కాననట్టి ద్రవ్యమును దన కులాచార ధర్మానుసారముగా న్యాయపథముఁ దప్పక యార్జించుటయును, భగవన్నియమనమేయని యెంచి యిట్టిపనుల యందుఁ బ్రవర్తించుటయు, నిట్లు దృఢముగ నమ్మి యా యా కార్యములందుఁ బ్రవర్తించుచున్న యెడల నట్టి కార్యములన్నియు. యజ్ఞార్థముగ, అనఁగా భగవత్ప్రీత్యర్థముగఁ జేయఁబడిన కర్మలే యగుచున్నవి గాని, యాత్మార్థమైయాసక్తితోఁ జేయఁబడిన కర్మలుగా నేరవు. కాననట్టి కర్మలవలని పుణ్యపాపములన్నియు భగవదర్పితములే యగుచున్నవి గాని, చేసినవానినంట నేరవు.

అర్జు — ఇపుడు నీవు చెప్పిన విషయములను బట్టి చూడఁగాఁ బ్రతిపురుషునకు నిట్టి యజ్ఞము సహజకర్మముగానే యున్నట్లగపడుచున్నదే.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్ ॥ 10

అర్థము :— పురా=పూర్వమందు, ప్రజాపతిః=బ్రహ్మ, ప్రజాః=ప్రజలను, సహయజ్ఞాః=యజ్ఞముతోఁ గూడినవారినిగా, సృష్ట్వా=సృజించి, అనేన=ఈయజ్ఞాదికర్మముచేత, ప్రసవిష్యధ్వమ్=వృద్ధిఁబొందుఁడు, ఏషః=ఈయజ్ఞము, వః=మీకు, ఇష్టకామధుక్=ఇష్టములగు కోరికలనిచ్చునది, అస్తు=అవుఁగాక, ఇతి=అని, ఉవాచ=చెప్పెను.

కృ — అవునుఁ ఇది సహజకర్మముగానే యుంచున్నది, అదెట్లనఁగా, పూర్వము బ్రహ్మ జగములను సృజించు కాలమున జనులను సృజించునపుడు వారితోఁ గూడ భగవదారాధన రూపమగు యజ్ఞమును సృజించి, అనఁగా భగవదారాధన కొఱకై యేవారలను సృజించి వారలతో నిట్లనియె. ఓజనులారా! మీరలు యజ్ఞము నాచరింపుచు దీనివలనఁ బుత్రపౌత్రాభివృద్ధిగా నుండుఁడు. ఈయజ్ఞము మీకోరికల నిచ్చుఁగాక యనిచెప్పెను. అందుచేత యజ్ఞము ప్రతిపురుషునకును సహజ కర్మముగా అనఁగాఁ దప్పక యాచరింపవలసినదిగానే యుంచున్నది.

శ్లో॥ దేవాన్భావయతాఽనేన తే దేవా భావయన్తు వః ।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ 11

అర్థము :— అనేన=ఈయజ్ఞముచేత, దేవాన్=దేవతలను. భావయత=తృప్తి పఱుపుఁడు. తే+దేవాః=ఆదేవతలు, వః=మిమ్ము. భావయన్తు=తృప్తిపొందింతురు గాక, పరస్పరమ్=అన్యోన్యము. భావయన్తః+(సన్తః)=తృప్తిఁబొందుచున్నవారై, పరమ్=మిక్కిలి, శ్రేయః=శ్రేయస్సును, అవాప్స్యథ=పొందుఁడు.

ఆబ్రహ్మ మఱియు నేమి చెప్పెననఁగా, ఓజనులారా! మీర లీ యజ్ఞముచేత దేవతల నారాధింపుఁడు. వారలు మిమ్ము క్షేమపఱతురు. ఇట్లు పరస్పరాభివృద్ధిని గోరుచున్నవారై మీరు మిగుల శ్రేయస్సును బొందుదురుగాక యని చెప్పెను.

అర్జు — ఇంతకు ముందు నీవు చెప్పుచు వచ్చిన విషయములో "యుక్త ఆసీత మత్పరః" (చూ 2-61) యోగియై నాయందాసక్తి గలవాఁడై యుండవలసినదని చెప్పియుంటివిగదా? ఇప్పుడు, బ్రహ్మ జనులను సృజించునపుడు మీరు దేవతల నారాధింపుఁడని బహువచనముచేఁ జెప్పుట చూడఁగా నీకంటె నితర దేవతలు గూడ నున్నట్లగపడుచున్నదే! అట్టి దేవత లెవరు?

కృ — ఈప్రపంచమునకు సృష్టిస్థితిలయకర్తను నేనొక్కఁడనేగాని, నాకంటె నితర దేవత లెవ్వరును లేరు. ఆయితే,

"చ. గురుఁడు హిరణ్యగర్భుఁడని కొందఱు కొందఱిల న్మహా విరా
ట్పురుషుఁడటంచుఁ గొందఱు బుభుక్ప్రభుఁడంచు ముకుందుఁడంచుఁ గొం
దఱు శివుఁడంచుఁ గొందఱు వినాయకుఁ డంచును గొందఱుం బరా
పరవరు నన్నెఱుంగక యుపాస్తియొనర్తురు రజ్జులై తగన్."

(సీ - రా. ౨. ఆ. 33)

అనునట్లీ భూలోకమునందలి జనులందఱును నా నిజస్వరూపము నెఱుంగఁ జాలక యందుఁ గొందఱు బ్రహ్మయనియుఁ, గొందఱు విష్ణువనియుఁ, గొందఱు శివుఁ డనియుఁ, గొందఱు విష్వక్సేనుఁ డనియుఁ, గొంద ఱింద్రుఁ డనియుఁ, గొందఱు సూర్యుఁ డనియు, నిట్లనేక విధములుగ భావించుచుఁ, దత్తదను రూపంబులగు పూజాద్రవ్యములచే నారాధింతురు. కాన నట్టి యారాధనము లన్నియు నాయందే సమర్పణములగుచు నేనే వారి వారి యిష్ట దేవతా రూపములతో వారి వారి యభీష్టముల నిచ్చుచుందును.

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥ 12

అర్థము:—యజ్ఞభావితాః = యజ్ఞములచేఁబూజింపఁబడిన, దేవాః = దేవతలు, వః = మీకు, ఇష్టాన్ = ప్రియములైన, భోగాన్ = భోగములను, దాస్యన్తే+హి = ఇవ్వఁగలరుగదా, తైః = ఆదేవతలచేత. దత్తాన్ = ఇవ్వఁబడినవానిని, ఏభ్యః = ఈః (యిష్టభోగములనిచ్చు దేవతలకొఱకు,) అప్రదాయ = ఇవ్వక, యః = ఎవఁడు, భుఙ్క్తే = అనుభవించుచున్నాఁడో, సః = వాఁడు, స్తేనః+ఏవ = చోరుఁడే.

కాన నోయి యర్జునా! బ్రహ్మ యీ జనులతో మఱియు నేమిచెప్పెననఁగా, ఓజనులారా! యజ్ఞములచే నారాధింపఁబడిన దేవతలు మీకిష్టమైన భోగముల నిత్తురుగదా, కాన నాప్రకారము మీరు దేవతానివేదనముఁ జేయుచుఁ దచ్ఛేషమును భుజింపుచుండవలెను. అట్లు వారలచే నివ్వఁబడిన పదార్థములను వారలకు నివేదించి తచ్ఛేషమును భుజింపక యెవఁడైన నంతయుఁ దానే భుజింపుచున్నాఁడో, యట్టి వాఁడు దొంగయనఁబడుచున్నాఁడు.

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! దేవతలు సమస్తభోగముల నిచ్చుచున్నారనియు, వారలచే నివ్వఁబడ్డ పదార్థముల వారికే నివేదింపవలెననియు, నట్లు నివేదింపక యనుభవించువాఁడు దొంగయనియుఁ జెప్పుచున్నావే యిందుకుఁ గారణమేమి? వార లిచ్చిన పదార్థములలోఁ గొంతభాగము మరల వారల కిచ్చుటచే వారల కెట్లు ప్రీతిగలుగును? అట్లు వారల కివ్వక యనుభవించుటచే దొఁగ యెట్లగుచున్నాఁడు? ఇది నాకుఁ జక్కఁగ బుద్ధికి నవగాహనగాక యున్నది. కనుక దయచేసి వివరించి చెప్పుము.

కృ — ఓయర్జునా! నీవు రాజ్యమేలెడి రాజువుగదా, నీవలన వేతనములఁ బుచ్చుకొనుచు ననేకులు నీకొలువు గొలుచుచున్నారుగదా, అట్లు చేయుటకుఁ గారణమేమి?

అర్జు — వారలు నన్నుఁగొలుచుటకైరయే నేను వారలకు జీతముల నిచ్చుచున్నాను గనుక వారలు నాకొలువు గొలుచుచున్నారు.

కృ — మంచిది, నీకొలువుడుగాండ్రలోఁ గొందఱు నీకుఁ బరిచర్య చేయుటయే గాక యప్పుడప్పుడు మంచి రుచికరములగు ఫలాదులను దెచ్చి కానుకలుగ నిచ్చుచున్నారు. మఱికొంద ఱట్లు చేయక నిరాకరించి యుంచున్నారు. అప్పుడీ రెండు తరగతుల వారిలో నెవరియందు నీకు నభిమాన మెక్కువగనుండును?

అర్జు — అప్పుడప్పుడు నాకుఁగానుకలు సమర్పించువారియందే యభిమాన మెక్కువగనుండును, తక్కినవారియం దట్టి యభిమానముండనేరదు.

కృ — మంచిది, నీవిచ్చిన వేతనములలోనుండి ప్రయపడిచి తెచ్చిన కానుకలా; లేక, మఱియొకవిధముగా సంపాదించి తెచ్చినవిగా నుండెనా?

అర్జు — నేనివ్వకున్న, వారల కెక్కడనుండి వచ్చును? కనుక నేనిచ్చినదానిలోనే కొద్దిగా ప్రయపడిచి తెచ్చుచున్నారని యెంచవలసియున్నది.

కృ — అవునుగదా, అప్పటికి దానివలన నీకేమి ప్రయోజనము గలిగినట్లు? నీకులేని వస్తువు నేమైన వారలు తెచ్చి యిచ్చిరా? లేక, వారలది తెచ్చి యివ్వకపోయినయెడల నీకేమైనఁ దక్కువయగునా? కనుక నట్టివారలయందు నభిమానముంచవలసిన కారణమేమి?

అర్జు — నాకు వారలిచ్చునట్టి కానుకలవలన నేమియుఁ బ్రయోజనము లేకపోయినను వారలట్లు చేయుటచే వారలకు నాయెడలఁగల భక్తిశ్రద్ధలను, కృతజ్ఞతను గనఁబఱచుచున్నారు, గాన వారియందు నేనభిమానించుట సహజమేగదా!

కృ — మంచిది, వారల నభిమానించుటచే వారికేమైనను బ్రయోజనము గలుగునా?

అర్జు — ఆహా! కలదు. నాకెప్పుడైతే వారియందభిమానము గలుగుచున్నదో వారలకప్పుడే వేతనములు వృద్ధిచేయుట మొదలగు మేలులను జేయుదునుగదా! అందువలన వారు క్రమక్రమముగా నభివృద్ధిఁ బొందఁదగియుందురుగదా, అట్లు చేయని వారియెడలనైననో, నాయందు భక్తిశ్రద్ధలు, కృతజ్ఞతయు, లేనివారని తోఁచుచున్నదిగదా, అట్లుతోఁచినప్పుడు వారికి వేతనాభివృద్ధి మొదలగు మేలుఁజేయ నాకెట్లు మనస్సు వచ్చును! అందునకు బదులుగ వారిని నానాటక్షీణగతికిఁ దేవలయునని యే తోఁచుచుండునుగదా?

కృ — మంచిది, ఇదే ప్రకారముగా నింద్రాదిదేవతలు జనులకు జీవనాధారములగు పదార్థముల నిచ్చుటకై భగవంతునిచే నియమింపఁబడియున్నారు. కాఁబట్టి వారలిచ్చు పదార్థములలోఁ గొంత వారికిఁ గృతజ్ఞతా సూచకముగ నివేదించుటచే సంతోషించినవారలై మరల నెక్కుడుగ నిచ్చుచుందురు. అందువలన జనులు శ్రేయోభివృద్ధిని బొందుచుందురు.

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః।
తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మకారణాత్॥ 13

అర్థము:— యజ్ఞశిష్టాశినః = భగవదారాధనచేసి మిగిలినదానిని భుజించెడు, సన్తః = సత్పురుషులు, సర్వకిల్బిషైః = సమస్తపాపములచేత, ముచ్యన్తే = విడువఁ

బడుచున్నారు, యే = ఎవరు, ఆత్మకారణాత్ = ఆత్మార్థముగా (తామే భుజించుటకై), పచన్తి = వంటచేసికొనుచున్నారో, తే + పాపాః + తు = అట్టి పాపులైతేనో, అఘమ్ = పాపమును, భుఞ్జతే = అనుభవించుచున్నారు.

కాన నోయి యర్జునా! నేనిదివఱకుఁ జెప్పిన ప్రకారము జనులు దమకు జీవనాధారములగు పదార్థముల నిచ్చుచుండెడు దేవతలను యజ్ఞములచే నారాధింపవలసినది యత్యావశ్యకము గాన బుద్ధిమంతులైనవారు యజ్ఞములచే నట్టిదేవతల నారాధించి వారికి నివేదించిన ప్రసాదమును భుజించి యుజ్జీవింపుచు సమస్తపాపముల నుండి విముక్తులగుచుందురు. అట్లు చేయక యెవఁడు స్వోదరపూరణార్థమైయే యన్నాదులను బచనము చేసికొనుచున్నాఁడో యట్టివాఁడు పాపస్వరూపమగు నన్నమునే భుజించినవాఁ డగుచున్నాఁడు. అనఁగా, నట్టి యన్నమును భుజించుటవలనఁ బాపమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడని యర్థము.

అర్జు — యజ్ఞములనఁగానేవి? అగ్నిష్టోమాది యజ్ఞములకు మాత్రమే యన్వయింపుచున్నవా? అట్లయినచో నందఱకిని నవి యెట్లు చేయుటకు సాధ్యపడును?

కృ — ఇచ్చట యజ్ఞములనఁగా నగ్నిష్టోమాదులకే కాదు

"తే. గీ. అతిథి పితృదేవతాపూజ లాచరించి
కాని గృహమేధులకు భోజ్యమైనఁ గుడువఁ
దగదు యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ
నార్యజనములు సెప్పుదు రధిపవర్య!" (భార. శాంతి. ౧ ఆ. ౩౨౭)

అనునట్లు, ప్రతిపురుషుఁడును నొకయిష్టదైవము నారాధించుట గలదుగదా! ప్రతిదినమును దాను పాకముఁ జేసికొనెడు పదార్థములను దానారాధించు నిష్టదైవమునకు నివేదనచేసి యాప్రసాదమును బిమ్మట భుజించుటయును యజ్ఞమే యనఁబడును. దైవఁ మానుషరూపేణ అని యున్నది గనుక, నతిథికిని, నభ్యాగతునకును నిచ్చుటగూడ దేవతాప్రీత్యర్థము చేయఁబడు యజ్ఞములలో చేరుచున్నది. ఇదిగాక, సకలభూతములును భగవత్స్వరూపమే గనుకఁ దనయింటివెనుసరించి తిరుగుచుండెడు శునక మార్జాలాది జంతువులకుఁ గూడ నన్నము వేయుట దేవతాప్రీత్యర్థము చేయఁబడు యజ్ఞములలోనే చేరుచున్నది. ఇట్లు చేయుట ప్రతిపురుషునకును దానెంత రిక్తుఁడైనను, నేమలఁడైనను, దనతన శక్త్యనుసారముగఁ జేయుటకు సాధ్యమైన పనియే గాని యసాధ్యమైనది గాదు. ఇట్లు చేయుటవలన భగవంతునకుఁ బ్రీతి గలుగఁ దగియుంచున్నది. అట్టిప్రీతియెప్పుడు గలుగుచున్నదో యప్పుడు వాని పాపములు పరిహార

ములగుచున్నవి. ఇఁక నట్లు చేయనివాని కన్నను, అనఁగాఁ బాకము చేయబడిన పదార్థములను భగవన్నివేదన చేయకయుఁ, దన శక్త్యనుసారముగ నతిథ్యభ్యాగతులకుఁ బెట్టకయుఁ దనకుఁ దనయింటఁ గాచికొనియుండెడు శునకాదులకైనఁ బెట్టక వండినదంతయు నెవఁడేని తనకుటుంబమునకు మాత్రమే యుపయోగించుకొనుచున్నాఁడో యట్టివాఁడు కేవలము స్వోదరపూరణార్థమైయే వండికొనిన వాఁడగుచున్నాడు. కాఁబట్టి యట్టివాఁడు పాపాత్ముఁడు.

శ్లో॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ 14

అర్థము :— భూతాని = ప్రాణులు (పంచభూతాత్మకమగు శరీరములు గల జీవాత్మలు), అన్నాత్ = అన్నమువలన, భవన్తి = కలుగుచున్నవి. అన్నసమ్భవః — అన్నముయొక్క-యుత్పత్తి, పర్జన్యాత్ = మేఘమువలన, (భవతి) = అగుచున్నది, పర్జన్యః = మేఘము, యజ్ఞాత్ = యజ్ఞమువలన, భవతి = కలుగుచున్నది. యజ్ఞః = యజ్ఞము, కర్మసముద్భవః = కర్మమువలనఁ గలుగుచున్నది.

అయితే, ఇట్లు యజ్ఞరూపక మగు దేవతారాధనమువలనఁ గలిగెడు ప్రయోజన మేమంటివేని చెప్పెద వినుము. అట్టి యజ్ఞములవలన దేవతలకు బ్రీతిగలుగుచున్నది. అందుచే వారలు కాలవర్షములు చక్కఁగఁ గురిపింతురు. దానివలన సస్యములు చక్కఁగా ఫలించును. అందువలన జనులకు నాహారపదార్థములు పుష్కలముగ దొరకును. అట్లుదొరుకుటచే మనుష్య పశుపక్ష్యాదులు మిక్కిల నభివృద్ధి నొందుచుందురు. కాన జనులు దేవతారాధన చక్కఁగా జరిగింపుచుండవలెను. కర్మచేయనియెడల, అనఁగాఁ గరచరణాద్యవయవములతోడ నాయా కాలమునకుఁ దగినట్లు పనులు చేయనియెడల, నట్టి దేవతారాధనము చేయుటకు వీలుపడదు. గానఁ బ్రతిమనుష్యుఁడును గర్మనాచరించియే తీరవలెను.

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ 15

అర్థము :— కర్మ = కర్మమును, బ్రహ్మోద్భవమ్ = బ్రహ్మవలన బుట్టినదానిఁగాను, బ్రహ్మ = బ్రహ్మమును, అక్షరసముద్భవమ్ = విరాట్పురుషునివలనఁ గలిగినదానిగాను, తస్మాత్ = ఆ కారణమువలన, సర్వగతమ్ = సర్వవ్యాప్తియైన, బ్రహ్మ = బ్రహ్మమును, నిత్యమ్ = ఎల్లప్పుడును, యజ్ఞే = యజ్ఞమందు, ప్రతిష్ఠితమ్ = ఉంచబడినదానినిగాను, విద్ధి = తెలిసికొనుము.

అట్టి కర్మమన్ననో, బ్రహ్మవలనఁ బుట్టినదగుచున్నది. అదెట్లనఁగా, "సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః" (చూ-3-10) బ్రహ్మ, జనులను యజ్ఞములతోఁ గూడఁ బుట్టించినాఁడని యిదివఱకే నేను జెప్పియుంటినిగదా, అట్టి యజ్ఞము కర్మము వలనఁ బుట్టినదని యిప్పుడేర్పడుచున్నదిగదా! కాన నట్టి యజ్ఞములకు హేతుభూతమగుకర్మ, బ్రహ్మవలననే పుట్టిన దగుచున్నది. అట్టి బ్రహ్మ యనగా సృష్టికర్తయగు ప్రజాపతి యన్ననో, "అక్షరసముద్భవమ్" నాశరహితుఁడగు విరాట్పురుషునివలన, అనఁగాఁ బరబ్రహ్మమునుండి పుట్టినవాఁడుగా నుంచున్నాఁడు. కనుక సమస్తమునందును నాపరబ్రహ్మమే వ్యాపించి యుండుచున్నదనియుఁ, గాన నాపరబ్రహ్మమే యీయజ్ఞమునందుంచున్నాఁడనియు, అనఁగాఁ గర్మరూపకమగు యజ్ఞము నాపరబ్రహ్మస్వరూపమే యనియు నెఱుఁగ వలయును.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయురిన్ద్రియారామో మోఘం ప్రార్థ! స జీవతి॥ 16

అర్థము :- హేపార్థ!=ఓయర్జునా! యః=ఎవఁడు, ఏవమ్=ఇటు (పైఁజెప్పబడిన ప్రకారము), ప్రవర్తితమ్=ప్రవర్తింపఁజేయఁబడిన, చక్రమ్=లోకచక్రమును, ఇహ=ఈలోకమునందు, న+అనువర్తయతి=అనుసరింపఁడో, సః=వాఁడు. అఘాయుః=పాపమయమగుజీవనము గలవాఁడును, ఇంద్రియారామః+(సన్)=ఇంద్రియ విషయాసక్తుఁడునునై, మోఘమ్=వ్యర్థముగా, జీవతి=బ్రదుకుచున్నాఁడు.

కాన నోయర్జునా! ఇది చక్రాకారముగాఁ దిరుగుచున్నది. అదెట్లనఁగా, యజ్ఞము జనులతోఁగూడ బ్రహ్మచే నుత్పత్తిచేయఁబడినది. ఆయజ్ఞమువలన దేవతలు ప్రీతులగుచున్నారు. (చూ-3-11); అట్లు ప్రీతులై వర్షమును గురిపించుటవలన లోకుల కాహారవస్తువులు సమృద్ధిగా దొరకుచున్నవి. అట్లాహారవస్తువులు సమృద్ధముగాఁ దొరకుటవలన జనులు (యజ్ఞమును) అనఁగా, భగవదారాధన రూపమగు కర్మను జేయ శక్తులగుచున్నారు. అట్టికర్మ యన్ననో, అభగవంతునియందే సమర్పణమగుచున్నది. గాన నీయజ్ఞరూపకమగుకర్మ, యేపరబ్రహ్మమునుండి పుట్టినదో యిన్ని కార్యములుచేసి తుదకు నాపరబ్రహ్మమునందే చేరుచున్నది. కాన నిది చక్రము వలెఁ దిరుగుచున్నదని చెప్పదగియుంచున్నది. కాఁబట్టి యీవిషయము నెవ్వఁడేని చక్కఁగ నెఱిఁగి, అనఁగాఁ దానుజేసెడు కర్మయంతయుఁ బరమాత్మునివలననే గలిగినదనియు, దానిఫల మాపరమాత్మునికే చెందవలసినదిగా నున్నదనియు నెఱుఁగఁజాలక యాత్మార్థమని యెంచి దానిఫలమును దానే యనుభవింపగోరి

యింద్రియవిషయములయందుఁ బ్రవర్తించుచున్నాఁడో యట్టివాఁడు పాపాత్ముఁడగు చున్నాఁడు. కానవాని జీవనము వ్యర్థమైనదిగా నుంచున్నది.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే॥ 17

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥ 18

అర్థము :— యః=ఏ, మానవః+తు=మనుష్యుఁడైతే, ఆత్మరతిః+ఏవ=తన లోఁదానే యానందించువాఁడును, ఆత్మతృప్తః+చ=తనలోదానే తృప్తిఁబొందిన వాఁడును, ఆత్మని+ఏవ=తనయందే, సన్తుష్టః+చ=సంతోషపడుచుండువాడును, స్యాత్=అగునో, తస్య=వానికి, కార్యమ్=చేయఁదగినది (కర్మతో అగత్యము); న+విద్యతే=లేదు. తస్య=వానికి (పైఁజెప్పఁబడిన లక్షణములు గలవానికి), ఇహ=ఈలోకమునందు, కృతేన=కర్మమును జేయుటచేత, అర్థః=ప్రయోజనము, న+ఏవ=లేనేలేదు, అకృతేన=కర్మమును జేయకుండుటచేత, కశ్చన=ఏదియు, (అర్థః)=ప్రయోజనము, న=లేదు, అస్య=వీనికి, సర్వభూతేషు=సమస్తభూతముల యందును, కః+చిత్=ఏదియును, అర్థవ్యపాశ్రయః+చ=ప్రయోజనముకొఱకు నాశ్రయింపఁదగినదియును, న=లేదు.

ఇంతవఱకుఁ గర్మనాచరింపవలసిన వారి విషయమై చెప్పితినిగదా! ఇఁకనట్టియే కర్మయుఁ జేయవలసిన నిమిత్తములేని వారల లక్షణమును జెప్పుచున్నాను వినుము. ఎవఁడైతే కేవల బ్రహ్మజ్ఞానిగనుంచున్నాఁడో, అనఁగాఁ బ్రపంచ మంతయు మిథ్యయనియు, నాత్మయొక్కఁడే నిత్యమైన వస్తువనియు నిశ్చయముగ నెఱుఁగు చున్నాఁడో వానికి

“ సీ. ఏదేశముననైన నేకాలముననైన నేమిసేయుచునైన నెట్టులైన
నఖిల వికారంబు లావిద్యకంబులు నే నవి కాకుండ నిష్ప్రపంచ
నిర్వికల్పాఖండ నిశ్చల నిర్మలావ్యయ సచ్చిదానందమయ నిరీహ
పరిపూర్ణనిర్గుణ ప్రత్యగాత్మాభిన్న పరమాత్ముఁ డనటంచుఁ బరమనిష్ఠ
తే. గీ. సంతతంబును దనుఁగాంచు సజ్జనునకు
మంత్రతంత్రంబులేల కర్మంబు లేల
జపతపోవ్రతదానయజ్ఞంబు లేల
నామవర్ణాశ్రమాభిమానంబులేల? ” (సీ. రా. ౨ ఆ. ౧౨౨)

అనునట్లు, ఈప్రపంచమునందలి యావద్విషయములయందును గలిగియుండెడు నాసక్తి తనంతఁ దానే నివర్తియై కేవలాత్మానుభవమునందే యాసక్తి గలిగి తనలోఁదానే సుఖించుచు నుంచున్నాఁడు. కాన వానికిఁ దనతృప్తి నిమిత్తముగాని, సుఖమునిమిత్తముగాని చేయవలసిన దేమియునుండదు సరేగదా, వానికి నే కర్మనైన నాచరించుటచేఁ బ్రయోజనమును, నాచరింపమిచే లోపమును, లేకపోవుటయే గాక యేవిషయమును గుఱించియు నెవరినైనను సరే యాశ్రయింపవలసిన యావశ్యకముగూడ నుండనేరదు.

అర్జు—అయ్యా! అట్టివాఁడు తనలోఁదానే తృప్తిఁబొందుచున్నాఁ డని యంటివిగదా, యెట్లు తృప్తిఁ బొందుచున్నాఁడు? వివరించిచెప్పుము.

కృ—ఎట్లనఁగా, కాముకుఁడుగా నుండు నొకపురుషుఁ డొక స్త్రీ లభించిన యెడల దానితో సాంగత్యముఁజేసి కామమును దీర్చుకొని తృప్తినొందుచున్నాఁడు. అస్త్రీ లభింపనియెడల నావిషయమును గుఱించి యెప్పుడును జింతాక్రాంతుఁడై యుంచున్నాఁడు. జ్ఞానియైననో, అట్టి స్త్రీవాంఛ బొత్తిగా లేనివాఁడగుచున్నాడు గనుక నా స్త్రీ లేకపోయెననెడు కొఱఁతను మనస్సునఁ బెట్టక, స్త్రీలభించునపుడు కాముకుఁడెట్లు తృప్తుఁడగుచున్నాఁడో యట్లే తృప్తుఁడై యుంచున్నాఁడు. మఱియు, జిహ్వాచాపల్యముగల యొకఁడు మంచిరుచిగల పదార్థములు లభించినపుడు వానిని భక్షించుటచేఁ దృప్తుఁడగుచున్నాఁడు. అట్టిపదార్థములు లభింపకుండునపు డతృప్తుఁడగుచున్నాఁడు. జ్ఞానియో, అట్టి జిహ్వాచాపల్యములేని వాఁడు గనుకఁ దన కాహారార్థము భగవదిచ్ఛానుసారముగ నెప్పుడెద్ది యప్రయత్నముగ లభింపుచున్నదో, అప్పుడు దానినే పంచభక్ష్యపరమాన్నములుగ భావించుకొని దానిని భక్షించి తృప్తి బొందుచున్నాడు. రుచికరమగు పదార్థము దొరికినపుడు తృప్తినొందుటయును, రుచికరముగాని పదార్థము దొరకినపుడు తృప్తినొందకపోవుటయు నుండదు. ఇదేతీరున దక్కిన యన్ని విషయములందును సదా తృప్తిఁబొందిన వాఁడుగానే యుంచున్నాఁడు.

అర్జు—మంచిది, అట్టిజ్ఞానికిఁ బ్రపంచవిషయములలో దేనియందును నాసక్తి లేక యుండునపుడు తనలోఁదాను సంతోషించుట యెట్లుగలుగును?

కృ—అట్టిజ్ఞానియైనవాఁడు ప్రపంచమునంతయు మిథ్యయనియు, నాత్మ యొక్కటియే నిత్యమగు పదార్థమనియు, నెఱిఁగినవాఁడగుచున్నాఁడు. కనుక నట్టి యసత్యపదార్థముల విషయములో, లోకులు భ్రమఁజెంది మూఢులై వానినే నిత్యపదార్థములుగా భావించి యావిషయములలో ననేకపాట్లుపడుచు నిత్యపదార్థమగు నాత్మ విషయములో నేమియుఁ బ్రయత్నము చేయక సంసారసముద్రమున మునుఁగుచుఁ దేలు

చు నుండువారలఁజూచి యోహో! వీరలు మూఢులై నిత్యానిత్యవస్తువివేకము లేక చెడుచున్నారుగదా! నేను భగవదనుగ్రహముచే నిట్టివిమూఢత్వము లేక నిత్యపదార్థమును దెలిసికొని సంసారబంధము వదలించుకొని మోక్షము కరతలామలకముగఁ జేసికొనియున్నానుగదా యని తనలోఁదాను సంతోషించుచున్నాఁడు. కనుక నే యట్టివాఁడెప్పుడును విషయములయందాసక్తినుంచక పరబ్రహ్మస్వరూపమగు నాత్మనే ధ్యానించుచుండును. (చూ-2-69.)

— శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19

అర్థము—తస్మాత్=ఆకారణమువలన, అసక్తః+(సన్)=ఫలాపేక్షలేనివాఁడవై, సతతమ్=ఎల్లప్పుడును, కార్యమ్=చేయఁదగిన, కర్మ=కర్మమును, సమాచర=చేయుము, హి=ఏలయనఁగా, పూరుషః=పురుషుఁడు, అసక్తః+(సన్)=ఫలాపేక్షలేనివాఁడగుచు, కర్మ=కర్మమును, ఆచరన్=చేయుచున్నవాఁడై, పరమ్=మోక్షమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు.

కనుక నోయి యర్జునా! జ్ఞానియగువానికిఁ గర్మాచరణముతో నావశ్యము లేదని యిప్పుడు నేఁ జెప్పిన యంశములవలన దెలిసికొని యుండుదువుగదా, నీకైననో, యట్టి జ్ఞానసంపత్తిలేదు గనుకఁ గర్మనాచరించియే తీరవలసినది. అయితే, ఫలాపేక్షను వదలి నీకునియతమై యుండు కర్మనాచరింపుము. ఏలయనఁగా, నేపురుషుడైనను సరే ఫలాసక్తిని విడిచి కర్మ నాచరించినయెడల నట్లాచరింపుచు రాఁగారాఁగా జ్ఞానోదయమగును. తద్వారా మోక్షమున కర్హుఁడగును.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః
లోకసఙ్గ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥ 20

అర్థము:—జనకాదయః=జనకచక్రవర్తి మొదలగువారు, కర్మణా+ఏవ=కర్మముచేతనే, సంసిద్ధిమ్=మోక్షమును, ఆస్థితాః+హి=పొందిరిగదాని, తస్మాత్=కాఁబట్టి, త్వమ్=నీవు, లోకసఙ్గ్రహమ్+అపి=లోకులకు మంచిమార్గమును జూపుటయను ప్రయోజనమునైనను, సంపశ్యన్=లెస్సగాఁ జూచినవాఁడవై (ఆలోచించినవాఁడవై) కర్తుమ్=+ఏవ=కర్మముఁజేయుటకొఱకే, అర్హసి=తగుదువు

నీకు జ్ఞానోదయము గాకపోవుటచేఁ గర్మనాచరించుట యగత్యమైన సంగతి యటుండనిమ్ము; ఒకవేళ నీవు జ్ఞానివిగానుండి కర్మతో నిమిత్తము లేనివాఁడవై యుండినను, లోకసంగ్రహము కొఱకైనను, అనఁగా జనులకు మంచిమార్గమును

జూపుటకైనను, నీవు కర్మనాచరింపవలసియుంచుచున్నది. జనకచక్రవర్తి బహ్మజ్ఞాన సంపన్నుఁడైన సంగతి నీవు వినియుందువుగదా! ఆయనయొక్క జ్ఞానమెట్టిదనఁగా, ఏలాటికర్మముతోడను నిమిత్తములేని శ్రీశుకులు మొదలగు మహర్షులకుఁ గూడ జ్ఞానోపదేశముఁ జేసినవాఁడు. అట్టి మహానుభావుఁడుగూడ సాధారణులగు రాజులవలె రాజ్యపరిపాలనముఁ జేయుచు, నారాజ్యాంగమునకుఁ దగిన యావత్కార్యములను యథావిధిగ నెఱవేర్చుచు వచ్చెను. ఇట్లు నెఱవేర్చుచుండియు నొకదానియందును లేశమైన నాశక్తినుంచినవాఁడుగాఁడు. అయితే, అట్టివాఁడేల యిట్టి రాజ్యభారమును వహించి కాయిక మానసిక క్లేశములకుఁ గారణములగు కార్యముల నిర్వహించెననియెదవో, తనవంటి యితరరాజులు తానాచరించునట్లే రాచకార్యముల నిర్వర్తింపుచు, న్యాయపరిపాలన మొనర్చి తద్వారా జనులకు సుఖమును గలుగఁజేయుచు రక్షించునటుల మార్గముఁజూపుటకొఱకే గాని తదితరమగు నేప్రయోజనము కొఱకును గాదు. కాన నీవును నట్లే నియతమగు కర్మనాచరింప వలసియుంచున్నది.

అర్జు — అయ్యా! మంచిది, ఇట్లు చెప్పితివే, నాకు నియతమగు కర్మను నే నాచరించుటచే నితరులకు నేలాటి ప్రయోజనమైన నెట్లు గలుగును? అట్లు నాకు నియతమగు కర్మను నే నాచరింపక పోయిన యెడల నితరుల కెట్టి బాధకము గలుగును?

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ 21

అర్థము:— శ్రేష్ఠః = శ్రేష్ఠుఁడగువాఁడు, యత్ + యత్ = ఏయే (కర్మను), ఆచరతి = చేయుచున్నాఁడో, తత్ + తత్ + ఏవ = ఆయాకర్మనే, ఇతరః = ఇతరుఁడైన, జనః = మనుష్యుఁడు, (ఆచరతి) = చేయుచున్నాఁడు, సః = వాఁడు, (ఆశ్రేష్ఠుఁడు), యత్ = దేనిని, ప్రమాణమ్ = ప్రమాణముగా, కురుతే = చేయుచున్నాఁడో, లోకః = (పామర) జనుఁడు, తత్ = దానిని, అనువర్తతే = అనుసరింపుచున్నాఁడు.

కృ — ఓయి యర్జునా! లోకమునందు బుద్ధిమంతులుగనుండెడువారు కొందరియు, బుద్ధిహీనులు అనేకులునుగ నుంచున్నారుగదా, ఆమూఢులకు యుక్తాయుక్తపరిజ్ఞానము బుద్ధిమంతుల కుండినట్లుండదు, కనుకఁ దాము, ఇదియుక్తము, ఇది యయుక్తము, అని తెలిసికొనుటకు శక్తిలేనివారలై ;

"ఆ. ఎఱుక గలుగునాతఁ డేదియొనర్చిన
నదియ చేతు రితరు లైనవార
లతఁడు సత్యమిట్టి దనెనేని లోకంబు
తత్ప్రవర్తనమునఁ దగిలియుండు." (భా. ౬. స్కం. ౧౧౩.)

అనునట్లు, యుక్తాయుక్తపరిజ్ఞానముగల వివేకులే యే కాలమం దెట్టిపనులు సేయుచున్నారో, ఆయా కాలమం దట్టిపనులను జేయుటయే యుక్తమని తలఁచి తామును నాలాగే నడుచుకొనుచుండుటయేగాక వార లెయ్యది ప్రమాణముగా వచింపు చున్నారో దాని ననుసరించి తక్కిన వారును నడచుకొనుచున్నారు. వివేకియగువాఁ డేదైనను బొరపాటుపని చేసినను నది యుక్తమనితలంచి వారు నాలాగే చేయు దురు. అదెట్లనఁగా నిందుకు దృష్టాంతముగ నొక కథఁ జెప్పెద వినుము. పూర్వ కాలమందు నొక గ్రహణసమయమున జనులు కొందఱు సముద్రస్నానమునకుఁబోయి యుండఁగా, నచటికి శాస్త్రవేత్తయగు నొకబ్రాహ్మణుఁడు పోయి తాను సముద్ర స్నానము సేయ సమకట్టి, తన చేతనుండెడు రాగిచెంబును నచటఁ బెట్టిపోయిన నాగుంపులో నెవఁడైనఁ దస్కరించునను భయముతో దాని నెవరికిని గనఁబడ కుండునటుల నాసముద్రపుగట్టున నొకచోట నిసుకలోఁ బూడ్చిపెట్టెను. ఆస్థలము గుఱుతు తనకు మరలఁ దెలియుటకుఁగాను దానిపై లింగాకారముగఁ గొంత యిసుకను బోఁగుచేసిపెట్టెను. అట్లిసుకను బోఁగుసేయుచుండఁగాఁ, జూచిన కొందఱీయన శాస్త్రజ్ఞుఁడుగానున్నాఁడు, ఇట్లు చేయుటచూడఁగా, గ్రహణకాలమున సముద్రస్నానముఁ జేసెడు ప్రతివాఁడును నిట్లే యిసుకతో లింగముఁ జేయవలసినది శాస్త్రోక్తమైన పద్ధతి కాబోలు నని యెంచి యాయన స్నానమునకు వెళ్ళినతోడనే యాలింగమున కన్నిప్రక్కల నట్లే మఱికొన్ని లింగములను జేసియుంచిరి. అట్లే యొకనిఁ జూచి యొకఁడుగా నందఱు నదేయభిప్రాయముగల వారలై యదేతీరున ననేకలింగములను జేసిరి. పిమ్మట నాబ్రాహ్మణుఁడు స్నానముఁజేసి వచ్చి యాలింగ ముల నన్నిటిని జూచి వానిలోఁ దానుజేసిన లింగమేదియైనదియు గుర్తింపఁజాలక యిట్లని చింతించె.

"శ్లో॥ గతానుగతికో లోకో నలోకః పారమార్థికః।
నేతో సైకత లింగేన నష్టం మే తామ్రభాజనమ్"

"ఈలోకమునందలి జనులలో నొకఁ డేమార్గమునఁ బోవునో యదే మార్గము నందఱు నవలంబించుచున్నారేగాని పారమార్థికముగాఁ జేయువారులేరు. నేను సము

ప్రతీరమున నిసుకలింగమును జేయుటచే నారాగిచెంబును బోఁగొట్టుకొంటిని ” అని చింతించెను.

కాన లోకమంతయు నిట్లేయని యెఱుంగుము. కాఁబట్టి నీవిపుడు పాండవ సైన్యమంతటికిని మొనగాఁడవుగ నున్నావు. కాన నీవిప్పు డేమిచేసిన నందఱు నదియే చేయుదురు. సంశయములేదు. నీవిపుడు యుద్ధమును మాని మరలిపోయినయెడల నీభుజ బలపరాక్రమములయందు భారము వేసియుండు నీసహోదరులు, ఓహో! మనయర్జునుఁడే శత్రుసైన్యమును జూచి భయపడి పరుగెత్తుచున్నాఁడే యిఁక మన మెట్లు యుద్ధముఁజేయగలమని తలఁచి మఱలుటకుఁ గారణమగును. వార లట్లు చేయఁగనే మీకు సహాయార్థముగా వచ్చియుండెడు రాజులందఱు నదేరీతిగాఁ జేయుదురుగదా? అట్లు జరిగినయెడల నందువలన నీకును, నీవారలకందఱకును గలిగెడు నవమాన మిట్టిదని యిదివఱకుఁ జెప్పనది గాక (చూ. 2. 33, 34, 35, 36,) ఇప్పుడు మరలఁ జెప్పవలెనా?

శ్లో॥ న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22

అర్థము:—హే పార్థ = ఓయి యర్జునా!, త్రిషు + లోకేషు = (స్వర్గమర్త్యపాతాళములనెడు) మూఁడులోకములయందును, మే = నాకు, కర్తవ్యమ్ = చేయఁదగినది, కించన = ఏదియును, న + అస్తి = లేదు. అనవాప్తమ్ = పొందఁబడనిదియు, అవాప్తవ్యం + చ = పొందఁదగినదియు, న = లేదు. (తథాపి) = అట్లయినను, కర్మణి + ఏవ = కర్మమునందే, వర్తే = ప్రవర్తించుచున్నాను.

ఓయియర్జునా! మఱియొకసంగతిఁ జెప్పుచున్నాను వినుము. నే నీమూఁడులోకములకును సృష్టిస్థితిలయ కారణకర్తఁగానున్నాను గాన నీమూఁడులోకములయందును నేనిదివఱకుఁ బొందనిదియు, నిప్పుడు నూతనముగాఁ బొందఁదగినదియు, నేమియు నుండదుగదా? అట్లుండియు నేనును దక్కిన జనులవలెఁ గర్మనాచరించుచునే యున్నానుగదా? అనఁగాఁ బ్రతియుగమునందును నితరజనులవలెనే యీభూమి యందు జన్మించుచు, జననీజనక దారపుత్రబంధుమిత్రాదులతోఁ గూడి నటించుచు, వారలవలెనే యన్ని కార్యములఁ జేయుచున్నానుగదా? ఇట్లు నేనేల చేయుచున్నానో తెలియునా? ఆ కారణమును జెప్పెద వినుము.

“ మ. జననంబందుటలేని యీశ్వరుఁడు దా జన్మించు నెల్ల న్విరో
ధినిరాసార్థము వీతకర్ముఁడగు నద్దేవుండు కర్మప్రవ

ర్తనుఁడా వెల్లఁ జరాచరప్రకటభూతశ్రేణుల న్గర్మవ
ర్తనులఁ జేయఁ దలంచి కాక కలవే నైత్యారికిం గర్మముల్."
(భాగ. 3. స్కం. 33.)

అనునట్లు నేను సామాన్యపురుషుఁడను గాననియు, లోకసంరక్షణార్థమై యవతరించిన విరాట్పురుషుఁడ ననియు, నీకుఁ దెలిసియున్నదిగదా? ఇట్టి నాకు నీలోకమునందుఁ దక్కిన జనులవలె నాచరింపవలసిన కర్మ యేమి యుంచున్నది? నేనిదివఱకుఁ బొందని విషయమేమియున్నది? లేదా యిప్పుడు నూతనముగఁ బొందవలసిన దేమియున్నది? ఏమియు లేదుగదా? అట్లుండియు నేను మీయందఱివలెనే కర్మములలోఁబడి యాచరింపుచున్నానుగదా? అనఁగా జననమరణాదులు లేని నేను మీవలెనే మాతృగర్భమున జనించి, జననీజనకులు, దార పుత్రులు, బంధుమిత్రాదులు గలవాఁడనై, సమస్తకర్మల నాచరింపుచున్నాఁడనుగదా? అందునకు నిదర్శనముగా నిపుడు నీకు నేను బావనుగా నుండుటయేగాక మిత్రుఁడనుగానుండి మీపక్షము వహించి రాయబారము మొదలగు కార్యములను జరిపి యిపు డీయుద్ధరంగమున నీకు సారథ్యమునుగూడఁ జేయుచున్నానుగదా! ఇట్టి పనులు నేను జేయకున్న నాకేమి కొదువయగును? లేదుగదా? ఇవి యన్నియు నటుండనిమ్ము. నేను మీపక్షమున రాయబార మొనరించుటకుఁ గౌరవసభకుఁ బోయినపుడు, దుర్బుద్ధియగు దుర్యోధనుఁడు నన్నుఁ గట్టివేయసమకట్టినపుడు నేను వానికి భయంకరమగు నావిశ్వరూప సందర్శనము నొసంగియుండలేదా? అప్పుడు నేఁగావలెనన్న నాదుర్యోధనుని వాని సహచరులగు తులువలతోఁగూడ నందఱు చూచుచుండ క్షణమాత్రములో భస్మము చేసియుందును గదా? అట్లు నేఁ జేసియుండినయెడల నిప్పు డీయుద్ధమునకుఁ బ్రసక్తియే లేకపోవునుగదా? అట్టిశక్తి నాయందుండియు నాలాగు చేయక యిప్పుడు నీకు సారథ్యముఁజేసి నీచేత యుద్ధముఁ జేయించి వారల వధింపవలయునెడి నావశ్యకము నాకేమియుండును?

అర్జు — అయ్యా! యిపుడు నీవుచెప్పినది యంతయు వాస్తవమే. ఇట్టి శక్తి నీయందుండియు సామాన్యజనులవలె నిట్లు నటించుటకుఁ గారణమేమి?

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః ॥ 23

అర్థము:—హే పార్థ! = ఓయియర్జునా!, హి = (నేను గర్మయందుఁ బ్రవర్తించుట) ఏలయనఁగా, జాతు = ఒకప్పుడైనను, అహమ్ = నేను, కర్మణి =

కర్మమునందు, సర్వశః = అన్ని విధములచేత, అతన్ద్రితః+(సన్) = జాగరూకుం డనై, న+వర్తేయమ్+యది = ప్రవర్తింపనియెడల, మనుష్యాః = జనులు, మమ= నాయొక్క, వర్త్మ = మార్గమును, అనువర్తన్తే = అనుసరింతురు.

కృ:— ఓయియర్జునా! ఇట్లు నేఁజేయుట యంతయు నాస్వప్రయోజనార్థము గాదనియు, లోకనటనార్థమే యనియు నెఱుంగుము. ఎట్లనఁగా, నేను,

"క. మదిఁ దనశాసన మిడి నిజ
పదములు సేవించు లోకపాలాదుల బెం
పొదవింప యదుకులంబున
నుదయించెను భువిని బల సహోదరుఁ డగుచున్." (భాగ.3.స్కం.3౫)

అనునట్లు, దుష్టసంహారమును, శిష్టపరిపాలనమును జేయుటకును, రాజులు మొదలగు వారలకు యుక్తప్రవర్తనమును గఱపుటకును నైరయే యీలోకమున యదు కులంబున నవతరించిన వాఁడను గనుక సామాన్యజను లందఱు నామందే గుఱి యుంచి నేఁజేయు పనులను గమనింపుదు, నేనెట్లుచేయుదునో యట్లే వారును జేయు చుందురు. కాన నేనేదైనఁ జేయవలసిన పనిచేయక మానుకొన్నను, లేక పొరపా టున నేదైనఁ జేయఁగూడని పనిఁ జేసినను, వారలు నట్లే చేయుదురు. కాన నే నెప్పు డును బనులయందు జాగరూకుఁడనై ప్రవర్తింపుచున్నాను.

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మచే దహమ్।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః॥ 24

అర్థము:—అహమ్ = నేను, కర్మ = కర్మమును, న+కుర్యామ్+చేత్ = చేయకుందునేని, ఇమే + లోకాః = ఈజనులు, ఉత్సీదేయుః = చెడుదురు, సంకరస్య = వర్ణసంకరమునకు, కర్తా+చ = కర్తమగాఁగూడ, స్యామ్ = అగు దును, ఇమాః + ప్రజాః = ఈజనులను ఉపహన్యామ్ = చెడఁగొట్టినవాఁడ నగుదును.

ఓయియర్జునా! నేనట్లు జాగరూకుఁడనై ప్రవర్తింపక పొరపాటున నేదైనఁ జేయఁగూడని పనిచేసినయెడల జనులును నాలాగే చేయుటవలన నేను వారలకుఁ దప్పుమార్గమును జూపినవాఁడనగుదును. ఇంతియగాక, వారలందువలనఁ జెడుదురు గనుక నేనే వారలను జెఱిపిన వాఁడనగుదును.

అదెట్లనఁగా నిందున కొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. పూర్వ కాలమున నొకయూరియందు శిష్టాచారసంపన్నుఁడును, వేదవేత్తయునునగు నొక

గొప్పపండితుఁ డుండెను. ఆయననుమించిన విద్వాంసుఁ డాచుట్టుప్రక్కల నెక్కడను లేకుండుటంజేసి యాయననే సర్వోత్కృష్టునిగ భావించి యందలి జనులందఱును నాయన యెప్పుడేది చేసినను నదియే దామును నాచరించుచు వచ్చుచుండిరి. ఇట్లుండ నొకనాఁడాయన గ్రహణకాలమం దనేకమంది బ్రాహ్మణులతోఁగూడ సముద్రస్నానమునకుఁబోయెను. స్నానముఁజేసి యొడ్డున నందఱును వరుసగఁ గూర్చుండి జపము సేయుచుండిరి. అట్టిసమయమున నాపండితునకు దోవతి గోఁచిపింఛె బిఱ్ఱుగా నుండి వెనుకతట్టుననూడి క్రిందఁబడియుండెను. ఆయన యదియెఱుఁగక తదేకనిష్ఠతో జపముఁజేసికొనుచుండెను. ఇట్లుండ నాయనకు నిరుప్రక్కల వరుసగాఁ గూర్చుండి యుండు బ్రాహ్మణు లదిచూచి గ్రహణకాలమున సముద్రస్నానాంతరము జపము సేయునపుడు గోఁచి పింఛె విడఁదిసికొని జపముసేయవలసినది పద్ధతిగాఁబోలునని యందఱును నట్లే గోఁచిపింఛె లూడఁదీసికొని జపముసేయుచుండిరి. పిమ్మటఁ గొంత సేపటికి నాపండితుఁడు జపముసాలించి లేచిచూడఁగానే తన కిరుప్రక్కలఁ జక్కఁగాఁ గూర్చుండి జపము సేయుచుండెడు నందఱును గోఁచి పింఛె లూడియుండుటను గనుఁగొని యాశ్చర్యపడి తనగోఁచి పింఛెను జూచికొనెను. అపుడు తనగోఁచిపింఛెయు నట్లే యూడియుండుటను దెలిసికొనినవాఁడై, ఓహో యిదియే కారణముగా నుండ వచ్చునని యూహించి తనగోఁచిపింఛెను సవరించి మరలఁ జక్కఁగఁ దోఁపికొనెను, అదిచూచి తక్కినవారందఱును నట్లేచేసికొనిరి.

శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్ ॥ 25

అర్థము:— హేభారత! = ఓయియర్జునా!, అవిద్వాంసః = పామరులు, కర్మణి = కర్మమునందు, సక్తాః+(సన్తః) = ఆసక్తిగలవారై, యథా = ఎట్లు, కుర్వన్తి = (కర్మము) జేయుచున్నారో, తథా = అట్లు, విద్వాన్ = పండితుఁడు, అసక్తః+(సన్) = ఆసక్తిలేనివాఁడై, లోకసఙ్గ్రహమ్ = జనులకుమంచిత్రోవఁ జూపుటను, చికీర్షుః = చేయనిచ్ఛగలవాఁడై, కుర్యాత్ = (కర్మము)జేయవలయును.

కావున నోయి యర్జునా! యీలోకమునఁబామరజను లాసక్తచిత్తులై కర్మల, నాచరించుచున్నారు గదా! అనఁగా దారపుత్త్రాదుల పోషణార్థమై పాటుపడి ధన మార్జించి వారలఁ బోషించుచు, వారియెడల నతిప్రేమగలవారై ప్రవర్తించుచు, బంధుమిత్త్రాదులయెడల నతి స్నేహముగలవారై వారల నెవరి నెవరి నేయేవిధముగ నాదరింపవలయునో వారివారి నాయావిధముగ నాదరించుచు, నతిథ్యభ్యాగతుల

సత్కరించుటచేఁ దమకుఁ బుణ్యము బ్బునని యెడు తలంపుతో వారల సత్కరింపుచు నిట్లే తక్కినయన్ని విషయములయందును నాసక్తిగలిగినవారలై కర్మల నాచరింపు చున్నారు గదా! జ్ఞానియన్ననో "ఋణానుబన్ధరూపేణ పశు పత్ని సు తాలయాః" అనునట్లు, దారపుత్రాదులందఱును, ఋణానుబంధమువలనఁ గలిగినవారేగాని, వార లకును దనకును నేమియు సంబంధము లేదనియు, గృహక్షేత్రారామవిత్తాదులు క్షణ భంగురములు గాని శాశ్వతములు గావనియుఁ, జక్కఁగ నెఱుఁగును గనుక నానిలో దేనియందు నతనికి నాసక్తియుండనేరదు గదా? అట్లయ్యును, ఈదారపుత్రాదులకై మనమేల పాటుపడవలెననియు, నీగృహారామక్షేత్రాదులవలన మనకేమిప్రయోజన మనియు నుపేక్షచేయక యన్నిటియెడలను పామరుఁడెట్లు తనకుఁ బ్రయోజనము గల దని తలఁచి యాసక్తితోఁ బనిచేయుచున్నాఁడో యట్లే పనిచేయుచుండవలెను. ఏల యనఁగా, జ్ఞానియగువాఁడిట్లు చేయనియెడలఁ బామరజనులతనిఁ జూచి తామును దారపుత్రబంధుమిత్రాదులయెడల ననాదరణ బుద్ధితోఁ బ్రవర్తింతురు. ప్రతివాఁడు నట్లుచేసినయెడలఁ బ్రపంచనటన జరుగుట కష్టతరమగునుగాన, జ్ఞానియగువాఁడుగూడ పామరునివలెనే కర్మనాచరింపుచుండవలెను.

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినామ్ ।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్ ॥ 26

అర్థము:— విద్వాన్ = పండితుఁడు, కర్మసఙ్గినామ్ = కర్మయందాసక్తిగల, అజ్ఞానామ్ = పామరులకు, బుద్ధిభేదమ్ = ఫలాపేక్షతోఁగర్మనాచరించెడుబుద్ధికిఁ జలనమును, న+జనయేత్ = పుట్టింపఁగూడదు, (స్వయమ్) = తాను, యుక్తః+ (సన్) = పట్టుదలగలవాఁడై, సర్వకర్మాణి = సమస్తకర్మలను, సమాచరన్ = చేయుచున్నవాఁడై, జోషయేత్ = ఇతరులనాచరించునట్లు ప్రోత్సాహపరచవలెను.

ఏలయనఁగా, నీలోకమునం దజ్ఞానులగు జనులాసక్తచిత్తులై కర్మలను జేయు చున్నారుగదా? అట్లు వార లాచరించెడు కర్మములయందు వారలకుఁగల యాసక్తి విడిపోవునట్లు జ్ఞానియగువాఁడు చేయఁగూడదు సరేగదా, తాను నాపామరులవలెనే విశేషాసక్తిగల యట్లభినయించి కర్మలనాచరింపుచుఁ దద్వారా యట్టిపామరుల కదివఱకుఁ గలిగియుండు నాసక్తి మఱింతయెక్కువయై మఱియును శ్రద్ధతోఁ బని సేయునటులఁ బ్రేరేపింప వలయును.

అర్జు — అయ్యా! నీవిట్లు చెప్పుచున్నావే, యిందువలన నీయభిప్రాయమేమి? జ్ఞానియగువాఁడు పామరజనులకుఁగల యజ్ఞానమునుఁబోగొట్టి సుజ్ఞానమును గలుగఁ

జేయుటకు బదులుగా వారల కదివఱకుఁ గలిగియుండు నజ్ఞానము మఱింత వృద్ధియగు నట్లు చేయవలసినదనియా నీతాత్పర్యము ?

కృ — ఓహో ! అదిగాదు. నీవు పొరపాటుగ నభిప్రాయమునఁ బడుచున్నావు. లోకమున జనులందఱు సాధారణముగ నజ్ఞానులుగానే యుంచున్నారు. జ్ఞానుల సంఖ్య మిక్కిలి కొద్దిగా నుంచున్నది. అజ్ఞానియగువానికిఁ గర్మయోగముచేఁ గ్రమ క్రమముగ జ్ఞానముహెచ్చి యాజ్ఞానము పండినపిమ్మటఁ గర్మచాలించిన యెడల సరియైన పద్ధతిగానుండునుగాని, యట్లులేక జ్ఞానియగువాఁడు కర్మనాచరింపకుండుటఁ జూచినంతమాత్రముచేతనే తాను నాజ్ఞానివలెనే కర్మనాచరించుట మానినయెడల నందుచేఁ బ్రతివాఁడును దన దారాపుత్రాది పోషణసయితము మానివేయును. అందు వలన మిగులఁ బ్రమాదములు గలుగుటయేగాక వాఁడు నుభయలోక భ్రష్టుఁడగును. ఇందున కొకదృష్టాంతమును జెప్పెదవినుము. ఇపుడు కౌరవసైన్యమందుండెడు భీష్మ ద్రోణులు నీకుహితులా? అహితులా?

అర్జు — నాకు హితులేగాక తాతయు, గురువును సదా నాక్షేమమును గోరు వారునైరయే యుంచున్నారు.

కృ — అవునుగదా, యిప్పుడు వార లే సైన్యమునఁ జేరియున్నారు ? ఏమిపని జేయఁబూనుకొని యున్నారు.

అర్జు — కౌరవసైన్యమందుఁజేరి మాతో యుద్ధముజేయుటకై యే పూనుకొని యున్నారు.

కృ — అదియేల ? మీయెడలవారికి ద్వేషము లేనిపక్షమున నిట్లేల చేయఁ బూనుకొనుచున్నారు ?

అర్జు — మొదటినుండి దుర్యోధనునిచేఁ బోషింపఁబడిన వారలగుటచేఁ నిప్పుడు తమయిష్టమునకు విరోధముగా నైనను నతని పక్షము వహించి మాతోడ యుద్ధమునకుఁ దలపడ వలసినవారైనారు.

కృ — అదేమి ? అ ట్లేల చేయవలెను ? ఒకవేళ నతనిచే వారలు పోషింప బడినవారైనను నిప్పు డత డక్రమమును జేయఁబూనుకొనుటచే నతనిపక్షమును విడిచి పెట్టి క్రమస్థులైన మీపక్షము నేల వహింపఁగూడదు ?

అర్జు — అయ్యయో ! అదెట్లు చేయవచ్చును ! ఆసైన్యమున కాధారభూతు లును, సర్వజ్ఞులును నగువారలే యట్లు చేసినయెడల నిఁక నేరాజైన నెవనినైన నెట్లు నమ్మఁగలడు ? అట్టినమ్మకము గలుగకపోయినయెడల రాజ్యకార్యముల నెట్లు నిర్వహింపఁగలడు ?

కృ — కాఁబట్టి, యిపుడు భీష్మద్రోణులు వారట్లు చేసినయెడల లోకము నందలి రాజులందఱును దమతమ సేనానాయకులు మొదలగువారలను, నట్టి సేనానాయకులు తమతమ రాజులను, నవమ్మటుకు ఓపలేకపోవుననియు, నటుచే రాచరికపు పనులు చక్కఁగ జెలఁబేరక యరాజకమైపోవుననియు, నందువలన లోకమంతయుఁ జెడిపోవుననియు, నట్లు చెడిపోవుటకు దామే కారణభూతుల మగుదుమనియు, నెంచిగదా, దుష్టవర్తనుఁడగు దుర్యోధనునియందు నయిష్టముగలవారైనను, వాని కార్యమునట్ల శ్రద్ధగలవారివలె నటింపుచు, వారికి మిక్కిలి ప్రియుఁడవగు నీతోడ యుద్ధమునకుఁ దలపడి యున్నారు ?

అర్జు — అవును అదే వాస్తవము.

కృ — మంచిది. లోకసంగ్రహ మనఁగా నిట్టిదియే యనియు, జ్ఞానియగు వాఁడు దన కాసక్తిలేని కర్మముల నిట్లే భీష్మాదులవలె నాసక్తియున్నట్లభినయింపుచుఁ జేయుచుండవలెననియుఁ దెలిసికొనుము.

అర్జు — అయ్యా ! ఇప్పుడు నీవుచెప్పినదంతయు సరే, దీనిఁబట్టి చూడఁగా జ్ఞానియు నజ్ఞానివలెనే కర్మమాచరింపవలసినది విధియైయున్నట్లు కనఁబడుచున్నది గదా ? అప్పటికి జ్ఞానికిని నజ్ఞానికిని గలభేదమేమి?

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహఙ్కారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే॥ 27

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥ 28

శ్లో॥ ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్నవిచాలయేత్॥ 29

అర్థము:— ప్రకృతేః = స్వభావమువలనఁగలిగిన, గుణైః = (సత్త్వరజస్తమో) గుణములచేత, క్రియమాణాని = చేయఁబడుచున్న, సర్వశః = నానావిధములైన, కర్మాణి = కర్మములను, అహమ్ = నేను, కర్తా = చేయువాఁడను, ఇతి = అని, అహఙ్కారవిమూఢాత్మా = నేననియెడు దురభిమానముగలవాఁడు, మన్యతే = తలంచుచున్నాఁడు, హేమహాబాహో = ఓయర్జునా! గుణకర్మవిభాగయోః = సత్త్వాదిత్రిగుణములయొక్కయు, వానిచే జేయఁబడు పనులయొక్కయు, విభాగముల యొక్క, తత్త్వవిత్ + తు = తత్త్వమును దెలిసినవాఁడయితేనో, గుణాః = సత్త్వ

దిగుణములు, గుణేషు = వాని స్వభావజన్యములగు పనులయందు, వర్తన్తే + ఇతి = ప్రవర్తించుచున్నవని, మత్వా = తలఁచి, న + సజ్జతే = కర్తృత్వాభిమానమును బొందఁడు, ప్రకృతేః = స్వభావమువలనఁ బుట్టిన, గుణసమ్మూఢాః = గుణములచేత మిక్కిలివిమూఢులైనవారు (అనఁగాఁ బ్రకృతిగుణముల తత్త్వము నెఱుఁగనివారు) గుణకర్మసు = సత్త్వాది గుణములవలనఁగలిగెడు వ్యాపారములయందు, సజ్జన్తే = ఆసక్తులగుచున్నారు, అకృత్స్నవిదః = ఏమియు నెఱుఁగని, మన్దాన్ = మందబుద్ధులైన, తాన్ = వారలను, కృత్స్నవిత్ = సమస్త మెఱిఁగినవాఁడు, న + విచాలయేత్ = చలింపఁజేయఁగూడదు (అనఁగా వా రాచరించునట్టికర్మను వదలునట్లు చేయఁగూడదు.)

కృ — ఓయి యర్జునా! జ్ఞానికిని నజ్ఞానికిని గలభేదమును జెప్పెదను వినుము. లోకమునందుఁ బ్రతిపురుషుండును జేయవలసిన పనులు వానివాని స్వభావజన్యములగు సత్త్వరజస్తమోగుణములచేఁ బ్రేరేపింపఁబడి చేయుచున్నాఁడని మునుపటికే (చూ 3. 5) చెప్పియుంటినిగదా? అట్టి యాగుణములచేఁ జేయఁబడుచుండు కార్యముల నజ్ఞానియగు వాఁడహంకార బుద్ధిచేఁ దానే చేయుచున్నానని తలఁచుచున్నాఁడు. జ్ఞానియన్ననో, ప్రకృతిగుణములయొక్కయు, వానివలనఁ జేయఁబడు కార్యములయొక్కయుఁ, దత్త్వమును దెలిసినవాఁడుగనుక నాయాగుణము లాయాపనులయందుఁ బ్రవర్తింపుచున్నవే గాని, తనకేమియు సంబంధములేదని యెంచి యాపనులయందు నాసక్తచిత్తుఁడుగాక యుంచున్నాఁడు. కానఁ బ్రకృతిగుణంబు లిట్టివని బొత్తిగాఁ దెలిసికొనలేక యాగుణములచేఁ జేయఁబడు కర్మలఁదానే చేయుచున్నానని తలఁచెడు నజ్ఞానియొక్క యట్టి నమ్మకమును సర్వజ్ఞుఁడగుజ్ఞాని చెడఁగొట్టఁగూడదు.

అర్జు — జ్ఞానియగువాఁ డజ్ఞాని కట్టి నమ్మకమును జెడఁగొట్టిననేగదా వాఁడు తెలివి గలిగి మంచిమార్గమునకుఁ దిరుగును. అట్లుచేయఁగూడదని చెప్పుటకుఁ గారణ మేమి ?

కృ — ఏమియుఁ దెలియని మూర్ఖున కట్టి నమ్మకమును జెడఁగొట్టినయెడల దానిచే వానికిఁగల దుర్గుణము మఱింత హెచ్చునేగాని తగ్గనేరదు. అదెట్లనఁగా, అజ్ఞానియగు నొకఁడొక సుకృతమునుగాని దుష్కృతమునుగాని చేయుచుండఁగా, జ్ఞానియగు మఱియొకఁడుచూచి, యోయీ! నీవుచేయు నీకార్యము నీయందుఁగల స్వభావగుణము చేయుచున్నదేగాని, నీవు దీనికిఁ గర్తవుగావని చెప్పినయెడల వాఁడు మూర్ఖుఁడగుటవలనఁ దానుజేయుచుండునది సుకృతముగా నుండినయెడల దీనియందు మనకుఁ గర్తృత్వము లేనపుడు దీనివలన మనకేమియుఁ బ్రయోజనములేదుగదా, ఇట్టి

ప్రయోజనములేని పని మనమేల చేయవలెనని మానుకొనవచ్చును; లేదా, వాఁడు చేయుచుండినది దుష్కృతముగా నుండినయెడల, నోహో! దీనియందు మనకుఁ గర్తృత్వములేదు గనుక దీనివలన మనకెట్టిపాపమును నంటనేరదు గాన మనమిట్టి కార్యము లెన్ని చేసినను జేయవచ్చునని యెంచి తానదివఱకుఁ జేయుచుండెడు దుష్కృతముల కంటె నెక్కుడుగ దుష్కృత్యములనే చేయుచుండవచ్చును. అట్లుగాక యాయజ్ఞాని తాఁజేయుకార్యములకుఁ దానే కర్తనని తలఁచియుండిన దాని కనుగుణ్యముగా జ్ఞానియగువాఁడు, ఓయీ! నీవీకార్యమును జేయుచున్నావుగదా, దీని ఫలాఫలముల నీవే యనుభవింప వలసియుంచున్నదని చెప్పినయెడల నపుడా యజ్ఞాని, ఓహో! అవును, వాస్తవమే, దీనికి నేనే కర్తను గనుక దీనిఫలమును నేనే యనుభవింపవలసి యుంచున్నదని యెంచినవాఁడై తానపుడు చేయుచుండినది సుకృతముగానుండిన యెడల దానిచేఁ దనకు మేలుగలుగునని యెంచి యట్టికార్యములే మఱియు నాచరించినయెడలఁ దనకు మఱింత మేలుగలుగునని తలఁచి మరల సుకృతమునే చేయఁబూనుకొనవచ్చును. లేక, తానపుడు చేయుచుండినది దుష్కృతముగ నుండినయెడల, ఓహో ఔను, ఇతఁడు చెప్పినది వాస్తవమే. ఇపుడు నేఁజేయునది దుష్కృతము గనుక దీనివలనఁ గలిగెడు కీడును నేనే యనుభవింపవలసి యుంచున్నది గదా, యనియెడు భయము మనస్సునకుఁ దోఁచినవాఁడై తానుజేసెడు దుష్కృతమును మానుకొనవచ్చును. కాన జ్ఞానియగువాఁ డజ్ఞానియగువానికిఁ దాజేయు కార్యమునకుఁ దానే కర్తననియెడు నమ్మకముఁ జెడఁగొట్టఁగూడదని చెప్పుటకుఁ గారణమైనది.

అర్జు — ఇప్పుడు నీవు చెప్పినది సయుక్తికముగానే యున్నది. అయితే, అట్లయినయెడల సర్వజ్ఞుఁడగు నొక గురువు తన్నునాశ్రయించిన శిష్యునకు నుపదేశించు నపుడుగూడ నిట్లే చెప్పవచ్చునా? అట్లుచెప్పినయెడల వీనియుపదేశమువలన వానికదివఱకుఁ గలిగియుండెడు నహంకారమమకారములు మఱింత హెచ్చుటకే కారణమగును గాని యవి నశింపనేరవుగదా? అవి నశించిననేగాని జ్ఞానోదయము గానేరదుగదా?

కృ — ఇపుడు నేఁ జెప్పినసంగతి యేమియు భ్రాంతిగనెఱుఁగని మూఢునకే యన్వయింపుచున్నది గాని యుపదేశార్థమై యొకసద్గురువు నాశ్రయించెడు శిష్యున కన్వయింపనేరదు. ఏలయనఁగాఁ గేవల మూర్ఖుఁడుగానుండు వాఁడు జ్ఞానము నపేక్షించి గురువునెప్పుడు నాశ్రయింపఁబోడు. అయితే, గురువునాశ్రయించెడు శిష్యుఁడెట్టివాడంటివేని, కొంచెము జ్ఞానము గలిగి దానిచే యుక్తాయుక్త వివేచనముచేయు శక్తిగలవాఁడై, దానివలనఁ దనకుఁ గలిగియుండెడు జ్ఞానము పరిపూర్ణమైనది గాదని తెలిసికొనినవాఁడై, యట్టిపరిపూర్ణత నొక సద్గురూపదేశముచేఁ బొందఁగోరి యట్టి

గురువును వెదకి కనిపెట్టి యాశ్రయింపుచున్నాఁడు. అప్పటి వాఁడా గురువునుసాక్షాద్భగవత్స్వరూపునిగఁ జూచుచు నాయన యేమిచెప్పిన నదియే సాక్షాద్భగవద్వాక్యమని నమ్ముచున్నాఁడు. అట్టిలక్షణములుగలవాఁడే సచ్ఛిష్యుఁడనఁబడును. సర్వజ్ఞుఁడైన గురువును దన్నాశ్రయించిన శిష్యుఁడిట్టి లక్షణములు గలవాఁడగునా, కాఁడా, యని చక్కఁగ ననేకవిధములఁ బరీక్షించి వానిమనస్సుపదేశముఁ బొందుటకుఁ జక్కఁగఁ బరిపక్వమై యున్నదని నమ్మకము గలిగిననేగాని యట్టియుపదేశముఁ జేయఁబూనుకొనఁడు. కాన నట్టిశిష్యున కుపదేశించునపుడు మాత్రము ప్రకృతి గుణములయొక్కయు నహంకార మమకారములయొక్కయుఁ దత్త్వము నున్నదియున్నట్టు బోధించునేగాని యజ్ఞానికివలెఁ బొరపాటగు నభిప్రాయము గలుగునట్లు బోధింపఁడు.

అర్జు — అయితే స్వామీ! ఇపుడు నీవు చెప్పిన దంతయుఁ జక్కఁగ నాలోచించి చూడఁగా, నేను రాజ్యాభిలాషచేతఁ గాకపోయినను లోకసంగ్రహార్థమైనను యుద్ధము జేయవలసియే యున్నట్లు కనఁబడుచున్నది. అయితే, ఇది బంధుమిత్రజనవధారూపమగు ఘోరకృత్యముగ నున్నది గనుక నెట్లుచేయుదునా యని నామనస్సు మిగులఁ బరితపించుచున్నదే! ఇందునకేమి చేయవచ్చునో చెప్పుము.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30

అర్థము:— అధ్యాత్మచేతసా = ఆత్మజ్ఞానముగల మనస్సుతో, మయి = నాయందు, సర్వాణి + కర్మాణి = సమస్తకర్మలను, సన్న్యస్య = సమర్పించి, నిరాశీః = ఫలాపేక్షలేనివాఁడవును, నిర్మమః = మమకారములేనివాఁడవును, భూత్వా=అయి. విగతజ్వరః+(సన్)=పోయినతాపముగలవాఁడవై, యుధ్యస్వ=యుద్ధముఁజేయుము.

కృ — అందునకొక సదుపాయముగలదు చెప్పెదవినుము. ఓ యర్జునా! నీవీయుద్ధముఁజేయుటలో రాజ్యము కొఱకే చేయుచున్నాననెడు తలంపు పెట్టికొనక, భగవదిచ్ఛ యీప్రకారముగ నున్నదిగాన, నేను భగవన్నియామానుసారముగ జరిగింపవలసిన వాఁడనై యున్నాననెడు నధ్యాత్మ బుద్ధితో నీవు చేసెడు నన్నికర్మలను భగవంతుఁడనైన నాయందు సమర్పించి జయముబొందవలెననెడు నపేక్షయును, నీయుభయసైన్యములయందలి వారును, మనబంధు మిత్రులనెడు మమకారమును, విడిచిపెట్టి, యుద్ధముఁ జేయుము. అట్లు చేసితివేని నీకిప్పుడుండునట్టి మనస్సంతాపము విడిచిపోవును.

శ్లో॥ యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపికర్మభిః ॥ 31

శ్లో॥ యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టానచేతసః ॥ 32

అర్థము:— యే + మానవాః = ఏమనుష్యులు, మే = నాయొక్క, ఇదమ్ = ఈ (పైఁజెప్పఁబడిన), మతమ్ = అభిప్రాయమును, శ్రద్ధావన్తః = శ్రద్ధగలవారును, అనసూయన్తః = విసుకులేనివారునై, నిత్యమ్ = ఎల్లప్పుడును, అనుతిష్ఠన్తి = అనుసరింపుచున్నారో, తే + అపి = వారుగూడ, కర్మభిః = కర్మలచేత, ముచ్యన్తే = విడువఁబడుచున్నారు. యే + తు = ఎవరైతే, ఏతత్ = ఈ (పైఁజెప్పబడిన), మే = నాయొక్క, మతమ్ = అభిప్రాయమును, అభ్యసూయన్తః + (సన్తః) = ద్వేషించినవారై, న + అనుతిష్ఠన్తి = అనుసరింపరో, తాన్ = వారలను, అచేతసః = బుద్ధిహీనులఁగాను, సర్వజ్ఞానవిమూఢాన్ = బొత్తిగాజ్ఞానములేనివారినిగాను, నష్టాన్ = చెడినవారినిగాను, విద్ధి = ఎఱుంగుము.

ఇదివఱకు నేఁజెప్పినదంతయు ననఁగా (3 – 4 మొదలు 3 – 30 వఱకు) చెప్పబడినదంతయుఁ గర్మయోగమనబడుచున్నది. ఈయోగము నాచరించుటయే యుత్తమమని నాయభిప్రాయమై యున్నది. కాన నీయోగము నెవరేని శ్రద్ధగలిగి,

" క. రసకర్మజ్ఞుఁడు దారము
పసిండి సేఁతకుఁ బ్రయత్న పరుఁడై శుద్ధ
త్వసమగ్రము సేయుక్రియ
న్విసుపక పరిశుద్ధిజీవునికిఁ జేయు టురున్" (భార. శాంతి. ౫ అ. ౪౧౭)

అనుశ్లో. వెండిని బంగారముఁ జేయుటకు రసవాది విసుకులేక యెట్లు పని చేయునో, అట్లు, విసుకులేక యెల్లప్పుడు నాచరింపుచున్నారో యట్టివారికి

" క. విను కుసుమంబుల వాసిం
చిన నొప్పునికంపు విడిచి చెందు నుసార
భ్యనిరూఢిం దిల లట్టుల
యనఘా! సుకృతముల జీవుఁ డకలంకుఁడగున్."

(భార. శాంతి. ౫ ఆ. ౪౧౨.)

అనునట్లు, పుష్పములతోఁ జేర్చఁబడియుండెడు నువ్వు లెట్లు కొంతకాలము నకుఁ దమ దుర్గంధమును విడిచి యాపుష్పములయొక్క పరిమళమును బొందునో

యోగాగున, నట్టి నిష్కామకర్మాచరణము వలనఁ గర్మసంబంధులగు పుణ్యపాపములఁ దెంచి నిష్కళంకుఁ డగుచున్నాఁడు.

" క. అంతంతకు సత్కర్మము
లెంతయుఁ బెనుపొందజీవుఁ డెక్కుడుచాయం
జింతాకలుషము వాయఁగ
సంతోషామృతమునాని సంశుద్ధుఁడగున్."

(భార, శాంతి. ౨. ఆ. ౪౧౫.)

అనునట్లు, సత్కర్మలఁజేయుచు రాఁగరాఁగఁ గ్రమక్రమముగ జ్ఞానమువృద్ధి కాఁగలదు. కాన వారలుఁగూడ నైష్కర్మ్యసిద్ధిని బొందిన జ్ఞానులవలెనే ముక్తులు గాఁగలరు. అట్లెవరేని యసూయాపరులై యీనా యభిప్రాయప్రకారము నిష్కామ కర్మయోగము నాచరింపక మానుకొనుచున్నారో యట్టివారిని కేవల మూఢు లనియు, బుద్ధిహీనులనియు, ఇహపరములకు రెంటికిని జెడినవారనియును దెలిసి కొనుము.

అర్జు — అయ్యా! కర్మయోగమును గుఱించి నీవింత పట్టుదలగా నుండు టకుఁ గారణమేమి? కర్మాచరణ చేయని వాఁ డిహపరములకు రెంటికి నెట్లు చెడుచున్నాఁడు?

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాని భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33

అర్థము:— భూతాని = ప్రాణులు, ప్రకృతిమ్ = (జన్మాంతరసంస్కారము వలనఁగలిగిన) స్వభావమును, యాన్తి = పొందుచున్నవి, (తతః) = కనుక, జ్ఞాన వాన్ + అపి = జ్ఞానవంతుఁడైనను, స్వస్యాః = తనదియగు, ప్రకృతేః = స్వభా వమునకు, సదృశమ్ = తగినట్లుగా, చేష్టతే = ప్రవర్తించుచున్నాఁడు. (అనఁగాఁ గార్యమును జేయుచున్నాఁడు). నిగ్రహః = నిరోధము (కర్మాచరణనిరోధము), కిం + కరిష్యతి = ఏమిచేయఁగలదు?

కృ — ఓయి యర్జునా! ఈలోకమునఁగల ప్రతిజంతువును దాని దాని స్వభా వసిద్ధములగు పనులనే చేయుచుండునుగాని తద్వ్యతిరిక్తములగు పనులను జేయదు. ఎట్లనఁగా, పశువులు గసవుమేయునేగాని మాంసమును భక్షింపవుగదా? పులులు మాంసమును భక్షించునేగాని కసవును మేయవుగదా? తుమ్మెదలు పూఁదేనె మొద లగు మధురపదార్థములనే గ్రోలునుగాని మఱియొక పదార్థమును గ్రాగవుగదా?

గిజిగాఁడను పిట్ట యొక్క విచిత్రమగు గూఁటిని గట్టుటఁ జూచి యుందువుగదా! అట్టి గూఁడు మఱియొకపక్షి కట్టగలుగునా? లేక, యా గిజిగాఁడు మఱియొకపక్షి గట్టెడు గూఁటివిధముగాఁ గట్టఁగలుగువా? ఇవియన్నియు దేనివలన జరుగుచున్నవి?

అర్జు — ఆయా జంతువులకుఁగల స్వభావమువలననే జరుగుచున్నవి.

కృ — అవునుగదా, నిగ్రహః కిం కరిష్యతి అని యున్నది. కనుక నట్టి స్వభావములను మాన్పింపఁగలమేమో యోచింతము. ఒకయావు, దూడనీనఁగనే యాదూడకుఁ బాలుమాత్రము కుడిపింపుచుఁ గసవు నమలఁగల యీడు వచ్చినతోడనే దానినింటఁ గట్టిజేసి కస వేమాత్రము దానికగపడనీయక దానికి బదులుగా దానియెదుట మాంసఖండములనే వేయుచువచ్చిన నది యామాంసఖండములఁ దిన మరగునా?

అర్జు — అట్లు మరగనేరదని తోఁచుచున్నది.

కృ — మంచిది, అది యట్లుండనిమ్ము. అడవిలో నొక పులి, పిల్లల నీనిన వెంటనే, యం దొక పిల్లను బట్టి యింటికిఁ దెచ్చి యొకబోనులో నునిచి దానికిఁ గొంతకాలము పాలుపోసి పెంచి యది యాహారముఁ దినుటకుఁదగిన యీడురాఁగానే దానిముందరఁ గసవు పోఁచలు వేయుచువచ్చిన నది యా కసవుపోఁచలు దినమరగి దాని జాతీయాహారమగు మాంసభక్షణము మానివేయునా?

అర్జు — అది యెన్నటికి నట్లు చేయదు. దొరకినయెడల మాంసమునే తినును. దొరకనియెడల నాఁకటితోఁ జచ్చునేకాని, కసవు నెంతమాత్రము మేయనేరదు.

కృ — అవునుగదా, దీనివలనఁ దిర్యగ్జంతువులచేతనే వానిస్వభావ విరుద్ధములగు పనులఁజేయింపనలవిగాని యపుడు మనుష్యులు వారివారి స్వభావజన్యములగు సాత్త్వికరాజస తామసగుణముల ననుసరించి చేయుచుండెడుపనులను నివారించుట కెవరికైన శక్యమగునని తలఁచెదవా?

అర్జు — అట్లు సాధ్యపడునని తోఁచలేదు.

కృ — కాఁబట్టి యుక్తాయుక్త పరిజ్ఞానముగలవాఁడు సయితము తన స్వభావమున కనుగుణ్యములగు చేష్టలఁ జేయుచునే యుండునుగాని యొకప్పుడు నూరకుండఁడు. (చూ. 3. 5) సరేగదా, అట్టిస్వభావవిరుద్ధములగు పనులనుగూడఁ జేయఁజాలఁడు. ఇట్టివిషయములో నొక పురుషుఁడు తనకు స్వభావసిద్ధములగు పనులఁ జేయకుండునట్లు గాని, లేక, తన స్వభావమునకు విరుద్ధములగు పనులఁ జేయునట్లు గాని మఱియొకఁడు చేయఁజాలఁడు. ఎట్లనఁగాఁ బరమలుబ్ధుఁడుగా నుండువాని కెవ రెన్ని నీతులు బోధించినను వానికి దాతృత్వము గలుగునా? లేక, నెఱదాతగా నుండువాని కెందఱు దురోభోధనచేసినను, నెంత లేమిడి గలిగినను, వానికి లోభ

గుణము పుట్టునా ? తక్కినయన్ని విషయములయందు నిట్లే యూహింపఁదగియుం చున్నది. కానఁ బ్రతిపురుషుండును వానివాని స్వభావానుగుణ్యములగు సుకర్మలను ఫలాసక్తిరహితుఁడై చేయుచునే క్రమక్రమముగా జ్ఞానము హెచ్చి యాజ్ఞానము పండి, తద్వారా మోక్షమున కర్హుఁడుగావలయును గాని యట్లాచరింపకుండినయెడల వానికి జ్ఞానోదయము గానేరదు సరేగదా, ఇహాముసందలి యనుభవమునకుఁ గూడఁ జెడినవాఁడై యుభయభ్రష్టుఁ డగును.

అర్జు — జ్ఞానియుఁగూడఁ బామరునివలెనే తన స్వభావసిద్ధములగు పనుల నాచరింపుచుండినయెడల నతనికిని బామరునికిని, గలభేద మేమి ! అతనికిని బామరు నికివలెనే కర్మఫలముంటుచున్నదిగదా! అట్లైనో, నతఁ డెట్లు మోక్షార్హుఁడు గాఁ గలఁడు ?

కృ — కర్మ నాచరించుటలో జ్ఞానికిని బామరునికిని భేదము గనఁబడదేగాని, అట్లాచరించుటలో వారికిఁ గలిగియుండెడు నుద్దేశములలో భేదముగలదు. కాన నట్టియుద్దేశమును బట్టియే యొకఁడు కర్మబద్ధుఁడును నగుచున్నాఁడు. అదెట్లనిన వివరించి చెప్పుచున్నానువినుము.

శ్లో॥ ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్యపరిపన్థినౌ॥ 34

అర్థము:— ఇన్ద్రియస్య + ఇన్ద్రియస్య = ప్రతీంద్రియముయొక్క, అర్థే = విషయమునందు, రాగద్వేషౌ = ఇష్టానిష్టములు, వ్యవస్థితౌ = కలిగియుంచున్నవి, (తస్మాత్) = కాబట్టి, తయోః = ఆరాగద్వేషములకు, వశమ్ = అధీనమును, న + అగచ్ఛేత్ = కాఁగూడదు, హి = ఏలయనఁగా, తౌ = ఆరాగద్వేషములు, అస్య = ఈపురుషునకు, పరిపన్థినౌ = శత్రువులు.

ఓయర్జునా! ప్రతిపురుషునకును బ్రతీంద్రియ విషయమునందును రాగద్వేషము లుండును. అనఁగా నొకప్పు డిష్టమును, మఱియొకప్పు డనిష్టమును గలిగియుండును. ఇష్టమగువిషయములయం దింద్రియములు ప్రవర్తించునపుడు మనస్సునకు సుఖమును, అనిష్టమగు విషయములయం దింద్రియములు ప్రవర్తించునపుడు బ్రతిపురుషునియొక్క మనస్సు సముద్ర తరంగములవలె వచ్చుచుఁబోవుచునుండెడు సుఖదుఃఖములవలనఁ బీడింపఁబడుచునే యుండును. అట్లు పీడింపఁబడుచుండు మనస్సును యోగమున నిలుపుట యసాధ్యము. కాన యోగాభ్యాసికి నీరాగద్వేషములు రెండును శత్రువులనఁ బడును. కావున యోగాభ్యాసియగువాఁ డీరాగద్వేషములను రెంటిని మనస్సున

నంటనీయక ప్రవర్తింపవలెను. అట్లెప్పుడు చేయుచున్నాడో యప్పుడు వానిమనస్సు నుండి సుఖదుఃఖములు విడిచిపోవును. అవెప్పుడు విడుచుచున్నవో యప్పుడే వాని మనస్సు యోగమున నిలకడగలదై యుండును. యోగాభ్యాసియగు వాఁ డిట్లు చేయుట చేతనే వానికిఁ గర్మఫలమంటక జ్ఞానమభివృద్ధియైన తద్వారా మోక్షార్హుఁ డగును. ఇఁకను బామరుఁడెన్నటో, యింద్రియవిషయములయందు రాగద్వేషములు గలవాఁడై యుంచున్నాఁడు. కనుక వానిమన సెప్పుడును సుఖదుఃఖములచేఁ బీడింప బడుచు నిలకడలేనిదై యుండుటచే వానికి జ్ఞానోదయము గానేరదు. వాఁడు మోక్షార్హుఁడు గానేరదు.

అర్జు — ప్రతీంద్రియ విషయములయందును, ఇష్టానిష్టములం గలిగి యుండుట యెట్లు? వానియందు మనస్సంటకుండఁ జేయుటయెట్లు? వివరించి చెప్పుము.

కృ — జిహ్వేంద్రియమునకు విషయము భోజనపదార్థము గదా, అట్టి భోజన పదార్థమొకప్పుడు రుచికరమైనదియు, మఱియొకప్పుడు రుచికరము కానిదియుఁ దట స్థింపుచుండునుగదా! రుచికరమైనపదార్థము తటస్థించినపుడు మనస్సునకు సంతోష మును అరుచికరమగు పదార్థము తటస్థించినపుడు మనస్సునకు దుఃఖమును గలుగుట సహజమేకదా?

అర్జు — అవును.

కృ — కాఁబట్టి, పామరజనుఁ డట్టి రుచికరమగుపదార్థము తటస్థించినపుడు మిగుల సంతోషింపుచు, మరలనట్టిపదార్థమునే తినవలయునని కోరుచుండుటచే వాని మనసెప్పుడును దానియందే వ్యాపింపుచుండును. అరుచికరమగు పదార్థము తటస్థించు నపు డయ్యో! యిట్టిపదార్థముదినవలసి వచ్చెనేయనియు, దానిఁ దినిన్యైన పిమ్మటఁ గూడ నయ్యో! యిట్టిపదార్థమును దింటిమే, మంచిపదార్థము లభింపకపోయెనే యనియుఁ జింతింపుచుండుటచే వానివలన నెప్పుడును దానియందే వ్యాపింపు చుండును. ఇట్లే, చక్షురింద్రియమునకు విషయములగు దృశ్యపదార్థములయందును, శ్రోత్రేంద్రియమునకు విషయములగు ధ్వనులు, అనఁగా సంగీతము, రోదనము, మొదలగు శబ్దములయందును, ఘ్రాణేంద్రియమునకు విషయములగు సుగంధదుర్గంధముల యందును, త్వగింద్రియమునకు విషయములగు శీతోష్ణాదులయందును, నాయాయింద్రి యములు ప్రవర్తించునపు డాయా సందర్భానుసారముగ వానిమనస్సునకు సుఖదుఃఖ ములుగలుగుచుండును. అట్టి సుఖదుఃఖములచే వానిమనస్సు పీడింపఁబడుచునే యుండునుగాన, యోగమున నిలకడగానుండనేరదు. (చూ. 2. 62. 63.) ఇఁకను, జ్ఞానియో యిట్టి సుఖదుఃఖములు క్షణభంగురములుగాని, శాశ్వతములు గావని యెంచి

వానియందెంతమాత్ర మాసక్తియుంచక యాత్మయొక్కటియే నిత్యపదార్థమని యెఱుఁగుచున్నాఁడు గాన వానిమనస్సు యాత్మధ్యానమునందు, అనఁగా యోగమునందు నిలకడగా నిల్చును. అయితే, అట్లు మనస్సును నిశ్చలముగ నుంచుకొనుట బహు కష్టసాధ్యము. అందుచేతనే గదా, ఋషులు మొదలగువారట్టి యింద్రియవిషయప్రసక్తి సాధ్యమగునంతవఱకు లేకుండునట్లు చేసికొనుటకై ముఖ్యముగా వనములయందు వాసము చేయుచున్నారు.

అర్జు — అయ్యా! నీవే యిట్లు చెప్పుచున్నావుగదా! అప్పటికిఁ గేవల కామ క్రోధములే కారణములుగను, బంధుజనవధయే ఫలితముగను నుండునట్టి యీఘోర మగు యుద్ధకర్మము జేయుటకంటె నేనును వనవాసముఁ జేయుచు విషయవ్యాసంగము మాని హాయిగ నేల యుండఁగూడదు ?

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35

అర్థము:— విగుణః = గుణములేని, స్వధర్మః = తనకులాచారము, స్వనుష్ఠితాత్ = చక్కఁగ నాచరింపఁబడిన, పరధర్మాత్ = ఇతరకులాచారముకంటె, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది, స్వధర్మే = తనకులాచారమునందు (అనఁగాఁ దనకులాచారమునకు సంబంధించిన పనులు చేయుటవలనను), నిధనమ్ + అపి = మరణము గలిగినను, శ్రేయః = శ్రేయస్కరము, పరధర్మః = ఇతరకులాచారము (అనఁగా నితరకులాచారమునకు సంబంధించిన పనులుచేయుట), భయావహః = భయమును గలుగఁజేయును.

కృ — ఓహో! నీ విట్లు తలఁచుచున్నావా యేమి ? దీనినిబట్టిచూడఁగా నిప్పుడు నేఁ జెప్పినదంతయు నీవు సరిగా గ్రహించినట్లు కనఁబడదు. నీవు నీ కులధర్మమైన యుద్ధమును మాని పరధర్మమైన (అనఁగా బ్రాహ్మణులచే నాచరింపఁదగిన) తపస్సును చేయఁదలఁచినట్లు కనఁబడుచున్నది. అట్లుచేయుట యెంతమాత్రము సరియైనదిగాదు.

“ తే. గీ. ఒప్పకున్నను నాత్మకులోక్త కర్మ
మూర్ధ్వగతిఁ జేర్చుఁ బరకర్మ మొప్పెనేని
నార్యజనములు కిల్బిషమండ్రు దానిఁ
గాన నడుపుము నిజవంశకర్మమధప.” (భార. శాంతి. ౧ ఆ. ౨౩౯)

అనునట్లు, గుణముగలదియుఁ జక్కఁగ నాచరింపఁబడినదియు నగు పరధర్మము కంటె గుణహీనమైనదియుఁ జక్కఁగ నాచరింపఁబడనిదియునగు స్వధర్మమే, అనఁగాఁ దనకులధర్మమే మేలు. ఎట్లనఁగా, యుద్ధము క్షత్రధర్మమైయున్నది. తపస్సు బ్రాహ్మణధర్మమై యున్నదిగదా! ఇప్పుడు నీవు యుద్ధమును మాని తపస్సుచేయుటకు వనమున కేగినయెడల, నేనిదివఱకు (చూ. ౨. 33-34-35-36) చెప్పినప్రకారము నిన్ను శత్రువులకు భయపడి పఱుగెత్తినవానిఁగా నీశత్రువులేగాక నీబంధుమిత్రాదులు గూడఁ దలంచుచుందురు. కాన వారిలో నీకతి లాఘవము గలుగును. పోనిమ్ము, వారలట్లు తలఁచిననేమి, బ్రాహ్మణవృత్తి నవలంబించుటచే వారలైన నిన్ను గౌరవింతురని తలఁచెదవేమో, అట్లెంతమాత్రము తలఁపవలదు. వారలును నీవారలవలెనే తలఁచుటయేగాక పులిని జూచి నక్కవాతవేసికొన్నట్లు నీవు తమయొక్క వృత్తి నవలంబించితివని నీయెడల నసూయాపరులగుదురు. అందువలన నీకీలోకమందు సుఖమేమియు నుండనేరదు సరిగదా, యొకవేళఁ బరలోకమందైన సుఖము గలుగునని యెంచెదవేమో యదియును సున్న. ఏలయనఁగా, నీవు యుద్ధము మాని తాపసవృత్తి నవలంబించుటచే నీదారపుత్ర బంధుమిత్రాదుల పోషణాది విధాయకకృత్యముల మానినవాఁడ వగుచున్నావుగదా! అందుచే వారలకు మిగులఁ గష్టములు సంభవించును. దానివలన నీకుఁ బాపముగలిగి నరకబాధను నీవు పరలోకమందనుభవింపనగును. కాన, నిహపరములకు రెంటికిని జెడినవాఁడవగుచున్నావు. అయితే, ఒకవేళ యుద్ధమున నీకే మరణము సిద్ధించునేమోయని యెంచెదవేని యట్లైనను నీవీయుభయలోకములయందును మేలునే చెందఁగలవు. అదెట్లనిన, ఇహమునందు నీభుజబలపరాక్రమముల నెఱిఁగియుండు నీబంధుమిత్రాదులును, నితరులును, నీవు చక్కఁగానే యుద్ధముచేసితివనియు, అయితే, దైవగతి యిట్లుండుటచే శత్రువులచేఁ జచ్చితివనియు; ననుకొనుచు, నీగుణాతిశయములను గొనియాడుచునే యుందురు. పరమందునో నీకు వీరస్వర్గమే గలుగుచున్నది. (చూ 2-37) కాఁబట్టి యుద్ధముఁ జేయుటయే మేలుగాని పరధర్మమగు తాపసవృత్తి నీకు మేలైనది గాదు.

అర్జు:— మంచిది, అయ్యా! ఇపుడు నేను నాకులధర్మమగు యుద్ధమును మాని తాపసవృత్తి నవలంబించుటచే నిట్టి యపకీర్తి గలుగుచున్నదిగదా! ఇట్టియుద్ధప్రసక్తి లేనపుడు నేనట్లు తాపసవృత్తి నవలంబించుట తగదా?

కృ — ఇప్పుడే కాదు, ఎప్పుడైననట్లు చేయఁగూడదు. ఇది నీకే కాదు సరే గదా, మఱియొవరికైన నెప్పటికిని గూడదు. ఒక కులస్థుఁడు ఇంకొక కులాచారపు పనులఁ జేయఁగూడదు. అట్లాచరించువాని కెప్పటికిని కీడేగాని మేలుగలుగనేరదు.

అదెట్లనినఁ జెప్పెదవినుము. ఒక బ్రాహ్మణుఁడు తన కులాచారప్రకార మాచరింపవలసిన సంధ్యావందన వేదాధ్యయనాది కృత్యముల మాని యితరు లాచరించుపనులఁ జేయుచు, వారివలె మాంసాదుల భక్షింపుచుండినయెడల వానిని దక్కిన బ్రాహ్మణులు కులమునుండి వెలివేయుదురుగదా! పోనిమ్ము, ఇతరులైనను దమకులాచారము నవలంబింపుచున్నాఁడు గదాయని వానియం దేమైన గౌరవముగా నుందురని యెంచెదవా? అట్లును గాదు. అందునకు బదులుగా వీఁడు కులభ్రష్టుఁడని యెంచి తమలోఁ గూడఁ జేరనివ్వక యతి నీచముగాఁ జూతురు. కాన నుభయభ్రష్టుఁ డగుచున్నాఁడు. మంచిది, ఇతరుఁ డెవఁడైన నొకఁడు తనకులాచారపు పనులు మాని బ్రాహ్మణాచారముల నవలంబింపుచు, వారలవలె సంధ్యావందనము, వేదాధ్యయనము మొదలగు పనులఁ జేయుచుండిన, వానిని బ్రాహ్మణులు తమ కులమునందుఁ జేర్చుకొనియెదరా?

అర్జు — అట్లెన్నటికిని జేర్చుకొనరు సరేగదా వానిఁజూచి యసహ్యపడుచుందురు.

కృ — మంచిది, వానికులస్థులగు తక్కినవారైనను వీఁడు బ్రాహ్మణాచారమును జరుపుచున్నాఁడే, వీఁడు మనకంటె నెక్కుడైనవాఁడు గదాయని తలంచి వానినేమైన గౌరవింతురా?

అర్జు — లేదులేదు. అందునకు బదులుగా వీఁడు బ్రాహ్మణవేషము వేసికొని లేనిపోని పోకిళ్ళు పోవుచున్నాఁడని పరిహాసింతురు.

కృ — అప్పటికి వీఁ డుభయభ్రష్టుఁడైన వాఁడేగదా?

అర్జు — అవును, అట్లేతోఁచుచున్నది.

కృ — కాఁబట్టి ఎవఁ డేకులమునఁ బుట్టుచున్నాఁడో వాఁ డా కులమునందుఁ గల యాచారములనే యథావిధిగా జరిగించుకొనుచుండుటయే మేలనియు, నితరకులాచారముల నాచరించుట కీడనియు, జెప్పుటకుఁ గారణమైనది. అయితే యట్లాచరించుటలో ఫలాభిలాష వదలి తానుజేయు కార్యములన్నియు భగవదర్పితములుగఁ జేయుచు, భగవంతుని సదా ధ్యానింపుచుండిన యెడల నదియే కర్మయోగమనఁబడును. దానివలననే క్రమముగా జ్ఞానము హెచ్చి తద్వారా మోక్షార్హుఁడు కాఁగలఁడు.

అర్జు — అయితే, అయ్యా! కొన్నికులము లతినీచములైనవిగను, వానియందలి యాచారములతి హేయములుగను, నుంచున్నవే, అట్టి కులాచారముల జరుపువారికిఁ గూడ జ్ఞానోదయమై వారలు మోక్షార్హులు కాఁగలరా?

కృ — అహా! అందునకు సందేహము లేదు. వా రెంత నీచు లైనను సరే, వారి కులాచారము లెంత హేయము లైనవియైనను సరే, ఆకులాచారముల పనులను ఫలాభిసంధి రహితముగా నాచరించుచు భగవదర్పితముఁ జేయుచు వచ్చినయెడల వారు మోక్షార్హులుగాఁ గలరు. దీనికి నిదర్శనముగా మీరందఱరణ్యవాసముఁ జేయుచుండినపుడు మార్కండేయ మహాముని మీయన్నయగు ధర్మరాజు నొద్దకు వచ్చి యుపన్యసించిన యనేకేతిహాసములలో మిథిలాపుర వాసియగు ధర్మవ్యాధుఁడను నొక లుబ్ధకుఁడు (బోయవాఁడు) కౌశికుఁడను నొక బ్రాహ్మణునకుఁ జేసిన ధర్మోపదేశమను నితిహాసమొకటి గలదు. దానిఁ జెప్పెద వినుము. అది చక్కఁగా విన్నయెడల నీమదిని గల సంశయములన్నియు వీడి కర్మయోగ మిట్టిదిగదా, దీనివలన గలిగెడు ఫలమిట్టిది కదా యని బోధపడఁగలదు. ఆయితిహాస మెట్లనిన, కౌశికుండను వేదాధ్యయన సంపన్నుండగు బ్రాహ్మణుండొక నాఁడు తనకు భిక్షయిడిన యొక పతివ్రతవలన మిథిలానగరమందు జితేంద్రియుఁడును, సత్యవాదియు, మాతృపితృ భక్తుండును, నైన ధర్మవ్యాధుండను కిరాతుఁడున్నవాఁడనియు నతఁడు సమస్తధర్మముల నెఱింగినవాఁడనియుఁ దెలిసికొని, యట్టి నీచవృత్తినవలంబించుచుండు వాని కిట్టి యోగ్యత యెట్లుగలిగెనో యరయవలయునని యపేక్షించినవాఁడై మిథిలానగరంబునకుం బోయి యచట నాధర్మవ్యాధుఁడుండు చోటికిఁ బోవఁగా నచట నాధర్మవ్యాధుండంగడియందుఁ యల్ప మృగమాంస ఖండంబు లమ్ముచుండుటం గని యాయంగడి యందుఁ జేరనిచ్చగింపక యనతి దూరంబున నొకచోట వేచియుండ నాకిరాతుండు మాంసవిక్రయంబు చేసి యంగడి మూసి యింటికిఁ బోవునపుడు తనకొఱకై వచ్చియుండెడు నాబ్రాహ్మణుని వృత్తాంతముఁ దెలిసికొన్నవాఁడై యా బ్రాహ్మణుండు గూర్చుండియుండు చోటికిం బోయి యాయనకు మ్రొక్కి— అయ్యా! మీరొక పతివ్రత పంపున నిచటికే తెంచుటయు, మీమనోరథమును, నేఁ దెలిసికొనినాఁడఁ, గాన నాతోడ మద్గృహంబునకు విచ్చేయుండని పిలుచుకొని పోయెను. అపుడా కౌశికుండు ధర్మవ్యాధు నెఱుకకును, పతివ్రతయొఱుకకును, నచ్చెరు వొంది యిదియేమి యాశ్చర్యమని తనమదిలో నూహించుకొనుచు వాని గృహంబున కరిఁగి యతనిచేఁ బూజితుండై యిష్టకథా ప్రసంగంబులనుండి యిట్లనియె.

“ తే. గీ. నీవు గడు ధర్మవిదుఁడవు జీవహింస
జీవనంబుగ నడుచుట శిష్టపథమె
యకట యీఘోరకర్మంబునకు మదీయ
బుద్ధి తద్దయు దుఃఖంబుఁ బొందె నిపుడు.

వ. అనుటయు లుబ్ధకుండిట్లనియె. బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయ బ్రహ్మచర్యంబులును, రాజులకు దండనీతియు, వైశ్యులకుఁ గృషిపశుపాలన వాణిజ్యంబులును, శూద్రులకు శుశ్రూషయు, నెట్లుపరమధర్మంబులై చెల్లు, నట్ల మాకును మృగమాంసోపజీవనంబు పరమధర్మంబు. విశేషించి యిది వంశక్రమాగతంబైన యాచారంబు. నిను మదియునుంగాక యీదేశంబునకు రాజైన జనకుండు నిజధర్మప్రవర్తకుండై సకలవర్ణరక్షణంబు వదలకుండు. ఆత్మవర్ణాచార ధర్మంబులు విడుచువారిఁ దనపుత్రులైనను దండితులంజేయుఁగావున నేనును నిజధర్మ పరిత్యాగంబు సేయనోడుదు నీదృశప్రవర్తనుండనయ్యును.

తే. గీ. జీవహింసనెన్నండును జేయ ననఘ
యొరులు చంపి తెచ్చినమాంస మొనర విలిచి
తగిన వెల కమ్మి బ్రతుకుదుఁ దద్ధనమున
నమలమాంసంబు శాంతియ సాధనంబు.

చ. వినయము విస్తరిల్లగురువృద్ధజనాతిథివిప్రదేవతా
ర్చనలొనరింతు సత్యమును శౌచము నేమఱ నీగిమన్ననం
దనుపుదు భృత్యబంధుతతిఁ దాల్మి వహింతు ననూయఁ జేయనెం
దునుమదిఁ దృష్ణపొన్పఁ బరదోషకథావిముఖుండ నెప్పుడున్.

క. సతతోపవాసనియమ
వ్రతములఁ జరియింతు నేకపత్నీప్రియుఁడన్
ఋతుకాలరతుఁడ నిందా
స్తుతులందుమనంబు నాకుఁ దుల్యతనుండున్.

వ. అట్లగుటంజేసి హీనయోని జాతుండనైనను, నిర్మలుండనైతిం బ్రసంగవశంబున నింత చెప్పవలసె.'' (చూ. భార. ఆరణ్య. ౫ ఆ ౩౧-౩౯) అని చెప్పియున్నాఁడు. కావున నోయి యర్జునా! యెవఁడేని యెట్టి నీచకులసంజాతుఁడైనను సరే, వాని కులవృత్తి యెంత హేయమైనదైనను, హింసారూపమైనదైనను సరే, యిప్పుడీ ధర్మవ్యాధునికిఁ గలిగియుండు లక్షణములు గలవాఁడైనయెడల వాఁడే నిష్కామకర్మయోగి యనఁబడును.

అర్జున ఉవాచ :

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ! బలాదివ నియోజితః॥ 36

అర్థము :— హేవార్ష్ణేయ ! = వృష్ణివంశోద్భవుఁడవైన యో కృష్ణమూర్తీ! అథ = అయితే, అయమ్ + పూరుషః = ఈపురుషుఁడు, కేన = దేనిచేత, ప్రయుక్తః + (సన్) = ప్రేరేపంపఁబడినవాఁడై, అనిచ్ఛన్ + అపి = ఇచ్ఛలేనివాఁడై యును, బలాత్ = బలాత్కారముగా, నియోజితః + ఇవ = ఆజ్ఞాపింపఁబడినవాఁడువలె, పాపమ్ = పాపకార్యమును, చరతి = చేయుచున్నాఁడు ?

అర్జు:— అయ్యా, కృష్ణమూర్తీ! ఇపుడు నీవు చెప్పినదంతయుఁ జక్కఁగ నాలోచించి చూడఁగాఁ బ్రతిపురుషునకును వానికులమెట్టిదైనను, వానికులవృత్తి యెంత హేయమైనదిగనున్నను, ప్రస్తుతము నేఁ జేయఁ బూనుకొన్న బంధుమిత్ర వధారూపమగు యుద్ధకర్మమువలె నెంత క్రూరమైనదిగనున్నను, దానివలనఁ బాపమంటనట్లును, నందునకు బదులుగా నట్టి కులవృత్తిపనుల నియతము దప్పక యాచరించుటచే వానికిఁ గ్రమముగ జ్ఞానోదయమై యతఁడు మోక్షమునకే యర్హుఁడగునట్లును, గనబడుచున్నది. కాన నీలోకమునం దెవరికిని బాపకార్యముఁ జేయవలసిన యగత్య ముండనేరదు సరేగదా, పాపకార్యము నరకహేతువనియెడి భయముగూడఁ గలిగి యుంచున్నది. కాన నీలోకమం దెవఁడును బాపకార్యములఁ జేయ నిచ్ఛగింపఁడు గదా ? అట్లుండియుఁ బ్రతిపురుషుఁడును నేదియో యొక పాపమును జేయుచునే యుండుట మనము చూచుచున్నాముగదా ? ఇందువలనఁ బ్రతిపురుషుఁడును బాపముఁ జేయ నిచ్ఛగింపనివాఁడయ్యును, నేదియో యొకదానిచేఁ బ్రేరేపింపఁబడి బలాత్కారముగ, జేయుచు న్నట్లగపడుచున్నదే అది యేది ?

శ్రీభగవానువాచ :

శ్లో॥ కామ ఏషః క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥ 37

అర్థము:— ఏషః = (నీచే నడుగఁబడిన) ఈహేతువు, రజోగుణసముద్భవః = రజోగుణమువలనఁ బుట్టినదియు, మహాశనః = తృప్తి నొందనిదియునగు, కామః = కామము (ఆశ). ఏషః = ఈహేతువే, (రజోగుణసముద్భవః) = రజోగుణమువలనఁ బుట్టినదియు, మహాపాప్మా = మహాపాతకమునకు హేతువైనదియునగు, క్రోధః + (చ) = క్రోధమును (అయియున్నది) (తతః) = కాఁబట్టి, ఏనమ్ = ఈకామమును, లేక, క్రోధమును, ఇహ = ఈలోకమునందు, వైరిణమ్ = (జ్ఞానికి) శత్రువునుగా, విద్ధి = తెలిసికొనుము.

కృ — ఓయి యర్జునా! ఇంతకు ముందు నీకు నేనొక సంగతిఁ జెప్పియున్నాను. అనఁగాఁ బ్రతీంద్రియ విషయమునందును రాగద్వేషము లుండునవనియు, నవి యోగాభ్యాసికి విరోధులనియుఁ. గాన వానివశము గాఁగూడదనియుఁ, జెప్పియుంటినిగదా (చూ. 3-34) అది జ్ఞాపకములోనున్నదా!

అర్జు — అవును, జ్ఞాపకమున్నది.

కృ — ఆరాగద్వేషములకే కామక్రోధములనియుఁ బేర్లుగలవు. ప్రతిపురుషునిఁ బాపముఁజేయునట్లు ప్రేరేపించునట్టిది యేదియని యిప్పుడు నీవడుగుచున్నావుగదా? అట్లు ప్రేరేపించునట్టిది ఈ కామమే. అనఁగా నింద్రియవిషయములయెడలఁ గలిగెడు కోరికయే. దీనికే ఆశ అనియుఁ బేరు. ఈ కామము దేనివలనఁ గలుగుచున్నదనఁగా, రజోగుణమువలనఁ బుట్టుచున్నది. ఈ కామ మెట్టిదనఁగా ఎంతదిన్నను నాపోవని తిండిపోతువలెఁ దృప్తిఁ జెందనిది. కాబట్టియే "ఆశకు మేరలేదు కనకాద్రిసమానధనంబు గూడినన్" అని పెద్దలు సెప్పియున్నారు. ఈ కామముయొక్క స్వరూప స్వభావములనుగుఱించి నీకిదివఱకే విపులముగాఁ జెప్పియున్నానుగదా (చూ. 2-62) అయితే, ఏపురుషుఁడైననుసరే కామము (కోరిక) కలిగినంతమాత్రముచేతనే పాపము నెట్లు చేయునందువేని చెప్పెద వినుము. ఈ కామమువలననే క్రోధముత్పన్నమగుచున్నది. ఆక్రోధమన్నను మహాపాతకములకు హేతువైనది. ఎట్లనఁగా, దీనివలన మోహము, స్మృతివిభ్రమము, బుద్ధినాశము మొదలగు ననర్థములు గలుగుచున్నవి. ఇదియంతయు నీకిదివఱకే విపులముగఁ జెప్పియున్నానుగదా? (చూ. 2-63) కనుక నీక్రోధముగూడఁ బ్రతిపురుషునిఁ బాపముఁ జేయునట్లు ప్రేరేపించునదియని యెఱుంగుము. కాఁబట్టి యీ కామక్రోధములు రెండును నీలోకమునఁ బ్రతివారికిని విరోధమును జేయునట్టివని, అనఁగా వానిచేఁ బాపకార్యములఁ జేయించి తద్వారా వానికి నరకబాధను గలుగఁ జేయునట్టివని యెఱుఁగుము.

అర్జు — ఇప్పుడు నీవు సెప్పిన ప్రకారము కామక్రోధములు రెండును రజోగుణమువలనఁ బుట్టినవైనయెడల నీరజోగుణము ప్రకృతివలన బుట్టినదిగదా! కాఁబట్టి ప్రతిపురుషునకును నీ కామక్రోధములు స్వభావగుణములే యైయున్నవిగదా, ఇట్టి విషయములో నెవనికైన నీ కామక్రోధములను విడుచుట కెట్లు సాధ్యమగును?

శ్లో॥ ధూమేనాఽవ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥ 38

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ ॥ 39

అర్థము:— వహ్నిః = అగ్ని, ధూమేన = పొగచేతను, ఆదర్శః = అద్దము మలేన + చ = మురికిచేతను, యథా = ఎట్లు, ఆవ్రియతే = ఆవరింపబడుచున్నదో, గర్భః = పిండము, ఉల్బేన = మావిచేతను, యథా = ఎట్లు, ఆవృతః = ఆవరింపఁబడుచున్నదో, తథా = అట్లు, ఇదమ్ = ఈ (జ్ఞానము), తేన = ఆ (కామముచేత), ఆవృతమ్ = ఆవరింపఁబడియున్నది, హేకౌన్తేయ! = ఓయర్జునా! దుష్పూరేణ = నిండింపఁగూడనిదియు, అనలేన = అగ్నివంటిదియు, కామరూపేణ = ఆశారూపమైనదియుఁ జ్ఞానినః = జ్ఞానికి, నిత్యవైరిణా + చ = నిత్యశత్రువైనదియునగు, ఏతేన = ఈ (క్రోధము) చేత, జ్ఞానమ్ = జ్ఞానము, ఆవృతమ్ = ఆవరింపబడియున్నది.

కృ — ఓయి యర్జునా! నీవు దలంచిన ప్రకారము కామక్రోధములు రెండును స్వభావగుణములనియే చెప్పవచ్చును. అయినను. నవి జ్ఞానమునందు సమ్మిళితమై యుండవుగాని, నిప్పు పొగచేతను, అద్దము మురికిచేతను, గర్భమునందలి శిశువు జరాయువు (మావి) చేతను, నెట్లావరింపబడియుంచున్నవోఁ ఆట్లే జ్ఞానమును నీకామక్రోధములచే నావరింపఁబడియుంచున్నది. గాన వానిని దొలఁగించుట బొత్తిగ నసాధ్యము గాదు. అదెట్లనఁగా, పొగ రాజుచుండెడు నిప్పును నూఁదుటచేతను, లేదా విసరుటచేతను, మంటమండి పొగవిడి పోవుచున్నదిగదా? మురికిలోఁ గప్పఁబడి యుండు నద్దము గడుగుటచేతను, లేదా తుడుచుటచేతను, నామురికివిడిచి యద్దము తేటగింపుచున్నదిగదా? ప్రసవించినతోడనే శిశువు నావరించియుండు మావి వీడి పోవుచున్నదిగదా? అలాగుననే “అభ్యాసేనతు కౌన్తేయ! వైరాగ్యేణచగృహ్యతే.” (చూ. 4–35). అనునట్లు యోగాభ్యాసమువలన నీకామక్రోధములు విడిచి పోయి జ్ఞానము ప్రకాశించును.

అర్జు — అయితే, పొగరాజుచుండెడు నిప్పును నూఁదఁగా మంటమండి యూయూఁదుటను నిలుపఁగానే మండుట నిలిచి మరలఁ బొగ రాఁజుచునే యుండును గదా, అలాగుననే యీజ్ఞానమునుగూడ నీ కామక్రోధములు గప్పుచు విడుచుచునే యుండునుగదా?

కృ — అవును, అయితే, పొగరాఁజుచుండెడు నిప్పును నూఁదఁగా, మండుచు, నామంట సమసిపోయి మరలఁ బొగరాఁజుచు, మరల మండుచు రాఁగరాఁగఁ గొంతసేపటికి మంట నలుప్రక్కల వ్యాపించి గొప్పమంట లేచి యటుపిమ్మట

నూఁగుటయు, విసరుటయు నక్కఱలేకయే తనంతట నెట్లు మండుచుండునో యాలాగుననే, యోగాభ్యాసికిఁగూడ నీ కామక్రోధములు మనోబుద్ధీంద్రియములయం దంకురింపుచును, నతఁడు చేయు మనోనిగ్రహమువలన నివర్తింపుచు, మరల నంకురింపుచు, మరల మనోబుద్ధీంద్రియనిగ్రహముచే నివర్తింపుచు నిట్లు కొంతకాలము వఱకు నతని బాధింపుచుండును. అయితే, అవి యంకురించినప్పుడెల్ల నా యోగాభ్యాసకుఁడు విడువక పట్టుదలతోడ మనోబుద్ధీంద్రియముల నిగ్రహముఁజేయుచు వచ్చిన యెడల నవి యంకురించినవెంటనే యణఁగిపోవును. అట్లు విడువక చేయుచు రాఁగ రాఁగ, నట్టియభ్యాసమువలనఁ గొంత కాలమునకుఁ బూర్ణవైరాగ్యము గలుగును. అప్పుడా కామక్రోధము లంకురించుట నిలిచిపోవును. అటుపిమ్మట జ్ఞానము నిర్మలమైనదై యవిచ్ఛిన్నముగఁ బ్రకాశింపుచుండును. తరువాత నాజ్ఞానము నీ కామక్రోధాదులు గప్పఁజాలవు. గనుకనే యట్టి జ్ఞానమునకు నఖండ జ్ఞానమని పేరు.

శ్లో॥ ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ 40

అర్థము:— ఇన్ద్రియాణి = ఇంద్రియములును, మనః = మనస్సును, బుద్ధిః = బుద్ధియును, అస్య = ఈ (కామమునకు), అధిష్ఠానమ్ = ఆశ్రయమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ఏషః = ఈ (కామము), ఏతైః = ఈ (యింద్రియాదులచేత), జ్ఞానమ్ — జ్ఞానమును, ఆవృత్య — ఆవరించి, దేహినమ్ = మనుష్యుని, విమోహయతి = మోహింపజేయుచున్నది.

అర్జు — ఈ కామక్రోధముల నివర్తింపఁజేయుటకు మనోబుద్ధీంద్రియములను నిగ్రహింపవలయునంటివే, యందుకుఁ గారణమేమి ?

కృ — ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవి కామక్రోధముల కాశ్రయస్థానములు. అనఁగాఁ గామక్రోధములీ యింద్రియాదులయందుఁ బుట్టి వానిచేతనే ప్రతి పురుషునియొక్క జ్ఞానము నావరించుకొని మోహింపఁజేయుచున్నవి. ఆయింద్రియాదులు లేనియెడల నీ కామక్రోధాదులు పుట్టనే పుట్టవు. అదెట్లనఁగా, నొక పురుషుఁ డేదైన కంటికింపైన వస్తువును జూచిననేగదా దానియందుఁ గామము (ఆశ) గలుగుచున్నది ?

అర్జు — అవును.

కృ — ఆయాశ దేనియందు బుట్టుచున్నది ?

అర్జు — మనస్సునందు.

కృ — అప్పటికి మనస్సుగూడఁ గామమునకు నాశ్రయస్థానము గాలేదా ?

అర్జు — అవును.

కృ — మంచిది, ఆవస్తువునం దాశ పుట్టినతోడనే దానిని బొందఁగోరునట్టిది యేది ?

అర్జు — బుద్ధి.

కృ — అప్పటికి బుద్ధిగూడఁ గామమునకు నాశ్రయస్థానముగాలేదా ?

అర్జు — అవును.

కృ — మంచిది, అట్లుకోరఁబడిన వస్తువులభించెనేని సరే, లేనియెడల నేమి గలుగుచున్నది ?

అర్జు — అట్లులభించుటకు దేనివలన నాటంకముగలుగుచున్నదో దానియెడల నాగ్రహముగలుగును.

కృ - అట్టి యాగ్రహమునకే క్రోధమనిపేరు. కాన నీకామక్రోధములకు మనో బుద్ధీంద్రియము లాశ్రయస్థానములని యిప్పుడు బోధపడినదిగదా ?

అర్జు — అవును, బోధపడినది,

కృ — మంచిది, ఆవస్తువును గంటితోఁ జూడని యెడల దానియందపేక్ష గలుగునా ?

అర్జు — కలుగదు.

కృ — అపేక్షయే కలుగనపుడు దానిఁబొందవలెనని యెడు కోరికయును బుట్టనేరదు గదా ?

అర్జు — అవును, పుట్టనేరదు.

కృ — ఇట్లే తక్కిన యింద్రియవిషయములను గుఱించియు గ్రహించునది.

శ్లో॥ తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥ 41

అర్థము:— తస్మాత్ = కనుక (పైఁజెప్పఁబడినప్రకారమింద్రియాదులు మోహ మునుగలుగఁజేయుచున్నవిగనుక), హేభరతర్షభ! = ఓయియర్జునా! త్వమ్ = నీవు ఆదౌ+హి = ఆదియందే, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, నియమ్య = నియ మించి పాప్మానమ్ = పాపరూపమైనట్టియు, జ్ఞానవిజ్ఞాననాశనమ్=జ్ఞానవిజ్ఞానము లను రెంటిని నశింపఁజేయునట్టిదియు నగు, ఏనమ్ = ఈ (కామమును), ప్రజహి=విడిచి పెట్టుము.

కనుక నోయి యర్జునా! నీవు ముఖ్యముగాఁ జేయవలసిన పనియేమనఁగా, మొట్టమొదటఁ బాపేంద్రియములు నడఁచి పట్టవలసినది. అనఁగా నాయింద్రియములు

పోయెడు దార్లను బోనీక మరలించుకొనుచుండవలసినది. ఇట్లు చేయుటవలన నాయింద్రియములు విషయములయందుఁ బ్రవర్తింపనేరవు. అనఁగా వ్యాపింపనేరవు. అట్టి యింద్రియము లెపుడు విషయములయందు వ్యాపించుట లేకపోవుచున్నదో యప్పుడా విషయములయం దాశ (కామము) పుట్టనేరదుగదా. ఆకామ మెప్పుడు లేకపోయెనో క్రోధమప్పుడే లేక పోవుచున్నదిగదా! కావ నీవట్లు చేయుటచేత (అనఁగా నింద్రియములను విషయములనుండి మరలించుటచేత) పాపకారణమును, జ్ఞానమును జెఱచునట్టిదియునగు నీకామమును నీవు విడిచినవాఁడవగుదువు.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! ఇంద్రియములు బలీయములైనవని యిదివఱకే నీవు చెప్పియున్నావుగదా ? (చూ. 2-60) అట్టి యింద్రియముల నడఁచిపట్టినయెడలఁ గామ మనెడు శత్రువును జయింపవచ్చునని యిపుడు చెప్పుచున్నావే, యట్టి బలవంతములైన యింద్రియముల నడఁచిపట్టుట కేమియుపాయము ?

శ్లో॥ ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥ 42

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా
జహి శత్రుం మహాబాహో ! కామరూపం దురాసదమ్॥ 43

అర్థము :— ఇన్ద్రియాణి = ఇంద్రియములు, పరాణి = శ్రేష్ఠములైనవి (అనఁగాస్వతః బలవంతములైనవని భావము.) ఇన్ద్రియేభ్యః = ఇంద్రియముల కంటె, మనః = మనస్సు, పరమ్ = శ్రేష్ఠమైనది, (ఎక్కువ బలముగలది), మనసః+తు మనస్సుకంటెను, బుద్ధిః = బుద్ధి, పరా = శ్రేష్ఠమైనది, (ఎక్కువ బలముగలది), బుద్ధేః+తు (అట్టి) బుద్ధికంటెను, యః = ఎవఁడు, పరతః = శ్రేష్ఠుఁడో, సః = వాఁడు, (ఆత్మా+ఇతి) ఆత్మయని, (పణ్డితాః) పండితులు, ఆహుః = చెప్పుదురు, (తస్మాత్) ఆకారణమువలన, హేమహాబాహో = ఓయర్జునా, ఏవమ్ = ఇట్లుఁ ఆత్మానమ్ = ఆత్మను, బుద్ధేః = బుద్ధికంటెను, పరమ్ = శ్రేష్ఠమైన దానినిగా, బుద్ధ్వా = ఎఱిఁగి, ఆత్మానామ్ = బుద్ధిని, ఆత్మనా = ఆత్మచేత. సంస్తభ్య = నిశ్చలముగఁజేసి, కామరూపమ్ = ఆశయనెడు, దురాసదమ్ = జయింపఁగూడని, శత్రుమ్ = (జ్ఞాన) శత్రువును, జహి = విడువుము.

కృ—అవును, ఇంద్రియములు బలవంతములైనవిగానే యుంచున్నవి. అయినను,

"క. వినుమా పై దింద్రియములకును
మనంబు షష్ఠంబు సప్తమత్వము బుద్ధిం

బనిగొను భవ్య క్షేత్ర
జ్ఞానియ ౯క్షమత గల్గ సుగుణా భరణా !''

(భార. శాంతి. ౫. ఆ ౧౬౫)

అనునట్లు, విషయములయందుఁ బ్రవర్తించుచున్నవానిలో మొదటివి పంచేంద్రియములును, వాని తరువాతిది, అనఁగా నాఱవది మనస్సును, దాని తరువాతిది, అనగా నేడవది బుద్ధియును, దానితరువాతిది, అనఁగా నెనిమిదవది యాత్మయు నై యుంచున్నవి. అదెట్లనఁగా;

"తే.గీ. తలఁచు మనమందు నిశ్చయదశయొనర్చు
బుద్ధి సర్వైకసాక్షిత్వమున వెలుంగు
నంతరాత్ముండు క్షేత్రజ్ఞుఁ డనగ వాని
మెఱుపు సత్త్వాదిగుణములై మెఱయు వత్స,''

(భార. శాంతి. ౫. ఆ-౧౬౬)

అనునట్లు, ఇంద్రియములు విషయములయందుఁ బ్రవర్తించినతోడనే యావిషయములయందు మనస్సు తగులుచున్నది. అనఁగా నేదైన యొకవస్తువును జూచినపుడును, ఒక శబ్దమును వినినపుడును, ఒక వస్తువు నాఘ్రాణించి నపుడును, ఒక వస్తువును రుచిచూచినపుడును, ఒక వస్తువును స్పృశించి నపుడునునేగాని యావిషయముల యందు మనస్సు తగులనేరదు గదా ? కాన ముందుపనిచేయునవి నేత్రాదీంద్రియము లైదును, వెనుకఁ బనిచేయునట్టిది మనస్సు. కనుక నది యాఱవదిగను, ఆ మనస్సే విషయమునఁ దగులుచున్నదో యావిషయము యుక్తమైనదా, అయుక్తమైనదా, యని యోచించి నిశ్చయించునది బుద్ధిగనుక నది యేడవదిగను, నివియన్నియుఁ జేయు పనులను సాక్షిభూతుఁడుగా, జూచుచుండునది యాత్మగనుక నాయాత్మ యెనిమిదవదిగను, నుంచున్నవి. గనుకనే

"తే.గీ, అనఘ యింద్రియములు విషయములు మనసు
బుద్ధియును నాత్మయును గ్రమంబునన యెక్కు-
డాత్మ బుద్ధి యనంగనల్పాంతరంపు
వస్తువులు బుద్ధి యస్సంటవి స్తరిలుట.'' (భార.శాంతి.౫.ఆ - ౧౬౭)

అనునట్లు, ఇంద్రియములకంటె మన స్సెక్కు-వైనదనియు. మనస్సుకంటె బుద్ధి యెక్కు-వైనదనియు, బుద్ధికంటె నాత్మ యెక్కు-వైనదనియును జెప్పఁబడుచున్నవి. అయితే, బుద్ధియే యన్నివిషయములయందుఁ బనిచేయునదిగను, నట్టి బుద్ధి చేసెడుపనుల నాత్మకేవల సాక్షిభూతుఁడై చూచుచుండుట మాత్రముఁ గలనను, నాత్మ

కును బుద్ధికిని, విశేషభేదము లేదనియును, అనఁగా, బుద్ధియే యాత్మయనియు, నాత్మయే బుద్ధియనియుఁ జెప్పఁదగి యుంచున్నది. అదెట్లనఁగా,

"క. కనుఁ గన్నై వినుఁ జెవియై
కొనుఁ జవి జిహ్వయయి మూరకొను నాసికయై
తనువై స్పర్శముఁ గైకొను
ననవద్యా బుద్ధియాత్మయందు నిలుచుచున్." (భార.శాంతి.౨.ఆ-౧౬౯)

అనునట్లు, బుద్ధి యాత్మయం దుంచున్నదై నేత్రేంద్రియమునఁ బ్రవర్తించు నపుడు చూచుచును, శ్రోత్రేంద్రియమునఁ బ్రవర్తించునపుడు వినుచును, జిహ్వేంద్రియమునఁ బ్రవర్తించునపుడు రుచిఁ జూచుచును, ఘ్రాణేంద్రియమునఁ బ్రవర్తించు నపుడు వాసనఁ జూచుచును, త్వగింద్రియమునఁ బ్రవర్తించునపుడు స్పృశించుచును, నుండుటయే గాక, అట్లుచేయునపుడు,

"క. ప్రీతిం గడుఁ బొదలు విషా
దాతురతన్ స్రుక్కుఁ దద్ద్వయము లేక సమ
త్వాతిశయంబున నిలుచును
నేతృత్వంబునను బుద్ధి నెఱపు గుణములన్." (భార.శాంతి.౨.ఆ-౧౭౦)

అనునట్లు, ఆయా విషయములు ప్రీతికరముగ నుండినయెడల సుఖించుచును, నసహ్యకరముగ నుండినయెడల దుఃఖించుచును, గొన్నిసమయముల యందట్టి సుఖ దుఃఖము లేవియుఁ జెందక సమభావము వహించి యుంచుండును. గనుక వీనిలో నన్నింటికంటె బుద్ధియే శ్రేష్ఠమైనదిగా నుంచున్నది గాన నో యర్జునా!

"ఆ.గీ. తత్స్వభావ మెఱిఁగి తా నింద్రియాదిస
ప్తకము వెంటఁ బోక తన్నుఁగనుచు
నున్నవానిఁ బొందనోపునె దుఃఖదై
న్యంబు సుఖమదంబు నప్రమత్త." (భార.శాంతి.౨.ఆ-౧౭౧)

అనునట్లు, బుద్ధిమంతుఁడగువాఁడు బుద్ధియొక్క సత్తాయిట్టిదని యెఱిఁగినవాఁడై యిట్టిబుద్ధిని గొని దానివలన యుక్తాయుక్తపరిజ్ఞానముగలవాఁడై మనస్సును, దద్ద్వారా యింద్రియములను, వశపఱచుకొని, సాక్షిభూతుఁడుగనుండు నాత్మయందే దృష్టినిలిపి యుండినయెడల నట్టివాఁడు సుఖము ననుభవించునప్పుడు మోదమును, దుఃఖము ననుభవించునపుడు దీనత్వమును, బొందక

" ఆ. గీ జలములందు నిలిచి జలపక్షి మునుఁగదు
మేడిపండు మశకపీడఁ బొరయ

దట్ల విషయసమితియందుం దా నది దన
యందు నుండు వికృతి నొందదాత్మ." (భార. శాంతి. ౫. ఆ. ౧౭౩)

అనునట్లు విషయములయందింద్రియములు ప్రవర్తించునపుడు నీటియందుండు పక్షి యానీటిచేఁ దడియకయుండునట్లును, అత్తిపండునందుండు పురుగులచే నది చెడకుండునట్లును, నేవిధమైన వికారమును జెందకుండునుగాన, నోయి యర్జునా! నీవు నీబుద్ధిబలముచేత నీమనస్సును గట్టిగా బిగఁబట్టి చలింపనీక దృఢముగ నుంటివేని యసాధ్యమగునట్టి కామమనెడి యీశత్రువును జయింపఁగలవు. ఇందుకు దృష్టాంతముగ నొకయితిహాసమును జెప్పుచున్నాను వినుము. మంకియను బ్రాహ్మణుఁడొకఁడు ధనాపేక్షగలవాఁడై మాఱుబేరమున కమ్ముకొనుటకుఁగా జోడు గుజ్జుకోడెలను గొని యారెంటికిని లంకెవేసి తోలుకొనిపోవుచుండ, నవి యొక చనుపయందుఁ బండుకొనియుండెడు నొకలొట్టియం జూచి బెదరి యాలొట్టియమీఁదినుండి పరుగెత్తఁగా, నాలొట్టియయును బెదరిలేచి పరుగెత్తసాఁగెను. అప్పుడా లంకెత్రాడా లొట్టియ మెడమీఁదఁ దగులుకొని యాకోడెలు రెండు నాలొట్టియకు నుభయపార్శ్వముల నురిఁదీసినట్లు వ్రేలాడుచుఁ జచ్చెను. అదిచూచి యావిప్రుండందువలనఁగలిగిన నష్టమును గుఱించి చింతింపుచుఁ దనలోఁ దానిట్లని వితర్కించె.

" క. మనమునకు సుఖముఁ గోరెడు
జనులకు నర్థక్రియావిశారదభంగుల్
పొనుపడ విడిచి బలములే
కునికియ యూహించి చూడ నుర వెబ్బంగిన్॥

వ. అని పలికి యుద్దామంబైన కామంబు విడుపు వడ కున్నఁ జిత్తంబునకు నిర్వృతి గల్గునేయను విచారంబు వుట్టి తదీయోత్సారణం బూహించి, యాచిత్తధర్మంబు నుద్దేశించి,

క. నీమూలం బే నెఱిఁగితిఁ
గామమసంకల్పమునన కలిగెదు సంక
ల్పామర్షరహిత మగుచే
తోముద్రం దాల్తునేను దుది యది నీకున్.

వ. అని కామంబనునది గోర్కి గావునఁ గోర్కియొప్పమిఁ దేట పఱుపం దలంచి

తే. గీ. సొమ్ము గోరినయంతన సుఖముగలుగ
దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగెనేని యనేకచింతలనొనర్చుఁ
జెడుట చావుతోఁ దుల్యమయ్యీడుమయేల.

వ. ఇచ్ఛానిరసనంబు సుఖంబని చెండియు,

క. శోకశ్రమతృష్ణలకున్
నీకలిమియ మూలమగుట నీ కగపడువాఁ
డేకర్తవ్యముఁగానం
డో కామమ నిన్నుఁ దొలఁగి యుండెద సుఖినై.

క. నీవాసపఱుప ధనములఁ
గావించెదఁబోవినాశకము నడుపంగా
నీవశమె కామమా చెడ
నేవగపున్ లేదు పెనుప దేహైన్యంబున్.

చ. సులభమొ దుర్లభంబొయని చూడనెఱుంగవుఁ గన్న దానిపై
నలముదు గామమా యిడుము లందఁగఁజేయుదు నిందు లేమిటం
గలుగదు నీకు నీతెఱఁగ గాధరసాలతభంగి నీవు స
న్నొప్పలమునఁ బోపనుండి నిడఁ బుచ్చెద బచ్చెనరూపు పోకలన్.

తే. గీ. ధనముచేటున విసివి నామనసునన్ను
నెడలవిడిచెను గామమ, యేను శాంతి
దాంతిసత్యక్షమాభూతదయలఁ జెంది
నాఁడ లోభాదు లొందవు నన్ను నింక.

తే. గీ. కామసుఖదివ్యసుఖములు కాంక్ష దొరఁగు
మేలిషోడశాంశంబునఁబోలలేవు
గానఁ గామమ నిను శత్రుకరణిఁజంపి
బ్రహ్మపురమున నుండెద రాజువోలె.

వ. అనిపలికి మంకి కోడెలు నచ్చినం బుట్టిన నిర్వేదంబున సకలకామంబులం బరిత్యజించి దేవసముండై యుండె" (భార. శాం. ౪. ౪౨-౫౪)

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ తృతీయాధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు వ్యాజమున
లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుపనిషదర్థ ప్రతిపాదకంబగు
భగవద్గీతా శాస్త్రమునందలి కర్మయోగంబను
తృతీయాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భితభావబోధిని

## చతుర్థాధ్యాయము

### జ్ఞానయోగము.

శ్రీభగవానువాచ :

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ 1

శ్లో॥ ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప! ॥ 2

శ్లో॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥ 3

అర్థము :— అహమ్ = నేను, అవ్యయమ్ = నాశరహితమైన, ఇమమ్ = ఈ (ఇంతకుముందు తెవ యధ్యాయమునఁ జెప్పఁబడిన), యోగమ్=కర్మయోగమును, వివస్వతే = సూర్యునికొఱకు, ప్రోక్తవాన్ = చెప్పియుంటిని. వివస్వాన్ = సూర్యుఁడు, మనవే = వైవస్వతమనువుకొఱకు, ప్రాహ = చెప్పెను. మనుః = వైవస్వతమనువు, ఇక్ష్వాకవే = ఇక్ష్వాకుమహారాజుకొఱకు, అబ్రవీత్ = చెప్పెను. ఏవమ్=ఇట్లు, పరమ్పరాప్రాప్తమ్=వంశపారంపర్యముగాఁ బొందఁబడిన, ఇమమ్= ఈకర్మయోగమును, రాజర్షయః = రాజఋషులు, విదుః = ఎఱుఁగుదురు. హేపరంతప! = ఓయర్జునా! సః+యోగః = ఆయోగము, మహతా+కాలేన = బహుకాలము గడచుటచే, ఇహ = ఈలోకమందు, నష్టః = నశించినదాయెను. మే = నాకు, భక్తః, = భక్తుఁడవును, సఖా+చ = సఖుఁడవును, అసి+ఇతి = అయితివని, పురాతనః = అనాదియైన, సః = అట్టి, అయమ్+యోగః+ఏవ=

ఈకర్మయోగమే, అద్య = ఇప్పుడు, తే=నీకొఱకు, మయా = నాచేత, ప్రోక్తః= చెప్పఁబడినది, ఉత్తమమ్ = శ్రేష్ఠమైన, ఏతత్ = ఈకర్మయోగము. రహస్యమ్+హి = గోప్యమైనదిగదా.

కృ — ఓయియర్జునా!

"క. నిర్మలమగునేకాంతిక
ధర్మము నారాయణోదితం బై క్రియలం
గర్మతుఁడగు బ్రహ్మమతిని
ధార్మికవర యొలసె నతఁడు దయ సిగురోత్తన్.

క. దక్షునకు నెఱింగించిన
దక్షుఁడు బోధించెఁ దనదు దౌహిత్రు జగ
చ్చక్షుని నాసవిత్రుండు మ
నుక్షితిపతి కిచ్చి నవ్వినుతధర్మంబున్.

క. మను విక్ష్వాకున కొసఁగె న
తనివలనఁ దదీయయోగ్యతాకలితులు స
జ్జనులును వడసి రనేకులు
విను నారాయణునిచేత వని నారదుఁడున్.

క. తగియెడు శిష్యుల కొసఁగెను
జగతీశ్వర యిట్టు లది ప్రశస్తంబై యి
జ్జగములను గలిగె విను మ
య్యగాధధర్మంబు దుష్కృతాప్రాప్యమగున్."

(భార. శాంతి. ౬. ఆ. ౧౯౫-౧౯౮.)

అనునట్లు, ఇప్పుడు నేఁజెప్పిన కర్మయోగమునిన్ను యుద్ధముఁజేయునటులఁ బ్రేరేపించుటకై నేనిపుడు కల్పనఁజేసి చెప్పితినని యనుకొందువేమో, యట్లుకాదు. ఇప్పుడు నీకుఁ జెప్పుటమాత్రమే కాదు, పూర్వమే, అనఁగా, మన్వంతరారంభమందే నేను సూర్యునకు నీయోగమును జెప్పియుంటిని. సూర్యునకుఁ జెప్పుటకుఁగారణ మే మంటివేని చెప్పెదవినుము. ఈలోకమున రాజ్యపరిపాలనముఁజేసెడు క్షత్రియులు జనకచక్రవర్తి మొదలగువారివలెఁ బ్రజాపరిపాలనఁజేయుటయందు నిష్కామకర్మ యోగానుష్ఠానపరులై యుండకపోయినయెడల రాజ్యాన్తే నరకం ధ్రువమ్ అను ప్రమాణానుసారముగ వారలకుఁ బరలోకహాని సంభవించును. కాన నట్లుగలుగకుండు టకై రాజులందఱు నీయోగ మభ్యసించవలసినవారై యుండుటచే వారల కుపదేశిం

చుటకుఁగా నట్టి క్షత్రియకులమునకు సూర్యుఁడాది పురుషుఁడుగాన నతనికి నుపదేశించుటకుఁ గారణమైనది. కనుక నాసూర్యుఁ డీయోగమును నాయుద్దేశానుసారము దన పుత్రుండును మొదటిరాజును నగు వైవస్వతమనువున కుపదేశించెను. తరువాత నావైవస్వతమనువు నీయోగమును దనపుత్రుఁడగు నిక్ష్వాకుమహారాజునకు నుపదేశించెను. ఇట్లు వంశపారంపరగా నొకరివలన నొకరుపదేశమును బొందిన వారగుచు రాజులందఱును గ్రహించిరిగాన యందుఁ గొందఱు మాత్ర మీ యోగమును జక్కఁగ నాచరించి రాజఋషులైరి. కాన నట్టి రాజఋషు లీయోగమునందలి సత్తను జక్కఁగ నెఱిఁగినవారైరి. అయితే ఇట్లు నేనుపదేశించిన పిదప బహుకాలము గడచినందున నీయోగము నాచరించుటయందు రాజులకు శ్రద్ధనానాటఁ దగ్గుచువచ్చినందున నిది క్రమక్రమముగ క్షీణించుచువచ్చి బొత్తిగ నశించిపోయెను. ఓయర్జునా! ఇప్పుడు నీకు నేనింతసేపు చెప్పిన యీకర్మయోగము పూర్వకాలమందు నేను సూర్యునకుఁ జెప్పినదే గాని యిప్పుడు నూతనముగఁ గల్పించినది కాదు. భూలోకమున నిట్టి యుత్తమ యోగ మున్నదని యిపుడెవరికిని దెలిసియుండదు గాన నిది బహుగోప్యమై యుంచున్నది. అయితే యిట్టిగోప్యమైన సంగతి నీకుమాత్రము చెప్పుటకుఁ గారణమేమనఁగా, నీవు నాకు బాహ్యమునకు బంధుఁడవును, సఖుఁడవును అయియుండుటయేగాక యంతరంగమునఁ బరమభక్తుఁడవునై యున్నావు. కనుకఁ దక్కిన రాజులవలె నీవును బరలోకహానిఁజెందక నీయోగము నాచరించి రాజఋషివై పరలోకసౌఖ్యమునుగూడఁ బొందవలయునని యెడు కోరికతో నీకుఁ జెప్పుటకుఁ గారణమైనది.

అర్జున ఉవాచ :

శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి॥ 4

అర్థము :— (హేకృష్ణ)! = ఓకృష్ణమూర్తీ!, వివస్వతః = సూర్యునియొక్క, జన్మ = జన్మము, పరమ్ = పూర్వపుది, భవతః = నీయొక్క, జన్మ = జన్మము, అపరమ్ = వెనుకటిది, ఆదౌ = ఆదియందు, త్వమ్ = నీవు, (వివస్వతే) = సూర్యునికొఱకు, ఏతత్ = దీనిని (ఈయోగమును), ప్రోక్తవాన్ + ఇతి చెప్పితివని, కథమ్ = ఎట్లు, విజానీయామ్ = తెలిసికొనఁగలను.

అర్జు — ఓ కృష్ణమూర్తీ! సూర్యుఁడాదియందే, అనఁగాఁ, బ్రపంచసృష్టి కాలమందే పుట్టినవాఁడును. నీవు వెనుక, అనఁగా ననేకయుగయుగములు గడచిన

పిమ్మట నిప్పుడు దేవకీగర్భమునఁ బుట్టినవాఁడవును నై యుండఁగా, నీవీ యోగమును మునుపు సూర్యునకుఁ జెప్పుట కెట్లు తటస్థపడెను! ఈమాటను నేనెట్లు నమ్మగలను?

శ్రీభగవానువాచ :

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప !॥　　5

అర్థము :—హే అర్జున ! = ఓయర్జునుఁడా !, మే = నాకును, తవ+చ = నీకును, జన్మాని = జన్మములు, బహూని = అనేకములు, వ్యతీతాని = కడచిపోయినవి. హేపరంతప ! = ఓయి యర్జునా !, అహమ్ = నేను, తాని = ఆజన్మములను, సర్వాణి = అన్నిటిని, వేద = ఎఱుంగుదును. త్వమ్ = నీవు, న+వేత్థ ఎఱుంగవు.

కృ — ఓయి యర్జునా ! నీవునన్ను బ్రశ్నఁజేయుటఁ జూడఁగా నేనును నీవలెనే మనుష్యమాత్రుఁడనని నీవుతలఁచినట్లు గనఁబడుచున్నది. అట్లు కాదు. మఱేమంటివేని, చెప్పెదవినుము. నీవు జీవాత్మవు, నేను బరమాత్మను. "నత్వేవాహం జాతునాసం - నత్వంనేమేజనాధిపాః ! నచైవనభవిష్యామ స్సర్వేవయమతఃపరమ్॥" నేనుగాని నీవుగాని యీరాజులుగాని యింతకుఁబూర్వము లేక పోయినదిలేదు ; ఇఁక ముందును లేకపోయెడు వారమునుగామని యిదివఱకే నీకుఁజెప్పియుంటిని గదా, (చూ. 2–12) కాన నీవును నేనును సృష్ట్యాదికాలము నందుండిన వారమేగాని లేక పోయినవారము కాము. అయితే "దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా। తథా దేహాన్తరప్రాప్తిః॥" ఆత్మకీదేహమునందు బాల్యయౌవన వార్ధక్య దశలు గలుగుటయెట్లుసహజమో యట్లే యన్యదేహమును బొందుటగూడఁ గలుగుచున్నదని యిదివఱకే చెప్పియుంటిని గదా, (చూ. 2_13) కాన సృష్టికాలము మొదలిదివఱకు నీవును నేనును ననేకజన్మల నెత్తియున్నాము. అయితే నీవు జీవాత్మవుగనుకఁ బ్రాకృతుఁడవు. అనఁగాఁ బ్రకృతిచేఁగప్పబడిన జ్ఞానముగలవాఁడవుగనుక నీకుఁ బూర్వజన్మజ్ఞాన ముండనేరదు. నేనైననో పరమాత్మనుగనుక నప్రాకృతుఁడను, అనఁగాఁ బ్రకృతికి విలక్షణుఁడనైన వాఁడను గనుక నేనెన్నిజన్మల నెత్తినదియు, నేయేజన్మయం దేయే పనులఁ జేసినదియుఁ జక్కఁగా నెఱుఁగుదును.

అర్జు — అయితే, అయ్యా ! నేను జీవాత్మనుగనుకఁ బ్రకృతిబద్ధుఁడనై, అనఁగాఁ బ్రకృతిసంబంధమగు సత్త్వరజస్తమోగుణములచేఁ జేయఁబడు కర్మలకను గుణ్యముగ జన్మల నెత్తుచుంటినిగదా ? నీవు పరమాత్మవును, పిపీలికాది బ్రహ్మ

పర్యంతమగు జంతుజాల మంతటికిని సృష్టిస్థితిలయకర్తవును, ప్రకృతికి విలక్షణుండవును, నైయుంచున్నావే, అట్టినీకుంగూడ నాతోపాటిన్ని జన్మలెట్లుకలిగెను ?

శ్లో॥ అజోఽపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా॥ 6

అర్థము :— అహమ్ = నేను, అజః + అపి + సన్ = పుట్టువులేనివాఁడనై యును, అవ్యయాత్మా + అపి + సన్ = నాశరహితస్వభావముగలవాఁడనైయును, భూతానామ్ = (పిపీలికాది బ్రహ్మపర్యంతము గలసమస్త) భూతములకు, ఈశ్వరః + అపి + (సన్) = ఈశ్వరుఁడను (సృష్టిస్థితిలయకర్తను) ఐయును, ఆత్మమాయయా స్వకల్పితమగు మాయచేత. స్వామ్ = స్వకీయమైన, (నాదియగు) ప్రకృతిమ్ = స్వభావమును, (ఈశ్వరత్వమును), అధిష్ఠాయ = ఆశ్రయించియే (అనఁగా విడువకయే యనిభావము), సమ్భవామి = పుట్టుచున్నాను (అవతరించుచున్నాను.)

కృ — ఓయి యర్జునా ! నాకు నీవుచెప్పినప్రకారము జననమరణాదులు లేని మాటవాస్తవమే. పిపీలికాదిబ్రహ్మపర్యంతమగు సమస్తప్రాణులను సృజించుటకును, రక్షించుటకును, లయింపఁజేయుటకును కర్తను నేనేగనుక. నన్నుఁ ద్రిగుణాత్మకమగు మాయ యంటనేరదు. అయినను.

"క. అయినీశ్వరుండ నైనే నా
మాయచే సీతావధూటి మదిఁదలఁప మహా
మాయుండ నయ్యు వశీకృత
మాయుండనై యవతరింతు మహిన ట్లనఘా॥ (సీ. రా. ౨ ఆ. ౩౧)

అనునటుల నట్టిమాయను, నాకు నేనే కల్పించుకొని యీలోకమున నవతరించుచున్నాను. అయితే, ఇట్లవతరించునపుడు నానిజస్వభావమును విడుతునను కొందువేమో, లేదు, లేదు. నేనీ భూలోకమునం దవతరించి సామాన్యమనుష్యుని వలె నటింపుచుండినను, నా నిజస్వభావమును విడువక యాశ్రయించియే యుందును. కనుకనే నేఁ నెప్పుడెప్పుడేయే యవతారమెత్తి యేయేపనులఁ జేసినదియును నెఱిఁగియుండుటకుఁ గారణమైనది.

అర్జు — నీ నిజస్వభావమనఁగా నెట్టిదియో వివరించి చెప్పుము.

కృ — నానిజస్వభావమనఁగా, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సత్య, స్వభావము. నిత్యమనఁగా, పరిణామములేక యెల్లప్పుడునొక తీరుగా నుండునది. శుద్ధమనఁగా, త్రిగుణాత్మకమగు ప్రకృతినంటక విలక్షణముగా నుండునది. బుద్ధమనఁగా, కేవల

జ్ఞానమే స్వరూపము గాఁగలది. ముక్తమనఁగా, సంసారరూపమగు బాధకము లేనిది, సత్యమనఁగా నిజమైనది.

అర్జు — అయ్యా! ఇట్టి స్వభావముగల నీవు ప్రకృతిబద్ధులమగు నస్మదాదుల వలె నీలోకమున స్వకల్పితమాయచే నవతరింపవలసిన కారణమేమి ?

శ్లో॥ యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థానమధర్మస్య తదా త్మానం సృజామ్యహమ్॥ 7

అర్థము :— హే భారత ! = ఓయి యర్జునా!, హి = (అట్లునే నవతరించుచుంటి నంటుట) యేలయనఁగా. ధర్మస్య = ధర్మమునకు, గ్లానిః = క్షీణదశ, యదా = ఎప్పుడు, భవతి = అగుచున్నదో. అధర్మస్య = అధర్మమునకు. అభ్యుత్థానమ్ = అభివృద్ధి, యదా = ఎప్పుడు, భవతి = అగుచున్నదో, తదా + తదా = అప్పుడప్పుడు, (దాని నడఁచుటకొఱకు), అహమ్ = నేను, ఆత్మానమ్ = తన్ను (అనఁగా నన్ను), సృజామి = సృజించుకొను చున్నాను (అనఁగా నవతరించుచున్నాననుట).

కృ -- ఓయి యర్జునా ! నేనిట్లుల యవతరించుచున్నాననఁగా,

ఉ. ఎప్పుడు ధర్మహాని యగు నెప్పు డధర్మము మీఱుఁ గ్రూరులై
యెప్పుడు దైత్యులుబ్బెదరు హీనతఁ బొందుదు రెప్డు వేల్పులే
నప్పుడు సత్కులీనుల గృహంబుల నుద్భవమొంది లీలమై
నెప్పటియట్ల నిల్పుదు సురేంద్రుల నంచిత ధర్మపద్ధతిన్.

(భార. ఆరణ్య. ౪-ఆ ౨౪౪)

కాన నీలోకమున నెప్పుడెప్పుడు ధర్మముక్షీణించి యధర్మము వృద్ధినొందుచుండునో యప్పుడప్పుడు నన్ను నేనే సృజించుకొను చున్నాను. అనఁగా నాచే సృజింపఁబడు మనుష్యులతో పాటు నేను నొక మనుష్యుడనుగాఁ బుట్టుచున్నాను.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే॥ 8

అర్థము :-- (అహమ్, = నేను. సాధూనామ్ = సాధువులయొక్క (ధర్మముఁదప్పక నడచువారలయొక్క), పరిత్రాణాయ = రక్షణముకొఱకును, దుష్కృతామ్ = దుర్మార్గులయొక్క (అధర్మపరులయొక్క), వినాశాయ = నాశముకొఱకును, ధర్మసంస్థాపనార్థాయ + చ = ధర్మమును లెస్సగా స్థాపించుటకొఱకును, యుగే + యుగే = ప్రతియుగమునందును, సమ్భవామి = పుట్టుచున్నాను.

ఓయి యర్జునా! ప్రతియుగమునందును నేనిప్పుడు చెప్పినప్రకారమెప్పుడెప్పుడైతే ధర్మముక్షీణించి యధర్మము వృద్ధిఁబొందుచుండునో, యప్పుడప్పుడట్టి యధర్మమును వ్యాపింపఁజేయుచుండెడు దుష్టజనులను నశింపఁజేయుటకును, ధర్మమును జక్కఁగఁ బరిపాలించుచుండెడు సత్పురుషులకునట్టి దుష్టజనులచే బాధగలుగకుండ రక్షించుటకును, మఱియు ధర్మాచరణపద్ధతులు జనులకుఁ గనఁబఱచి వారలచే నాచరింపించి తద్ద్వారాక్షీణించిన ధర్మమును బునరుద్ధారణఁజేయుటకును, నవతరించుచున్నాను.

అర్జు — అయ్యా! నీవీప్రపంచమునకు నీశ్వరుండవై యుండి సంకల్పమాత్రముచేతనే సకల చరాచరములను సృజించుటకును, లయింపఁజేయుటకును, శక్తిగలిగియుండఁగా నీలోకమున నొకవేళ దుష్టులు ప్రబలి శిష్టులను బాధించుచుండినయెడల నట్టిదుష్టులు నశించునట్లును, శిష్టులు వృద్ధిఁబొందునట్లును, ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిః అనునట్లు, నీవు సంకల్పించిన మాత్రముననే యట్లు జరుగఁదగినదై యుండఁగా నట్లుచేయక వారలతోపాటు నీవును భూమియందు జన్మించి సంసారసంబంధమగు నష్టకష్టముల ననుభవింపవలసిన కారణమేమి?

కృ — నీవుచెప్పినది నిజమే. నేను సంకల్పమాత్రముననే దుష్టనాశమును, శిష్టపరిపాలనమును, జేయఁగలుగుదును గాని యట్లుచేయుటవలన నేనును వారలలో నొకఁడనుగా నవతరించి చేసెడుపనులవలనఁ గలుగునట్టి ప్రయోజనమువంటి ప్రయోజనము గలుగనేరదు. అదెట్లంటివేని, వివరించిచెప్పుచున్నాను గమనించివినుము.

కృతయుగమునందు హిరణ్యకశిపుఁడు తనకొమారుడును, నాకుఁ బరమభక్తుఁడునగు ప్రహ్లాదుని ననేకవిధముల బాధించి నీహరిగిరి యెక్కడనున్నాఁడో చూపుమని ధిక్కరించినపుడు

"క. ఇందుఁగలఁ డందులేఁడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందేగలఁడు దానవాగ్రణి వింటే."

అనిచెప్పఁగా నాడహంకరించి తనసభామంటప స్తంభమును జూపి 'ఈ స్తంభమునం జూపఁగలవెఁ జక్రింగిక్రిన్?' అనియడిగి యుండలేదా! అపుడు సభాస్తంభమున నుద్భవింపకయేవాఁడు నశించునటుల సంకల్పించినయెడల నందువలన వాఁడు నశించి ప్రహ్లాదునిబాధ నివారణమాత్రమే యగునుగాని, నాదుభక్తుఁడగు ప్రహ్లాదునికి నేను సర్వాంతర్యామి నని కలిగియుండిన నమ్మకము చెడకుండ నిల్చునా? అట్టి

పరమభాగవతోత్తముని నమ్మకమునకే భంగము గలిగిన యెడల, పతితులగు పామరజనులకు నాదు సర్వాంతర్యామిత్వమును సూచించిన నమ్మక మెట్లు గలుగును ! కాన నేనప్పుడా స్తంభమున నుద్భవించియే తీరవలసివచ్చినది. ఇదిగాక, త్రేతాయుగమునందు రావణాసురుఁడు చేయుచుండిన సాధుబాధలు మితములగు నానేక కృత్యములవలన లోక కంటకుఁడై యుండెనుగదా అట్టివాని నాశమును సంకల్పించినయెడల నొక్క క్షణమున వాఁడు నశించిపోవునుగదా ? అట్లుచేయక నేను కౌసల్యాగర్భమం దవతరించి పదునాలుగేం డ్లష్టకష్టములఁబడి వనవాసముఁజేసి, భార్యనుగోలుపోయి సామాన్య మనుష్యునివలె భార్యావియోగదుఃఖము ననుభవించుచు, రావణునితో యుద్ధముఁజేసి వానిని వధించుటకు కారణ మేమనఁగా ఆ యవతారమునందు పదునాలుగేండ్లు వనవాసము చేయుటచే లోకమునందలి జనులు పితృవాక్యపరిపాలన మెట్లాచరింపవలసిన దనియు, భరతునకును, లక్ష్మణునకును జరిగించిన చర్యలవలన లోకమునందు ననుజన్ము లగ్రజుల యెడల నడచుకొనవలసిన పద్ధతు లెట్టివనియు, మఱియుఁ బతివ్రతయగు భార్య యుండవలసిన పద్ధతి యెట్టిదనియు, ఏకభార్యయందు భర్తకుండవలసిన ప్రేమాతిశయ మెట్టిదనియు, నీమొదలగు ననేకధర్మములఁ గనఁబఱచి జను లట్లాచరించునట్లు చేయుటకుఁ గా నవతరించుటకుఁ గారణమైనది. అట్లు నేఁ జేయక సంకల్పమాత్రముననే రావణుని వధించినయెడల నిట్టిధర్మములన్నియు లోకుల కగపఱచుటకు నాకెట్లవకాశము గలుగును ! ఇట్లే ప్రతి యవతారమునను దుష్ట సంహారము చేయుటయేగాక లోకులకు నాయా యుగముల కనుగుణ్యములగు ననేక ధర్మములఁ గనఁబరచుటకయ్యే యవతరించుచుంటిని గాని, వ్యర్థముగఁగాదు, కనుకనే (3-22) న మే పార్థాస్తి కర్తవ్యమ్ : (3-23) యది హ్యహం న వర్తేయమ్ : అని యిది వఱకు నీకుఁ జెప్పియుంటిని. అది నీకు జ్ఞాపకమున్నదిగదా ?

అర్జు — అవును, జ్ఞాపకమున్నది.

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ! ॥ 9

అర్థము:— హేఅర్జున ! = ఓయర్జునుఁడా', యః = ఎవఁడు, ఏవమ్ = ఇట్లు (అనఁగా నింతకుముందు 7-8 శ్లోకములలోఁ జెప్పినప్రకారముగా), మే = నాయొక్క, దివ్యమ్ = అప్రాకృతమైన, జన్మ = జన్మమును, కర్మ + చ = కర్మమును, తత్త్వతః = యథార్థముగా, వేత్తి = ఎఱుఁగుచున్నాఁడో, సః = వాఁడు, దేహమ్ = శరీరమును, త్యక్త్వా = విడిచి, పునః = మరల, జన్మ = పుట్టుకను, న + ఏతి = పొందఁడు, మామ్ = నన్ను, ఏతి = పొందుచున్నాఁడు.

కృ — ఓయియర్జునా! నేను సంకల్పమాత్రముచేతనే ప్రపంచసృష్ట్యాది కార్యములు చేయఁగలిగియుండఁగా నిట్టుసామాన్య మనుష్యునివలె నవతరించి నటించుచుండుటకుఁ గారణమును సమగ్రముగఁ జెప్పితినిగదా, ఇదియే నాయవతారరహస్యము. దీని నుద్ధవుఁడు, విదురుఁడు, మొదలగువారవలె నాకత్యంతభక్తులై నా మర్మము దెలిసినవారే యెఱుఁగుదురు. కాని తక్కినవారెఱుఁగఁజాలరు. సాధారణముగ లోకమున ననేకులు నన్నుఁ దమతోపాటు ప్రాకృతపురుషునిగాఁ దలంతురేగాని, యవతరించిన యప్రాకృతపురుషునిగా నెఱుంగఁజాలరు. అట్టిప్రాకృతపురుషుఁడవని నన్నెఱిఁగినవారు బహుపకృత్తుగా నుందురు. అనఁగా వేయింట నొకఁడుండుట కష్టము. అట్లెఱిఁగెడు నాకొద్దిమందియైనను నాయమానుషచర్యలనుబట్టి నేనవతారపురుషుఁడననియు, నేనియా యొకపనికొఱకు, అనఁగా హిరణ్యకశిపుని వధకొఱకు నృసింహావతారమును, రావణవధకొఱకు రామావతారమును, కంసవధకొఱకు నీకృష్ణావతారమును నెత్తితినని తలంతురేగాని లోకసంగ్రహార్థమై, అనఁగా నిదివఱకు నేఁజేసినప్రవర్తనము లోకులకు ధర్మాచరణ పద్ధతులనుగఱపి తద్ద్వారా ధర్మసంస్థాపనమును జేయుటకొఱకని యెఱుంగరు. అట్టివారిలోనైనను వేయింట నొకఁడు మాత్రము నాయవతారముయొక్క ప్రధానోద్దేశమును, నేఁజేయుపనులయొక్క పర్యవసానమును నానిజస్వరూపమును దెలిసికొనఁగలఁడు గాని యందఱును నట్లు తెలిసికొనుటకు సాధ్యపడదు. అట్టివఁడు దెలిసికొనఁగలఁడో వాఁడే నాకంతరంగభక్తుఁడగుచున్నాఁడు. కాన నట్టివానికి నీదేహమువిడిచిన పిమ్మటఁ బునర్జన్మ గలుగనేరదు.

అర్జు — అట్టివారలకుఁ బునర్జన్మలేకపోవుటకుఁ గారణమేమి ?

శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10

అర్థము:— బహవః = అనేకులు, జ్ఞానతపసా = జ్ఞానమనెడుతపస్సుచేత, పూతాః = పరిశుద్ధాత్ములై, మామ్ = నన్ను, ఉపాశ్రితాః = ఆశ్రయించినవారై, మన్మయాః = నాయందేచిత్తమును జేర్చినవారగుచు, వీతరాగభయక్రోధాః (సన్తః) = పోఁగొట్టఁబడినయనురాగము భయము క్రోధముగలవారై, మద్భావమ్ = నాభావమును (మోక్షమును), ఆగతాః = పొందినవారైరి.

కృ — ఓయి యర్జునా! నాజన్మకర్మలయొక్క యథార్థతను దెలిసినవారికిఁ బునర్జన్మము లేకపోవుటకుఁ గారణమేమనఁగా, ఎవఁడైతే నాజన్మకర్మముల యథార్థతను దెలిసికొన్నవాఁడగుచున్నాఁడో యతఁడు జ్ఞానోదయమైనవాఁ డగుచున్నాఁడు

గానన్ట్లు జ్ఞానోదయ మెప్పుడగుచున్నదో యప్పుడు పరిశుద్ధాంతఃకరణులగుచున్నవారై నన్నే యాశ్రయింపుచుఁ జిత్తము నెల్లప్పుడు నాయందే [illegible] అట్టి వ్యవహరించుచున్నారో యప్పటికిఁ బ్రపంచవిషయములలో [illegible] మునిఁగియుండ నేరరు. అట్టియనురాగ మెప్పుడుండదో యప్పుడె [illegible] క్రోధమును, భయమును [illegible] నట్టి నేను [illegible] మోక్షమును జెందుచున్నారు.

అర్జు — అయితే, అయ్యా! ఇప్పుడు నీవు చెప్పిన యంశములనుబట్టి చూడఁగా నీయవతారరహస్యములు చక్కఁగాఁ దెలిసికొని నీ వెట్టిరూపమున నవతరించియుండి నను, ఆరూపము విరాట్పురుషుఁడవగు నీవు లీలామాత్రముగా ధరించిన నీయప్రాకృత దివ్యమంగళవిగ్రహమే గాని, నీనిజస్వరూపము గాదని యెఱిఁగెడు నీయందలి భక్తులనుమాత్రమే మోక్షము నిచ్చునట్లుగ నున్నది. అయితే, లోకములందు నట్టి జ్ఞానులు స్వల్పముగనుండుచున్నారు. తక్కినవారిలోఁ [illegible] కేవలము మూఢులై భగవద్విషయమైన చింత యొక్క [illegible] లేక యుండెదరు, అనేకులు నీనిజస్వరూప మిట్టిదని యు, నీవవతరించిన కార్య మిట్టిదని యు దెలిసికొనలేనివారైనను, నప్పుడప్పుడు నీవు ధరించియుండెడు నవతారరూపములతో జరిగించెడు నమానుషచర్యలనుబట్టి యాయా కాలములయందలి జను లాయాయవతారరూపములనే నీనిజస్వరూపమునుగా భావించి భజించుచుందురుగదా, అట్టి వారలా యారూపములనుబట్టి చేసెడు ప్రపత్తి వ్యర్థమగుచున్నదా! అట్లు కానియెడల దానివలన వారలకుఁగలిగెడు ఫల మెట్టిది?

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ 11

అర్థము:— హే పార్థ! = ఓయియర్జునా! యే = ఎవరు, మామ్ = నన్ను, యథా = ఎట్లు (ఏరూపముగా నుద్దేశించి), ప్రపద్యన్తే = ప్రపత్తిఁజేయుచున్నారో, తాన్ = వారలను, తథా+ఏవ = అట్లాగుననే (ఆ రూపముతోనే), అహమ్ = నేను, భజామి = పొందుచున్నాను (అనఁగా భగవత్స్వరూపము నేరూపముగా భావించుకొని భజింతురో యారూపమున వారిని గాపాడుచుననుట) లేక, సేవించుచున్నాను అనఁగా భృత్యుఁడు యజమానునాజ్ఞను నెఱవేర్చురీతిగా నేను నాభక్తులగువారల సంకల్పమును నెఱవేర్చుచున్నాననుట). (తస్మాత్) = ఆ కారణమువలన, మనుష్యాః = జనులు, సర్వశః = అన్నివిధములచేతను, మమ+వర్త్మ+ఏవ = నామార్గమునే, అనువర్తన్తే = అనుసరించినవారగుచున్నారు.

కృ — ఓయి యర్జునా! నీవు చెప్పునట్లీలోకమందు నాయవతారరహస్యము నెఱుంగక నాయవతారస్వరూపమునే నానిజస్వరూపముగా నెంచి భజించెడు వార లనేకులుగలరు. అట్టివారలనుగూడ నేను వ్యర్థపుచ్చుటలేదు. అయితే, అట్టివారలకు నావిషయమైన పరిపూర్ణజ్ఞానము లేదుగనుక వారలకు మోక్షప్రాప్తిలేక పోయినను, వారలెవ్వరెవ రేయేఫలమునుగోరి నన్నెట్టిరూపముగ భావించి భజించుచున్నారో వారికివారికి నేనాయారూపముతోడనే యాయాఫలము నిచ్చుచుందును. కాననీలోక మందలి జనులన్నివిధముల నన్నే భజించినవారగుచున్నారు. అనఁగా,

"చ. గురుఁడని హిరణ్యగర్భుఁడని కొందఱు గొందఱిలన్మహావిరా
ట్పురుషుఁడటంచుఁ గొందఱు బుభుక్షుప్రభుఁడంచు ముకుందుఁడంచుఁ గొం
దఱుశివుఁడంచుఁ గొందఱు వినాయకుఁడంచును గొందఱుంబరా
త్పరవరునన్నెఱుంగక యుపాస్తియొనర్తురు దజ్ఞులైతగన్" (చూ. పు.131.)

అనునట్లు, మఱియునిట్లే, రాముఁడే దేవుఁడని రామోపాసనఁజేయువారును, కృష్ణుఁడే దేవుఁడని కృష్ణోపాసనఁ జేయువారును, నృసింహుఁడే దేవుఁ డని నృసింహోపాసనఁజేయువారును, నన్నేయారాధించిన వారగుచున్నారు. ఇదిగాక మఱికొందఱు చిల్లరదేవతలగు సింహవాహిన్యాది క్షుద్రదేవతలను, నవగ్రహములను, కాళిమొదలగు శక్తులను గూడ నారాధించుచున్నారు. వారలట్లుచేయుటలో నాయాదేవతలు నారూపములే యని నమ్మి యేదేనియొక ఫలము నాశించి నన్నారాధించువారు గనుకను, ఈప్రపంచము నందలి పిపీలికాదిబ్రహ్మపర్యంతముగాఁగల సమస్తచరాచరములు నాస్వరూపములే గనుకను, (చూ 10_21 మొదలు 10-39 వఱకు). "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అనునట్లు. అట్టియారాధనయుఁగూడ నన్నే చెందుచున్నది. కాన నేనే వారలకును, వారువారు వాసించు దేవతారూపములతో వారువారు కోరినఫలము నిచ్చుచుందును. కాన నీలోకమందుఁ గేవలము మూఢులును, నాస్తికులును దప్ప, నేమాత్రమైనను దైవభక్తిగలిగి యెట్టిమతము నవలంబించియైనను, నేదేవతనైనను నేరూపిఁగ భావించియైనను, నేవిధముగానైనను, నేసంకల్పముతోనైనను, నారాధించినయెడల నట్టివారందఱును నన్నే యారాధించిన వారలగుచున్నారు. కనుక వారి వారి మనోనిశ్చయమునకును, ఆరాధనమునకును దగినట్లు ఫలమును నేనే యిచ్చు చున్నాను.

అర్జు — అయ్యా! ఎవరెవరేయేదేవతనారాధించినను, ఆయాదేవతారూపముగ ఫలము నిచ్చువాఁడవు నీవేయైయుండఁగా, జనులాయాఫలముల నుద్దేశించి నిన్నే యారాధింపక చిల్లరదేవతల నారాధించుటకుఁ గారణమేమి?

శ్లో॥ కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥ 12

అర్థము:— ఇహ + మానుషే + లోకే = ఈమనుష్యలోకమందు, కర్మజా = కర్మవలనఁగలిగెడు, సిద్ధిః = ఫలము, క్షిప్రమ్ = శీఘ్రముగా. భవతి + హి = అగుచున్నదిగదా, (తస్మాత్) = ఆకారణమువలన, కర్మణామ్ = కర్మములయొక్క, సిద్ధిమ్ = ఫలమును, కాంక్షన్తః = కోరునట్టివారు, దేవతాః = (చిల్లర) వేల్పులను, యజన్తే = ఆరాధించుచున్నారు.

కృ — ఈభూలోకమునందలి జనులలో నెవరో సకృత్తుగా జ్ఞానముగలిగి మోక్షేతరఫలముల నపేక్షింపక మోక్షమునే కోరెడువారుగనుచున్నారు. కనుక నట్టివారికిఁ జిల్లరదేవతల నారాధించుటవలనఁ బ్రయోజనములేదుగనుక మోక్షప్రదాయకుఁడనగు నన్నే యారాధించి కడతేఱుదురు. తక్కిన వారలైననో కర్మఫలముల నాశించియే కర్మలఁజేసెడు వారుగనుచున్నారు. అట్టిఫలములు స్వల్పపాటివైనందునఁ జిల్లరదేవతల నారాధించుటచే శీఘ్రముగఁ బొందఁదగినవిగానుచున్నవి. కాన నీలోకములో నెవరెవరేయేఫలమును గోరుదురో వారా యాఫలమును నీయఁదగిన యాయాదేవతల నారాధించుచున్నారు. అదెట్లనిన, రంభాసంభోగాది స్వర్గఫలమును గోరువారింద్రాది దేవతలనుగూర్చి యజ్ఞములనుజేయుదురు. సంతానమును గోరువార లశ్వత్థ ప్రదక్షిణాదులు చేయుదురు. ఏదైననొక క్రూరగ్రహచారము నివర్తించుకొనఁ గోరువారలు నవగ్రహముల నారాధింతురు. ఏదేని యాపదఁబొందిన వారలాయాపన్నివారణార్థమై సుందరకాండ పారాయణాదులఁజేయుదురు. ఐశ్వర్యము మొదలగువానిం గోరువారు సూర్యనమస్కారాదులఁజేయుదురు. ఇట్లనేకవిధములగు ఫలములనాశించి యాయాఫలముల నీయఁదగిన యనేకదేవతల నారాధించుచుందురు.

అర్జు — మంచిది, అట్లు చిల్లరదేవతల నారాధించుటయందును. గొందఱుత్తములగు రామకృష్ణాద్యవతారరూపములను; మఱికొందఱుమధ్యములగు నింద్రాదులను, మఱికొందఱధమములగు అంకమ్మ, పోలేరమ్మ, కాటేరి, భేతాళుఁడు, మునీశ్వరుఁడు మొదలగు క్షుద్రదేవతల నారాధించుచున్నారే యందుకుఁ గారణమేమి?

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥ 13

అర్థము :— గుణకర్మవిభాగశః = గుణ = సత్త్వరజస్తమోగుణములయొక్కయు, కర్మ = ఆగుణములవలనఁజేయఁబడు పనులయొక్కయు, విభాగశః = విభజనను బట్టి,

చాతుర్వర్ణ్యమ్ = బ్రాహ్మణ క్షత్రియాది వర్ణచతుష్టయము, మయా = నాచేతను, సృష్టమ్ = సృజింపఁబడినది. తస్య = అస్సృష్టికి, కర్తారమ్ + అపి = కర్తనైనను, మామ్ = నన్ను, అకర్తారమ్ = కర్తఁగానివానిఁగను, అవ్యయమ్ = నాశరహితునిఁగను, విద్ధి = ఎఱుఁగుము.

కృ — ఓయియర్జునా! ఈలోకమునందలి జనులలోఁ గొందఱు కేవలము సత్త్వగుణప్రధానులుగను, గొందఱు సత్త్వరజోగుణములు మిశ్రములుగాఁ గలవారుగను, గొందఱు రజస్తమోగుణములు మిశ్రములుగాఁగలవారుగను, మఱికొందఱు కేవల తమోగుణప్రధానులుగను నుంచున్నారు. ఇందు మొదటి తరగతివారలనఁగాఁ గేవల సత్త్వగుణప్రధానులు, శమము, దమము, శౌచము, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము, (చూ. 18. 42.) స్వభావకర్మములుగాఁగలిగి దేవతలనే యారాధింతురు. (చూ. 17. 4.) రెండవతరగతివారు, అనఁగా సత్త్వరజోగుణములు మిశ్రమములుగాఁగలవారలు. శౌర్యము, తేజస్సు, ధైర్యము, దార్ఢ్యము, యుద్ధము, దానము, ఈశ్వరత్వము. స్వభావగుణములుగాఁగలిగి (చూ. 18. 43) దేవతలను, యక్షరాక్షసులను, నారాధింతురు. (చూ. 17. 4) మూడవతరగతివారలు, అనఁగా రజస్తమోగుణములు మిశ్రమములుగాఁగలవారు కృషిగోరక్షణవాణిజ్యములు స్వభావకర్మలుగాఁగలిగి (చూ. 18, 44) యక్షరాక్షసులను, భూతప్రేతగణములను, నారాధింతురు. (చూ. 17. 4) నాల్గవతరగతివారలు, అనఁగా. కేవల తమోగుణప్రధానులు, పైమూడుతరగతులవారికిఁ బరిచర్య నేయుటయే స్వభావముగాఁగలిగి (చూ. 107. 44) భూతప్రేతగణములనుమాత్రమే యారాధింతురు. (17. 4) కనుకనే యీనాలుగు తరగతుల వారా గుణములయొక్కయు, నాగుణములననుసరించి వారు చేయుపనుల యొక్కయు, నుత్తమ, మధ్యము, అధమ, అధమాధమత్వములనుబట్టియే వారి వారికిఁ దగినట్లుగ, అనఁగా, మొదటితరగతి వారికిఁదగినట్లు బ్రాహ్మణులు, అనఁగా బ్రహ్మ ముఖమునఁబుట్టినవారనియు, రెండవతరగతికిఁదగినట్లు క్షత్రియులు, అనఁగా బ్రహ్మ బాహువులయందుఁబుట్టినవారనియు, మూడవతరగతివారికిఁదగినట్లువైశ్యులు, అనఁగా బ్రహ్మయొక్క యూరువులయందుఁబుట్టిన వారనియు, నాలుగవతరగతివారికిఁదగినట్లు శూద్రులు, అనఁగా బ్రహ్మయొక్క పాదములయందుఁ బుట్టినవారనియు, నాలుగువర్ణములు, అనఁగా జాతిభేదములు గల్పించియుంటిని. అయితే, అట్టిజాతిభేదముల నేనుగల్పించిన వాఁడనైనను, ఆయాతరగతి వారియొక్క స్వభావసిద్ధము లగు గుణకర్మలనుబట్టి కల్పించఁబడినవి గనుక,

" మ. జననం బెందును లేనియీశ్వరుఁడు దా జన్మించు టెల్ల న్విరో
ధినిరాసార్థము పీతకర్ముఁ డగు నద్దేవుండు కర్మప్రవ
ర్తనుఁడౌ టెల్లఁ జరాచరప్రకటభూతశ్రేణులం గర్మవ
ర్తనులం జేయఁదలంచి కాక కలవే దైత్యారికిం గర్మముల్ ॥" (చూ. పు. 143)

అనునట్లు నాకా విషయమునం దేమియుఁ గర్తృత్వము లేదని యెఱుంగుము.

శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥ 14

అర్థము:— మామ్ = నన్ను, కర్మాణి = కర్మములు, న+లిమ్పన్తి = అంటవు, మే = నాకు, కర్మఫలే = కర్మఫలమునందు, స్పృహా = ఇచ్ఛ, న = లేదు, ఇతి = అని, యః = ఎవఁడు, మామ్ = నన్ను, అభిజానాతి = ఎఱుఁగుచున్నాఁడో, సః = వాఁడు, కర్మభిః = కర్మములచేత, న+బధ్యతే = కట్టువడఁడు.

కనుక నట్టి కర్మములవలని పుణ్యపాపములు నన్నంట నేరవు సరేగదా, కర్మఫలమునందలి యిచ్ఛయును నాకు లేదు. ఇట్లు నన్ను నెవఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు సయితము కర్మబద్ధుఁడు గానేరఁడు.

అర్జు — అయ్యా! నీవు చేసిన కర్మముయొక్క ఫలము నిన్నెట్లు చెందకపోవును? "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అనునట్లు, ఎవఁడు చేసిన కర్మఫలమును వాఁ డనుభవింపవలసినది విధియైయుండఁగా, నిన్ని కర్మ యంట నేరదని యెవ్వరైన నెట్లూహింపవచ్చును?

కృ — మంచిది, ఈవిషయమునుగుఱించి నీకొక దృష్టాంతమును జెప్పెద వినుము. ప్రభుత్వముఁ జేయుచుండెడు నొక రాజునొద్దకు నరహత్య చేసిన యొక నేరస్థుఁడు తేఁబడి వానికా రాజు మరణదండన విధించుచున్నాఁడు. అప్పుడు వానిని జంపినపాప మా రాజును జెందుచున్నదా?

అర్జు — వానిని జంపినపాపము రాజును జెంద నేరదు. ఏలయనఁగా, వాఁ డదివఱకుఁ జేసిన నేరమునకుఁ దగిన దండన రాజు విధించెనే గాని వానియెడల ద్వేషము గాని, వానిఁ జంపవలెనని యెడు నిచ్ఛ గాని యా రాజున కెంతమాత్రమును లేదు. కాన నా రాజునకుఁ జెంద నేరదు.

కృ — అవునుగదా, అట్లే నేనును నెవఁ డెట్టి గుణకర్మలుగలవాఁడై యుండెనో వానివానికట్టి వర్ణాశ్రమధర్మముల నేరుపఱచితినే గాని యొక నియమం దభిమానించి

బ్రాహ్మణునిగను, మఱియొకనియందు ద్వేషించివాని శూద్రునిగను, నేరుపఱచి యుండలేదుగదా? అట్టికర్మ నాకేల యంటును?

అర్జు — అవును నిన్ను నంటనేరదు సరే, అయితే, ఇట్లు నిన్ను నెఱింగినవారు గూడఁ గర్మబద్ధులుగారని చెప్పితివే, అదెట్లు?

కృ — ఇప్పుడు నేఁజెప్పిన దృష్టాంతములోని నేరస్థునకు రాజుమరణదండన విధించుచున్నాఁడుగదా? ఆప్రకారము రాజాజ్ఞను నెఱవేర్చువారెవరు? రాజభటులుగదా? మంచిది, అట్లునెఱవేర్చుటకుఁగా నారాజా నేరస్థుని నిద్దఱుభటుల కొప్పగించుచున్నాఁడు. అందొక భటుఁడా నేరస్థునియందు నేదేని యొక కారణమువలన ద్వేషముగలిగియుండి, ఆహా వీఁడు నేఁడు నాచేతఁ జిక్కెనుగదా, వీని నేను జంపి పగదీర్చుకొనుట కిప్పు డవకాశముగలిగెను గదాయని సంతోషించుచు వాని వధావిషయకమగు కర్మమునందుఁ బ్రవేశించుచున్నాఁడు. మఱియొకఁడయ్యో పాపము, వీనినా చేతులారఁ జంపవలసివచ్చెనుగదా, అయితే, దీనికి నేనేమిచేయవచ్చును, రాజాజ్ఞను నెఱవేర్చవలసినది నావిధిగదా, ఆరాజైనను వీనియందేమైన ద్వేషమువహించి యిట్టియాజ్ఞనుజేసినవాఁడా, లేదుగదా, నేరస్థులనుశిక్షించి న్యాయపరిపాలనముఁ జేయుట రాజునకు విధిగనుక వీఁడు నరహత్యఁజేసినవాఁ డగుటవలన వీని కిట్టి దండన రాజు విధింపవలసివచ్చెనేగాని యితరోద్దేశము రాజునకును లేదుగదా, కాననిట్టి మరణదండన విధించుట రాజునకు ననివార్యమైన పనిగా నున్నదిగదా, ఇది యెంత క్రూరకార్యమైనను, రాజాజ్ఞాప్రకారము చేయవలసినది మనకు విధికృతము గనుక మన కీపని చేయక తప్పదనుకొనుచు వానివధావిషయక కర్మమునందుఁ బ్రవేశించుచున్నాఁడు. ఈయిద్దఱుభటులలో నెవనికీకర్మవలనఁ బాపమంటును? ఎవనికంటదు?

అర్జు — ఇందులో మొదటివానికిమాత్ర మీకర్మఫలమంటునుగాని, రెండవవానికంటనేరదని తోఁచుచున్నది. ఏలయనఁగా, రెండవవాఁడు నేరస్థునితప్పిదమునకుఁ దగినట్లు రాజు శిక్ష విధించినాఁడనియుఁ దానురాజాజ్ఞను నెఱవేర్చుచున్నాననియు, నెఱిఁగి యాకర్మమునందు నేలాటి యాసక్తియు లేక విధికృతమని చేయుచున్నాఁడు గాన వాని కాకర్మమువలన నేలాటి దోషమంటనేరదని తోఁచుచున్నది.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతమ్ ॥ 15

అర్థము:— ముముక్షుభిః = మోక్షాపేక్షులైన, పూర్వైః + అపి = పూర్వీకులచేతఁగూడ, కర్మ = కర్మము, ఏవమ్ + జ్ఞాత్వా = ఈప్రకారమెఱిఁగి, కృతమ్ =

చేయఁబడినది. తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, పూర్వైః = పూర్వీకులచేత, కృతమ్ = చేయఁబడినదియు, పూర్వతరమ్ = పురాతనమైనదియునగు, కర్మ + ఏవ = కర్మమునే. కురు = చేయుము.

కృ — కాన నోయియర్జునా! పూర్వికులగు ముముక్షువులగు జనకాదులు సయితము నిట్లు నేఁజెప్పినవిధముగ, అనఁగా నేను గర్మబద్ధుఁడను గానని, నట్లే తెలిసికొనువారును గర్మబద్ధులుగారని, తెలిసికొనియే కర్మ నాచరించియున్నారు. కాబట్టి వారలను నిదర్శనముగాఁగొని వారాచరించినట్టి యీపురాతనమైన కర్మయోగమునే నీవు నాచరింపుము.

శ్లో॥ కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 16

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చవికర్మణః ।
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

అర్థము:— కిమ్ = ఏది, కర్మ = కర్మము, కిమ్ = ఏది, అకర్మ=అకర్మము (నైష్కర్మ్యము). ఇతి = అని, కవయః + అపి =విద్వాంసులును, అత్ర = ఈవిషయమునందు, మోహితాః = భ్రమించుచున్నారు. హి = ఏలయనఁగా, కర్మణః = కర్మముయొక్క, గతిః = మార్గము, గహనా = తెలియనశక్యమైనది. (తస్మాత్)= కనుక, కర్మణః = (చేయఁదగిన) కర్మయొక్క, (గతిః) = మార్గము, బోద్ధవ్యం = తెలిసికొనదగినదైయున్నది, వికర్మణః + చ = నిషిద్ధకర్మముయొక్కయు (చేయఁగూడని కర్మయొక్కయు), (గతిః) = మార్గము, బోద్ధవ్యం = తెలిసికొనదగినదైయున్నది, అకర్మణః + చ = నైష్కర్మ్యముయొక్కయు, (గతిః) + అపి = మార్గముగూడ, బోద్ధవ్యం = తెలిసికొనదగినదైయున్నది, (తతః) = ఆకారణమువలన, యత్ = ఏ(కర్మాకర్మవిభజనమును), జ్ఞాత్వా = ఎఱిఁగి, అశుభాత్ = అశుభమునుండి (అనఁగానశుభకారణమగుకర్మబంధమునుండి), మోక్ష్యసే = ముక్తుఁడవు కాఁగలవో, తత్ = అట్టి, కర్మ = కర్మమును, తే = నీకొఱకు, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

ఓయియర్జునా! ఈలోకమునఁ గొన్నికర్మలు వేదోక్తములును, శాస్త్రవిహితములునై యాచరింపఁదగినవియు, మఱికొన్ని యావేదములచేతను, శాస్త్రములచేతను, నిషేధింపఁబడినవియు, నాచరింపఁగూడనివియునై యుంచున్నవిగదా ?

అర్జు — అవును.

కృ — కనుక వేదశాస్త్రపారగుఁడగు విద్వాంసునకట్టి కర్మలలో నేదిచేయఁదగినదియో, ఏదిచేయఁగూడనిదియో, తెలిసియుండవచ్చునుగదా ?

అర్జు — అవును.

కృ — మంచిది, అట్టి విద్వాంసునకునుగూడఁ గొన్నిసమయములలో నొకానొక సందర్భమునుబట్టి యొకకార్యము శాస్త్రవిహితమైనదైనను దీనిని జేయవచ్చునాయనియు మఱియొకకార్యము శాస్త్రనిషిద్ధమైనదైనను దీనిని మన మేల చేయఁగూడదనియు, సందేహము గలుగుచున్నదిసుమా.

అర్జు — ఇది వింతగానున్నది. అయ్యా ! సమస్తవేదములును, శాస్త్రములును, నెఱిఁగిన విద్వాంసునకట్టి సందేహమెట్లు గలుగును ?

కృ — అందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. వేదశాస్త్రములు చక్కఁగాఁదెలిసిన యొక విద్వాంసుఁ డేదియో యొకపనినిమిత్త మడవికిఁ బోయి యచట నొకవృక్షముక్రిందఁ గూర్చుండియుండుతఱి నచటి కనతిదూరంబుననుండు బాటయందుఁ గొంతద్రవ్యమును గొని యొంటరిగ నిరాయుధుఁడై పోవుచుండెడు నొకమార్గస్థుని నాయుధపాణులగు నలువురు చోరులు వెంబడించుచున్నారు. అదిచూచి యామార్గస్థుఁ డడవిలోఁ జొరఁబడి పరుగిడుచువచ్చి యీవిద్వాంసుఁడు గూర్చుండియుండు వృక్షమునకు సమీపముననుండు నొకపొదలోఁ జోరుల కంటికిఁ గనఁబడకుండునట్లు దాఁగుచున్నాఁడు. ఇదియంతయు నావిద్వాంసుఁడు చూచుచునేయున్నాఁడు. వాఁడు దాఁగినవెంబడిగానే యాచోరు లచటికివచ్చి యావిద్వాంసుని జూచి యీమార్గమునఁ బరుగెత్తుచువచ్చినవాఁడెటువోయెనని యడుగుచున్నారు. అప్పుడా విద్వాంసుఁడేమిచేయవచ్చును ? ఆమార్గస్థుఁ డాచేరువపొదలో దాఁగియున్నాఁడని యథార్థమును జెప్పవచ్చునా ? లేక మఱియొకదిక్కుచూపి యీమార్గమునఁబోయినాఁడని యబద్ధముఁజెప్పవచ్చునా? లేక, యేమియుఁబలుకక మౌనము ధరించి యూరకుండవచ్చునా ? ఈమూఁటిలో నేది చేయుటయుక్తము ?

అర్జు — ఇదిమిక్కిలి చిక్కుగానున్నది. అయ్యా ! ఆవిద్వాంసుఁ డాచోరులకు నిజముచెప్పినయెడల, నిరపరాధియు, నిరాయుధుఁడునైన యామార్గస్థుని ప్రాణమునకును, ధనమునకును, హానిగలుగును గనుక నట్లుచెప్పుట యుక్తముగనున్నట్లు కనఁబడలేదు. వారలకుఁ దప్పుమార్గముఁజూపినయెడల ననృతమాడుట నిషిద్ధమైనపని గనుక నట్లుచెప్పుటయు నుచితముగానున్న ట్లగపడదు. మంచిది, మౌనముధరించి యూరకున్నయెడల నాచోరులు మూర్ఖులు గనుకఁగోపించుకొని యావిద్వాంసునే చంపి

వేయుచుండుగాన నిట్టివిషయములో నావిద్వాంసుఁడేమి చేయఁదగినదియో నూహించుట కష్టసాధ్యముగానేయున్నది. అట్టివిషయములో నేమి చేయవచ్చునో నీవే చెప్పుము.

కృ — అట్టివిషయములో నిజమాడినయెడల నిరపరాధియగు మార్గస్థుని ప్రాణమునకును ధనమునకును హానికలుగును గనుక నట్టిహానికి నీవిద్వాంసుఁడే కారణభూతుఁడగుచున్నాఁడు. కాన కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః। సుకృతం దుష్కృతంచైవ చత్వారస్సమభాగినః అనునట్లు చోరులకు నా కార్యమువలనఁగలిగెడు పాపము 'నీవిద్వాంసుఁడును బంచుకొనవలసినవాఁడైయున్నాఁడు. అట్లుచేయుటకంటె యేమియుఁజెప్పక మౌనముగానుండిన యెడలఁ దన ప్రాణమునకే హానిసంభవించుచున్నది. అట్లుగాక, వారలకుఁ దప్పుమార్గముఁజూపి యనృతమాడిన యెడల నందువలన నిరపరాధిగానుండెడు వానియొక్క ప్రాణసంరక్షణమగుటయేగాక యాచోరులయొక్క దుష్ప్రయత్నమునకు భంగమునుగలుగుచున్నది. ఇందువలన వీనికనృతమాడిన దోషమునకు బదులుగాఁ బ్రాణసంరక్షణముఁజేసిన సుకృతముఁగలుగుచున్నది. కాన శాస్త్రనిషిద్ధమైనదైనను నిచట ననృతమాడుటయే మేలనియు, శాస్త్రవిహితమైనదైనను నిచట నిజమాడుట కీడనియు నెఱుఁగవలయును. కనుకనే

"తే. గీ. ప్రాణహానిఁ దప్పించుచోఁ బరిణయంబు
నందు గురుజనకార్యార్థమయ్యు నంగ
నాజనముతోడి సంభాషణమున సర్వ
ధనముఁజెడియెడునెడ బొంకఁజను నృపాల.

క. గురుసంరక్షణమునకును
బరమాపదయైనయెడను బ్రాహ్మణధనముల్
విరహితములుగాఁ జెఱచోఁ
జోరఁగా నగు * బ్రుచ్చిమికి వసుమతీనాథా."

(భార. శాంతి. ౧.ఆ ౨౯౯ ౨౯౨)

* ఇందునకు నిదర్శనముగఁ బరమభాగవతోత్తముఁడగు కబీరుదాసుగారి చర్యలు కొన్నిగలవు. అవియెవ్వియనఁగా, ఒకప్పుడాయన కొమారుఁడగు కమాల్ దాసు తీర్థయాత్రకుఁబోయి మరలఁ దనయింటికిఁజేరఁగా నపుడతని గుడ్డకొంగున ముడి వేయఁబడియుండెడు నొకయమూల్యమగు రత్నమునుజూచి యిదియెక్కడిదని యతని తండ్రియగు కబీరుదాసడిగినట్లును, అందుకు కమాల్ దాసు తానుతీర్థయాత్ర చేయునపుడొకయూర నొకవర్తకుఁడివ్వఁబోఁగాఁ దానంగీకరింపకపోవుటచేఁ దనకుఁదెలియకుండ దానిని ముడివేసెనని ప్రత్యుత్తరమిచ్చినట్లును, అందుపైని కబీర్ దాసు రామ

సీ. సత్యంబు పలుకుట సర్వధర్మములకు మిక్కిలి యనృతంబుమేటిపాత
కము తద్విశేషంబు గలదు చెప్పెద నొరు నర్థంబు లెప్పుడు నపహరింపఁ
జూచు పాతకులతో సూనృతంబాడుట పాపంబు బొంకులు పలికి యట్టి
వారి హింసించుట పరధర్మమిదియొక్కఁ డేలభూతములకు హితము సేయు.

తే. గీ. బొంకు లెల్లను ధర్మముల్ భూతబాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము
భూతములదుష్టశిష్టత్వములువివేక
సూక్ష్మతావేద్యములు వానిఁ జూడవలయు. (భార. శాంతి. 3. అ.౪౫)

క. పరహితము సేయఁబూనిన
పురుషుఁడు పాపంబు సేయఁ బొందఁడు కీడుం
బరముని యగు నగస్త్యుఁడు
పరోపకారార్థకృతి నభవ్యుం డగునే." (భార. శాంతి. 3. అ. ౨౯౬)

అని పెద్దలు చెప్పియున్నారు.

అర్జు — అహా! కర్మగతియెంత చిత్రమైనదిగానున్నది ?

కృ — అవును, కనుకనే (గహనాకర్మణోగతిః) కర్మయొక్క మార్గము తెలిసికొనుట కష్టసాధ్యము. కానఁ బ్రతిపురుషునకును

"క. ధర్మ మధర్మముఁబోలె న
ధర్మము దా ధర్మమగువిధంబునఁ దోఁచుం
గర్మసమితినొక్కొకయెడ
ధర్మగతియెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్." (భార. శాంతి. ౫. అ)

---

నామమును విక్రయించి రత్నమును దెచ్చితివాయని కోపగించుకొని మరల నారత్నము నావర్తకునకిచ్చివేసిరమ్మని పంపినట్లును, ఆయన చరిత్రవలనఁ దెలియవచ్చుచున్నది. ఇట్టినిరపేక్షకుఁడగు నీభాగవతోత్తముఁ డొకనాటిరాత్రి తనయింటికి నకస్మాత్తుగా విచ్చేసిన సాధువుల సమారాధనకొఱకుఁ బదార్థముల సేకరింపఁదలఁచి గత్యంతరము లేమిచే నొకవర్తకునియింటికిఁ గన్నము వేసి కావలసిన పదార్థముల ముచ్చిలించె ననియు, మఱియొకనాఁ డిట్లే యకస్మాత్తుగఁ దనయింటికివచ్చిన సాధుజనుల సంతర్పణముఁగా నొకవర్తకుని పదార్థముల నిమ్మనియడుగ నాదుష్టచిత్తుఁడగు వర్తకుఁడు మహాపతివ్రతయగు నాయనభార్యను గోరినసందు కాయన యొడఁబడెననియుఁ దెలియవచ్చుచున్నది.

అనునట్లు కేవల వేదశాస్త్రములనుబట్టిమాత్రమే గాక యాయాసమయసందర్భాను సారముగ నెప్పుడెప్పుడేయేకర్మ చేయఁదగినదిగా నుంచున్నదో, యేయేకర్మ చేయఁగూడనిదిగా నుంచున్నదో దానిని బాగుగ గుర్తెఱింగి చేయుచుండవలయును. అట్లు చేయుచుండిన యెడల నాకర్మవలనఁగలుగు నశుభఫల మంటనేరదు గాన, కర్మ నాచరించునపుడు గమనింపవలసిన పద్ధతులు నీకుఁజెప్పుచున్నాను వినుము.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18

అర్థము:- యః = ఎవఁడు, కర్మణి = కర్మమునందు, అకర్మ = నైష్కర్మ్యమును, పశ్యేత్ = చూచుచున్నాఁడో, యః = ఎవఁడు, అకర్మణి = నైష్కర్మ్యమునందు, కర్మ+చ = కర్మమును, (పశ్యేత్) = చూచుచున్నాఁడో. సః = వాఁడు, మనుష్యేషు = మానవులయందు, బుద్ధిమాన్ = బుద్ధిమంతుఁడు, సః = వాఁడే, యుక్తః = యోగి, (సః) = వాఁడే, కృత్స్నకర్మకృత్ = సకలకర్మల నాచరించినవాఁడు.

ఓయియర్జునా! కర్మాకర్మ వికర్మలయొక్క పద్ధతియిట్టిదని యింతకుముందు (పై శ్లో. 4. 17) చెప్పియుంటినిగదా, అట్లెవఁడేని కర్మమును దానుజేసియుఁ జేయని వాఁడ ననుకొనుచున్నాఁడో, ఎవఁడు దానేకర్మయుఁజేయకయే చేసినవాఁడననియను కొనుచున్నాడో, వాడే నైష్కర్మ్యసిద్ధిని బొందిన జ్ఞానియుఁ గర్మనాచరించిన యోగియునగుచున్నాడు. అదెట్లనఁగా, నింతకుముందు (4–17) నేఁ జెప్పినప్రకార మడవిలోఁ జోరులతో నన్నృతమాడిన పండితుఁడట్లు నృతమాడుట శాస్త్రవిరుద్ధమైన కర్మముగ నుండినను, నిరపరాధియు నిరాయుధుఁడునునగు మార్గస్థుని ప్రాణసంరక్షణార్థమై యట్లువిధిలేక చేయవలసివచ్చినందున

"ఉ. భూతహితంబుగా బలుకుబొంకును సత్యఫలంబునిచ్చుఁ ద
ద్భూతభయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల
ప్రాణాతురుఁడైనచోఁ బరిణయంబులయందును బల్కుబొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్."
(భార. అరణ్య. ౨ఆ. ౬౨)

అనునట్లు, అదిపాపకార్యముగాదనియు, నందువలన దన కన్నృతమాడినదోష మంటదనియు, నమ్ముచున్నాఁడుగాన నతఁడన్నృతమాడుటయను కర్మమును జేసియుఁ జేయనివాఁడనియే తలంచుచున్నాడు. అందువలన నతఁడు కర్మమునం దకర్మమును

సీ. సత్యంబు పలుకుట సర్వధర్మములకు మిక్కిలి యనృతంబుమేటిపాత
కము తద్విశేషంబు గలదు చెప్పెద నొరు నర్థంబు లెప్పుడు నపహరింపఁ
జూచు పాతకులతో సూనృతంబాడుట పాపంబు బొంకులు పలికి యట్టి
వారి హింసించుట వరధర్మమిదియొక్కఁ డేలభూతములకు హితము సేయు.

తే. గీ. బొంకు లెల్లను ధర్మముల్ భూతబాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము
భూతములదుష్టశిష్టత్వములువివేక
సూక్ష్మతావేద్యములు వానిఁ జూడవలయు. (భార. శాంతి. 3. అ. ౮౫)

క. పరహితము సేయఁబూనిన
పురుషుఁడు పాపంబు సేయఁ బొందఁడు కీడుం
బరమముని యగు నగస్త్యుఁడు
పరోపకారార్థకృతి నభవ్యుం డగునే.” (భార. శాంతి. 3. ఆ. ౨౯౬)

అని పెద్దలు చెప్పియున్నారు.

అర్జు — అహా! కర్మగతియెంత చిత్రమైనదిగానున్నది ?

కృ — అవును, కనుకనే (గహనాకర్మణోగతిః) కర్మయొక్క మార్గము తెలిసికొనుట కష్టసాధ్యము. కానఁ బ్రతిపురుషునకును

“క. ధర్మ మధర్మముఁబోలె న
ధర్మము దా ధర్మమగువిధంబునఁ దోఁచుం
గర్మసమితినొక్కొకయెడ
ధర్మగతియెఱుంగవలయుఁ దచ్ఛాస్త్రములన్.” (భార. శాంతి. ౫. ఆ)

---

నామమును విక్రయించి రత్నమును దెచ్చితివాయని కోపగించుకొని మరల నారత్నము నావర్తకునకిచ్చివేసిరమ్మని పంపినట్లును, ఆయన చరిత్రవలనఁ దెలియవచ్చుచున్నది. ఇట్టినిరపేక్షకుఁడగు నీభాగవతోత్తముఁ డొకనాటిరాత్రి తనయింటికి నకస్మాత్తుగా విచ్చేసిన సాధువుల సమారాధనకొఱకుఁ బదార్థముల సేకరింపఁదలఁచి గత్యంతరము లేమిచే నొకవర్తకునియింటికిఁ గన్నమువేసి కావలసిన పదార్థముల మ్రుచ్చిలించెననియు, మఱియొకనాఁ డిట్లే యకస్మాత్తుగఁ దనయింటికివచ్చిన సాధుజనుల సంతర్పణకుఁగా నొకవర్తకుని పదార్థముల నిమ్మనియడుగ నాదుష్టచిత్తుఁడగు వర్తకుఁడు మహాపతివ్రతయగు నాయనభార్యను గోరినందు కాయన యొడఁబడెననియుఁ దెలియవచ్చుచున్నది.

అనునట్లు కేవల వేదశాస్త్రములనుబట్టిమాత్రమే గాక యాయాసమయసందర్భా నుసారముగ నెప్పుడెప్పుడేయేకర్మ చేయఁదగినదిగా నుంచున్నదో, యేయేకర్మ చేయఁ గూడనిదిగా నుంచున్నదో దానిని బాగుగ గుర్తెఱింగి చేయుచుండవలయును. అట్లు చేయుచుండిన యెడల నాకర్మవలనఁగలుగు నశుభఫల మంటనేరదు గానఁ గర్మనాచ రించునపుడు గమనింపవలసిన పద్ధతులు నీకుఁజెప్పుచున్నాను వినుము.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18

అర్థము:- యః = ఎవఁడు, కర్మణి = కర్మమునందు, అకర్మ = నైష్కర్మ్య మును, పశ్యేత్ = చూచుచున్నాఁడో, యః = ఎవఁడు, అకర్మణి = నైష్కర్మ్య మునందు, కర్మ+చ = కర్మమును, (పశ్యేత్) = చూచుచున్నాఁడో. సః = వాఁడు, మనుష్యేషు = మానవులయందు, బుద్ధిమాన్ = బుద్ధిమంతుఁడు, సః = వాఁడే, యుక్తః = యోగి, (సః) = వాఁడే, కృత్స్నకర్మకృత్ = సకలకర్మల నాచరించినవాఁడు.

ఓయియర్జునా ! కర్మాకర్మ వికర్మలయొక్క పద్ధతియిట్టిదని యింతకుముందు (పై శ్లో. 4. 17) చెప్పియుంటినిగదా, అట్లెవఁడేని కర్మమును దానుజేసియుఁ జేయని వాఁడ ననుకొనుచున్నాఁడో, ఎవఁడు దానేకర్మయుఁజేయకయే చేసినవాఁడననియను కొనుచున్నాడో, వాడే నైష్కర్మ్యసిద్ధిని బొందిన జ్ఞానియుఁ గర్మనాచరించిన యోగియునగుచున్నాడు. అదెట్లనఁగా, నింతకుముందు (4-17) నేఁ జెప్పినప్రకార మడవిలోఁ జోరులతో నసృతమాడిన పండితుఁడట్లు నృతమాడుట శాస్త్రవిరుద్ధమైన కర్మముగనుండినను, నిరపరాధియు నిరాయుధుఁడునునగు మార్గస్థుని ప్రాణసంరక్ష ణార్థమై యట్లువిధిలేక చేయవలసివచ్చినందున

"ఉ. భూతహితంబుగా బలుకుబొంకును సత్యఫలంబునిచ్చుఁ ద
ద్భూతభయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల
ప్రాణాతురుఁడైనచోఁ బరిణయంబులయందును బల్కుబొంకు స
త్యాతిశయంబ యింద్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్."
(భార. అరణ్య. ౨ఆ. ౬౨)

అనునట్లు, అదిపాపకార్యముగాదనియు, నందువలన దన కనృతమాడినదోష మంటదనియు, నమ్ముచున్నాఁడుగాన నతఁడనృతమాడుటయను కర్మమును జేసియుఁ జేయనివాఁడనియే తలంచుచున్నాడు. అందువలన నతఁడు కర్మమునం దకర్మమును

జూచిన వాఁడనఁబడును. ఆపండితుఁడే దానన్నృతమాడుట పాపకార్యమనియెంచి యాచోరులు దన్ను నడిగినపుడు తూష్ణీంభావమును వహించియున్నయెడల నాచోరులా చుట్టుపట్ల వెదకి యచ్చటఁబొదలో దాగియుండు మార్గస్థునిగనిపెట్టి పట్టుకొని వానిసొమ్ముదోఁచుకొని ప్రాణహానిఁ గలుగఁజేసినయెడల నాచోరులఁ దప్పుదారిఁ గనఁబఱచి వెళ్ళగొట్టుటకుఁదగిన యవకాశముదనకుఁ గలిగియుండియు నట్లు చేయక పోవుటచే నామార్గస్థుని ప్రాణమునకు హానిసంభవించుటవలన నందలిపాపము దన కాపాదించుననియెఱిఁగి యటి యనృతమాడుచున్నాఁడు. గనుక నతఁడు, అకర్మ యందుఁ గర్మమునుజూచినవాఁడగును.

అర్జు — అయ్యా! అనృతమాడుట యెప్పటికైనను బాపకార్యమేగదా? యట్లుండఁగా నిట్టివిషయములో ననృతమాడుటవలనఁ, దనకుఁ బాపములేదని యాపండితుఁ డెట్లునమ్ముచున్నాఁడు? అతఁడనృతమాడుటయును నిషిద్ధకర్మను జేసినవాఁడగుచుండఁగా దానిఫలమతని కెట్లంటకపోవును?

శ్లో॥ యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుఃపణ్డితం బుధాః॥ 19

అర్థము:— యస్య = ఎవనియొక్క, సమారమ్భాః = కార్యారంభములు (అనఁగాఁగర్మములు), సర్వే = అన్నియు, కామసఙ్కల్పవర్జితాః = కామముయొక్క యుద్దేశ్యముచే విడువఁబడినవో (అనఁగాఫలాపేక్షవలన సంకల్పింపఁబడనివో), తమ్ = అట్టివానిని, బుధాః = పెద్దలు, పణ్డితమ్ = జ్ఞానవంతునిగాను, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణమ్ = జ్ఞానమనెడు నగ్నిచే దదహింపఁబడిన కర్మలుగలవానినిగాను, ఆహుః = చెప్పుదురు.

కృ — ఓయియర్జునా! నీవడిగిన ప్రశ్న సరియైనదే. ఎప్పటికైనను ననృత మాడుట నిషిద్ధకర్మమే; దానివలన బాపముసంభవించుటయుసిద్ధమె. అయితే, యీవిషయములో నది పాపకార్యముగానేరదు. ఏలయనఁగా, నిచట నీపండితు డనృతమాడుటవలనఁ దానొకమేలును బొందవలెననెడు కోరికగలఁవాఁడుగాఁడు; అట్టికోరికచేత నట్టియనృతమాడుటకు సంకల్పించినవాఁడునుగాఁడు; అయితే, అట్లు చేయుటకుఁగారణమేమనఁగాఁ, దానాచోరులతో నిజముచెప్పినయెడల నందువలన నిరపరాధిగానుండెడు నొకనికిఁ బ్రాణహానిగలుగుచున్నదే యని తలఁచి జీవకారుణ్యముగలవాఁడై యట్టియుపద్రవమతనికిఁ గలుగకుండుటకై విధిలేక యనృతమాడిన వాఁడగుచున్నాఁడు గాన నతఁడీ యనృతమాడుటయను కర్మను స్వప్రయోజనార్థమై చేసినవాఁడుగాఁడు; అనఁగా నందువలనఁ దానొకలాభమునుగాని మేలునుగాని

పొందఁదలఁచి చేసినవాఁడుగాఁడు. అయితే, కేవలము జీవకారుణ్యముచేతనే చేసిన వాఁడగుచున్నాఁడు. జీవకారుణ్యముతో నెప్పుడు చేసెనో యాకర్మయప్పుడే భగవంతునకుఁ బ్రీతికరమైనదిగా నేర్పడుచున్నదిగాన నతనియొక్క యాకర్మఫలాపేక్షతోఁ జేయఁబడనిదియు, భగవత్ప్రీత్యర్థముగాఁ జేయఁబడినదియు నగుచున్నది. కాన నాకర్మ వలనఁగలుగఁదగిన ఫలము భగవంతునికే యర్పితమగుచున్నదిగాని చేసినవాని కెంత మాత్రమంటనేరదు. ఇట్లే యెవఁడైతే తానుజేసెడు కర్మలన్నియు స్వప్రయోజనార్థమైన ఫలమునుగోరక భగవత్ప్రీత్యర్థముగఁ జేయుచున్నాఁడో యట్టివానికర్మలన్నిటి యొక్క ఫలమా భగవంతునకే యర్పితమగుచు వీనికిఁ జెందనేరదు. కాన నట్టివాఁడే జ్ఞానియనియు, వాఁడు చేసెడు కర్మలఫలములన్నియు వానికిఁ జెందకపోవుటచే నశించినవగుచున్నవనియుఁ బెద్దలు సెప్పుదురు.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః ॥ 20

అర్థము :— సః = వాఁడు (పైశ్లోకమునఁ జెప్పఁబడిన లక్షణములుగలవాఁడు), కర్మఫలాసఙ్గమ్ = కర్మఫలమునందలియాసక్తిని, త్యక్త్వా=విడిచిపెట్టి, నిత్యతృప్తః= ఎప్పుడును దృప్తిఁబొందినమనస్సుగలవాఁడును, నిరాశ్రయః+(సన్) = దేనినినాశ్రయింపనివాఁడునగుచు, కర్మణి = కర్మమునందు, అభిప్రవృత్తః+అపి = ప్రవర్తించినవాఁడైనను, కించిత్ = కొంచెమైనను (ఏకర్మమునైనను), న+కరోతి+ఏవ= చేయనివాఁడే.

ఓయియర్జునా! ఇంతకుముందు (శ్లో-4-19) కామసంకల్పవర్జితుఁడగు వాఁడు చేసెడు కర్మము జ్ఞానాగ్నిచే దహింపఁబడుచున్నదని చెప్పితినిగదా, అదెట్లనఁగా నెప్పుడైతే, ఒకనికి నొకఫలమును బొందవలెననియెడు కోరికలేకపోవుచున్నదో, అప్పుడా ఫలమును బొందుటకుఁగాను గర్మచేయవలెనని యెడు సంకల్పము పుట్టనేరదు గదా? అట్టి సంకల్పమెపుడు లేకపోవుచున్నదో యాకర్మవలనఁగలుగు ఫలమునందపేక్ష యప్పుడే లేకపోవును; అట్టికర్మఫలాపేక్ష యెప్పుడు లేకపోవుచున్నదో యప్పుడు వానికిఁ గావలసిన దేమియునుండదు. కనుక నావిషయమైన చింత యేమియు మనస్సునలేనివాఁడగును; గనుక వానిమనస్సెప్పుడును దృప్తిఁబొందినదిగానే యుంచున్నది. కనుక నట్టివాఁడు నిత్యతృప్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అట్టి వానికిఁ గోరఁదగిన ఫలమేమియునుండదు. కనుక వాఁడేవిషయమునుగుఱించియు, దేనినైనను నాశ్రయింపఁదలఁచిన యక్కఱలేనివాఁడగును గనుక వాఁడు నిరాశ్రయుఁ

డనియును జెప్పఁబడుచున్నాఁడు. కాన నిట్లుకర్మఫలసంగనివృత్తియు, నిత్యతృప్తియు, నిరాశ్రయత్వమును నెవనికిఁ గలుగుచున్నదో వాఁడేకర్మచేసినను స్వప్రయోజనార్థమైచేసినవాఁడుగాఁడు గనుకను దానిఫలమువానికిఁజెందదు గనుకను, వాఁడాకర్మఁ జేసియుఁ జేయనివాఁడుగానే యేర్పడుచున్నాఁడు. కనుకనే

" క. కరణములుదొడరిననుని
ష్కారణత నున్నను శమంబు గలయోగికి సు
స్థిరమగు సమాధి యని ముని
వరశాండిల్యుండు శిష్యవరులకుఁ జెప్పెన్." (భార. శాంతి. ౫. ఆ. ౧౯౭)

అర్జు — అయితే, అయ్యా! అట్టివాఁడు స్వప్రయోజనార్థముగా నేమియుఁ గోరఁడనియు, నేపనినిజేయఁడనియుఁ, జెప్పితివిగదా ? ఏదిచేసినను జేయకపోయినను, దనదేహయాత్రార్థమై భిక్షాన్నమునైనను సంపాదింపవలసియుంచున్నదిగదా ? అట్లు చేయుట తనయుదరపోషణార్థమైనది గనుక స్వప్రయోజనార్థమైనదిగా లేదా? అంతమాత్రముగూడ స్వప్రయోజనార్థమై చేయనియెడల వాఁడుజీవించుట యెటు?

కృ — అయితే, చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

అర్థము :— నిరాశీః = (దేనియందు) నాశలేనివాఁడును, యతచిత్తాత్మా = మనోనిగ్రహముగలవాఁడును, త్యక్తసర్వపరిగ్రహః = విడువఁబడిన సమస్తవస్తుస్వీకారముగలవాఁడునై (ఇతరులవలన నేవస్తువునైనను బుచ్చుకొనుటయందుఁ బ్రీతిలేనివాఁడునై), కేవలమ్ + శారీరమ్ = దేహధారణమాత్రమైన, కర్మ=కర్మమును, కుర్వన్ = చేయువాఁడు, కిల్బిషమ్ = (సంసారబంధహేతువగు) కిల్బిషమును, న + ఆప్నోతి= పొందఁడు.

ఓయియర్జునా! నీవిప్పుడడిగిన ప్రశ్నునుబట్టిచూడఁగా దేహధారణమాత్రమైన భిక్షాన్నభోజనాది కృత్యముగూడ ఫలాపేక్షతో స్వప్రయోజనార్థమైచేసెడు కర్మగా నీవెంచుచున్నట్లగపడుచున్నది. అట్లెంత మాత్రమెంచఁదగదు. ఏలయనఁగా నొక పురుషుఁడు మనోనిగ్రహముగలవాఁ డెప్పుడగుచున్నాఁడో యప్పుడు వానిమనస్సు, ఐహికాముష్మికములలో దేనియందును దగులమి నొందకయుండుటచే వానిలో దేనియందును నాశలేని వాఁడగుచున్నాఁడు; అట్లెప్పుడు వానికి దేనియందును నాశ లేకపోవుచున్నదో యప్పుడు వాఁడు దేనినైనను బొందవలెననెడు కోరికతోనే

ప్రయత్నమును జేయఁడు సరేగదా. అట్టి దేనినైనను నెవ్వరైన నితరులు దనకు నయాచితముగ నిచ్చినను దానిని బుచ్చుకొనఁడు. ఒకవేళ విధిలేక పుచ్చుకొనవలసివచ్చినను, అట్టిచ్చువారియొక్క మనస్సునకుఁ గొంతే గలుగకుండుటకుఁ గాఁ బుచ్చుకొనునే గాని యవి తనకుఁ గావలసియున్నవనియు, వానివలనఁ దనకొక ప్రయోజనమున్నదనియు, ననియొహ నపేక్షతోఁ బుచ్చుకొనఁడు, గాన

"క. అపరిగ్రహాసర్వారం
భపరిత్యాగములుఁ గలఁగుపండితునకు మః
ఖపుఁదెరువు వాటిలదు మో
క్షపదము సొప్పడి తదాత్మకసుఖం బొందున్."
(భార. శాంతి. ౬. ఆ. ౩౧౩.)

అనునట్లు, అట్టివాఁడు కేవలదేహధారణార్థమై కావలసిన యన్నపానాదులకుఁ గాఁజేసెడు కర్మవలన వానికేమియుఁ గిల్బిష మంట నేరదు.

అర్జు — అయితే, అయ్యా! ఇట్లుచెప్పితివిగదా. తానే ప్రయత్నమును జేయక పోయినను, నితరు లయాచితముగ నిచ్చిన దానినైనను బ్రీతితోఁ బరిగ్రహింపఁడని చెప్పితివిగదా, తనయాహారార్థమై యితరులిచ్చెడు నన్నాదులను భక్షించుటయు, వస్త్రాదులను ధరించుటయు, నీమొదలగునవి స్వప్రయోజనార్థమై చేసిన పనులేగదా? అట్లుండఁ దనకేమియు వానివలనఁ బ్రయోజనములేదని తలఁచువాఁడును, వానిని బ్రీతితోఁ బరిగ్రహింపనివాఁడును నెట్లగును?

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే॥　　22

అర్థము :- యదృచ్ఛాలాభసంతుష్టః = అప్రయత్నముగఁ దనంతట లభించిన యాహారాదులతోఁ దృప్తినొందినవాఁడును, ద్వన్ద్వాతీతః = సుఖదుఃఖములవలన బాధ నొందనివాఁడును, విమత్సరః = మాత్సర్యములేనివాఁడును, సిద్ధౌ + అసిద్ధౌ = ప్రాప్త్యప్రాప్తులయందు, సమః + చ = సమబుద్ధిగలవాఁడును, కృత్వా + అపి = (దేహధారణకుఁగావలసిన భోజనాది కృత్యములు) చేసియు, న + నిబధ్యతే = కర్మబద్ధుఁడు కాఁడు.

కృ — ఓయియర్జునా! నీవుచెప్పినప్రకార మితరు లిచ్చిన యన్నవస్త్రాదులను నాత్మార్థమై యుపయోగించినను నందువలన వారికిఁ బ్రీతిపూర్వకముగ వాడుటగాని, యందువలనఁ దనకొక ప్రయోజనముగలిగినదని గాని, జ్ఞానియగువాఁ డెంచఁడు. ఏల

యనఁగా నట్టివాఁడు దన దేహధారణార్థమై కావలసిన యన్నవస్త్రాదులకొఱకు నితరులను యాచింపక యయాచితముగ నెవరైన నిచ్చినదాని నుపయోగపఱచుకొనును. అట్లు తనకేయే వేళకు నేది యయాచితముగ లభించుచున్నదో యట్టిదానితోనే తృప్తిఁ జెందును: ఎట్లనఁగా ? ఒకనాఁడొకరు పంచభక్ష్యపరమాన్నములతో భోజనమిడిన దానివలన నెట్లుతృప్తిఁబొందునో, మఱియొకనాఁడు మఱియొకరు తమశక్తికొలఁదిఁ బచ్చడియన్నము పెట్టినను, నట్లే దానితోడను దృప్తిఁబొందునుగాని, మొదటఁ బంచభక్ష్యపరమాన్నములతోఁబెట్టిన వానియందుఁ బ్రీతియుఁ, బచ్చడియన్నముఁబెట్టినవారియందు నప్రీతియు నుంచఁడు. ఈయుభయులయందును సమభావముగలవాఁడైయే యుండును. కనుక నతఁడు యదృచ్ఛాలాభసంతుష్టుఁడని చెప్పఁబడును. అట్లు జిహ్వాకు రుచికరములగు పదార్థములు పుష్కలముగఁ దొరకినపుడు సంతుష్టియు, నట్లుగాక కేవలనిస్సారమగు భోజనపదార్థముము దొరకినపు డసంతుష్టియు లేక యాయుభయములయందును సమమైన తృప్తిని జెందినవాడగుటచే ద్వంద్వాతీతుఁడనఁబడును. మఱియు, మొదట రుచికరమగు పదార్థములిచ్చినవారియందు ప్రీతియు, నిస్సారమగు పదార్థములిచ్చిన వారియందు నప్రీతియు, లేనివాఁడగుటచే విమత్సరుఁడనఁబడును. ఇదిగాక యట్టివానికి నొకనాఁ డాహారపదార్థములు చిక్కుటయు, మఱియొకనాఁడు చిక్కకుండుటయుఁగూడఁ గలుగును. అట్లు చిక్కినపుడు సంతోషించుటయుఁ, జిక్కకపోయినపుడు చింతించుటయు లేక యెల్లప్పుడును దృప్తిఁజెందిన మనస్సు గలవాఁడై యుండునుగాన సిద్ధ్యసిద్ధులయందు సమభావముగలవాఁడని చెప్పఁబడును. ఇట్టి లక్షణములుగలవాఁడు గనుక వాఁడు దేహధారణార్థమై చేసెడి భోజనాదికృత్యములు స్వప్రయోజనార్థమై చేసినవని యెంచఁగూడదు. కాఁబట్టి యందువలన దాని ఫలిత మతని నంటనేరదు. కనుకనే

" ఆ. ఒకటి గోరి దాని కుల్లంబు గందఁగ
జాలిఁబడమి యేమి సంభవించె
నేనిఁ దానఁ దృప్తి నూనుట దప్పిన
పనికి వగవకునికి భవ్యవిధము." (భార. శాంతి. ౫. ఆ. ౨౩.)

అని పెద్దలు చెప్పియున్నారు.

శ్లో॥ గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ 23

అర్థము:— గతసఙ్గస్య = సంగములేనివాఁడును (అనఁగా ఐహికాముష్మికములలో దేనియందును దగులములేనివాఁడును, ముక్తస్య = (సంసారబంధమునుండి)

విడువఁబడినవాఁడును, జ్ఞానావస్థితచేతసః = జ్ఞానమునందే నిలువఁబడిన మనస్సుగల వాఁడును, యజ్ఞాయ = యజ్ఞముకొఱకు (అనఁగా భగవత్ప్రీత్యర్థముగ), ఆచరతః = కర్మనాచరించుచున్నవానియొక్క, కర్మ = కర్మము, సమగ్రమ్ = యావత్తు, ప్రవిలీయతే = నశింపుచున్నది.

ఓయియర్జునా ! ఇదివఱకు నేఁజెప్పినప్రకార మెవఁడైతే సంగరహితుఁడును, అనఁగాఁ దానుజేయు కర్మములయొక్క ఫలమునం దాశలేనివాఁడును (చూ. 4-20) ముక్తుఁడును, అనఁగా, తనకుఁగా సర్వవస్తుసంపాదనమును విడిచినవాఁడును, (చూ. 4-21) జ్ఞానియు, అనఁగా యదృచ్ఛాలాభసంతుష్టుఁడును, విమత్సరుఁడును; సిద్ధ్యసిద్ధులయందు సమభావముగలవాఁడును, (చూ. 4-22) నై కేవలము యజ్ఞముకొఱకు, అనఁగా భగవత్ప్రీత్యర్థముగఁ గర్మనాచరింపుచున్నాఁడో యటివాఁడుచేయు కర్మలన్నియు, అనఁగా నిపుడుచేయుకర్మయుఁ బ్రాచీనకర్మయు నశించును. అనఁగా వాఁ డీజన్మమందుఁజేయు కర్మయొక్కయు, నునుపటి జన్మలయందుఁజేసిన కర్మలయొక్కయు, ఫలము వాని నంటనేరదని తెలిసికొనుము.

అర్జు — అయ్యా ! యిదివఱకు నీవుచెప్పియుండు కర్మ కేవల దేహధారణార్థమైన కర్మయని చెప్పుచువచ్చి (చూ. 4-21-22) యిప్పుడు యజ్ఞముకొఱకుఁ జేయఁబడినకర్మయని చెప్పుచున్నావే. అందువలన నీభావమేమి ? యజ్ఞమనఁగా, అగ్నిష్టోమాదివేదోక్తకర్మలకు నన్వయింపుచున్నదిగదా, అట్టియజ్ఞములు స్వర్గాదిఫలాపేక్షతోఁ జేయఁబడు కామ్యకర్మములనియు, మోక్షసాధకములుగావనియు నిదివఱకుఁజెప్పియుంటివిగదా ? (చూ. 2-42-43-44) అట్లుండఁగా నిచ్చట యజ్ఞముకొఱకుఁజేయఁబడు కర్మ సమగ్రముగా నశింపుచున్నదనియు, దానిఫల మంటనేరదనియుఁ జెప్పుచున్నావే, యిది కేవలము పరస్పర విరుద్ధముగా నున్నదే, యిట్లు చెప్పుటకుఁ గారణమేమి ?

కృ — లేదు, లేదు. నీవు తలఁచినప్రకారము యజ్ఞమనునది యగ్నిష్టోమాది యజ్ఞకర్మలకుమాత్రమే యన్వయించునదిగాదు. మఱియేమనిన నింతకుముందు నేఁ జెప్పిన లక్షణములు గలిగి జ్ఞాననిష్ఠుఁడై భగవదర్పితముగఁ జేసెడు కర్మలన్నిటికిని నన్వయింపుచున్నది. అదెట్లనిన; వివరించిచెప్పుచున్నాను వినుము.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యమ్ బ్రహ్మకర్మసమాధినా॥　　　　24

అర్థము:— బ్రహ్మణా = బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగువానిచేత, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మమనెడునగ్నియందు, హుతమ్ = వేల్చఁబడిన, బ్రహ్మహవిః = బ్రహ్మస్వరూ

పమగు హవిస్సు, బ్రహ్మార్పణమ్=బ్రహ్మమునకే యర్పితము, (భవతి) = అగుచున్నది, (తథా) = అట్లు, బ్రహ్మకర్మసమాధినా = సర్వము బ్రహ్మస్వరూపమే యనుచిత్తైకాగ్రతతో నుండువాని, తేన = వానిచేత, బ్రహ్మ + ఏవ = పరబ్రహ్మమే, గన్తవ్యమ్= పొందఁబడఁదగినది.

ఓ యర్జునా! సర్వసంగపరిత్యాగము చేసినవాఁడు యజ్ఞము నెట్లు చేయఁగలఁడనియు. యజ్ఞమనఁగా సకలవస్తుపరికరములతోఁ జేయఁబడు నగ్నిహోమాది యజ్ఞములే యగును, నీవు దలఁచునట్లు తోఁచుచున్నది. ఇచట యజ్ఞమనఁగా నదిగాదు. సర్వసంగపరిత్యాగియగు జ్ఞానికి నట్టియజ్ఞము చేయు నావశ్యకమును నవకాశమును నుండనేరవు. అయితే, అతఁడు కేవల దేహధారణార్థమై చేసెడు భోజనాదికృత్యమే యజ్ఞమనిపించుకొనుచున్నది. ఎట్లనఁగా నతఁడు కేవలము బ్రహ్మజ్ఞాననిష్ఠుఁడు గనుకఁ దాను పరబ్రహ్మస్వరూపమేయనియుఁ, దాను భుజించెడు పదార్థము బ్రహ్మరూపమే యనియుఁ, దాను బ్రహ్మస్వరూపుఁడైనందునఁ దనయందుండెడు జఠరాగ్నియు బ్రహ్మస్వరూపమనియు, నాజఠరాగ్నికిఁగాను దాను వేసెడి యాహారమే బ్రహ్మస్వరూపమగు హవిస్సనియు, అనఁగా (అన్నం పరబ్రహ్మస్వరూపమ్)అను ప్రమాణానుసారముగను బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగు తనకుఁ బ్రపంచమందలి చరాచరములన్నియు బ్రహ్మస్వరూపములుగనే కనుపట్టుచుండును గనుకను దానుభుజించెడు నాహారమును బ్రహ్మస్వరూపమగు హవిస్సనియు, నది తాను భక్షించుటయే బ్రహ్మాగ్నియను తన జఠరాగ్నియందు వేల్పఁబడినదనియు, నది బ్రహ్మస్వరూపమగు తన జఠరాగ్నిని దృప్తి పఱచుటచే బ్రహ్మార్పణమగుచున్నదనియుఁ, దలఁచుచున్నాఁడు గాన నట్లు బ్రహ్మకర్మనిష్ఠుఁడగు, అనఁగాఁ దానుజేసెడు భోజనాదికృత్యములు యావత్తు బ్రహ్మార్పణముగఁ జేయఁబడుచున్నవనియెడు నిశ్చయజ్ఞానముగలవాఁడెవఁడో వాఁడు పరబ్రహ్మమునే పొందుచున్నాఁడు. అనఁగాఁ బరబ్రహ్మములో నైక్యమగుచున్నాఁడు. కాని తదితరములగునట్టివియుఁ, బునర్జన్మకుఁ గారణభూతములగునట్టివియు, నగు స్వర్గాది భోగములను జెందఁడు. కాన నిట్లు బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగు వాఁడు దేహధారణార్థము చేసెడు భోజనాది నిత్యకృత్యమే యజ్ఞమనఁబడును. ఇది జ్ఞానయజ్ఞము. ఇది గాక మఱియు ననేకవిధములగు యజ్ఞములునుగలవు. వానిని వివరించి చెప్పెద వినుము.

శ్లో॥ దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ 25

అర్థము:— అపరే = కొందఱు, యోగినః = (నిష్కామకర్మానుష్ఠానపరులగుయోగులు), దైవమ్ + ఏవ = దేవతార్చనమునే, యజ్ఞమ్ = యజ్ఞమునుగా, పర్యుపాసతే = ఆచరింపుచున్నారు, అపరే = (నైష్కర్మ్యసిద్ధినిబొందిన) మఱికొందఱు, యజ్ఞేన + ఏవ = యజ్ఞముచేతనే (అనఁగాఁ బైశ్లోకమునఁజెప్పఁబడినప్రకారము సమస్తము బ్రహ్మస్వరూపమనియెడు జ్ఞానయజ్ఞముచేతనే), యజ్ఞమ్ = (అజ్ఞానమనెడు) హవిస్సును, బ్రహ్మాగ్నౌ = బ్రహ్మ (జ్ఞానమనెడు) నగ్నియందు, ఉపజుహ్వతి = వేల్చుచున్నారు.

ఎట్లనఁగా నటిబ్రహ్మజ్ఞానములేనట్టియు, నట్టిజ్ఞానమును బొందఁగోరి యందునకుఁగా యత్నముఁజే యుచుండునట్టి యోగులు (అనఁగా నిష్కామకర్మానుష్ఠానపరులు) చేయుచుండెడు దేవ ర్చనాది కృత్యముగూడ యజ్ఞమే యనిపించుకొనుచున్నది. ఇది దైవయజ్ఞము. అట్టియోగు లటి కర్మానుష్ఠానమును జేయుచు రాఁగరాఁగ గొంతకాలమునకు జ్ఞానోదయమై నైష్కర్మ్య సిద్ధిని బొందినవారగుచున్నారు. అట్టిసిద్ధినిబొందినవారి కట్టి దేవతార్చనాదికృత్యముల నిమిత్తములేక, సర్వం పరబ్రహ్మస్వరూపమ్ అనియెడు జ్ఞానోదయముగలుగుటచే నదివఱకుఁగలిగియుండెడు నజ్ఞానము నశించిన దగుచున్నది. కాన నట్టివా రజ్ఞానమనెడు హవిస్సును బ్రహ్మజ్ఞానమనెడు నగ్నియందు వేల్చినవారగుచున్నారు. కాన నదియును యజ్ఞమేయగుచున్నది. ఇదియే యింతకుముందు (చూ. 4–24) చెప్పఁబడిన జ్ఞానయజ్ఞము.

శ్లో॥ శ్రోత్రాదీనీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

అర్థము:— అన్యే = కొందఱు, శ్రోత్రాదీని = శ్రోత్రము మొదలగు. ఇన్ద్రియాణి = ఇంద్రియములనెడు (హవిస్సులను), సంయమాగ్నిషు = నిగ్రహములనెడు నగ్నులయందు, జుహ్వతి = వేల్చుచున్నారు, అన్యే + అపి = మఱికొందఱు, శబ్దాదీన్ = శబ్దము మొదలగు, విషయాన్ = విషయములనెడు (హవిస్సులను), ఇన్ద్రియాగ్నిషు = ఇంద్రియములనెడునగ్నులయందు, జుహ్వతి = వేల్చుచున్నారు.

ఓయియర్జునా! యింతవఱకు (చూ. 4–24) జ్ఞానయజ్ఞములఁగుఱించియు, (చూ. 4–25) దైవయజ్ఞమునుగుఱించియుఁ, జెప్పితినిగదా. ఇఁకను, ఇంద్రియయజ్ఞమును గుఱించియు, విషయయజ్ఞమును గుఱించియుఁ, జెప్పుచున్నాను వినుము. ఎట్లనఁగాఁ, గొందఱు యోగాభ్యాసకులు శ్రోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా, ఘ్రాణములనెడు పంచేంద్రియములను వానివిషయములయందుఁ బ్రవర్తింపనీక నిగ్రహింపు

చున్నారు. (చూ. 2–58) వారట్లు చేయుటవలన నింద్రియవ్యాపారములు నశించు చున్నవి. కాన నట్టివారు నిగ్రహమనెడు నగ్నియందు నింద్రియములనెడు హవిస్సులను వేల్చినవారగుచున్నారు. కావున నిది యింద్రియయజ్ఞమనిపించుకొనుచున్నది. మఱికొందఱు రాగద్వేషరహితులై యింద్రియంబుల స్వవశంబుగావించుకొని వానిచే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడు విషయంబుల ననుభవింపుచుండియు, నావిషయంబులయం దాసక్తచిత్తులుగాకుండుటంజేసి వాని ననుభవింపనివారే యగుచున్నారు. (చూ. 2–64) కాన నట్టివారు విషయము లనెడు హవిస్సులను నింద్రియము లనెడు నగ్నులయందు వేల్చినవారగుచున్నారు. కనుక నిది విషయయజ్ఞ మనిపించుకొను చున్నది.

శ్లో॥ సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27

అర్థము:— అపరే = మఱికొందఱు. జ్ఞానదీపితే = జ్ఞానముచేఁ బ్రకాశింపఁజేయఁబడిన, ఆత్మసంయమయోగాగ్నౌ = మనోనిగ్రహయోగమనెడు నగ్నియందు, సర్వాణి = సమస్తమైన, ఇన్ద్రియకర్మాణి=ఇంద్రియవ్యాపారములను, ప్రాణకర్మాణి + చ = పంచప్రాణములవ్యాపారములను, జుహ్వతి = వేల్చుచున్నారు.

ఓయి యర్జునా! ఇంతవఱకు జ్ఞానయజ్ఞ–దైవయజ్ఞ–ఇంద్రియయజ్ఞ–విషయయజ్ఞములను గుఱించి చెప్పితినిగదా. ఇఁకను గర్మయజ్ఞమునుగుఱించి చెప్పుచున్నాను వినుము. అదెట్లనిన; కొందఱు యోగులు సర్వేంద్రియవ్యాపారములను, అనఁగా శ్రోత్ర, త్వక్, చక్షుః, జిహ్వా, ఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియములవ్యాపారములగు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను, అనఁగా వినుట, స్పృశించుట, చూచుట, రుచిఁగొనుట, ఆఘ్రాణించుట, అను వ్యాపారములను, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలనెడు కర్మేంద్రియముల వ్యాపారములగు మాటలాడుట, పని చేయుట, నడచుట, మలమూత్రవిసర్జనములు సేయుట, అను వ్యాపారములును, మఱియు, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము లనెడు పంచప్రాణముల వ్యాపారములగు నుచ్ఛ్వాస, నిశ్వాసాదులును. నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయము లనెడు నుపప్రాణముల వ్యాపారములగు నున్మీలననిమీలనాదులును, వీనినన్నిటిని బంధించి యాత్మసమాధియనెడు యోగమున నున్నారు. అట్టి యోగు లట్టి సమాధినిష్ఠయం దుండునంతవఱకుఁ బైఁజెప్పఁబడినప్రకారము సమస్తజ్ఞానేంద్రియ కర్మేంద్రియములయు, ప్రాణోపప్రాణములయుఁ జేష్టితములను బంధించి యాత్మను బరబ్రహ్మస్వరూపమునందు లయింపఁజేసి తన్మయత్వముఁజెంది నిర్జీవకళేబరమువలె

శరీరప్రజ్ఞ లేనివారై యుంచున్నారు గాన నట్టివారు పైఁజెప్పిన సమస్తకర్మలను సమాధినిష్ఠయను నగ్నియందు వేల్చినవారగుచున్నారు గాన నది కర్మయజ్ఞ మనఁ బడుచున్నది.

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః॥ 28

అర్థము:— సంశితవ్రతాః = ఆశ్రయింపఁబడిన వ్రతములుగలవారగుచు (అనఁగా నేదేనియొక యుద్దేశ్యముతో వ్రతమును బూనినవారై), యతయః = యత్నించు చుండెడు, అపరే = మఱికొందఱు, ద్రవ్యయజ్ఞాః = (సద్విషయములయందు) ద్రవ్యమును వినియోగించుటయే యజ్ఞముగాఁగలవారును; తథా = అలాగుననే, తపోయజ్ఞాః = కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులే యజ్ఞముగాఁ గలవారును, యోగయజ్ఞాః = యమనియమాద్యష్టాంగయోగములే యజ్ఞముగాఁగలవారును, స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః + చ = వేదాధ్యయనము చేయుటయు, నందలి యర్థము నెఱుఁగుటయు నే యజ్ఞముగాఁగలవారును, (భవన్తి) = అగుచున్నారు.

ఓయియర్జునా! యింతవఱకు నేఁజెప్పిన జ్ఞానయజ్ఞ, ఇంద్రియయజ్ఞ, విషయయజ్ఞ, కర్మయజ్ఞము లివి యన్నియు నైహికాముష్మికములగు నపేక్షలేవియు లేని వారలు సేయునట్టి యజ్ఞములుగా నుంచున్నవి. ఇఁక నట్టి యాపేక్షలతోఁగూడు కొన్నవారు చేసెడి యజ్ఞములు గొన్నిగలవు. వానిని వివరించి చెప్పుచున్నాను వినుము. ఎట్లనఁగా నీలోకమున ననేకు లనేకవిధములగు కోరికలఁగలవారై, అనఁగాఁ గొందఱు ద్రవ్యాపేక్షగలవారును, గొందఱు సంతానాపేక్షగలవారును, గొందఱు తాము యత్నించిన కార్యములు నెఱవేఱవలెనని కోరువారును, మఱికొందఱు దమకుఁ గలిగిన యాపదలు దొలఁగిపోవఁ గోరువారును, ఇట్లనేకు లనేకవిధములగు కోరికలు గలవారై యాకోరికలు నెఱవేఱుటకుఁగాను భగవత్ప్రీత్యర్థముగఁ గొందఱు పుణ్యక్షేత్రములయందు దానాదికృత్యములఁ జేయుటయందును, దేవాలయ తటాకాదులు నిర్మించుటయందును, నన్నప్రదానాద్యనేక సద్విషయములయందును, ధనవ్యయము చేసి, తద్ద్వారా తమ యీప్సితములను బొందఁగోరుదురు. ఇది ద్రవ్యయజ్ఞ మనఁబడు చున్నది. అట్లే ధనవ్యయము చేయుటకు వీలులేని మఱికొందఱు భగవత్ప్రీత్యర్థముగ దేహకార్శ్యములగు కృచ్ఛ్రచాంద్రాయణోపవాసాది తపస్సులంజేసి తద్ద్వారా తమ యీప్సితములఁ బొందఁగోరుదురు; అది తపోయజ్ఞ మనఁబడుచున్నది. మఱికొందఱు యమనియమాద్యష్టాంగయోగముల నభ్యసించి తద్ద్వారా యీప్సితములను బొంద

గోరిన వారగుచున్నారు; ఇది యోగయజ్ఞమనఁబడుచున్నది. మఱికొందఱు వేదాధ్యయనము, సుందరకాండమొదలగు గ్రంథముల పారాయణాది కృత్యములచేఁ దమ యీప్సితములు నెఱవేఱుననెడు తలంపుతో నదియొక వ్రతముగాఁ జూనిచేయుదురు; అది స్వాధ్యాయజ్ఞానయజ్ఞమనఁబడుచున్నది. ఇట్లనేకవిధములగు యజ్ఞములు సయితముగలవు.

అర్జు — అయ్యా! యిపుడు నీవుచెప్పిన యజ్ఞములలో యోగయజ్ఞమును గూడ, అనఁగా యమనియమప్రాణాయామా ద్యష్టాంగయోగమునుగూడ నొకయజ్ఞమునుగాఁజెప్పితివిగదా, అదియునెట్లు యజ్ఞమగును ? అందు హవిస్సేది ? వివరించి చెప్పుము.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥ 29
అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి॥ 29½

అర్థము:— ప్రాణాయామపరాయణాః = ప్రాణాయామమును జేయువారగు, అపరే = కొందఱు, ప్రాణాపానగతీ = ప్రాణాపానములగతులను, రుద్ధ్వా = నిరోధించి, ప్రాణమ్ = ప్రాణమును, అపానే = అపానమునందును, తథా = అలాగే, అపానమ్ = అపానమును, ప్రాణే = ప్రాణమునందును, జుహ్వతి = వేల్చుచున్నారు, అపరే = మఱికొందఱు, నియతాహారాః + (సన్తః) = నియమింపఁబడిన యాహారముగలవారై, ప్రాణాన్ = ప్రాణములను, ప్రాణేషు = ప్రాణములయందు, జుహ్వతి = హోమముఁజేయుచున్నారు.

కృ — ఓయియర్జునా! యోగయజ్ఞమనునది నీకుఁ జక్కఁగాఁబోధపడలేదు కాఁబోలును. మరల వివరించి చెప్పుచున్నాను వినుము. యోగమునందు ముఖ్యమైన యంగము ప్రాణాయామము. అనఁగా నాసికాముఖములయందు సంచరించెడు వాయువును మంత్రపూర్వకముగ నిరోధించుట. ఈప్రాణాయామము, రేచక, పూరక, కుంభకము లనెడు మూడుపద్ధతులు గలదిగా నుంచున్నది. అందు రేచకమనఁగా నూపిరి వెలుపలికి విడుచుట. దీనికే యుచ్ఛ్వాసమని పేరు. పూరకమనఁగా నూపిరిఁబూరించుట. అనఁగా లోపలికిఁ దీయుట. దీనికే నిశ్శ్వాసమనియు, అపానమనియుఁ జెప్ప. కుంభకమనఁగా నూపిరిఁబిగఁబట్టుట. అనఁగా లోపలికిఁ దీల్చిన వాయువును వెలుపలఁబోకుండ నిలిపియుంచుట. ప్రాణమనఁగా హృదయమందలి గాలి. అపానమనఁగా గుదస్థానమందలిగాలి. అనఁగా మూర్ధ్వభాగమందుండుగాలి

ప్రాణమనియు, నధోభాగమందుండెడు గాలి యపానమనియు, ననఁబడుచున్నవి. ప్రాణాయామముఁజేయు వాఁడొక నాసికారంధ్రమునుండి వాయువును బీల్చి మఱి యొక నాసికారంధ్రమునుండి విడుచుచున్నాఁడు. అట్లు పీల్చుటచే నూర్ధ్వవాయువును నధోవాయువునఁ గలిపినవాఁడగుచున్నాఁడు. గాన నది ప్రాణ మపానమునఁ గలియుటయగుచున్నది. కాన నిట్లుచేయుటయే ప్రాణము నపానమునందు వేల్చుట యనఁబడును. దీనికే పూరకమనియు, నిశ్శ్వాసమనియు, నపాననమనియుఁ బేరు. మఱియు నటు లోపలికిఁబీల్చఁబడినవాయువును వెలుపలికి విడుచుటవలన నధోభాగమందుండెడు వాయువు నూర్ధ్వభాగమునకుఁ బంపుటయగుచున్నది. అనఁగా నపానమునుఁ బ్రాణమునఁ జేర్చుటయగుచున్నది. కాబట్టి యిది యపానమును బ్రాణమునందు వేల్చుటయగుచున్నది. ఇదే రేచక మనఁబడును. కానఁ బూరకమును జేసినపుడు ప్రాణము నపానమునందు వేల్చినవాఁడును, రేచకమును జేసినపు డపానమును బ్రాణమునందు వేల్చినవాఁడును నగుచున్నాఁడు. ఇట్లే మఱికొందఱు నియతాహారులై, అనఁగా స్వల్పాహారమును గొనువారలై ప్రాణవాయువులను వెలుపలవిడువక లోపలనే నిలిపియుంచున్నారు. ఇదియే కుంభక మనెడు ప్రాణాయామము. ఇట్లుచేయుటవలనఁ బ్రాణవాయువులను బంధించుచున్నారు. అనఁగాఁ బ్రాణాపానవ్యానోదాన సమానము లనెడు పంచప్రాణములయొక్క వ్యాపారములగు నుచ్ఛ్వాసనిశ్వాసాదులను, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములనెడు నుపప్రాణ వ్యాపారములగు నిమీలనోన్మీలనాదులను స్తంభించి నిశ్చేష్టితులై యుంచున్నారు. కనుక నట్టివారు ప్రాణములను బ్రాణములయందు వేల్చినవారగుచున్నారు.

అర్జు — అయితే, ఆచార్యా! ఇట్లుచేయుట చూడఁగా నిది కేవలము శరీరసాధకముగానుంచున్నది. ఇది సాధారణముగా గారడీలు మొదలగువారుగూడ నుదరపోషణార్థ మభ్యసించు విద్యగా నుంచున్నది. ఇట్టిది యెట్లు మోక్షసాధకమగును? దీనివలన యోగుల కేమిప్రయోజనము?

కృ — నీవుచెప్పినది వాస్తవమే గాని, అయితే, గారడీలు మొదలగువా రభ్యసించుట దమకు వాయుధారణయందుఁగల సామర్థ్యము నితరుల కగపఱచి తద్ద్వారా యుదరపోషణఁ జేసికొనుచున్నారుగాన వారలకది మోక్షసాధకముగాదు గాని యోగులకట్లుగాదు. యోగు లిది యేల యభ్యసింపుచున్నారనఁగా, నిట్లుచేయుటవలన మనస్సును జలింపనీక యొకలక్ష్యమునందు నిల్పియుండునట్లుచేయుటకు ననుకూలమైనదగుచున్నది. వారలు దమమనస్సును బరమాత్మయందు నచంచలముగా నిలుపవలసినవారై యుంచున్నారు. కనుక నట్లుచేయుటకిది సాధకముగానుంచు

న్నది. కాన దీని నభ్యసింపుచున్నారు. కాఁబట్టి యిది మోక్షసాధకములలో ముఖ్యమైనదిగా నుంచున్నది.

అర్జు — అయ్యా! ఇప్పుడు నీవు చెప్పిన ప్రాణాయామములు మూఁడింటిలోఁ గుంభకమనెడు ప్రాణాయామము నియతాహారులై సేయుచున్నారని చెప్పుటకుఁ గారణమేమి? తక్కిన ప్రాణాయామములకు లేని యాహారనియమ మీప్రాణాయామమునకు మాత్రమెట్లుకలిగినది?

కృ — ఈకుంభకమను ప్రాణాయామము తక్కిన రేచక పూరకములకంటె మిగులఁ గష్టసాధ్యము. కేవలము స్వల్పాహారమును గొనువారికేగాని యితరులకు నిది సాధ్యపడనేరదు. ఏలయనఁగా, నీప్రాణాయామము సేయుటవలనఁ బ్రాణవాయువులు వెలుపలికిఁ బోనీక నిరోధింపఁబడుచున్నవి. అందువలన నవి లోపలనే యిమిడియుండవలసియుంచున్నవి. అట్లుండుటకు వానికిఁదగినంతచోటు కావలసియుంచున్నది. గాన నీప్రాణాయామముఁజేయువాఁడు మితాహారముఁ జేయనియెడల నిరోధింపఁబడిన ప్రాణవాయువులకు నట్టియెసలిక వాటుగలుగనేరదు. కనుకనే

" తే. గీ. అధిప లఘ్వాశియై యింద్రియప్రపంచ
జయము గలిగి మోక్షార్థోక్తసారధర్మ
నిరతి నుండెడువానికిఁ బరమమగు ప
దంబు తంగేటిజాన్నుచందంబు నొందు ॥" (భార. శాంతి. ౨ఆ. ౩౯౧)

అని పెద్దలు చెప్పియున్నారు.

శ్లో॥ సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥ 30

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ! ॥ 31

అర్థము :— హేకురుసత్తమ! = ఓయర్జునా!, ఏతే=పైఁజెప్పఁబడిన (అనగా 4–24 మొ 4–29½ వఱకుఁ జెప్పఁబడిన), సర్వే + అపి = అందఱును, యజ్ఞవిదః= యజ్ఞములనెఱిఁగినవారును, యజ్ఞక్షపితకల్మషాః = యజ్ఞముచేత నశింపఁజేయబడిన పాపములుగలవారును, యజ్ఞశిష్టామృతభుజః + (సన్తః) = యజ్ఞమునమిగిలిన యమృతమునుభుజించినవారై, సనాతనమ్ =శాశ్వతమైన, బ్రహ్మ=బ్రహ్మమును, యాన్తి= పొందుచున్నారు, అయజ్ఞస్య = పైఁజెప్పఁబడిన యజ్ఞములలో దేనినిజేయనివానికి, అయమ్ + లోకః=ఈలోకము(అనఁగా నైహికసుఖము), న + అస్తి=లేదు. అన్యః=

మఱియొకలోకము (అనఁగాఁ బరలోకసుఖము), కుతః = ఎక్కడిది? (అనఁగాఁ గలుగ నేరదనుట).

ఓయియర్జునా! యిపుడు నేఁజెప్పినపండ్రెండును, అనఁగా (4-24) జ్ఞానయజ్ఞమును, (4-25) దైవయజ్ఞమును (4-26) ఇంద్రియయజ్ఞవిషయయజ్ఞములును, (4-27) కర్మయజ్ఞమును (4-28) ద్రవ్యయజ్ఞ-తపోయజ్ఞ-యోగయజ్ఞ-స్వాధ్యాయయజ్ఞములును,(4-29) ప్రాణాయామయజ్ఞమును, అను నీయజ్ఞములలో నన్నిటినిగాని, కొన్నిటినిగాని, చేసినవారలుమాత్రమే యజ్ఞము నెఱిఁగినవారును, యజ్ఞమువలనఁ బోఁగొట్టబడినపాపములుగలవారును, యజ్ఞశిష్టామృతమును భుజించినవారునై మోక్షమును జెందఁగలరు. కాని తదితరులు, అనఁగా నీయజ్ఞములలో దేనినిజేయనివారు మోక్షమును బొందఁజాలరు. అట్టివారీలోకమున నతినీచులుగను నిందితులుగను, నెంచఁబడుచున్నారు. కాన నట్టివారికి నిహలోకసౌఖ్యమే గలుగనేరదు. అట్లుండఁ బరలోకసౌఖ్యమెట్లుగలుగనగును ?

అర్జు — అయ్యా! యజ్ఞశిష్టామృతమనఁగా నగ్నిష్టోమాది యజ్ఞములయందు దేవతాప్రీతికొఱకు హోమముఁ జేయఁగా మిగిలిన యాజ్యపురోడాశాది హవిస్సులకుఁ గదా యన్వయింపుచున్నది. అట్లుండఁగా నిపుడు నీవుచెప్పిన జ్ఞానయజ్ఞమునందు బ్రహ్మమును బ్రహ్మమునందు వేల్చుటయు, నింద్రియయజ్ఞమునం దింద్రియములను నియమమను నగ్నియందు వేల్చుటయు, విషయయజ్ఞమునందు శబ్దాదివిషయములను నింద్రియములనెడు నగ్నులయందు వేల్చుటయుఁ గర్మయజ్ఞమునందు సమస్తేంద్రియవ్యాపారములను బ్రాణవ్యాపారములను నాత్మనియమమనెడు నగ్నియందు వేల్చుటయు, యోగయజ్ఞమునందుఁ బ్రాణములను బ్రాణములయందు వేల్చుటయు, నని చెప్పితివిగదా. ఈయజ్ఞములయందు హోమముచేయఁగా మిగిలెడు నమృతమెట్టిది? దానిని భుజించుటయనఁగా నెట్లు ?

కృ — ఈయజ్ఞములయందు యజ్ఞశిష్టామృతమనఁగా నగ్నిష్టోమాదులలోవలె నాజ్యపురోడాశాదిద్రవ్యములుగావు. మఱియేమనఁగా నిపుడు నేఁజెప్పిన జ్ఞానాది యజ్ఞములుసేయుచు రాఁగరాఁగఁ బెరుఁగుదరుచఁగా జ్ఞానయుత్పత్తియైనట్లు, ఆత్మజ్ఞానముత్పన్నమగును. అట్టి యాత్మజ్ఞానమే యీయజ్ఞములయందలి యమృతమనఁబడును. అట్టి యాత్మజ్ఞానానుభవమే యమృతమును భుజించుటయగుచున్నది. అగ్నిష్టోమాదులయందలి యమృతానుభవమువలన స్వర్గాదిభోగములు గలిగిన ట్లీయజ్ఞములవలనఁగలిగెడు నాత్మానుభవముచే మోక్షప్రాప్తిగలుగుచున్నది.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥ 32

అర్థము :— ఏవమ్ = ఇట్లు (అనఁగాఁ బై 24 మొదలు 30 వఱకుఁ జెప్పఁబడినప్రకారముగా), బహువిధాః = నానావిధములైన, యజ్ఞాః = యజ్ఞములు, బ్రహ్మణః + ముఖే = బ్రహ్మముఖమునందు (అనఁగా వేదమందు), వితతాః = విస్తరింపఁబడియున్నవి, తాన్ = ఆ (యజ్ఞములను), సర్వాన్ = అన్నిటిని, కర్మజాన్ = కర్మములవలనఁ బుట్టినవానినిగా, విద్ధి = ఎఱుఁగుము. ఏవమ్ = ఇట్లు, జ్ఞాత్వా = ఎఱిఁగి, విమోక్ష్యసే = (సంసారబంధమునుండి) విడువఁబడఁగలవు.

ఓయియర్జునా! ఇపుడు నేఁజెప్పిన యన్నివిధములగు యజ్ఞములును బ్రహ్మముఖమునుండి యుత్పన్నమైన వేదమునందు సవిస్తరముగాఁ జెప్పఁబడియున్నవి. అనఁగా వీనిలో నేయేయజ్ఞ మెట్లెట్లాచరింపవలసినదియు వేదమునందు వివరించి చెప్పఁబడియున్నవి. కాని నా వేదమును జక్కఁగ నెఱిఁగినవార లీయజ్ఞములన్నియుఁ గర్మజములని, అనఁగా నిందుఁగొన్ని యజ్ఞములు కాయికములు, అనఁగా శరీరముచేఁ జేయదగిన యగ్నిష్టోమాది కర్మలవలనఁగలిగిన యజ్ఞములనియుఁ, గొన్ని వాచికములు, అనఁగా వాక్కుచేఁజేయఁదగిన స్వాధ్యాయాదికర్మలవలనఁ గలిగినయజ్ఞములనియు, మఱికొన్ని మానసికములు, అనఁగా మనస్సుచేఁ జేయఁదగిన యింద్రియ నిగ్రహాది కర్మలవలనఁ గలిగిన యజ్ఞములనియుఁ, దెలిసికొనఁగలరు. కాన నట్లు నీవీయజ్ఞములన్నియుఁ గర్మజములేయని యెఱిఁగినయెడల నీవు సంసారబంధ విముక్తుఁడవు కాఁగలవు.

అర్జు — అయితే, అయ్యా! ఇప్పుడు నీవు చెప్పినవి యనేకవిధములైన యజ్ఞములుగా నుంచున్నవిగదా. ఇవియన్నియు నొకపురుషుఁడే యాచరించుట కష్టసాధ్యముగదా? కాన వీనిలో శ్రేష్ఠతరమైన యజ్ఞమేదియో నిర్ణయించిచెప్పుము.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః పరంతప!।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే॥ 33

అర్థము :— హేపరంతప! = అరిభీకరుఁడవగు నో యర్జునా!, ద్రవ్యమయాత్ = ద్రవ్యములచేఁ జేయఁబడు, యజ్ఞాత్ = యజ్ఞముకంటె, జ్ఞానయజ్ఞః = జ్ఞానయజ్ఞము, శ్రేయాన్ = శ్రేయస్కరమైనది, హేపార్థ! = ఓ యర్జునా!, సర్వమ్ + కర్మ = సమస్తకర్మము (అనఁగాఁ బైఁజెప్పఁబడిన యజ్ఞకర్మమంతయు),

అఖిలమ్ = నిశ్శేషముగా, జ్ఞానే = ఆత్మజ్ఞానమునందు, పరిసమాప్యతే = ముగియుచున్నది (అనఁగా జ్ఞానోత్పత్తితో నంతమొందుచున్నది).

కృ — ఓయి యర్జునా! ధనము మొదలుగాఁగల ద్రవ్యసామగ్రితోఁ జేయఁబడు యజ్ఞములకంటె నట్టి సామగ్రితో నిమిత్తములేని జ్ఞానయజ్ఞమే మేలైనదిగా నుంచున్నది. ఏలయనఁగా నిదివఱకుఁ జెప్పఁబడిన కాయిక - వాచిక - మానసిక కర్మలన్నియు జ్ఞానోత్పత్తికయియే చేయఁబడునవి గనుక నవి జ్ఞానమే పర్యవసానముగాఁగలవి యగుచున్నవి. అనఁగా జ్ఞానోత్పత్తి యైనతోడనే యా కర్మలన్నియు నివర్తింపు చున్నవి. కాఁబట్టి

" క. యజ్ఞంబులలోనఁ దపో
యజ్ఞంబుత్తమము దాని నాదరణమునం
బ్రాజ్ఞోత్తమ చేయుము స
ర్వజ్ఞుఁడు ప్రీతుఁడగు శాంతరసమొప్పఁ జూమీ."

(భార. అశ్వ. ౨అ. ౭౦.)

అనునట్లు ద్రవ్యమయ యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞమే మేలైనదిగానుంచున్నది.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శనః॥　　34

శ్లో॥ యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ!।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥　　35

అర్థము :- హేపాణ్డవ! = ఓ యర్జునా!, యత్ = ఏ (జ్ఞానమును); జ్ఞాత్వా = ఎఱిఁగి (అనఁగాఁ దెలిసికొనిన పిమ్మట), పునః = మరల, ఏవమ్ = ఇట్లు (అనఁగా నిపుడు నీవు పొందుచున్నట్లు), మోహమ్ = అజ్ఞానమును, న + యాస్యసి = పొందవో, యేన = ఏ (జ్ఞానముచేత), భూతాని + అశేషేణ = సమస్తభూతములను (అనఁగాఁ బ్రాణులును), ఆత్మని=నీయందును. అథః=పిమ్మట, మయి (చ) = నా యందును, ద్రక్ష్యసి = చూడఁగలవో, తత్ + జ్ఞానం = అట్టి జ్ఞానమును, తత్త్వదర్శినః = ఆత్మతత్త్వము నెఱిఁగిన వారగు, జ్ఞానినః = జ్ఞానులు, తే = నీకు, ఉపదేక్ష్యన్తి = ఉపదేశింపఁ గలరు, (తస్మాత్) = కనుక, ప్రణిపాతేన = నమస్కారము చేతను, పరిప్రశ్నేన = ప్రశ్నచేయుట చేతను, సేవయా = శుశ్రూషచేతను, (తేభ్యః) = వారివలన, విద్ధి = తెలిసికొనుము.

ఓయియర్జునా! జ్ఞానోదయమైన పిమ్మటఁ గర్మలన్నియు నశించుచున్నవి. కనుక జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమని చెప్పితినిగదా? అది యెందువలన ననఁగా నట్టి జ్ఞానోదయ మెప్పుడగుచున్నదో యప్పుడే యిపుడు నీకుఁ గలిగియుండు నజ్ఞానరూప మగు బంధుజనవిషయమైన పామరత్వము విడుచుటయేగాక నీయందును నాయందును దక్కిన సకలప్రాణుల యందును, నుండునట్టి యాత్మ యొక్కటియే యనియెడు నిశ్చయబుద్ధి గలుగును. కాన నీవట్టి జ్ఞానమును సంపాదింప యత్నింపుము.

అర్జు — అయ్యా! అట్టి జ్ఞానము నేనెట్లు సంపాదింప వచ్చునో యుపాయ మును జెప్పుము.

కృ —

" . గురుపదాంభోజముల్ గొలువక కలుగునే ప్రవిమలవైరాగ్యభాగ్యమహిమ
గురుపాదతీర్థంబుగ్రోలక కలుగునే జ్ఞానవిజ్ఞానయోగానుభవము
గురుసుప్రసాదంబు గొనకున్నఁగల్గునే ప్రతిలేనిచిత్తోపరతిసుఖంబు
గురుతత్త్వమాత్మఁగన్గొనకున్నఁ గల్గునే నిరతిశయంబైన పరమపదము

తే.గీ. అట్లు గావున విద్యార్థియైన యోగి
వినయభయభక్తు లెదలోనఁ బెనఁగొనంగ
నలచతుర్విధ శుశ్రూష లాచరించి
కొనుచు ననిశంబు గురువులఁ గొలుచు ననఘ!" (సీతా.రా. ౩అ. ౧౨)

అనునట్లు, అట్టిజ్ఞానమును సంపాదించుటకుఁ దత్త్వవేత్తలగు పెద్దల నాశ్ర యింపవలెను. అట్టివారి నాశ్రయించి వారికి శిష్యుఁడవై నమస్కరించి సేవఁజేసి యడిగినయెడల వారు నీకుఁ జెప్పుదురు. కాన నట్లుచేయుము.

అర్జు — మంచిది, యిట్లు చెప్పితివిగదా? అట్టి తత్త్వజ్ఞానులుగ నుండువారు నిరపేక్షకులును, నభిమానరహితులును, సర్వసములును, గృపాళులునునై యుండ వలెనుగదా! ఇట్టి లక్షణములు గలవారి నెవరైన నాశ్రయించినంత మాత్రముననే వారియెడల దయచేసి వారికి జ్ఞానోపదేశము చేయవలసిన వారై యుండఁగా నట్లు చేయక తమ్ము నుపదేశార్థమై యాశ్రయించిన వారివలన నమస్కారము శుశ్రూష మొదలగువాని నపేక్షించుటకుఁ గారణమేమి? అట్టి నమస్కార శుశ్రూషాదులు సేయనివారికి నుపదేశింపనివారైన యెడల, వారలు నిరపేక్షకులును సర్వసములును నెట్లగుచున్నారు? అట్టివారి యుపదేశమువలన జ్ఞానోదయమెట్లు గలుగును?

కృ — ఇపుడు నీవుచేసిన ప్రశ్న సయుక్తికముగనే యున్నది గాని, దానికి సమాధానముఁ జెప్పెద వినుము. నీవు దలఁచినట్లు నమస్కారశుశ్రూషాదులుగాని

మఱియేదియుఁగాని, యెవరివలనఁగాని, యట్టివారన్నిటికి నపేక్షింపరు. అయినను నట్టిశుశ్రూషాదులుచేసెడు వారికేగాని యితరులకు వారుపదేశించుటయులేదు. అది యేలయనఁగా, సర్వసంగపరిత్యాగులగు నట్టివారికి నితరులుచేసెడు శుశ్రూషాదుల వలన నేలాటిప్రయోజనము లేకపోయినను జ్ఞానోపదేశార్థమై తమ్మునాశ్రయించిన శిష్యులట్టిశుశ్రూషాదులుచేసిననేగాని యుపదేశింపకపోవుట, యట్టిశుశ్రూషాదుల వలనఁ దమకొక ప్రయోజనమనియెంచి కాదుగాని తమ్ముజ్ఞానోపదేశముకొఱకు నాశ్రయించిన శిష్యునియొక్క యధ్యవసాయమెట్టిదైనదియు నెఱుఁగుటకై యని తెలిసికొనుము. ఎట్లనఁగా, నందునకొక దృష్టాంతముఁ జెప్పుచున్నానువినుము. ఒకగురువును జ్ఞానోపదేశార్థమై యిద్దఱు శిష్యులాశ్రయింపుచున్నారు. ఆ గురువా యుభయులలో నొకనికైనను నుపదేశముచేయక కాలహరణము సేయుచు వచ్చుచున్నాఁడు. అట్లు కొంతకాలమాశ్రయించి యాయుభయులలో నొకఁడు మన మింతకాల మాశ్రయించినను నుపదేశముచేయకపోయెను గదా, ఇట్టిగురువును నేల యాశ్రయింపవలెనని యెంచి వెళ్ళిపోవుచున్నాఁడు. తక్కినవాఁ డట్లుచేయక యాగురువు దన కుపదేశింపకున్నను నెట్లైన నాతనికరుణవడసి యుపదేశమును బొందవలెనను నాసగలవాఁడై నానాట నాగురువునెడల భక్తివిశ్వాసములు హెచ్చుచు మిగుల వినయవిధేయతలుగలవాఁడై యాయనకు శుశ్రూషఁజేయుచువచ్చుచున్నాఁడు. అట్లుసేయుట స్వప్రయోజనార్థమైయేగాని యాగురువుగోరుటవలనఁ గాదుగదా? ఇట్లుచేయుచు రాఁగరాఁగ నాశిష్యుని మనస్థైర్యమిట్టిదని వాడుసేయు శుశ్రూషాదులవలన నా గురువు కనిపెట్టుచువచ్చును. ఇట్లుకనిపెట్టుచు రాఁగరాఁగ నెప్పుడైతే వీనియధ్యవసాయ మచంచలమైనదనియు, వీని కుపదేశించినయెడల దానిచే జ్ఞానోదయము నిశ్చయముగఁగలుగుననియు నందువలనవాఁడు ముక్తినిబొందఁగలఁడనియుఁ దనబుద్ధికి స్థిరముగఁదోఁచుచున్నదో యప్పుడుపదేశము సేయుచున్నాఁడు. కాన నిందువలన నుపదేశముకొఱ కాశ్రయించెడు శిష్యుఁడుసేయు పరిచర్యాదులు గురువుయొక్క ప్రయోజనార్థముగాదనియుఁ, దనప్రయోజనార్థమేయనియు స్పష్టమగుచున్నదిగదా?

అర్జు — అవునయ్యా! యిప్పుడు నాకుఁ జక్కఁగా బోధపడినది.

శ్లో॥ అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి॥ 36

అర్థము:— సర్వేభ్యః = సమస్తులైన, పాపేభ్యః = పాపాత్ములకంటె, (త్వమ్) = నీవు, పాపకృత్తమః = విశేషపాపముఁజేసినవాఁడవు, అసి + చేత్ +

అపి = అయితివైనను, సర్వమ్ = సమస్తమైన, వృజినమ్ = పాపమును (సముద్రమును), జ్ఞానప్లవేన + ఏవ = జ్ఞానమనెడు తెప్పచేతనే, సన్తరిష్యసి = దాటఁగలవు.

కృ = ఓయియర్జునా! ఇపుడు నేఁజెప్పినప్రకారమొక సద్గురువు నాశ్రయించి యాయనను వందనశుశ్రూషాదులచే మెప్పించి యాయనచేయు నుపదేశము వలన జ్ఞానమును బొందితివేని యట్టిజ్ఞానమువలన నీకుఁగలిగెడు ప్రయోజనమేమనఁగా నదివఱకు నీవుచేసియుండెడు పాపముమితిమీఱినదైనను, అనఁగాఁ దక్కినయందఱు చేసిన పాపముకంటె మిక్కిలి గొప్పదైనను నట్టిపాపమనెడు సముద్రమును నీజ్ఞానమనెడు తెప్పతో దాటఁగలవు. అనఁగా నట్టిజ్ఞానోదయముచే నెంత గొప్పపాపమైనను నశింపుచున్న దనుట.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున! ।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

అర్థము:— హేఅర్జున! = ఓయర్జునుఁడా! యథా = ఏప్రకారము, సమిద్ధోఽగ్నిః = చక్కఁగారగులుచుండెడునిప్పు, ఏధాంసి = సమిధలను, భస్మసాత్కురుతే = భస్మము సేయుచున్నదో, తథా = అప్రకారముగానే, జ్ఞానాగ్నిః = జ్ఞానమనెడునగ్ని, సర్వకర్మాణి = సమస్తకర్మలను, భస్మసాత్కురుతే = భస్మము సేయుచున్నది (అనఁగా నశింపఁజేయుచున్నది).

అదెట్లనిన; నిప్పుచక్కఁగా రగులుకొనకమునుపు దానిపై బాగుగ నెండిన కట్టెలు వేసినను నాయగ్ని సమసిపోవుటయు, నట్లుగాక యానిప్పు చక్కఁగా రగులుకొని ప్రజ్వలింపుచుండు నపుడు దానిపైఁ బచ్చికట్టెలు వేసినను నాకట్టెలు క్షణములో రగులుకొని భస్మమగుటయును మనము చూచుచున్నాము గదా. అట్లేయల్పజ్ఞానముగలవానియొక్క కర్మలు నశింపనేరవుగాని, అఖండజ్ఞానమువలనఁ గర్మలు నశింపఁగలవు. అట్టియఖండజ్ఞానమెట్టిదనిన; నింతకుముందు (చూ. 4–35) నేఁజెప్పిన ప్రకారము సమస్తభూతములను నీయందును, నాయందును, జూడఁగలుగు నట్టిజ్ఞానమేద్దియో యదియే యఖండజ్ఞానమనఁబడును. అట్టిజ్ఞానమెప్పు డుత్పన్నమగుచున్నదో యప్పుడే సమస్తకర్మలు నశించినవగుచున్నవి.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥ 38

అర్థము :– ఇహ = ఈలోకమునందు, జ్ఞానేన=జ్ఞానముతోడ, సదృశమ్ = సమానమైనదియు, పవిత్రమ్ = పవిత్రమైనదియు, న + విద్యతే + హి = లేదు.

గదా, తత్ = అట్టి జ్ఞానమును, కాలేన = కాలక్రమముచేత, యోగసంసిద్ధః = యోగసిద్ధిని బొందినవాఁడు, ఆత్మని = తనయందు, స్వయమ్ = తనంతటనే, విన్దతి = పొందుచున్నాఁడు.

కాన నోయి యర్జునా! ఇదివఱకు నేఁజెప్పిన యంశములన్నిటినిబట్టి చూడఁగా నాత్మజ్ఞానముతో సమానమైనదియు, పవిత్రమైనదియు, మఱియొకటిలేదని చక్కఁగఁ దెలిసికొనఁగలవు గదా. అయితే, అట్టిజ్ఞానము సులభముగ లభించునని యెంచెద వేమో యట్లెంచఁ గూడదు. అది లభించుట బహు కష్టసాధ్యము. ఎట్లనఁగా, నిదివఱకు నేఁజెప్పినప్రకార మొక సద్గురువు నాశ్రయించి యాయనకు వందనశుశ్రూషాదులు సేయుచు నింద్రియమనో నిగ్రహాదియోగము నభ్యసింపుచు రాఁగ రాఁగఁ జాల కాలమునకు యోగసిద్ధిని బొందఁగలఁడు. అనఁగా జ్ఞానోత్పత్తికిఁ దగిన చిత్తశుద్ధిని బొందఁగలఁడు. అట్టిమనః పరిపక్వస్థితికి నెప్పుడు వచ్చుచున్నాఁడో యప్పుడు చేయఁబడు నుపదేశమువలన జ్ఞానము తనంతటఁ బ్రకాశించును. అదెట్లనఁగా, నిందు కొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఇద్దఱు మనుష్యు లొకపొలమును జెఱిసగముగాఁ బంచుకొని ప్రత్యేకముగా వ్యవసాయముఁ జేయుచున్నారు. అందొకఁడు తన భాగమునకువచ్చిన పొలమునందు దున్నుట యెరువు వేయుట మొదలగు కృషిచేయకయే విత్తనముఁ జల్లుచున్నాఁడు. రెండవవాఁ డప్పుడప్పుడు దుక్కికిఁ బదును వడినప్పుడెల్లఁ జక్కఁగాదున్ని యాదుక్కి చేసిన పొలము నెండలకు బాగుగఁ గాఁగనిచ్చి పిమ్మట మరలఁ బదునువడినపుడు దున్నుచువచ్చి యిట్లు దుక్కి బాగుగ నైనపిమ్మట దానికిఁ దగినంతయెరువువేసి యిట్లు నాలుగైదు మాసములవఱకుఁ గష్టపడి సిద్ధపఱచి యుంచుకొని విత్తనపుకోపు వచ్చినపుడు విత్తనము వేయుచున్నాఁడు. ఈయిద్దఱు నొకటే పొలమునందుఁ బైరుపెట్టిన వారుగదా. కనుక నిద్దఱువెట్టినపైరును నొకటేరీతిగాఁ బైరై ఫలించునా! అట్లు కాని యెడల నందులో నెవఁడు పెట్టినపైరు చక్కఁగా ఫలింపఁదగి యుంచున్నది?

అర్జు — పొలమొకటే యైనను. నిపుడు నీవు సెప్పిన యీ యిరువురిలో రెండవవాఁడు భూమిని జక్కఁగ దున్ని యెరువువేసి సిద్ధపఱచి విత్తనపుకోపు గని పెట్టి విత్తనము వేసినవాఁడు గనుక వాఁడు వేసిన విత్తనమే చక్కఁగఁ బైరై ఫలించును గాని యట్టికృషి యేమియుఁ జేయకయే విత్తనము వేసిన మొదటివాని పొలము ఫలించుటలేదు. సరేగదా వాఁడు వేసిన విత్తనమైనను మొలచుటయే సందేహాస్పదమై యుంచున్నది.

కృ — అవునుగదా. మనస్సును సట్టిదేయని యెంచుము. మనస్సే పొలము వంటిది. జ్ఞానప్రాప్తికొరకుఁ జేసెడు యోగాభ్యాసమును గురుశుశ్రూషాదులును, కృషివంటివి. ఇట్టి గురుశుశ్రూషయు యోగాభ్యాసాదులును జేయుచు రాఁగా రాఁగాఁ గొంత కాలమునకు యోగసంసిద్ధిని బొందుట, అనఁగా మనఃపరిపక్వమగుటయే విత్తనపు కోపువంటిది యగుచున్నది. అట్టి మనఃపరిపక్వమును బొందినవానికిఁ జేసెడు నుపదేశమే విత్తనపుకోపున వేసిన విత్తనమువంటిదై జ్ఞానమనెడు మొలక వెంటనే మొలచుచున్నది. అనఁగా జ్ఞానోత్పత్తి యగుచున్నది.

శ్లో॥ శ్రద్ధావాన్లభతే జ్ఞానం తత్పరస్సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి ॥ 39

అర్థము:- శ్రద్ధావాన్ = (జ్ఞానమును సంపాదించుకొనుటయందును, అందునకుఁగా నాశ్రయించెడు గురువునెడలను) శ్రద్ధగలవాఁడును. తత్పరః = అవిషయమునందే మనస్సుగలవాఁడును, సంయతేన్ద్రియః = ఇంద్రియ నిగ్రహముగలవాఁడును, జ్ఞానమ్ = (అట్టి) జ్ఞానమును, లబ్ధ్వా = పొంది, పరామ్ = ఉత్కృష్టమైన, శాన్తిమ్ = చిత్తోపరతిని, అచిరేణ = అలస్యము లేకయే (అనఁగా శీఘ్రముగా), అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

ఓయియర్జునా ! ఇదివఱకు నేఁజెప్పిన దృష్టాంతము (చూ. 4 - 38) చక్కఁగా బోధపడినది గదా !

అర్జు — అవును చక్కఁగా బోధపడినది.

కృ — కనుక నట్లెవఁడైతే జ్ఞానమును సంపాదించుట యందు నాసక్తి గలవాఁడై యందునకుఁ నాశ్రయింపఁబడిన సద్గురువునెడల భక్తిశ్రద్ధలు గలవాఁడును, తదేకనిష్ఠుఁడును, నింద్రియనిగ్రహుఁడునై యుంచున్నాడో యట్టివానికే జ్ఞానము లభించును గాని, యితరులకు లభింపనేరదు. అట్లు జ్ఞానము లభించు నంతవఱకే వానికిఁ గష్టముగాని లభించినపిమ్మట నావెంటనే మిగులఁ బ్రయాసలేకయే వానికిఁ జిత్తశాంతి గలుగుచున్నది. ఇందునకు నిదర్శనముగ మన కనుభవ సిద్ధమైన విషయ మొకటిగలదు. దానిం జెప్పెద వినుము.

మాయన్నయైన ధర్మరాజు పూర్వము నారదవచన ప్రబోధితుండై రాజసూయ యాగము సేయు నపుడొక యద్భుతమైన సంగతి జరిగినది. అది యేమనఁగా బ్రహ్మచారియుఁ గేవలవైరాగ్యశీలుఁడునునగు నొక విప్రవరుఁడొక సద్గురువు నాశ్రయించి యాయన యనుగ్రహము వడసి యుపదేశమునొంది తద్ద్వారా కడతేఱవలయు ననెడు

నిశ్చయబుద్ధితో నట్టియొక్క గురువు నాశ్రయించి యాయనకు నతి శ్రద్ధాభక్తులతో శుశ్రూష సేయుచుఁ జాల కాలము కనిపెట్టియుండ నొక్కతఱి నాగురుశిష్యులిరువురు నొకయడవి మార్గమునఁ జనుచుండ నప్పుడా గురువునకు నకస్మాత్తుగ నవసానకాలము తటస్థించి మిగుల దప్పిఁగొని నడువఁజాలక యొకవృక్షముక్రిందఁ బరుండి దాహమునకు నుదకముఁ దెమ్మని శిష్యున కాజ్ఞాపించెను. ఆశిష్యుఁడా సమీపమున జలాశయము లేకుండుటచేఁ జాలదూరము పోవలసి వచ్చినందునఁ గొంత తడవాయెను. ఇంతలో నిచట నాగురువునకుఁ గాలము సమాప్తమగుటచేఁ బ్రాణము విడుచునపుడు తన శిష్యునిందలంచి యతఁడు తనకు నింత కాల మెడతెగని భక్తిశ్రద్ధలతో నాశ్రయించిన వాఁడగుటచే నతనికి వ్యర్థపుచ్చఁగూడదని తలంచినవాఁడై తా నాశిష్యున కుపదేశింపఁదలంచిన వాక్యములను దన సమీపమున నేలమీఁద వ్రేలితో వ్రాసి దాని సమీపమున గాడిదలను బందులను మేపుకొనుచుండిన యొక దొమ్మరిదానికిం జూపి తన శిష్యుఁడు వచ్చినపుడాతనికి దానిం గనఁబఱుపు మని చెప్పి ప్రాణము విడిచెను. అంత నాదొమ్మరిది యాయక్షరములు గాలికిఁ జెడిపోవునేమో యని తలఁచి వాని నొక తాటియాకుపై నొక ముల్లుతో లిఖించి యానేలను వ్రాసియుండు నక్షరములఁ జెఱిపివేసి యాతాటియాకు నొక కమ్మగాఁ జుట్టి తనచెవిని బెట్టుకొనెను. ఇంతలో నాశిష్యుఁడు జలమునుగొనివచ్చి మృతుఁడై యుండిన గురువును జూచి మిగుల శోకింపుచు నాదొమ్మరిదానివలన నదివఱకు జరిగిన వృత్తాంతము నెఱిఁగినవాఁడై యాతాటియాకు కమ్మను దనకిమ్మని మిగుల నాతురతతో నడిగెను. అట్టి యాతని యాతురతనుజూచి యాదొమ్మరిది కొంత కాల మతనిచేఁ బరిచర్యలఁ జేయించుకొనఁ దలఁచి యాకమ్మ నతనికివ్వక కాలముజరపుచు నతనిచేఁ దనగాడిదలు మొదలగు వానిని మేపించుకొనుచు వచ్చెను. అతఁడును నెట్లైన దాని యనుగ్రహము వడసి దాని చెవినుండు గురువాక్య లిఖితమగు కమ్మను బడయఁగోరి తనగురువునెట్లు భక్తిశ్రద్ధలతో నాశ్రయించుచువచ్చెనో యట్టి భక్తిశ్రద్ధలతోడనే దాని నాశ్రయించి యది చెప్పిన పనులెల్లఁజేయుచు వెసలికపాటు గలిగినపుడు గ్రామములకుఁబోయి బ్రాహ్మణగృహములయందు భిక్షఁగొనుచు దక్కిన కాల మంతయు దానినే యాశ్రయించుచు నది యెక్కడికిఁబోయిన నక్కడికిఁ బోవుచు దాని చెవినుండు కమ్మయందే గుఱియుంచి దాని వెంబడిఁ దిరుగుచు వచ్చెను. ఇట్లు చాల కాలము జరుగఁగా నొక నాఁడా దొమ్మరిగుంపు ధర్మరాజు సేయుచుండెడు రాజసూయయాగశాలల కనతి దూరంబున విడిసియుండ నచ్చట నీ విప్రవరుం డాదొమ్మరిదాని యాజ్ఞానుసారముగ గాడిదలను బందులను మేపుచుండి క్షుద్బాధచే మిగులఁ బీడితుఁ డగుటంజేసి తత్సమీపంబున

నుండెడు యాగశాలాసంబంధమగు వంటసాలలోనుండి ప్రవహించుచుండెడు గంజికాలువనుజూచి దానిలోనుండి నాల్గుదోసిళ్ళ గంజి నెత్తుకొని త్రాగెను. అప్పుడా యజ్ఞశాలయందు లక్షబ్రాహ్మణ్య సంతర్పణకు నొకమాటు తనంతట మ్రోగునట్లుగా నేర్పఱుపఁబడి కట్టియుండెడు గంట విడువక మ్రోగసాగెను. అదివిని మీయన్నయగు ధర్మరా జిన్ని లక్షల బ్రాహ్మణ్యమున కేక కాలమున నెట్లు సంతర్పణ జరిగెనని యాశ్చర్యపడుచుండఁగా నే నందలి నిజస్థితి నెఱిఁగియున్న వాఁడను గనుక నావిషయమును గుఱించి నిదానముగ విచారింతమని యాయనకప్పుడు సమాధానము చెప్పి పిదప నాదొమ్మరిదానిచే గడమీఁద నాడించి వేడుకఁ జూచునటుల ధర్మరాజును ప్రేరేపింపఁగా నతఁడట్లా దొమ్మరిదానినాడ నుత్తరువుచేసెను. ఆ దొమ్మరిది మిగుల నుత్సాహముతోఁ దనసామర్థ్యమునంతయు నాసభికులకుఁ గనఁబఱుపఁదలఁచి గడపై నాడుచుండునప్పు డదివఱకు నందుకుఁగాఁ జెప్పించియుంచిన జోడుబంగారుకమ్మల నెగురవేసి యాకమ్మల గడపై నాడుచునే యందుకొని చెవులను ధరింపవలసినదని యుత్తరువు చేయఁగా నది యట్లనె యందుకొని తనచెవుల నదివఱకుండిన తాటియాకుకమ్మల నూడఁదీసి క్రిందఁబాఱవైచి యాబంగారుకమ్మలను ధరించెను. అట్లు పాఱవేసిన వెంటనే యచ్చట దానితోఁగూడ వచ్చి కనిపెట్టియుండిన యావిప్రుఁడా క్రిందఁబడిన తాటియాకు కమ్మలలోఁ దన గురూపదేశవాక్యము వ్రాయఁబడియున్న కమ్మనెత్తుకొని వెళ్ళిపోయెను. ఈవిషయమును నేనుదప్ప మఱెవరును గమనించినవారుగారు. అంతట నామఱునాటి యుదయమున నేను ధర్మరాజు నేదో యొకమిషమీఁద వెంటఁదీసికొని పాదచారులమై యాసమీపమునయుండెడు నదీతీరమున విలాసార్థముగ విహారింపుచుండఁగా నచట నీబ్రాహ్మణుఁడు తన గురూపదేశవాక్యము వ్రాయఁబడియుండు తాటియాకుకమ్మను విప్ప చేతఁబట్టికొని కూర్చుండియుండుటను మే ముభయులము చూచినవారలమై యాసమీపమునకు బోయి పరికించిచూడఁగా నతఁడు నిర్జీవిగానుండెను. అదిచూచి మిగుల నాశ్చర్యపడుచుండఁగా నపుడు నేనాబ్రాహ్మణుని వృత్తాంతమంతయు నతనికిఁ దెలియపఱచి యీబ్రాహ్మణుఁడే యింతకుముందటి రోజున యజ్ఞశాలాసమీపమందుఁ బాఱుచుండిన గంజికాలువలోని గంజినాల్గు దోసిళ్ళు త్రాగెననియు, నప్పుడతఁడు త్రాగిన గంజిలో నెన్ని బిందువులుండెనో యన్నిలక్షల బ్రాహ్మణ్యమునకు సంతర్పణజరిగిన దానితో సమమయ్యెననియు, నందువలన నాగంట విడువక యన్నిసార్లు మ్రోగెననియు, నాబ్రాహ్మణునకిట్టిమాహాత్మ్యమాతనికి గురువునెడలఁ గలిగియుండిన భక్తివలనను, ఆగురూపదేశవాక్యములభింపఁజేసికొనుటయందుఁ గలిగిన శ్రద్ధవలనను గలిగినదనియు, నట్టిశ్రద్ధవలననే యతనికా

వాక్యము లభించిన వెంటనే యతనియందుండెడి యాత్మలేచిపోయి పరమాత్మతో నైక్యమయ్యెననియుఁ దెలియఁజెప్పితిని. అందుపైని ధర్మరాజాకళేబరమునకు నగ్ని సంస్కారాదిక్రియలను విధ్యుక్తముగ జరిగించెను. కాన నోయియర్జునా! దీనివలన శిష్యునకు గురువునందుండవలసిన భక్తియిట్టిదనియు, నాగురూపదేశమును బొందుట యందుండవలసిన శ్రద్ధయిట్టిదనియు, నట్టిశ్రద్ధవలనఁగలిగెడు నిశ్చయజ్ఞానమిట్టిదనియు నట్టిజ్ఞానమువలనఁగలిగెడు పర్యవసానమిట్టిదనియు నెఱుఁగవలయు.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥ 40

అర్థము:- అజ్ఞః + చ = (గురూపదిష్టవాక్యార్థమును) తెలిసికొనఁజాలని వాఁడునై, అశ్రద్దధానః + చ = (గురువుచెప్పెడు వాక్యములను) శ్రద్ధతోవినని వాడునునై, సంశయాత్మా = (గురువుచెప్పెడువాక్యార్థమునందు) సందేహముతోఁ గూడినమనస్సుగలవాఁడు, వినస్యతి = నశింపుచున్నాఁడు. సంశయాత్మనః = (అట్లు) సంశయముతోఁగూడినమనస్సుగలవానికి, అయమ్ + లోకః = ఈలోకము, న = లేదు, పరః = పరలోకము, న = లేదు, సుఖమ్ + చ = సుఖమును, న + అస్తి = కలుగదు.

ఓయియర్జునా! ఆత్మజ్ఞానము సంపాదించుటయందును, తదర్థమైయాశ్రయింపఁబడుగురువునెడలను భక్తిశ్రద్ధలుగల వానికే జ్ఞానోదయమగునని యిదివఱకు (చూ. 4-39) చెప్పితినిగదా. అట్లు జ్ఞానమును సంపాదింపవలెనెడు ప్రాణికియు, గురువు నెడల భక్తిశ్రద్ధలను లేనివాఁడును, గురువుచేసెడు నుపదేశవాక్యార్థములయందు నమ్మకములేనివాఁడునునైనయెడల నట్టివానికి జ్ఞానోదయముగానేరదు గనుక వాఁడు నశించును. అనఁగా నట్టివానికి నిహపరముల రెంటియందును సుఖము గలుగనేరదనుట. ఇందునకు నిదర్శనముగ నొకకథగలదు దానిం జెప్పెదవినుము. పూర్వమొకసమయమునఁ బార్వతీదేవి పరమేశ్వరునిగూర్చి స్వామీ! "శ్లో॥ శ్రీశైలే శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అని చెప్పుదురు గదా? ప్రతిసంవత్సరము వేలకొలఁది జనులు శ్రీశైలయాత్రకుఁ బోవుచుందురే యాశిఖరదర్శనముచేసిన మాత్రముననే వారలందఱు పునర్జన్మము నొందక ముక్తులగుదురా? యని ప్రశ్నచేయఁగాఁ బరమేశ్వరు డిట్లనియె. "ఓపార్వతి! అట్లు ముక్తులగు వారెవ్వరో నీకుఁ గనఁబఱచెద రమ్మ"ని శివరాత్రికి వేలకొలఁది స్త్రీపురుషులు శ్రీశైలయాత్రకుఁ బోవుచుండఁగా మనమిరువురము వృద్ధ బ్రాహ్మణ దంపతులమై యాదారిని శ్రీశైలశిఖరము కనఁబడునంత దూరముననుండు నొకపాడుబావిలో నేను బడియుండెదను. నీవా బావియొద్దున నేడ్చుచుఁగూర్చుండి

యాదారినిబోవువారల నందఱిని "బావిలోఁబడియుండు నాభర్తను లేవఁదీసిపొండు మీకుఁబుణ్యముఁగలుగున"ని యడుగుచుండుము అట్లడుగఁగా లేవఁదీయఁబూని వచ్చిన వారితో "నీవేమైనఁ బాపముచేసియుంటివేని నాభర్తను దాఁకఁగూడద"ని చెప్పుచుండుము. అప్పుడు ముక్తులగు వారెవ్వరో నీకుఁ దెలియును" అని యట్లిరువురు వృద్ధబ్రాహ్మణదంపతులై యాదారియందుండు పాడుబావిలోఁ బడి తాను, ఆబావియొద్దున నాభర్తను లేవఁదీయుఁడని యేడ్చుచు నావృద్ధముత్తైదువయునుండిరి. అట్లుండి యాదారిని శ్రీశైలయాత్రకుఁబోయెడు వారలనందఱిని నావృద్ధముత్తైదువ యీబావిలోబడియుండెడు నాభర్తను లేవఁదీయుఁడని యేడ్చుచు నడుగుచుండఁగా లేవఁదీయవచ్చిన వారితోనెల్ల నీవేమైనఁ బాపముఁజేసియుంటివేని నాభర్తనుదాఁకఁ గూడదనిచెప్పఁగా నంతట వారెల్ల నేనేమాత్రమైనఁ బాపముచేసియే యుందునని చెప్పఁగా నీవు తాఁకఁగూడదు. పొమ్మనిచెప్పుచుండును. ఇట్లువచ్చిన వారందఱును లేవఁదీయకయే వెళ్ళుచుండిరి. ఇట్లుండఁగాఁ గొంతసేపటికి నొకవేశ్యకాంత యనేక కుటుంబములనుముంచి వారలద్రవ్యమంతయుఁ గడించి మహాపాపియైయుండి తానును గడతేఱవలెనని యాశివరాత్రిరోజున శ్రీశైలయాత్రకుఁబోవుచుండి దారిలో నాబావి యొద్దున నాభర్తను లేవఁదీయుఁడని యేడ్చుచుండిన వృద్ధముత్తైదువయొక్క కంఠధ్వనినివిని లేవఁదీయరాఁగా నీవేమైనఁబాపముఁ జేసియుందువేని నాభర్తను దాఁకఁ గూడదని చెప్పఁగా నావేశ్య నాకు శ్రీశైల శిఖరదర్శనమాయెనే నా కెక్కడిది పాపము? నాపాపమంతయుఁ బరిహారమయ్యెనని చెప్పుచు నావృద్ధబ్రాహ్మణునకుఁ దనచేతి నందిచ్చి లేవఁదీసి యొడ్డునఁ జేర్చివెళ్లెను. అంతటఁ బరమేశ్వరుఁడు "ఓపార్వతీ! చూచితివా? ఈయాత్రకువచ్చిన వేలకొలఁది జనులలో నీవేశ్యకొక్కతెకే శ్రీశైలశిఖరదర్శనమువలనఁ బునర్జన్మ లేదనియెడు నిస్సంశయమైన నమ్మకము గలిగి యున్నది. కాన నీవేశ్య యొక్కతెయె తన పాపములన్నియు నశించి ముక్తురాలు కాఁగలదు" అని పరమేశ్వరుఁడు చెప్పఁగాఁ బార్వతీదేవి విని మిగుల నాశ్చర్యపడినదాయెను. కాఁబట్టి యోయియర్జునా! ఎవఁడైతే భగవద్విషయమును గుఱించిన శాస్త్రోక్త వాక్యములనుగాని, గురూపదిష్ట వాక్యములనుగాని యిట్టి, అనఁగాఁ బైఁ జెప్పఁబడిన వేశ్యయొక్క నమ్మకమువంటిదృఢమైనట్టియు సంశయరహితమైనట్టియు బుద్ధితో నమ్ముచున్నాఁడో యట్టివాఁడా గట్టి నమ్మకమువలన నదివఱ కెట్టి పాపములెన్ని చేసియుండినను నవియన్నియు నశించి కృతార్థుఁడు గాఁగలఁడు గాని, అట్టి నమ్మకములో నేమాత్రము చాంచల్యముగాని సంశయముగాని కలిగియుండిన యెడల నట్టివాఁడు కడతేఱఁ జాలఁడు.

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్నసంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ! ॥ 41

అర్థము :- హేధనఞ్జయ ! = ఓయర్జునా !, యోగసన్న్యస్తకర్మాణమ్ = నిష్కామ కర్మయోగముచేత విడువఁబడిన కర్మఫలములు గలవాడును, జ్ఞానసఞ్ఛిన్న సంశయమ్ = జ్ఞానోదయమగుటచేఁ దెగఁగొట్టఁబడిన సంశయము గలవాఁడును నైనఁ ఆత్మవన్తమ్ = ఆత్మజ్ఞానిని, కర్మాణి = కర్మములు, న + నిబధ్నన్తి = బంధింపవు.

ఓయియర్జునా ! గురూపదిష్ట వాక్యముల యందు శ్రద్ధలేక సంశయము గలిగి యజ్ఞుఁడుగానుండు వానికి నిహపరములు రెండును లేవని చెప్పితినిగదా. (చూ.4-40) అట్లుగాక యాత్మజ్ఞానముగలవాఁడును, సంశయరహితుఁడునునై, నిష్కామ కర్మ యోగముచేత విడువఁబడిన కర్మఫలములు గలవానిని దానుజేసెడు కర్మల యొక్క ఫలములగు పుణ్యాపాపము లంటనేరవు గనుక నట్టివానికి నిహమునందును బరము నందును సుఖము గలుగును.

శ్లో॥ తస్మాదజ్ఞానసమ్భూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత ! ॥ 42

అర్థము :- తస్మాత్ = కాఁబట్టి (అనఁగా జ్ఞానముచేఁ బోగొట్టఁబడిన సంశ యము గలవాఁడు కర్మబద్ధుఁడుగాఁడు గనుక), హేభారత = ఓయియర్జునా !, ఆత్మనః = నీయొక్క, హృత్స్థమ్ = హృద్గతమైనదియు, అజ్ఞాన సమ్భూతమ్ = అజ్ఞానము వలనఁ గలిగినదియు నగు, ఏనమ్ + సంశయమ్ = ఈ సంశయమును, జ్ఞానాసినా = జ్ఞానమనెడు కత్తిచేత, ఛిత్త్వా = ఛేదించి, యోగమ్ = నిష్కామ కర్మానుష్ఠానమును, ఆతిష్ఠ = ఆచరింపుము, ఉత్తిష్ఠ = (యుద్ధమునకు) లెమ్ము.

ఓయియర్జునా ! సంశయాత్మకుఁడగు నజ్ఞునకు నిహపరములు లేవనియు (చూ. 4 – 40) అట్టి సంశయ రహితుఁడగు జ్ఞానికిఁ గర్మ బంధములు లేవనియు (చూ. 4 – 41) చెప్పితినిగదా, అట్లగుటవలన నిప్పుడు నీకుఁ గలిగియుండెడు సంశ యము, అనఁగా బంధుజనవధారూపకమగు యుద్ధమును జేయవచ్చునా చేయఁగూడదా యనెడు సందేహ మజ్ఞానజన్యములగు శోకమోహాదులవలనఁ గలిగినదిగా నుంచున్నది. ఇట్లజ్ఞానమువలనఁ గలిగిన దని నీవే యొప్పుకొన్నవాఁడవై యట్టి యజ్ఞానము తొలఁగు నట్లు చేయుమని నన్ను గురువుఁగభావించి నీవు శిష్యత్వము వహించి యుపదేశముఁ గోరియుంటివిగదా. (చూ. 2 – 7) కాన గురువును శిష్యుఁడే ప్రకారి మనువర్తింప వలసినదియు, గురూపదిష్ట వాక్యమునందు శిష్యుఁడెట్టి నమ్మక ముంచవలసినదియు,

నింతవఱకు విపులముగఁ జెప్పియుంటిని గదా, (చూ. 4 - 39 - 40 - 41). కనుక శిష్యుఁడవగు నీకు గురుఁడనగు నేను జెప్పెడు వాక్యమును గట్టిగనమ్మవలసినది. అట్లు నమ్మినయెడల నీ కిదివఱకు నజ్ఞానముచేఁ గలిగియుండెడు నీసంశయము విడిచిపోయి జ్ఞానోదయము గాఁగలదు. అట్టి జ్ఞానమనెడు కత్తిచే ఛేదింపఁబడిన సంశయము గలవాఁడవై కర్మఫలాసక్తిని విడిచి, అనఁగా నిదివఱకు నేఁ జెప్పియుండు ప్రకారము ద్వంద్వములగు సుఖదుఃఖములు, లాభనష్టములు జయాపజయములు మొదలగు వాని యందు సమబుద్ధిగలవాఁడవై (చూ. 2 - 38) యుద్ధముఁ జేసినయెడల నీకుఁ బుణ్యపాపము లెవ్వియు నంటనేరవు, గానయుద్ధమునకుఁ లెమ్ము.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే జ్ఞానయోగో నామ చతుర్థోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు వ్యాజమున
లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుపనిషదర్థ ప్రతిపాదకం బగు
భగవద్గీతా శాస్త్రము నందలి జ్ఞానయోగంబను
చతుర్థాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భితభావబోధిని



## పంచమాధ్యాయము



## కర్మసన్న్యాసయోగము

**అర్జున ఉవాచ :**

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ ! పునర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1

అర్థము:— హేకృష్ణ ! = ఓకృష్ణమూర్తీ ! కర్మణామ్ = కర్మములయొక్క, సన్న్యాసమ్ = పరిత్యాగమును; పునః = మరల; యోగమ్ + చ = ఆచరణయోగమును; శంససి = చెప్పుచున్నావు. ఏతయోః = ఈరెంటిలోపల: యత్ = ఏది; శ్రేయః = శ్రేష్ఠమైనదిగా; (త్వయా) = (నీచేత): సునిశ్చితమ్ = చక్కఁగానిశ్చయింపఁబడుచున్నదో; తత్ = అట్టి: ఏకమ్ = ఒక్కదానిని; మే = నాకు; బ్రూహి = చెప్పుము.

### సంభాషణ

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ ! నీవొకప్పుడు సన్న్యాసము, అనఁగా, కర్మపరిత్యాగము మిగుల శ్రేష్ఠమైనదని చెప్పుచున్నావు. మఱియొకప్పుడు యోగము, అనఁగా, నిష్కామకర్మాచరణము శ్రేష్ఠమైనదని చెప్పుచున్నావు. నీవిట్లు చెప్పుటవలన నీరెంటిలో నేది శ్రేష్ఠతరమైనదియుఁ దెలిసికొనఁజాలకున్నాను. కాన నీరెంటిలో నేది శ్రేష్ఠతరమైనదియో దానిని నీవే నిశ్చయించి నాకుఁ జెప్పుము.

**శ్రీభగవానువాచ :**

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥ 2

అర్థము:— సన్న్యాసః = కర్మపరిత్యాగమును, కర్మయోగః + చ = కర్మాచరణయోగమును, ఉభౌ = (ఈ) రెండును, నిఃశ్రేయసకరౌ = మేలైనవి, తయోః = ఆరెంటిలో, కర్మయోగః + తు = కర్మాచరణ యోగమైతేనో, కర్మసన్న్యాసాత్ = కర్మపరిత్యాగముకంటె, విశిష్యతే = శ్రేష్ఠమైనదగుచున్నది.

కృ — ఓయి యర్జునా! కర్మసన్న్యాసమును గర్మానుష్ఠానమును, ఈరెండు మార్గములును మోక్షమునకు సాధకములుగానే యుంచున్నవి. అయినను నీరెండు మార్గములలోఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మానుష్ఠానమే శ్రేష్ఠతరమైనదిగా నుంచున్నది.

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే॥ 3

అర్థము:— హేమహాబాహో = ఓ యర్జునా! యః = ఎవఁడు, నిర్ద్వన్ద్వః + (సన్) = సుఖదుఃఖాది ద్వంద్వరహితుఁడగుచు, న + కాంక్షతి = (దేనియందును) కోరికలేకయుంచున్నాఁడో. న + ద్వేష్టి = (దేనియందును) ద్వేషములేకయుంచున్నాఁడో, సః = వాఁడు, నిత్యసన్న్యాసీ = ఎప్పుడును గర్మపరిత్యాగముచేసినవాఁడు, (ఇతి) = (అని), జ్ఞేయః = ఎఱుఁగఁబడఁదగినవాఁడు, (సః) = అట్టివాఁడు, బన్ధాత్ = (సంసార) బంధమునుండి, సుఖమ్ = సులభముగా, ప్రముచ్యతే = విడువఁబడుచున్నాఁడు.

ఏలయనఁగా నీలోకమునందే పురుషుఁడైనను గర్మబంధమునుండి విముక్తుఁడైననేగాని మోక్షమున కర్హుఁడుగా నేరఁడుగదా? అట్టికర్మబంధవిముక్తి, ద్వంద్వసహిష్ణుత్వము, అనఁగా సుఖదుఃఖాది ద్వంద్వములయందు సమబుద్ధి గలిగియుండుటవలననేగాని కలుగనేరముగదా. అట్టి ద్వంద్వసహిష్ణుత్వము రాగద్వేషరహితునకేగాని తదితరులకుఁ గలుగనేరదు. కనుక నెవడైతే అట్టిరాగద్వేషములులేని వాఁడుగ నుంచున్నాఁడో, అనగా, నొకటిని ద్వేషించుటయు, నొకటిని గాంక్షించుటయు లేకయుంచున్నాడో, అట్టివాఁడే నిజమైన సన్న్యాసి యనిపించుకొనుచున్నాఁడు గాని అట్టి రాగద్వేషములుఁవిడువకయే, గర్మపరిత్యాగము చేసినంతమాత్రముచేతనే సన్న్యాసి గానేరఁడు సరేగదా, కర్మానుష్ఠానము చేయుచుండినను అట్టి రాగద్వేషరహితుఁడుగానుండువాఁడు సన్న్యాసిగాక యుండుటయును లేదు. ఇంతటికిని ఫలితార్థమేమనఁగా, కర్మపరిత్యాగముచేసినవాఁడైనను సరే — లేక కర్మానుష్ఠానపరుఁడైనను సరే రాగద్వేషరహితుఁడుగా నుండినయెడల నట్టివాఁడే సన్న్యాసియనియు, అట్టి

రాగద్వేష రహితుఁడుగానుండనివాఁడు కర్మనాచరింపక పోయినను సన్న్యాసి కానేరఁడనియు నెఱుంగవలయును.

శ్లో॥ సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః।
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విన్దతే ఫలమ్॥ 4

అర్థము:— బాలాః = మూఢులు, సాఙ్ఖ్యయోగౌ = కర్మసన్న్యాస, కర్మానుష్ఠాన యోగములను, పృథక్ = భిన్నముగా (వేఱైనవానినిగా), ప్రవదన్తి = చెప్పుచున్నారు, పణ్డితాః = జ్ఞానులు, న+(ప్రవదన్తి) = (అట్లు) చెప్పరు, ఉభయోః = (అకర్మసన్న్యాస, కర్మానుష్ఠానయోగములు) రెండింటిలో, ఏకమ్+అపి = ఒకదానినైనను, సమ్యక్ = చక్కఁగా, అస్థితః = ఆచరించినవాఁడు, ఫలమ్ = ఫలమును (మోక్షమును), విన్దతే = పొందుచున్నాఁడు.

కనుకనే

"క. విను సాంఖ్యసమజ్ఞానం
బును యోగసమానబలము భూవర లే వెం
దును నవి రెండును వేఱుగఁ
గను బాలిశుఁ డొక్కఁ డెఱుఁగ నవి నెగడున్"

(భార. శాంతి. ౬. ఆ. ౧౧౨.)

అనునట్లు కర్మ సన్న్యాసరూపకమగు సాంఖ్యమును, కర్మానుష్ఠానరూపకమగు యోగమును, ప్రత్యేకమైనవిగ నజ్ఞానులు చెప్పుదురే కాని జ్ఞానులు చెప్పరు. ఏలయనఁగా,

"'తే. అనఘ యింద్రియముల విషయములమీఁద
నిగుడనీక మనంబుతో మగుడఁ దిగిచి
యాత్మఁ గూర్చుట సాంఖ్యులయనువు సాంఖ్య
యోగములు రెండు నారయ నొక్క టెఱుఁగ"

"క. ఈ రెండు ప్రకారంబుల
వారలకును మమత విడువవలయుట సరి ని
స్సారపు సంసారమునకుఁ
గారణము మమత్వమగుట గవిజనముఖ్యా"

(భార. శాంతి. ౫. ఆ ౯౭, ౯౮.)

అనునట్లు, ఇంద్రియములను విషయములమీఁదఁ బ్రవర్తింపనీక మరలించుచు నాత్మావలోకనము చేయుటయే కర్మముల సన్న్యసించిన సాంఖ్యులయొక్క పనిగా నుంచున్నది. ఇదియే కర్మానుష్ఠానపరులగు యోగులుగూడఁజేయవలసిన పనిగా

నుంచున్నది. ఇంతియగాక సంసారహేతుభూతమగు మమకారము నీయుభయులును విడువవలసిన వారుగనే యుంచున్నారు. కాని నీయుభయులకును భేదములేదని పండితులు చెప్పుటకుఁ గారణమైనది. పామరులన్ననో, ఇట్టి వీరి యోగ్యతను, అనఁగా, చిత్తశుద్ధిని నెఱుఁగదగినవారుగారు గనుకఁ గర్మను బరిత్యజించినవారిని సాంఖ్యులనియుఁ, గర్మ ననుష్ఠించువారిని యోగులనియును, వారికిని వీరికిని భేదము గలదనియు నెంచుదురు. ఇంతియెగాని వారిచిత్తవృత్తినిఁబట్టి యాలోచించిన యెడల నాయుభయులకును భేదములేదనియే చెప్పఁదగియుంచున్నది. ఏలయనఁగా; కర్మ ననుష్ఠించువాఁడుగాని లేక త్యజించువాఁడుగాని యిదివఱకుఁ జెప్పఁబడిన ప్రకార మింద్రియనిగ్రహముఁగలిగి రాగద్వేషరహితులై యుండినయెడల నట్టివా రుభయులును మోక్షమునే పొందుచున్నారు. అదియే వారలకు ఫలముగా నుంచున్నది.

శ్లో॥ యత్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానమ్ తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాఙ్ఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ 5

అర్థము:— యత్ = ఏ, స్థానమ్ = మోక్షస్థానము, సాఙ్ఖ్యైః = సాంఖ్యులచేత (సన్న్యాసులచేత), ప్రాప్యతే = పొందఁబడుచున్నదో, తత్ = అది (ఆమోక్షస్థానము), యోగైః + అపి = కర్మయోగులచేతను, గమ్యతే = పొందఁబడుచున్నది, యః = ఎవఁడు, సాఙ్ఖ్యమ్ + చ = కర్మసన్న్యాసయోగమును, యోగమ్ + చ = కర్మానుష్ఠానయోగమును, ఏకమ్ = అభేదముగా, పశ్యతి = చూచుచున్నాఁడో, సః = వాఁడు, పశ్యతి = (తత్త్వమును) తెలిసినవాఁడగుచున్నాఁడు.

అనఁగా, సాంఖ్యులచేఁ బొందఁబడదగిన స్థానమేదియో యదియే యోగులచేతను బొందఁబడఁదగినదై యుంచున్నది. కాన

" ఆ. యోగిచూచు భంగి సుర్వీశ సాంఖ్యుఁడుఁ
జూచు సాంఖ్యుఁ డరయుచొప్పుయోగి
వరుఁడు నరయుఁగాన వారిద్దఱును
నొక్క తెరవువార లండ్రు పరమమునులు"

" క వినుసాంఖ్యమ్మును యోగము
నను పేళ్ళవి కాని దీనియందదియును దా
న నిదియుఁ దోఁచుచునుండుం
గనుఁ దత్త్వవిచారి యొకఁడె కా నీ రెంటిన్."

(భాగ. శాంతి. ౫. ఆ ౨౦౫, ౨౦౬.)

అనునట్లు యోగిపలె సాంఖ్యుఁడును, సాంఖ్యునివలెయోగియు నాత్మావలోక నము చేయువారనియు, వారుభయులు నవలంబించు మార్గమొక్కటేయనియు, నాయుభయులకును నామములయందును, బాహ్యవృత్తియందును మాత్రమే భేదము గాని చిత్తవృత్తియందు భేదములేదనియును, కనుక సాంఖ్యమన్నను, యోగమన్నను నొకటియేగాని భేదమైనవి గావనియు నెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే తత్త్వవేత్త యనఁబడును.

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! ఇపుడు నీవుచెప్పిన విషయమును బట్టిచూడఁగా సాంఖ్యుఁడును (కర్మసన్న్యాసియును), యోగియును (కర్మానుష్ఠానపరుఁడును), ఇంద్రియ నిగ్రహమునందును రాగద్వేషరాహిత్యమునందును, సమానులుగనుక వార లకు భేదములేదనియును వారుభయులు నొకటేఫలమును, అనఁగా, మోక్షమును జెందఁగలరనియును నేర్పడుచున్నది గదా? అట్లైన యెడల, పైఁ జెప్పఁబడిన యింద్రియ నిగ్రహాదిలక్షణములు గలవాఁడు, కాయక్లేశకారణమగు యోగము నాచ రించుటకంటె నట్టి కాయక్లేశముతో నిమిత్తములేని సన్న్యాసము నవలంబించుటయే సుఖతరమైయుండఁగా, అట్లుచెప్పక, "తయోస్తుకర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే" కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే మేలని చెప్పుటకుఁ గారణమేమి?

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తు మయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి॥ 6

అర్థము :— హే మహాబాహో = ఆజాను బాహుఁడవగు నో యర్జునా! సన్న్యాసః+తు = కర్మసన్న్యాస యోగము (నైష్కర్మ్యసిద్ధి) అయితేనో, అయోగతః = కర్మానుష్ఠానము లేకయే, ఆప్తుమ్ = పొందుటకొఱకు, దుఃఖమ్ = కష్టము (అసాధ్యమైనది), యోగయుక్తః = కర్మానుష్ఠానపరుఁడగు, మునిః=మనన శీలుఁడు, బ్రహ్మ = బ్రహ్మపదమును (మోక్షమును), న+చిరేణ = శీఘ్రముగా, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

కృ — ఓయియర్జునా! కర్మనాచరించుటకంటె సన్న్యసించియుండుటయే సుఖతరమని నీతలంచుచున్నావు కాఁబోలును; అట్లెంతమాత్ర మెంచఁదగదు. కర్మను సన్న్యసించియుండుటయే మిగులఁ గష్టతరమని యెఱుంగుము. అదెట్లనఁగా, కర్మను సన్న్యసించువాఁడెట్లుండవలెననఁగా

"క. శాకకణమూలఫలపి
ణ్యాకాదుల భైక్ష మైనయన్నంబున ని

శ్లోకత నాఁకలి వుచ్చుచు
లోకాలోకంబున నచలుఁడు గావలయున్."

(భార. శాంతి ౪. అ. ౩౧౬.)

అనుసట్లు, వనమునందలి కందమూలఫలాదులైనను, లేక, గృహస్థులిచ్చెడు భిక్షాన్నమైనను దిని, యవి యెట్టి రుచికరములైన వైనను సరే, యెంతకొద్దియైనను సరే, దానిచే నాకఁలిదీర్చికొనుచు, పంచభక్ష్యపరమాన్నములు భుజించినవానివలెఁ దృప్తినొందుచుండవలయును. స్త్రీసాంగత్యము మొదలగు విషయవాంఛలు వాని మనస్సున నెప్పుడు నంకురింపకయే యుండవలయును. ఎవనిమనస్సైనతే యట్టి పరిపాక దశను బొందుచున్నదో వాఁడే నిజమైన సన్న్యాసియగును గాని, కాషాయ దండ కమండలాదిచిహ్నములను ధరించినంతమాత్రముచేతనే సన్న్యాసిగానేరఁడు. అదెట్లనఁగా

"ఆ. కీడు గని యొకండు గృహధర్మముడిగి స
మాశ్రయించు నాశ్రమాంతరంబు
దాన సంగ ముడుగఁగా నేరదది యొల్ల
మియును వలపుగాన మీనవయన."

"క. దండము గాషాయంబును
ముండితయుఁ గమండలువును మోక్షమొసఁగ నె
ట్లుం డేని లింగములకు న
ఖండజ్ఞానప్రదత్వకలనము గలదే!"

"ఆ. జ్ఞానమునన కాని మానిని లింగమా
త్రమున ముక్తి యగునె రాజ్యబంధ
రాగబంధనిఖిలభోగబంధములఁ బ్ర
జ్ఞానిఁ దునిమినాఁడ నది గతముగ."

(భార. శాంతి. ౬. అ. ౧౭౭. ౧౭౮. ౧౮౦.)

అని జనకచక్రవర్తి సులభయను యోగినితోఁ జెప్పినట్లు, ఒకఁడు జ్ఞానోదయము కాకయే యేదియో యొక గృహచ్ఛిద్రమువలనఁ దనగృహస్థధర్మమును విడిచి జుట్టుగొఱిగించుకొని కాషాయదండకమండలాది చిహ్నముల ధరించినంత మాత్రము చేతనే యట్టి చిహ్నములవలన వానికి జ్ఞానము కలుగునా? కలుగనేరదు గదా? అట్టి జ్ఞానము గలిగిననే గాని, లేనియెడల నాచిహ్నములవలన వానికి ముక్తి గలుగ నేరదుగదా? అట్టిగృహచ్ఛిద్రాది కారణము లెవ్వియు లేకయే సహజమైన విరక్తి

గలుగుట యరుదుగదా; అయితే, అట్టివిరక్తి యెట్లుగలుగునంటివేని; యోగము వలన, అనఁగా నిష్కామ కర్మాచరణము వలననేగాని యితరోపాయముల వలనఁ గలుగనేరదు. ఆ నిష్కామకర్మయోగమన్ననో, యిట్టికష్టతరమైనది కాదు. మఱెట్టిదనిన, నేపురుషుఁడైన నింద్రియ నిగ్రహుఁడై తన కులాచార ధర్మములను యథావిధిగ ననుష్ఠింపుచునే యాచరింపఁ దగినదిగా నుంచున్నది. అదెట్లనిన

“క॥ విను దేవతాప్రసాదం
బున నిర్మలయోగతంత్రములు పనుపడు న
య్యనువున నిశ్చలమతి ని
ల్చునది శిథిలతాన్నపానసుఖతృష్ణుండై.” (భార. శాంతి. ౪ఆ. ౩౧౫)

అనునట్లు, అట్టివాడుగృహస్థాశ్రయమునందుండి పైఁజెప్పఁబడినసన్న్యాసివలెఁ గందమూలాదులచే గాక, తనయింటఁ దనయిష్టానుసారముగఁ బచనము చేయఁబడి దేవతానివేదనము చేయఁబడిన మృష్టాన్నమును భుజింపుచు, నందువలన సుఖముగాఁ దృప్తిఁబొందింపఁబడిన క్షుత్పిపాసలుఁ గలవాఁ డగుచుండుటయేగాక, యెప్పుడైన స్త్రీ వాంఛ పొడమినయెడల దానిని దనభార్యవలనఁ దీర్చికొనుచుఁ దన కావశ్యకముగఁ గావలసిన యితర విషయముల నన్నిటిని బుత్రమిత్ర కళత్రాదుల వలనను, బహుభృత్య నికరంబుల వలనను, న్యాయార్జితంబులగు ధనధాన్యాదికముల వలనను, నెఱవేర్చికొనుచు, సుఖముగ జీవించుచు నాచరింపఁ గలఁడు. కాన నిట్టి కర్మయోగము నాచరించుచునే క్రమక్రమముగ విరక్తి హెచ్చి సన్న్యసించుట మేలుగాని, అట్టిజనిమైన విరక్తి కలుగకమునుపు సన్న్యసించుట కష్టసాధ్యము. కనుక నోయర్జునా! ;

“క॥ జననజరామృత్యుభయం
బున యోగమమేతసాంఖ్యముం దిరముగ నూఁ
దినయతులు నిర్మమత్వం
బునఁ బహుయుదు రప్పదంబుపొం దచలముగన్ ॥”

(భార. శాంతి. ౬ఆ, ౧౫౭)

అనునట్లు. ఎవఁడైతే యోగయుక్త సన్న్యాసిగా నుంచున్నాఁడో, అనఁగా, మనస్సన్న్యాసము గలిగి ఫలాసక్తి విడిచి, జనన జరామృత్యుభయంబులు గలిగి దేనియందును మమకార ముంచక తనకులాచార ధర్మానుగుణ్యములగు కర్మల నాచరించుచున్నాఁడో, అట్టివాఁడు కర్మ సన్న్యాసికంటె శీఘ్రముగ బ్రహ్మ పదమును (మోక్షమును) బొందఁగలఁడు. అదెట్లనఁగా – నిందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

పడమటినుండి తూర్పునకుఁ బ్రవహించెడు నొక నదీతీరమున నొక గ్రామము గలదు. ఆనది వర్షాకాలమునఁ బూర్ణముగఁ బ్రవహించు చుండునపుడు తత్తీరమున నుండు నాగ్రామమునకుఁ బోవుటకుగా నిద్దఱు మనుష్యులు ప్రయత్నింపు చున్నారని యెంచుకొనుము. అందొకఁ డాగ్రామమునకుఁ బడమట రెండామడల దూరమున నదే నదీతీరమున నుండెడు నొక యూరినుండి పడవమీద బయలుదేఱు చున్నాఁడు. మఱియొకఁ డాగ్రామమునకుఁ దూర్పున రెండామడలదూరమున నదేతీరమున నుండెడు మఱియొక యూరినుండి పడవమీఁద బయలు దేఱుచున్నాఁడు. ఈయుభయులును నేకకాలమునందే బయలుదేఱుచున్నారు. కాన వారిరువురు నేక కాలముననే యా గ్రామమునకుఁ జేరవలసి యుంచున్నారు గదా, అట్లు చేరఁగలరా? లేనియెడల నందెవఁడు ముందు చేరఁగలఁడు?

అర్జు — ఆయిరువురిలోఁ బడమటినుండి బయలు దేఱినవాఁడే తూర్పు నుండి బయలుదేఱిన వానికంటె ముందుగాఁ జేరఁగలఁడు. ఏలయనఁగా, ఆనది పడమటి నుండి తూర్పునకు ప్రవహించుచున్నది గనుకఁ బడమటనుండి తూర్పునకుఁ బోయెడు పడవ యాప్రవాహముయొక్క వేగమువలన శీఘ్రముగను, సునాయాసముగను, బోయి చేరవలసిన స్థానమునకుఁ జేరఁగలదు. అయితే, ఆపడవ నడిపెడువాఁడు మాత్రము చుక్కానిని జక్కఁగఁ ద్రిప్పికొనుచు నాపడవను దప్పుమార్గమునఁ బోనీక పట్టుకొని రావలయును. అంతమాత్రముపని వాఁడు చేయుచుండిన యెడల నాపడవ యితర ప్రయత్నమేమియు లేకయే తన యిచ్ఛగనే పోయి చేరఁగలదు. ఇఁకను తూర్పు నుండి పడమరకుఁబోయెడు పడవయన్ననో యాప్రవాహమునకు నెదురెక్కి పోవలసి యుంచున్నది గనుక దానిని నడిపెడువాఁడు చుక్కానిని ద్రిప్పికొనుట మాత్రమే గాక తెడ్లుమొదలగు సాధనముల వలన నడిపింప వలసినవాఁడై యుంచున్నాడు. మిగులఁ బ్రయాసకరమగు నట్టిపనిచేయు చుండినను, బడమటినుండి తూర్పునకు నీటి వాలున నడిచెడు పడవతోపాటు, అంతవేగముగ నడవఁజాలదు గనుక నది యాలస్యముగఁ జేరఁదగి యుంచున్నది.

కృ — అవునుగదా, ఇంద్రియవిషయ ప్రవృత్తియు నిట్టి ప్రవాహము వంటిదే యగుచున్నది. ఎట్లనఁగా, ఎవఁడైతే గృహస్థధర్మ్మము నాచరింపుచు నాయాసమయ సందర్భానుసారముగ నింద్రియవిషయ భోగముల ననుభవింపుచు, నట్లనుభవించునపుడా యింద్రియము లీడ్చిన ట్లెల్లఁ దప్పుమార్గములఁ బోనీక మనస్సనెడు పడవను బుద్ధియనెడు చుక్కానిచేఁ ద్రిప్పికొనుచుఁ జక్కనిమార్గమునఁ బోనిచ్చుచున్నాఁడో వానికిఁ జర్వితచర్వణముగాఁ దాననుభవించిన విషయము లన్నిటియందుఁ గాలక్రమముగఁ

దనంతట విరక్తి గలుగఁగలదు. అదెట్లనఁగా నొక పదార్థమెంత రుచికరమైన దైనను దానిని దఱుచుగ భక్షించుటచే దానియందదివఱకుఁ గలిగి యుండెడు నభిరుచి క్రమక్రమముగఁ దగ్గుచువచ్చి తుదకు నాపదార్థమునం దసహ్యమెట్లు కలుగుచున్నదో, యట్లే పలుమారు అనుభవింపఁ బడిన యింద్రియవిషయముల యందును క్రమక్రమముగ నాసక్తి విడుచుచుఁ దుదకు నావిషయముల యందు బొత్తిగ నసహ్యము గలుగును. ఇదియే విరక్తి యనఁబడుచున్నది. అట్లసహ్యమెప్పుడు గలుగుచున్నదో, అప్పుడు వానికి స్థిరమైన వైరాగ్యమును, అట్టి వైరాగ్యమువలన జ్ఞానోత్పత్తియును, అట్టి జ్ఞానమువలన మోక్షమును శీఘ్రముగఁ గలుగఁదగి యుంచున్నది. కనుకనే "కామి గాక మోక్షకామి గాఁడు" అని యార్యులు చెప్పి యున్నారు. అట్లుగాక యెవఁడైతే అట్టివిషయ వాంఛానివృత్తియు, స్థిరమైన వైరాగ్యమును జెందకమునుపే యేదియో యొక గృహచ్ఛిద్రాది కారణమువలన సన్న్యసించినయెడల నట్టివాని యింద్రియములు మనస్సును విషయములమీఁదికి లాగుచునేయుండును. అయితే, తాను సన్న్యసించిన వాఁడు గనుక నట్టి విషయవాంఛలఁ దీర్చుకొన నవకాశము లేనివాఁడగుటచే వానియందుండి తనమనస్సును ద్రిప్పికొనుట బహుకష్టతరముగనుండును. అదెట్లనఁగా, నిష్కామ కర్మానుష్ఠానపరుఁడగు వానికి నొకవేళ నేదేని రుచికరమగు పదార్థము దినవలెనని కోరిక పుట్టిన యెడల నట్టిపదార్థమును దనయింటఁ బచనము చేయించి భగవన్నివేదనము చేసి యట్లు భగవదర్పణమయిన దానినిభక్షించి తనయీప్సితమును నెరవేర్చుకొనఁ గలఁడు. మఱియొకవేళ స్త్రీవాంఛగలిగినయెడల నట్టివాంఛను స్వస్త్రీసంయోగము వలనఁ దీర్చుకొనఁగలఁడు. గాన నట్టివాఁడు విషయవాంఛలను సులభముగను, న్యాయ పథముదప్పకయును దీర్చుకొనఁదగిన యవకాశముగలవాఁడై యుంచున్నాఁడు. ఇకఁను సన్న్యాసియన్ననో, అట్టివాంఛలు పొడమినపుడు వానిం దీర్చుకొనుటకుఁదగిన యవకాశములేనివాఁడుగాన నట్లనుభవమువలనఁ దీర్చుకొనుటకు బదులుగాఁ దనమనస్సును నిరోధించుటచేఁ దీర్చుకొనవలసినవాఁడై యుంచున్నాఁడు. అయితే అట్లునిరోధించుట బహుకష్టసాధ్యము గనుక వానికి విషయవాంఛావృత్తి సులభముగఁ గలుగనేరదు. అట్లు విషయవాంఛానివృత్తి గలిగిననేగాని స్థిరమైన వైరాగ్యమును, జ్ఞానమును గలుగనేరదు. కనుక వీనికంటె నిష్కామకర్మానుష్ఠానపరుఁడే శీఘ్రముగా జ్ఞానియును, తద్వారా మోక్షార్హుఁడును గాఁగలఁడని చెప్పఁదగియుంచున్నది.

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! ఇపుడు నీవుచెప్పిన కష్టములన్నియు నేదైన గృహచ్ఛిద్రములచే సన్న్యసించిన వానికేఁగదా కలుగఁదగియుంచున్నవి? అయితే అందఱు నట్లేసన్న్యసించిన వారుగనుందురా? అట్టి గృహచ్ఛిద్రములేవియు లేకయే

కేవల మోక్షాపేక్షచే సన్న్యసించినవారును గొంద ఱుందురుగదా ? అట్టి వారి కంటెనుగూడ నిష్కామకర్మయోగియే శీఘ్రముగ మోక్షమును బొందఁగలుగునా?

కృష్ణ — ఆహా, అవును. అట్టివారలకంటెనుగూడ నిష్కామకర్మయోగియే శీఘ్రముగ మోక్షమును బొందఁగలఁడు. ఏలయనఁగా, నట్టివారలు మోక్షమును బొందవలెననెడు నపేక్షచేత సన్న్యసించిన వారగుచున్నారుగాని విషయవాంఛానివృత్తిచేఁ గలిగిన వైరాగ్యమువలన సన్న్యసించినవారుగారు. కాన నట్టివాఁడు తనమనస్సు నెంతపదిలముగనుంచుకొనినను దాని నింద్రియములు విషయములమీఁదికి లాగుచునే యుండును. నిష్కామకర్మయోగియన్ననో, యట్టి విషయములన్నింటిని జర్విత చర్వణముగ ననుభవించి రోసి విడిచిపెట్టుచున్నాఁడు గనుక వానిమనస్సు మరల నావిషయముల నిచ్ఛగింపనేరదు. అదెట్లనిన, నొకఁడు తనయెదుటనుండెడు నొక రుచికరమగు పదార్థమును దినవలెనని యపేక్షించుచున్నాఁడు, గాని దానిఁదిన్నయెడల దానియందుండెడు దుర్గుణమునుబట్టి తనకు నజీర్ణాది దేహబాధలఁ గలుగఁజేయుననెడు భయముతోఁ దినకయుంచున్నాఁడు. అట్లుండినను వానిమనస్సు దానియందలి యపేక్షచేఁ బీడింపఁబడుచునేయుండును. ఇది యిట్లుండ మఱియొకఁడు దనయెదుటనుండెడు నట్టిపదార్థమునే దనయాశదీఱఁ దినుచున్నాఁడు. అట్లు తినుటవలన వానికి నజీర్ణాది బాధలుకలిగి వమనము చేసికొనుటచే దానియందు మిగుల నసహ్యముగలిగి, మరల నాపదార్థమును జూచినఁగాని, లేక దాని పేరు వినినపుడుగాని వమనముగాఁదగినంత రోతపుట్టుచున్నవి. అట్టివాని మనస్సున మరల నాపదార్థమును గుఱించిన యపేక్ష గలుగనేరదుగదా ? కాన నట్లే యోగియగువాఁడు విషయముల ననుభవించుటచే వానియెడల రోతపుట్టి విరక్తినొందినవాఁడును, అట్టి విషయానుభవములేకయే సన్న్యసించినవాఁడు తనమనోబలముచేత విరక్తినిజెందినవాఁడును గాన నట్టివైరాగ్యమునందు నిల్చియుండుటకు యోగికి సాధ్యపడినంత సులభముగా సన్న్యాసికి సాధ్యపడనేరదు. కనుకనే, "దుఃఖమాప్తుమయోగతః" యోగము నవలంబింపకయే సన్న్యసించుట కష్టసాధ్యమని చెప్పుటకుఁ గారణమైనది.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7

అర్థము:— విశుద్ధాత్మా = శుద్ధాంతఃకరణుఁడును, విజితాత్మా = స్వాధీనమనస్కుఁడును, జితేన్ద్రియః = ఇంద్రియనిగ్రహుఁడును, సర్వభూతాత్మభూతాత్మా = సమస్తప్రాణులు తనవంటివేయనెడు సమభావముగలవాఁడునగు, యోగ

యుక్తః= కర్మానుష్ఠానపరుఁడు, కుర్వన్ + అపి = కర్మనాచరింపుచున్నవాఁడైనను, న + లిప్యతే=(ఆకర్మచే) అంటఁబడఁడు.

కావున,

" తే. విను విరక్తిదృఢజ్ఞానజనిత గాన
దీపితజ్ఞానమున విరక్తియు ధరింపఁ
బడిన బుద్ధి నిర్ద్వంద్వతఁ బరగునింటి
యంద నిల్చి నిస్సంగుఁడనై చరింతు " (భార. శాంతి. ౬ ఆ. ౧౭౪.)

అని జనకుఁడు చెప్పినట్లు, ఎవఁడైతే సంసార మసారమనియెడు ననుభవజ్ఞానము గలవాఁడై యట్టిజ్ఞానముచే నుత్పన్నమగు విరక్తిగలవాఁడును, శుద్ధాంతఃకరణుఁడును, జితేంద్రియుఁడునునై, సర్వభూతములును దనవంటివేయనియెడు భావముతోఁ బ్రవర్తింపుచున్నాఁడో, అట్టివాఁడే యోగియనఁబడును. అట్టియోగయుక్తుఁడు గృహము నందుఁగాని మఱియెక్కడనేగానియుండి యాసక్తచిత్తుఁడుగాక, యేకర్మములు నాచరించినను సరే, అట్టికర్మలయొక్క ఫలము వాని నంటనేరదు.

శ్లో॥ నైవ కిఞ్చిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్శ్వసన్॥ 8

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ 9

అర్థము:— తత్త్వవిత్ = బ్రహ్మజ్ఞానసంపన్నుఁడైన, యుక్తః = యోగి (నిష్కామకర్మానుష్ఠానపరుఁడు), పశ్యన్ = చూచుచున్నను, శృణ్వన్ = వినుచున్నను, స్పృశన్ = తాఁకుచున్నను, జిఘ్రన్ =ఆఘ్రాణించుచున్నను, అశ్నన్= తినుచున్నను, గచ్ఛన్ = నడుచుచున్నను, స్వపన్ = నిద్రించుచున్నను, శ్వసన్= శ్వాసింపుచున్నను, ప్రలపన్ = మాటలాడుచున్నను, విసృజన్ = మలమూత్రవిసర్జనముచేయుచున్నను, గృహ్ణన్ = గ్రహింపుచున్నను, ఉన్మిషన్ = కన్నులఁ దెఱచుచున్నను, నిమిషన్ + అపి = కన్నులమూయుచున్నను, ఇన్ద్రియాణి = ఇంద్రియములు, ఇన్ద్రియార్థేషు = ఇంద్రియవిషయములయందు, వర్తన్తే + ఇతి = ప్రవర్తింపుచున్నవని, ధారయన్ = ఎంచుకొన్నవాఁడగుచు, కించిత్ + ఏవ= కొంచమైనను, న + కరోమి + ఇతి = నేను చేయుటలేదని, మన్యేత = తలంచును.

అదెట్లనఁగా నట్టి నిష్కామకర్మయోగి తత్త్వజ్ఞానసంపన్నుఁడు గాన నతఁడు,

"సీ. వినుచు ముట్టుచుఁ గనుఁగొనుచు నానుచు మూరుకొనుచుఁ బల్కుచుఁ బనుల్గొనుచుఁ జనుచు
వర్ణాశ్రమోచితవ్యాపారముల నిచ్చ సలుపుచుఁ దలఁచుచు మెలఁగునెడల
నీయింద్రియంబు లీయింద్రియార్థంబులఁ బూనివర్తించునే వీనికెల్ల
సాక్షిని కేవలసచ్చిదానందస్వరూపుఁడ గుణజాతిరూపనామ

తే. రహితుఁడ నటంచుఁ దెలిసి నిరంతరంబు
దన్నుదాఁ జూచుకొనుచు సత్యముగ నీ య
ఖండనియమంబు వదలక యుండు టరయ
నియమ యోగం బనందగు నిర్మలాత్మ!" (సీ. రా. 3 ఆ. ౧౫౧.)

అనునట్లు, ఏవస్తువునైనను జూచునప్పుడును, ఏశబ్దమునైన వినునప్పుడును, ఏవస్తువునైనఁ దాఁకునప్పుడును, ఏగంధమునైన నాఘ్రాణించునప్పుడును, ఏపదార్థమునైన భుజించునప్పుడును, ఎచటికైన నడిచిపోవునపుడును, నిద్రించునపుడును, ఉచ్ఛ్వాస నిశ్వాసములు విడుచునపుడును, ఎవరితోనైన మాటలాడునపుడును, మలమూత్రవిసర్జనము చేయునపుడును, ఏవస్తువునైన హస్తముతో గ్రహించునపుడును, కన్నులఁ దెఱచునపుడును, మూయునపుడును, తన జ్ఞానేంద్రియకర్మేంద్రియములు వానివానిపనియవి సేయుచున్నవియేగాని తానేమియు జేయుటలేదని తలఁచుచు నాఁడు. కావున

"గీ. ఎఱుకగలుగుభోగి యెట్లుభోగించిన
దురితమెడలిభోగతుష్టియొసఁగు
చోరుఁడొట యెఱిఁగి పోరామిసేయ న
య్యిల్లు తస్కరించు హితునియట్ల." (వా. రా. 3. ఆ.)

అనునట్లు, తత్త్వజ్ఞానసంపన్నుఁడగు వాఁడొకచోరుఁడొక యింటియందుండు వారితో స్నేహముచేసి వారలకుఁదనయెడల నమ్మకముపుట్టునట్లు ప్రవర్తించుచు సమయమువేచియుండి యాయింటివార లేమఱినప్పు డా యింటిలోని సొత్తులెట్లు తస్కరించుచుండునో యట్లే తాను గృహస్థాశ్రమమునందుండి తత్సంబంధంబగు పనులయం దాసక్తచిత్తునివలె నటించుచు,

"క. అలుమ బిడ్డలు బంధులు
నై లీలఁ జరింపఁగను గృహస్థుఁడు దత్త

ల్లోలత్వరహితచిత్తత
మేలుగ నలవఱుపవలయు మీ చెఱఁగి నృపా."
(భార. శాంతి. ౧. అ. 3-౭౭)

అనునట్లు, దారపుత్రబంధుమిత్రాదులతోఁగలసి, వారియెడల నత్యంత ప్రేమాతిశయముగలిగియున్నట్లభినయించుచు నిదియంతయును మిథ్యయనియెఱిఁగి యంతర్ముఖుఁడై యాత్మానుభవమునుజేయుచు నెందును దగులమునొందక యుండును. అట్లుండియు,

" సీ. కృతవిచారుండగు నతనిచేతోవృత్తి మననవర్జితమునఁ జెనకిపోవు
నొకకొంత పరిణతనొంది సంసారవాసనఁ గడఁగును నింద్రజాలమట్లు
రాగహీనతమనోగ్రంధి దెంపఁగ నీళ్ళ కలఁక నిండుపు రాచి తెలుచుభంగి
విజ్ఞానవశమున వెలయుస్వభావంబు నిత్యప్రసన్నమై నెగడుచుండు.

" గీ. నట్టియోగికి బ్రహ్మరుద్రాదిసురలు
కృపకుఁ దగు పాత్రులైయుండు కేవలంబ
కన్నులూరక దిక్కులు గాంచుపగిదిఁ
జిత్తరతిలేక కార్యంబు సేయుచుండు."    (వా. రా. 3. అ.)

అనునట్లు, అట్టివాని మనస్సుగూడ నొకానొకప్పుడు మననము నేమఱియుండు సమయమునఁ జలించుచువచ్చును. అనఁగా, సంసారసంబంధమగు సుఖదుఃఖముల నొందును. అయినత్తే, పామరులవలె నతఁడట్టి సుఖదుఃఖములయందు మగ్నుఁడుగాక, వెంటనే తనబుద్ధిచే నాలోచించి తెలివిఁదెచ్చికొని రాగద్వేషముల నడంచును. అందువలనఁ జిల్లగింజతో బురదనీరువిఱిగి తేటగించినట్లు, వానిమనస్సు కలఁకఁదేఱి నిర్మలమైనదై యెప్పటియట్ల ప్రకాశింపుచుండును.

అర్జు — అయ్యా నీవుచెప్పినదిసరే, అట్లివాఁడైన ననాసక్తచిత్తుఁడై కర్మము నాచరింపుచున్నను, అట్టివాఁడు తనకులాచార ధర్మములనెఱపుటలో, మంచిపనులతో పాటు ననేక క్రూరకృత్యములు గూడఁ జేయవలసినదిగా నుంచున్నదిగదా? అనఁగా నిపుడు నేను క్షత్రియుండ నగుటచే నాకులాచారధర్మమగు నీయుద్ధమును బంధుమిత్ర వధారూపకమగు ఘోరకృత్యము చేయవలసినదిగా నేర్పడుచున్నదిగదా? నేనిప్పుడు నీవుచెప్పినప్రకార మనాసక్తచిత్తుఁడనై చేసినను, దీనివలని బాధ ననేకులు పొందవలసినవారై యుంచున్నారుగదా? ఇట్లితరులకు బాధకమును గలుగఁజేయు పనులనుజేసినను నాకర్మఫలమగు పాపము అంటకయుండునా?

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ 10

అర్థము:— యః = ఎవఁడు, కర్మాణి = కర్మములను, బ్రహ్మణి = పగమాత్మయందు, ఆధాయ = అర్పించి, సఙ్గమ్ = ఫలాపేక్షను, త్యక్త్వా = విడిచి, కరోతి = చేయుచున్నాఁడో, సః = వాఁడు, అమ్భసా = ఉదకముచేతను, పద్మపత్రమ్ + ఇవ = తామరాకువలె, పాపేన = పాపముచేత, న + లిప్యతే = అంటఁబడఁడు.

కృ — ఓయియర్జునా! అట్లెవఁడైతే తనకులాచారధర్మానుసారముగఁ జేయవలసిన పనుల నన్నింటిని బ్రహ్మార్పణముగఁ జేయుచున్నాఁడో, అనఁగా, భగవంతుని వలన నట్టికులాచారధర్మము లేర్పడినవనియు, తనను భగవంతుఁ డాకులమున జన్మింపఁ జేయుటచే నాకులమునకు సంబంధించిన పనులనన్నింటిని జేయుటకుఁగాఁ దనను భగవంతుఁడు నియమించెననియుఁ, గనుక నట్టి పనులేవియైననుసరే, అనఁగా నితరులకు బాధకములైనవైననుసరే, లేక సాధకములైనవైననుసరే, వానిఁజేయుటకు భగవన్నియమనానుసారముగ బద్ధుఁడనై యున్నాననియు నెంచి, యట్టిమనోనిశ్చయముతోఁ జేయుచున్నాఁడో, యట్టివానిఁ బ్రవర్తన యెట్లుండుననఁగా,

“ ద్విరదగతిరగడ. మొదలుసరిగాఁగఁ గను మోదమును ఖేదమును,
వదలుకొని యుండుఁ బరవాదమును భేదమును,
గలఁకపడి సల్పఁడు వికర్మమును గర్మమును,
దలఁపఁ డొక యించుకయధర్మమును ధర్మమునూ,
మరులుకొని చేయఁ డభిమానమును మానమును,
మఱచియును మానఁడతి మౌనమును జ్ఞానమును,
గ్రందుకొనిపొందఁడు సుకాంతలను వింతలను,
జెందఁ డతి దుర్విషయచింతలను వంతలను,
సొలయక జయించు నతిసుప్తియు నసుప్తియును,
దెలిసికను నాత్మసుఖతృప్తియును జ్ఞప్తియును,
లౌల్యమతిఁదాల్పఁ డభిలాషమును వేషమును,
దుల్యముగఁ గాంచు ఘనతోషమును రోషమును,
జెలులపై నుంచఁ డిల స్నేహమును మోహమును,
యఁ డిది సత్యమని దేహమును గేహమును,

విరసముగ నెంచు నల విత్తముల మొత్తముల,
సరసముగ నెంచుమది సత్తములఁ జిత్తముల,
భ్రమగొని భజింపఁ డిలఁ బాత్రులను బుత్రులను,
సమముగఁ దలంచు నరుశత్రులను మిత్రులను,
గర మభిలషింపఁ డొక కల్మియును బల్మియును,
సిరియనుకొనున్ బుధుల చెల్మియును దాల్మియును,
సడలఁ డొకయింతయును శాంతియును దాంతియును,
గడకరుగ నీఁడు ముఖకాంతియును క్షాంతియును,
ప్రాపనుచుఁ జూచు గురుభక్తియు విరక్తియును,
నోపిక నెఱుంగు శ్రుతియుక్తియును ముక్తియును" (సీ. రా. 3. ఆ. ౧౧౪)

కాన నట్టివాఁ డాచరించెడు కర్మలయొక్క ఫలములగు పుణ్యపాపములు, కవిరాజవిరాజితము.

తరణి సమస్తరసంబులఁ గ్రోలుచుఁ దద్రసనిష్ఠవికారములం
బొరయని చందమున న్విషయంబులఁ బొందుచుఁ దద్గుణదోషములన్
నిరతము నంటక యోగివరుం డతినిర్మల నిశ్చల మానసుఁడై
పరమ సుఖామృత వార్ధిని గ్రుంకుచుఁ బావనుఁడై విలసిల్లుఁ దగన్"
(సీ. రా. 3. ఆ. ౧౦౫)

అనునట్లు, సూర్యుఁడు సమస్తరసములఁ బీల్చినను, ఆ రసములయందుండెడు గుణదోషము లాసూర్యు నెట్లంట నేరవో యట్లును,

"తోధకవృత్తము. చారువివేకియ సారమహాసం
సారముఁ జెంది యసంగత నుండున్
నీరజపత్రము నీరము నే ప్రా
ద్దారయ నంటియు నంటని భంగిన్" (సీ. రా. 3. ఆ. ౧౦౭)

అనునట్లు, తామరాకు నీటియందుండియు నానీటిచేఁ దడుపఁబడని విధమునను,

"ఆ. పావకుండు సర్వభక్షకుండయ్యు ని
ర్దోషుఁడైనభంగి దూరదర్శి
విషయరాగియయ్యు వీతరాగియునై వె
లుంగుచుండు ముక్తసంగుఁ డగుచు" (సీ. రా. 3. ఆ. ౧౧౦)

అనునట్లు, సర్వభక్షకుండగు నగ్నిహోత్రుని వస్తువులదోషమంటని మాడ్కిని,

"తే. తనరు సాత్త్విక రాజస తామసములఁ
బొంది పొందఁడు నిర్గుణానందపరుఁడు
మంటి నంటియు నంటక నొంటి మెలఁగు
విమలమృత్తికా టకంబు చందమున ననఘ." (సీ. రా. 3. ఆ. ౧౧౧)

అనునట్లు, బురదలోఁ దిరుగుచుండెడు కుమ్మరపురు వాబురదనంటని విధము నను వాని నంటనేరవు.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽత్మశుద్ధయే ॥ 11

అర్థము:— యోగినః = కర్మయోగులు, ఆత్మశుద్ధయే = చిత్తశుద్ధికొఱకు, సఙ్గమ్ = ఫలాపేక్షను, త్యక్త్వా = వదలి, కాయేన = శరీరముచేతను, మనసా = మనస్సుచేతను, బుద్ధ్యా = బుద్ధిచేతను, కేవలైః + ఇన్ద్రియైః + అపి = ఇంద్రియములచేతమాత్రమైనను, కర్మ = కర్మమును, కుర్వన్తి = చేయుచున్నారు.

కావున, నట్టి మహానుభావుండు ప్రారబ్ధవశంబున స్వవర్ణాశ్రమోచిత ధర్మంబుల యందుఁ బ్రవర్తింపుచు, తదనుగుణ్యములగు మనోవాక్కాయిక కర్మలను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారములను జేయుచుండినను, వానినెల్ల నాత్మశుద్ధికొఱకే చేయుచుండునుగాని మఱియేయితర ప్రయోజనమునుగోరిచేయఁడు. అదెట్లనిన,

"చ. పరపురుషానురక్తిగల భామిని యెల్లపనుల్ గృహంబునం
బొరిఁబొరిఁ జేయుచుం బ్రియుని పొందు సుఖంబుగఁ జూచుఁటీతి భా
స్వరపరతత్త్వవేది నిజవర్ణనిజాశ్రమ యోగ్య ధర్మముల్
నిరతము సల్పుచుం బరమ నిర్మల సౌఖ్యము గాంచు నెమ్మదిన్."
(సీ. రా. 3. ఆ. ౧౧౨.)

అనునట్లు, పరపురుషగమనము గోరుచుండెడు స్త్రీ తనయింటఁ గలపనులనెల్ల దనపెనిమిటియొక్కయు, అత్తమామలయొక్కయు, ఆడబిడ్డలయొక్కయు, బావమఱఁదులయొక్కయు, నిచ్ఛానుసారముగ నెరవేర్చుచుఁ, దనమనస్సునుమాత్ర మెప్పుడును దన విటకానియందే చేర్చుచు, వానినే స్మరించుచు, వానితోఁ గవియుటకుఁ దగిన సమయమును నెట్లు వేచియుండునో, యట్లే, యోగియును గృహస్థాశ్రమమునందుండి, యందుకుఁదగిన పనుల నన్నింటిని నిర్వర్తించుచు వానియం దాసక్తచిత్తుఁడుగాక తన మనస్సును సదా భగవంతునియందే చేర్చుచుండును.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్ ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12

అర్థము:— యుక్తః =యోగి (నిష్కామకర్మానుష్ఠానపరుఁడు), కర్మఫలమ్= కర్మఫలమునందలి యపేక్షను, త్యక్త్వా = విడిచి, నైష్ఠికీమ్ =స్థిరమైన, శాన్తిమ్= చిత్తశాంతిని, ఆప్నోతి = పొందుచున్నాఁడు, అయుక్తః+(తు) = కామ్యకర్మానుష్ఠానపరుఁడైనవో, కామకారేణ = కోరికలుగలవాఁడగుటచేత, ఫలే =కర్మఫలమునందు, సక్తః+(సన్) = ఆసక్తిగలవాఁడెగుచు, నిబధ్యతే = సంసారబద్ధుఁడగుచున్నాఁడు.

కావున గృహస్థాశ్రమంబునందుండి జితేంద్రియుండును, నిష్కాముండును నైసర్గికకర్మలనాచరింపుచు నాత్మజ్ఞానంబు గలపురుషుఁడు,

"వ. శత్రువులంగెలువ నిశ్చయించినపురుషుండు దుర్గంబాశ్రయించి శత్రువులంజయించినమాడ్కిని గృహాశ్రముండగుచు శ్రీనారాయణ చరణారవిందంబులను దుర్గంబాశ్రయించి యరిషడ్వర్గంబులం జయించి ముక్తుండగు."

అట్లుగావున,

"చ. అరయ గృహస్థులయ్యును మదర్పితకర్ములు నస్మదీయ సుం
దరచరితామృతశ్రవణతత్పరమానసయాతయాములు
న్సరసగుణాఢ్యులై తనరు సాధుల కీగృహముల్దంప దు
ష్కరభవబంధహేతువులు గావు నృపాలతనూజ యెన్నడున్"

చ. అనుపమవేదవేదులగు నంచితయోగిజనాను గీయమా
ననిజకథాసముత్సుకుఁ డనందగు నేను మదీయులందు నూ
తనముగ నుండుఁ గావునను దారతవారికి నీగృహావళుల్
ఘనభవబంధహేతువులుగా విదియుంతయు నిక్కమారయన్."
(భాగ. ४. స్కం. ౯౧౨, ౯౧౪)

అట్లుగాక, యెవఁడుజితేంద్రియుఁడు గాకుండునో వాఁడు కామాదిసహితుండగుటంజేసి యట్టివాఁడు కర్మలసన్న్యసించి వనవాసియైనను వానికి సంసారబంధంబులు సిద్ధింపకమానవు.

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽఽస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ 13

అర్థము:— వశీ = (ఇంద్రియములను) వశపఱచుకొన్నవాఁడు, మనసా = మనస్సుచేత, సర్వకర్మాణి = సమస్తకర్మములను, సన్న్యస్య=పరిత్యజించి, న+ఏవ+కుర్వన్ = తానేమియుఁజేయనివాఁడును, న+కారయన్ = (ఒకరిచేతఁ) జేయింపనివాఁడునునై, నవద్వారే = తొమ్మిదివాంకిళ్లుగల, పురే = పట్టణప్రాయమైన, దేహే = శరీరమందు, సుఖమ్ = హాయిగా, అస్తే = ఉంచున్నాఁడు.

కాఁబట్టి యోగి యర్జునా! ఎవఁడైతే సమస్తకర్మములను చేయుచున్నను మనస్సునందుమాత్రము వానిని సన్న్యసించిన వాఁడగుచున్నాఁడో, అనగా నట్టి కర్మలయెడ నాసక్తచిత్తుఁడుగాక యుంచున్నాఁడో, యట్టివాఁడు నవద్వారములుగల పట్టణమువంటిదగు నీదేహమునసుండియుఁ దా నేకర్మమును జేయకయు, జేయింపకయు, అనఁగాఁ, దానుసొంతముగఁజేయునట్టిగాని, యితరులచేఁ జేయించునట్టిగాని పనులయందాసక్తచిత్తుఁడుగాక

"మ. తరుణీనందనబంధుసాధురిపు మిత్రవ్రాతముల్ తన్ను బ
ల్మరునిందించిన సంస్తుతించిన మహామానావమానాదులన్
నెఱినొందించిన నిర్వికారుఁడగుచున్ నిశ్చేష్టుఁడై యుండుభా
స్వరతత్త్వానుభవజ్ఞుఁడెయ్యెడల జీవన్ముక్తదేహస్థితిన్.

ఆ. బహుళసంకటములు ప్రాప్తంబులైనచోఁ
దల్లడింపఁడాత్మ తత్త్వవిదుఁడు
వాయుశీతవహ్ని వర్షాతపంబుల
కించుకైనగిరిచలించనట్లు." (సీ. రా. 3. అ. ౧౭౫. ౧౭౮.)

అనునట్లు, సుఖముగానుంచున్నాఁడు.

అర్జు — అయ్యా, యిపుడు నీవుచెప్పినవిషయమును బట్టిచూడఁగా మనోబుద్ధీంద్రియములను వశపఱచుకొని నిష్కామకర్మనాచరించెడువాఁడు దనస్వకులాశ్రమోచిత ధర్మములననుసరించి యేకార్యముచేసినను, లేక యితరులచేఁ జేయించినను, నా కార్యములలో దేనినైనను జేయనివాఁడుగను జేయించనివాఁడుగనునే యుండునట్లగపడుచున్నదిగదా? అట్లైనయెడల, కర్తలేని కర్మ యొకటియునుండనేరదుగదా? అప్పటికి నాకార్యములకుఁ గర్తయెవఁడు?

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

అర్థము:— ప్రభుః = ఈశ్వరుఁడు, లోకస్య=లోకమునకు (ఈప్రపంచమునందలి జీవజంతువులకు), కర్తృత్వమ్ = కర్తృత్వమును, న+సృజతి = సృజింపఁడు,

కర్మాణి = కర్మములను, న+(సృజతి) = సృజింపఁడు, కర్మఫలసంయోగమ్= కర్మఫలములతోడి సంబంధమును, న+(సృజతి) = సృజింపఁడు, (కిమ్)+తు = మఱేమనిన, స్వభావః = స్వభావము (ప్రకృతిసంబంధమువలనఁగలిగెడు వాసన), ప్రవర్తతే = ప్రవర్తింపుచున్నది (కర్తృత్వాదులకుఁగారణ మగుచున్నది).

కృ — ఓయియర్జునా! ఈశ్వరుఁడీలోకమునందలి జనులకు నేకర్మయందును గర్తృత్వమునుగాని, యాకర్మయొక్క ఫలముతోడి సంబంధమునుగాని సృజింపలేదు. అయితే మఱేమనఁగాఁ బ్రతిజీవుఁడును ద్రిగుణాత్మకమగు, అనఁగా, రజస్సత్త్వ తమోగుణములతోఁ గూడిన ప్రకృతిచేఁగప్పఁబడియుంచున్నాఁడు. ఈప్రకృతికే స్వభావమనియెడు నామాంతరమును గలదు. ఈస్వభావమే యాజీవునిచే నన్ని పనులు సేయించుచుండునుగాని జీవుని కాపనులయం దెంతమాత్రమును గర్తృత్వ ముండ నేరదు. కనుక నేగదా యింతకుముందు "కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః" (చూ 3-5) అని చెప్పుటకుఁ గారణమైనది. అదెట్లనఁగా నిందునకు దృష్టాంతముగ నొకసంగతిఁ జెప్పుచున్నానువినుము. ఈలోకమునందుండెడు జను లందఱు నొకటేవిధముగఁ బ్రవర్తింపక నానావిధములుగఁ బ్రవర్తించుటను జూచుచున్నాముగదా? అనఁగా నొకఁడు దనకుమఱియొకఁ డెంత యపకారము చేసినను వానికిఁ బ్రత్యపకారముచేయక యందునకు బదులుగా నుపకారము నే చేయుచుండుటయు, తన్ను నిర్నిమిత్తముగఁ దిట్టినను వానినిమరలఁ దిట్టక వానిని భూషించుటయుఁ జూచుచున్నాముగదా? అది యెందువలననో తెలియునా?

అర్జు — అవును, అట్టివారలను జూచుచున్నాము; వారలు సత్త్వగుణప్రధానులగుటచే వారికట్టి సహనము గలిగియుండునని తోఁచుచున్నది.

కృ — అవునుగదా, మంచిది, అట్లేమఱి యొకఁ డితరులచే దూషింపఁబడినపుడుగాని, అపకారమునొందినపుడుగాని. వారలను మరలఁబదింత లెక్కుడుగ దూషించుటయు, తనకు వారుచేసిన యపకారముకంటెఁ బదింత లెక్కుడుగఁ బ్రత్యపకారముఁ జేయుటయుఁగూడఁ జూచుచున్నాముగదా? అదియెందువలననో తెలియునా?

అర్జు — అవును, అట్టివారినిఁగూడఁ జూచుచున్నాము. వారు కేవల రజోగుణప్రధానులని తోఁచుచున్నది.

కృ — అవునుగదా? అయితే మొదట నేఁజెప్పిన సత్త్వగుణప్రధానునకు నపకారముచేసెడు బుద్ధియును, రెండవతూరి చెప్పిన రజోగుణప్రధానునికి నుపకారము చేసెడు బుద్ధియును నెప్పుడైనఁగలుగునా?

అర్జు — అట్లుకలుగనేరదు. ఏలయనఁగా, వానిగుణముల కనుగుణ్యములగు

పనులువాఁడును, వీనిగుణముల కనుగుణ్యములగు పనులువీఁడును జేయుచుందురే గాని యాగుణములకు వ్యతిరేకములగు పనులు సేయరు.

కృ — అవునుగదా ? అప్పటికిఁ బ్రతిపురుషుఁడు సేసెడు పనులు వానిస్వభావము ననుసరించియే గదా చేయుచున్నాఁడు ? కనుక, నాపనులు వానిచేత నాస్వభావగుణము చేయించుచున్నదగుచున్నదా లేదా ?

అర్జు — అవును, ఆస్వభావగుణమే చేయించుచున్నదని చెప్పవలసియుంచున్నది.

కృ — కనుకఁ బ్రతిపురుషుఁడు చేసెడు కర్మలయొక్క కర్తృత్వము వానివాని స్వభావగుణములయందుంచున్నదే గాని వానియందు లేదనియెఱుంగుము.

అర్జు — ఇందువలనఁ బ్రతికర్మయొక్క కర్తృత్వమును స్వభావము (ప్రకృతి) నందే యుంచున్నదని నాబుద్ధికిపుడు స్పష్టముగఁ దోఁచుచున్నది. అయితే, మఱియొక సందేహము గలుగుచున్నది. అదేమనఁగా, లోకమునందలిజనులు సుకృతమును దుష్కృతమునుగూడఁ జేయుచున్నారుగదా ? అట్టిసుకృతముయొక్క ఫలము పుణ్యమును దుష్కృతముయొక్క ఫలము పాపమునునై యుంచున్నవికదా ? అట్టి పుణ్యపాపములాకర్మల నాచరించిన జీవునకు, వానియందుఁ గర్తృత్వములేనందున నాజీవునినంటనేరవుగదా ? ఆజీవునిచే నాకర్మలఁజేయించెడు స్వభావము అచేతన పదార్థముగనుక దానికిని నంటనేరదుగదా ? ఇఁక నాపుణ్యపాపము లెవరికిఁజెందుచున్నవి ? ఈజీవునిని, బ్రకృతినిని సృజించిన యీశ్వరునికేగదా చెందవలసియుంచున్నవి ?

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ 15

అర్థము:— విభుః = ఈశ్వరుఁడు, కస్యచిత్ = ఎవనియొక్కయు, పాపమ్ = పాపమును, న+అదత్తే = గ్రహింపఁడు, సుకృతమ్+చ = పుణ్యమునుగూడ, న+ఏవ+(అదత్తే) = గ్రహింపఁడు, జ్ఞానమ్ = జ్ఞానము, అజ్ఞానేన = అజ్ఞానముచేత, అవృతమ్ = కప్పఁబడియున్నది, తేన = దానిచేత, జన్తవః = జీవజంతువులు, ముహ్యన్తి = భ్రమించుచున్నవి.

కృ — ఓయియర్జునా ! నీవు తలఁచినట్లీశ్వరుఁడెన్నటికిని నెవరియొక్కయుఁ బాపమునుగాని పుణ్యమునుగాని గ్రహింపఁడు. అనఁగా నెవఁడుచేసిన పుణ్యపాపములయొక్కయుఁ గర్తృత్వమును గ్రహింపఁడు.

అర్జు — అయితే, అకర్తృత్వ మెవరికిఁ జెందుచున్నది ?

కృ — జీవునికే చెందుచున్నది.

అర్జు — ఇదియేమి యన్యాయము? భగవంతుఁడు కర్మలయొక్క కర్తృత్వమును జీవులకివ్వలేదనియు, నాజీవులను సంబంధించియుండు ప్రకృతియే యాకర్మలఁజేయుచున్నదనియు నీవిపుడు చెప్పితివిగదా? అట్లుండఁగ ర్తృత్వములేని జీవునకుఁ బ్రకృతిచేఁ జేయఁబడుకర్మలయొక్క ఫలములగు పుణ్యపాపములెట్లు చెందఁగలవు ?

కృ — అదెట్లనఁగా, జీవుఁడు దానేమియుఁ జేయకపోయినను, బ్రకృతిచేఁ జేయఁబడు కర్మలను దానుచేసినట్లెంచుచున్నాడుఁ కనుక నాకర్మలను దనపై నారోపించుకొనుచున్నాఁడు-ఇట్లుచేయుటయే యహంకార మనఁబడుచున్నది. గాన నాకర్మ ఫలము వానినంటుచున్నది.

అర్జు — అయ్యో పాపము; ఈజీవుఁడు నిర్నిమిత్తముగఁ దాఁజేయని పనులను దనయం దారోపించుకొని యందువలన నేలబద్ధుఁడు గావలయును ?

కృ — అజ్ఞానముచే నట్లుచేయుచున్నాఁడు. ఈ యజ్ఞానమునకే అవిద్యయనియు, మాయయనియు నామాంతరములు గలవు. దీనిచేతనే సమస్తజంతువులయొక్క జ్ఞాన మావరింపఁబడియున్నది. గాన నీయజ్ఞానమువలన మోసపోయి యహంకారమునువహించి యందుచే బద్ధుఁడగుచున్నాఁడు.

అర్జు — అయితే యీమాయ యెవరిచేఁగల్పితమైనది !

కృ — ఈశ్వరునిచేతనే కల్పితమైనది.

అర్జు — అట్లైనయెడల జగత్సృష్టికర్తయగు నీశ్వరుఁడే యీమాయనుగల్పించి దానిచే జీవుల మోహింపఁజేయుచు, తద్వారా, వారలను గర్మబద్ధులఁజేయుచుఁ దానేమియుఁ జేయనివానివలె దేనిఫలమునంటక విలక్షణుఁడుగ నెట్లుండఁగలఁడు ?

కృ — ఈశ్వరుఁడు జీవులను మాయనుగూడ సృజించినది వాస్తవమేగాని అయితే ఆజీవులకు మనుష్యజన్మమునందు ఆమాయను దరించుటకుఁదగిన శక్తినిఁగూడ నిచ్చియున్నాఁడు. దానికే బుద్ధి (reason) అనిపేరు. కాన నేజీవుఁడైతే మనుష్యజన్మ వచ్చినప్పు డట్టి బుద్ధినిఁ జక్కఁగ నుపయోగించి తనయొక్కయు, మాయయొక్కయు స్వరూపస్వభావములను జక్కఁగఁదెలిసికొని యున్నవాఁడై సమస్త కర్మములను బ్రకృతి సంబంధములేయనియు, వానితోఁ దనకేమియు సంబంధము లేదనియుఁ దెలిసికొని ప్రవర్తించుచున్నాఁడో, యట్టివాఁ డామాయను దరించిన వాఁడగుచున్నాఁడు. కాన వాఁడు కర్మబద్ధుఁడుగానేరఁడు. అట్లుగాక యేజీవుఁడైతే తనకు మనుష్యజన్మవచ్చినపుడు దనకు భగవంతుఁ డిచ్చియుండెడు బుద్ధినిఁ జక్కఁగ నుపయోగించుకొనక యహంకారమమకారములు గలవాఁడై ప్రకృతిచేఁజేయఁబడు కార్యములన్నియుఁ దానేచేయునవిగా భావించుచున్నాఁడో, అట్టివాఁడు మదించిన

యేనుఁగు దన నెత్తినమట్టి దానే వేసికొనినట్లు ప్రకృతిచేఁ జేయఁబడు కర్మలను దనయం దారోపించికొనుచు నందుచేఁ గర్మబద్ధుఁడగుచు నాకర్మలయొక్క ఫలాఫలముల ననుభవించుచున్నాఁడు గాని భగవంతునిచే వాఁడు కర్మబద్ధుఁడు గాఁ జేయఁబడుట లేదు. ఇందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. అదెట్లనఁగా ?

ఒకయజమానుఁడిద్దఱు నౌకర్లను బిలిచి యొక తామరకొలనికిఁబోయి తామ రాకులు, మొదలగునవి దెమ్మని నియమించి పంపుచున్నాఁడు. అట్లు పంపునపుడు, ఆ కొలనిలోదిగినయెడలఁ దామరతీఁగలు, అల్లితీఁగలు మొదలగునవి మిక్కిలిగ నుంచున్నవి గనుక నవి కాళ్ళకుఁ జుట్టుకొన్నయెడల నవి యీఁతవచ్చినవానినిగూడ లోపలికిముంచివేయఁగలవు; గాన నవి కాళ్ళకుఁజుట్టుకొనినపుడు వానిని ఖండించి తెఱపఁ జేసికొనుటకుఁగా నుపయోగించుకొండని చెఱియొక కత్తినిచ్చిపంపుచున్నాఁడు. అందొకఁడు తనయజమానుని యాజ్ఞను, నతఁడిచ్చిన యాయుధమును, మఱవక యాలాగు ననే యాకత్తితో నాతీఁగలు కాళ్ళకుఁజుట్టుకొనినపుడెల్ల ఖండింపుచు నాతీఁగలచేఁ గట్టువడక యజమానుని యాజ్ఞానుసారముగఁ దామరాకులు మొదలగునవి దీసికొని వచ్చి యిల్లు చేరుచున్నాఁడు. రెండవవాఁడు దనయజమానుని యాజ్ఞను మఱచిన వాఁడై యాయన యిచ్చిన యాయుధము నుపయోగింపక యాతీఁగలచేఁగట్టువడి విడివడ సమర్థుండు గాక మునిఁగిపోవుచున్నాఁడు. ఇట్టి వీని మరణమునకు వీనియజమానుఁడు గారణభూతుఁడగుచున్నాఁడా ?

అర్జు — కానేరఁడు. ఏలయనఁగా, వానినాకొలనికిఁ బంపునపుడు, అచట నుండెడు తీఁగలసంగతిఁ దెలియఁజేసి దాని నివారించుకొనుటకుఁ దగినసాధనమునుగూడ నిచ్చిపంపినాఁడు; అయితే దానిని వాఁడుపయోగించుకొనక పోవుటవలన వానికిట్టి గతి సంభవించినది. గాననందలి దోషమాయజమానునికి నాపాదింపనేరము.

కృ — అయితే యాసంగతిఁదెలియని వార లేమనుకొందురు ?

అర్జు — ఆయజమానుఁడే వాని మరణమునకుఁగారణభూతుఁడని యనుకొందురు.

కృ — అవునుగదా ? అట్లే యీప్రపంచమునందలి జనులును, అజ్ఞానముచేత వార లనుభవించెడు కర్మఫలములను నీశ్వరుఁడు కారణభూతుఁడని యెంచుచున్నారు.

అర్జు — అయితే ప్రతిజీవునకును మానవజన్మము గలిగినపుడు మాయను దరించుటకుఁదగిన సాధనమగు బుద్ధిని భగవంతుఁడిచ్చుచుండఁగా దానిచే నట్టి మానవజన్మము నెత్తిన ప్రతిజీవుఁడును మాయను దరించి మోక్షము నొందుటకుఁదగుప్రయత్నము సులభముగఁ జేయవచ్చునుగదా ? అట్లుండియు నీప్రపంచమున నట్లు చేసెడు వారు

బహుసత్కృత్యగనుంచున్నారే, అనఁగాలక్ష్మిమందిలో నొకఁడైన నుండుట యరుదుగా నున్నదే, అందుకుఁగారణమేమి ?

కృ — ఓహో! మాయను జయించుట సులభసాధ్యమని నీకెంచుచున్నావు గాబోలును, ఈమాయాశక్తినిగుఱించి తొల్లి బ్రహ్మ నారదునితోఁ జెప్పినవాక్యములను జెప్పుచున్నానువినుము. అందుపైని దానిశక్తి యిట్టిదని నీవెఱుంగగలవు.

"మ. హరిమాయాబల మే నెఱుంగనటశక్యంబే సనందాదిస
త్పురుషవ్రాతముకైన బుద్ధినితరంబున్మాని సేవాధిక
స్ఫురణం దచ్చరితానురాగ గుణవిస్ఫూర్తిన్ సహస్రాస్యసుం
దరతంబొల్పగుశేషుఁడుం దెలియఁడన్నం జెప్పనే లొండొరున్.

"మ. విను వేయేటికిఁ దాపసప్రవరయవ్విశ్వాత్ముఁ డీశుండుదాఁ
దన మాయామహిమాంతముం దెలియఁగా దధ్యంబుదాఁ జాలఁడ
న్ననునేనైనను మీరలైన సురలైనన్వామదేవుండునై
ననునిక్కంబెఱుఁగంగఁజాలుదురె విజ్ఞానక్రియాయుక్తులన్."

(భాగ. ౨స్కం. ౧౦౮, ౨౦౩.)

అట్లుగావున నిట్టిమాయను జయించుట కష్టసాధ్యముగాని సులభముగానేరదు.

అర్జు — అయితే యీమాయను దరించుటకు దేవాదులకే యింతకష్టసాధ్యమైన యెడల మనుష్యాదులకెట్లు సాధ్యపడఁగలదు ? ఇపుడు నీవు చెప్పినసంగతులను బట్టి చూడఁగా మనుష్యులలో నెవరును, నీమాయను దరింపఁజాలరని తోఁచుచున్నది.

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతితత్పరమ్ ॥ 16

అర్థము:— తత్ = అట్టి (అనఁగాఁ బైశ్లోకమునఁ జెప్పఁబడియుండుప్రకారము జ్ఞానము నావరించియుండునట్టి), అజ్ఞానమ్ + తు = అజ్ఞానమైతేనో, ఆత్మనః + జ్ఞానేన = ఆత్మజ్ఞానముచేత, యేషామ్ = ఎవరికి, నాశితమ్ = నాశముచేయఁబడుచున్నదో, తేషామ్ = అట్టివారలకు, జ్ఞానమ్ = జ్ఞానము, ఆదిత్యవత్ = సూర్యుఁడువలె (అనఁగా సూర్యుఁడువస్తువులఁ బ్రకాశింపఁజేయునట్లు,) తత్ + పరమ్ = ఆపరబ్రహ్మస్వరూపమును, ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నది.

కృ — ఓయియర్జునా! అట్లుచెప్పవలదు; మాయను దరించుటమిగులఁ గష్టసాధ్యమే; అయినను నందఱునట్లు తరింపలేరనిచెప్పఁగూడదు. ఇంతకుముందీమాయను దరించుటకు బుద్ధియనెడు శక్తి నొకదానిని భగవంతుఁడు ప్రతిపురుషునకు నిచ్చియున్నా

డని చెప్పియుంటినిగదా? దానిని బహుమందిచక్కఁగ నుపయోగించుకొనలేకున్నను, అక్కడక్కడ నొకానొకరైనను దానినిఁ జక్కగా నుపయోగించుకొనఁగలరు. అట్టివారలకు,

"క. రాగాదిదోష దూషిత
మైంగర్హితమైన చిత్తమదిసంసారం
బాగతిఁ బరిత్యజించిన
వేగమె భవబంధములకు విరగడఁగాంచున్." (వా-రా. వి. ఆ.)

అనునట్లు రాగద్వేషాదులు విడిచిపోఁగలవు. అవెప్పుడు విడిచిపోవుచున్నవో యప్పుడు వారలకు జ్ఞానోదయమగును. అట్టిజ్ఞానమెప్పుడు గలుగుచున్నదో యప్పుడు సూర్యోదయమైనవెంటనే యదివఱకు చీఁకటియందు దృష్టికిగోచరముగాకుండిన వస్తువులన్నియు నెట్లు స్పష్టముగఁ గనఁబడుచున్నవో, అట్లే యదివఱకు నజ్ఞానాంధకారమువలన మనోదృష్టికి గోచరింపకుండిన పరబ్రహ్మస్వరూపము స్పష్టముగ గోచరింపఁగలదు. అందుచే సంసారబంధ విముక్తికాఁగలదు. కనుకనే తొల్లి బ్రహ్మ నారదునకు,

"చ. సరసగతిన్ మునీంద్రులు ప్రసన్నశరీరహృషీకమానస
స్ఫురణగలప్పుడవ్విభుని భూరికళాకలితస్వరూపముం
దరమిడిచూతురెప్పుడుగుతర్కతమోహతిచేతనజ్ఞతం
బొరసినయప్పు డవ్విభుని మూర్తిఁ గనుంగొన లేరు నారదా."

(భాగ. ద్వి.స్క. ౧౧౩)

అనఁగా, పరబ్రహ్మస్వరూపమును గనుఁగొనుటకుఁగా బ్రయత్నముసేయుచుఁ దన్నిమిత్తమై యనేకతపస్సులు మొదలగు వానినిఁజేయుచుండెడు మునీంద్రులైనను, దుర్వాదముఁజేయుచు నజ్ఞానసహితులైయుండు నంతవఱకు నాభగవంతునిఁ గనుఁగొనఁజాలరనియును, అట్లుగాక యింద్రియనిగ్రహముగలిగి నిర్మలమైనమనస్సుగలవారెప్పుడగుచున్నారో, అప్పు డాభగవత్స్వరూపమును జూడఁగలరనియును జెప్పియున్నాఁడు.

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ 17

అర్థము:— (తే) = వారు (అనఁగా, పైశ్లోకమునఁ జెప్పఁబడిన ప్రకారము బ్రహ్మజ్ఞానోదయమైనవారు), తద్బుద్ధయః = ఆపరమాత్మయందే బుద్ధిగలవారును, తదాత్మానః = ఆపరమాత్మయందేమనస్సుగలవారును, తన్నిష్ఠాః=పరమాత్మయందే

యాసక్తిగలవారును, తత్పరాయణాః = ఆపరమాత్మనే యాశ్రయించినవారును, జ్ఞాననిర్ధూతకల్మషాః +(సన్తః) = జ్ఞానముచేఁబోఁగొట్టఁబడినపాపములుగల వారునునై, అపునరావృత్తిమ్ = పునర్జన్మములేనిపదవిని (మోక్షమును), గచ్ఛన్తి = పొందుచున్నారు.

కావుననోయియర్జునా!

"చ. ఇతరము మాని తన్నుమది నెంతయు నమ్మి భజించువారి నా
శ్రితజన సేవితాంఘ్రిసరసీరుహుఁడైన సరోజనాభుఁడం
చితదయతోడ నిష్కపటచిత్తమునం గరుణించునట్టి వా
రతుల దురంతమైతనరు నవ్విభుమాయఁ దరింతురెప్పుడున్."

(భాగ. ౧౧స్కం. ౨౦౪)

అనునట్లు, ఎవరైతే యితరచింతలేవియులేక సర్వకాల సర్వావస్థలయందును నాభగవంతునియందే మనస్సునిలిపి యాయననే ధ్యానించుచు, ఆయనయందే యాసక్తిగలవారై యాయననే యాశ్రయింపుచున్నారో యట్టివారా భగవద్విషయక జ్ఞానముచే నశింపఁజేయఁబడిన పాపములుగలవారై మాయను దరించి పునరావృత్తి రహిత శాశ్వతమగు మోక్షపదవినిఁ జెందఁగలరు.

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! యిట్లుచెప్పితివిగదా, మంచిది, మాయ యొక్క సత్త్రప్రబలమైనదని యింతకుముందు చెప్పితివిగదా, కాన నట్లెవరైనఁ దమ మనోబుద్ధీంద్రియములను భగద్విషయమున సర్వదాప్రవర్తింపఁజేయుచుండినను, ఆమాయాబలముచే నొకానొకప్పుడైనను జలించుటగలుగునుగదా? అట్టివారలగతియేమి?

కృ — అవును, అట్లు చలించుటయునుగలదు. అట్లైనను, నంత్యకాలముననైనను మమకారమువిడిచి భగవంతునియందు నిశ్చలమైన భక్తిచేసినయెడల నట్టివారు సుఖతము పరమపదమును జెందఁగలరని యిదివరకే (స్థిత్వాస్యామన్తకాలేపిబ్రహ్మనిర్వాణమృచ్ఛతి) అని నీకుఁ జెప్పియున్నానుగదా. (చూ. 2–72). ఇందునకు నిదర్శనముగ బ్రహ్మసనకాదులతోఁజెప్పిన వాక్యములను జెప్పుచున్నానువినుము:

వ. సంసారమగ్నులై దివసంబులు ద్రొబ్బియు నంతంబున శునకసృగాల భక్ష్యంబులైన కాయంబులందు మమత్వంబు సేయక భగవదర్పణంబుసేసిన పుణ్యాత్ములం గొందఱుగల రెఱింగి-తువినుము. ఏను నీబ్రహ్మత్వంబునంజెందు రాజసంబువిడిచి యమ్మహాత్ముని పాదారవిందంబుల భక్తినిష్ఠుండనై శరణాగతత్వంబున భజియించునప్పుడు దెలియుదు. రాజసగుణుండనై యున్నవేళఁ దెలియఁజాల. కావున శాస్త్రంబులు ప్రపంచింపక కేవలభక్తిజ్ఞాన యోగంబున సేవింతును. మఱియు సన

కాములగు వీరును భగవంతుండైన రుద్రుండును, దైత్యపతియైన ప్రహ్లాదుండును, స్వాయంభువమనువు, నతనిపత్నియగు శతరూపయుఁ, దత్పుత్రులగు ప్రియవ్రతోత్తాన పాదులుం దత్పుత్రికలును, ప్రాచీనబర్హియు, ఋభువును, వేనజనకుండగు నంగుండును, ధ్రువుండును వెండియు,

సీ. గాధి గయాసు రేక్ష్వాకుదిలీప మాంధాతలు భీష్మ యయాతి సగర
రఘు ముచికుం దైళ రంతిదే వోద్ధవ, సారస్వ తోదంక భూరి షేణ
శ్రుతదేవ మారుతి శతధన్వ పిప్పల, బలి విభీషణ శిబి పార్థ విదుర
లంబరీష పరాశ రాలర్క సౌభరి, దేవల మిథిలేశ్వ రేంద్రదత్తు.

తే. గీ. లార్ష్టి షేణాదు లైన మహాత్ము లెలమి
దవిలి యద్దేవు భక్తిఁ జిత్తములనిలిపి
తత్పరాయణులౌట దుర్దాంతమైన
విష్ణుమాయఁ దరింతు రవ్విమలమతులు.

మ. అనఘా వీరల నెన్న నేమిటికిఁ దిర్యగ్జంతుసంతాన ప
క్షి నిశాటాటవికౌఘజీవనివహ స్త్రీ శూద్ర హూణాదులై
నను నారాయణభక్తియోగమహితానందాత్ములై రేని వా
రనయంబుం దరియింతు రవ్విభునిమాయావైభవాంభోనిధిన్.''

(భాగ. ౨స్క౦. ౨౦౫-౨౦౭.)

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! ఇపుడు నీవుచెప్పిన బ్రహ్మవాక్యములను, అనఁగా బ్రహ్మ సనకాదులకుఁ జెప్పినమాటలనుబట్టి చూడఁగా నీలోకమునందు బ్రహ్మర్షులును, రాజర్షులును, తపస్వులును, యోగులును మాత్రమే గాక యల్పజాతి వారును, పశుపక్ష్యాది తిర్యగ్జంతువులునుగూడ నిశ్చలమగు భగవద్భక్తిని జేసినయెడలఁ దరింపఁదగియున్నట్లగపడుచున్నదిగదా?

కృ — ఆహా, అవును. ఎట్టివారైననుసరే భగవంతునియందు నచంచలమగు భక్తిఁజేసినయెడల వారందఱియందును భగవంతుఁడు జాత్యాదిభేదముల నెంచక సమానమగు ప్రేమనే యుంచుచున్నాఁడు.

శ్లో॥ విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాస్సమదర్శినః ॥ 18

అర్థము:— విద్యావినయసమ్పన్నే = విద్యయునడఁకువయుఁగల, బ్రాహ్మణే = బ్రాహ్మణునియందును, గవి = గోవునందును, హస్తిని = ఏనుగునందును, శుని + చ + ఏవ = కుక్కయందును, శ్వపాకే + చ = కుక్కమాంసముఁదిను వానియందును,

సమదర్శినః = సమభావముగలవారు (అనఁగానీయన్నిటియందుండునాత్మ బ్రహ్మస్వరూపమేయని తలఁచువారు), పణ్డితాః = జ్ఞానులు.

కనుకనే పండితులగువారు

"చ. వినయము విద్యయుంగలుగు విప్రునియందును గోవునందు నో
ప్పానెరయు హస్తియందునొక పోఁకకుఁబోవని కుక్కయందుఁదా
నినడిచి తెచ్చివండితిను నీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనులు దందతరాత్మునినిరంజను నింగనునట్టి పండితుల్."
(భార. శాం. ౫. అ. ౧౦౯.

అనునట్లు, విద్యయు నడఁకువయుఁగల బ్రాహ్మణునందును, గోవునందును నేనుఁగునందును, శునకమందును, దానిమాంసముదినువానియందును సమభావము గలవారై యుందురు. అనఁగాఁ బైవాని యన్నిటియందును సమభావముగల వారెవరో యట్టివారే పండితు లనఁబడుదురు.

శ్లో॥ ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥ 19

అర్థము:— యేషామ్ = ఎవరియొక్క, మనః = మనస్సు, సామ్యే = (పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జంతువులయెడల) సమభావమునందు, స్థితమ్ = స్థిరమై యుంచున్నదో, తైః = వారలచేత, ఇహ + ఏవ = ఈజన్మమునందె, సర్గః = సంసారము, జితః = జయింపఁబడినది, బ్రహ్మ = పరమాత్మ, సమమ్ = (సమానప్రపంచమందు) సమభావముగలవాఁడును, నిర్దోషం + హి = దోషరహితుఁడునుగదా, తస్మాత్ = ఆ కారణమువలన, తే = అట్టిసమభావముగలవారు, బ్రహ్మణి + ఏవ = పరమాత్మయందే, స్థితాః = ఉన్నవారగుదురు.

అట్లెవరైతే యీప్రపంచమందుండు పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్త జంతువులయందును, సమబుద్ధిగలవారై యుంచున్నారో యట్టివారే సంసారమును జయించినవారు. అనఁగా మాయనుదరించిన వారగుచున్నారు. ఏలయనఁగా

"గీ. తాపసులయందు శాస్త్రవిత్పన్నులందు
యాచకులయందు నృపులందు నతిబలాఢ్యు
లందు సమయుక్తుఁడగువాఁడ యధికుఁడెందు
ననియెఱుంగుము మనమున మనుకులేశ. (వాసి. రా. ౧ అ.)

అనునట్లును,

"లయగ్రాహి॥ భృంగములయందును దరంగములయందును విహంగములయందును
గురంగములయందున్
సింగములయందును బ్లవంగములయందును దురంగములయందును భుజంగములయందే
కాంగులగు దేవమునిపుంగవనరాదిఘన జంగమము లందును నజంగములలందున్
సంగమును భంగము గలుంగ కొకభంగిని వెలుంగుదును నేనని కనుంగొనుము వత్సా"
(సీతా. రా. అర. ౧౩౪ )

అని శ్రీరామచంద్రుం డాంజనేయునితోఁ జెప్పినరీతిని, నీప్రపంచమునందలి పిపీలికాది బ్రహ్మపర్యంతమగు సమస్తజంతువులయందును నాపరమాత్మయే వ్యాపించి యున్నాఁడు గనుకను, నట్టిపరమాత్మ దోషరహితుఁడు గనుకను, నెవరైతే, అట్టి సమస్త జంతువులను బరబ్రహ్మ స్వరూపములుగను దోషరహితములుగను నెప్పుడు తెలిసికొనుచున్నారో, అప్పుడట్టివారు మాయను దరించిన వారగుచున్నారు. అట్లు మాయ నెప్పుడు తరించినవారగుచున్నారో, అప్పుడు

"ఉ. సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడున్
సర్వజగత్ప్రసిద్ధుఁ డను సర్వగుఁడున్నగు చక్రపాణి యీ
సర్వశరీరులున్విగతి సంసృతిఁ జెంది విశీర్యమాణులై
పర్వినచో నథంగు గతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్."
(భాగ. ౧౦స్కం. ౨౧౨ )

అనునట్లు, అజ్ఞానము నశించినవారై తాము నాపరబ్రహ్మస్వరూపముగనే ప్రకాశింతురు. గాననట్టివారు పరబ్రహ్మయందే యున్నవారలగుచున్నారు.

అర్జు — అట్లజ్ఞానమునశించినవారు పరబ్రహ్మస్వరూపులగుదురని చెప్పితివి గదా ? అట్టివారిలక్షణము లెట్లుండును ?

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః 20

అర్థము:— బ్రహ్మణి + స్థితః = (పైశ్లోకమునఁ జెప్పఁబడినప్రకారము) పరమాత్మయందే యున్నవాఁడు, అనఁగా బ్రహ్మభావమునొందినవాఁడు, స్థిరబుద్ధిః = చలింపని చిత్తముగలవాఁడును, అసమ్మూఢః = మోహరహితుఁడును, బ్రహ్మవిత్ + (సన్) = బ్రహ్మజ్ఞానముగలవాఁడునగుచు, ప్రియమ్ = ఇష్టమైనదానిని, ప్రాప్య = పొంది (పొందినపుడు), న + ప్రహృష్యేత్ = సంతోషింపఁడు, అప్రియమ్ = ఇష్టముగానిదానిని, ప్రాప్య = పొంది (పొందినపుడు), న + ఉద్విజేత్ + చ = వ్యసనమును బొందను బొందఁడు.

కృ — అట్లుబ్రహ్మమునందున్నవాఁడే బ్రహ్మవిదుఁడు. అనఁగా బ్రహ్మస్వరూపము నెఱిఁగిన వాఁడనఁబడును. అట్టివాని లక్షణము లెట్టివనఁగా, స్థిరబుద్ధిగల వాఁడును మోహరహితుఁడును నై

"క. హర్షంబును మానంబు న
మర్షము నపరాధమును సమద భావము ను
త్కర్షాపకర్ష చింతలు
నార్ష సమాచారమున నిరస్తగుణంబుల్." (భార. శాంతి. ౫. ఆ. ౨౪.)

అనునట్లు, ప్రియముచే కూడినపుడు సంతోషమును నప్రియము గలిగినపుడు దుఃఖమును బొందకుండును.

అర్జు — అనఁగా నదియెట్లో వివరించి చెప్పుము.

కృ —

"తే. గీ. పొలుచు వేడుకఁ బెండ్లికిఁ బోవునపుడు
నుగ్రులై చంపఁగొనిపోవుచున్న యెడలఁ
జిత్తమెంతయుఁ జల్లనై శీతకరుని
చందముననున్న యాతండు శాంతుఁడండ్రు." (వాసి. రా. ౧. ఆ.)

అనునట్లెవఁడైతే పెండ్లికిఁగాను మేళతాళములతో నూరేగుచు బంధుజన సహితముగ బోవునపుడు సంతోషమును, దన్నుఁజంపుటకుఁగా నితరులు దీసికొనిపోవునపుడు దుఃఖమును లేక యొకటేతీరగు మనస్సుగలవాఁడై యుంచున్నాఁడో యట్టివాడే సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

అర్జు — ఇట్టిసమయములయందుఁగూడ నంత నిబ్బరముగ నుండువారుగలరా?

కృ — ఆహా! కలరు. అయితే, అట్టివారు మిక్కిలి యరుదుగా నుందురు. ఇందునకు నిదర్శనముగ నొక యితిహాసముఁజెప్పెద వినుము. ఇదివఱకు నీకొకవిషయమునకు నిదర్శనముగా జడభరతుని కథఁజెప్పియుంటినిగదా, ఆజడభరతుఁడొక నాటిరాత్రి యతని సవతితల్లికొడుకులచేఁ జేనిలోఁగావలిగా నియమింపఁబడి యచట సమాధినిష్ఠుఁడైయుండఁగా నాపటణమేలెడు వృషలరాజు సంతానకాముఁడై కాళికాదేవికి బలియిచ్చుటకు నియమింపఁబడిన నరపశువులను నతని భృత్యులు కాళికాలయమునకుఁ గొనిపోవుచుండ వారలనేమరించి యానరపశువు తప్పించుకొని పాఱిపోవఁగా నపుడా భృత్యులు వెదకియు వానింగనఁజాలక యాసమీపమునఁ జేనిలో సమాధినిష్ఠుఁడై యుండు నీజడభరతుని బలియిచ్చుటకుఁ బట్టుకొనిపోయి యభ్యంజనాది కృత్యములు జరిగించి కాళియెదుటఁగూర్చుండఁబెట్టిరి, అపుడు వృషలరాజు భరతునిఁ బశువునుగా

బలియిచ్చుటకుఁ బూనుకొని ఖడ్గమెత్తి నఱకఁబోఁగా నిట్టి మహానుభావుని దనకు బలి యివ్వఁదలఁచిన యావృషులఁనిపైఁ గాళికాదేవి యాగ్రహించి యారాజును సపరివారముగ నఱికివేసెను. అపుడా భరతుఁడు

" ఉ. అచ్చట విప్రసూనుఁడు భయంబొక యించుకలేక చంపఁగా
వచ్చినవారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దా
నచ్యుత భావముంచిహృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానమునొందక యుండె నెంతయున్."

(భాగ, 5స్క—ం. ౧. ఆ. ౧3౯.)

కాన నట్టిమహానుభావులంత నిబ్బరముగ నుండఁగలరు. అయితే, అట్టివారీ ప్రపంచమున మిక్కిలి యరుదుగ నుందురు.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యస్సుఖమ్।
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥ 21

అర్థము:— యః = ఎవఁడు, బాహ్యస్పర్శేషు = అత్మేతరవిషయములయందు, అసక్తాత్మా = ఆసక్తచిత్తుఁడుకానివాఁడై, అత్మని = ఆత్మయందే, సుఖమ్ = సుఖమును, విన్దతి = అనుభవింపుచున్నాఁడో, సః=వాఁడు, బ్రహ్మయోగయుక్తాత్మా= బ్రహ్మధ్యానముతోఁగూడినమనస్సుగలవాఁడై, అక్షయమ్= శాశ్వతమైన, సుఖమ్= సుఖమును, అశ్నుతే = అనుభవింపుచున్నాఁడు.

కాననట్టి మహానుభావులు బాహ్యవిషయములయందనాసక్తచిత్తులగుచు, అనఁగా జ్ఞానేంద్రియములు శబ్దాది విషయములయందుఁ బ్రవర్తించునపుడును కర్మేంద్రియములు వానివాని వ్యాపారములయందుఁ బ్రవర్తించునపుడును నట్టివిషయముల వలనఁగాని యెలాటి మనోవికారమును నొందక తనమనోదృష్టిచే నాపరబ్రహ్మస్వరూపమునే చూచుచు నానందించుచుండును. అట్లుండ వాఁడు బ్రహ్మసమాధియందున్నవాఁడై, అనఁగా నాపరబ్రహ్మమందైక్యమును జెందిన మనస్సుగలవాఁడై యక్షయమగు బ్రహ్మానందము ననుభవింపుచుండునేగాని బాహ్యవిషయ సుఖముల యందెంతమాత్రమును నానందింపఁడు.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః॥ 22

అర్థము:— హేకౌన్తేయ! = ఓయర్జునా!, హి = ఏలయనఁగా (పైశ్లోకమునఁ జెప్పినప్రకారము విషయాసక్తుఁడుగానివాఁడు శాశ్వతసుఖమననుభవించుటకుఁగారణ

మేమనఁగా), యే = ఏవి, సంస్పర్శజాః = విషయసంయోగములవలనఁ గలిగిన, భోగాః = సుఖములో, తే = అవి, దుఃఖయోనయః+ఏవ = దుఃఖహేతువులే, (తే) = అవి, ఆద్యన్తవన్తః = ఉత్పత్తినాశములుగలవి, (తస్మాత్) = కాఁబట్టి, బుధః = జ్ఞానియగువాఁడు, తేషు = ఆవిషయసుఖములయందు, న+రమతే = రమించఁడు (అనఁగా ననురక్తుఁడుగాఁడు).

ఏలయనఁగా నీబాహ్యవిషయ సంబంధములగు సుఖములన్నియు నాద్యంతములు గలవి గనుక నవి తుదకు దుఃఖకరములేయగుచుండును. అదెట్లనఁగా నొకఁడొకప్పుడు మిగులరుచికరములగు పదార్థముల భక్షింపుచు నానందించుచున్నాఁడు. అట్టిపదార్థముల రుచిని మరగినవాఁడగుటచే నాపదార్థములు లభింపక యరుచికరములగు పదార్థములు లభించినపుడు వానిమనస్సునకు దుఃఖముగలుగక పోదుగదా? అట్లా రుచికరములగు పదార్థముల ననుభవింపకయే యుండినయెడలను, లేక, యవిలభించినపు డనుభవించినను, నివి దనకెల్లపుడును లభింపఁదగినవి గావనెడు తలంపుతో వానియందు మిగుల నాసక్తచిత్తుఁడుగాకుండినను, అట్టి పదార్థములు లభించనపుడు వానిమనస్సునకట్టి దుఃఖముగలుగనేరదుగదా? ఇట్లే తక్కినయన్నియింద్రియ విషయసుఖములును శాశ్వతములుగావుగనుక నవిలభించుచుండు నంతవఱకు సుఖమునిచ్చుచుఁ బిమ్మట, అనఁగా నవి లభింపనపు డవియే దుఃఖమునకుఁ గారణభూతములగుచున్నవి. కనుకనే జ్ఞానియగు వాఁ డట్టి విషయసుఖములయందు రమింపఁడు. అనఁగా

“క. భోగంబుఁ దపముఁ బోరిబోరి రాగవిరాగతల
హృదయ రంగంబునఁ గే
ళీగతులఁ బేర్చి యార్చుచు
యోగి యనుభవించుఁ దగిలియుండఁ డెందున్ ”

(భార. శాంతి. ౨ఆ. ౨౧౪.)

అనునట్లు వానిని, అనఁగా నావిషయసుఖములఁ బారబ్ధవశమున ననుభవింపుచుండినను నప్పుడప్పుడు విరక్తిమార్గము నవలంబించుచు నివియన్నియు ననిత్యములనియుఁ దుదకు దుఃఖకరములేయగునవియనియుఁ దలఁచుచు వానియెడల మిగుల నాసక్తచిత్తుఁడుగాక జాగరూకుఁడై మెలగుచుండును.

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! ఎవఁడైననొక రుచికరమగు పదార్థము ననుభవించినయెడల దానిరుచిమరగి మరల దానినే యభిలషించుట యీలోకమునఁ బ్రతిపురుషునకు సహజమైనసంగతిగనున్నదిగదా. అట్లే ప్రతివిషయసుఖము ననుభవించెడువాఁడు దానియందలి రుచిమరగుట సహజమైనసంగతిగ నున్నదిగదా.

అట్లుండఁగా నట్టివిషయములనొక వెంబడిననుభవింపుము దానియందు రుచిమరగక విరక్తి గలిగియుండుట బహుకష్టసాధ్యముగదా.

శ్లో॥ శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీనరః ॥ 23

అర్థము:— యః = ఎవఁడు, ఇహ + ఏవ = ఈ (లోకమందే), శరీరమోక్షణాత్ = శరీరమువిడుచుటకంటె, ప్రాక్ = ముందుగనే, కామక్రోధోద్భవమ్ = కామక్రోధజన్యమగు, వేగమ్ = తీవ్రమును, సోఢుమ్ = సహించుటకొఱకు, శక్నోతి = శక్తుఁడగుచున్నాఁడో, సః + నరః = అట్టిమనుష్యుఁడు, యుక్తః = యోగసిద్ధినిబొందినవాఁడగుచున్నాఁడు, సః = వాఁడు, సుఖీ = మనస్సౌఖ్యముగలవాఁడగుచున్నాఁడు.

కృ — అవును, అట్లుచేయుట మిగులఁ గష్టసాధ్యమే. అందఱును నట్లు చేయుట సాధ్యపడదు. ప్రతిపురుషుఁడును నీప్రపంచమున జీవించియుండునంతవఱకుఁ గామక్రోధాదులచేఁ బీడింపఁబడుచునే యుండును. అట్టి కామక్రోధాదులయొక్క వేగము నెవఁడైతే సహింపగలఁడో అనఁగావాని నిగ్రహింపగలఁడో అట్టివానికట్లుచేయుటకు సాధ్యపడునేగాని తదితరులకు సాధ్యపడనేరదు. కాన నట్టివాఁడే నిజమైన సుఖియగునుగాని విషయసుఖముల ననుభవించెడువాడుసుఖి కాఁడు. అయితే అట్లుచేయుటకు సంపూర్ణమైన యోగబలముగలవానికే గాని యొకమాత్రపుయోగికి సాధ్యపడనేరదు. అదెట్లనఁగా,

"క. స్రోతోవేగము పటుగతి
వీతబలుందిగుచునట్ల విషయము లీడ్చుం
జేతో బలసంభృతయో
గాతిశయుఁడుఁగాని వాని నంచితచరితా"

(భార. శాంతి. ౨అ. ౨౮౧.)

అనునట్లు, ఒకనదిపూర్ణప్రవాహముగాఁ బాఱుచుండు నపుడాప్రవాహమున నెవఁడైన బలహీనుఁడుగా నుండెడు వాఁడు దిగినయెడల వాఁడాప్రవాహవేగమునకుఁ దట్టుకొనలేక యాప్రవాహములో నెట్టుకొట్టుకొనిపోవునో యట్లేచాలినంత యోగబలములేనివాని మనస్సును విషయములీడ్చును. అట్లుగాక యోగసిద్ధిని బొందిన దృఢచిత్తుఁడైనయెడల నట్టివాఁడు.

"క. నదిరయము వారణేంద్రుఁడు
గుదియించినయట్లుపోలె గురువరదైన్యా

స్పదమగు విషయోల్లాసము
గుదియించునుయోగసిద్ధి గురువ్యాధ్యలుఁడున్ "

(భార. శాంతి. ౫ఆ. ౫౮-౯.)

అనునట్లు, అట్టి నదీప్రవాహవేగము నేనుఁగెట్లు సడ్డసేయక యానదిని దాఁటి పోఁగలదో యట్లే యింద్రియ విషయములయొక్కయుఁ, గామక్రోధాదుల యొక్కయు, బలము నింతమాత్రము సడ్డసేయక వానిచేఁ దనమనస్సును జలింపనీక యుండఁగలఁడు. అయితే, అట్టి యోగబలమొకటేసారి కలుగనేరదు. మఱేమన్నను,

"క. యోగులకు యోగబలమున
రాగముమోహంబునుం జిరస్నేహముఁగా
మాగమముక్రోధమును గుణ
యోగముఁబెడఁ బాపవరుస నున్నతియొలయున్ "

(భార. శాంతి. ౫ఆ. ౫౭౬.)

అనునట్లు, యోగాభ్యాసకుఁడు రాగమోహాదులను గామక్రోధాదులను, అడఁచుచు రాఁగారాఁగాఁ గ్రమక్రమముగా యోగబలము హెచ్చుచుఁ దుదకు సంపూర్ణయోగసిద్ధినిఁ జెందఁగలఁడు. అట్టిసంపూర్ణసిద్ధి నెప్పుడు పొందుచున్నాఁడో యప్పుడు

"చ. ఘనరుషముఁన్ సముద్ధతమృగంబును జాలము వచ్చి వాగురా
వినిహతిఁజేసియిష్టపదవిం జనుచాడ్పున యోగతంత్రరో
ధన మగులోభజాతదురితవ్రజముం బెడఁబాచిసత్పథం
బునఁ జరియించుయోగిసుఖమూర్తిత సుస్థితగావహించుచున్."

(భార. శాంతి. ౫ఆ. ౫౭౭.)

అనునట్లు, గొప్పమత్స్యమువలలోఁబడినపు డావలను బటాపంచలుగఁ జించివేసి యెట్లువెళ్ళిపోవునోయట్లును, మంచిబలముతోఁ గూడికొనియుండు మృగ మురిలోఁ జిక్కికొనినపు డాయురిత్రాళ్ళను దనబలముచేఁద్రెంచివేసి యెట్లువెళ్ళిపోవునో యట్లును, నట్టిసంపూర్ణసిద్ధిని బొందినయోగి కామక్రోధాదులలోఁజిక్కువడక తప్పించుకొనుచు నెపుడును సన్మార్గమునవే ప్రవర్తింపఁగలఁడు. అట్లు, సంపూర్ణమగు యోగసిద్ధినిబొందని వానిగతియేమనఁగా

"ఆ. యోగబలములేని యొకభంగియోగిబల్
ద్రోపు లేనిమీను నేపులేని
మృగము వలయును రియాఁ దెగిపోవ నుఱుకంగ
లేనియట్ల భవములోన నడఁగు."

(భార. శాంతి. ౫ఆ. ౫౭౮.)

అనునట్లు, బలములేని కొద్దిపాటిచేఁపగాని మృగముగాని వలలోను, ఉరిలోను దగులుకొనినపుడు వానిని త్రెంచుకొని పైటఁబోలేక యా వలయందును నురియందును జిక్కుకొని యెట్లు చచ్చుచున్నవో యట్లే సంపూర్ణయోగబలములేని యొకమాత్రపుయోగి కామక్రోధాదుల జయించెడుశక్తిచాలక వానికి లోఁబడి బద్ధుఁడగును.

అర్జు — ఎవఁడైన యోగము నభ్యసించెడు వాఁడా యోగబలమునందుఁ గ్రమక్రమముగ హెచ్చుచుఁ గొంతకాలమునకు సంపూర్ణబలము నొందునని చెప్పితివిగదా. అందునకుఁ గారణమేమి? యోగమనఁగా నింద్రియనిగ్రహముగలిగి కామక్రోధాదుల నడఁచి స్వకులోచితకర్మల యథావిధిగ నాచరింపుచు నిష్కాముఁడై యుండుటయేగదా. అట్లు యోగిగావలయునని కోరెడు ప్రతిపురుషుఁడును సులభముగ నాచరింపవచ్చునే అట్లెప్పుడాచరింప మొదలుపెట్టుచున్నాఁడో, యప్పుడే యోగియగుచున్నాఁడుగదా. అట్టివానికా యోగముయొక్క సంపూర్ణబల మా వెంటనే గలుగక చాలాకాలమువఱకు నట్లాచరింపుచు రాఁగరాఁగఁ గ్రమక్రమముగ హెచ్చి పిమ్మట సంపూర్ణబలము గలుగవలసిన కారణమేమి?

కృ — ఓహో! నీవట్లనుకొనుచున్నావు కాఁబోలును. పులిని జూచి నక్కవాతవేసికొన్నట్లెవఁడైన నొక యోగినిజూచి తాను నట్లే యోగిగావలయునని యా యోగినటించినట్లే తానును నటించినంత మాత్రముచేతనే యోగసిద్ధిగలుగు ననుకొనుచున్నావుగాఁబోలును. అట్లెంతమాత్రము గలుగనేరదు. ఇంద్రియవిషయములయొక్కయుఁ గామక్రోధాదులయొక్కయు నిరసనము మనోబలముచేఁ జేయఁదగలసియున్నది. అట్టి మనోబలమన్నదో యభ్యాసవశమునఁ గ్రమక్రమముగ హెచ్చవలసినదేగాని యొక్కసారిగాఁ గలుగఁదగినదిగాదు. అదెట్లనఁగా,

“ఆ. అల్పమైనయగ్ని యడఁగునిబంధనములు
మీఁద నైవబలము మిగులలేని
యోగమట్లు తనకు నురవట్టిదానన
సాధ్యమొందు సకల జనమనోజ్ఞ.

ఆ. ఇద్ధమైనయగ్ని యింధనసంపద
నతిశయిల్లునట్లు లధికబలస
మగ్రసారయోగ మహిమయు నంతంత
కగ్గలించు వ్రతము లగ్గలింప”

(భార. శాంతి. ౫.ఆ. ౫౭౯,౫౮౦.)

అనునట్లొక యణుమాత్రపు నిప్పునుదెచ్చి దానినొకగుడ్డపేలికలోఁగాని గడ్డిలోఁగాని చుట్టి యూదినయెడల నది మండుచున్నదిగదా. అందుపైని సన్ననియెండుపుల్లలు మొదలగునవివేసినయెడల నామంటకొంచెము హెచ్చుచున్నదిగదా. అందుపైనిగట్టెలు మొదలగువానిఁ జేర్చుచురాఁగరాఁగ నామంట ప్రబలమై గొప్పమంటయగుచున్నది గదా, అందుపై నెన్నికట్టెలు వేసినను నంతకంతకు నాయగ్ని ప్రజ్వలింపుచుండునేగాని సమసిపోనేరదుగదా, అట్లుగాక, మొదటఁ దేఁబడిన యణుమాత్రపు నిప్పును బెద్దమంటగాఁ బ్రజ్వలింపజేయవలెనని కోరెడువాఁడిప్పుడు నేఁజెప్పినవిధముగఁ గ్రమక్రమమున నభివృద్ధిసేయుటకు బదులుగ నా యణుమాత్రపు నిప్పుపైనొకటే సారిగ మోపెడు కట్టెలు వేసినయెడల నది మంటమండి ప్రజ్వలించునా?

అర్జు — ప్రజ్వలింపదు. అందునకు బదులుగ నానిప్పు సమసిపోవును.

కృ — మంచిది, ఇప్పుడు నేఁజెప్పినప్రకారము క్రమక్రమముగాఁ బ్రజ్వలింపయందుపై నా మోపెడు కట్టెలు వేసినయెడల నప్పుడేమగును?

అర్జు — అపుడు మఱింత ప్రజ్వలించి గొప్పమంటమండును.

కృ — అవునుగదా. ఈయోగాభ్యాసము నట్టిదేయని యెఱుంగుము. అనఁగా యోగాభ్యాసియగువాఁ డింద్రియ నిగ్రహాది కృత్యములను జేయుచు రాఁగరాఁగ వాని మనస్సునకుఁ గ్రమక్రమముగ బలముకలిగి మొదటఁ గష్టతరముగనుండునట్టి యింద్రియనిగ్రహాదికృత్యమును కొంతకాలమునకు సుఖతరముగా నేర్పడును. తుదకు నింద్రియయవిషయాదులు వానినేమియు బాధింపఁజాలవు అట్టిస్థితి కెప్పుడు వచ్చుచున్నాఁడో యప్పుడువాఁడు కామక్రోధాదులను జయింపశక్తిగలవాఁడగును. గాన

" తే. గీ. పాపములకెల్ల నెక్కుడుపాతకములు
నూవె క్రోధలోభంబులు సువ్రతాత్మ
వానిరెంటి జయించినవాఁడు గాని
యెందుఁ బరమధార్మికుఁడని యెన్నఁబడఁడు. " (భార. అరణ్య. ౫.ఆ.౪౨.)

అనునట్లు, సమస్త పాపములకు మూలాధారములగు కామక్రోధములను జయించిననేగాని సంపూర్ణుఁడగు యోగికాఁజాలఁడు.

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవయః।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24

అర్థము :— యః = ఎవఁడు, అన్తస్సుఖః = ఆత్మయందే సుఖించువాఁడును, అన్తరారామః = ఆత్మయందే క్రీడించువాఁడునై యున్నాఁడో, తథా=అలాగుననే, యః = ఎవఁడు, అన్తర్జ్యోతిః + ఏవ =ఆత్మయందే దృష్టిగలవాఁడునైయున్నాఁడో,

సః + యోగీ = అట్టియోగాభ్యాసి, బ్రహ్మభూతః + (సః) = బ్రహ్మస్వరూపుఁడై, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మసాయుజ్యమును, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

కామక్రోధములు జ్ఞానికి నిత్యవైరులనియు, జ్ఞానమువానిచే నావరింపఁబడి యుంచున్నదనియు నిదివఱకే చెప్పియుంటిని గదా (చూ. 3. 37. 38), కాన నెవఁడైన నట్టి కామక్రోధములజయించుటకుఁ దగినంత సంపూర్ణమైనయోగము నెప్పుడు పొందుచున్నాఁడో యప్పుడు వానిజ్ఞానము శత్రురహితమును, నావరణరహితమునునై నిర్మలముగఁ బ్రకాశింపఁగలదు. అట్టి నిర్మలజ్ఞానమెప్పుడు గలుగుచున్నదో యప్పుడు వానికి,

సీ. స్థూలశరీరంబు సుస్థిరముగనుండు సకలేంద్రియము లుపశాంతినొందు
సన్మనఃపవనముల్ సంచలింపక యుండు గామాదిశత్రువర్గమునశించు
స్ఫురదమానిత్వాదిసుగుణముల్ సమకూఱు,ఘనగుణాతీతలక్షణము నొదవుఁ
బొలుపారువైరాగ్య బోధోపరతులుసంపూర్ణంబులై మదిఁ బొదలుచుండుఁ

తే. గీ. బరమసుఖవార్ధియుప్పొంగి పొఱుచుండు
మంచటవసించు మోహించి మోక్షలక్ష్మి
సంశయములేక దృఢముగా సంతతంబు
సర్వమును బ్రహ్మమని చూచు శాంతనిధికి " (సీ. రా. 3 ఆ. ౬౪.)

అనునట్లు, ఇట్టిలక్షణములు గలుగును. ఇట్టిలక్షణము లెప్పుడుగలుగుచున్నవో యప్పుడు వాఁడు పరబ్రహ్మస్వరూపియై తనలోఁదానే సుఖించుచు బ్రహ్మానందమును బొందుచు బ్రహ్మపదమును జెందుచున్నాఁడు.

అర్జు — అయ్యా! కృష్ణమూర్తీ! ఇప్పుడు నీవు చెప్పినదంతెయుఁ జక్కఁగ నాలోచించిచూడఁగా నెవఁడైననుసరే యేయాశ్రమ మందుండిన వాఁడైనను సరే బ్రహ్మపదవిని బొందుట కర్హుఁడుగాఁ దగియున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. అట్లు నాకుఁదోఁచు నీయంశము సరియైనదా నా? కాదా?

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః॥ 25

అర్థము :— ఛిన్నద్వైధాః = ఛిన్న = ఛేదింపఁ బడిన (పోఁగొట్టఁబడిన), ద్వైధాః = ద్వివిధము (సంశయము) గలవారును, యతాత్మానః = స్వాధీనమైన మనస్సుగలవారును, సర్వభూతహితే + రతాః = సమస్త ప్రాణులయెడలఁ బ్రీతిగల వారునగు, ఋషయః = ఋషులు, క్షీణకల్మషాః + (సన్తః) = క్షీణించిన పాపము గలవారై, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మసాయుజ్యమును, లభన్తే = పొందుచున్నారు.

కృ — అహా! నీకుఁదోఁచిన యభిప్రాయము సరియైనదే. అయితే, ఆయా యాశ్రమమునుబట్టి వారివారికిఁ దారతమ్యమును, నామభేదములును గలవు. ఆయెట్లనిన, నీలోకమున బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, యత్యాశ్రమములని నాలుగాశ్రమములు గదా? అందు శ్రీశుకునివలె బ్రహ్మచర్యమున నుండియే ముముక్షువులై తక్కినయాశ్రమముల నొల్లక యోగము నభ్యసించి ముక్తులగువారు కొందఱును, జనకచక్రవర్తివలె గృహస్థాశ్రమమున నుండియే నిష్కామకర్మయోగము నాచరించి ముక్తులగువారు కొందఱును, ఈరెండాశ్రమములను యథావిధిగఁ గడపి ముముక్షువులై వానప్రస్థాశ్రమము నవలంబించి ముక్తులగువారుకొందఱును నైయుంచున్నారు. ఇట్టి వీరందఱును ఋషులనఁబడుదురు. ఇట్టి మహర్షులు మనోనిగ్రహము గలవారును, సంశయరహితులునై యుంచున్నారు. సంశయరహితు లనఁగా,

సీ॥ ఘటశరావాదిమృత్కార్యజాతంబుల నెంచిమృత్తికయని కాంచుపగిది
నమలకుండలకిరీటాదిభూషణముల, స్వర్ణంబని యెఱుంగు చందమునను
నసికుంతశూలచక్రాదికంబుల నెల్ల నినుమని యరసికన్గొనినభంగిఁ
బొలుపారు ఫేనబుద్బుదతరంగంబుల మంచినీరని విలోకించురీతిఁ

తే. గీ. దనరు బహువిధ పటములఁ దంతువనుచుఁ
దెలియుకైవడి మొదలిసందియము విడిచి
భ్రాంతిని దొలంగి సర్వంబు బ్రహ్మమనుచు
సుఖముగా సంతతంబును జూచునతఁడు." (సీ. రా. ౩ ఆ. ౯౩)

అనునట్లు, తమయందుండెడు జీవాత్మలకును దక్కిన సమస్తజంతుజాలములయందుండెడు జీవాత్మలకును నేమియు భేదములేదనియు, నివియన్నియు నాపరమాత్మస్వరూపము లేయనియుఁ దెలిసికొన్నవారై యావిషయమున నేలాటి సందేహమును లేక నిశ్చయబుద్ధి గలిగియుండువారని తాత్పర్యము. కనుకనే యట్టివారు సమస్తభూతములును దమవంటివేయని తెలిసికొనినవారు గాన నట్టి సమస్తభూతములకును నెప్పుడు హితమునే చేయఁగోరుచుందురు. కాన నట్టివార లేపాపము నంటక గతకల్మషు లగుదురు. కనుక నట్టివారు బ్రహ్మపదవిని బొందుచున్నారు.

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ 26

అర్థము :— కామక్రోధవియుక్తానామ్ = కామక్రోధములచేత విడువఁబడినవారును, యతచేతసామ్ = స్వాధీనమైన మనస్సుగలవారును, విదితాత్మనామ్=ఆత్మజ్ఞానము గలవారునునగు, యతీనామ్=సన్న్యాసులకు, బ్రహ్మనిర్వాణమ్ = బ్రహ్మ

సాయుజ్యము, అభితః = (ఇహపరములయందు) అంతటను, వర్తతే = ఉంచు న్నది (కలుగుచున్నదనుట.)

ఇంకను బైమూడాశ్రమములుగాక నాల్గవదియగు సన్న్యాసాశ్రమమునందుండు వారెట్టి వారలనఁగా వారిలోఁ గొందఱు పైఁజెప్పబడిన బ్రహ్మచర్య, గార్హస్థ్య, వాన ప్రస్థాశ్రమములు మూడును యథావిధిగఁ గడపి, ఆయాశ్రమములయందు వారికిఁ గలిగియుండెడు ననుభవజ్ఞానముచేఁ బొడమిన నిజమైన వైరాగ్యముగలవారై సన్న్య సించినవారును, మఱికొందఱు వారివారి పూర్వజన్మసుకృతాను సారముగ నట్టి మూడాశ్రమములయందలి ధర్మాచారములను క్రమముగ నిర్వర్తింపకమునుపే యట్లు నిర్వర్తించిన వారికి ననుభవజ్ఞానముచేఁ గలిగెడు విరక్తివంటి విరక్తియేగలిగినవారై సన్న్యసించుచున్నారు. ఇట్లు నిజమైన విరక్తిగలిగి సన్న్యసించినవారే యతులనియు, సాంఖ్యు లనియుఁ జెప్పఁబడుదురు. వీరే నైష్కర్మ్యసిద్ధినిబొందినవారు. అనఁగా నేలాటికర్మయు నాచరింపఁ బనిలేనివారును, కేవల పరబ్రహ్మస్వరూపులును నై ప్రవ ర్తింపుచుందురు. కాన వారు విజితేంద్రియులును కామక్రోధరహితులునునై, యీ ప్రపంచమంతయుఁ బరబ్రహ్మస్వరూపమేయని తెలిసికొన్నవారై, సుఖింపుచుందురు. కాన నట్టివా రంతటను ముక్తులయ్యేయుందురు. అనఁగా నట్టివారీ దేహమును విడిచి పరలోకగతులైనప్పుడు ముక్తులగుటసరేగదా యీదేహములతో నీలోకమునఁ బ్రవ ర్తింపుచుండియుఁగూడ ముక్తులేయగుచున్నారు.

శ్లో॥ స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరేభ్రువోః।
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యన్తరచారిణౌ॥ 27

శ్లో॥ యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదాముక్తఏవసః॥ 28

అర్థము:— యః = ఎవఁడు, బాహ్యాన్ = బాహ్యములగు, స్పర్శాన్ = విష యములను, బహిః+కృత్వా = బయటనేయుంచి (మనస్సునందుఁజొరనీక), చక్షుః+చ = దృష్టిని, భ్రువోః = కనుబొమలయొక్క, అన్తరే+ఏవ = మధ్య ప్రదేశమందే, కృత్వా = చేసి (అనఁగానిలిపి), నాసాభ్యన్తరచారిణౌ = ముక్కుల లోపల సంచరించునట్టి, ప్రాణాపానౌ, ప్రాణాపానవాయువులను, సమౌ = సమ ములుగా, కృత్వా=చేసి, యతేంద్రియమనోబుద్ధిః=స్వాధీనమైన యింద్రియములును, మనస్సును, బుద్ధియుఁ గలవాఁడును, విగతేచ్ఛాభయక్రోధః = పోయిన యాశయు, భయమును, క్రోధమును, గలవాఁడును, మోక్షపరాయణః = మోక్షమునం దాసక్తి

గలవాఁడును నగు, సః + మునిః = అట్టి మననశీలుఁడు, సదా = ఎల్లప్పుడు, ముక్తః + ఏవ = ముక్తుఁడే (మోక్షమును బొందినవాఁడే).

అదెట్లనఁగా నెవఁడైతే బాహ్యవిషయములయందు మనస్సును జొరనీకదృష్టిని కనుబొమల మధ్యమున నిలిపి యుచ్ఛ్వాస నిశ్వాసములను సమములుగాఁజేసి యింద్రియమనోబుద్ధులను స్వాధీన పరచుకొన్నవాఁడై యిచ్ఛయు, భయమును, క్రోధమును, లేనివాఁడై మోక్షమునందే యాసక్తిగలవాఁడగుచున్నాఁడో యట్టి, వానిలక్షణము లెట్లుండుననఁగా ? తొల్లిటి యజగరమహాముని లక్షణమువలె నుండును. ఆయన యొకప్పుడు తనలక్షణము లిట్టివని పరమభాగవతోత్తముండగు ప్రహ్లాదునితోఁజెప్పి యున్నాఁడుగాన నావాక్యములను నీవు వినినయెడల నిజమైన యతులయొక్క లక్షణములిట్టివని నీకుఁ జక్కఁగఁబోధపడఁగలదు గానఁజెప్పుచున్నాను వినుము.

" సీ. అజినవల్కలదుకూలాంబరంబులు గట్టియుండుఁ గట్టకయుండునుండుచుండు
నాందోళికారథహయనాగముల నెక్కియైన నెక్కకయైననరుగుచుండుఁ
గర్పూరచందనకస్తూరికాలేపమైన ధూళిజమైన నలఁదికొండు
భర్మశయ్యల నైనఁ బర్ణశిలాతృణభస్మంబులందైనఁ బండుకొండు.

ఆ. గీ. మానయుక్తమైన మానహీనంబైనఁ
దీయనైన మిగులఁ దిక్తమైనఁ
గుడుచు సగుణమైన గుణవర్జితంబైన
నల్పమైనఁ జాలనధికమైన.

క. లేదని యెవ్వరి నడుగను
రాదని చింతింపఁ బరులు రప్పించినచోఁ
గాదని యొద్దియు మానను
ఖేదము మోదమునులేక క్రీడింతు మదిన్.

క. నిందింపఁ బరుల నెన్నఁడు
వందింప ననేకపీడవచ్చిన మదినా
క్రందింప విభవముల కా
నందింపఁ బ్రకామవర్తనంబున నధిపా !

వ. ఇట్లుకోరికలేక యొక్కనమయంబున దిగంబరుఁడనై పిశాచంబు చందంబున నుండుచుఁ బెక్కుదినంబులంగోలెఁ బెనుబాఁపవర్తనంబుఁ గైకొని నిమీలితలోచనత్వంబున నేకాంతభావంబున విష్ణునియందుఁ జిత్తంబు సేర్చి భేదగ్రాహకచిత్తవృత్తుల, నర్థరూప పరిభ్రమంబుగల ఘనంబునందు ఘనంబును, నహంకా

రంబునందు నహంకారంబును మాయయందు మాయను నాత్మానుభూతియందు లయంబు నొందించి, సత్యంబ దర్శించుచు విరక్తినొంది స్వానుభవంబునం దాత్మస్థితుండనై యుండును" (భాగ ౧౧స్కం ౪౩౭-౪౪౧.) ఇట్టిలక్షణములు గలవార లీ లోకమున జీవించియుండియు ముక్తినొందినవారితో సములగుదురు. కాన వారు జీవన్ముక్తులని చెప్పఁబడుదురు, మఱియు నట్టి జీవన్ముక్తుని సంపూర్ణలక్షణములు తొల్లి శ్రీరామచంద్రుఁ డాంజనేయునకుఁ జెప్పియున్నాఁడు. దానిం జెప్పెద వినుము.

"వ. ఇట్టివైరాగ్య బోధోపరతియుక్తుండైన జీవన్ముక్తుండు ప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వ సాక్షాత్కార ప్రచండమార్తాండ ప్రకాశనిరస్తానాద్యనిర్వచనీయాజ్ఞానాంధకారపటలుండు, పరిత్యక్త వర్ణాశ్రమాచారకోలాహలుండు, నిరంతరచిత్త విశ్రాంతి పరాయణుండు, విషయాసక్తి వివర్జితుండు, ప్రబలప్రారబ్ధాధీన శరీర చేష్టుండు, నంతస్సుఖుండంత రారాముం, డంతఃప్రకాశుం, డాత్మరతుం డాత్మతృప్తుం, డాత్మసంతుష్టుండు, దూరీకృత దురితక్రియుండు, ప్రశాంతమానసుండు, విజితేంద్రియుండు, గృతకృత్యుండు, ప్రాప్తాప్రాప్తవిహీనుండు, సర్వవ్యవహారాతీతుం, డశరీరుండు సర్వశరీరస్థుండు, నిరింద్రియుండు, సర్వేంద్రియద్రష్టయు, సప్రాణుండు, సర్వప్రాణిప్రేరకుండు, సర్వేంద్రియోపశాంతి సుఖరసికుండు, వివేకహృత్సంగుండు, నిత్యాసంగుండు, ప్రజ్ఞాప్రౌఢసఖీసహాయుం డసహాయుండు, దృఢాపరోక్షాత్మ నిశ్చయసంపన్నుండు, వర్ణాశ్రమసదాచార దురాచార కామక్రోధ లోభ మోహదంభ దర్పకుహక క్రౌర్యశౌర్యజాడ్యమాత్సర్యద్వేషకార్పణ్యనిందాస్తుతిమానావమానేర్ష్యాసూయాదయానైష్ఠుర్యవాక్పారుష్యాది నానావిధచిత్తవికారరహితుండు స్త్రీవాసనార్థవాసనా ప్రతిష్ఠావాసనాశాస్త్ర వాసనాదేహ వాసనాలోక వాసనా కర్తృత్వభోక్తృత్వాది వాసనా వివర్జితుండు, విగతబ్రహ్మవేతృత్వాభి మానవాసనుండు, నిత్యనిర్మలుండు నిత్యశాంతుండు, నిత్యోదాసీనుండు, నిష్ప్రపంచుం, డవ్యక్త మహదహంకార పంచతన్మాత్రాకాశాది సర్వప్రపంచమాయా గంధర్వనగరాశ్రయుండు, నిరాశ్రయుండు, సర్వావభాసకేవల చిదాకాశమాత్రుండు, పరమసుఖైక స్వరూపకుండు, దూరీకృతసంసారుండు, దేహేంద్రియ గుణాతిరిక్తుండు; దేవతా స్పృహణీయశీలుండు; నానాపాశవినిర్ముక్తుండు, రాజసతామసవస్తు సేవావిజిత నిద్రుం, డక్రియాత్మపూజాపరుండు, మౌనజపపరాయణుం, డచింత్యధ్యాననిష్ఠుం, డనిచ్ఛాసుఖతత్పరుండు, విశ్వవంద్యుండు, యథేచ్ఛాసంసారశీలుండు, ధీరుండు, దాంతుండు, నిత్యప్రబుద్ధచిత్తుండు, స్వాత్మసమాధినిష్ఠుండు, జగదింద్రజాలద్రష్టయు, విశేషప్రాప్తాశేషపురుషార్థుండు, త్యక్తాశేషవిశేషదుఃఖుం, డధిగతపరమస్వాస్థ్యుండు,

సంగృహీతచితుండు, మితవాక్యుఁడు, పరమ కారుణికుండు, సర్వభూతమిత్రుండు, పేశలాచార మధురుండు, పాణిపాత్రనిపతితమాత్రాశనుండు: యోగారూఢుండు, తితిక్షుండు, పరమైకాంతికుండు, నిష్కళంకుండు, నిస్పృహుండు, ప్రారబ్ధవశ ప్రాప్తదేహేంద్రియాది వ్యాపారరూపపుణ్యపాపక్రియాకర్తృత్వాభిమానపూర్వక ముఖవికాస దైన్యశూన్యుండు, సదాప్రసన్నచిత్తుండు, వికసితముఖుండు, దుష్టశిష్ట జనసంగదూరుండు, సాధువిద్వజ్జనసంగుండు, సర్వసమర్థోపేక్షాబుద్ధియుక్తుండు, కుశలాకుశలక్రియాదూరుండు, వేదాంతశాస్త్రవిచార ఘోరదావానల భస్మీకృత సర్వవేద శాస్త్రాగమపురాణ సర్వేశ్వరవిధిప్రతిషేధాదివాసనారణ్యుం, డవ్యక్తలింగుం, డవ్యక్తాచారుం, డేకచారియు, ననికేతనుండు, గిరిగుహావిహారుండు, మృత్యుభయ వివర్జితుండు, పరలోకభయ విరహితుండు, నిర్వ్యాజశాంతాత్మకుండు, బంధమోక్షనికాంక్షుండు, సర్వాతీతసర్వ పరిపూర్ణా ప్రతిద్వంద్వ బ్రహ్మచైతన్య ప్రకాశ స్వరూప మాత్రుండునై ప్రకాశించు” (సీ.— రా. 3ఆ. ౧౩౩)

ఇట్టి లక్షణములుగలవాఁ డీలోకమున జీవించియుండినను లేక పరలోకగతుఁడైనను, ముక్తినొందినవాఁడే యగుచున్నాఁడు. అయితే, అట్టి వాఁడీలోకమున జీవించియుండినప్పుడు జీవన్ముక్తుఁడనియును, బరలోకగతుఁడైనపుడు విదేహముక్తుఁడనియుఁ జెప్పబఁడుచున్నాఁడు.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి॥ 29

అర్థము :— సః + మునిః = పైశ్లోకములోఁ జెప్పఁబడిన లక్షణములుగల మననశీలుఁడు, యజ్ఞతపసామ్ = యజ్ఞములకును దపస్సులకును, భోక్తారామ్ = భోక్తనుగాను, సర్వలోకమహేశ్వరమ్ = సమస్తలోకములకుఁ బ్రభువునుగాను, సర్వభూతానామ్ = సమస్తప్రాణులకు, సుహృదమ్ = హితునిగాను, మామ్ = నన్ను. జ్ఞాత్వా = ఎఱిఁగి, శాన్తిమ్ = చిత్తశాంతిని, ఋచ్ఛతి = పొందుచున్నాఁడు.

కాన నోయర్జునా! అట్టిలక్షణములుగల యతులును, ఋషులును నాయొక్క నిజస్వరూపము నెఱింగినవారగుచున్నారు. అదెట్లనఁగా, వారలీ ప్రపంచమునందలి సమస్తభూతములును బరబ్రహ్మస్వరూపమని యెంచి యట్టి భూతములకు హితమును జేయువార లెప్పుడగుచున్నారో యప్పు డట్టి సమస్తభూతములయందు వ్యాపించి యుండు పరమాత్ముఁడగు నన్ను నాభూతములకు హితునిగ నెఱిఁగిన వారగుచున్నారు. మఱియు వారలు నన్ను దేవమనుష్యాది సమస్తలోకములకును నీశ్వరునిగ నెఱిఁగినవారగుచున్నారు. కాన నెవరెవ రేయే దేవతల నుద్దేశించి యేలాటి యజ్ఞ

ములనుగాని తపస్సులనుగాని చేసినను నట్టియజ్ఞములను దపస్సులను ననుభవించువాఁడను నేనేయని, అనఁగా నవియన్నియు నాకే చెందుచున్నవని యెఱిఁగిన వారగుచున్నారు. కాన నట్లెప్పుడు నన్నెఱిఁగిన వారగుచున్నారో యప్పుడే శాంతిని (మోక్షమును) బొందుచున్నారు.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాంయోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాసయోగోనామ పఞ్చమోఽధ్యాయః
ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు వ్యాజమున
లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుపనిషదర్థ ప్రతిపాదకంబగు
భగవద్గీతాశాస్త్రమునందలి కర్మసన్న్యాసయోగంబను
పంచమాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావ బోధిని

## షష్ఠాధ్యాయము

### ఆత్మసంయమయోగము

శ్రీభగవానువాచ.

శ్లో॥ అనాశ్రితః కర్మఫలమ్ కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ ననిరగ్ని ర్న చాక్రియః॥ 1

అర్థము;— యః=ఎవఁడు, కర్మఫలమ్=కర్మఫలమును, అనాశ్రితః=ఆశ్రయింపని (కోరని) వాఁడై, కార్యమ్=చేయఁదగిన, కర్మ=కర్మను, కరోతి=చేయుచున్నాఁడో, సః = వాఁడు, సన్న్యాసీ+చ = కర్మనుసన్న్యసించినవాఁడును, యోగీ+చ= నిష్కామకర్మ నాచరించువాఁడును, (భవతి)=(అగుచున్నాఁడు). నిరగ్నిః=అగ్నికార్యములగునౌపాసనాది కర్మలను వదలినవాఁడు, న =(సన్న్యాసి) కాఁడు, అక్రియః+ చ = నిత్యనైమిత్తికాదికర్మలవదలినవాఁడును, న =(సన్న్యాసి) కాఁడు.

#### సంభాషణ

కృష్ణుఁడు — ఓయియర్జునా! తపోయజ్ఞాది సకలకర్మలభోక్తను నేనేయని యెఱిఁగినవాఁడు మోక్షార్హుఁడని చెప్పితినిగదా (చూ 5–29) కాన నట్లెవఁడైతే చక్కఁగ నెఱుఁగుచున్నాఁడో, వాఁడు తాను జేసెడు కర్మలయొక్క ఫలముల నాశింపక యాకర్మల నాకే యర్పణము సేయుచుండును. అట్లెవఁడైతే ఫలాసక్తిరహితుఁడై తాను జేయవలసిన నిత్యనైమిత్తికాదికర్మల నాచరించుచున్నాఁడో వాఁడు నిష్కామ కర్మానుష్ఠానపరుఁడగు యోగియగుటసరేగదా? అట్లుకర్మఫలాసక్తి రహితుఁడై కర్మ నాచరించెడువాఁడా కర్మలనాచరించియు నాచరింపనివానితో సముఁడని యిదివఱకే నీకుఁజెప్పియుంటినిగదా? (చూ 4–20) కాన నట్టి వాఁడే సమస్తకర్మలఁ బరిత్య

జించిన సన్న్యాసియనిగూడఁ జెప్పఁదగియుంచున్నాఁడు. కాని యట్లు నిర్మలచిత్తుఁడు గాక గృహస్థులు నిత్యకృత్యముగ నాచరింపవలసిన యౌపాసనాద్యగ్నికార్యములను, మఱియు నితరములగు నిత్యనైమిత్తికాది కర్మలనువదలుకొని, శిఖాయజ్ఞోపవీతముల విసర్జించి, కాషాయదండక మండలాది చిహ్నముల ధరించినంత మాత్రముచేతనే సన్న్యాసిగానేరఁడు. కనుకనేగదా యింతకుముందు నేను నీకుఁ జెప్పినవిషయములలో సన్న్యాస కర్మయోగములు రెండును శ్రేయస్కరములే యనియును (చూ 5-2) రాగద్వేషరహితుఁడగు వాఁడుకర్మనాచరించినను సన్న్యాసియే యనియు,(చూ5-3), సన్న్యాసకర్మయోగములకు రెంటికిని భేదము, లేదనియు (చూ5-4), సన్న్యాసులు పొందఁగల మోక్షమునే యోగులుసైతము పొందఁగలరనియు, (చూ-5-5) చెప్పియుంటిని.

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ!।
న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన॥ 2

అర్థము:— హే పాణ్డవ! = ఓయర్జునా! యమ్ = దేనిని, సన్న్యాసమ్ + ఇతి = కర్మసన్న్యాసమని, ప్రాహుః = (పెద్దలు) చెప్పుచున్నారో, తమ్ + ఏవ= దానినే, యోగమ్ = నిష్కామకర్మానుష్ఠాన, యోగమునుగా, విద్ధి = ఎఱుఁగుము, హి = ఏలయనఁగా, అసన్న్యస్తసఙ్కల్పః = సంకల్పరహితుఁడుగానట్టి, కశ్చన= ఎవఁడును, యోగీ = నిష్కామకర్మానుష్ఠానపరుఁడు, న + భవతి = కానేరఁడు.

కావున నోయి యర్జునా! దేనినైతే పెద్దలు సన్న్యాసమని, అనఁగా, కర్మపరిత్యాగమని చెప్పుచున్నారో, దానినేయోగమని, అనఁగా నిష్కామ కర్మానుష్ఠానమని యెఱుంగుము. అనఁగానిష్కామ కర్మానుష్ఠాన యోగమునకును గర్మపరిత్యాగ సాంఖ్యమునకును నేమియుభేదములేదనుట. ఏలయనఁగా నీలోకమునం దెవఁడైననుసరే నిత్యనైమిత్తికాది కర్మల నాచరించుటలో సంకల్ప రహితుఁడుగా నుండిననే గాని వాఁడాచరించెడుకర్మ నిష్కామకర్మ యనఁబడదు. అట్టి నిష్కామకర్మాచరణమువలననేగాని యోగము సిద్ధింపనేరదు. కాననట్టి యోగమెప్పుడొకనికి సిద్ధించుచున్నదో యప్పుడు వాఁడుసర్వసంకల్ప వర్జితుఁడగుచున్నాఁడు. అట్లు సర్వసంకల్పవర్జితుఁ డెప్పుడగుచున్నాఁడో యప్పుడు వాఁడు కర్మల నాచరింపుచుండినను నాచరింపనివాఁడే యగుచున్నాఁడు. (చూ-6-20) కనుకనే, "ఏకం సాఙ్ఖ్యంచ యోగం చయః పశ్యతి స పశ్యతి" (చూ-5-5) అని యింతకుముందు నేను నీకుఁజెప్పుటకుఁ గారణమైనది; కనుకనే

ఆ. గీ. యోగిచూచుభంగి సుర్వీశసాంఖ్యుండుఁ
జూచుసాంఖ్యుఁడరయు చొప్పుయోగి
పరుఁడు నరయుఁగాన వారిద్దఱునొక్క—
తెరువువారలంద్రు పరమమునులు.

అనియును,

క. వినుసాంఖ్యంబును యోగము
నను పేళ్లవి కానిదీని యందదియును దా
న నిదియుఁదోఁచుచునుండుం
గను దత్త్వవిచారి యొకఁడ కానీరెంటన్".

అనియును బెద్దలు గూడఁ జెప్పియున్నారు.

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే।
యోగారూఢస్య త స్యైవశమః కారణముచ్యతే॥ 3

అర్థము:— యోగమ్ = యోగసిద్ధిని, అనఁగా యోగారూఢత్వదశను, ఆరురుక్షోః = ఎక్కుటకునిచ్ఛగించిన, అనఁగా, పొందఁగోరిన, మునేః = మననశీలునకు, కర్మ = నిష్కామకర్మానుష్ఠానము, కారణమ్ = సాధనముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. యోగారూఢస్య = యోగసిద్ధినిబొందిన, తస్య + ఏవ = ఆ (మునికే), శమః = కర్మసన్న్యసము, కారణమ్ := (మోక్షమునకు) సాధనముగా, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

అయినను నీకర్మయోగజ్ఞాన యోగములకు రెంటికిని నించుక భేదముగలదు. దానిం జెప్పెద వినుము. యోగమునకు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనియెడు నెనిమిది యంగములు (దళలు) గలవనియును, వానిలో నొకదానినుండి మఱియొక దానికిఁ గ్రమక్రమముగ నెక్కవలెననియును నింతకుముందు నీకు వివరముగఁ జెప్పియుంటినిగదా. (చూ—3-3) గనుక నట్టి యంగములయందు మొదటిదియగుయమము నాచరించిననేగాని నియమమనునంగము నాచరించుటకు శక్తిగలుగదు; నియమము నాచరించిననేగాని, ఆసనము నాచరించుటకు శక్తిగలుగదు; ఆయాసనము నాచరించిననేగాని ప్రాణాయామము నాచరించుటకు శక్తిగలుగదు; ఆప్రాణాయామము నాచరించిననేగానిప్రత్యాహారము నాచరించుటకు శక్తిగలుగదు; ఆప్రత్యాహారము నాచరించిననేగాని, ధ్యానధారణ సమాధుల నాచరించుటకు శక్తిగలుగదు; గాన నొక మెట్టునుండి క్రమముగాఁ బై

మెట్టునకు నెక్కిన రీతిగానీ యోగాంగముల నాచరింపవలసియుంచున్నది. కనుక నిది యోగము నెక్కుటయని చెప్పఁబడుచున్నది. అయితే యీయోగము నెక్కుటలో మొదటివైదు మెట్లను, అనఁగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములనెడు మెట్లనెక్కునంతవఱకుఁ గర్మ నాచరించియే తీరవలెను. అనఁగా, ఫలాభిసంధి రహితముగఁ గర్మ నాచరింపవలయును. అట్లు చేయనివానికి నామెట్ల నెక్కుటకు, అనఁగా యోగాంగములగు నాయాదశలను క్రమక్రమముగఁబొందుటకు సాధ్యపడదు. కాన ఫలాభిసంధి రహితముగఁ గర్మ నాచరింపుచు రాఁగరాఁగఁ గ్రమక్రమముగ యోగాభ్యాసమున హెచ్చుచు మొదటివైదు మెట్లనుదాటి యాఱవదియగు ధ్యానమనెడు మెట్టు నెక్కినప్పటికి, అనఁగా ధ్యానదశను బొందినపు డేలాటికర్మల నాచరింపవలసిన యగత్యము లేకపోవుచున్నది. అనఁగానప్పటికి నైష్కర్మ్యసిద్ధిని బొందిన వాఁడగుచున్నాఁడు. అట్టినైష్కర్మ్యసిద్ధిని బొందినవాఁడే యోగారూఢుఁడనఁబడుచున్నాఁడు. కావున నట్టినైష్కర్మ్యసిద్ధిని (యోగారూఢత్వమును) బొందునంతవఱకు యోగము నెక్కుటకుఁ గర్మాచరణమే సాధనమనియు, నట్టికర్మాచరణమువలన యోగసిద్ధిని, అనఁగా యోగారూఢత్వదశను బొందినవెనుక నాపై మూడుమెట్లను, అనఁగా ధ్యాన, ధారణ, సమాధులను మెట్లనెక్కుటకుఁ గర్మనివృత్తియే (మోక్షమునకు) సాధనమనియు, చెప్పఁబడుచున్నది. కర్మలుబొత్తిగా విడిచిపెట్టఁదలఁచినవాఁడు నైష్కర్మ్యసిద్ధిని బొందునంతవఱకు, అనఁగా, యోగము యష్టాంగములలో యొక్కనాఱవదియగు ధ్యానమనెడు దశను బొందునంతవఱకుఁ గర్మనాచరించియే తీరవలెను. అట్లుచేయక కర్మాచరణమును విడిచిపెట్టినయెడల నది కపటసన్న్యాసమనఁబడుచున్నది గాని నిజమైన సన్న్యాసముగాదు. దానివలన నేమియుఁ బ్రయోజనముగలుగ నేరదు. యోగసిద్ధియైనపిమ్మట నైతేనో, అంతకుముం దాచరింపుచున్న కర్మలలో నేదియు నగత్యములేని వాఁడగుచున్నాఁడు. కాన నపుడు వానికిఁ గర్మసన్న్యాసము తనంతటనే సిద్ధింపఁగలదు.

అర్జు — అయ్యా! యిపుడునీవుచెప్పిన దానింబట్టిచూడఁగా, యోగాభ్యాసము చేయువానికి యోగారూఢత్వమును బొందునంతవఱకుఁగర్మాచరణమావశ్యకమనియు నటుపిమ్మట దానితో నిమిత్తములేదనియుఁ దెలియవచ్చుచున్నది. అయితే, యోగాభ్యాసకుఁడు యోగారూఢత్వదశను బొందినవాఁడెప్పుడగుచున్నాఁడు? అనఁగానెట్టి లక్షణములుగలవాఁడు యోగారూఢుఁడనిపించుకొనుచున్నాఁడు?

శ్లో॥ యదా హి చేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే।
సర్వసఙ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ 4

అర్థము :—యదా + హి = ఎప్పుడైతే, ఇన్ద్రియార్థేషు=ఇంద్రియవిషయముల యందును, కర్మసు + చ = కర్మలయందును, న + అనుషజ్జతే=ఆసక్తుఁడు గాఁడో, (తదా) = అప్పుడు, సర్వసఙ్కల్పసన్న్యాసీ = సమస్తకోరికలను విడిచినవాఁడు, (భవతి) = అగుచున్నాఁడు, తదా = అప్పుడు (సమస్తకోరికలను విడిచినవాఁడై నప్పుడు), యోగారూఢః = యోగారూఢుఁడు (నైష్కర్మ్యసిద్ధినిబొందినవాఁడు), (ఇతి) = అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

కృ—యోగాభ్యాసకుఁడగు నొకపురుషుఁడు యోగారూఢత్వదశ నెప్పుడు పొందుచున్నాఁడనఁగాఁజెప్పుచున్నానువినుము. ఈవిషయమునఁ దొల్లి దేవగురువగు బృహస్పతి, మనువునకుపదేశించునపుడు

"సీ. జ్ఞానయోగము కృపాసంపన్నబుద్ధి నా కెఱిఁగింపవే యన్న నెలమి నాతఁ
డతనికిట్లను "ననఘాత్మ. సత్కర్మయోగశ్రద్ధ నాకకిఁ గారణంబ
నిష్టంబుఁ బ్రోవను నిష్టంబుదేరను, నరుఁడు గర్మాచరణంబొనర్చు
నెయ్యవిసుఖము లొక్కింతకాలమునకునవియ దుఃఖంబులై యావహిల్లు

ఆ. నింత యెఱిఁగి ఫలము నెడ నిరపేక్షుఁడై
సమతసౌఖ్యదుఃఖచయముఁ ద్రోచి
కామముఖ్యవిపదకంపితజ్ఞానవి
శేషబుద్ధిఁ బరమసిద్ధిఁ బొందు." (భార. శాంతి ౪ అ. ౧౭౨.)

అని చెప్పియున్నాఁడు. కాన నట్లు యోగాభ్యాసియగు పురుషుఁడు తదంగములగు యమనియమాది నిష్ఠల జరుపుచు దదనుగుణ్యములగు కర్మములను ఫలాభిసంధిరహితముగ నాచరింపుచు రాఁగ రాఁగఁ గొంతకాలమునకు వానికి నింద్రియవిషయములగు శబ్దస్పర్శరూప రసగంధములయందును, స్రక్చందన వనితాద్యైహిక సుఖములయందును, నిస్పృహగలుగును. అనఁగా నవియన్నియు నిస్సారములనియు, ననిత్యములనియుఁదోఁచి యందువలన వానియం దదివఱకుఁ గలిగియుండిన యిచ్ఛవిడిచి పోవును. అట్లెప్పుడు వానియందలి యాసక్తివిడుచుచున్నదో యప్పుడే వానికనుగుణ్యములగు కర్మముల నాచరించుటయందును నిచ్ఛలేక పోవును. అప్పుడు,

తే. గీ. సర్వసంకల్పరహితుఁడై సత్త్వమున వి
నిశ్చలంబుగఁ జిత్తంబు నిలుపవలయు
సత్త్వసక్తచిత్తంబు ప్రసాదమొసఁగు
దానఁ గాలంబునడపు టుత్తమవిధంబు." (భార. శాంతి. ౫ అ. ౧౫౫)

అనునట్లు సర్వసంకల్పములను విడిచినవాడును, కేవలసత్త్వగుణప్రధానుండును నగుచున్నాఁడు అట్టిస్థితి కెప్పుడువచ్చుచున్నాఁడో యప్పుడు యోగారూఢుండనిపించుకొనుచున్నాఁడు. అట్టి యోగారూఢత్వము బొందినవాఁడే కర్మలను సన్న్యసించుటకు నర్హుఁడుగాని తదితరుఁడు గానేరఁడు.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! అట్టియోగారూఢత్వదశను బొందునంతవఱకు నింద్రియములను, మనస్సును నిగ్రహించియుండుట సాధ్యపడదుగదా! అట్లు నిగ్రహించియుండుట బహుకష్టతరముగదా? కాన నట్లుచేయుటకు సదుపాయమేమి?

శ్లో॥ ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః॥ 5

అర్థము:— ఆత్మానః = మనస్సును, ఆత్మనా = బుద్ధిచేత, ఉద్ధరేత్ = ఉద్ధరింపవలయును (అనఁగాఁదప్పుమార్గములయందుఁ బ్రవేశింపకుండ గాపాడవలెనని భావము). ఆత్మానమ్ = మనస్సును, న + అవసాదయేత్ = నశింపనీయఁగూడదు. (అనఁగా, తప్పుమార్గములయందుఁ బ్రవేశించి తద్ద్వారా చెడిపోనివ్వఁగూడదని భావము), హి = ఏలయనఁగా, ఆత్మ + ఏవ = (తన) మనస్సే, ఆత్మనః = తనకు, బన్ధుః = ఒకప్పుడు బంధువును, అనఁగా మేలుచేయునదియును, ఆత్మ + ఏవ = (తన) మనస్సే, ఆత్మనః = తనకు, రిపుః = (ఒకప్పుడు) శత్రువును. (అనఁగాఁ గీడుచేయునదియును), (భవేత్) = అగును.

కృ — మంచిది, అందునకు సదుపాయమును జెప్పుచున్నాను వినుము. అదేమనఁగా, "మనఏవమనుష్యాణాం కారణంబన్ధమోక్షయోః" అనునట్లు ప్రతిపురుషునకును వానిమనస్సే బంధమోక్షములకుఁ గారణభూతమైనదగుచున్నదిగదా, అయితే "మనసస్తు పరాబుద్ధిః" అలాటిమనస్సుకంటె బుద్ధిబలమైనదనియును, "సంస్తభ్యాత్మానమాత్మనా, జహిశత్రుమ్" బుద్ధిచేత మనస్సును నిగ్రహించి (కామమనెడు) శత్రువునుజయింపవలెననియు నిదివఱకు నీకుఁజెప్పియున్నానుగదా. (చూ-3-42_43) కనుకఁ బ్రతిపురుషునకును వానిమనస్సే యొకప్పుడు బంధువుగను, మఱియొకప్పుడు శత్రువుగను, అనఁగా గీడుచేయునదిగను నుంచున్నది. గాన నట్టిమనస్సును దనబుద్ధిబలముచేత నుద్ధరించుకొనవలయును. అనఁగా నది తప్పుమార్గములయందుఁ బ్రవేశింపకుండఁ గాపాడుకొనుచు దానివలన మేలును బొందవలయునుగాని దానిని దప్పుమార్గములఁ బోనిచ్చి యందువలనఁ గీడును బొందఁగూడదు.

అర్జు — అట్లనఁగానేమి ? తనమనస్సు తనకు నెప్పుడెట్టి విషయములలో బంధువగును ? ఎప్పుడు శత్రువగును ?

శ్లో॥ బన్ధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్॥ 6

అర్థము:— యేన = ఎవనిచేత, ఆత్మనః = తనయొక్క, ఆత్మా = మనస్సు, ఆత్మనా = బుద్ధిచేత, జితః = జయింపఁబడుచున్నదో, తస్య = వానియొక్క, ఆత్మా + ఏవ = మనస్సే, బన్ధుః = బంధువు (మేలుచేయునది) (భవతి) = అగుచున్నది, అనాత్మనః + తు = మనస్సునుజయింపనివానికైతేనో, ఆత్మా + ఏవ = మనస్సే, శత్రువత్ = విరోధివలె, శత్రుత్వే = కీడుచేయుటయందు, వర్తేత = ప్రవర్తింపుచుండును.

కృ — ఓయియర్జునా ! ఒకపురుషునకుఁ దనమనసెప్పుడు బంధువుగను. ఎప్పుడుశత్రువుగను బ్రవర్తించునో, దానిని జెప్పుచున్నాను వినుము. ఎప్పుడైతే, ఒకపురుషుఁడు దన మనస్సును విషయములయందుఁ బ్రవర్తించునపుడు తనబుద్ధిచే యుక్తాయుక్తవివేచనఁజేయుచుఁ దప్పుమార్గమునఁబోనీక బిగఁబట్టియుంచుచున్నాఁడో యప్పుడు వాఁడు తనబుద్ధిబలముచేఁ దనమనస్సును జయించినవాఁడగుచున్నాఁడు. అట్లనఁగా నొకపురుషుఁడు మఱియొకనిని నిష్కారణముగఁ దిట్టుచున్నాఁడు. అప్పుడా నిందింపఁబడినవాని మనస్సునఁ గ్రోధముపుట్టఁ దగియుంచున్నదిగదా? అట్లుక్రోధము గలిగినవెంటనే వాఁడు తనబుద్ధిచేఁ జక్కఁగనాలోచించి వానిని మరలఁదిట్టుట యుక్తముగాదనియును, వానితిట్లను సహనముసేయుటయే శ్రేయస్కరమనియును, నెంచి తనమనస్సున నుత్పన్నమైన కోపమును బ్రకాశింపనీక యుపశమనముచేసుకొనుచున్నాఁడు. అప్పుడట్లుచేయుటచే వానికి గలిగెడు ప్రయోజనమేమనఁగా

"క. పలుకుపడినతనిఁ బాపం
బులు విడుచుం; బలికినతనిఁబొందును బాపం
బులు; నొరుపాపము దనపై
నొలయింపఁగ నేల నిందయుడిగినఁ గాదే." (భార.శాంతి.౨ఆ.౨౭౬)

"క. జనములు దను నవమానిం
చిన నిందించినను మాఱు సేయక సైరిం
చిన శాంతాత్ముఁడు వారల
మును చేసినయట్టి సుకృతముల నాఁచికొనుఁ." "

(భార.శాంతి. ,౨ఆ. ౨౭౪.)

అనునట్లు తననుతిట్టిన వాని సుకృతమును నాకర్షించుకొన్న వాఁడగుచున్నాఁడు గనుక నట్టివానికి నిచట సైరణ చేయఁబడిన తన మనస్సితరులు చేసిన సుకృతమును దనకు లభింపఁజేయుటచేఁ దనకు బంధువులవలె మేలుచేయునది యగుచున్నదిగదా? వీనిసంగతి యిట్లుండఁ, నిఁకను వీని దిట్టినవాని గతియేమగుచున్నదనఁగా, వాఁడేదియో యొక స్వల్పకారణములనుబట్టి క్రోధావిష్టుఁడై యాక్రోధము నడఁపఁజాలక వీనిని దిట్టుటవలనఁ దానదివఱకుఁ జేసిన సుకృతమును వీనికి ధారపోసినవాఁడగుచున్నాఁడుగదా! అట్లగుటవలన

“క. ఒరులపనికిఁగా నిజహిత
పరహితుఁడగునట్లు గాదె వివిధేంద్రియ కా
ర్యరతుండై యాత్మసము
ద్ధరణంబును జేయకునికి ధరణీనాథా” (భార. శాంతి. ౫ఆ, ౫౩౧)

అనునట్లితరుల మేలుకొఱకుఁ దనమేలును బోఁగొట్టుకొన్నవాఁడగుచున్నాఁడు గదా, గనుక నిచట బుద్ధిబలముచే సైరింపఁబడని వానిమనస్సు వానికి నిట్టికష్టమును గలుగఁజేసినదగుచున్నది. కాన నట్టివానిమనస్సు వానికి శత్రువువలెఁ జెరుపుచేసినదగుచున్నదిగదా? ఇట్లే ప్రతిపురుషుని మనస్సును నింద్రియ విషయాదులయందుఁ బ్రవర్తించునపుడు కామక్రోధాదులచేఁ బ్రేరేపింపఁబడి తప్పుమార్గములఁ బ్రవేశింపఁ జూచును. బుద్ధిమంతుఁడగువాఁడు తనబుద్ధిబలముచేత నామనస్సును మరలించుకొనుచువచ్చిన నది తప్పుమార్గములయందుఁ బ్రవర్తించుటమాని తనస్వాధీనములో నుండును. అట్టిస్వాధీనమనస్సుచేఁ జేసెడుకర్మలు నిష్కామకర్మములగుటచే వానివలన బద్ధుఁడుగాక మోక్షార్హుఁడగును గాన వానికా మనస్సు మేలుచేసినదగును. కనుకనే దానిని బంధువని చెప్పుటకుఁ గారణమైనది. అట్లు మనోనిగ్రహము చేయక దానిని విషయములయందిచ్చవచ్చినట్లు ప్రవర్తింపనిచ్చినయెడలఁ దదనుగుణ్యములగు కామ్యకర్మముల నాచరింపుచు నాకర్మములచే బద్ధుడగుచున్నాఁడు. కాన వాని మనసు వానికిఁ గీడుచేసినదగుచున్నది. కనుకనే దానిని శత్రువని చెప్పుటకుఁ గారణమైనది.

అర్జు — మనస్సును జయించుటయనఁగా నెట్టిది? అనఁగా మనో జయముగల వాని లక్షణము లెట్లుండును.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ 7

అర్థము:— జితాత్మనః = మనోజయముగలవాఁడగు, ప్రశాన్తస్య = శాంత చిత్తునియొక్క, ఆత్మా = మనస్సు, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణాదులవలనఁ గలిగెడు సుఖదుఃఖములయందును, తథా = అలాగుననే, మానావమానయోః = మానావమానములయందును, పరమ్ = మిక్కిలి, సమాహితః = సమభావముగలదై యుండును.

కృ — మనోజయముగల వానిలక్షణము లెట్టివనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఒకపురుషునిమన సెప్పుడైతే కామక్రోధాద్యరిషడ్వర్గములచే వికారములను బొందక శీతోష్ణములు, లాభాలాభములు, జయాపజయములు, నిందాస్తుతులు, శుభాశుభములు, మానావమానములు మొదలగు ద్వంద్వములవలనఁ గలిగెడు సుఖదుఃఖములయందు సమభావముగలిగియుంచున్నదో, అనఁగా నాశీతోష్ణాదులుసుఖకరములుగా నుండు నపుడు, సంతోషించుటయు. దుఃఖకరములుగానుండునపుడు వ్యసనపడుటయులేక, యాయుభయముల యందును నొకటేవిధముగ నుంచున్నదో, అప్పుడు వాని మనస్సు జయింపబడినదగుచున్నది. అపుడు వాఁడెట్లుండుననఁగా,

“క. వినుతించిన నిందించిన
　　ననఘా మనమునఁ బ్రియంబు నప్రియమును లే
　　కునికియు వ్రేసినమైనను
　　గనలునోడమమియుఁ బ్రబుద్ధ గణ్యాగుణంబుల్ ”

(భార. శాంతి. ౫౮. ౨౨.)

అనునట్లు, తన్నుదూషించిన వారలయెడలఁ గోపములేకయు, భూషించిన వారలయెడలఁ బ్రీతిలేకయుఁ, దుదకుఁ దన్నెవఁడైనఁ గొట్టినను వానియెడలఁ గోపపడ కయు నుండును. మఱియు నట్టి మనోజయముచే మిగుల శాంతి నొందిన చిత్తముగల వాఁడెట్లుండుననఁగా,

“తే.గీ. పొలుచువేడుకఁ బెండ్లికిఁ బోవునపుడు
　　నుగ్రుఁడై చంపఁ గొనిపోవుచున్నయెడల
　　జిత్తమెంతయుఁ జల్లనై శీతకరుని
　　చందమునసున్న యాతండు శాంతుఁడంద్రు” (వా. రా- ౧౮.)

అనునట్లు, సంతోషకార్యములన్నింటిలో గొప్పది తన వివాహముగదా ? అట్టి పెండ్లికిఁగాను దన్ను బెండ్లికొడుకునుంజేసి తీసికొనిపోవునపుడును, దుఃఖకరమగు కార్యములన్నింటిలోఁ దనమరణముకంటె మించినది లేదుగదా, అట్టిమరణమునొందిం చుటకుఁగాఁ దా నితరులచేఁ గొనిపోఁబడునపుడును, సంతోషము, వ్యసనము,

భయము మొదలగు వికారములను బొందక, ఆయాకాలాను గుణ్యములుగ నాయా కార్యములు జరుగుచున్నవని యెడునిశ్చయ జ్ఞానముగలవాఁడై నిబ్బరముగా నుండును. ఇంతియగాక, అట్టివాఁడు

"క. అవమానమునకుఁ దృప్తుం
డవు నమృతముఁ ద్రావినట్ల యంచితసమ్మా
నవిధికి నుద్వేగముఁ బొం
దు విషంబును బోలె శమరతుఁడు మునినాథా."

(భార. శాంతి. ౨ఆ. ౨౫.)

అనునట్లు మేలుగలిగినపుడు సంతోషించుటకు బదులుగా దుఃఖించుటయు, కీడు గలిగినపుడు దుఃఖించుటకు బదులుగా సంతోషించుటయును గూడఁగలదు.

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥ 8

అర్థము:— జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా — జ్ఞాన=శాస్త్రజ్ఞానముచేతను, విజ్ఞాన = అనుభవజ్ఞానముచేతను, తృప్తాత్మా=తృప్తినొందినమనస్సుగలవాఁడును, కూటస్థః = సుఖదుఃఖాదిద్వంద్వములచే నేలాటిమనోవికారములను జెందక యెల్లప్పుడు నొకటే రీతిగనుండువాఁడును, విజితేంద్రియః = యింద్రియనిగ్రహముగలవాఁడును, సమలోష్టాశ్మకాఞ్చనః = మంటిగడ్డ, ఱాయి, బంగారు, వీనియందు సమభావముగలవాఁడును నునగు. యోగీ = యోగారూఢుఁడు, యుక్తః+ఇతి = (కర్మసన్న్యాసమునకుఁ) దగినవాఁడని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

కాన నట్లివాఁడైతే జ్ఞానవిజ్ఞానములచే, అనఁగా శాస్త్రజ్ఞానముచేతను, అనుభవ జ్ఞానముచేతను దృప్తినొందిన మనస్సుగలవాఁడును, కూటస్థుఁడును, అనఁగా నిది వఱకుఁజెప్పఁబడిన ప్రకారము శీతోష్ణాదిద్వంద్వములచేతనుఁగాని, కామక్రోధాద్యరి షడ్వర్గములచేతఁగాని చలింపని, అనగా నేలాటి మనోవికారమును బొందక యెల్లప్పుడు నొకటేరీతిగనుండువాడును, ఇంద్రియ నిగ్రహముగలవాఁడును, సమలోష్టాశ్మ కాంచనుఁడును, అనఁగా మంటిగడ్డ, ఱాయి, బంగారు, వీనియందు సమదృష్టిగల వాఁడును, నగుచున్నాఁడో అట్టివాఁడు

"క. సమదృష్టిని ఱాయియుఁ గన
కముఁ జూచుచుఁ దత్సమాధికలితంబగు వృ
త్తము నడపిన శబ్దబ్ర
హ్మము షణ్మాసములయోగి మతివర్తించున్."

క. మనసును నింద్రియములునుం
　దనయందొదుగంగఁజేయఁ దానుజెలివినొం
　దినిరంజనత్వ సిద్ధింగని గత
　ధూమానలంబు కరణి వెలుంగున్."

(భార. శాంతి. ౫ఆ. ౧౨౨. ౧౨౦.)

అనునట్లు, పరబ్రహ్మస్వరూపము నెఱిఁగినవాఁడును, నిరంజనుఁడును. అనఁగా దోషరహితుఁడును, పొగలేని నిప్పువలెఁ గేవలజ్ఞాన స్వరూపుఁడునునై ప్రకాశింపు చుండును. కానట్టివాఁడే జ్ఞానయోగమునకు, అనఁగా, కర్మసన్న్యాసయోగమునకు నర్హుఁడగుచున్నాడు. అనఁగాఁ నైష్కర్మ్యసిద్ధిని బొందినవాఁడగుచున్నాఁడు.

అర్జు — అయ్యా! జ్ఞానవిజ్ఞానములచేఁ దృప్తినొందిన మనసుగల వాఁడని చెప్పితివిగదా, అట్లనఁగా నేమి? జ్ఞానమనఁగా నెట్టిది? విజ్ఞానమనఁగా నెట్టిది? ఆరెంటికినిగల భేదమెట్టిది? వానిచేఁ దృప్తినొందుట యెట్లు? వివరించి చెప్పుము.

కృ — జ్ఞానమనఁగా శాస్త్రములఁ జదువుటవలనను, గురువు, పెద్దలు మొదలగువారలు చెప్పఁగ వినుటవలనను, భగవద్విషయమిట్టిదియని తెలిసికొనుట జ్ఞానమనఁబడుచున్నది. ఆభగవద్విషయమునే తనస్వానుభవముచేఁ దెలిసికొనుట. యంతకంటె విశేషమైనదిగనుక నది విజ్ఞానమనఁబడుచున్నది. ఇందునకు దృష్టాంతముగ నొక సంగతిఁజెప్పెదను వినుము.

ఒకఁడు మఱియొకనికి నొక కలగండపెళ్లయును, ఒక పటికపు గడ్డయును, ఒక వెలిగారపుముక్కయును, ఒక సైంధవలవణపు శకలమును, ఒక పలుకుసాటి తునకయును జూపి, వానిపేళ్లను, స్వభావములను జెప్పుచున్నాఁడు. అప్పుడా రెండవవాఁ డాయా పెళ్లనా యావస్తువని తెలిసికొనుచున్నాఁడుగదా.

అర్జు — అవును, తెలిసికొనుచున్నాఁడు.

కృ — ఇట్లు తెలిసికొనుటయే జ్ఞానమనఁబడుచున్నది. అయితే, అట్లు తెలిసికొనినను, అవియన్నియు నొకటేరూపుగా నుండుటవలన వానినిదనకుఁ జూపి చెప్పినవాఁడొకవేళఁ బొరబాటున నొకదానిని మఱియొకటిగాఁ జెప్పియుండునేమోయని సంశయించుటకవకాశము గలిగియుండునుగదా?

అర్జు — అవును, అట్టిసంశయము గలుగుటకుఁ గారణమున్నది.

కృ — మంచిది, అప్పుడతఁడొక్కొక పెళ్లఁగానెత్తి నాలుకతోఁ జప్పరించి రుచిచూచినయెడల నపుడావస్తువులలో నేదికలకండయైనదియు, నేదిపటికయైనదియు, నేదివెలిగారమైనదియు, నేదిసైంధవలవణమైనదియు, నేదిపలుకుసాయియైనదియు, నిశ్చయముగ నెఱుఁగుచున్నాఁడుగదా?

అర్జు — అవును, అప్పుడాయా పేరుగల దాయావస్తువని నిశ్చయముగ నెఱుఁగుచున్నాఁడు. గాననప్పుడు వానిమనస్సునకుఁ దృప్తిగలుగుచున్నది.

కృ — ఇట్లు తెలిసికొనుట మొదటఁ దెలిసికొనఁబడిన విధముకంటె విశేషమైనదిగనుక నిదివిజ్ఞానమనఁబడుచున్నది. ఇట్లు తెలిసికొన్న పిమ్మట వానిమనస్సునకు మొదటఁదనకుఁ జెప్పినవాఁడు సరిగానే చెప్పినాఁడనియెడు నిశ్చయముగలుగుచున్నది గనుక నప్పుడావిషయమునఁ దృప్తినొందిన మనస్సుగలవాఁడగుచున్నాఁడు.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు।
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥ 9

అర్థము:— సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థ ద్వేష్య బన్ధుషు=సుహృత్=తనయెడల మంచిఅభిప్రాయముగల వారియందును, మిత్ర =తనయెడల స్నేహముగల వారియందును, అరి = (శత్రువులు) అనఁగాఁ దన్ను ద్వేషించెడువారియందును, ఉదాసీన=తనయెడలనట్టిమిత్రత్వ శత్రుత్వము లెవ్వియులేనివారియందును, మధ్యస్థ=తనయెడలమిత్రత్వశత్రుత్వములయందు సమముగఁ బ్రవర్తించువారియందును, ద్వేష్య=తనచేద్వేషింపఁబడఁదగినవారియందును, బన్ధుషు = చుట్టములయందును, సాధుషు+అపి = సజ్జనులయందును, పాపేషు+చ =దుర్జనులయందును, సమబుద్ధిః=సమానమైన బుద్ధిగలవాఁడు, విశిష్యతే = ఉత్కృష్టుఁడగుచున్నాఁడు.

ఓయియర్జునా! పైశ్లోకమునఁ జెప్పబడిన లక్షణములుగలవాఁడు కర్మసన్న్యాసయోగమున కర్హుఁడని చెప్పితినిగదా. అట్టివారలలోఁగూడ నుత్కృష్టులైన వారలు గొందఱుంచున్నారు. వారెట్టివారనఁగాఁ జెప్పుచున్నానువినుము. మిత్రులనఁగా దనయెడల స్నేహముగలవారియందును, సుహృదులనఁగా నట్టి స్నేహము లేకపోయినను. దనయెడల మంచియభిప్రాయము గలిగియుండువారియందును, అరులనగాఁ దన్ను ద్వేషించుచుండెడు వారియందును, ఉదాసీనులనఁగాఁ దనయెడల నట్టి మిత్రత్వశత్రుత్వము లెవ్వియు లేకయుండు వారి యందును, మధ్యస్థులనఁగాఁ దనయెడల నొకప్పుడు శత్రుత్వమును మఱియొకప్పుడు మిత్రత్వమును గలిగి ప్రవర్తించువారియందును, ద్వేష్యులనఁగాఁ దనకపకారులై తనచే ద్వేషింపఁబడఁదగిన వారియందును, బంధువులనఁగా జననీజనక దారపుత్రాది దేహసంబంధులయందును, సాధువులనఁగా సజ్జనులయందును, పాపాత్ములనఁగా దుర్జనులయందును, ఇట్టివారలగు నందఱియందును, సమానమైన బుద్ధిగలవాఁడెవఁడో యట్టివానికి

"క॥ చుట్టము పగయను భేదం
బెట్టిజనుల వలనఁదగుల దెల్లప్పుడు నె

పుట్టున నైద్దానను మఱిం
బుట్టును సంతోషహాని బుద్ధాత్మునకున్'' (భార-శాంతి-౫ అ)

అనునట్లు, ఒకఁడు తనకుఁగావలసినవాఁడనియు, మరియొకఁడు తనకు విరోధి యనియు, భేదబుద్ధిలేక యందఱి యెడలను సమబుద్ధిగలవాఁడుగ నుంచున్నాఁడు గనుక నట్టివానికి నెప్పుడైననుసరే యే కారణమువలననైననుసరే మనస్సునకు స్నేహ భావముగాని, ద్వేషభావముగాని కలుగవలసిన కారణముండదు గనుక నట్టివాని మనస్సునకెప్పుడును సంతోషహాని గలుగనేరదు. కాఁబట్టి యట్టివాఁడు శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు.

అర్జు—అయ్యా! ఇట్టిలక్షణములన్నియు సంపూర్ణముగనుండిననేగదా యోగి యగును. అట్లుండ, వీరిలోఁగూడ నుత్కృష్టనికృష్టత్వములు గలవారలుంచున్నారా?

కృ—అవును, ఇట్టిలక్షణములన్నియు నుండిన నే యోగియగును గాని తదిత రుఁడు గానేరఁడు. అయినను, వారిలోఁ గొందఱెల్లప్పుడు గాకపోయినను, నొకా నొకప్పుడైనను దమకపకారముఁజేసెడు వారియెడలఁ గ్రోధముగలవారై శపించుట మొదలగు కార్యములు సేయుటయు, మఱికొందఱెప్పుడును నట్టిక్రోధము తమ మనస్సునఁ బుట్టకయేయుండెడువారును నున్నట్లు మనమనేక ఋష్యాదుల చరిత్రముల వలనఁ దెలిసికొనుచున్నాముగదా. అట్టివారిలో శ్రేష్ఠులెల్లప్పుడు శాంతచిత్తులై యుండెడువారా? లేక, యొకానొకప్పుడు క్రోధచిత్తులగువారా?

అర్జు—ఎల్లప్పుడు శాంతచిత్తులగువారే శ్రేష్ఠులని చెప్పవలసియుంచున్నది. అయితే యట్టియోగారూఢస్థితికి వచ్చుటకు నేలాగుప్రయత్నము చేయవలయును?

శ్లో॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥ 10

అర్థము:— యోగీ=యోగము నభ్యసించువాఁడు, యతచిత్తాత్మా=నియ మింపఁబడిన మనోబుద్ధీంద్రియములు గలవాఁడును, నిరాశీః=ఆశలేనివాఁడును (దేనిని గోరనివాఁడును), అపరిగ్రహః=గ్రహింపనివాఁడును (దేనిని సంపాదించుటయం దిచ్ఛలేనివాఁడును), రహసి = ఏకాంతస్థలమునందు, ఏకాకీ=ఒంటరిగా, స్థితః+ (సన్) = ఉన్నవాఁడునునగుచు, సతతమ్ = ఎల్లప్పుడు, ఆత్మానమ్ = మనస్సును, యుఞ్జీత=(ఆత్మావలోకనమందు) అలవఱుపవలయును.

కృ—ఓయియర్జునా! యోగము నభ్యసించువాఁ డేమి చేయవలయుననఁగా, తన యింద్రియములను విషయములయందుఁ బ్రవర్తించునపు డావిషయములయందు మనస్సుఁదగులనీక బుద్ధిచే నామనస్సును బిగఁబట్టి యైహికసంబంధమగు నేవిషయ

మును గోరనివాఁడును, అవి తమంతట లభించినను వానిని బరిగ్రహించుటయందిచ్ఛ లేనివాఁడునునై యేకాంతస్థలమున నొంటరిగానున్నవాఁడగుచు నెల్లప్పుడును దన మనస్సును నాత్మావలోకనము నందలవఱుపవలయును.

అర్జు—ఏకాంతస్థల మందుండవలయునని చెప్పితివిగదా. అదియేల? ఏకాంత స్థలమనఁగా నెట్టిది?

కృ—మ|| "మన మేకాగ్రతఁ బొందఁ జేయు, జనసమ్మర్దంబు వర్జించి శూ
న్యనికేతాద్రి గుహా వివిక్తవన దేవాగారముఖ్యంబులై
న నివాసంబుల నుండఁగావలయుఁ దన్మన్నించినం గీడు సే
సిన హర్షంబున మర్షమున్ హృదయముం జెందింప కక్షోభ్యుఁడై."
(భార-శాంతి-5 అ 121.)

అనునట్లు మనస్సుచలింపకుండుటకుఁగా జనసమ్మర్దములేని ప్రదేశముననుండ వలయును. అట్టిస్థలము లెవ్వియనఁగా, కాఁపురములేని పాడిల్లుగాని, కొండగుహ గాని, అడవిప్రదేశముగాని లేక దేవాలయముగాని, ఈమొదలగు స్థలములయందు జన సమ్మర్ద ముండదుగనుక నట్టిస్థలములయందుండే యోగము నభ్యసించినయెడల నట్టిప్రదేశములయందు మనస్సునాకర్షింపఁదగిన యింద్రియవిషయము లేవియునుండ నేరవుగనుక నట్టిచోట్ల మనస్సుచలించుటకుఁ గారణముగలుగదు - కాన నట్టిచోట్ల యోగము నభ్యసించుట సుఖకరముగ నుండును.

అర్జు—ఇట్లు విజనస్థలములయందు యోగ మాచరించుట బ్రహ్మచర్యాది నాలు గాశ్రమముల యందుండువారికిని నియతమా, లేక యత్యాశ్రమమునందుండువారికి మాత్రమే నియతమా?

కృ—నాలుగాశ్రమములలో దేనియందున్నవారైనను సరే యిట్లేచేయవలసి యుంచున్నది.

అర్జు—అయితే, అయ్యా! అట్టిస్థలములలోనుండి యోగమునభ్యసించుట బ్రహ్మచర్యవానప్రస్థ యత్యాశ్రమములలో నుండువారికి సాధ్యపడినట్లు గృహస్థా శ్రమమునందుండు వారికందఱకును సులభముగ సాధ్యపడనేరదుగదా, అట్టివా రేమి చేయవచ్చును?

కృ—"తే.గీ. అనఘ నిర్జన నిశ్శబ్ద మైనయట్టి
చోటు హృదయస్థుఁడగు దేవుఁ జూచుపనికి
వలయు లేకున్న శబ్దసంకలితమేని
సజ్జనాన్వితస్థలమార్యసమ్మతంబు||" (భార-అనుశాస-4 అ. 211)

అనునట్లు సాధ్యమైనంతవఱకు మొదటఁ జెప్పఁబడినప్రకారము నిర్జనమైనట్టియు, నిశ్శబ్దమైనట్టియు స్థలమునందే యోగము నభ్యసింపవలయును. ఏలయనఁగా నట్టిస్థలమునయున్న యెడల నాత్మావలోకనముఁ జేయుటకు వీలుగానుండును. ఇది మొదటిపక్షము. ఒకవేళ నట్టిస్థలము లభ్యపడక పోయినయెడల సజ్జనులుండెడు స్థలములయందైనను జేయవచ్చును. ఏలయనఁగా, సజ్జనులుగానుండెడు వారతని యోగమునకు విఘాతముఁ గలుగఁజేయఁదగిన సంభాషణలనుగాని పనులనుగాని చేయరుగనుక నట్టిస్థలములయందైనను యోగము నభ్యసింపవచ్చును. ఇది రెండవ పక్షము.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! యోగాభ్యాసకుఁడట్టి విజనస్థలంబున రేయిం బగలు నెల్లప్పుడు నెడతెగకయుండి యభ్యసింపవలయునా? అట్లయినయెడల నాలాగు చేయుటకు బ్రహ్మచర్య యత్యాశ్రమంబులనున్నవారికి వీలుపడఁగలుగునేగాని గృహస్థవానప్రస్థాశ్రమములయుందుండు వారికెట్లువీలుపడును? వారలు తమవర్ణాశ్రమాచారోచితకర్మల నిర్వర్తింపవలసినవారై యుంచున్నారుగదా. అట్టిపనుల నిర్వర్తించుటకు వారలకెట్లవకాశము గలుగును?

కృ — అట్లురేయుంబగళ్లంతయు విజనస్థలంబుననుండఁ బనిలేదు. మతేమన్నను,

"తే.గీ. కరము నియతుఁడై కొంతేసి కాలముల శ
రీరధర్మావిరోధిగా రేయుఁ బగలుఁ
బ్రాణసంయమనము నడపంగవలయుఁ
దాన జిత్తంబుఁ దనువు శుద్ధత వహించు."

(భార. శాంతి. ౬ఆ. ౧౧౫)

అనునట్లు యోగాభ్యాసకుఁడు తనశరీరసౌఖ్యమునకుఁగాని, లేక ము కులాచారధర్మములకుఁగాని, బాధకములేకుండునట్లు ప్రతిదినమును బగటియందును రాత్రియందును గొంతకాలము నేర్పఱచుకొని యట్టికాలములయందట్టి విజనస్థలములయందుండి యోగము నభ్యసింపవలయును.

అర్జు — అయ్యా! మంచిది, నాకు మఱియొక సంశయముగలుగుచున్నది. అదేమనిన, ఇప్పుడు నీవుచెప్పినదానింబట్టి చూడ బ్రహ్మచర్యగృహస్థవానప్రస్థాశ్రమములయందుండెడువారు దమ వర్ణాశ్రమాచారోచిత కృత్యముల నెఱవేర్చుకొనుటకు ననుకూలముగ నుండునట్లు తమ గృహములకు సమీపముననుండునట్టి విజనస్థలముల నేర్పఱచుకొనవలసినవారగున ట్లగపడుచున్నదిగదా, ఇఁకను యత్యాశ్రమమున నుండెడువారల కట్టి గృహములేమింజేసి వారలకట్టివసతి యుండనేరదుగదా. అట్టివా

రట్టి విజనస్థలంబుననుండినయెడల వారలకన్నపానాదు లెట్లు దొరకఁగలవు? అవి లేనిచో వారలు క్షుత్పిపాసాపీడితులై జీవించియుండలేరుగదా?

కృ — అట్లుకక్కఱలేదు. అట్టివారలుగూడ "శ్లో॥ యత్రమన్యేత భూయిష్ఠం ప్రావృషీవతృణోదకమ్। అన్నం పానం బ్రాహ్మణస్యతజ్జీవే న్నాను సంజ్వరేత్॥" (సనత్కుమారీయము) అనునట్లు, పశువులెట్లయితే వర్షములుచక్కఁగాఁగురిసి యుదకమును గసవును సమృద్ధిగనుండెడు చోట్లను వెదకికొని మేయఁబోవునో యట్లే జ్ఞానియై సన్న్యసించినవాఁడును నెచ్చటనైతే తనకు నన్నపానాదులు సులభముగ దొరకఁదగియుంచున్నవో యట్టిస్థలమును వెదకికొని దానికిఁజేరువనుండెడు నొకవిజనస్థలములందు నివాసము జేయవలయునుగాని యన్నపానములులేక శ్రమపడఁదగినట్టి విజనస్థలములయందుండఁగూడదు. అనఁగా జనసమృద్ధమగునట్టియు, భిక్షసులభముగ దొరకఁదగినట్టియుఁ బట్టణములు, గ్రామములు మొదలగువానికి సమీపమునఁగాని, లేక, భక్షణార్హములగు కందమూలఫలాదులు సమృద్ధిగ దొరకునట్టి యడవులయందుఁ గొండలయందుఁగాని నివసింపవలయుననుట.

అర్జు — అట్టివిజన స్థలములయందుండి యోగము నెట్లభ్యసింపవలయును?

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥ 11

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।
ఉపవిశ్యాఽసనే యుఞ్జ్యా ద్యోగమాత్మవిశుద్ధయే॥ 12

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్॥ 13

అర్థము:— శుచౌ + దేశే = శుభ్రమైనస్థలమునందు, ఆత్మనః = తనకు, న+అత్యుచ్ఛ్రితమ్ = మిక్కిలియెత్తుగానిదియు, న+అతినీచమ్ = మిక్కిలితగ్గుగానిదియు, చేలాజినకుశోత్తరమ్ = దర్భయు, దానిపైని కృష్ణాజినమును, దానిపైని వస్త్రమును బఱపఁబడినదియు, స్థిరమ్ = కదలకుండునదియునగు, ఆసనమ్ = పీఠమును, ప్రతిష్ఠాప్య = ఏర్పఱచికొని, తత్ర = అట్టి (అట్లుసిద్ధపఱపఁబడిన), ఆసనే = పీఠమునందు, ఉపవిశ్య = కూర్చుండి, మనః = మనస్సును, ఏకాగ్రమ్ = నిశ్చలముగా, కృత్వా = చేసి, యతచిత్తేన్ద్రియక్రియః = నియమింపఁబడిన యింద్రియమనోవ్యాపారములుగలవాఁడై, కాయశిరోగ్రీవమ్ = దేహమును, శిరస్సును, కంఠ

మును, సమమ్ = సమముగానుండునట్లును, అచలమ్ = చలింపకుండునట్లును, ధారయన్ = ధరించినవాఁడై, స్థిరః = కదలనివాఁడై, దిశః+చ = దిక్కులపైనను, అనవలోకయన్ = చూడనివాఁడై, స్వమ్ = తనదియగు, నాసికాగ్రమ్ = ముక్కుకొనను, సంప్రేక్ష్య = చూచి (చూచుచు), ఆత్మవిశుద్ధయే = చిత్తశుద్ధికొఱకు, యోగమ్ = ధ్యానయోగము యుఞ్జ్యాత్ =అభ్యసింపవలెను.

కృ — యోగమునిట్లభ్యసింపవలెననఁగా,

“ సీ. విదితమై, విజనమై. విమలమై, సుఖమై, పొసంగువివిక్తదేశంబునందు
సమభూమియందు నిశ్చలముగా మిఱు పల్లములు గాకుండఁ జేలవముగాఁగ
వరుసఁగుశాజిన వస్త్రంబులను వుగాఁ బఱచి యొప్పగ వానిపైఁ దిరముగఁ
బూని పద్మాసనాసీనుఁడై యా మీఁదఁ గాయమధ్యమమును గళము శిరము.

తే గీ. జక్కఁగా నిక్కి దృక్కులు ముక్కు చక్కిఁ
జిక్కఁ దక్కించి తక్కిన దిక్కుఁ గనక
మిక్కిలి దశేంద్రియంబుల ద్రుక్కఁజేసి
ఫలితముగ యోగ మభ్యసింపంగవలయు.” (సీ. రా. ౧౮. ౧౦౧)

అనునట్లు, అట్టివిజనస్థలమందొక శుభ్రమగు ప్రదేశమున మిక్కిలి యెత్తుగాని మిక్కిలితగ్గుగాని లేకుండునట్లొక పీఠమునమర్చికొని, దానిపైని దర్భయు, నాదర్భపైని కృష్ణాజినమును, అందుపైని వస్త్రమును బఱచి యాపీఠముపైఁగూర్చుండి దేహమును శిరస్సును గంఠమును గదలకుండ సమముగానిలిపి అనఁగా ముందు వెనుకలకుఁగాని, ప్రక్కలకుఁగాని వంగకుండ నిలిపి చలింపనివాఁడై దిక్కులఁజూడక, తన నాసికాగ్రమునందే దృష్టినిలిపి ధ్యానయోగము నభ్యసింపవలెను.

అర్జు — ధ్యానయోగమనఁగా నెట్టిది ? దాని నభ్యసించుటయెట్లు ?

కృ — “ ఆ. పవనము లలయించి, పరిహృతసంగుఁడై,
యింద్రియముల గర్వ మెల్లమాపి,
హరివిశాలరూపమందుఁ జిత్తముఁ జేర్చి
నిలుపవలయు బుద్ధినెఱపి బుధుఁడు.” (భాగ. ౨ స్కం. ౧౫)

అనునట్లు, ఇంద్రియములను నిరోధించి దేనియందు నాసక్తిలేనివాఁడై ప్రాణవాయువులబంధించి, తన మనస్సున శ్రీహరి విరాట్స్వరూపమును ధ్యానించుచుండవలయును.

అర్జు – స్థలముపరిశుభ్రముగ నుండవలెననియు, పీఠము మిక్కిలి యెత్తుగాని తగ్గుగాని లేకుండవలయుననియు, ఆపీఠము కదలకుండ స్థిరముగ నుండవలయుననియుఁ జెప్పుటకుఁ గారణమేమి ? అందువలన నాయోగికి నేలాటిప్రయోజనముగలుగును?

కృ — స్థలము పరిశుభ్రముగ నుండనియెడల నచటక్రిమికీటకాదులయు, దుర్గంధాదులయు బాధగలిగియుండును: అట్టి బాధగలిగినపుడు మనస్సుచలించుటకుఁ గారణమగును. కనుక నట్టిప్రదేశము శుభ్రముగ నుండవలసినది యావశ్యకము. పీఠము మిక్కిలి తగ్గుగనున్నయెడల నేలఁబ్రాఁకెడు క్రిమికీటకాదు లాపీఠముమీఁదికెక్కుట కవకాశముగలుగును. అందుచే నాయోగికి బాధకముగలుగఁదగియుండును. అట్లుగాక యాపీఠము మిక్కిలి యెత్తుగానున్నయెడల నొకవేళ నాయోగి ధ్యానపరుఁడై యుండునపు డేదైన నొక ప్రమాదము గలిగినయెడలఁ గ్రిందఁబడుటకవకాశముగలిగి యుండును. కాన నట్లెత్తుగను నుండఁగూడదు.

ఇఁక నాపీఠముపైని దర్భాజినవస్త్రములు పఱచవలసినందుకుఁ గారణమేమనఁగా నాయాసనము శుచిర్యాభిముగను, మృదువుగను సుఖకరముగను నుండుట కొఱకే.

అర్జు — ఆయోగిధ్యానము సేయునపుడు కాయశిరఃకంఠములను గదలకుండ నుంచుకొని దిక్కులుచూడక తన నాసికాగ్రమునే చూడవలసినదెందుకు ?

కృ — అట్లుచేయుటవలన నతనిదృష్టి చుట్టుప్రక్కలనుండు నితరవిషయముల మీఁదఁ బాఱకుండును. అందుచే నాతనిమనస్సు చలింపకుండును. అట్లుగాక యతని దృష్టికి నితరవిషయములు గోచరించుచుండినయెడల వానిమనస్సు విషయముల మీఁదఁ బ్రవర్తించుట కవకాశము. అట్లు ప్రవర్తించుచుండు నపుడామనస్సును నిబ్బరముగనుంచుట యసాధ్యము.

అర్జు — అయితే, అయ్యా ! అట్లుధ్యానముచేయునపుడు ప్రాణవాయువులను బంధించవలసి నట్లిప్పుడు నీవుచెప్పెడి వాక్యములవలనఁ గనఁబడుచున్నదే, అది యెందువలన ?

కృ — అవును. అట్లుచేయనియెడల దృష్టిని నాసికాగ్రమున నిలుపుటకసాధ్యపడదు. అట్లుదృష్టినాసికాగ్రమున నిలువనియెడల జిత్తము చలింపకుండ నుండనేరదు.

అర్జు — అయితే, అట్లు ప్రాణవాయువులను బిగఁబట్టుటవలనఁ బ్రాణమున కపాయముగలుగదా ?

కృ — మెలకువదప్పినయెడల నపాయము గలుగునుగాన

" క. ప్రాణాయామము క్రమమునఁ
బ్రాణోత్పీడనముగాని భంగినడపుచున్
ఘ్రాణాగ్రస్థితివిషయ
శ్రేణిదొఱఁగియుండి యోగసిద్ధతఁబడయున్." (భార. శాంతి. ౬౮)

అనునట్లు యోగాభ్యాసకుఁడు ధ్యానము సేయునపుడు మెల్లఁగ బిగలిగి ప్రాణమున కపాయము లేకుండునట్లూపిరి బిగఁబట్టుట యభ్యసింపవలయును. అట్లభ్యసింపుచు వాఁగాఁ గ్రమక్రమముగ నలవడును. అందుపైని దృష్టిని జలింపకుండ నాసికాగ్రముపై నిలుపుటకు సాధ్యపడును. అట్లెప్పుడు సాధ్యమగుచున్నదో, అప్పుడు వాని చిత్తము చలింపకుండ భగవత్స్వరూపమనెడి లక్ష్యమునందు నిల్చియుండును కాన,

శ్లో॥ ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ 14

అర్థము:—యుక్తః=యోగాభ్యాసకుడు, మనః=మనస్సును, సంయమ్య=(పైఁజెప్పబడిన ప్రకారము) నిరోధించి, ప్రశాన్తాత్మా=శాంతచిత్తుఁడును, విగతభీః=దిగులులేనివాఁడును, బహ్మచారివ్రతే+స్థితః=బ్రహ్మచర్యవ్రతమందున్న వాఁడును, మచ్చిత్తః=నాయందే మనస్సుగలవాఁడును, మత్పరః+(సన్)=నాయందే యాసక్తిగలవాఁడునునై, ఆసీత=ఉండవలెను.

"మ. యతధీచిత్తమరుద్ధశేంద్రియగణను వ్యాపారుఁడై మానియై
హృతకామాదివికారుఁడై గతభయుండై బహ్మచారివ్రత
స్థితుఁడై శాంతమనస్కుఁడై స్వగురుమూర్తి ప్రోక్త లక్ష్యార్థసం
గతి యామద్వయ మభ్యసింపదగు యోగంబంచితోద్యోగుఁడై॥"
(సీతా.రా.1 ఆ).

అనునట్లు యోగాభ్యాసకుఁడు మనోబుద్ధీంద్రియములయొక్కయు, ప్రాణవాయువులయొక్కయు, శరీరముయొక్కయు వ్యాపారములనన్నింటి నిదివఱకుఁ జెప్పఁబడిన ప్రకారము నియమించినవాఁడును, శాంతచిత్తుఁడును, అనఁగాఁ గామాద్యరిషడ్వర్గములచే బాధింపఁబడని మనస్సుగలవాఁడును, భయరహితుఁడును, అనఁగా నాధ్యాత్మికాధి దైవికాది భౌతికములనెడు తాపత్రయముచే దిగులుఁజెందని మనస్సుగలవాఁడును, బ్రహ్మచర్య వ్రతమందున్నవాఁడును, అనఁగా

"మ॥ గురుశుశ్రూషయు, నాగమాధ్యయనమున్, గోష్ఠీనిరాసంబుఁ, ద
త్పరతం, బొందొరయంగఁ దాఁ జోరమియున్, శైక్షాశనత్వంబు ష
డ్వరకర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేకయు
వ్వరితోడం బగ గాకయున్కియును, భవ్యబ్రహ్మచర్యోక్తముల్."
(భార.శాంతి. 2 ఆ. 230)

అనునట్లొక సద్గురువు నాశ్రయించి యాయనకుఁ బరిచర్యసేయుచు నాయన వలన నుపదేశమునొంది వేదాధ్యయనాదుల నభ్యసించుటయు, జనసమ్మర్దముండుచోటఁ

జేరకుండుటయు, నొకవేళ నట్టిజనసమూహము దానుండెడు చోటికి వచ్చినను వారలతోఁ దానుగలియకుండుటయు, భిక్షాన్నముఁదినుటయు, యజనయాజనాధ్యయనాధ్యాపక దానపరిగ్రహములనెడు షట్కర్మములు నిర్వర్తించువాఁడు రాగద్వేషరహితుఁడైయుండుటయు. నెవరితోడనైనను పరే యేకారణమునుబట్టియైనను విరోధింపకుండుటయు, బ్రహ్మచర్యవ్రతమనఁబడుచున్నది. కాన నట్టి వ్రతమునందున్నవాఁడునునై సదానాయందేమనస్సునిలిపి నన్నే ధ్యానింపుచుండవలెను.

శ్లో॥ యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥ 15

అర్థము:— నియతమానసః=మనోనిగ్రహముగల, యోగీ=యోగాభ్యాసకుఁడు, ఏవమ్=ఇట్లు, (పైశ్లోకములందు 10-11-12-13-14 శ్లోకములలోఁజెప్పఁబడిన ప్రకారము), సదా=ఎల్లప్పుడు, ఆత్మానమ్=మనస్సును, యుఞ్జన్=అలవరచినవాఁడై, నిర్వాణపరమామ్=మోక్షమే పర్యవసానముగాఁగలదియు, మత్సంస్థామ్=నాయందుండునట్టిదియునగు, శాన్తిమ్ = చిత్తోపరతిని. అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

ఇట్లు (10-11-12-13-14 శ్లోకములలోఁ జెప్పఁబడిన ప్రకారము) ఎవఁడైతే యెల్లప్పుడు తనమనస్సును నిగ్రహింపుచు దానిని యోగమునందలవఱచుచు వచ్చునో యట్టివాఁడు తుదకు, అనఁగా నాయోగముపండినపిమ్మటఁ జిత్తశాంతిని బొందును. అట్లెప్పుడు శాంతచిత్తుఁడగుచున్నాఁడో యప్పుడునన్ను బొందినవాఁడగుచున్నాఁడు. అనఁగా జననమరణాది సంసారరాహిత్యమైన నిర్వాణపదవిని బొందుచున్నాఁడనుట.

శ్లో॥ నాత్యశ్నత స్తుయోగోఽస్తి నచైకాన్త మనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున! 16

అర్థము:— హేఅర్జున! = ఓయర్జునుఁడా! యోగః = యోగసిద్ధి, అత్యశ్నతః + తు = మిక్కుటముగఁదినువానికి, న+అస్తి=కలుగదు. ఏకాన్తమ్=బొత్తిగా, అనశ్నతః+చ=భుజింపనివానికిని, న+(అస్తి)=కలుగదు, అతిస్వప్నశీలస్య+చ=మిక్కిలిగా నిద్రించువానికిని, న+(అస్తి)=కలుగదు, జాగ్రతః+చ+ఏవ=మిక్కిలిగా మేలుకొనియుండువానికిని, న+(అస్తి)=కలుగదు.

అయితే, ఓయియర్జునా! అట్లు యోగము నభ్యసించెడు వాఁడు గమనింపవలసిన పద్ధతులుకొన్నిగలవు. అవియెవ్వియనఁగా,

"చ. వనరుచు నేమియుం దినని వానికి మిక్కిలి వెక్కసంబుగాఁ
దిని తొఁగఁబోయువానికిని దీఱనినిద్దుర యెల్లప్రొద్దుఁ బై

కొనఁబడియుండువానికిని గొంకక రేఁబగ లొక్కరీతిమే
ల్కొని వసియించువానికి నగోచరము లగు యోగిలక్ష్యముల్."

(సీ. రా. ౧ ఆ. ౯౯)

అనునట్లు దేహధారణార్థము గావలసినంతకంటె నధికముగ భుజింపఁగూడదు. బొత్తిగ భుజింపకయు నుండఁగూడదు. దేహారోగ్యమునకుఁ గావలసినంతకంటె నెక్కువగ నిద్రింపఁగూడదు. బొత్తిగ నిద్రింపక మేల్కొని యుండుటయును గూడదు. ఏలయనఁగా, అధికముగ భుజించినయెడల నాయాసమును అజీర్ణాది దేహబాధలను గలుగఁదగియుంచున్నవి. అట్టిదేహబాధలుగలవానిమనస్సు యోగమున స్థిరముగ నుండనేరదు. లేక, బొత్తిగా భుజింపక యుపవసించువాఁడైతేనో, ఎప్పుడును క్షుద్బాధచేఁ బీడింపఁబడుచుండును. కాన నట్టివానియొక్క మనస్సును యోగమునభ్యసించునపుడు స్థిరముగ నుండఁజాలదు. మఱియు నెప్పుడు నిద్రపోవు స్వభావముగలవాని మనస్సు మాంద్యము గలిగియుండునుగనుక నట్టివానిమనస్సును యోగమునందు స్థిరముగ నుండఁజాలదు. లేక, బొత్తిగా నిద్రింపక మేల్కొని యుండువాఁడైనయెడల నట్టివాఁడెప్పుడు కూరుకుపాట్లుపడుచు నిద్రమబ్బుగలవాఁడై యుండునుగనుక నట్టివానిమనస్సుగూడ మాంద్యముగానే యుండును గాన నట్టివాని మనస్సుగూడ యోగమున స్థిరముగ నుండఁజాలదు. కాన,

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

అర్థము :— యుక్తాహారవిహారస్య=ఉచితమైన (అనఁగా దన దేహప్రకృతికిఁ దగినట్టిదియు, మితమైనట్టిదియు) ఆహారవ్యాయామములుగలవాఁడును, కర్మసు= కర్మలయందు (అనఁగా గాలోచితములగు నిత్యనైమిత్తికాదికర్మల నెఱవేర్చుట యందు), యుక్తచేష్టస్య=యుక్తమైన (అనఁగా దనశక్తిస్వభావములకుఁదగిన) ప్రవర్తనగలవాఁడును, యుక్తస్వప్నావబోధస్య=మితమైననిద్రయును మెలకువయును గలవాఁడు (అనఁగా రాత్రి పెందలకడ శయనించి యుదయమునఁ బెందలకడ మేల్కొనువాఁడును (నగు), (యోగినః)=యోగాభ్యాసికి, యోగః=యోగము, దుఃఖహా=కష్టమునుబోఁగొట్టునది (అనఁగా సుఖముగా నభ్యసింపఁదగినది), భవతి= ఆగుచున్నది.

"క. యుక్తాహారవిహారుఁడు
యుక్తస్వప్నావబోధుఁడును గర్మములన్
యుక్తవిచేష్టుండగు ఘన
యుక్తునకగుఁ బరమరాజయోగము సుఖమై" (సీ. రా. ౧ ఆ. ౧౦౦)

అనుటట్లు యోగము నభ్యసించువాఁ డుచితమైన యాహారవ్యాయామములు గలవాఁడై యుండవలయును. అనఁగాఁ దనదేహప్రకృతికి నేయే పదార్థములు వికటించునో యట్టివానిని వర్జించి తనదేహారోగ్యమున కనుకూలములగు పదార్థములను మాత్రమే మితముగ భుజింపుచుఁ దనదేహారోగ్యమునకుఁ దగినట్టి నడచుట మొదలగు వ్యాయామములు గలవాఁడై యుండవలయును. మఱియుఁ దాను ప్రతిదినమును నెఱవేర్చవలసిన నిత్యనైమిత్తికాది కృత్యములయందుఁ దనశక్తిస్వభావముల కనుకూలముగ నుండునట్లు ప్రవర్తింపవలయును. ఎట్లనఁగాఁ గొందఱు చల్లని నీటితో స్నానము చేయఁగలరు. మఱికొందఱు అట్టి చల్లనీళ్ళతో స్నానము చేసినయెడల నేదియో యొక రుగ్మతఁగలుగఁ దగిన దేహప్రకృతిగలవారుగ నుండుచున్నారు. కాన నట్టివా రుష్ణోదకముతో స్నానము చేయవలసియుండుచున్నది. ఇట్లే తక్కినయన్ని విషయములయం దూహింపవలయును. మఱియును మితమైననిద్రయు జాగరూకతయుఁ గలిగియుండవలయును. అనఁగా రాత్రులయందు విశేషకాలము మేలుకొని యుండక, పెందలకడ శయనించి యుదయమునఁ బెందలకడ, అనఁగా నరుణోదయమునకుముందే నిద్రమేల్కొనుచుండవలయును. పగలు నిద్రింపరాదు. ఇటు చేయుటవలన వాని దేహారోగ్యము చెడకుండును. కాన నిట్లెవఁడైతే జాగ్రతతోఁ బ్రవర్తించుచుండునో యట్టివానికి దేహారోగ్యము చక్కఁగానుండును. కనుక నట్టివాఁడు యోగమునభ్యసించునెడల మిగులఁ గష్టము నొందఁడు. అనఁగా నట్టివానికి యోగము నభ్యసించుట సులభసాధ్యమగుచున్నది.

శ్లో॥ యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

అర్థము :— వినియతమ్ = (పైఁజెప్పఁబడిన ప్రకారము) నియమింపఁబడిన, చిత్తమ్ = మనస్సు, యదా = ఎప్పుడు ఆత్మని + ఏవ = ఆత్మానుభవమందే, అవతిష్ఠతే = నిల్చియుండుచున్నదో, తదా = అప్పుడు, (సః) = వాఁడు, సర్వకామేభ్యః = సమస్తకోరికలకొఱకు, నిస్స్పృహః + (సన్) = అపేక్షలేనివాఁడై, యుక్తః + ఇతి = యోగముతోఁ గూడినవాఁడని (అనఁగాఁ యోగసిద్ధిని బొందినవాఁడని), ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

కనుక నోయియర్జునా! యిట్లిపుడు నేఁజెప్పిన ప్రకారము మనస్సును నిరోధింపుచు యోగము నభ్యసింపుచుండఁగాఁ గొంతకాలమునకట్టి యోగాభ్యాసి మనస్సు తనంతటనే పరమాత్మస్వరూపధ్యానమున నిలిచిపోవును. అనఁగా నతఁడెచటనుండినను ఏమి పనిచేయుచుండినను నతని యింద్రియములు విషయములయందుఁ బ్రవర్తింపు

చుండినను సరే, ఆతని మనస్సావిషయములలోఁ జేనియందును దగులము నొందక నెల్లప్పుడును భగవత్స్వరూపమునందే నిలిచియుండి యాస్వరూపమునే ధ్యానింపుచుండును. ఆతనిమనస్సెప్పుడట్టిస్థితికి వచ్చుచున్నదో, అప్పు డెతఁడు యోగసిద్ధిని బొందినవాఁడగుచున్నాఁడు.

అర్జు — అట్లెంత కాలము వఱ కభ్యసించినయెడల నట్టి యోగసిద్ధిఁ బొందఁ గలఁడు ?

కృ — "ఇవ్విధంబునఁ బ్రతిదివసంబు యామత్రయము నియమంబుఁ దప్పక యభ్యసించినయెడల నిర్మలనిశ్చల చిత్తవృత్తిగల పురుషునకు షణ్మాసంబులకును, మందప్రజ్ఞునకు సంవత్సరంబునకును. కేవలమూఢాత్మునకు ద్వాదశవర్షంబులకును బరమసూక్ష్మతారక యోగసిద్ధియగునని యోగశాస్త్రంబుల వినంబడు."

(సీ. రా. ౧౮. ౧౯౨.)

అర్జు — " ‥ గాభ్యాసము చేయువాని మనస్సు, అట్లు చేయుచు రాఁగా రాఁగాఁ గొంత కాలమునకుఁ బరమాత్మస్వరూపధ్యానమునందు నిలిచిపోవునని చెప్పితివి గదా, అదియెట్లు? ఁగా నపుడు వానిమన స్సేరీతిగనుండును ?

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥　19

అర్థము:— యతచిత్తస్య = నియమింపఁబడిన చిత్తముగలవాఁడును, యోగమ్ = ధ్యానయోగమును, యుఞ్జతః = అభ్యసింపుచున్న వాఁడునునగు, యోగినః = యోగి యొక్క, ఆత్మనః = మనస్సునకు, నివాతస్థః = గాలిలేనిచోట నుండెడు, దీపః = దీపము, యథా = ఏప్రకారము, న+ఇఙ్గతే = చలింపకుండునో, సా = అట్టి యచలస్థితి, ఉపమా = ఉపమానముగా, స్మృతా = చెప్పఁబడినది.

కృ — అట్టివానిమనస్సెట్లుండుననఁగా,

" క. అది గుదిసిన, విజ్ఞానము
గదలక నిర్వాతదీప కాంతియుఁబోలెం
బొదలును; జిత్తంబును నుప
లదశాసంప్రాప్తి నిశ్చలంబగు; దానన్." (భార. అనుశా. ౪ఆ. ౨౧౯.)

అనునట్లు యోగము నభ్యసింపుచు రాఁగ రాఁగఁ గొంత కాలమునకు వానికి నిశ్చలజ్ఞానము గలుగును. అనఁగా వానిజ్ఞానము గాలిలేనిచోటనుండెడు దీపమువలెఁ జలింపకయుండును. అట్టిజ్ఞానోత్పత్తికి యెప్పుడగుచున్నదో యప్పుడు వానికి విషయ వాంఛ లడుగుచున్నవి గనుక నప్పుడు వానిమనస్సుగూడ బండకొని, అనఁగా డాయి

యేప్రకారమైతే వర్షాతపాదులచేఁ జలింపకుండునో, అట్లే యింద్రియ విషయాదులచేఁ జలింపనిదై, కదలకుండునట్టి దీపమువలెనుండును. అదెట్లనఁగా దీపమును జలింపఁ జేయునది వాయువుగదా? అట్టివాయువులేనిచో నుండెడు దీపము చలింపవలసిన కారణములేకపోవుటచే నెటు కదలకుండునో, అట్లే మనస్సును జలింపఁజేయునవి యింద్రియవిషయములు గనుక నట్టి విషయవాంఛయెప్పుడు లేకపోవుచున్నదో, అప్పుడు వానిమనస్సు పైఁజెప్పబడిన దీపమువలెఁ జలింపకుండును. కాన,

"క. వినుము, నితవాస్థానం
బునఁ గంపనరహితదీపము వెలింగెడుచా
డ్పున నంతరాత్మ వెలుఁగుచు
నునికి ప్రసాదంబుభంగి యుత్తమధిషణా" (భార. శాంతి. ౨అ. ౧౫౬.)

అనునట్లు యోగిమనస్సు, అట్టి నివాతదీపస్థితికి నెప్పుడువచ్చుచున్నదో, అప్పు డామనస్సు స్వస్థతను, అనఁగా శాంతిని బొందినదగుచున్నది. కాన నప్పు డతఁడు యోగసిద్ధిని బొందినవాఁ డగుచున్నాఁడు.

అర్జు — అట్లు యోగసిద్ధిని బొందినవాని లక్షణము లెట్లుండును?

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ 20

శ్లో॥ సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్।
వేత్తి యత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥ 21

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాఽధికం తతః।
యస్మిన్‌స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥ 22

శ్లో॥ తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ 23

అర్థము :— చిత్తమ్ = మనస్సు, యోగసేవయా = యోగాభ్యాసముచే, నిరుద్ధం+(సత్) = నిరోధింపఁబడినదగుచు, యత్ర = ఎప్పుడు (ఏస్థితియందు), ఉపరమతే = శాంతినిబొందుచున్నదో, యత్ర+చ = ఎప్పుడైతే, ఆత్మనా = తనమనస్సుచేత, ఆత్మానమ్ = పరమాత్మ (స్వరూపమును), ఆత్మని+ఏవ = తనయందే, పశ్యన్ = చూచుచు, తుష్యతి = సంతోషింపుచున్నాఁడో,

అయమ్ = ఈయోగాభ్యాసకుఁడు, అతీన్ద్రియమ్ = ఇంద్రియగోచరముగానట్టిదియు, బుద్ధిగ్రాహ్యమ్ = బుద్ధిచేగ్రహింపఁబడఁదగినదియు, ఆత్యన్తికమ్ = అంతము

లేనట్టిదియు నగు, సుఖమ్ = ఆనందము, యత్ = ఏదిగలదో, తత్ = దానిని, యత్ర = ఎప్పుడు (ఏస్థితియందు), వేత్తి = ఎఱుంగుచున్నాఁడో, యత్ర + చ = (మఱియు) నెప్పుడైతే, స్థితః + (సన్) = యోగమందున్నవాఁడై, తత్త్వతః = ఆత్మానుభవమునుండి, న + ఏవ + చలతి = చలింపఁడో (మరలఁడో),

యమ్ = ఏసుఖమును (ఆనందమును), లబ్ధ్వా = పొంది, అపరమ్ = మఱియొక, లాభమ్ = సుఖమును, తతః = అంతకంటె, అధికమ్ = అతిశయమైనదానినిగా, న + మన్యతే = తలఁపఁడో, యస్మిన్ + చ = ఏ (యాత్మానుభవమందైతే), స్థితః + (సన్) = ఉన్నవాఁడై, గురుణా = గొప్పదియగు, దుఃఖేన + అపి = దుఃఖముచేతనైనను, న + విచాల్యతే = చలింపఁబడఁడో,

దుఃఖసంయోగవియోగమ్ = దుఃఖసంబంధరాహిత్యమైన, తమ్ = దానిని (పైమూఁడుశ్లోకములలోఁ జెప్పఁబడినస్థితిని), యోగసంజ్ఞితమ్ = యోగమనెడుపేరు గలదానినిగా (యోగసిద్ధినిగా), విద్యాత్ = ఎఱుఁగవలయును, సః + యోగః = అట్టియోగ (సిద్ధి), అనిర్విణ్ణచేతసా = విసుకులేనిమనస్సుచేత, నిశ్చయేన = సాధించి పొందవలె ననుపూనికతో, యోక్తవ్యః = పొందఁదగినదిగానుంచున్నది.

'కృ — ఓయి యర్జునా! యోగసిద్ధిని బొందినవాని లక్షణము లెట్టివనఁగా యోగాభ్యాసియోగసిద్ధి నెప్పుడుపొందినవాడగునో దానిం జెప్పుచున్నాను వినుము. యోగము నభ్యసించెడు వాఁడు ప్రతిదినమును యోగమునభ్యసించు కాలమందుఁ దన మనస్సును విషయములమీఁదఁ బ్రవర్తింపకుండునట్లు నిరోధింపవలయునని యింతకు ముందు చెప్పియుంటినిగదా; అట్లు ప్రతిదినమును యోగాభ్యాసకాలమందు మనస్సు విషయములమీఁదిఁ బ్రవర్తింపుచుండినను బ్రయత్నపూర్వకముగ దానినావిషయముల నుండి మరలించుచు రాఁగ రాఁగఁ గొంత కాలమునకు నట్టి యభ్యాసవశమున విషయములనుండి తనంతటనే మరలఁగలదు. అనఁగా నట్టివిషయములయం దాసక్తిలేనిదై యుండును. అట్లెప్పు డప్రయత్నగ మరలుచున్నదో యప్పుడు వానిమనస్సునకు శాంతిగలుగును. అనఁగా విషయవాంఛానివృత్తిగలుగును. అట్లు విషయవాంఛానివృత్తి యెప్పుడైతే కలుగుచున్నదో, అప్పుడు వాని మన స్సితరవ్యాయామము లేనిదై వాఁడు చేయుచున్న పరమాత్మస్వరూపధ్యానమందు నిశ్చలముగ నిల్చినదగుచు సదా ఆపరమాత్మస్వరూపమునే చూచుచు నానందించుచుండును. పరమాత్మస్వరూప మెట్టిదనఁగా నది యింద్రియములకు గోచరించునట్టి స్వరూపముగాదు. అనఁగా, నేత్రములతోఁ జూడఁదగినదిగాఁ గాని, చెవులతో వినఁదగినదిగాఁ గాని, ముక్కుతో నాఘ్రాణింపఁదగినదిగాఁ గాని, నోటితోఁ జవిచూడఁదగినదిగాఁ గాని,

దేహముతో స్పృశింపఁదగినదిగాఁగాని యుండదు. మఱెట్టిదనఁగా, బుద్ధిచే గ్రహింపఁదగినదిగ నుంచున్నది. దానిని బుద్ధిచే నెట్టిదిగ గ్రహింపవలెననగా,

"వ. వినుము భగవంతుండైన హరివిరాడ్విగ్రహంబునందు భూతభవిష్యద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు. ధరణీ సలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్త్వంబులనియెడి సప్తావరణంబులచేత నావృతంబగుమహాండ కోశంబైన శరీరంబునందు ధారణాశ్రయుండైన వైరాజపురుషుఁడు తేజరిల్లు. అమ్మహాత్మునికిఁ బాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగ పాదాగ్ర భాగంబులు రసాతలంబు, గుల్ఫంబు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలంబు. ఊరువులు వితలంబు, జఘనం బతలంబు, నాభివివరంబు నభస్థలంబు, వక్షంబు గ్రహతారకా ముఖరజ్యోతిస్సమూహసమేతంబగు నక్షత్రలోకంబు, గ్రీవంబు మహర్లోకంబు, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, కర్ణంబులు దిశలు. శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు అశ్వినీదేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియంబు సూర్యుండు, రేయింబగళ్ళు ఱెప్పలు. భ్రూయుగ్మ విజృంభణంబు బ్రహ్మపదంబు, ధాతువులు జలంబులు, జిహ్వేంద్రియంబు రసంబు, సంభాషణంబులు సకలవేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్రాది స్నేహకళలు, నగవులు జనోన్మాదకరంబులైన మాయావిశేషంబులు, కటాక్షంబు లనంతసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబుల ధర్మమార్గంబులు, వెన్ను ధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబు, శల్యసంఘంబులు గిరులు, నాడీనివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్వాసంబులు వాయువులు, ప్రాయంబు నిరవధికంబైన కాలంబు, కర్మంబులు నానావిధజంతు నివహాసంభవ సంచరణంబులు, శిరోజంబులు మేఘంబులు, కట్టుపుట్టంబులు సంధ్యలు, హృదయంబు ప్రధానంబు, సర్వవికారంబులకు నాశ్రయంబైన మనంబు చంద్రుండు, చిత్తంబు మహత్తత్త్వంబు, అహంకారంబు రుద్రుండు. నడపులు చతుర్యగాదులు, అశ్వాశ్వతర్యుష్ట్రగజంబులు నఖంబులు. కటిప్రదేశంబు పశుమృగాదులు, విచిత్రంబులైన శిల్పనైపుణంబులు పక్షులు, బుద్ధి మనువులు, నిలాసంబు పురుషుండు, షడ్జాదులైన సర్వవిశేషంబులు గంధర్వవిద్యాధరసిద్ధచారణాప్సరస్సమూహంబులు, స్మృతి ప్రహ్లాదప్రముఖులు, వేద్యంబు దైత్యదానవానీకంబై యుండు. మఱియు నమ్మహావిభునకు ముఖంబు బ్రాహ్మణులును, భుజంబులు క్షత్రియులును, ఊరువులు వైశ్యులును, చరణంబులు శూద్రులును, నామంబులు నానా

విధంబులైన వసురుద్రాదిదేవతాభిధానంబులును, ద్రవ్యంబులు హవిర్భాగంబులును, కర్మంబులు యజ్ఞప్రయోగంబులునవు. ఇవిసర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబున ముముక్షుండైనవాఁడు మనంబును సంధానంబు సేయవలయు''

(భాగ. అష్ట-ం. ౧౬.)

అని పెద్దలు చెప్పియున్నారు. కాన విరాట్స్వరూపమిట్లుండునని బుద్ధిచే నూహించి తెలిసికొనఁదగినదిగా నుంచున్నది. అట్టివిరాట్స్వరూపమును దెలిసికొనుటచే మనస్సున కొక గొప్పయానందము గలుగును. ఆయానందమంతములేనిదిగా నుండును. కాన నట్టియానందము వానిమనస్సున కెప్పుడైతే కలుగుచున్నదో, అప్పుడు వానిమనస్సు దానియందే లగ్నమై చలింపక నిల్చియుండును. అనఁగా మఱియొక విషయమున మరలఁ బ్రవర్తింపనేరదు. ఏలయనఁగా నాయానందంబును బొందినపిమ్మట నంతకంటె నెక్కుడగు నానందమును గలుగఁ జేయఁదగిన విషయము మఱియొకటిలేదని తెలిసికొన్నవాఁడగుచున్నాఁడు. కనుకఁ దదితరములగు నేవిషయములయందును మరల వానిమనస్సు రమింపనేరదు. కాన నట్టియానందాబ్ధిని దేలుచుండువాని మనస్సును నాధ్యాత్మికాధిదైవికాధిభౌతికతాపత్రయములలో నేదియైననుసరే, యెంతిగొప్ప దుఃఖకరమైనదియైననుసరే, చలింపఁజేయఁజాలదు. అనఁగా నట్టిదుఃఖములేవి సంభవించినను వానిని లక్ష్యముచేయకుండును. కాననట్లు నిత్యానందజనకమైనట్టిదియు, దుఃఖరాహిత్యమైనట్టిదియు నగుస్థితికి వానిమనస్సెప్పుడు వచ్చుచున్నదో, అప్పుడువాఁడు యోగసిద్ధిని బొందినవాఁడని చెప్పఁదగియుంచున్నాఁడు. అయితే, ఓయియర్జునా! అట్టి యోగసిద్ధిని బొందుట సులభసాధ్యము గాదుసుమా. మఱేమనఁగా,

"క. రసకర్మజ్ఞుండు దారము
పసిండిసేఁతకుఁ బ్రయత్నపరుఁడై శుక్ల
త్వసమగ్రముసేయు క్రియ
న్విసువక పరిశుద్ధి జీవునికిఁ జేయుటురున్." (భార-శాంతి-౫ ఆ. ౪౧౭)

అనునట్లు రసవాదము నెఱిఁగినవాఁడు వెండిని బంగారముచేయుటకై యెంత పాటుపడునో యట్లే, యోగము నభ్యసించువాఁడనేక విధములగు నంతరాయములు గలుగుచుండినను వానిని లక్ష్యపెట్టకయు, నెంతకాలమునకును లభింపకపోయెనే యని మనస్సున విసికికొనకయు, నేవిధముగనైనను నెంతకష్టమున కోర్చియైనను, దీనినిసాధించి పొందవలెననెడు పూనికతో నభ్యసించిననేగాని యట్టియోగసిద్ధి లభింపనేరదు.

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ 24

శ్లో॥ శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చి దపి చిన్తయేత్॥ 25

అర్థము:— సఙ్కల్పప్రభవాన్ = సంకల్పమువలనఁ బుట్టెడు, సర్వాన్ + కామాన్ = సమస్తకోరికలను, అశేషతః = బొత్తిగా, త్యక్త్వా = విడిచిపెట్టి, ఇన్ద్రియగ్రామమ్ = ఇంద్రియసమూహమును, మనసా + ఏవ = మనస్సుచేతనే, సమన్తతః = అంతట (అన్నివిషయములనుండి), వినియమ్య = మరలించుకొని, ధృతిగృహీతయా = ధైర్యము నవలంబించిన, బుద్ధ్యా = బుద్ధిచేత, శనైశ్శనైః = మెల్లమెల్లగా, (మనః) = మనస్సును, ఉపరమేత్ = శమింపఁజేయవలయును, (తథా) = అట్లు, ఆత్మసంస్థమ్ = తనయందున్న దానినిగా (తనకు వశవర్తినిగా), కృత్వా = చేసి, కిఞ్చిత్ + అపి = ఆత్మేతరమగు నేవిషయము నైనను, న + చిన్తయేత్ = తలఁపఁగూడదు.

కాన నోయియర్జునా! యోగాభ్యాసియగువాఁడు ముఖ్యముగా జేయవలసిన పనియేమనఁగా, ఇంద్రియములను నియమించుకొనవలసియున్నది. ఆనియమించుటయన్ననో, కన్నులు మూసికొనుట, చెవులు మూసికొనుట, ముక్కు మూసికొనుట, నోరు మూసికొనుట, దేనిని స్పృశింపకుండుట మొదలగుపనులచేఁ జేయఁదగినదిగాదు. ఏలయనఁగా, ఒకవస్తువును, నేత్రములతోఁజూచి దానియందుఁ గోరిక పుట్టునపుడు నేత్రములు మూసికొనినయెడల నావస్తువునందుఁ గలిగిన యభిలాష, అంతమాత్రముచేత విడిచిపోనేరదు. ఇట్లే తక్కిన యింద్రియములకును గోచరించిన విషయములయందుఁ బొడమిన వాంఛలాయాయింద్రియములను మూసికొనినంతమాత్రముచేతనే నివర్తింపనేరవు. మఱి యవియెట్లు నివర్తింపఁదగియున్నవనిన, మనస్సుచేతమాత్రమే నివర్తింపఁదగియున్నవి. ఏలయనఁగా, ఇంద్రియములేవిషములయందుఁ బ్రవర్తింపుచున్నవో యావిషయములయందుఁ దగిలెడువాంఛలు సంకల్పమువలనఁబుట్టుచున్నవి. అట్టిసంకల్పముయొక్క యుత్పత్తిస్థానము మనస్సేయైయుంచున్నది. కాన నట్టి సంకల్పములకు మనస్సునం దెడమియ్యకుండినయెడల,

"క. ఓలిని సంకల్పంబులు
సాలించినఁ దమమడంగి సంసారమహా
జాలము సెడునంతశరత్
కాలవియద్భాతి బరమతత్త్వము తెలుఁగున్॥" (వాసి–రా– ౨ ఆ.)

అనగ నట్టి విషయములయందును గోరికలు పుట్టనే పుట్టవుగదా. కాన యోగాభ్యాసియగువాఁడు తనమనస్సున నేలాటిసంకల్పమునకును నెడమివ్వకుండవలయును. అట్లు చేయుటవలన వానిమనస్సున నేకోరికయుఁ బుట్టనేరదు. అట్లు కోరికలులేనివాఁ డెప్పుడగుచున్నాఁడో, అప్పుడు వానియింద్రియము లెట్టివిషయములయందు బ్రవర్తించినను, ఆవిషయములయందు వానికి వాంఛ గలుగనేరదు గాన నట్లు చేయుటవలనఁ దనయింద్రియములను మనస్సుచేత నియమించిన వాఁ డగుచున్నాఁడు. అయితే, అట్లు చేయుట బుద్ధిబలము గలవానికేగాని పేదమనస్సుగలవానికి సాధ్యపడదు గాన దృఢమైన నిశ్చయముగల బుద్ధితో మనస్సును పైఁజెప్పఁబడిన ప్రకార మలవఱపవలయును. అట్లలవఱచుటయైనను సులభముగ సాధ్యపడదు. కానఁ గొంచెముకొంచెముగ నలవాటుసేయుచు రావలయును. అట్లుసేయుచురాఁగ రాఁగఁ గొంతకాలమునకు వానిమనస్సు పరమించును. అనఁగా నేలాటికోరికలులేనిదై స్వస్థతనొందును. అట్టి మనస్స్వస్థత యెప్పుడు గలుగుచున్నదో, అప్పుడామనస్సు తనయందే నిల్చి యుండును. అనఁగాఁ దనకు వశవర్తియైయుండును. అట్లు తనమనస్సును వశవర్తినిగాఁ జేసికొని యాత్మావలోకనముదప్పఁ దదితరములగు చింతలెవ్వియు లేక యుండవలయును.

శ్లో॥ యతో యతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మ న్యేవ వశం నయేత్ ॥ 26

అర్థము:— చఞ్చలమ్ = చపలమైనదియు, అస్థిరమ్ = నిలకడలేనిదియు నైన, మనః = మనస్సు, యతః + యతః = ఎచ్చటెచ్చటనైతే, నిశ్చరతి = సంచరించుచుండునో, తతః + తతః = అచ్చటచ్చట, ఏతత్ = ఈ (మనస్సును,) నియమ్య = నిరోధించి (మరలించి), ఆత్మని + ఏవ = తనయందే, వశమ్ = అధీనమును, నయేత్ = పొందింపవలెను.

అయితే, ఓయియర్జునా! మనస్సు మిగులఁ జపలస్వభావముగలది గాన దానినెంతబిగఁబట్టినను నిలుకడగానుండదు. ఏదైననొకవిషయమునఁ బ్రవర్తించుచునే యుండును, అనఁగా నేదైననొక యింద్రియమునకు సంబంధించిన విషయము గోచరించినపుడా విషయము నపేక్షించుచుండును. అదెట్లనఁగా, ఏదైనమంచివస్తువును జూచినపుడు దానిని గ్రహింపఁగోరును. ఏదైనసంగీతము మొదలగు సుస్వనము వినినపుడు దానిని మఱికొంతసేపు వినవలెనని కోరును. ఏదైనరుచికరమగు పదార్థము గనఁబడినపుడు దానిం దినవలయుననికోరును. ఏదైన సువాసనద్రవ్యములు తటస్థించినపుడు వాని నాఘ్రాణింపఁగోరును. వేఁడిమిగానున్నపుడు చల్లగాలిని గోరును.

చలిగానున్న పుడుష్టమును గోరును. గాన నట్లెప్పుడెప్పు డేయేవిషయములయందు మనస్సునకాసక్తిగలుగుచున్నదో, అప్పుడప్పు డాయావిషయములయందుండి యా మనస్సును మరలించుకొనుచు రావలయును. అట్లుచేయుచు వచ్చినయెడలఁ గొంత కాలమునకామనస్సు చపలతనుమాని విషయములయందలి యాశలుడిగి తనస్వాధీన మందుండును. అనఁగా శాంతినిబొందును.

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్ ।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥ 27

అర్థము:— ప్రశాన్తమనసమ్ = శాంతచిత్తుఁడైనట్టియు, శాన్తరజసమ్ = విడువఁబడిన రజోగుణముగలిగినట్టియు, అకల్మషమ్ = పాపరహితుఁడైనట్టియు, బ్రహ్మభూతమ్ = బ్రహ్మస్వరూపుఁడైనట్టియు, ఏనమ్ = ఈ (పైశ్లోకముచేఁ జెప్పబడిన లక్షణములుగల), యోగినమ్ = యోగిని, ఉత్తమమ్ = ఉత్కృష్టమైన, సుఖమ్ = సుఖము (బ్రహ్మనందము), ఉపైతి + హి = పొందుచున్నదిగదా.

అట్లు మనస్సెప్పుడు శాంతినిబొందుచున్నదో అప్పుడుయోగి కామములేని వాఁడగుచున్నాఁడు. అనఁగా విషయములయందలి యాశ లుడిగిన వాఁడగుచున్నాఁడు. అట్లు కామమెప్పుడు లేకపోయెనో, అప్పుడే వాని ననుసరించి పుట్టునట్టి క్రోధాదులగు నితరదుర్గుణములును లేనివాఁడగుచున్నాఁడు. (చూ. 2-62-63) ఈకామ క్రోధాదులు రజోగుణమువలనఁ బుట్టినవిగనుక (చూ. 3-37) ఇవి యెప్పుడులేక పోయెనో, అప్పుడాయోగి రజోగుణరహితుఁడును నగుచున్నాఁడు. మఱియు నీకామక్రోధాదులే సమస్తపాపములకు హేతుభూతములైనవియు, జ్ఞానమునకు విరోధములైనవియుఁగనుక (చూ-3-37) అవియెప్పుడు విడిచిపోవుచున్నవో, అప్పు డకల్మషుఁడు, అనఁగాఁ బాపరహితుఁడగుచున్నాఁడు. పాపమెప్పుడువిడిచెనో, అప్పుడాయోగి పరబ్రహ్మస్వరూపుఁడగుచున్నాఁడు. అనఁగా, పరబ్రహ్మతో సమానుఁడగుచున్నాఁడు. కాన నట్టియోగి యన్నిటికంటె శ్రేష్ఠమైనదియు, శాశ్వతమైనదియు నగు బ్రహ్మనందమును బొందుచున్నాఁడు.

శ్లో॥ యుఞ్జ న్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే॥ 28

అర్థము :— ఏవమ్ = ఇట్లు (ఇంతకుముందు చెప్పఁబడినప్రకారము), యోగీ = యోగాభ్యాసకుఁడు, ఆత్మానమ్=(తన) మనస్సును, సదా=యెల్లప్పుడు, యుఞ్జన్ = అలవఱచుచు, విగతకల్మషః + (సన్) = కల్మషరహితుఁడై, బ్రహ్మసంస్పర్శమ్ =

బ్రహ్మానుభవరూపమైనట్టి, అత్యన్తం + సుఖమ్ = నిత్యానందమును, సుఖేన = సులభముగా, అశ్నుతే = అనుభవించుచున్నాఁడు.

కనుక నిపుడు నేను జెప్పినప్రకార మెవఁడైతే యెల్లప్పుడును దనమనస్సును విషయములనుండి మరలించుచు యోగాభ్యాసమున నలవఱచుచువచ్చునో యట్టివాఁడు విగతకల్మషుఁడై, అనఁగా, ఆగామిసంచిత ప్రారబ్ధములగు పుణ్యపాపములు నిశ్శేషముగ నశించినవాఁడై పరబ్రహ్మ స్వరూపుఁడగుచు నిత్యానందము ననుభవింపఁగలఁడు.

అర్జు — పరబ్రహ్మస్వరూపుఁడెట్టివాఁడు? అనఁగా నతనిలక్షణము లెట్లుండును?

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

అర్థము:— యోగయుక్తాత్మా = యోగముతోఁ గూడుకొనినమనస్సుగలవాఁడు, సర్వత్ర = పిపీలికాదిబ్రహ్మపర్యంతమగు సమస్తజంతువులయందును, సమదర్శనః + (సన్) = సమానభావముగలవాఁడై, ఆత్మానమ్ = తన్ను, సర్వభూతస్థమ్ = సమస్తభూతములయందున్నవానిఁగాను, సర్వభూతాని = సమస్త భూతములను, ఆత్మని + చ = తనయందున్నవానినిగాను, ఈక్షతే = చూచుచున్నాఁడు. అనఁగాఁ దెలిసికొనుచున్నాఁడని భావము.

కృ — ఓయియర్జునా! బ్రహ్మస్వరూపుఁడెట్టివాఁడనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఇంతకుముందు నేఁజెప్పినప్రకారము యోగముతోఁ గూడిన మనస్సుగలవాఁ డెవఁడగుచున్నాఁడో యట్టివాఁడు సర్వత్రసమదర్శనుఁ డనఁబడుచున్నాఁడు. అనఁగా పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తజంతువులును బరబ్రహ్మస్వరూపమే యని తెలిసికొని వానియన్నింటియెడలను సమభావముగలవాఁడై యుంచున్నాఁడు. కాన నట్టివాఁ డితర సమస్తజంతువులయందును దానున్నవాఁడుగాను, తనయం దితర సమస్తజంతువులున్నవిగాను భావించుకొనుచున్నాఁడు. ఇట్టిలక్షణములుగలవాఁడు గాన బ్రహ్మస్వరూపుఁ డనఁబడుచున్నాఁడు. కాన నట్టివాఁడు

"క. సమదర్శియై యఖిల భూ
తములను దనయట్లు కాఁగఁ దలఁచుచు నెవ్వం
డమలన్యాయపరుండగు
నమరులకును వందనీయుఁ డింద్రునకేంద్రా."

అనునట్లట్టివాఁడు దేవతలకు సయితము వందనీయుఁడగుచున్నాఁడు.

అర్జు — అట్టివాఁడు సమస్తజంతువులు బరబ్రహ్మస్వరూపమేయని యెట్లు తెలిసికొనుచున్నాఁడు ?

కృ—"సీ. ఘటశరావాదిమృత్కార్యజాతంబుల నెంచిమృత్తికయని కాంచుపగిది
నమలకుండలకిరీటాదిభూషణముల స్వర్ణంబనియెఱుంగు చందమునను
నసికుంతశూలచక్రాదికంబులనెల్ల నినుమనియరసికన్గొనినభంగిఁ
బొలుపార ఫేనబుద్బుదతరంగంబుల మంచినీరని విలోకించురీతిఁ

తే. దనరు బహువిధపటములఁ దంతువనుచుఁ
దెలియుక్రైవడి మొదలిసందియమువిడిచి
భ్రాంతిని దొఱంగి సర్వంబు బ్రహ్మమనుచు
సుఖముగా సంతతంబును జూచు ననఘ! (సీ. రా. 3 అ. 83)

అనునట్లు బుద్ధిమంతుడగువాఁడు కుండ, మూకుడు మొదలగు కుమ్మరస్వరూపములన్నియు మట్టితోఁజేయఁబడినవనియు, మకరకుండల కిరీటాది భూషణములన్నియు బంగారముతోఁ జేయఁబడినవనియు, కత్తులు, శూలములు మొదలగు నాయుధములన్నియు నినుముతోఁ జేయఁబడినవనియు, నీటిబుగ్గలు, ఫేనములు (నురుగులు) మొదలగునవి యుదకముచే నేర్పడినవనియు, నానావిధవస్త్రములును నూలుతోఁ జేయఁబడినవనియు నెట్లు తెలిసికొనుచున్నాఁడో, అట్లే యోగియగువాఁడీప్రపంచమందలి సమస్తజంతువులును నామరూపములచే భేదములుగఁగన్పట్టుచుండినను వాని యన్నిటియందునుండెడు జీవాత్మలన్నియు నాపరమాత్మస్వరూపమేగాని యితరము గాదనియుఁ దెలిసికొనుచున్నాఁడు.

శ్లో॥ యోమాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ 30

అర్థము :— యః=ఎవఁడు, సర్వత్ర=చరాచరప్రపంచమందంతటను, మామ్=నన్ను, పశ్యతి=చూచుచున్నాఁడో, సర్వమ్=సమస్తప్రపంచమును, మయి+చ=నాయందును, పశ్యతి=చూచుచున్నాడో, తస్య=వానికి, అహమ్=నేను, న+ప్రణశ్యామి=నశింపను (లేకపోను), సః+చ=వాఁడును, మే=నాకు, న+ప్రణశ్యతి=నశింపఁడు (లేకపోఁడు).

అట్లైవఁడైతే సమస్తభూతములను బరబ్రహ్మస్వరూపముగ నెంచుచున్నాఁడో వాఁడు నన్ను నంతటఁజూచుచున్న వాఁడగుచున్నాఁడు. అనగాఁ "సర్వంవిష్ణుమయంజగత్" అనునట్లు ప్రపంచమంతయు నాస్వరూపమేయని తెలిసికొన్న వాఁడగుచున్నాఁడు. కాన వానికి నేనును, నాకు వాఁడును నెప్పుడును గనపడక

పోము. అనఁగా నట్టి వాఁడెప్పుడును నన్నుఁజూచుచున్నవాఁడేయగును. నేనును నెప్పుడును వానిని జూచుచున్నవాఁడనే యగుదును.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ 31

అర్థము:— సర్వభూతస్థితమ్=సమస్తభూతాంతరాత్ముఁడనగు, మామ్=నన్ను, యః = ఎవఁడు, ఏకత్వమ్ + ఆస్థితః = అభేదబుద్ధిగలవాఁడై, భజతి=భజింపుచున్నాఁడో (ఉపాసనఁజేయుచున్నాఁడో), సః + యోగీ=అట్టియోగి, సర్వదా + వర్తమాన + అపి = ఏవిధముగాఁ బ్రవర్తింపుచున్నవాఁడైనను, మయి=నాయందు, వర్తతే=వర్తిలుచున్నవాఁడగుచున్నాఁడు.

మఱియు నెవ్వఁడైతే సమస్తభూతాంతరాత్ముఁడనగు నన్ను నభేదబుద్ధితోఁ జూచుచున్నాఁడో అనఁగా నీప్రపంచమునందలి సమస్త భూతములయందుండెడు వాడను నేనేగాని నాకంటె నితరవస్తువేదియు లేదనియెడి నిశ్చయజ్ఞానముగలిగి యుంచున్నాఁడో యట్టిమహానుభావుఁడు నిజముగా నన్నెఱింగినవాఁడగుచున్నాఁడు. కాన నట్టివాఁ డేవిధముఁగా బ్రవర్తించుచుండినను నాయందే ప్రవర్తింపుచున్నవాఁడగుచున్నాఁడు. అనఁగా నెప్పుడెప్పు డేయేపనులఁ జేయుచుండినను, అప్పుడప్పుడాయా పనులన్నియు నాయనుమతి నొంది చేసినవిగను నాకు హితమైనవిగను నుండును.

అర్జు — అయితే, అయ్యా, కృష్ణమూర్తీ! ఇట్లు చెప్పితివిగదా, అట్టివాఁడు పరులకు హితముగనుండునట్టి పనులఁజేయుచున్నంతవఱకు వానిపనులు నీకు హితకరముగ నుండవచ్చును సరే. ఒకవేళ నట్టివాఁ డేదైన ప్రమాదమువలననో, విధిలేకయో, లేక బుద్ధిపూర్వకముగనో పరులకు బాధకలుగునట్టి హింసాదికృత్యములఁజేసినయెడల నట్టికృత్యములుగూడ నీకు హితకరములుగనే యుండునా?

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 34

అర్థము:— హేఅర్జున!= ఓయర్జునుఁడా!, యః=ఎవఁడు, సర్వత్ర=సమస్తజీవజంతువులయందలి, సుఖం + వా=సుఖముగాని, దుఃఖం + వా=దుఃఖముగాని, ఆత్మౌపమ్యేన=తనజీవాత్మవంటివే తక్కినజీవాత్మలనెడు భావముతో, సమమ్=(తనసుఖదుఃఖములతో) సమముగా, పశ్యతి=చూచుచున్నాఁడో, సః + యోగీ= అట్టియోగి, పరమః = శ్రేష్ఠుఁడుగా (యోగులలో శ్రేష్ఠుఁడని), మతః = (నా) తాత్పర్యము.

కృ — ఓయియర్జునా! నీవడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పచున్నాను వినుము. ఎవఁడైతే తనయందును తక్కిన యితరజంతువులయందును నాపరమాత్మ యొక్కఁడే వ్యాపించియున్నాఁడని నిశ్చయముగఁ దెలిసికొనుచున్నాఁడో, అప్పుడి తరులకుఁగలిగెడు సుఖదుఃఖములు తనకుఁగలిగినట్లుగనే భావించుచుండును. అనఁగా నేయితరప్రాణికైననుసరే యేదైన సుఖముగలిగినప్పు డాసుఖము తనకుఁగలిగినట్లే సంతోషించుచుండును. లేకదుఃఖముగలిగినప్పు డాదుఃఖము తనకే గలిగినట్లు బాధ నొందును. అట్లెవఁడైతే యితరుల సుఖదుఃఖములను దన సుఖదుఃఖములుగ భావించుచున్నాఁడో యట్టియోగియే శ్రేష్ఠుఁడు. కాన నట్టివాఁ డితరప్రాణులకు బాధకరములగు హింసాదికృత్యములను బుద్ధిపూర్వకముగ నెట్లు చేయఁగలఁడు? ఎవఁడైనఁదనకు బాధగలుగఁదగినపనిని బుద్ధిపూర్వకముగఁ దానేచేయునా! చేయఁడు గదా. అయితే, ఒకవేళ బుద్ధిపూర్వకముగఁగాక యజ్ఞానకృతముగ నేదైన నితర జంతువులకు హింసగలుగఁదగిన పనులను జేయవచ్చును. అనఁగా భూమిమీఁదఁ దాను నడచునపు డేదైన చీమలు మొదలగు నల్పజంతువులను ద్రొక్కుట మొదలగు కార్యములనుజేయును. అయితే, అవి తెలిసిచేయఁబడినవి కావు. కనుక నట్టి హింసలు వానిచేఁ జేయఁబడినవి కానేరవు. మఱియు నట్లే యేదైన హింసాకృత్య ములు విధిలేక చేయఁబడుటయునుగలదు. అనఁగా నొకని నొకచీముగాని, దోమ గాని, నల్లిగాని యకస్మాత్తుగఁ గుట్టుచున్నది. అప్పుడువానికిఁ బాధకుగలుగు టచే వెంటనే యాచటఁజేతితో నలుపుకొనుచున్నాఁడు. అందువలన నాజంతువు చచ్చుచున్నది. ఈమొదలగు కార్యములు విధిలేక చేయునవియే గాని బుద్ధిపూర్వక ముగఁ జేయునవి కావు. కాన నట్టిహింసలుగూడ వానిచేఁ జేయఁబడినవిగానేరవుగదా! ఇఁకను గావలెనని బుద్ధిపూర్వకముగఁ జేయు కార్యములేగద వాని కాపాదింపఁబడి యున్నవి. అట్టి కార్యములను వాఁడు చేయనేచేయఁడుగదా. కాఁబట్టి వాఁడు చేసెడు కార్యములన్నియు నాకుహితములుగ నేయుంచున్నవి.

అర్జు—అయితే, ఎవఁడైనను నొకానొకప్పు డేదైన దుష్టజంతువులను జూచిన పుడు వానివలనఁదనకు బాధగలుగునని భయపడి యవితనకు బాధచేయకున్నను వానినిఁ జంపుట లేక హింసించుట మొదలగు కృత్యములను గొందఱు సేయుటగలదుగదా! అట్టికృత్యములు బుద్ధిపూర్వకముగఁ జేయఁబడినవేయగుచున్నవిగదా?

కృ—అవును అయితే నిజమైనయోగి, అనఁగా నిపుడు నేఁజెప్పిన లక్షణ ములుగలవాఁడట్టి క్రూరజంతువులను జూచినయెడల వానివలనఁ దనకొక బాధగలుగు ననెడు భయమును బొందఁడుసరేగదా, అజంతువులును, ఎంతక్రూరస్వభావముగలవి యైనను, అట్టివానికేమియు బాధఁగలుగఁజేయవు. ఏలయనఁగా "యద్భావం తద్భవతి"

అనునట్లు వీని కాజంతువులయందును క్రూరభావము లేక పరమాత్మస్వరూపమే యనెడు భావము గలిగియుంచున్నది గనుక నాజంతువులకును వీనియం దట్టి భావమే కలుగును. కాన నాజంతువులవలన వీనికిఁగాని, వీనివలన నాజంతువులకుఁగాని భయముగలుగ నేరదు కనుకనే యోగసిద్ధిని బొందినవాఁడు సాధారణముగఁ గ్రూర జంతువులు సంచరింపఁదగిన యడవులు మొదలగు స్థలములలో నిర్భయముగ నివసించుచు నిద్రవోవుచు నుండఁగలఁడు. అట్లితరులు చేయుటకు సాధ్యపడదుగదా?

అర్జున ఉవాచ :

శ్లో॥ యోఽయం యోగస్త్వయాప్రోక్తః సామ్యేనమధుసూదన।
ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33

శ్లో॥ చఞ్చలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢమ్।
తస్యాఽహంనిగ్రహం మన్యే వాయోరివసుదుష్కరమ్॥ 34

అర్థము :— హేమధుసూదన = ఓకృష్ణమూర్తీ! చఞ్చలత్వాత్ = (మనస్సు) చపలస్వభావముగలదిగనుక, సామ్యేన=సమభావముచేత (తన యాత్మకును నితర జంతువులయందలి యాత్మలకును భేదములేకుండునట్లు సమముగఁ జూడవలయునని); త్వయా=నీచేత, ప్రోక్తః=చెప్పఁబడిన, అయం+యోగః=ఈయోగము, యః= ఏదిగలదో, ఏతస్య=దీనియొక్క (ఇట్టి సమదర్శన యోగముయొక్క), స్థిరామ్=నిలకడగ్రా, స్థితిమ్=ఉనికిని, అహమ్=నేను, న+పశ్యామి=చూడకున్నాను (తెలిసికొనఁజాలకున్నాను), హి=ఏలయనఁగా, హేకృష్ణ! = ఓకృష్ణమూర్తీ, మనః= మనస్సు, చఞ్చలమ్ = చపలస్వభావముగలదియు, ప్రమాథి = (ఇంద్రియములను) క్షోభపెట్టునదియు, బలవత్ = బలముగలదియు, దృఢమ్=దృఢమైనదియునైయున్నది, (తస్మాత్)=ఆ కారణమువలన, తస్య=ఆమనస్సుయొక్క, నిగ్రహమ్=నిరోధమును, వాయోః+ఇవ=వాయువుయొక్క (నిరోధమును) వలె, సుదుష్కరమ్= మిక్కిలికష్టతరమైనదానిఁగా, అహమ్=నేను, మన్యే=తలఁచుచున్నాను.

అర్జు—అయ్యా, కృష్ణమూర్తీ! ఇపుడు నీవు చెప్పినదంతయు సరేగాని, అయితే, మనస్సు మిగులఁజపలస్వభావము గలదిగదా? ఇంద్రియములను నిరోధించుచుండినను వానిని బలవంతముగనైన విషయములమీఁదికి నీడ్చుచుండునుగదా. కాన నిట్టిమనస్సును, నిరోధించుట వాయువును నిరోధించుటయెట్లుకష్టమో అట్లు మిగులఁ గష్టతరముగదా? ఇట్టివిషయములో నిపుడు నీవు చెప్పిన ప్రకారము సమస్తజంతువుల యందు వ్యాపించియుండెడు నాత్మ తనయందుండెడు యాత్మవంటిదే యనెడు

నిశ్చయజ్ఞానముతోఁగూడిన యోగము స్థిరముగ నెట్లునిల్చియుండఁగలదో, అది నేను దెలిసికొనఁజాలకున్నాను. ఏలయనఁగా, నెవఁడైనఁ దనవంటి మనుష్యులనుగాని లేక నిరపాయకరములగు పశుపక్ష్యాదులనుగాని చూచినపుడు వానియందిపుడు నీవు చెప్పినప్రకారము సమభావముగలిగి, అనఁగా వానియందలి యాత్మయుఁ దనయందలి యాత్మయు నొకటేయనియెడు జ్ఞానముగలిగి వానియందు స్నేహభావముంచుట సులభసాధ్యమేగాని, యట్లుగాక యేదైన క్రూరజంతువును, అనఁగా, సింహము, పులి, తోడేలు; విషసర్పము, వృశ్చికము, మొదలగు దుష్టజంతువులను జూచినపుడును నట్లే సమబుద్ధితోఁ దక్కినజంతువులయందువలె స్నేహభావముంచి వానినిజూచి భయపడకయుండుట మిగులఁగష్టతరముగదా ? అట్లుండుటకు వాని మనస్సెంత నిబ్బరముగనుండిన సాధ్యపడును ? ఇట్టి చపలస్వభావముగల మనస్సెంత నిబ్బరముగ నుండఁగలదా యనెడు సందియము నాకుఁగలుగుచున్నది.

శ్రీభగవా నువాచ :

శ్లో॥ అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహంచలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥ 35

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥ 36

అర్థము :— హే మహాబాహో ! = ఆజానుబాహుఁడవగు నో యర్జునా ! మనః = మనస్సు, చలమ్=చపలస్వభావముగలది (గనుక), దుర్నిగ్రహమ్=నిగ్రహింపఁగూడనిది (యనుట). అసంశయమ్=సందేహములేనిది, (తథాపి)=అయినను, అభ్యాసేన+తు = అభ్యాసముచేతనైనను, వైరాగ్యేణ+చ=వైరాగ్యముచేతనైనను, గృహ్యతే=గ్రహింపఁదగియుంచున్నది, హేకౌన్తేయ=కుంతీపుత్రుఁడవగు నోయియర్జునా!, యోగః=యోగము, అసంయతాత్మనా=మనోనిగ్రహములేనివానిచేత, దుష్ప్రాపః=పొందఁబడఁదగినదికాదు, యతతా=యత్నించుచున్న, వశ్యాత్మనా+తు=మనోనిగ్రహముగలవానిచేతనైతేనో, ఉపాయతః=ఉపాయమువలన, అవాప్తుమ్=పొందుటకొఱకు, శక్యః=సాధ్యమైనది, ఇతి=అని, మే=నాయొక్క, మతిః=అభిప్రాయము.

కృ—ఓయియర్జునా! నీకుఁగలిగినసంశయము సరియైనదే. మనస్సు చపలస్వభావముగలది యనుటయు, నిగ్రహింపశక్యముగానిదనుటయు, నిజమే. అందునకేమియు సందియములేదు, అయినను ఆహేతువునుబట్టి దానిని విషయప్రవృత్తియందు యథేచ్ఛ

ముగా విడిచిపెట్టఁగూడదు. మఱేమి సేయవలయుననిన, నభ్యాసముచేతఁ గాని, వైరాగ్యముచేత గాని, దానిని వశపఱచికొనవలసి యున్నది. అభ్యాసముచేత వశపఱచికొనుట యెట్లనఁగా, నింతకుముందు నేఁజెప్పినప్రకారము (చూ-6—25-26) దృఢమైనబుద్ధి బలముచేతఁ దనమనస్సును విషయములయందుఁ బ్రవర్తింపనీక బిగఁబట్టుచు నితరచింతలు మాని మెల్లమెల్లగా నాత్మావలోకనముం దలఁపవలయును. అట్లు చేయుచు వచ్చినను, ఒకానొకప్పుడామనస్సు తనస్వాభావగుణము మానక విషయములమీఁదికిఁ బోవుచునేయుండును. అట్లెప్పుడెప్పుడది చరించుచున్నదో, అప్పుడప్పుడే వెంటనే దాని నావిషయములనుండి మరలించుచు రావలయును. ఇట్లు ప్రతిదినమును జేయుచువచ్చిన నిదియే యభ్యాసమనఁబడుచున్నది. ఇట్టి యభ్యాసము చాలకాలమువఱకుఁ జేయుచు రాఁగరాఁగ నామనస్సుయొక్క చపలస్వభావము క్రమక్రమముగఁ దగ్గుచువచ్చి తుదకు నిశ్చలమైనదై వాని స్వాధీనమందు నిలుచును. ఇందుకు దృష్టాంతముగ నింతకుముందొక చోరుఁడు చౌర్యమునకుఁగా రాజగృహమునఁ బ్రవేశించి యారాజు తన భార్యతోఁ దనకొమార్తెవివాహవిషయమై జరిగించిన ప్రస్తావమును వినినమీఁదట నారాజుయొక్క మనోనిశ్చయప్రకారము జరిగించి యారాజుయొక్క కొమార్తెను సర్వరాజ్యసహితముగఁ బొందవలయు ననియెడు నిశ్చయబుద్ధిగలవాఁడై యట్టినిశ్చయముతో నాఱుమాసములవఱకు నెడతెగక భగవద్ధ్యానము చేసినంతట నట్టియభ్యాసమువలన నతనిమనస్సు పరిపక్వదశను బొందినదై పిమ్మట విషయవాంఛలన్నియు విడిచి యారాజు తనకొమార్తె నిచ్చెదనన్నను దానియం దిచ్ఛలేనివాఁడై నిరాకరించె నట్టిదివఱ కొక కథను జెప్పియుంటినిగదా. (చూ. 2-61) మొదట వానిమనస్సు కేవల దుర్విషయములయందుఁ బ్రవర్తింపుచుండినదైనను, వాఁడొక స్వల్పమగు నైహికసుఖమునందు లక్ష్యముంచి తన మనస్సును భగవద్ధ్యానానుభవమునం దాఱుమాసములవఱకు నలవఱచినంతమాత్రముచేతనే యట్టి వైరాగ్యశీలుఁడుగాఁ దగియుండఁగా నిఁకను శాశ్వతబ్రహ్మానంద పదవియగు మోక్షమునందు లక్ష్యముంచి మనస్సునలవఱచిన యెడల నదియేలకట్టువడకపోవును? కాననట్టియభ్యాసముచేత మనస్సును స్వాధీనపఱచికొనవచ్చును. అట్లుగాక కొందఱు తమ పూర్వజన్మసుకృతమునుబట్టి శ్రీశుకులు, జడభరతుఁడు మొదలగువారివలె నట్టియభ్యాసమును జేయకయే వైరాగ్యశీలురగుటయుఁగలదు. అట్టివారికన్ననో మనస్సతిసులభముగ స్వాధీనపడుచున్నది. కాన నోయియర్జునా! ఇట్టి రెండువిధములలో దేనిచేతనైననుసరే మనస్సును జయించినవాఁడుమాత్రమే, యుపాయమువలన యోగమును బొందఁగలఁడుగాని యట్టిమనోజయము లేనివాని కట్లుచేయుటకు బొత్తిగ సాధ్యపడదని నాయభిప్రాయము.

అర్జు — అచ్యుతా! యిప్పుడు నీవుచెప్పినదంతయు నాకు బహుతృప్తికరముగా బోధపడినదిగాని, మనోజయముగలవాఁడు యోగము నేదియో యొకయుపాయము వలనఁ బొందునని చెప్పితివిగదా. ఆయుపాయమనఁగా నెట్టిదో తెలియఁగోరెద. విస్తరించి చెప్పుము.

కృ — అయితే, చెప్పుచున్నాను వినుము. మనస్సును జయించుటకుఁ దగిన యుపాయము కామక్రోధాద్యరిషడ్వర్గమును జయించుటయే. అనఁగాఁ గామక్రోధలోభమోహమదమాత్సర్యములు తనమనస్సునఁ జొరనీక యొకవేళఁ జొచ్చినను వానిఁ దనమనస్సునందు దీర్ఘకాలముండనీక యెడఁబుచ్చుచు వచ్చుటయేయని యెఱుంగుము. ఇట్టియుపాయముచే మనస్సు కట్టుపడఁగలదు. అట్లు మనస్సెప్పుడు కట్టుపడుచున్నదో అప్పుడు వానికి యోగసిద్ధిసులభముగ లభింపఁదగియుంచున్నది. అయితే, ఆ కామక్రోధాదుల యుత్పత్తికారణములును వాని సంహారవిధములును నెట్టివో యవి తెలిసినయెడల వానిని సులభముగ నివర్తించుకొనవచ్చునుగాన వానిం జెప్పెద వినుము.

“ సీ. మనుజేంద్ర సంకల్పమున బుట్టుఁ గామంబు; రూపఱు దేహనిరూపణమునఁ;
బహులదోషంబునఁ బ్రభవించుఁ గ్రోధము: క్షీణత్వమాయుక్తిఁ జేసి పొలియు;
భూతాస్థిరత్వంబు బుద్ధి గానమిలోభ, మనఘ, జనించు గాంచిన నడంగు;
నజ్ఞానమున మోహ మావహిల్లు నధర్మ లేపవర్జనమున లేక తక్కుఁ;
తే. గీ. కులమునను విద్య ధనమునఁగలుగు మదము
మరలి వాని పెంపూహింప మ్రందిపోవు;
సాత్త్వికుఁడు గామిఁ బొడము మాత్సర్య; మదియుఁ
జెడు; గురూత్తమ, సాధుసంసేవనమున.

క. ఈయాఱింటను సకలా
పాయంబులు మానవులకుఁ బాటిలు, వీనిం
బాయంగఁ జదివు నోపిన
ధీయుతునకు శుభము సద్గతియు సమకూరున్.

క. ఇవి దోఁ దేశులభంగిం
గవియుఁ బురుషు ధైర్యహానిఁ గనుఁగొని ధైర్యం
బవలంబించిన నరుఁ డే
రవు; వీనికి నిదియ తెఱఁగు రాజవరేణ్యా!”

(భార. శాంతి. 3ఆ. ౪౨౧-౪౨౩.)

అనునట్లు సంకల్పమువలన మనస్సునఁ గామము (కోరిక) పుట్టుచున్నది. అట్టి

కోరిక జనియించినను గలిగినపుడు దేహము క్షణభంగురమని తెలిసికొనినయెడల నిట్టిక్షణభంగురమగుదేహమునకుఁగా నీకోరికలేల యనియెడు నిస్పృహ వెంటనే కలుగును. అందుపై నాకోరిక యడఁగిపోవును. ఇతరులు తనకుఁజేసెడు నపకారమువలనఁ గ్రోధము గలుగును. అట్టిక్రోధము గలిగినప్పుడట్టియపకారి యంతకు ముందెప్పుడైనను దనకుఁ జేసియుండెడు నేదైననొక మేలును స్మరించినయెడల నతనిని క్షమింపవలయునని యెడు బుద్ధిగలుగును. అందుచే నాక్రోధము నశించి పోవును. జీవితములు క్షణభంగురములని యెఱుఁగమిచే లోభగుణము పుట్టును. అట్లెఱిఁగినవెంటనే యాలోభగుణము విడిచిపోవును. అజ్ఞానముచేత మోహము (వలపు) కలుగును. అధర్మమునఁ బ్రవేశింపఁగూడదనియెడు నిశ్చయముచేసికొనిన యెడల నామోహము నివర్తించును. కులము, విద్య, ధనము, వీనిలోనన్నియుఁగాని యేదైననొకటిఁగాని యుండినయెడ వానికి మదము (గర్వము) గలుగును. అయితే, బుద్ధిమంతుఁడగువాఁడు తనకంటె నెక్కుడు కులవిద్యాధనములుగల వారనేకులు గలరనియు, వారలలోఁ దానతిస్వల్పుఁడననియుఁ దెలిసికొనినయెడల నామదముడఁగిపోవును. సాత్త్వికుఁడుఁగాకుండుటచేత మాత్సర్యము గలుగును. అట్టిమాత్సర్యము సజ్జనసాంగత్యమువలన విడిచిపోవును. ఈయాఱుగుణములవలననే సమస్తవిధములగు నపాయములు గలుగఁజొచ్చియున్నవి. ఇవిలేనివానికి శుభము గలుగును. కాననే వీని కరిషడ్వర్గమని నామముఁగలిగెను. ఇవి స్థిరచిత్తములేనివానినే బాధించునుగాని స్థిరచిత్తముగలవాని నేమియుఁ జేయఁజాలవు. గాన బుద్ధిమంతుఁడగు వాఁడీ కామక్రోధాదులను పైఁజెప్పఁబడిన యుపాయములచే నివారించుకొనుచు వచ్చినయెడల వానిచిత్తము స్థైర్యముగలదై యోగమున నిలువఁగలదు.

అర్జున ఉవాచ:

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి॥ 37

అర్థము:— హేకృష్ణ!=ఓకృష్ణమూర్తీ!, శ్రద్ధయా=శ్రద్ధచేత, ఉపేతః= కూడుకొన్నవాఁడు (ఐనను), అయతిః = నిగ్రహశక్తిలేనివాఁడు (అగుటచే), యోగాత్ = యోగమునుండి, చలితమానసః = చలింపఁబడిన మనస్సుగలవాఁడు, యోగసంసిద్ధిమ్=యోగసాఫల్యమును, అప్రాప్య=పొందక, కామ్+గతిమ్= ఏగతిని, గచ్ఛతి=పొందుచున్నాఁడు.

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! మనోనిగ్రహములేనివానికి యోగము సిద్ధింప నేరదని చెప్పితివిగదా (చూ. 6-36). అట్లైనయెడల నొకవేళ నెవఁడైన మిగుల

శ్రద్ధతో యోగము నభ్యసింపుచుండినను, మనోనిగ్రహశక్తిలేని వాఁడగుటచే వానిమనస్సుచలించినయెడల నట్టివానికి నీవుతలఁచెడు ప్రకారము యోగసిద్ధి కలుగనేరదుగదా. అట్లుకలుగకపోవుటచే యోగభ్రష్టుఁడగుచున్నాఁడుగదా. అట్టివానిగతియేమగును?

శ్లో॥ కచ్చి న్నోభ భయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి? ।
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి॥ 38

అర్థము :— హేమహాబాహో! = ఓకృష్ణమూర్తీ! బ్రహ్మణః + పథి = మోక్షమార్గమగుయోగమునందు, అప్రతిష్ఠః = పట్టుదలలేనివాఁడగు, విమూఢః = మూఢాత్ముఁడు, ఉభయవిభ్రష్టః + (సన్) = ఇహపరసౌఖ్యములకు రెంటికిని జెడినవాఁడగుచు, ఛిన్నాభ్రమ్ + ఇవ = చెదరినమేఘమువలె, న + నశ్యతి + కచ్చిత్ = నశింపకుండునా?

ఓ మహాబాహో!

"తే. గీ. యోగధర్మంబుకంటెను నుత్తమంబు
కలుగనేరదు ధర్మమెుక్కటియునపుడ
రాగమంబగుపదమున కరయనదియు
మేటినిచ్చెన సంయమికోటికెల్ల" (భారం-అను-4అ 216)

అనునట్లు మోక్షపదవికి యోగమే నిచ్చెనవంటిదనియు, నింతకంటె నుత్తమమైనధర్మము మఱియొకటిలేదనియు, పెద్దలు చెప్పియున్నారుగదా? కాఁబట్టి యీయోగమేకదా బ్రహ్మపదవికి, అనఁగా మోక్షమునకు మార్గమైయున్నది. ఈ యోగమునాచరించుటలో విసుకులేక యుండవలయునని యిదివఱకు నీవే చెప్పియున్నావుగదా? (చూ: 3-31). ఇట్టిమోక్షమార్గమగుయోగమునందెవఁడైన మూఢుఁడగువాఁడు మనస్సు నిలుపలేకయో, లేక, విసుకుచేతనో, పట్టుదలలేనివాఁడైనయెడల వానికా యోగము సిద్ధింపనేరదుగదా? అదియెుపుడు సిద్ధింపక పోయెనో, అప్పుడు పరమునకు, అనఁగా మోక్షమునకుఁజెడిన వాఁడగుచున్నాఁడుగదా? పోనిమ్ము, వాఁడిహలోకమందైనను సుఖ మనుభవించుచున్నాఁడా యనిన యదియును గానము. ఏలయనఁగా మొదట యోగము నభ్యసింపకయే యుండినయెడలఁ దనయిచ్ఛవచ్చినట్లు విషయానుభవము సేయుచు నిహలోక సౌఖ్యముల ననుభవింపుచుండును. అట్లునుగాక యోగమునభ్యసించుటకు నారంభించినది మొదలు వాఁడు తనమనస్సును విషయములనుండి మరలించుచునేయుండవలెనుగదా? అట్లు చేయుటచే విషయానుభవమునకుఁ దప్పిన వాఁడగుచున్నాఁడుగదా? కాన వాఁడిహలోకసౌఖ్యమునకుఁగూడఁజెడినవాఁడే యగుచున్నాఁడు. కాన నట్టివాఁ డుభయభ్రష్టుఁ డగుచున్నాఁడు గదా? కావున లోకులకు జీవనాధారమగు నుదకమును వర్షించుటకుఁగాను గూడిన మేఘము

వాయువశమునఁ జెదరినదై యెట్లు ఫలప్రదముగాక, చెడిపోవునో వానియోగమును నట్లే విఫలమైనదై, వాఁడిహపరములకు రెంటికిని జెడినవాఁడు కాకపోవునా యని నాకు సందేహము గలుగుచున్నది.

శ్లో॥ ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హ స్యశేషతః ।
త్వదన్య స్సంశయస్యాఽస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ 39

అర్థము :— హే కృష్ణ! = ఓకృష్ణమూర్తీ! మే = నాయొక్క, ఏతమ్ = ఈ(పైశ్లోకమునఁ జెప్పఁబడిన), సంశయమ్ = సందేహమును, అశేషతః = నిశ్శేషముగా, ఛేత్తుమ్ = ఛేదించుటకొఱకు (నివర్తింపఁజేయుటకు), (త్వమ్) = నీవు, అర్హసి = తగుదువు, హి = ఏలయనఁగా, అస్య = ఈ, సంశయస్య = సంశయమును, ఛేత్తా = ఛేదించువాఁడు, త్వత్ = నీకంటె, అన్యః = మఱియొకఁడు, న+ఉపపద్యతే = లభింపఁడు.

కావున నోకృష్ణమూర్తీ! ఇట్టి నాసందియమును దీర్చుటకు నీవే తగినవాఁడవు. ఏలయనఁగా, జీవాత్మలమగు నేను మొదలగు వారమును, పరమాత్మవగు నీవును నిదివఱకనేక జన్మముల నెత్తియున్నామనియు, ఆజన్మలయొక్క సంగతి ప్రాకృతులమగు మాకుఁ దెలియదనియు, నప్రాకృతుఁడవగు నీకుమాత్రము తెలియుననియు నిదివఱకు నీవే చెప్పియుంటివి గదా (చూ 4-5). కాన నీజన్మమున యోగభ్రష్టుఁడగువాఁడవతలి జన్మమున నేమియగుచున్నాఁడో దానిని దెలిసికొనుటకు భూతభవిష్యద్వర్తమానములను గుఱ్తెఱిఁగిననీకు సాధ్యపడినట్లితరులకు సాధ్యపడదు గదా! గనుక నాకిపుడు గలిగిన సంశయమును నివర్తింపఁజేయుటకుఁదగినవారు నీకంటె నితరులెవ్వరును నున్నట్లగపడదు.

శ్రీభగవానువాచ:

శ్లో॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
నహి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి ॥ 40

అర్థము :— హే పార్థ! = ఓయియర్జునా!. తస్య = అట్టి యోగభ్రష్టునికి, ఇహ = ఈలోకమందు (గాని), అముత్ర = పరలోకమందు (గాని), వినాశః = నాశము, న+ఏవ+విద్యతే = కలుగనేకలుగదు, హి = ఏలయనఁగా, తాత! = తండ్రీ, కల్యాణకృత్ = మంచిపనిచేయువాఁడు, కః+చిత్ = ఎవఁడును, దుర్గతిమ్ = దుర్గతిని, న+గచ్ఛతి = పొందఁడు(సుమా).

కృ — ఓయియర్జునా! అట్టియోగభ్రష్టుఁ డిహపరములకు రెంటికిని జెడునని

నీవు సందేహింపఁ బనిలేదు. అట్టివాని కిహమునందుఁ గాని పరమునందుఁ గాని యేమియుఁ జెఱుపు గలుగ నేరదు. ఏలయనఁగా వాఁడు చెడ్డపని యేమియుఁజేసిన వాఁడుగాఁడు. తరింపవలెననియెడు కోరికతో యోగమును గొంతవఱకు నభ్యసించిన వాఁడు. కనుక వాఁడు మంచిపనినిచేసినవాఁడే యగుచున్నాఁడు. ఓయినాయనా! మంచిపనిఁజేసినవాని కెవనికైనఁ జెడుఫలముగలుగునా? కలుగదుగదా? "స్వల్ప మప్యస్యధర్మస్య త్రాయతే మహతోభయాత్" ఈయోగమును గొంతమట్టున కాచరించినను జననమరణాదిసంసారభయమునుండి రక్షింపఁబడునని యిదివఱకే నీకు నేను జెప్పియుండలేదా? (చూ. 2-40).

అర్జు — అయితే "అసంయతాత్మనాయోగోదుష్ప్రాపఇతిమేమతిః" మనో నిగ్రహశక్తిలేనివానికి యోగము సిద్ధింపదని యింతకుముందు నీవేచెప్పితివిగదా? (చూ-6-36). యోగము సిద్ధించిననేగాని మోక్షమున కర్హతగలుగదుగదా? మోక్షము నొందిన వానికేగాని జననమరణాది సంసారము నివర్తి కాదుగదా? అట్లుండ యోగ మును గొంతపట్టున కాచరించి సిద్ధిని బొందకమునుపే భ్రష్టుఁడైనవాని కట్టి సంసార భయ మెట్లు విడువఁగలదు?

కృ — నీవడిగిన ప్రశ్న సయుక్తికముగానే యున్నది. అయితే యోగభ్రష్టుఁ డగువాఁడు కొంతమట్టునకైనను యోగము నాచరించినవాఁ డగుచున్నాఁడు గనుక

"చ. తనకులధర్మమున్విడిచి దానవవైరిపదారవిందము
లనిశముసేవఁజేసిపరిపాకము నొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱుమేనసైన నది సిద్ధివహించుఁ దదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము సిద్ధివహించునె యెన్ని మేనులన్."

(భాగ. ౧స్క-౦. ౧౦౦.)

అనునట్లు వానికి నీజన్మమునందే సంసారనివృత్తి (మోక్షము) కలుగకపోయి నను, ముందునకు నింతకంటె మంచిజన్మలుగలిగి యాజన్మలలో మరల నీయోగమునే యభ్యసింపుచుఁ గ్రమక్రమముగ యోగసిద్ధినిబొంది ముక్తుఁడు కాఁగలఁడు. అదెట్లనిన వివరించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వాశాశ్వతీ స్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ 41

శ్లో॥ అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్।
ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ 42

అన్వయము:— యోగభ్రష్టః = యోగభ్రష్టుఁడు, పుణ్యకృతాం = పుణ్యము చేసిన వారియొక్క, లోకాన్ = లోకములను (స్వర్గాదిలోకములను), ప్రాప్య = పొంది, శాశ్వతీః + సమాః = అనేకసంవత్సరములవఱకు, ఉషిత్వా = ఉండి (నివసించి), శుచీనామ్ = సదాచారవంతులైన శ్రీమతామ్ = శ్రీమంతులయొక్క, గేహే = గృహమునందు, అభిజాయతే = పుట్టుచున్నాఁడు, అథవా = అట్లు కానియెడల, ధీమతామ్ = బుద్ధిమంతులైన (జ్ఞానులగు), యోగినామ్ + ఏవ = యోగులయొక్కయే, కులే = వంశమునందు, భవతి = జన్మించుచున్నాఁడు, ఈదృశమ్ + జన్మ = ఈలాటి జన్మము (యోగులవంశమందుఁబుట్టుట), యత్ = ఏదికలదో, ఏతత్ + హి = ఇదియేకదా, లోకే = (ఈ) లోకమునందు, దుర్లభతరమ్ = మిక్కిలియరుదైనది.

యోగభ్రష్టుఁడైనవాఁ డెప్పుడును నరకలోకమునకుఁబోఁడు. మఱేమన్ననో,

" క. ఈతెరువునఁ జరియించుచు
నేతెఱఁగుననైనఁ దప్పెనేనియుఁ బురుషుం
డాతత నాకసుఖముఁగనుఁ
దోఁతెంచును మగుడ సద్బుధులవంశమునన్." (భార. శాంతి. ౫అ. ౭-౨౭)

అనినట్లు పుణ్యకార్యములు చేసినవారేలోకములకుఁబోదురో, అట్టిస్వర్గాది లోకములకేపోవును. ఆలోకములకుఁ బోయినపిమ్మట నచ్చటఁ జిరకాలమువఱకు సమస్తభోగముల ననుభవింపుచుండి పిమ్మట మరల నీలోకమున సదాచారసంపన్నులును, నైశ్వర్యవంతులును నగువారి గృహమునందు జన్మించును. అట్లు కానియెడల జ్ఞానవంతులగు యోగులవంశమునందే జన్మించుటయుఁ గలదు. అయితే, ఈలోకమున నైశ్వర్యవంతులగువారు సదాచారసంపన్నులైనను వారియిండ్లలోఁ బుట్టుట కంటె, జ్ఞానవంతులగుయోగులు దరిద్రులుగానుండినను వారియిండ్లలోఁ బుట్టుటయే మిగుల శ్రేష్ఠమైనదిసుమా. ఏలయనఁగాఁ జెప్పుచున్నానువినుము.

" క. ధనముగలవాఁడు మృత్యువ
దనమున నున్నట్లు భయము దనచిత్తమునం
దనుకఁగ నుల్లలనడుకును
వినుశిఖిచోరాదిముఖ్యవిషయాపదకున్.

క. కోపంబును లోభంబును
నేపారి మనంబుఁగలఁప నెప్పుడుఁజింతా
తాపంబునొందు సధనుం
డాపదగా కవ్విధము సుఖావహమగునే" (భార. శాంతి. ౪అ. ౩౪,౩౫)

అనునట్లు, ఐశ్వర్యవంతుఁడుగాఁ బుట్టినయెడల వాని మనసెప్పుడును ధనమును సంపాదించుటయందును, సాధనమునకుఁ జోరాద్యుపద్రవము గలుగకుండఁగాపాడుకొనుటయందును, వ్యాయామమును జెందియుండుటయే గాక, యట్లు చేయుటలోఁ గలిగెడు క్రోపలోభాదులవలన నెప్పుడును గలఁతనొందుచుండును; గాన నట్టివాఁడు పూర్వజన్మవాసనావశమున మరల నాజన్మమునయోగము నభ్యసించినను నిర్విఘ్నముగ నెఱవేఱఁజాలఁడు. అట్లుగాక ద్రవ్యహీనులగు యోగుల వంశమునఁబుట్టినయెడల

" క. ఎచ్చోటనైన నధనుఁడు
పిచ్చలవిడినుండు లేమి వెఱపించుకయుం
బొచ్చెంపుఁజెంద మొల్లఁడు
మెచ్చరె సురలైనఁ బలుకు మృదువైయుండన్ ! "

(భార. శాంతి. ౪ ఆ. ౩౬.)

అనునట్లు ద్రవ్యమును సంపాదించుట కాపాడుట మొదలగు వ్యాయామభయము లేమియు లేమిచే వానిమనస్సు కపటములేనిదై, నిర్మలముగను, నిశ్చింతగలదిగను నుండును గనుకను, ఆవంశస్థులకు యోగాభ్యాసము వంశాచారముగ నుండుటవలనను, వానికి నాజన్మమునందు యోగము నభ్యసించుట మునుపటిజన్మయందుకంటె నతిసులభసాధ్యమగును. కాననట్టి యోగులవంశమునఁబుట్టుటయే శ్రేష్ఠతరమైయుంచున్నది.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన ! 43

అర్థము :— హే కురునన్దన != ఓయర్జునా !, తత్ర = ఆమరుజన్మమునందు, పౌర్వదైహికమ్ = మునుపటిజన్మసంబంధమైనదియు, బుద్ధిసంయోగమ్ = జ్ఞానసహితమైనదియు నగు, తమ్ = దానిని (పూర్వజన్మమునఁ గొఱవడినయోగమును), లభతే = పొందుచున్నాఁడు, తతః = అట్లుపొందుటవలన, సంసిద్ధౌ = యోగసిద్ధివిషయమై, భూయః = మరల, యతతే + చ = యత్నమునుగూడఁ జేయుచున్నాఁడు.

కాన నోయి యర్జునా ! అట్లు యోగులవంశమునఁబుట్టినవాఁడేమి సేయుననఁగా

" క. హరిచరణాంబుజమకరం
దరసావేశితమనఃప్రధానుండగు స
త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ
బొరసినఁ దన పూర్వమార్గమును విడువఁ డిలన్.

(భాగ. ౨ స్కం. ౨.)

అనునట్లు పూర్వజన్మమునఁ గొంచెమట్టునకైనను యోగమునభ్యసించి భగవద్ధ్యానమునుజేసిన వాఁడు గాన నభ్యాసనావిశేషమువలన నీజన్మమునందును నా యోగము నభ్యసింపవలయుననియెడి బుద్ధియుదయించును. అట్టిబుద్ధి యెప్పుడుదయించుచున్నదో యప్పుడుమరల నాయోగము నభ్యసించుటకుఁ దగిన ప్రయత్నమునుగూడ వెంటనే చేయుచున్నాఁడు.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః।
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ 44

అర్థము:—సః = ఆ(యోగభ్రష్టుఁడు), అవశః+అపి = (యోగమునభ్యసించుటకు) తానుగాఁబ్రయత్నము సేయనివాఁడైనను, తేవ=అట్టి (విషయములనకొంటఁబడి నట్టి), పూర్వాభ్యాసేన+ఏవ = ముందటిజన్మయందుఁ జేయఁబడిన యభ్యాసవాసనావశముచేతనే, హ్రియతే+హి= లాగఁబడుచున్నాఁడుగదా, యోగస్య = యోగమునకు (యోగమ్ము నాచరించుటకు), జిజ్ఞాసుః+అపి = ఇచ్ఛగలవాఁడన్ననో, శబ్దబ్రహ్మ= వేదమును (వేదోక్తకర్మజాలమును), అతివర్తతే=అతిక్రమించుచున్నాఁడు.

ఒకవేళ నట్టివాఁడు యోగము నభ్యసింపవలయుననియెడు తలంపే లేనివాఁడైనను వాని పూర్వాభ్యాసము వానినివిడువదు. కానవాఁడట్టి పూర్వాభ్యాసవాసనావశమున నప్రయత్నముగనైన నీజన్మమున మరల యోగమునభ్యసించునటులఁ బ్రేరేపింపఁబడును. అట్లుండ నట్టి పూర్వాభ్యాస వాసనకుఁ దోడుగ వానికి యోగమునందభిలాషకూడఁ గలిగినయెడలఁ జెప్పనేల? బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లగునుగదా. కావున నట్టివాఁడు వేదోక్తకర్మల నతిక్రమించినవాఁడగును. అనఁగా నైష్కర్మ్యసిద్ధిని బొందినవానితో సమానుఁడగును.

శ్లో॥ ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్॥ 45

అర్థము:— ప్రయత్నాత్ = పట్టుదలవలన, యతమానః = యత్నించుచున్న, యోగీ+తు = యోగియైతేనో, సంశుద్ధకిల్బిషః = కిల్బిషరాహిత్యముగలవాఁడై (నశించిన యాగామిసంచితప్రారబ్ధములుగలవాఁడై), అనేకజన్మసంసిద్ధః = అనేక జన్మములయందభ్యసించుటవలనఁ బొందఁదగినయోగసిద్ధినిబొందినవాఁడు, (భవతి) = అగుచున్నాఁడు, తతః = పిమ్మట (అట్టియోగసిద్ధిని బొందినతరువాత), పరామ్+గతిమ్ = పరమపదమును (మోక్షమును), యాతి = పొందుచున్నాఁడు.

యోగమునభ్యసింపవలయునని యభిలషించినంత మాత్రముచేతనే వానికిట్టి

యోగ్యతగలుగఁదగియుండఁగా నిఁక ను యోగమును బ్రయత్నపూర్వకముగఁ బట్టుదలతో నభ్యసించినయెడల నట్టివానికేమి ప్రయోజనముగలుగునో యెఱుఁగుదువా? చెప్పుచున్నానువినుము. అట్టివానికి ననేకజన్మలయందు యోగాభ్యాసము సేయుటవలనఁ గలుగఁదగిన జ్ఞాన మాజన్మయందే కలుగుచున్నది. అట్లెప్పుడు కలుగుచున్నదో యప్పుడు "బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే" (చూ-2-50) అనునట్లు వెంటనే, అనఁగా నాజన్మమునందే వానియొక్క-యాగామి సంచితప్రారబ్ధములగు సమస్తపుణ్యపాపములు నశించినవై వాఁడు కిల్బిషరహితుఁడును బరిశుద్ధుఁడును నగుచున్నాఁడు. అట్లు గతకల్మషుఁడెప్పుడగుచున్నాఁడో యప్పుడు "కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః । జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్." (చూ 2-51) అనునట్లు మోక్షమును బొందుచున్నాఁడు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః ।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున!॥ 46

అర్థము:— హేఅర్జున! = ఓయర్జునుఁడా! యోగీ = యోగాభ్యాసి, తపస్విభ్యః = తపస్సుచేయువారలకంటెను, అధికః = శ్రేష్ఠుఁడు (అనియు), జ్ఞానిభ్యః+అపి = జ్ఞానులకంటెనుగూడ, అధికః = శ్రేష్ఠుఁడు(అనియు), (మే)+మతః = నాయభిప్రాయము, (కించ) = మఱియును, యోగీ = యోగాభ్యాసి, కర్మిభ్యః + చ = సత్కర్మానుష్ఠానపరులకంటెనుగూడ, అధికః = శ్రేష్ఠుఁడు, తస్మాత్ = ఆకారణమువలన, యోగీ+భవ = యోగివగుము.

ఈకారణములనుబట్టి తపస్వులకంటెను, జ్ఞానులకంటెను, సత్కర్మానుష్ఠానపరులకంటెను యోగియే శ్రేష్ఠుఁడని తాత్పర్యము. కాన నోయియర్జునా! నీవు యోగమునే యభ్యసింపుము.

అర్జు — అయ్యా! యోగి తపస్వులకంటె నధికుఁడని చెప్పుటకుగారణమేమి?

"క. తపము నిదానము ధర్మ
ప్రపంచమున కెల్లదానిఁ గ్రమమున వ్రతతం
త్రపరాయణు లొనరింతు ర
ధిప ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁబొరయుచున్."

(భార. శాంతి. ౩ఆ. ౪౧౩.)

అనునట్లీప్రపంచమునంగల సమస్తధర్మములలోఁ దపస్సే శ్రేష్ఠమైనదని యెంచి పెద్దలాచరింపుచున్నట్లు వినుచున్నాముగదా? అట్లుండనట్టితపము నాచరించెడు వారికంటె యోగులెట్లు శ్రేష్ఠులుకాఁగలరు?

కృ — అవును నీవు చెప్పునది వాస్తవమే. అయితే తపస్సెట్టిదనఁగా

" క. వినుమశన నిగ్రహముఁదప
మనునభిధానంబుగల మహాధర్మముత
ద్ధనవంతుఁచిత్తఫలగతిఁ
జనునఖిలస్థావరములు—జంగమతతులున్." (భార. శాంతి. 3 ఆ.)

అనునట్లాహారమును వర్జించియాచరింపఁదగినది. కనుకనే తపస్వులు వాతాంబుపర్ణాశనులని చెప్పఁబడుచున్నారు. అట్లాహారమును వర్జించి యుండఁదగినశక్తి యెవనికిఁ గలుగుచున్నదో యట్టివానికే తపస్సు సిద్ధించునుగాని తదితరులకు సిద్ధింపనేరదు. అట్టి తపస్సిద్ధిని బొందినవానికిఁ జరాచరములన్నియు వశవర్తులగును. అయితే, ఇంద్రియనిగ్రహమనోనిగ్రహములే యెంతో కష్టసాధ్యములై యుండఁగా దేహధారణకు ముఖ్యాధారమైన యాహారమును వర్జించుట యెంతకష్టతరమైనదో నీవే యోచించిచూడుము. యోగికన్ననో యట్టియాహారమును వర్జింపవలసినపనిలేదుగదా— క్షుత్పిపాసాదిబాధలు గలిగినప్పుడు వానిందీర్చుకొనుటకుఁ దగినమితమైన యాహారమును బుచ్చుకొనుచు నింద్రియమనోనిగ్రహములను మాత్రము చేయుచువచ్చిన యోగము సిద్ధింపఁగలదు గదా! కాఁబట్టి తపస్సుకంటె యోగమే శ్రేయమని చెప్పుటకుఁ గారణమైనది.

అర్జు — మంచిది, జ్ఞానమన్నిటికంటె నుత్తమమైనదనియును, జ్ఞానమునొందినవాఁడతి శీఘ్రముగా మోక్షమును బొందఁగలఁడనియును నింతకుముందు చెప్పియుంటివిగదా (చూ.4-39). యోగముసిద్ధించిననేగదా యట్టిజ్ఞానము గలుగఁబోవుచున్నది. అట్లుండఁగా నిపుడు జ్ఞానికంటె యోగియే శ్రేష్ఠుఁడని చెప్పుటకుఁ గారణమేమి?

కృ — జ్ఞానము శాస్త్రజ్ఞానమనియు, నాత్మజ్ఞానమనియు రెండువిధములు. శాస్త్రజ్ఞానమనఁగా వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు మొదలగు వానిం జదువుటవలనను, వినుటవలనను వానియందలి విషయమును దెలిసికొనుట శాస్త్రజ్ఞానమనఁబడును. సదసద్వివేకముగలిగి పరమాత్మ స్వరూపమిట్టిదని తెలిసికొనుట యాత్మజ్ఞానమనఁబడును. శాస్త్రజ్ఞానము లేకపోయినను నాత్మజ్ఞానమున్నయెడలఁ గడతేరవచ్చునుగాని శాస్త్రజ్ఞానముమాత్రముండి యాత్మజ్ఞానము లేకపోయినయెడలఁ గడతేరుటకు సాధ్యపడదు. కనుక నట్టి శాస్త్రజ్ఞానము మాత్రము గలిగియుండువారలకంటె యోగి శ్రేష్ఠుఁడని చెప్పుటకు గారణమేమనగా, ఈప్రపంచమునం దనేకు లనేక విధములగు సత్కర్మల నాచరించుచుండుటను జూచుచున్నాము గదా? వారందఱు నేదేనియొక ఫలము నుద్దేశించి యట్టికర్మల నాచరించుచున్నారు. అనఁగాఁ గొందఱు స్వర్గాదిభోగముల నపేక్షించి యజ్ఞాదులను, గొందఱు సంతానము నపేక్షించి యశ్వత్థప్రదక్షిణాదులను, గొందఱు భోగభాగ్యముల నపేక్షించియున్న

దానాదులను జేయుదురు. యోగియన్ననో తానును దక్కిన వారివలెనే యట్టి సత్కర్మల నాచరించినను వానినన్నింటిని భగవత్ప్రీత్యర్థముగఁ జేయునేగాని తన ప్రయోజనార్థము, అనఁగా నందువలనఁ దనకొక ప్రయోజనము కలుగవలయునని యెడు కోరికతోఁజేయఁడు, కాన నట్టి సత్కర్మానుష్ఠానపరులలో యోగియే శ్రేష్ఠుఁడని చెప్పుటకుఁగారణమైనది.

శ్లో॥ యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యోమాం సమే యుక్తతమోమతః ॥ 47

అర్థము:— సర్వేషామ్+యోగినామ్+అపి = (అట్టి) యోగులందఱిలో నైనను, యః = ఎవఁడు, మద్గతేన = నాయందు లయించిన లేక సక్తమైన, అన్తరాత్మనా = అంతరంగముతోడ, శ్రద్ధావాన్ = భక్తిగలవాఁడై, మామ్=నన్ను, భజతే = భజింపుచున్నాఁడో, సః = అట్టివాఁడు, యుక్తతమః = యోగులలో నుత్తముఁడు (అని), మే = నాయొక్క, మతః = అభిప్రాయము.

అయితే, అట్టియోగులలోఁగూడఁ దారతమ్యము గలవారలున్నారుసుమా! అదెట్లనిన, యోగమనఁగా నింద్రియ మనోనిగ్రహముచేసి చిత్తమును నాయందుఁ గూర్చుటగదా? అనఁగా నన్ను ధ్యానించుటగదా? అట్టియోగము నభ్యసించువారు తమమనోబుద్ధీంద్రియములను విషయములమీఁదికిఁ బోకుండఁ బ్రయత్నపూర్వకముగఁ ద్రిప్పికొనుచుండవలెనుగదా? అట్టివారిలో నొకానొకని మనస్సు, అట్లు ప్రయత్నపూర్వకముగ నిరోధింపనక్కఱలేకయే తనంతటనేనాయందు సక్తమై. సదా నన్నే ధ్యానింపుచు నేయితరవిషయమును నొల్లక యెప్పుడును నాగుణానుభవమునందే సొక్కుచుండును. ఇట్లుచంచలభక్తితో నెవఁడు నన్నుధ్యానించుచుండునో యట్టివాఁడుయోగులలో నుత్తముఁడని నాయభిప్రాయము. ఇందున కనుగుణ్యముగ "సంసార ప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదులైన మోక్షమార్గంబులు పెక్కులుగలవందు భక్తిమార్గంబు కంటె సులభంబులేదు" (భాగ. ౨ స్కం) అనిపెద్దలుచెప్పియున్నారు.

అర్జు — అయ్యా! మనస్సును బ్రయత్నపూర్వకముగ నిరోధించుచున్నప్పుడే యోగమునందు నిలుచుట కష్టసాధ్యమైయుండఁగా, అట్టిప్రయత్నము లేకయేయొకఁడు మనస్సు నీయందెట్లు నిలుపఁగలఁడు? అట్టివారలుగూడ నీప్రపంచమునఁగలరా?

కృ — ఆహా, అట్టివారలునుగలరు. అయితే బహుసకృత్తుగనుందురు. ఇందు నకు నిదర్శనముగఁ బూర్వముకృతయుగంబునఁ బ్రహ్లాదుండను పరమభాగవతోత్తముని చరిత్రము వినియుందువుగదా? అతండతి బాల్యమునందే యేలాటియోగము నభ్యసింపకయే నాయందచంచల భక్తిగలవాఁడై యేయితరవిషయము నొల్లకయుండె. నతనిచర్య లెట్టివనఁగా,

“ సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు
నసురారి తనప్రోల నాడినయట్లైన నసురబాలురతోడ నాడమఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ బరభాషలకు మాఱుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడమఱచు

తే. హరిపదాంభోజయుగచింతనామృతమున
నంతరంగంబు నిండినయట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడత లేకయునుండును జడునిభంగి.

శా. పానీయంబులు ద్రావుచు న్గుడుచుచు న్భాషించుచు న్హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచు న్సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం
ధానుండై, మఱచె న్సురారిసుతుఁడే తద్విశ్వము న్భూవరా !

సీ. వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై, యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై యుద్ధతుఁడై । పాడు నొక్కచోట
విష్ణుఁ డింతయుఁ గాని వేఱొండు లేదని, యొత్తిలినగుచుండు నొక్కచోట
నళినాక్షుఁడను నిధానముఁ గంటి నేనని, యుబ్బి గంతులువైచు నొక్కచోట

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్షజనిత బాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు.” (భాగ. ౭ స్కం. ౧౨౩. ౧౨౪.)

కాన నిట్టి వారలు యోగులలో నుత్తములని నాయభిప్రాయము. ఇట్టివారలకు గలిగియుండెడు జ్ఞానము తక్కినవారల జ్ఞానముకంటె విశేషమైనదగుచున్నది గాన నిది విజ్ఞానమనఁబడుచున్నది.

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే ఆత్మసంయమయోగో నామ షష్ఠోఽధ్యాయః
ఇది శ్రీకృష్ణభగవాను డర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి ఆత్మసంయమయోగంబను
షష్ఠాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావ బోధిని

## సప్తమాధ్యాయము

### విజ్ఞాన యోగము

శ్రీభగవానువాచ.

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జన్మదాశ్రయః।
ఆసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ 1

అర్థము:— హేపార్థ = ఓయి అర్జునా! (త్వమ్) = (నీవు), మయి = నాయందు, ఆసక్తమనాః = చేర్పఁబడిన మనస్సుగలవాఁడవై, మదాశ్రయః = నన్నే యాశ్రయించినవాఁడవై, యోగమ్ = ధ్యానయోగమును, యుఞ్జన్ = ఆచరించుచు, మామ్ = నన్ను, అసంశయమ్ = సంశయరహితమగునట్లు, సమగ్రమ్ = సంపూర్ణముగా, యథా = ఎట్లు, జ్ఞాస్యసి = ఎఱుఁగఁగలవో, తత్ = దానిని, శృణు = వినుము.

### సంభాషణ

కృ — ఓయియర్జునా! యోగులలో నొకానొకఁడు ప్రహ్లాదునివలె సప్రయత్నముగఁ దనంతటనే నాయందు సక్తమైన చిత్తముగలవాఁడై ప్రపంచమునందేది చూచినను నాస్వరూపముగనేభావించి సదా నన్నే ధ్యానింపుచుండుననియు, అట్టివాఁడు యోగులలో నుత్తముఁడనియుఁ జెప్పియుంటినిగదా (చూ_6-47). అట్టి యోగ్యతయెట్టివానికిఁ గలుగుననఁగా; నాయొక్క స్వరూపమును సంపూర్ణముగను, నిస్సంశయముగను నెవఁడెఱుఁగుచున్నాడో యట్టివానికే కలుగునుగాని తదితరులకుఁ గలుగనేరదు. కావున నట్లు నాస్వరూపమును నీవు సంపూర్ణముగ నెఱిఁగి నన్నేయాశ్రయించినవాఁడవగుచు, నాయందే సక్తమైన చిత్తము గలవాఁడవై సదా నన్నే ధ్యానింపుచు నెట్లుండగలవో యాసదుపాయమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః।
యజ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే ॥ 2

అర్థము :— యత్ = దేనిని, జ్ఞాత్వా = తెలిసికొనినపిమ్మట, ఇహ = ఈ లోకమునందు, భూయః = మరల, జ్ఞాతవ్యమ్ = తెలిసికొనదగినది, అన్యత్ = మఱియొకటి, న+అవశిష్యతే = మిగిలియుండదో, ఇదమ్ = (అట్టి) యీ, సవిజ్ఞానమ్ = అనుభవసహితమైన, జ్ఞానమ్ = జ్ఞానమును, అశేషతః = నిశ్శేషముగా (సవిస్తారముగా), తే = నీకు, అహమ్ = నేను, వక్ష్యామి = చెప్పుచున్నాను.

అదెద్దియనఁగా, విజ్ఞాన సహితజ్ఞానము. అనఁగా అనుభవముతోఁగూడిన జ్ఞానము. అదెట్టిదనఁగా అట్టి విజ్ఞానమెవనికిఁ గలుగుచున్నదో వాఁడు నానిజస్వరూపమును సంపూర్ణముగఁ దెలిసికొనినవాఁడై సంశయరహితుఁడగుచున్నాఁడు. కాన నట్టివానికి మరలఁ దెలిసికొనఁదగిన యంశము మఱియొకటి యీప్రపంచమున నుండనేరదు. కాఁబట్టి యట్టివిజ్ఞాన మెట్టిదైనదియు సవిస్తరముగ నీకుఁ జెప్పెద నాకర్ణింపుము.

అర్జు — అయ్యా! విజ్ఞానము (అనుభవసహితజ్ఞానము) అనఁగా నెట్టిది? జ్ఞానమునకును విజ్ఞానమునకును భేదమేమి?

కృ — జ్ఞానమనఁగా వేదశాస్త్రపురాణాదులవలనను, సద్గురూపదేశమువలనను, పరమాత్మస్వరూపమిట్టిదని తెలిసికొనుట. అట్టిజ్ఞానమును స్వానుభవముచే దృఢపఱచుకొనుట విజ్ఞానమనఁబడుచున్నది. అదెట్లనఁగా నొకఁడు మఱియొకనికి నొకకలకండపెళ్లనుజూపి యిదికలకండపెళ్లయని చెప్పుచున్నాఁడు. అందువలన నది కలకండపెళ్లయని రెండవవాఁడు తెలుసుకొనుచున్నాఁడుగదా! అయినను పటిక, వెలిగారము మొదలగు పెళ్లలుగూడ నదేతీరుగ నుంచున్నవి గనుక మొదటివాఁడు చెప్పిన ప్రకారము నిజముగానది కలకండపెళ్ల యౌనో కాదో యని సందేహించుటకు నవకాశముండునుగదా? అట్లుగాక, యాపెళ్లను నోటఁజప్పరించి చూచిన యెడల నప్పుడది కలకండపెళ్లయేయని నిశ్చయముగఁ దెలిసికొనఁగలఁడుగదా? అట్లు తెలిసికొనినపిమ్మట వానికావిషయమైన సంశయమేమియు నుండనేరదుగదా? కాన నట్లే పరమాత్మస్వరూపమిట్టిదని శాస్త్రములవలనను, గురువులవలనను దెలిసికొనుటకుఁదోడుగా స్వానుభవమువలనఁగూడఁ దెలిసికొనినయెడల నది స్థిరమైనట్టియు నిస్సంశయమైనట్టియు, జ్ఞానమగుచున్నది. కాన నట్టి యనుభవజ్ఞానము నేరీతిగఁ బొందవచ్చునో దానిం జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3

అర్థము:— మనుష్యాణామ్ = మనుష్యులలో, సహస్రేషు = వేలసంఖ్యలయందు, కశ్చిత్ = ఒకానొకఁడు, సిద్ధయే = (ఆత్మజ్ఞాన) సిద్ధికొఱకు, యతతి = యత్నించుచున్నాఁడు, యతతామ్ = (అట్లు) యత్నించుచున్నవారలలో, సిద్ధానామ్ + అపి = జ్ఞానసిద్ధినిపొందినవారిలో సయితము, కశ్చిత్ = ఒకానొకఁడు, మామ్ = నన్ను, తత్త్వతః = నిజముగా, వేత్తి = తెలిసికొనుచున్నాఁడు.

ఈయనుభవజ్ఞానము సాధారణముగఁ గలుగనేరదు. ఈలోకమున వేలసంఖ్యజనులలో నొకానొకఁడు జ్ఞానమును సంపాదింపవలెననెడు కోరికతోనందుకై ప్రయత్నముఁజేయును. అట్లు ప్రయత్నముఁజేసెడు ననేకులలో నొకానొకఁడు మాత్రమే సిద్ధినిఁ బొందును. అనఁగా జ్ఞానముగలవాఁడగును. అట్టిజ్ఞానసిద్ధినిబొందిన వారిలోఁగూడ నొకానొకఁడు మాత్రమే నా నిజస్వరూపమును దెలిసికొనఁగలఁడు. కాని యందఱును దెలిసికొనఁజాలరు.

అర్జు — అయ్యా! జ్ఞానసిద్ధిని బొందినవాఁడనఁగా ఆత్మానాత్మ స్వరూపములిట్టివని తెలిసికొనిననేగాని జ్ఞానసిద్ధిని బొందినవాఁడు కానేరడుగదా? అట్లుండ నట్టి జ్ఞానసిద్ధిని బొందినవాఁరిలోఁగూడ నొకానొకఁడే గాని యందఱును నీ నిజస్వరూపమును నెఱుఁగనేరరని చెప్పుటకుఁ గారణమేమి?

కృ — అవును. ఆత్మానాత్మవివేకము పొందినవాఁడనఁగా ఆత్మనిత్యమైనదనియు అనాత్మ యనిత్యమైన పదార్థమనియు మాత్రమే యెఱుఁగుచున్నాఁడు గాని వాని స్వరూపములెట్టివైనదియు నెఱుఁగజాలఁడు. అనఁగా పరమాత్మ సర్వవ్యాపియనియు ప్రపంచమందలి సమస్తములైన చేతనాచేతన పదార్థములయందు వ్యాపించియున్నాఁడనియు మాత్రమే యెఱుఁగఁగలఁడు గాని యాపరమాత్మ ప్రపంచమందలి యేయేవస్తువునం దేయేరూపముగఁ బరిణమించుచున్నాఁడో, దానిని సాధారణముగఁ దెలిసికొనఁజాలఁడు. అట్లు తెలిసికొనుటయే విజ్ఞానమనఁబడుచున్నది. అట్టి విజ్ఞానము జ్ఞానులలోఁగూడ నొకానొకనికిమాత్రము గలుగునేగాని యందఱికునుగలుగఁజాలదు. కాన నట్టి విజ్ఞానమును వివరించి చెప్పెద వినుము.

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ।
అహఙ్కార ఇతీయం మేభిన్నా ప్రకృతి రష్టధా॥ 4

అర్థము:— మే = నాయొక్క, ఇయమ్ = ఈ, ప్రకృతిః = మాయ, భూమిః = భూమియు, ఆపః = జలమును, అనలః = అగ్నియు, వాయుః = గాలియు, ఖమ్ = ఆకాశమును, మనః = మనస్సును, బుద్ధిః = బుద్ధియు, అహఙ్కారః + ఏవ + చ = అహంకారమును, ఇతి = అని, అష్టధా = ఎనిమిదివిధములుగా, భిన్నా = విభజింపఁబడినది.

పృథివ్యప్తేజో వాయురాకాశములను పంచభూతములను బుద్ధి చిత్తాహంకారములను మూడు అంతఃకరణములను జేరి నాదగు ప్రకృతి (మాయ) యగుచున్నది అనఁగా నామాయ భూమి - ఉదకము-అగ్ని-వాయువు-ఆకాశము-మనస్సు-బుద్ధి-అహంకారము-అని యెనిమిది విధములుగ విభజింపఁబడి యున్నదనుట. ఈయెనిమిదింటిచేతనే యీదృశ్యప్రపంచమంతయు సృజింపఁబడియున్నది. అనఁగా, నీప్రపంచమందలి స్థావర జంగమ వస్తువులలో నేదియైనను సరే పైఁ జెప్పఁబడిన యెనిమిదింటిలో నేదేని యొక దానిచేఁగాని, కొన్నిటిచేఁగాని, లేక అన్నిటిచేఁగాని చేయఁబడియున్నది. అనఁగా నీయెనిమిదింటిలో నేదేని యొకటియైనను లేకయే యీప్రపంచమునందలి యేవస్తువైన నుండనేరదనుట.

శ్లో॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్ ॥ 5

అర్థము :—హేమహాబాహో! = ఓయిఅర్జున!, ఇయమ్+తు = ఈప్రకృతి యన్ననో, అపరా=తక్కువైనది; యయా=దేనిచేత; ఇదమ్+జగత్ = ఈప్రపంచము; ధార్యతే=ధరింపఁబడుచున్నదో; జీవభూతామ్=జీవరూపమైన (అట్టి); మే=నాయొక్క; అన్యామ్+ప్రకృతిమ్=మఱియొక ప్రకృతిని; ఇతః=ఇంతకంటె; పరామ్=శ్రేష్ఠమైన దానినిగా; విద్ధి=ఎఱుఁగుము.

ఇంతవఱకు నేఁ జెప్పిన ప్రకృతి యచేతనమైనది గనుక నిది తక్కువైనదిగా నుంచున్నది గాన నిది స్థూలప్రకృతియనఁబడుచున్నది. ఇంతకంటె వేఱైనదియు సూక్ష్మమైనదియునగు ప్రకృతి మఱియొకటి గలదని యెఱుంగుము. అది యెట్టిదన్ననో ఈప్రపంచమునందుఁగల జంగమకోటి కంతటికిని జీవ రూపముగా నుంచున్నది. అనఁగా, చేతనప్రపంచ మంతటికిని నిదియె యాధారభూతముగ నుంచున్నది. కాన దీనిని సూక్ష్మప్రకృతియనియు నింతకుముందు నేఁజెప్పినస్థూల ప్రకృతి కంటె శ్రేష్ఠమైనదియనియు నెఱుంగుము.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా॥ 6

అర్థము :—సర్వాణి=సమస్తములైన, భూతాని = భూతములు (ప్రాణులు), ఏతద్యోనీని=ఈసూక్ష్మప్రకృతియే (యుత్పత్తి కారణముగాఁగలవి), ఇతి=అని, ఉపధారయ = తెలిసికొనుము; (తస్మాత్) = (ఆ కారణమువలన), అహమ్ = నేను, కృత్స్నస్య+జగతః = జగత్తునకంతటికిని, ప్రభవః = ఉత్పత్తి కారణభూతుఁడనై

యున్నాను, తథా = అలాగుననే, ప్రళయః = లయ కారణభూతుఁడనున్ను (అయి యున్నాను).

ఈసూక్ష్మప్రకృతి అస్థూలప్రకృతికంటె శ్రేష్ఠమైనదని చెప్పుటకుఁ గారణ మేమనఁగా, ఈప్రపంచమునందుఁగల సమస్తభూతములకు, అనఁగా, పిపీలికాది బ్రహ్మ పర్యంతమగు యెనుబదినాలుగులక్షల జీవరాసులకును నీసూక్ష్మప్రకృతియే యుత్పత్తి కారణముగానుంచున్నది. కనుక నిది స్థూలప్రకృతికంటె శ్రేష్ఠమైనదని చెప్పుటకుఁ గారణమైనది. అయితే దీనికంటెఁ దక్కువైనదియు నింతకుముందు చెప్పఁబడిన దియునగు స్థూలప్రకృతియు నాదియేయైయున్నదని యిదివఱకే చెప్పియుంటినిగదా ? కాన సమిష్టికి నీచరాచర ప్రపంచమునకంతటికిని నేనే యుత్పత్తి కారణ భూతుఁడనై యున్నాను. అట్లే యీప్రపంచ లయమునకును నేనే కారణ భూతుఁడనై యున్నాఁడను.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్ కిఞ్చి దస్తి ధనఞ్జయ ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7

అర్థము :— హేధనఞ్జయ ! = ఓయి ధనంజయుఁడా !, మత్తః = నాకంటె, పరతరమ్ = శ్రేష్ఠతరమైనది, అన్యత్ = మఱియొకటి, కిఞ్చిత్ = కొంచెమైనను (ఏదియును), న + అస్తి = లేదు, మణిగణాః = పూసల సమూహములు, సూత్రే + ఇవ = దారమునందువలె, ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్త (ప్రపంచము), మయి = నాయందు, ప్రోతమ్ = కూర్చఁబడియున్నది.

కాన నోయి ధనంజయా ! ఈప్రపంచమునందు గల చేతనాచేతన పదార్థము లన్నియు నా స్వరూపములేయనియు, నాకంటె నితరమగు మఱియొకటి యణుమాత్ర మైననుండదనియు ననేక విధములగు పూసలొక దారమునఁ గూర్పఁబడి యేప్రకారముగ నుంచున్నవో, అనఁగా నొకదార మనేక విధములగు పూసలయందు గ్రుచ్చఁబడి వాని యన్నిటి యందును నేప్రకారముగ వ్యాపించి యున్నదో, అదే తీరుగ నేను నీప్రపంచమునందలి స్థావర జంగమములన్నిటియందును వ్యాపించి యుంచున్నానని యెఱుంగుము. అట్లునిన నీకుఁ జక్కఁగ బోధపడునట్లు వివరించి చెప్పుచున్నానువినుము.

ఈలోకమునఁ దెలుపు, ఎఱుపు, పసుపు, ఆకుపచ్చ, నలుపు, నీలము మొదలగు ననేక విధములగు రంగులుఁ గలవియును, చిన్న, పెద్ద మొదలగు నురువులునుగల యనేక విధములగు పూసలుంచున్నవిగదా ! ఒక నేర్పరియగు పనివాఁడాపూసలు దారమునం గ్రుచ్చి వానితో ననేక విధములగు రూపముల నేర్పఱచుచున్నాఁడుగదా ? అనఁగా మను ష్యులవలెను, గుఱ్ఱములవలెను, ఏనుఁగులవలెను, చిలుకలవలెను, రథములవలెను, కంకణ ములు మొదలగు ఆభరణములవలెను నేర్పఱచుటను మనము చూచుచున్నాము గదా ?

అర్జు — అవును అట్లు పూసలతో ననేకవిధములుగఁ జేయఁబడిన పనితనములను జూచుచునేయున్నాము. అవి యాయా పనివాని బుద్ధి చాతుర్యముకొలఁదిఁ జిత్రవిచిత్రములుగ నుండుచున్నవి.

కృ — అవునుగదా! మంచిది, అట్టిపనులయందుండెడు రూపభేదములును, చిత్రవిచిత్రములును, దేనివలనఁ గలుగుచున్నవి? పూసలవలననా? దారమువలననా? పనితనమువలననా?

అర్జు — ఒక పనియందు నుపయోగింపఁ బడియుండు వివిధవర్ణములుగల పూసలవంటివే మఱియొక పనియందును నుపయోగింపఁబడుచున్నవి. అయితే ఆ పూసలయందు గ్రుచ్చఁబడెడు దారముయొక్క యల్లిక భేదముచేత మాత్రమే యాయా పనికి వేఱువేఱు రూపభేదములు గలుగుచున్నవి. అనఁగా మనుష్యరూపముగ నల్లఁబడిన యొక పనితనమునందు నేలాటి రంగులుగల పూసలేలాటిదారముతో గ్రుచ్చఁబడియున్నవో, గుఱ్ఱముపలె నల్లఁబడియుండు నొక పనితనమునందును నాలాటి రంగులుగల పూసలేయాలాటి దారముతోనే కూర్పఁబడియున్నవి. కాన నీరూపభేదములాపనివాని బుద్ధి చాతుర్యము కొలఁదిఁ జేయఁబడు నల్లిక వలనఁగలుగుచున్నదే గాని పూసలయొక్కగాని, దారముయొక్కగాని భేదములవలన గాదు.

కృ — మంచిది. అట్లైనయెడల నొకపనివాఁడు నానావర్ణములు గల కొన్ని పూసలనొక దారముతోనల్లి మనుష్యరూపముగ నేర్పఱచిన దానినిఁ జెడఁగొట్టిన యెడల, మరల నాపూసలనే యదే దారమున గ్రుచ్చి యల్లిక భేదముచే మఱియొక రూపముగ, అనఁగా, గుఱ్ఱము, ఏనుఁగు మొదలగువానిలో నేదైన యొకరూపముగ నేర్పఱప వచ్చునుగదా!

అర్జు — అవును అలాగు నిరభ్యంతరముగఁ జేయవచ్చును. ఆపూసలనే, యా దారముతోనే, యెన్నిమారులైనను ఎన్నిరూపములుగనైనను అల్ల వచ్చును. అది యాపనివాని పనితనమువలన నట్టి రూపభేదములు గలుగఁదగి యున్నవిగాని అసలు వస్తువులగు పూసలయందును, దారమునందును, నేమియు భేదముండనేరదు.

కృ — అవునుగదా! అట్లే ఇదివఱకు నేఁజెప్పిన స్థూలప్రకృతియగు పృథివ్యప్తేజో వాయువాకాశములనెడు పంచభూతములును, బుద్ధి చిత్తాహంకారములనెడు నంతఃకరణములు మూఁడును (చూ. 7-4), వివిధవర్ణములగు పూసలవంటి దనియును, జీవభూతమగు సూక్ష్మప్రకృతి (చూ. 7-5) దారమువంటి దనియును నెఱుంగుము. అనఁగాఁ బూసలలో గ్రుచ్చఁబడిన దారముయొక్క యల్లికభేదముచే నెట్లు వివిధములగు రూపము లేర్పడుచున్నవో, ఆలాగుననే జీవభూతమైన నాదు సూక్ష్మప్రకృతి

స్థూలప్రకృతియం దనేకవిధములుగ వ్యాపించుటచే నీప్రపంచమునందలి యనేక విధములగు జీవరాసులుత్పన్నములగుచున్నవని యెఱుంగుము. మణియును బూసలలో వ్యాపించియుండెడు దారమును బెరికి వేయఁగనే యారూపముచెడి యాపూసలన్నియుఁ గుప్పగరాలి తొలుత దారమునఁ గూర్పఁబడక మునుపుండిన రీతిని నానావిధ వర్ణములుగల పూసలుగ నెట్లేర్పడునో, యట్లే, యీప్రపంచమునందలి సమస్తజంతుజాలములయందు వ్యాపించియుండునట్టియు నాదు సూక్ష్మప్రకృతియు నగు జీవాత్మ యాయాకళేబరమునుండి వెడలినవెంటనే, యాకళేబరము నశించినదగుచు దానియందు మిశ్రమమైయుండెడు పంచభూతములును నాయాభూతములలో నైక్యమగు. కనుకనే యీప్రపంచముయొక్క యుత్పత్తికిని లయమునకును నేనే కారణభూతుఁడనని చెప్పుటకుఁ గారణమైనది. (చూ. 7-6)

శ్లో॥ రసోఽహ మప్సు కౌన్తేయ! ప్రభాస్మి శశిసూర్యయోః।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8

శ్లో॥ పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు॥ 9

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్॥ 10

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ 11

అర్థము :— హే కౌన్తేయ!=ఓయి యర్జునా!, అహమ్=నేను, అప్సు=ఉదకములయందలి, రసః = రుచియును, శశిసూర్యయోః = చంద్రసూర్యుల యందలి, ప్రభా=ప్రకాశమును, సర్వవేదేషు=సమస్తవేదములయందలి, ప్రణవః=ఓంకారమును, ఖే=ఆకాశమునందలి, శబ్దః=శబ్దమును, నృషు=నరులయందలి, పౌరుషమ్=మగతనము (పరాక్రమమును), అస్మి=అయియున్నాను, పృథివ్యామ్=భూమియందలి, పుణ్యః+గన్ధః+చ=సువాసనయును, విభావసౌ=అగ్నియందలి, తేజః+చ=దీప్తియును, అస్మి=అయియున్నాను, సర్వభూతేషు=సమస్తభూతములయందలి, జీవనమ్=జీవనమును (ఆయువును), తపస్విషు=తాపసులయందలి, తపః+చ=తపస్సును, అస్మి=అయియున్నాను, అహమ్=నేను, బుద్ధిమతామ్=బుద్ధిమంతులయొక్క, బుద్ధిః=వివేకమును, తేజస్వినామ్=తేజోవంతులయొక్క, తేజః=తేజ

స్సును, అస్మి = అయియున్నాను, హేభరతర్షభ ! = ఓ భరతవంశశ్రేష్ఠుఁడా, అహమ్=నేను, బలవతామ్=బలవంతులయొక్క, కామరాగవివర్జితమ్=ఆశయును అనురాగమును లేని, బలమ్+చ=బలమును, భూతేషు=భూతములయందలి, ధర్మావిరుద్ధః=ధర్మవిరుద్ధము కాని, కామః=వలపును (సంగమేచ్ఛయును), అస్మి=అయియున్నాను, హేపార్థ != ఓయియర్జునా !, (ఏవమ్) = (ఇట్లు), మామ్ = నన్ను, సర్వభూతానామ్=సమస్తభూతములకును, సనాతనమ్=అనాదియైన, బీజమ్=బీజమును గా (ఉత్పత్తి కారణభూతునిగా), విద్ధి=ఎఱుంగుము.

ఓయి యర్జునా ! పంచభూతాత్మకమగు నా స్థూలప్రకృతియందు జీవరూపకమును శ్రేష్ఠతరమునగు నా సూక్ష్మప్రకృతి యేవిధముగా వ్యాపించియున్నదో దానిని వివరించి చెప్పుచున్నాను వినుము. ఉదకము స్థూలప్రకృతిలోఁ జేరిన పంచభూతములలో నొకటిగదా ! దానియందంతర్వ్యాప్తమైయుండెడు రసము అనఁగా ఉప్పన, తీయన మొదలగు రుచియే నా సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. ఇదిగాక, ఆకాశము పంచభూతములలో నొకటిగదా ! దాని యందంతర్వ్యాప్తమైయుండెడు శబ్దమే నా సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. భూమియును నా స్థూలప్రకృతిలోఁ జేరిన పంచభూతములలో నొకటిగదా ! అభూమియందొక విధమైన పరిమళ మంతర్వ్యాప్తమైయున్నది. అట్టి పరిమళమే నా సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. అగ్నియు నా స్థూలప్రకృతిలోఁ జేరిన పంచభూతములలో నొకటియైయున్నదిగదా ! దాని యందంతర్వ్యాప్తమైయుండెడు తేజస్సు, అనగా, దీప్తియే నా సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. అనఁగాఁ బైఁజెప్పిన భూతములయందు అనఁగా నుదకమునందు రుచియును, ఆకాశమునందు శబ్దమును, పృథివియందు గంధమును, అగ్నియందు దీప్తియును లేనియెడల నవి యెందును నుపయోగింపనేరవు గనుక వానియందాయాగుణమును గలుగఁజేసినవాఁడను నేనే కాబట్టి యాయాగుణములు జీవరూపమైన నాసూక్ష్మప్రకృతియని చెప్పుటకుఁ గారణమైనది. కావున నిట్లే సూర్యచంద్రబింబములయందు ప్రకాశము లేనియెడల వానివలన నీప్రపంచమున కేమియుఁ బ్రయోజన ముండనేరదు గదా ! కాన నాసూర్యచంద్రులయందుఁ బ్రకాశమును బ్రపంచోప యోగార్థమై కలుగఁజేసియున్నాను. కనుక నట్టిప్రకాశమే నా సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. మఱియు సమస్త వేదములయందును ప్రణవమే (ఓంకారమే) ముఖ్యమైనదిగానున్నది గదా! అనఁగాఁ బ్రణవోచ్చారణ లేని వేదోచ్చారణము నిరర్థకమైనది గదా ? కాఁబట్టి యా ప్రణవమే సమస్త వేదాంతసారభూతమైనదియు, సకల వేదములకు జీవభూతమైనదియునని చెప్పఁదగియున్నదిగదా ! కనుక నట్టిప్రణవమే నాదగు సూక్ష్మ ప్రకృతియని యెఱుంగుము. మఱియు నీ ప్రపంచమునఁగల సమస్త జీవ

రాసులలో మనుష్యజన్మమును, అట్టి మనుష్య జన్మయందు పురుషజన్మమును శ్రేష్ఠము గదా! అట్టి పురుషులయందుఁ గూడఁ బరాక్రమవంతులగు పురుషులు శ్రేష్ఠులుగదా, అనఁగా నీ ప్రపంచమునందు గల సమస్తభూతకోటియందును బరాక్రమసహితమైన పురుషజన్మ శ్రేష్ఠతరమైనదిగ నేర్పడుచున్నదిగదా! కాన నట్టిపురుషులయందలి పరాక్రమమే నాదగు సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. మఱియుఁ బురుషులలోఁ దాపసోత్తములు శ్రేష్ఠులుగదా! అట్టి శ్రేష్ఠత్వము వారికి వారలయందుండెడు తపస్సుచేతనేగదా కలుగుచున్నది! కాన నట్టి తపస్సే నేననియెఱుంగుము. అనఁగా నాదగు సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. మఱియు, మనుష్యులలో బుద్ధిమంతులగువారే శ్రేష్ఠులుగదా! అట్టివారికిఁ గలిగియుండెడు బుద్ధియే (వివేకమే), నేనని అనఁగా నాదు సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. మఱియు తేజోవంతులగువారియందలి తేజస్సును నేనే (నాదు సూక్ష్మప్రకృతియే) యని యెఱుంగుము. ఇదిగాక యోయి యర్జునా! మఱియు నాస్వరూపమెట్టిదైనదియు నింకను జెప్పుచున్నాను వినుము. ప్రపంచమందలి మనుష్యులలో ననేకులనేకవిధములగు బలముగలవారలగుచున్నారు గదా! అనఁగాఁ గొందఱు విద్యాబలముగలవారును, కొందఱు ధనబలముగలవారును కొందఱు దేహబలముగలవారును, మఱికొందఱు బుద్ధి బలముగలవారుగను నుంచున్నారుగదా! అట్టివారిలోనుండెడు న్యాయాబలమును "శ్లో॥ విద్యా వివాదాయ ధనం మదాయ। ప్రజ్ఞావిశేషః పరవఞ్చనాయ। ఖలస్యసాధోర్విపరీతమేత ద్జ్ఞానాయ దానాయవిచక్షణాయ॥" అనునట్లు కొందఱు కామాద్యరిషడ్వర్గసహితులై దుర్వినియోగపఱచుటయు, మఱికొందఱట్టి కామాద్యరిషడ్వర్గరహితులై సద్వినియోగపఱచుటయుఁ జూచుచున్నాముగదా! అట్టివరైతే తమయందుండెడు న్యాయాబలమును గామాద్యరిషడ్వర్గరహితులై సద్వినియోగపఱచుచున్నారో, అట్టివారియందుండునట్టి యాబలము నేనని, అనఁగా, నాదగు సూక్ష్మప్రకృతియని యెఱుంగుము. మఱియు నీప్రపంచమునఁగల జీవజంతువులన్నిటియందును స్త్రీపురుషజాతులు రెండు గలిగియుండుటయును, ఆజాతులు రెండును బరస్పర కామోద్రేకముగలవియై రమించుటయు, అందువలనఁ బ్రజావృద్ధి గలుగుచుండుటయు, చూచుచున్నాముగదా! అట్టి ప్రజావృద్ధి కారణమగు కామమెదిగలదో, అదియే నాదగు సూక్ష్మప్రకృతి యని యెఱుంగుము. అయితే మనుష్యేతరములగు పశు పక్షి క్రిమికీటకాది తిర్యగ్జంతుజాలములయందుండెడు కామము కేవల స్వభావజన్యమైనదిగను విధినిషేధములు లేనిదిగను నుండుటంబట్టి యాజంతువులయందలి కామమునకు ధర్మాధర్మభేదము లేకపోయినను, యుక్తాయుక్తపరిజ్ఞానముగల మనుష్యజాతియందలి కామమునకుమాత్ర మాయాదేశాచార, మతాచార, కులాచార, వంశాచారములనుబట్టి యనేకవిధములగు

విధినిషేధములు గలిగియున్నవి. కనుక మనుష్యులలోమాత్ర మెవరెట్టి విధి నిషేధములకు లోఁబడినవారుగ నుంచున్నారో వారివారియం దట్టి విధినిషేధముల ననుసరించియుండెడు కామము (సంభోగేచ్ఛ) ధర్మమైనదగును, అట్టి విధినిషేధముల నతిక్రమించియుండెడు కామము ధర్మవిరుద్ధమైనదిగనుండును. కాననట్లు దేశాచార – మతాచార – కులాచార – వంశాచారధర్మములకు విరుద్ధము గాకుండు నట్టి కామము యేదికలదో యదియే నాదగు సూక్ష్మప్రకృతియని యెఱుంగుము.

ఇట్లే సమస్తభూతములయందుండెడు నుత్కృష్టాపకర్షతలలో నుత్కృష్టతగల వేవియో యవియన్నియు నేనేయని (నాసూక్ష్మప్రకృతియనియు) యెఱుంగుము. కనుక ఓయి యర్జునా! ఇపుడు నేను వివరించిన యన్ని యంశములనుబట్టిచూడఁగా నేనే యీప్రపంచమందలి సమస్త చరాచరములకు ననాదియగు బీజము అనఁగా నుత్పత్తికారణమనియు, చేతనములగు సమస్త భూతములయందుండెడు చైతన్యమును (జీవమును) నేనేయనియు నెఱుంగఁగలవుగదా ?

అర్జు — అయ్యా! ఇంతకుముం దీప్రపంచమునందు నీకంటె నితరమగువస్తువు మఱియొకటి లేనేలేదని చెప్పితివిగదా (చూ. 7_7), ఇపుడు ప్రపంచమందుగల సమస్తభూతములయందలి యుత్కృష్టాపకర్షతలలో యుత్కృష్టతను మాత్రమే నేనని చెప్పుచున్నావే, అట్లయినయెడల నాభూతములయందలి యపకర్షత నీకంటె వేరైన దగుచున్నదిగదా ? అట్లయినయెడల నీవిదివరకుఁ జెప్పినదానికిది విరుద్ధమైనదగు చున్నదిగదా ?

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే ।
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు తే మయి ॥ 12

అన్వయము:— యే = ఏవి, సాత్త్వికాః + భావాః + ఏవ = కేవలసాత్త్విక స్వభావముగలవిగనుంచున్నవో (అవియును), (యే) = ఏవి, రాజసాః + (భావాః) + చ = రాజసస్వభావముగలవిగనుంచున్నవో (అవియును), యే = ఏవి, తామసాః + (భావాః) + చ = తామసస్వభావముగలవిగనుంచున్నవో (అవియును), మత్తః + ఏవ + ఇతి = నావలనఁగలిగినవేయని, తాన్ = వానిని, విద్ధి = ఎఱుఁగుము, అహమ్ + తు = నేనైతేనో, తేషు = వానియందును, న = లేను, తే = అవి, మయి + (చ) = నాయందును, (న) = లేవు.

కృ — ఓయి యర్జునా! ఇదివఱకు నేఁజెప్పినప్రకార మీప్రపంచమున నాకంటె నన్యమైనది మఱియొకటి లేని మాటయే వాస్తవము. నేనిప్పుడిట్లు చెప్పినది అనఁగా ప్రతిదానియందును నుత్కృష్టత నేనని చెప్పుటవలన నపకర్షత నాది కాదని భావింప

కుము. అదియును నాదియే. అయితే దానికిని దీనికిని గల భేదమును వివరించి చెప్పుచున్నాను వినుము. నాదియగు ప్రకృతి త్రిగుణాత్మక మైనదిగ నున్నది. అనఁగా సత్త్వ రజస్తమస్సులనియెడు మూడుగుణములు గలదిగ నుంచున్నది. ఆసత్త్వరజస్తమో గుణము లెట్టివనఁగా,

"సీ॥ సత్త్వగుణంబు సంతోష, మానంద, మారోగ్య, మక్రోధ, మార్జవంబు,
శుద్ధిప్రకాశత, సుస్థిరత్వ, మహింస, నిర్మలశ్రద్ధ, వినీతి, లజ్జ,
సత్యంబు, శౌచంబు, సమత, యాచారం, బకార్పణ్య మపైశున్య, కామవృత్తి
విను రజోగుణములు: విగ్రహ దర్పాభిమాన కామ క్రోధ మత్సరములుఁ,

ఆ. కరుణలేమి, భోగకాంక్ష, యహంకార,
మున్మ్మలిక, తమోగుణమ్ము; లప్ర
కాశ మోహ బహుతరాశన వాద ప్ర
మాద మాంద్య మరణ ఖేదనములు." (భార. శాంతి. ౯ అ. ౯౦.)

అను నట్టులు సంతోషము, ఆనందము, ఆరోగ్యము, క్రోధములేకుండుట, ఆర్జవము, శుద్ధి, ప్రకాశత్వము సుస్థిరత్వము, అహింస, నిర్మలశ్రద్ధ, వినీతి, లజ్జ, సత్యము, శౌచము, సమత్వము, ఆచారము, అకార్పణ్యము, అపైశున్యము అనగా ఔదార్యము, అకామవృత్తి అను నివి సత్త్వగుణములనియు, విగ్రహము; అనఁగా విరోధము, దర్పము అనఁగా డంబము, అభిమానము, కామము, క్రోధము, మాత్సర్యము, కరుణ లేమి, భోగమునందపేక్ష, అహంకారము, ఉన్మ్మలికము అనునవి రజోగుణములనియు; అప్రకాశము, మోహము, తిండిపోతుతనము, వాదము, ప్రమాదము, బుద్ధిమాంద్యము, మరణభయము అను నివి తమోగుణములనియుఁ జెప్పఁబడుచున్నవి. అట్టి త్రిగుణములలో.

"ఉ॥ సత్త్వరజస్తమోగుణవశస్థితిఁ గేవల పుణ్యమిశ్రకా
రిత్వవిరుద్ధకర్మముల ప్రేరితమైకను నూర్ధ్వలోకసే
విత్వము మానుషత్వపద వీకలనంబును రౌరవంబునా
తత్త్వముదన్నలుంగని ప్రధానముచేతల నావహిల్లినన్"

(భార. శాంతి. ౬ అ. ౧౦౧)

అనునట్లు కొందఱు కేవల సత్త్వగుణప్రధానులై తదనుగుణ్యములగు కేవల పుణ్యకర్మలనే చేయుచు నందునకుఁదగిన పరలోకసుఖముల ననుభవింతురు. మఱి కొందఱు మూడుగుణములు మిశ్రమముగఁ గలవారలై పుణ్యపాపకర్మలను మిశ్రమముగఁ జేయుచుఁ దత్ఫలములగు సుఖదుఃఖములను మిశ్రమములుగ ననుభవింతురు.

మఱికొందఱు కేవల తమోగుణ ప్రధానులై తదనుగుణ్యములగు పాపకార్యములనే చేయుచుఁ దత్ఫలములగు రౌరవాది నరకబాధల ననుభవింతురు. ఇట్టి యీ మూఁడు గుణము లింతభేదముగలవైనను ఇవియన్నియు నావలనఁగలిగినవే యని యెఱుంగుము.

అయితే వీనియందు సత్త్వగుణ ప్రధానములైన విశ్రేష్ఠతమములైనవియును నాదగు సూక్ష్మప్రకృతిచేఁ గలిగినవియును గనుక వానిని నేనే యని చెప్పుటకుఁ గారణమైనది. తక్కిన మిశ్రమ గుణములును గేవల రజస్తమోగుణములును వానికంటెఁ దక్కువైనవి గనుక నాదు స్థూలప్రకృతిచేఁ గలిగినవగుచున్నవి గాని నాకన్యములైనవిగ నెప్పుడును గావు. అయితే యివియన్నియు నావలనఁ గలిగినవేయైనను వానియందు నేనుగాని, అవి నాయందుగాని యంటియుండుటలేదు. అనఁగా.

"ఆ॥ తాను బ్రకృతిఁ బ్రకృతి తనయందు నిల్చని
ల్చినను దాన వికృతిఁ జెందకుండుఁ
బురుషుఁ డుదకమత్స్యములయుదుంబరమశ
కములసంగమంబు కరణిఁగలుగ.

ఆ. జలముఁ గదిసియుండి జలముచే నార్ద్రంబు
గాకయుండునట్టి కమలదళము
భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియునువ
ద్వికృతిఁ బొందకుండు వీతదోష!" (భార. శాంతి. ౯ ఆ-౧౦౭, ౧౦౯)

అనునట్టుల నుదకమునకును, దానియందుండెడు మత్స్యములకును, మేడిపండునకును, దానియందుండెడు దోమలకును, తామరాకునకును, దానికి నుత్పత్తిస్థానమగు నుదకమునకును నెట్లు సంబంధములేదో, అట్లే యీ త్రిగుణములకును నాకును సంబంధములేదని యెఱుఁగుము.

శ్లో॥ త్రిభిర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్ ।
మోహితమ్ నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్ ॥ 13

అర్థము :— ఏభిః = ఈ (పైఁజెప్పఁబడిన), త్రిభిః = మూఁడైన, గుణమయైః = సత్త్వరజస్తమస్సు లనెడు గుణవికారములుగల, భావైః = స్వభావములచేత, ఇదమ్ + జగత్ = ఈ ప్రపంచము, సర్వమ్ = అంతయు, మోహితమ్ = మోహింపఁబడినదగుచు, మామ్ = నన్ను, ఏభ్యః = ఈ మూఁడుగుణములకంటె, పరమ్ = విలక్షణునిగను, అవ్యయమ్ = నాశరహితునిగను, న + అభిజానాతి = తెలిసికొనఁజాలదు.

అయితే, ఓయి యర్జునా! ఈ లోకమి త్రిగుణాత్మకమగు నా మాయచేతఁ

గప్పఁబడియుంచున్నది గనుకఁ దత్సంబంధమగు నజ్ఞానముచే నావరింపఁబడినదై యుంచున్నది గాన

"క|| పురుషునికల రూపెఱిఁగెడు
పరిబోధనము లేకయుండుఁ బ్రకృతికిఁ బ్రకృతిం
బురుషుఁడెఱుంగును దనకుం
బరంబు లేదని యుఁగ శుభస్థిరదృష్టిన్ ||" (భార. శాంతి. ౬-అ-౧౦౫)

అనునట్లు నేనా త్రిగుణాత్మకమగు ప్రకృతికంటె విలక్షణుఁడ ననియును, నాశరహితుఁడ ననియు తెలిసికొనఁ జాలదు గాని నేను మాత్రము దానికంటెఁ బరుఁడనని యెఱిఁగియున్నాను.

అర్జు — అయ్యా! నీవట్లు విలక్షణుఁడవని లోకమెఱుంగకుండుటకుఁ గారణమేమి? నీమాయ అంత దురవగాహమైనదియా?

శ్లో|| దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే॥ 14

అర్థము :— హి=ఏలయనఁగా, ఏషా=ఈ (పైఁజెప్పఁబడిన), గుణమయీ=త్రిగుణాత్మకమైన, మమ=నాయొక్క, మాయా=ప్రకృతి, దైవీ=దేవసంబంధమైనది (అనగా నావలనగలిగినది:, గనుక) దురత్యయా=దాఁట శక్యముగానిదిగ నుంచున్నది, యే=ఎవరు, మామ్+ఏవ=నన్నే, ప్రపద్యన్తే=ప్రపత్తిచేయుచున్నారో, తే=వారు, ఏతామ్+మాయామ్=ఈమాయను, తరన్తి=తరించుచున్నారు.

కృ — అవు నబ్బాయీ త్రిగుణాత్మకమగు నామాయ నాచేతనే కల్పింపఁబడినది; చిత్రమైనశక్తిగలదిగనే యున్నది గనుక నిదియెవ్వరికిని దరింపశక్యముగానిదియేయని చెప్పఁదగియున్నది.

అర్జు — అయితే, అట్లయిన యెడల నీప్రపంచమున నెవ్వరును నీ మాయను దరింపలేరు గదా? అందఱును యెల్లప్పుడును నీ మాయలోనే మగ్నులయి యుండవలసియే యున్నారా, లేక కొందరైనను నీ మాయను దరింపఁగలవారుందురా?

కృ — ఆహా! కలరు. వారెట్టివారనఁగా, ఎవరైతే "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అని యితర చింతలన్నియు మాని నన్నే ప్రపత్తి చేయుచున్నారో యట్టివారు నన్ను నీప్రకృతికంటె విలక్షణునిగ నెఱుంగఁగలరుగాన నట్టివారు నామాయను దరింపగలరు.

అర్జు — అట్లైన యెడల ప్రపంచమునందలి జనులందరు నిన్నే ప్రపత్తి చేయుచు నీ మాయను సులభముగఁ దరింపఁదగియుండఁగా యందొకానొకఁడు మాత్రమట్లు చేయుటకుఁ గారణమేమి?

శ్లో॥ నమాం దుష్కృతినోమూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః॥ 15

అర్థము :— మూఢాః=మూఢులును, ఆసురమ్+భావమ్=రాక్షసస్వభావమును, ఆశ్రితాః=ఆశ్రయించినవారును, దుష్కృతినః=దుష్కర్మలఁజేయువారునగు, నరాధమాః=మనుష్యాధములు, మాయయా=మాయచేత, అపహృతజ్ఞానాః+(సన్తః)=అపహరింపఁబడిన జ్ఞానముగలవారగుచు, మామ్=నన్ను, న+ప్రపద్యన్తే=ప్రపత్తిచేయరు.

కృ — ఓయి యర్జునా! అవును. నన్ను ప్రపత్తిచేయువారికి నామాయను దరించుట యతిసులభసాధ్యమైన పనిగానేయున్నది. నా మాయయొక్క నిజస్వరూపమెట్టిదనఁగా,

"గీ॥ తృణకణాంశము వజ్రంబుఁ ద్రెంచినట్లు
కోరితామరనూలునఁ గొండలెల్లఁ
గట్టువడినట్లు విశ్వంబు గట్టువడియె
నకటమాయాప్రభావ మేమందుననఘ." (వారా. ౨ ఆ)

అనునట్లు నన్నే ప్రపత్తిచేయువారలకీమాయ తృణప్రాయముగను నూలిపోగువంటిదిగను నుండును; గాన వారలు దాని నతిసులభముగఁ దరింపఁగలుగుదురుగాని మద్విముఖులన్ననో వజ్రము తృణముచేఁ ద్రెంపఁబడినట్లును, కొండలు నూలుపోగుచేఁ గట్టువడినట్లును స్వల్పమగు నాదు మాయచేఁగట్టుపడి దానివలన విడివడ సమర్థులుగానేరరు. అయితే యీ ప్రపంచమునందందఱును నన్నేయేల ప్రపత్తిచేసి యీ మాయను దరింపకుందురనఁగా నే నీ మాయను గల్పించినను దీనిం దరించుటకుఁదగిన బుద్ధినిగూడ జనులకందఱకు నిచ్చియున్నాను. అయితే యిదివఱకు నేను నీకుఁజెప్పిన యొకదృష్టాంతములోని తామర కొలనికిబోయిన యిద్దరు మనుష్యులవలె నందులోఁ గొందఱుమాత్రము, అనఁగా వేయింటిలో నొకఁడు మాత్రము బుద్ధిని జక్కఁగ నుపయోగించికొనుచు దానిబలముచే నన్నుఁ దెలిసినవాఁడై నన్నేప్రపత్తిచేసి నామాయను దరించును గాని తక్కిన వారందఱు మూఢులై నేనిచ్చినబుద్ధిని జక్కఁగ నుపయోగపఱచికొనక యసురభావము నాశ్రయించినవారై, అనఁగా రాక్షసులేప్రకారము భగవంతుని యందును భాగవతులయందును ద్వేషబుద్ధి గలవారలై యకృత్యములఁ జేయుచుండిరో యట్లనేకవిధములగు హింసాద్యకృత్యములఁ జేయుచుందురు. కాన నట్టినరాధములీమాయను ద్రెంచుకొనఁజాలక దానిచేఁగట్టువడి మోహితులై యుందురు గాన నట్టివారలు నన్నుఁ దెలిసికొనఁజాలరు. కాఁబట్టి వారు నన్నుఁ బ్రపత్తిచేయరు.

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!॥ 16

అర్థము:— భరతర్షభ = భరతవంశశ్రేష్ఠుఁడవైన, హే అర్జున! = ఓయి అర్జునుఁడా!, ఆర్తః = ఆర్తిని జెందినవాఁడును, జిజ్ఞాసుః = నన్ను దెలిసికొన నపేక్షించువాఁడును, అర్థార్థీ = చతుర్విధపురుషార్థములలో నేదేనియొక యర్థమును (ప్రయోజనమును) గోరువాఁడును, జ్ఞానీ+చ = జ్ఞానియును (నన్ను దెలిసికొనినవాఁడును), (ఏతే) = ఈ (పైఁజెప్పఁబడిన), చతుర్విధాః = నాలుగువిధములవారునైన, సుకృతినః+జనాః = పుణ్యాత్ములు, మామ్ = నన్ను, భజన్తే = భజించుచున్నారు.

అయితే, ఓయియర్జునా! ఇఁకను నన్నుఁ బ్రపత్తిచేయువారల సంగతిఁ జెప్పుచున్నాను వినుము. వార లెవరనఁగా ఆర్తులనియు, జిజ్ఞాసులనియు, అర్థార్థులనియు, జ్ఞానులనియు, నాలుగు తెగల వారుగ నుంచున్నారు. అందు ఆర్తులనఁగా, ఆధ్యాత్మికాధి దైవికాధిభౌతికముల నెడు తాపత్రయములలో నేదైననొక దానిచే మిగులఁ బీడితులై దాని నివారించుకొనఁజాలక దిగులు జెందిన మనస్సుగలవారును, అనన్యగతికులునై నన్ను శరణునొందెడువా రార్తులనఁబడుచున్నారు. వా రెట్టివారై నదియు నీమనస్సునకుఁ జక్కఁగ స్ఫురించుటకై యనుభవసిద్ధములగు దృష్టాంతములఁజెప్పుచున్నాను వినుము. పూర్వము మకరిచేఁజిక్కి యనేక విధములఁ బోరాడి యికను దీనిజయింపఁ జాలననియు, దీనిచెఱనుండి విడిపించుటకు సర్వేశ్వరుఁడగు నాభగవంతుఁడు దప్ప నితరులకు సాధ్యపడదనియు నెంచి గజేంద్రుఁడు నన్ను భజించి యా మకరి చెఱనుండి విడిపింపఁబడినసంగతి లోకప్రసిద్ధమైనదియే కదా! ఇదిగాక పంచపాండవులగు మీభార్యయగు ద్రౌపదీదేవి కౌరవసభయందు నీ యెదుటనే చీరలొలువఁబడుచుండ నామె తన మానసంరక్షణచేయఁగల వారి నెవ్వరింగానక నన్ను స్మరించుటయు, అందుపై నే నావెంటనే యామెకు నక్షయవలువ లొసంగుటయు నీ వెఱింగిన సంగతియే గదా! కనుక నీరీతిగా నేదియొకానొక గొప్ప యాపదలోఁ జిక్కువడి సర్వశక్తిగల భగవంతుఁడు దప్ప నితరు లెవ్వరును నాయాపదను దీర్పఁజాలరని తోఁచినప్పుడు తన్నివారణార్థమై నన్ను భజింతురు. కాన నట్టివార లార్తు లనఁబడుచున్నారు. ఇఁకను జిజ్ఞాసు లెట్టివారనఁగా పూర్వజన్మసుకృతమువలన భగవద్విషయమున నాసక్తినొందినచిత్తముగలవారై భగవంతుఁడనగు నన్ను సమగ్రముగ నెఱుంగఁగోరి యొక సద్గురువు నాశ్రయించి యుపదేశమును బొంది వేదాంతాది గ్రంథపఠనయు తపోదానాది సత్క్రియలును భగవన్నామ సంకీర్తనమును జేయువారు జిజ్ఞాసులనఁబడుచున్నారు. ఇఁకను అర్థార్థు లెట్టివారనఁగా, ధర్మార్థ

కామమోక్షము లనెడు చతుర్విధపురుషార్థములలో దేనినైనఁ బొందఁగోరెడువారు. అందు ధర్మమనఁగా పరలోకసుఖమునకు సాధనములైన దానాదిపుణ్యకార్యములును, అర్థమనఁగా నట్టిధర్మములను నెఱవేర్చుటకు సాధనములైన ధనధాన్యాది వస్తువాహనాదులును, కామమనఁగా నైహికములగు ననేకవిధములైన భోగములయందలి యిచ్ఛయును, మోక్షమనఁగా జనన మరణ రాహిత్యమైన శాశ్వతపదవియునై యుంచున్నవి. వీనిలో దేనినైనఁ బొందఁగోరి యంచునకుగా నన్నాశ్రయించెడు వార లర్థార్థులనఁబడుచున్నారు. ఇఁకను జ్ఞానులెట్టివారనఁగా, నాయు నిజస్వరూపము నెఱిఁగిన వారై యీ ప్రపంచమంతయు మిథ్యయనియు, నశాశ్వతమనియు, నిశ్చయజ్ఞానము గలవారై యైహికాముష్మికములలో దేనియందును నిచ్ఛలేనివారునై నన్నే పరమ ప్రాప్యముగ నెంచి ధ్యానించుచుండెడు వారు జ్ఞాను లనఁబడుచున్నారు. కాన నీ నాలుగు తరగతులవారును నన్ను భజించెడువారుగ నుంచున్నారు. అనఁగా నీలోకము నందలి జనులలో నన్ను భజించెడువారు ఇపుడు నేఁ జెప్పిన నాలుగు కారణములనుబట్టి నన్నాశ్రయించు చున్నారనుట.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమప్రియః॥ 17

అర్థము :— తేషామ్ = ఆ (నాలుగుతరగతులవారిలో), జ్ఞానినః = జ్ఞానియగు వానికి, అహమ్ = నేను, అత్యర్థమ్ = మిక్కిలి, ప్రియః = ప్రియుఁడను, సః + చ = ఆజ్ఞానియును, మమ = నాకు, ప్రియః = ప్రియుఁడు, హి = ఏలయనఁగా, జ్ఞానీ = జ్ఞానియగువాఁడు, నిత్యయుక్తః = (నాతో) నిత్యసంబంధముగలవాఁడును, ఏకభక్తిః = ఒక్క నాయందుమాత్రమే భక్తిఁగలవాఁడును (గనుక), విశిష్యతే = (ఆనలుగురిలో) శ్రేష్ఠుఁడగుచున్నాఁడు.

అయితే, ఓయి యర్జునా! ఇపుడు నేఁజెప్పిన నాలుగు తరగతులవారిలో, అనఁగా, ఆర్తుఁడు, జిజ్ఞాసుఁడు, అర్థార్థి, జ్ఞాని అను నీనలుగురిలో జ్ఞానియగువాఁ డెల్లప్పుడును నాయెడల భక్తిఁజేయుచుండును. ఆభక్తియున్ననో, తక్కిన ముగ్గురివలె నేదియో యొక ప్రయోజనార్థమైచేసెడు భక్తిగాదు. మఱేమనిన నిర్హేతుకమైన భక్తిచేయువాఁడుగ నుంచున్నాఁడు. అనఁగా "సర్వం విష్ణుమయం జగత్" అను నట్లు ప్రపంచమంతయు నాస్వరూపమే యనియు, నాకన్యమగు పదార్థ మొక్కటి యైన లేదనియుఁ జక్కఁగఁ దెలిసికొనినవాఁడై సదా నన్నే ధ్యానించుచు జ్ఞాన దృష్టిచే నాస్వరూపమునే చూచుచుండును. కాన నతఁడు నాయు నిత్యయుక్తుఁడు. అనఁగా, నాతో నెల్లప్పుడు సంబంధముగలవాఁ డగుచున్నాఁడు. మఱియు నట్టివాఁడు

నాకంటె నితరమగు దేని నాశ్రయింపక నన్నే పరమప్రాప్యముగ నెంచి భజించును గాన నట్టివాఁడు నాకేకభక్తుఁడనియును జెప్పఁదగి యున్నాఁడు. కనుకనే

"క|| జ్ఞానికి నేను బరోక్షుఁడఁ
గాను బరోక్షుండు నాకు గాఁ డతఁ డిది సు
జ్ఞానం బజ్ఞాన కియ్యది
గానఁడు తన్ను నన్నుఁ గానమి ననఘా!" (సీ. రా. ౨ ఆ. ౧౩౨)

అనుచున్నాను, నేనాతనిని నన్నాతఁడును నెల్లప్పుడును జూచుచునే యుందుము గాని మాయికపురిలో నొకరికొకరు కనఁబడకుండుట యెప్పుడును గలుగదు. కాన నాజ్ఞానినాకును నేనాతనికిని మిక్కిలి ప్రియతములమైయుందుము.

అర్జునుడు:— అయ్యా! నీవీప్రపంచమున కంతటికి నీశ్వరుఁడవును సమవర్తివియునై యుండఁగా నిన్ను భజించెడివారిలో నెవరెవ రేయేకారణమువలన భజించి ననుసరే వారందఱి యెడలను నీకు సమమైన ప్రేమ గలుగవలసి యుండఁగా నట్లుగాక వారిలో జ్ఞానులయెడలమాత్ర మెక్కువ ప్రేమగలిగి యుండుటయును దక్కినవారి యెడలఁ దక్కువ ప్రేమగలిగి యుండుటకును గారణమేమి? ఆర్తులు మొదలగు వారుగూడ నిన్నచంచల భక్తితోఁ గొల్చుచుండుటలేదా? ఇంతకుముందు నీవు చెప్పిన దృష్టాంతములోని గజేంద్రుఁడు ద్రౌపది మొదలగువా రెట్టి యచంచల భక్తిఁజేసిన దియు, వారల యాపదలకు నీవెట్టి సంభ్రమముతో నడ్డపడినదియు, నీ వెఱింగియుండుటయే గాక లోకమంతయు నెఱింగిన సంగతియే గదా? అట్టి విషయములో నీవిప్పుడు చెప్పెడుమాటలనుబట్టి చూడఁగా వారలభక్తి నికృష్టమైనదిగను, జ్ఞానుల యొక్క భక్తిమాత్ర ముత్కృష్టమైనదిగను నీ వెంచు చున్నట్లుగ పడుచున్నదే, అట్లైన యెడల నీవు గజేంద్రుఁడు మొదలగువారల మొఱలు వినినపు డట్టియాతురతతో నడ్డపడుటకుఁ గారణమేమి?

శ్లో|| ఉదారా స్సర్వఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥ 18

అర్థము:— ఏతే=ఈ (పైఁజెప్పఁబడిన), సర్వే=అందఱును, ఉదారాః+ఏవ=ఉత్కృష్టులే, జ్ఞానీ+తు=జ్ఞానియన్ననో, ఆత్మా+ఏవ=నేనే (అని), మే=నాయొక్క, మతమ్=అభిప్రాయము, హి=ఏలయనఁగా, సః=ఆ (జ్ఞానియగువాఁడు), యుక్తాత్మా=(నాయందే) చేర్చిన మనస్సుగలవాఁడై, మామ్+ఏవ=నన్నే, అనుత్తమామ్=సర్వోత్తమమైన, గతిమ్=ప్రాప్యమునుగా, ఆస్థితః=(ఎంచి) యున్నవాఁడు.

కృష్ణుడు:— ఓయియర్జునా! నేనిదివఱకుఁజెప్పిన నాలుగు తెగలవారియొక్క భక్తియందుండెడు నుత్కృష్టత నికృష్టతలనుబట్టి వారియెడలఁ దారతమ్యము నెంచిన వాఁడనుగాను. వారందఱు చేసెడు భక్తియు నుత్కృష్టమైనదే. కనుక వారందఱు నుత్కృష్టులనియే చెప్పఁదగి యున్నారు. అయితే వారలుచేయు భక్తియందుఁ గొంచెము తారతమ్యము గలదు. అది యేమనఁగా, ఆర్తులగువారు చేసెడు భక్తి యెంత యచంచలమైనదైనను వారికిఁగలిగియుండెడు బాధగాని యాపదగాని నివారణ కాఁగలందులకుఁగాఁ జేయుచున్నారుగాన నట్టిబాధగాని యాపదగాని నివారణమైనపిమ్మట వారికి నాయెడలఁ గృతజ్ఞతా సూచకముగఁగొంత భక్తియుండినను మొదటనుండినంత యచంచలమైన భక్తి యుండనేరదు. అర్థార్థియగువాఁడు, అనఁగా నేదేనియొక ప్రయోజనము గోరి నాయందుభక్తిఁజేయువాఁడును నట్లే తన కాప్రయోజనము సిద్ధించునంతవఱకే యట్టియచంచల భక్తిని జేయునుగాని యటుపిమ్మటఁ జేయఁజాలఁడు. ఇఁకను జిజ్ఞాసువన్ననో, నానిజస్వరూపము నెఱుఁగఁగోరి యందునకుఁ గాఁదగు ప్రయత్నముఁ జేయువాఁడు గనుక వాఁడుచేయు ప్రయత్నము సిద్ధించునంతవఱకు, అనఁగా వాఁడు నానిజస్వరూపము నెఱుఁగు నంతవఱకు వానికి నాయందు స్థిరమైన భక్తి కుదురఁజాలదు. ఇఁకను జ్ఞానియన్ననో నా నిజస్వరూపము నెఱిఁగిన వాఁడును, నాకంటె నితరమైనదేదియుఁ దన కాశ్రయింపఁదగినది లేదనియెడు నిశ్చయబుద్ధిగలవాఁడును, అనఁగా నన్నే పరమప్రాప్యముగ నెంచియుండువాఁడును గనుక నట్టివానికి నాయందుఁ గలిగియుండెడు భక్తి శాశ్వతమైనదిగ (చలింపనిదిగ) నుంచున్నది. కాన,

"క. జ్ఞానియనఁగ వేఱొక్కఁడె
నేనుసుమీ, తెలియనాతనికి నాకును సు
జ్ఞానముచేఁ బరికించినఁ
గానఁబడదు భేదమెందుఁ గవినుతచరితా!" (సీ. రా. ౨౫. ౧౩౧.)

అనునట్లు—జ్ఞానియేనేననియు, నేనే యాజ్ఞానియనియు, మాయుభయులకును నీషన్మాత్రమైన భేదములేదనియు, నాయభిప్రాయము.

అర్జు — అవును ఈ కారణములనుబట్టి జ్ఞానిగొడలఁ దక్కినవారియెడలనుండు నభిమానముకంటె నెక్కువ యభిమానముండవచ్చును సరేగాని యాజ్ఞానియే నీవనియు, నీవే యాజ్ఞానియనియు నెట్లెంచవచ్చును?

కృ — ఓయియర్జునా! ఇపుడు నేఁ జెప్పిన యంశమునందుండెడు సూక్ష్మమును నీవుగ్రహించి నట్లగపడదు గాన నిది నీమనస్సునకుఁ జక్కఁగఁ బట్టునట్లొక దృష్టాంతమూలముగఁ జెప్పుచున్నాను వినుము.

ఓయియర్జునా! నీవు క్షత్రియుండవును, మిగుల భుజబల పరాక్రమశాలివియునని ప్రసిద్ధిఁ జెందినవాఁడవై యున్నావు గదా! ఇట్టి నిన్నొకఁడు బలవంతుఁడగు శత్రువుచేఁ బీడితుఁడై వానివలని బాధఁదొలఁగింపుమని నిన్నుశరణుఁజొచ్చి యనేక విధములుగ స్తోత్రము సేయుచుఁ బ్రార్థించుచున్నాఁడు. అపుడు నీకు వానియెడలఁ గనికరముగలుగుచున్నదా లేదా? అట్లుకనికరము గలిగినవెంటనే వానిశత్రువును సంహరించి వానిబాధ నివారణచేయుదువుగదా! అంతటవాఁడు సంతోషించి తన దారినేపోవునా లేక అవలఁగూడ సిన్ను నాశ్రయించియే యుండునా?

అర్జు — వానియాపద నివారణమైన వెంటనే వాఁడు స్వేచ్ఛగా వెళ్లునేగాని యటుపిమ్మటఁ గూడ నన్నాశ్రయించి యుండవలసిన పనిలేదని తలఁచెదను.

కృ — మంచిది. అట్లే నీవలన నేదైన నొకప్రయోజనమునుగోరి మఱియొకఁడు నిన్నుశరణుఁజొచ్చి యాశ్రయించుచున్నాఁడు. వాఁడును నిట్లే తన బ్రయోజనము నెఱవేఱిన పిమ్మట సంతోషించి వెళ్లిపోవునా? లేక యింకను నిన్నాశ్రయించియే యుండునా?

అర్జు — నావలన నెవఁడేఁవ డేయేప్రయోజనమును గోరివచ్చి నన్నాశ్రయించు చున్నాఁడో వాఁడు వాఁ డాయా ప్రయోజనము సిద్ధించినవెంటనే సంతోషించివెళ్లి పోవునేగాని మరల నన్నాశ్రయింపవలసిన యగత్యముండునని నాకుఁ దోఁచదు.

కృ — అవునుగదా, ఇట్లే మఱియొకఁడు నిన్నాశ్రయించు చున్నాఁడని యెంచుకొనుము. వాఁడిప్పుడు నేఁ జెప్పినప్రకారమేలాటి ప్రయోజనమును నీవలనఁ బొందఁగోరి కాదుగాని నీవురాజశ్రేష్ఠుఁడవనియు, మిగుల భుజబలపరాక్రమశాలి వనియు, సత్యసంధుఁడవనియు, సకలసద్గుణగరిష్ఠుఁడవనియు, నిన్నుమించిన మఱి యొక ప్రభువులేఁడనియు నెంచి తానెల్లప్పుడు నిన్నాశ్రయించి నీయండఁబాయక నీవాఁడుగనుండుట తనకు సర్వోత్కృష్టమైన పనిగానెంచి నిన్నాశ్రయించుచున్నాఁడు. కాన వాఁడు నిన్నేదియు గోరకయే ప్రతిదినమును నీసేవఁజేయుచు నుంచున్నాఁడు. వానికి నీయందుఁగల భక్తిశ్రద్ధలనుజూచి నీవు వానియందుఁ గనికరించి వానికేదైన ధనకనకవస్తువాహనాదుల నీయంత నీవిచ్చినను వాన్నిని బుచ్చుకొనకయు, ఒకవేళవిధి లేక నీబలవంతమువలనఁ బుచ్చుకొనినను వానిని సరకుసేయక నీయభిమానము నొక్క దానినే కోరినవాఁడై నిర్హేతుకముగ సదా నీసేవఁజేయుచు నుంచున్నాఁడనియెంచి కొనుము. అట్టివాఁడు తక్కినవారివలెఁ గొంతకాలము వఱకు నిన్నాశ్రయించి పిమ్మట విడిచిపోవునని యెంచెదవా?

అర్జు — అట్టివాఁడు విడిచి పోవఁడనియు వాని జీవితకాలపర్యంతము నన్నా శ్రయించియే యుండుననియు నెంచఁదగియున్నది.

కృ — అవునుగదా? అట్టివానియందు నీకభిమానముండునా? ఉండదా? ఉండునెడల నింతకుముందు నేఁజెప్పిన యిద్దఱియందు నుండిన యభిమానమువంటిదిగనే యుండునా? లేక యంతకంటెఁ దక్కువదిగ నుండునా? యెక్కువదిగ నుండునా?

అర్జు — అట్టివానియందుఁ దక్కిన యందఱియందు నుండు నభిమానముకంటె నెక్కువగనే నాకుండవలసియుంచున్నది.

కృ — మంచిది. అట్టివానికి నొకానొకప్పు డొక గొప్ప యాపద సంభవించుచున్నదని, అనఁగా, వానిని మఱియొకఁడు నీయెదుటనే చంపఁబూనుకొనుచున్నాఁడని యెంచికొనుము. అపుడు వాడు నీప్రాపకమును జెందినవాఁడైయుండియుఁ దన్ను గాపాడుమని కోరకయేయుంచున్నాఁడు. అందువలన నీవువాని నుపేక్ష చేయుదువా? లేక వాని శత్రువును సంహరించి వాని యాపదను నివర్తింపఁ జేయుదువా?

అర్జు - అయ్యయ్యో!! నాయందట్టి నిర్హేతుకభక్తిశ్రద్ధలుఁగలిగి సదా నన్నే యాశ్రయించి నా సేవఁ జేయుచుండెడు వాఁడు నాప్రాణతుల్యుఁడుగదా? అట్టివానిని జంపవచ్చిన శత్రువును నన్నే చంపవచ్చినవానిఁగ భావించి వెంటనే నాప్రాణమునకు దెగించియైన వాని జంపకయుండునా? అట్లుచేయక యట్టి నాయాశ్రితు నుపేక్షించినయెడల నాజన్మమేల?

కృ — అవునుగదా? అప్పటికి నీవుచెప్పెడు మాటలనుబట్టి చూడఁగా నట్టి నీయాశ్రితునకుఁ గలిగెడు మేలు నీకుసొంత మేలుఁగను, వానికిఁ గలిగెడుకీడు నీకు సొంతకీడుగను భావించిన వాఁడవగు చున్నావుగదా?

అర్జు — అవును, ఇందునకేమియు సందియము లేదు!

కృ — అవునుగదా? ఇట్లే జ్ఞానియగువాఁడు ప్రపంచమంతయు మిథ్యయని యెఱిఁగి దేనిని నాశ్రయింపక నన్నే పరమ ప్రాప్యముగ నెంచి నాయందే భారము మోపి సదా నన్నే భజించుచుండెడు వాఁడుగదా! అట్టి నాభక్తుఁడు నాకు ప్రాణతుల్యుఁడుగ నుండుటయును, వాని యోగక్షేమములే నాయోగక్షేమములుగనే భావించుటయును, సహజమైనదిగ నీకుఁ దోఁచుచున్నదా? లేదా?

అర్జు — ఆహా! అవును; అట్టివాఁడు నీప్రాణతుల్యుఁడనియు, నీకును వానికిని భేదము లేదనియు, నీవుచెప్పినమాట సహజమైనదేయని నాబుద్ధికిపుడు చక్కఁగా నవగాహమైనది.

శ్లో॥ బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః॥ 19

అర్థము:— జ్ఞానవాన్ = జ్ఞానవంతుఁడు, బహూనామ్ = అనేకములైన, జన్మనామ్ = జన్మములకు, అన్తే = కడపట, సర్వమ్ = సమస్తప్రపంచము, వాసుదేవః = వాసుదేవస్వరూపము, ఇతి = అని, మామ్ = నన్ను, ప్రపద్యతే = ప్రపత్తిచేయుచున్నాఁడు, సః = అట్టి, మహాత్మా = మహానుభావుఁడు, సుదుర్లభః = మిక్కిలిదుర్లభుఁడు అనఁగా మిక్కిలి యరుదుగ నుండువాఁడు.

కృ — అయితే ఓయి యర్జునా! అట్టిమహానుభావుఁ డీలోకమున బహుసత్కృత్తుగా, అనఁగాఁ గోటిమందిలో నొకఁడుగానుండునుగాని సర్వసాధారణముగ నుండఁడు. అదేలయనఁగా వేలసంఖ్యలజనులలో నొకానొకఁడుమాత్రమే నన్నెఱుంగుటకు యత్నించుననియు, అట్లుయత్నించువారగు వేలకొలఁది జనులలో నొకానొకఁడు మాత్రమే ప్రయత్నసిద్ధిని బొందుననియు, అట్టివారిలోనైనను, అనేకవేలమందిలో నొకానొకఁడుమాత్రమే నాదునిజస్వరూపము నెఱుంగఁగలఁడనియు నిదివఱకు నీకుఁ జెప్పి యున్నానుగదా? (చూ. 7–3). కాన నట్లు నన్నెఱుంగఁగోరి నాయందు భక్తిఁజేసెడు వారలట్లు భక్తిఁజేయ నారంభించిన వెంటనే నన్ను గనఁజాలరు. అయితే వారలుచేసెడుభక్తియును వ్యర్థముకానేరదు. మఱేమనిన, వానివానిభక్తిశ్రద్ధలకుఁ దగినట్లు వానివానికి మరల నంతకంటె నుత్తమజన్మము గలుగుచుండుననియు, ఆజన్మయందు మరల నాయందు భక్తిఁజేయుచుండుననియు నిదివఱకే నీకుఁజెప్పి యుంటినిగదా? (చూ. 6–41–42). కాన నిట్లనేక జన్మలనెత్తుచు నొకజన్మకంటె మఱియొకజన్మయందు నాయెడల భక్తియు జ్ఞానమును క్రమక్రమముగ హెచ్చుచు రాఁగ రాఁగ నిట్లనేక జన్మముల నెత్తినపిమ్మట వానికి సంపూర్ణజ్ఞానమును నాయందలి సంపూర్ణమైనభక్తియుఁ గలిగినవాడగుచు నీప్రపంచమంతయు వాసుదేవ స్వరూపమేగాని తదితరమగు వస్తువణుమాత్రమైనను లేదనియెడు నిశ్చయజ్ఞానము గలవాఁడగును. అట్టినిశ్చయజ్ఞాన మెప్పుడు గలుగుచున్నదో అప్పుడు నన్నే పరమప్రాప్యముగ నెంచి యాశ్రయించునుగాని, నాకంటె నితరమగు దేనిని నాశ్రయింపఁడు. అట్టిస్థితి నెప్పుడువచ్చుచున్నాఁడో యప్పుడు వాఁడు నాకు ప్రాణతుల్యుఁడగును గాన నపుడు వానికిని నాకును భేదము లేదనియు, వాఁడే నేననియు, నేనే వాఁడనియుఁ జెప్పఁదగి యున్నది. కాబట్టి అటివాఁ డీప్రపంచమున మిక్కిలి యరుదుగ నుండును.

అర్జు:— అయ్యా! నిన్నెఱుంగఁగోరి భక్తిఁజేయు వాఁడిన్ని జన్మలేల యెత్తవలెను? వాఁడు నిన్ను భక్తిఁజేయ నారంభించిన జన్మయందే సంపూర్ణములైన జ్ఞానవైరాగ్యములు వానికేల కలుగఁగూడదు?

కృ — మంచిది, ఇంకొకటొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. జీవాత్మ పరమాత్మలకుఁ గలభేదమును గుఱించి నీకిదివఱకుఁ జెప్పి యున్నానుగదా? అనఁగా జీవాత్మ ప్రకృతిసంబంధముగలది యగుటచే రజితాదులగు నితరలోహములతో మిళితమైన బంగారము వంటిదనియు, పరమాత్మ యట్టిప్రకృతి సంబంధము లేనిది గనుక నట్టి యితరలోహ సంబంధములేని యపరంజివంటి దనియు నిదివఱకుఁ జెప్పియున్నానుగదా! (చూ. 2-16). అది జ్ఞాపకమున్నదా?

అర్జు — ఆహా, జ్ఞాపకమున్నది.

కృ — మంచిది, అటితర లోహములతోఁ జేరియుండెడు బంగారమును దానియందుండెడు మలినము నెత్తివేసి స్వచ్ఛమైన యపరంజిగాఁ జేయవలసినయెడల నేమి చేయవలెను?

అర్జు — పుటము వేసినయెడల నట్లు కాఁగలదు.

కృ — మంచిది, అట్లు పుటమువేసిన యెడల మొదటి పుటమునకే దానియందుండెడు మలిన మంతయుఁబోయి యపరంజి యగునా?

అర్జు :—అట్లు కానేరదు. మొదటిపుటమునకు దానియందుండెడు మలినము కొంతమట్టునకు హరించి వన్నె హెచ్చును; మఱియొక పుటము వేసినయెడల దానియందలి మలినము మఱికొంత హరించి వన్నె మఱికొంత హెచ్చును; ఇట్లు పుటములువేయుచు రాఁగరాఁగఁ దానియందుండెడు మలినము క్రమక్రమముగ హరించుచు వన్నె హెచ్చుచువచ్చి తుదకు స్వచ్ఛమైన యపరంజి యగును. అటుపిమ్మట నితరమగు నపరంజికిని దీనికిని నేమియుభేద ముండనేరదు.

కృ — అవునుగదా; అట్లే జీవాత్మయగు మనుష్యునకును ననేకజన్మ సంస్కారములవలననేగాని ప్రకృతి సంబంధమగు నజ్ఞానము నశింపనేరదు. అజ్ఞానము సంపూర్ణముగ నశించిననేగాని సుజ్ఞాని గానేరఁడు. అట్టి సుజ్ఞాని యెప్పుడగుచున్నాఁడో అప్పుడు పరమాత్మనగు నాకును వానికిని భేదముండనేరదు.

ఇట్లనేక జన్మసంస్కారము వలననేగాని సంపూర్ణ జ్ఞానము గలుగదనుటకు ననుభవ సిద్ధములగు దృష్టాంతములను జెప్పుచున్నాను వినుము.

ఈలోకమున ఋషులుగా నుండెడువారందఱు నెన్నియో జన్మలలోఁజేసిన తపోబలమువలనఁ బడసిన యింద్రియ మనోనిగ్రహశక్తిగలిగినవారై యట్టియున్నతస్థితికి వచ్చినవారగుచున్నారుగదా! అట్లుండియు నట్టివారుగూడ నొకానొకప్పుడు కామక్రోధములచే జలించిన మనస్సుగల వారగుచున్నారుగదా? అనఁగాఁ గొందఱు ఋషులొకానొకప్పుడు స్త్రీలనుజూచి మోహపరవశులైనట్లును, మఱి కొందఱు ఋషులేదియో యొక కారణమునుబట్టి కొంతఱియెడలఁ గోపోద్దీపితులై

శపించినట్లును వినుచున్నాముగదా! అట్టి ఋషులు పండిన తపస్సుగలవారయ్యును గామక్రోధాముల నడచజాలక తపోభంగమును జెందినవారైనట్లిందువలన స్పష్టమగుచున్నదిగదా? కనుక,

"క॥ చిత్తేంద్రియో పరమము మ
హత్తరమిది యెల్లవారి కబ్బదు వినుమ
య్యుత్తమదశ గలిగిన వి
ద్వత్తముఁ డతిదుర్లభుఁడుసదా మన్మయుడున్" (సీ. రా. 3 ఆ. ౧౩౯)

అనునట్లు అట్టి బలవంతములైన కామక్రోధాదులు బొత్తిగ నంకురింపకుండునంత స్థిరమైన చిత్తమందఱికి నబ్బనేరదు. అది యొకానొకనికబ్బుట యనేకజన్మముల సంస్కారమువలననేగాని తటస్థింపదు గాన నట్టియుత్తమదశను బొందినవాఁడు నాతో సమానుఁడనియును, అట్టివాఁడు బహుసకృత్తుగ నుండుననియు నెఱుంగుము.

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః ।
తతం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా ॥ 20

అర్థము :— స్వయా = స్వకీయమైన, ప్రకృత్యా = స్వభావముచేత, హృతజ్ఞానాః = అపహరింపఁబడిన జ్ఞానముగలవారలు, తైః + తైః = ఆయాస్వభావముల కనుగుణ్యములగు, కామైః = కోరికలచేత, నియతాః + (సన్తః) = ప్రేరేపింపఁబడినవారగుచు, అన్యదేవతాః = (నాకంటెనితరములగు) దేవతలనుగూర్చి, తమ్ + తమ్ = ఆయాదేవతల కనుగుణ్యములగు, నియమమ్ = నిష్ఠను, ఆస్థాయ = అవలంబించి, ప్రపద్యన్తే = ప్రపత్తిచేయుచున్నారు.

ఓయి యర్జునా! ఈలోకమునందలి జనులలోఁ బుణ్యాత్ములుగా నుండువారిదివఱకు నేఁజెప్పిన ప్రకారము నాలుగువిధములైన కారణములచేత, అనఁగా, ఆర్తిచేతను, జిజ్ఞాసచేతను, అర్థాపేక్షచేతను, జ్ఞానముచేతను, నన్ను భజింపుచున్నారని చెప్పియుంటిని గదా! (చూ. 7–16). తక్కినవారుగూడ నన్నారాధింపకపోయినను వారివారి పూర్వజన్మ సంస్కారమువలనఁ గలిగెడు స్వభావముల కనుగుణ్యములగు కోరికలు గలవారై యాయాకోరికల నివ్వఁదగిన యన్యదేవతల నుద్దేశించి యేయే దేవత నేయేవిధముగ నారాధింపవలయునని శాస్త్రాదులయందు విధింపఁబడియున్నదో ఆయాదేవతల నాయావిధానముల నవలంబించి యారాధింతురు. అదెట్లనఁగా, నట్టివారిలోనుగూడ నుత్తమ మధ్య మాధమములగు స్వభావములు గల వారలున్నారు గాన నందుత్తమస్వభావముగల వారలిహమునందు ధనకనక వస్తువాహనాది సంపదలను, పరమునందు రంభాసంభోగాది స్వర్గభోగములను గోరినవారై యట్టియన్యదేవతల

యందు నుత్తమములగు నింద్రాది దేవతల నుద్దేశించి వారికిఁ బ్రీతికరములగు నగ్నిష్టోమాది క్రతువుల చేతను, సూర్యాదినవగ్రహములను వారికిఁ బ్రీతికరములగు నమస్కారాదులచేతను నారాధింతురు. మధ్యమస్వభావముగలవారలు సంతానాది కోరికలు గలవారలై యశ్వత్థాదులను బ్రదక్షిణాది విధానములచే నారాధింతురు. అధమస్వభావముగలవారన్ననో పరహింసాదికృత్యములయం దిచ్ఛగలవారై తదనుగుణ్యములగు భేతాళుడు, కాటేరి, అంకమ్మ, పోలేరమ్మ మొదలగు క్షుద్రదేవతలను బలులు మొదలగువానిచే నారాధింతురు.

శ్లో॥ యో యో యాం యాం తనుం భక్త శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్॥ 21

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్॥ 22

అర్థము :— యః + యః + భక్తః = ఏయేభక్తుఁడు, యామ్ + యామ్ + తనుమ్ = ఏయేదేవతాస్వరూపమును, శ్రద్ధయా = ఆసక్తితో, అర్చితుమ్ = ఆరాధించుటకొఱకు, ఇచ్ఛతి = ఇచ్ఛయించుచున్నాఁడో, తస్య + తస్య = ఆయాభక్తునికి, తామ్ + శ్రద్ధామ్ = అట్టియాసక్తిని, అచలామ్ = చలింపనిదానిఁగా, అహమ్ + ఏవ = నేనే, విదధామి = చేయుచున్నాను, సః = ఆభక్తుఁడు, తయా + శ్రద్ధయా = అట్టిశ్రద్ధతోడ, యుక్తః + (సన్) = కూడుకొనినవాఁడై, తస్య = ఆదేవతయొక్క, ఆరాధనమ్ = ఆరాధనమును, ఈహతే = ఇచ్ఛతోఁజేయుచున్నాఁడు, తతః + చ = అట్టియారాధనమువలనఁగూడ, మయా + ఏవ = నాచేతనే, విహితాన్ = కలుగఁజేయబడినవియు, హితాన్ = ఇష్టములైనవియునగు, కామాన్ = కోరికలను, లభతే = పొందుచున్నాఁడు.

అయితే, అట్లెవఁడెవఁడేయే దేవత నేయేమూర్తిగ భావించి యేలాటి శ్రద్ధాభక్తులతోఁ బూజింప నిశ్చయించుచున్నాఁడో వానివాని కాయా దేవతలయెడలఁ గలిగియుండెడు భక్తిశ్రద్ధలు చలింపకుండునట్లు నేనే చేయుచున్నాను. కాన వాఁడట్టి యచంచలభక్తిచే నట్టిదేవత నారాధించుచు నట్టియారాధనమువలనవాఁ డేయేఫలమును గోరి యట్టి యారాధనమును జేసెనో ఆయాఫలమును నాచేతనే యివ్వఁబడి పొందుచున్నాఁడు. అదెట్లనఁగా వివరించి చెప్పుచున్నాను వినుము. 'ఈప్రపంచమునంగల దేవమనుష్యాదులును, పశుపక్ష్యాది తిర్యగ్జంతువులును, తక్కిన యచేతనపదార్థములన్నియును, నాకంటె నితరములైన యీప్రపంచమున నణుమాత్రమైన లేవనియును నిదివఱకే నీకుఁజెప్పియుంటినిగదా ? (చూ. 7-7). మఱియు నెవరెవ రేయేవిధముగ

నన్నుపాసించుచున్నారో, వారివారి నాయావిధముననే యనుగ్రహించుచున్నానని యును చెప్పియుంటినిగదా! (చూ. 4-11). ఇట్టి విషయములలో నెవఁడేని యేమూర్తినైననుసరే, యారాధించునపుడు వాఁడామూర్తి రూపముగనుండు నన్నే యారాధించినవాఁ డగుచున్నాఁడు గదా? అట్టియారాధనమువలన వాఁడు పొందెడు ఫలము వాని కామూర్తివలన నివ్వఁబడినట్లెంచఁబడుచున్నదిగదా! కనుక వానికా ఫలమును, ఆమూర్తిరూపముగనుండు నేనే యిచ్చినవాఁడ నగుచున్నానుగదా? మఱియు నొకఁడెవ్వఁడైతే యొక మూర్తి నారాధించి తన యిష్టావాప్తిని బొందుచున్నాఁడో, అపు డట్టికోరికెలుగల మఱికొందఱును ఆమూర్తినే కొలిచినయెడలఁ దమకోరికలుగూడ సిద్ధించుననియెడు నమ్మకము గలిగి యామూర్తియెడల నచంచలమగుభక్తిని జేయుచుందురుగదా! అపుడు వారికట్టియచంచలభక్తిని ఆమూర్తిరూపమగు నేనే కలుగఁజేసినవాఁడనగుచున్నానుగదా! కనుక వారలుగూడ నజ్ఞానకృతముగనైనను నన్నే యారాధించినవారును, నావలననే తమ యీప్సితార్థములఁ బడసిన వారును అగుచున్నారు.

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥ 23

అర్థము:— అల్పమేధసామ్ = అల్పబుద్ధిగల, తేషామ్ = వారలకు (అన్యదేవతారాధనపరులకు), తత్ = ఆ (అట్టియన్యదేవతారాధనమువలనఁ గలిగెడు), ఫలమ్ + తు = ఫలమన్ననో, అన్తవత్ = అంతముగలదిగా, భవతి = అగుచున్నది, దేవయజః = (అన్య) దేవతారాధనచేయువారలు, దేవాన్ = (అట్టి) దేవతలను, యాన్తి = పొందుచున్నారు, మద్భక్తాః + అపి = నాభక్తులన్ననో, మామ్ = నన్ను, యాన్తి = పొందుచున్నారు.

అయితే, అట్టివారలు పొందెడుఫలము అంతముగలదిగా, అనఁగా శీఘ్రకాలమున నశింపఁదగినదిగానుండును. ఏలయనఁగా, అట్టివారలు స్వల్పబుద్ధి గలవారలు గనుక వారలబుద్ధికిఁదగినట్లు స్వల్పఫలములనుగోరి యట్టిస్వల్పఫలముల నియ్యఁదగిన దేవతాంతరముల నాశ్రయించుచున్నారు. ఇఁకను నాభక్తులన్ననో, అట్టి స్వల్పబుద్ధి గలవారలు కారుగనుక శాశ్వతమగు మోక్షమనియెడు ఫలమును గోరినవారై యట్టి ఫలమునియ్యఁదగిన నన్నాశ్రయింతురు. ఇందున కొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఆదేశమున, ఒక రాజ్యమునేలెడు ప్రభువొకఁడు గలఁడనుకొనుము, ఆ ప్రభువు తనదేశమునందంతట ధర్మశాలలను, అనఁగా, బ్రాహ్మణులకు నిత్యసంతర్పణ జరిగించుటకుగాను గొన్నిశాలలను, తక్కినజనులకు నన్నప్రదానము సేయుటకుఁదగినశాలలు

కొన్నియును, కేవలహీనకులస్థులగువారికిఁ దగిన యాహారములగు అంబళ్లు మొదలగు వాని నిచ్చుటకుఁ దగినశాలలు కొన్నియును, దాహముమాత్రము కావలసినవారికి మజ్జిగ, మంచినీళ్లు మొదలగునవి యిప్పించుటకుఁ దగినశాలలు కొన్నియును, అచ్చటచ్చట నేర్పఱచి యాయాశాలలకు నొక్కొక యధికారిని నియమించియున్నాఁడని యెంచికొనుము. అట్టివిషయములో, ఆకలిఁగొనిన బ్రాహ్మణుఁడు సంతర్పణ జరిగెడుశాలకును తదితరులగు జను లితరకులసుల కన్నప్రదానము జరిగెడు శాలలకును, కేవల నీచజాతివారలు, అంబళ్లు మొదలగునవి పోసెడుశాలలకును, కేవల పిపాసాపరులు మంచినీళ్లు మొదలగు వానినిచ్చెడుశాలలకును బోయి యాయాశాలాధికారుల నాశ్రయింతురా, లేక, ఆ ప్రభువు నొద్దకుఁ బోయి యాప్రభువు నాశ్రయింతురా ?

అర్జు — అట్టివారలకుఁ బ్రభువు నాశ్రయించవలసిన పనియేమియున్నది ? ఆయాధర్మములను జరిగించుటకుగా నొక్కొకయధికారిని బ్రభువు నియమించియే యున్నాఁడు గనుక నంను దేనిదేనిఁగోరెడువాఁడు దానదానిఁబొందఁదగిన శాలాధికారినొద్దకుఁబోయినయెడల నయ్యదిలభింపఁ గలదు గాన నాయాశాలాధికారినొద్దకే పోవునుగాని ప్రభువునొద్దకుఁ బోవఁడనియే చెప్పఁదగియున్నది. సరేకదా, అట్టివారి కాప్రభువునొద్దకుఁ బోవఁదగిన యావశ్యముగాని యోగ్యతగాని యుండనేరదని చెప్పఁదగియున్నది.

కృ — అవునుగదా, మంచిది. ఇది యిట్లుండఁ జతుశ్శాస్త్రపండితుఁడును, కవీశ్వరుఁడును అగు నొక బ్రహ్మణోత్తముఁ డాప్రభువునకుఁ దనయోగ్యతను, ప్రావీణ్యతను గనఁబఱచి యాయనవలనఁ దన వంశపారంపర్యముగాఁ జరుగఁదగిన యొకశ్రోత్రియమును సంపాదింపఁగోరి పోవుచున్నాఁడు, ఆయన యిదివఱకుఁ నేఁజెప్పిన ధర్మశాలాధికారి యొద్దకుఁ బోవునా, లేక, ప్రభువునొద్దకే నేరుగాఁబోవునా?

అర్జు — అట్టివానికి నీపర్ణశాలలలో లభ్యపడఁదగిన వానియందేదియు నక్కఱయుండదు గనుకను, ఆయనయొక్కయోగ్యతను గనిపెట్టఁదగిన శక్తియు, అందుకుఁ దగిన యీవి నియ్యఁదగిన శక్తియు నాప్రభువునందు మాత్రమే యున్నదిగాన నట్టివాఁ డాప్రభువునొద్దకే నేరుగాఁ బోవునుగాని తదితరులగు నేయధికారులయొద్దకును బోవఁడనియే చెప్పఁదగియున్నది.

కృ — అవునుగదా, అట్లే యీ ప్రపంచమునం దవివేకులుగా నుండు వారు స్వల్పఫలములను గోరి యాఫలముల నియ్యఁదగిన యన్యదేవతలనే యాశ్రయింతురనియు, వివేకులగువారు నన్నుఁదెలిసికొనినవారై యిదివఱకు నేఁజెప్పిన చతుర్విధ పురుషార్థములలో దేనినైనఁ గోరినవారై నన్నే యాశ్రయింతురనియు నెఱుంగుము,

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మామబుద్ధయః ।
పరంభావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్ ॥ 24

అర్థము :— అబుద్ధయః = బుద్ధిహీనులు, అవ్యయమ్ = వ్యయములేనిదియు, అనుత్తమమ్ = ఉత్తమోత్తమమైనదియు, పరమ్ = ప్రకృతికంటెవిలక్షణమైనదియు నగు, మమ + భావమ్ = నాస్వరూపమును, అజానన్తః + (సన్తః) = తెలియనివారగుచు, అవ్యక్తమ్ = వ్యక్తుఁడు కాని (చక్షురాదీంద్రియములకు గోచరించని), మామ్ = నన్ను, వ్యక్తమ్ + అపన్నమ్ = గోచరత్వమునుబొందినవానిగా, మన్యన్తే = తలఁచుచున్నారు.

అట్లవివేకులుగా నుండెడువారు నన్నాశ్రయింపక యన్యదేవతల నాశ్రయించుటకుఁ గారణమేమనఁగా, అట్టివారు నాశరహితమైనట్టియు, సర్వోత్తమమైనట్టియు, ప్రకృతికి విలక్షణముగ నుండునట్టియు, నానిజస్వరూపము నెఱుంగఁజాలక చక్షురాదీంద్రియములకు నగోచరుఁడనగు నన్ను గోచరములగు చిల్లరదేవతలనుగ భావించి యారాధింపుచుందురు. అదెట్లనఁగా, ఇపుడు నేఁ జెప్పినదృష్టాంతములోని ప్రభువుగానుండెడు వానినందఱును జూడఁజాలరుగదా ? ఆప్రభువు నెపుడును గని విని యెఱుగని వారా ప్రభువుచే నియమింపఁబడిన ధర్మశాలలకుఁ బోయినపుడచ్చటచ్చట నాయాధర్మముల నాప్రభువుయొక్క నియమనానుసారముగ నెఱవేర్చుచుండెడు నాయాయధికారినిజూచి యతఁడే యాధర్మమును జేయుచుండెడు ప్రభువని యెంచి కొందురుగదా ? అట్లే యీలోకమునందు నాస్వరూపము నెఱుఁగజాలని యవివేకులును దామారాధించుచుండెడు దేవతలనే నాస్వరూపములుగ భావింతురు.

శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః ।
మూఢోఽయంనాభిజానాతి లోకో మామజమవ్యయమ్ ॥ 25

అర్థము :— అహమ్ = నేను, యోగమాయాసమావృతః + (సన్) = యోగమాయచేఁగప్పబడినవాఁడనై, సర్వస్య = సమస్తజనమునకు, ప్రకాశః = గోచరించువాఁడను, న = కాను, మూఢః = వివేకములేని, అయమ్ = ఈ, లోకః = జనము, అజమ్ = జన్మరహితుఁడనైనట్టియు, అవ్యయమ్ = నాశనరహితుఁడనైనట్టియు, మామ్ = నన్ను, న + అభిజానాతి = ఎఱుఁగఁజాలరు.

అదేలయనఁగా, ఇపుడు నేఁ జెప్పిన యాప్రభువు రాజగృహాంతఃపురమునందుండుటచేఁ దద్గృహాంతరవర్తులకును, తత్పరివారజనములకును, తత్సభాసదులకును, మఱియు నేదేని యొక కార్యార్థమా రాజసభకుఁబోవుచుండెడు వారికిని, మఱియు నాప్రభువును జూడకపోయినను, ఆరాజ్యమంతయు నొకప్రభువుచేఁ బరిపాలింపఁ

బడుచున్నదనియు నా ప్రభు వారాజగృహమున నున్నాఁడనియుఁ దమవివేకముచేతఁ దెలిసికొనఁదగినవారికినిదప్ప దక్కినవారికట్టి ప్రభువొకఁడున్నట్లును, ఆప్రభువు యొక్క యాజ్ఞవలననే యాధర్మశాలలు మొదలగునవి యా యా యధికారులవలన నెఱవేర్పఁబడుచున్నవనియు నెఱుఁగఁజాలక యారాజునాజ్ఞానుసారముగ నేయే ధర్మము నేయేయధికారి నిర్వర్తించుచున్నాఁడో, ఆయా యధికారియే యా యా ధర్మమునకుఁ బ్రభువని యెట్లు తలంతురో, అట్లే నేను యోగమాయాపరిచ్ఛిన్నుఁడ నగుటచే నీలోకమునందలి జనులకందఱకును ప్రకాశుఁడనుగాను, అనఁగా నీలోకము నందలిజనులందఱును నన్నెఱుఁగఁ జాలరనుట. అనఁగా నీలోకమునందలి జనులలో వివేకులుగానుండెడు వారుమాత్రమే నన్నుఁజూడక పోయినను నేఁజేయుచుండెడు సృష్టిస్థితిలయాది కార్యములవలన జననమరణాదులులేని పరమాత్ముఁడనగు నేను సర్వాంతర్యామిగానున్నాఁడనని యెఱుఁగఁగలరు గాని మూఢులుగా నుండెడి జనుల లెఱుఁగఁజాలరు.

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున!
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన॥ 26

అర్థము:— హే అర్జున ! = ఓయియర్జునుఁడా !, అహమ్ = నేను, సమతీతాని = కడచిపోయినట్టియు, వర్తమానాని + చ = ఇపుడుండునట్టియు, భవిష్యాణి + చ = ఇఁకముందు కలుఁగఁబోవునట్టియు, భూతాని = ప్రాణులను, వేద = ఎఱుఁగుదును, మామ్ + తు = నన్నన్ననో, కశ్చన = ఎవఁడును, న + వేద = ఎఱుఁగఁడు.

అయితే, ఓయియర్జునా ! ఇదివఱకు నేఁజెప్పినదృష్టాంతములోని యల్పజనులా యధికారులనే ప్రభువులనుగానెంచి వారలను నియమించియుండెడు నిజమైన ప్రభువును దెలిసికొనఁజాలకపోయినను, ఆప్రభువు మాత్రమెట్లు భూతభవిష్యద్వర్తమాన కాలములయం దాయా ధర్మశాలలలో జరుగుచుండెడు పనులను దెలిసికొనుచు, నందుకుఁ గావలసిన సమస్తవస్తుసామగ్రుల నిప్పించుచు, నేయేధర్మశాలయం దేయే జనులకు నేయే కాలములయం దేలాటియాదరణ జరుగవలసియుండునో, ఆయాధర్మశాలలయం దాయాజనులకు నాయా కాలములయం దాలాటియాదరణజరుగుచుండునట్లు తగునేర్పాట్లను జేయుచుండెనని తలఁచెదవా లేక, అట్టి యల్పజనులు తన్నుఁ దెలిసికొనలేదనియెడు కారణమునుబట్టి యాయా ధర్మశాలలను నిలిపివేయునని తలఁచెదవా ?

అర్జు — అట్లు నిలిపివేయునని యెంతమాత్రమును దలంపఁజాలను. అల్పులుగానుండెడు జనులు కొందఱు వారల యవివేకముచేత నాధర్మములను జరిగించుచుండెడు తన్నుఁ దెలిసికొనలేకపోయినంతమాత్రముచేతఁ దాను బారమార్థికముగ

జేయుచుండెడు ధర్మమును నిల్పివేసినయెడల నట్టిప్రభువుకూడ నాస్వల్పజనులవలెనే తానును స్వల్పబుద్ధిగలవాఁడే యగునుగదా? కాన నట్లు చేయఁడనియే యెంచఁదగి యున్నది.

కృ — అవునుగదా, అట్లే యీసమస్తప్రపంచమునకును సృష్టిస్థితి లయకర్త నగు నన్ను నీలోకమున నజ్ఞానులుగనుండెడు వారలెఱుంగక పోయినను, వారలకేమి, ఇతరులకేమి, ఇది వఱకు జరిగినట్టియు ఇపుడు జరుగుచుండునట్టియు, ఇకఁను జరుగఁ బోవునట్టియు, స్థితిగతులను నేను జక్కఁగ నెఱుఁగుచు నేయేకాలమున నెవరెవరి కెయ్యది యేయేవిధముగ జరుగవలయునో, అయాకాలమున వారి వారి కయ్యది యాయావిధముగ జరుగునట్లు చేయుచునే యుందునుగాని వారు నన్నెఱుంగక యుండిరనియెడు కారణమునుబట్టి నేను వారలనెప్పటికిని యుపేక్షించియుండుట లేదని యెఱుంగుము.

అర్జు — ఇట్టి నిన్ను సర్వసాధారణముగ నందఱు నెఱుంగలేక పోవుటకుఁ గారణమేమి?

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత!
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప॥ 27

అర్థము :— హేభారత + పరంతప = భరతవశంజుఁడవగు నోయర్జునా, సర్వభూతాని = సకలజంతువులు, ఇచ్ఛాద్వేషసముత్థేన = కామక్రోధములవలనఁ గలిగిన, ద్వన్ద్వమోహేన = సుఖదుఃఖాది ద్వంద్వరూపకమగు మాయచేత, సమ్మోహమ్ = అజ్ఞానమును, సర్గే = జననకాలమునందు, యాన్తి = పొందుచున్నవి.

కృ — అందుకుఁగారణమును జెప్పుచున్నాను వినుము.

ఇంతకుముందు నీవునన్నొక ప్రశ్న చేసియున్నావు, ఏమనఁగా, ప్రతిపురుషుఁడును అనిచ్ఛాపూర్వకముగనైనను బలాత్కారముగఁ బ్రేరేపింపఁబడినవానివలె, బాపము సేయుచున్నాఁడే యని యడిగియున్నావుగదా! (చూ. 3-36). అందునకు నుత్తరముగా నేను రజోగుణ సముద్భవములైన కామక్రోధములచేత నట్లుప్రేరేపింపఁ బడుచున్నాఁడనియు, ఆ కామక్రోధములు రెండును జ్ఞానము నావరించుచున్నవనియు, కాననవి జ్ఞానికి నిత్యవైరులనియు చెప్పియుంటినిగదా (చూ. 3-36-39)? జ్ఞాపకమున్నదా?

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ :— ఆకామక్రోధములే ఇచ్ఛాద్వేషము లనఁబడుచున్నవి. ప్రతిపురుషుఁడును అట్టి యిచ్ఛాద్వేషములచేత శీతోష్ణాది ద్వంద్వములవలన సుఖదుఃఖముల ననుభవించుచున్నాఁడు. అవెట్లనఁగా, శీతోష్ణములు — లాభనష్టములు — జయాపజయములు—

శుభాశుభములు – మానావమానములు – మొదలగునవి ద్వంద్వములనఁబడు చున్నవిగదా ? ఈద్వంద్వములలోఁ గొన్ని సుఖకరములుగను, కొన్ని దుఃఖకరములుగను ఉండునుగదా ? సుఖకరములుగ నుండువానియం దిచ్ఛయు, దుఃఖకరములుగ నుండువానియందు ద్వేషబుద్ధియు, ప్రతిపురుషునకును సహజముగ నుండును గదా ? అట్లుండుటయే యజ్ఞానమనఁబడును. ఏలయనఁగా, అట్టి సుఖదుఃఖ కారణములగు ద్వంద్వములయం దిచ్ఛా ద్వేషములుండు నంతవఱకు నాత్మజ్ఞానము గలుగ నేరదనియు, అట్టి యిచ్ఛాద్వేషము లెప్పుడు లేకపోవుచున్నవో అప్పుడు వాని మనస్సు నిర్మలమైనదగుచున్నదనియు, అనఁగా, జ్ఞానోత్పత్తి యగుచున్నదనియు నిదివఱకే నీకుఁ జెప్పియుంటినిగదా ? (చూ. 2–64–65). కనుక నట్టి యిచ్ఛాద్వేషములవలన ద్వంద్వములగు సుఖదుఃఖములును, అట్టి సుఖదుఃఖములవలన మోహరూపమగు నజ్ఞానమును, ప్రతిజీవుని నావరించి యున్నదని యెఱుంగుము. కాన నాజీవుఁడు మరల మాతృగర్భముఁజొచ్చి జన్మించునపుడుగూడ నట్టి యజ్ఞానముచే నావరింపఁబడియే యుండునుగాని దానివిడిచి జీవుఁడెప్పుడు నుండనేరఁడు. కాఁబట్టి ప్రతిపురుషుఁడును అజ్ఞానముచే నావరింపఁబడియే జన్మించుచున్నాఁడని చెప్పవలసియున్నది. అట్టి యజ్ఞానముచే నెవఁడైతే జననకాలమునుండి యావరింపఁబడియున్నాఁడో, అట్టివాఁడు నన్నెఱుఁగజాలడుగదా ?

అర్జు — అయ్యా ! ఇట్లు చెప్పితివిగదా, దీనింబట్టిచూడఁగా సకల ప్రాణులును జననకాలమునందే యజ్ఞానముచే నావరింపఁబడి నిన్నెఱుఁగజాలకున్నట్లగపడుచున్నదే, ఇట్టి విషయములో నిన్నెటింగెడు కొందఱైన నెట్లెఱుంగఁ గలుగుదురు ? అందున కుపాయమేది ?

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ 28

అర్థము :—పుణ్యకర్మణామ్=పుణ్యకర్మలఁజేసినట్టి, జనానామ్=మనుష్యులలో, యేషామ్=ఎవరియొక్క, పాపమ్+తు=పాపమైతే, అన్తగతమ్=అంతరించినదగుచున్నదో, తే=(అట్టి) వారలు, ద్వన్ద్వమోహనిర్ముక్తాః=శీతోష్ణాదిద్వంద్వములవలనఁ గలిగెడు సుఖదుఃఖరూపమగు నజ్ఞానముచే విడువఁబడినవారును, దృఢవ్రతాః=దృఢమైన పూనికగలవారునునై, మామ్=నన్ను, భజన్తే=భజింపుచున్నారు.

కృ — ప్రతిజీవుఁడు నట్టియజ్ఞానమును దొలఁగించికొనుటకుఁదగిన సాధనమగు బుద్ధినిగూడ నిచ్చియున్నాననియు, దానిని జక్కఁగ నుపయోగించుకొనువారట్టి యజ్ఞానమును దొలగించుకొనఁగలరనియు, ఇదివఱకే చెప్పియుంటినిగదా ! కనుక నట్లు కొందఱు తమబుద్ధిబలముచే యుక్తాయుక్త వివేచనము గలవారలై సత్కర్మల

నాచరించుచుందురు. అట్టి సత్కర్మలచేఁ బాపములు కొంత హరించి వారలు పుణ్యలోక ప్రాప్తిజెందుదురు. అట్టి బుణ్యలోక సుఖము ననుభవించిన పిమ్మట "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అనునట్లు మరల నీలోకమున జన్మింతురు. అట్లు జన్మించుటలోఁ బూర్వజన్మ సంస్కారమునుబట్టి యంతకంటెఁ గొంచెము మేలైనజన్మము నెత్తి పూర్వజన్మవాసనావశమున మునుపటికంటెఁ గొంచెమెక్కుడుగ సత్కర్మల నాచరించుచుందురు. అట్లనేకజన్మల నెత్తుచు నొకజన్మకంటె మఱియొక జన్మయందు నెక్కుడుగ సత్కర్మల నాచరించుచు రాగఁరాఁగ గొంత కాలమునకు వారలపాపము బొత్తిగ నశించునుగాన నట్లుపుణ్యకర్మలఁజేయుచు వచ్చెడు వారలలో నెవరియొక్క పాపము బొత్తిగ నంతరించి పోవుచున్నదో, అట్టివారలకు జ్ఞానోదయమగును. అట్లు జ్ఞానోదయ మెప్పుడగుచున్నదో అప్పుడువారు శీతోష్ణాది ద్వంద్వములచేఁ జలింపనివారును దృఢచిత్తముగలవారునునై నన్ను భజింపుదురు.

శ్లో॥ జరామరణమోక్షాయ మా మాశ్రిత్యయతన్తి యే।
తే బ్రహ్మ త ద్విదుఃకృత్స్న మధ్యాత్మంకర్మ చాఖిలమ్ ॥ 29

అర్థము :– యే=ఎవరు, కృత్స్నమ్+అధ్యాత్మమ్=ప్రపంచమునందలి సకల చరాచరములయందు వ్యాపించియుండునట్టి యాత్మను, అఖిలమ్+కర్మ+చ= (సృష్ట్యాది) సమస్తకర్మమును, తత్+బ్రహ్మ=ఆబ్రహ్మస్వరూపమునుగా, విదుః= ఎఱుఁగుచున్నారో, తే = అట్టివారు, మామ్ = (అట్టిపరబ్రహ్మనగు) నన్ను. ఆశ్రిత్య=ఆశ్రయించి, జరామరణమోక్షాయ=జరామరణమునుండి విముక్తికొఱకు (అనఁగా మోక్షముకొఱకు), యతన్తి=యత్నించుచున్నారు.

అదెట్లనఁగా, అట్లు జ్ఞానోదయమైనవారలీప్రపంచమునందలి సమస్తచరాచరములయందు వ్యాపించియుండునట్టి, అనగా, సర్వాంతర్యామిగానుండునట్టి యాత్మయును సృష్ట్యాది సమస్తకర్మమును నాపరబ్రహ్మస్వరూపమే యని యెఱుంగఁగలరు. అనఁగా, ఆ పరబ్రహ్మ స్వరూపముగానిది యేదియు నీప్రపంచమున నణుమాత్రములేదని స్పష్టముగఁ దెలిసికొనఁగలరు. అట్లెఱుఁగుట యనేకజన్మసంస్కారమువలనఁ గాని కలుగనేరదనియు, అట్టియెఱుక గలిగినపిమ్మట సర్వము వాసుదేవస్వరూపమని తెలిసి నన్నే యాశ్రయింతురనియు, అట్టివార లీలోకమున బహుఅసక్తుగ నుందురనియు నిదివఱకే నీకుఁ జెప్పియుంటినిగదా ? (చూ. 7–19). మఱియు నశాశ్వతములగు స్వల్పఫలముల గోరెడువా రట్టిఫలముల నియ్యఁదగిన యన్యదేవతల నాశ్రయింపుదురనియు, శాశ్వతఫలమగు మోక్షమును గోరెడువారట్టిఫలము నియ్యఁదగిన నన్నే యాశ్రయింతురనియుఁగూడ నిదివఱకే నీకుఁజెప్పియున్నానుగదా? (చూ. 7–20–23). కనుక నట్లెవరై తేయెఱిఁగినవా రగుచున్నారో, అట్టివారలు జననజరామరణ

రాహిత్యమైన మోక్షముదప్పఁ దక్కినయన్ని ఫలములును నశాశ్వతములైనవియే యని తెలిసికొనినవారై యట్టిశాశ్వతమగు మోక్షమునుగోరి యట్టిఫలము నియ్యఁదగిన పరమాత్ముఁడనగు నన్నే యాశ్రయింతురని యెఱుంగుము.

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥ 30

అర్థము:— యే = ఎవరు, మామ్ = నన్ను, సాధిభూతాధిదైవమ్ = అధిభూత-అధిదైవములతోఁగూడినవానిగాను, సాధియజ్ఞమ్+చ = అధియజ్ఞముతోఁ గూడినవానిఁగాను, విదుః = తెలిసికొందురో, తే = వారలుగూడ, ప్రయాణకాలే + అపి + చ = ప్రాణప్రయాణసమయమందుగూడ, యుక్తచేతసః + (సన్తః) = మనోనిగ్రహముగలవారై, మామ్ = నన్ను, విదుః = ఎఱుఁగఁగలరు. (అనగా మఱవరనుట).

మఱియు నట్లు నన్ను నధ్యాత్మాఖిలకర్మస్వరూపుఁడగు పరబ్రహ్మముగ నెవ రెఱుఁగుచున్నారో, అట్టివారలు నన్ను *అధిభూత అధిదైవ అధియజ్ఞములతోఁగూడిన వానిగఁగూడ నెఱుంగఁగలరు. కనుకనట్టివారలు ప్రాణప్రయాణసమయమందుఁగూడ మనోనిగ్రహముగలవారలై నన్నెఱుంగఁ గలరు. ఓయియర్జునా! ఇట్లు చెప్పుటవలన నాభావమేమనఁగా, ప్రాణప్రయాణసమయమునందు

"కఫవాతపైత్యముల్గప్పగా బరచేతఁ గంపముద్భవమంది కష్టపడుచు
నాజిహ్వతో నిన్ను నారాయణా! యంచుఁబిలుతునో శ్రమచేతఁ బిలువలేనో?"
(నారసింహ శతకము)

అని యొక భక్తుఁడు చెప్పిన ట్లట్టిసమయమున నాయందలి స్మరణగలుగుట అతి దుర్లభమైన దైనను ఇపుడునేఁ జెప్పిన జ్ఞానముగల వారలు అట్టి సమయమునందుఁ గూడ నన్ను మఱువక స్మరింతురనుట.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాంయోగశాస్త్రే
శ్రీకృష్ణార్జున సంవాదే విజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి విజ్ఞానయోగంబను
సప్తమాధ్యాయము.

---

* అధ్యాత్మ - అధిభూత - అధిదైవ - అధియజ్ఞము-(8-3.4) లో వివరింపఁ బడుచున్నవి.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావబోధిని

## అష్టమాధ్యాయము

### అక్షరపరబ్రహ్మయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ కిం తద్బ్రహ్మకి మధ్యాత్మం కిం కర్మపురుషోత్తమ !
అధిభూతం చ కింప్రోక్త మధిదైవం కి ముచ్యతే ॥ 1

అర్థము :— హేపురుషోత్తమ ! = ఓకృష్ణమూర్తీ!, తత్ + బ్రహ్మ + కిమ్ = అబ్రహ్మ మెట్టిది? అధ్యాత్మమ్ + కిమ్ = అధ్యాత్మమనఁగా నెట్టిది ?, కర్మ + కిమ్ = కర్మమనఁగా నెట్టిది ?, అధిభూతమ్ + చ + కిమ్ + ప్రోక్తమ్ = ఏది అధిభూతమని చెప్పఁబడుచున్నది ?, అధిదైవమ్ + కిమ్ + ఉచ్యతే = ఏది అధిదైవమని చెప్పఁబడు చున్నది ?

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! జరామరణరహితమోక్షముకొఱకు నిన్నెవరైతే యాశ్రయింపుచున్నారో, అట్టివార లాపరబ్రహ్మమును సమస్తమైన యధ్యాత్మమనియు సమస్త కర్మయనియు నెఱుంగుదురని చెప్పితివి గదా, (చూ.7-29). అబ్రహ్మమనఁగా నెట్టిది ? అధ్యాత్మమనఁగా నెట్టిది ? కర్మమనఁగా నెట్టిది ? మఱియు నట్టివారలు నిన్ను, అధిభూతమును గాను, అధిదైవమును గాను నెఱుంగుదురని చెప్పితివిగదా, (చూ. 7-30). ఆయధిభూతమనఁగా నెట్టిది ? అధిదైవమనఁగా నెట్టిది ?

శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన !
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2

అర్థము :— హేమధుసూదన ! = ఓకృష్ణమూర్తీ !, అస్మిన్ + దేహే = ఈ దేహమునందు, అధియజ్ఞః = అధియజ్ఞుఁడు, కః = ఎవఁడు ? అత్ర = ఈదేహమునందు, కథమ్ = ఎట్లున్నాఁడు, నియతాత్మభిః = మనోనిగ్రహముగలవారిచేత,

(త్వమ్) = నీవు, ప్రయాణకాలే + చ = ప్రాణప్రయాణసమయమునందును, కథమ్ + జ్ఞేయః + అసి = ఎట్లెఱుఁగఁబడుచున్నావు ?

మఱియు, నీవే యధియజ్ఞుఁడవని చెప్పితివిగదా, ఆయధియజ్ఞుఁడనువాఁడెవఁడు? ఈదేహమునం దెట్లుంచున్నాఁడు ? ఇదిగాక అట్లెఱింగెడువారు నిన్ను మరణకాలమందును మనోనిగ్రహముగలవారై యెఱుఁగుదురని చెప్పితివిగదా (చూ. 7-30)? అదియెట్లు? వారలు ప్రాణప్రయాణసమయమున మనస్సు నెట్లు నిగ్రహింపఁగలరు ? నిన్నె ట్లెఱుంగఁగలరు? ఇదియంతయు నాకు సవిస్తరముగఁ జెప్పుము.

శ్రీభగవా నువాచ :

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

అర్థము :— బ్రహ్మ = బ్రహ్మము (పరమాత్మ), పరమమ్ = సర్వోత్కృష్టమైన, అక్షరమ్ = అక్షరమనియు, స్వభావః = ప్రకృతి, అధ్యాత్మమ్ = అధ్యాత్మమనియు, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, భూతభావోద్భవకరః = సమస్తభూతములకు నుత్పత్తి కారణమగు, విసర్గః = విసర్జనము, కర్మసంజ్ఞితః = కర్మమని చెప్పఁబడుచున్నది.

కృ :— ఓయి యర్జునా! బ్రహ్మ మెట్టిదనగా,

"క. నయన ముఖ పాణి పాదము
లయమహితా, రొందుఁగలిగి యాద్యంతపరి
క్షయ వృద్ధిరహితమై ని
ర్ద్వయమగుతత్త్వంబు నక్షరం బండ్రు బుధుల్ ॥" (భార. శాంతి. ౩ - అ౫)

అనునట్లీప్రపంచమందంతటికిని ద్రష్టయు, భోక్తయు, వ్యాప్తయు, కర్తయునై యాద్యంతరహితమును, వృద్ధిక్షయరహితమును, నిర్ద్వంద్వమును నైయుండునట్టి తత్త్వముగాన నాబ్రహ్మము "అక్షరము" అనఁగా చలనములేనిది, అని చెప్పఁబడుచున్నది. ఇఁకను అధ్యాత్మమన్ననో, త్రిగుణాత్మకమైన ప్రకృతి (స్వభావము) అధ్యాత్మ మనఁబడుచున్నది.

"క॥ నరనారీ సంబంధము
వరుసగదా పురుషునకును బ్రకృతికి నన్యో
న్యరమణ మది సర్వజనన
కర మిట్టుల శ్రుతులుసెప్పుఁ గారుణ్యనిధీ!" (భార. శాంతి. ౩ - అ. ౨౫)

అధిదైవమ్+చ = అధిదైవమన్ననో, పురుషః=(అక్షరుండగు) విరాట్పురుషుఁడు, అత్ర+దేహే=ఈదేహమునందు, అధియజ్ఞః=అధియజ్ఞుఁడనువాఁడు, అహమ్+ఏవ=నేనే.

ఓయియర్జునా! ఇఁకను, అధిభూతమెద్ది యనఁగా, క్షరత్వము అనఁగా నహంకారాది చతుర్వింశతి తత్త్వసముదాయము. వీనికి క్షరమని పేరుగలుగుటకుఁ గారణమేమనఁగా,

"క॥ క్షరమంద్రు దానివలనను
క్షరియించిన తత్త్వములను జనవత్సలయ
య్యిరువది నాల్గింటిని దర
తరమ విభాగించి చెప్పెదం జలియంగన్॥" (భార. శాంతి ౬ ఆ. ౬)

అనునట్లు ఇదివఱకు నేఁజెప్పినయక్షరము, అనఁగా, పరబ్రహ్మమునుండి క్షరియించినవి (ఉత్పన్నములైనవి) గనుక వానికి క్షరమను నామము గలిగెను. ఆచతుర్వింశతి తత్త్వములెవ్వియనఁగా,

"సీ॥ జ్ఞానేంద్రియములైదు జానుగాఁగర్మేంద్రియములైదు పృథ్వాద్యదులై మభూతములు గంధముఖగుణములునైదు బుద్ధ్యాద్యహంకరణ చతుష్టయమునుగూడుకొని యిరువదినాలుగును జతుర్వింశతి తత్త్వంబు లయ్యెను ధరణియందు"

అనునట్లు, శ్రోత్రత్వక్చక్షుః జిహ్వాఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియములైదును, వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియములైదును, పృథివ్యప్తేజో వాయురాకాశముల నెడు మహాభూతములైదును, శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు నింద్రియ విషయములైదును, మనోబుద్ధి చిత్తాహంకారము లనెడు నంతఃకరణములు నాల్గును జేరి యిరువదినాలుగు తత్త్వము లనఁబడుచున్నవి.

"క॥ క్షగమ య్యిరువది నాలుగు
నరనాథా యక్షరంబునకు నెయ్యెడలన్
క్షరభావము లేదయ్య
క్షరవిలాసములు సూవె క్షరతత్త్వమ్ముల్". (భార. శాంతి. ౬ ఆ. ౯)

అనునట్లాయిరువదినాలుగు తత్త్వములును నక్షరమగు నాపరబ్రహ్మమువలనఁ గలిగినవియే; అనఁగా, నాపరబ్రహ్మముయొక్క విలాసములేయయ్యున్నవి. అయినను, అవిక్షరత్వము, అనఁగా, నశించెడు స్వభావముగలవియగుటచే వానికి క్షరమనెడు పేరుగలిగెను. ఆ యిరువదినాలుగు తత్త్వములకు నావలనుండెడు యిరువదియైదవ

అనునట్లు ఆబ్రహ్మమే పురుషుఁడుగాను, ఆప్రకృతియే స్త్రీగాను నుంచున్నవి. కాన, పురుషుఁడు స్త్రీసంపర్కముచే నాస్త్రీగర్భమునందుఁ దనరేతస్సును విసర్జించుటవలన నెట్లుపిండోత్పత్తియగుచున్నదో, అట్లే యాబ్రహ్మమను పురుషుఁడు ప్రకృతియను స్త్రీతోఁగలసి తన యంశము నాప్రకృతియందు విడుచుటచే, అనఁగా, తనయంశమును బ్రకృతితో సంబంధింపఁజేయుటచే నీప్రపంచమందలి సమస్తభూతములుత్పత్తియగుచున్నవి (చూ. 14-3). కాన నట్లు ప్రకృతితో సంబంధించుటయే భూతోత్పత్తి కారణమగు విసర్గమనఁబడుచున్నది. అట్టివిసర్గమునకే కర్మయని పేరు. ఇందునకు నిదర్శనముగఁ బూర్వము శ్రీసీతాదేవి యాంజనేయునకుఁ దత్త్వోపదేశము జేయునపుడు ప్రకృతిపురుషుల సంబంధమును దెలియఁజేయుటలో

“మ॥ సుమతీరాముడు నిర్వికారము సదా శుద్ధంబచిం
త్యమవాచ్యంబతులం బతీంద్రియము సత్తామాత్రమున్ స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్ప మజమున్ సత్సంవిదానందరూ
పమమూర్తం బజరంబు కేవల పరబ్రహ్మంబు చింతింపగన్.”

“క॥ త్రిగుణాత్మికయై యనిశము
జగములఁ బుట్టింపఁ బెంపసమయింపంగాఁ
దగుమూలప్రకృతియు నే
నగుదుఁ జూమీ సత్యముగ మహాగుణశాలీ!” (సీ. రా. ౧ ఆ. ౭౬, ౭౭)

అనియును, శ్రీరాములాయాంజనేయునకే యుపదేశించిన కాలమందు,

“క॥ ఆయీశ్వరుండ నే నా
మాయయె సీతావధూటి మదిఁ దలఁప మహా
మాయుఁడ నయ్యు వశీకృత
మాయుఁడనై యవతరింతు మహిని ట్లనఘా!” (సీ. రా. ౨ ఆ. ౩౧)

అనియును చెప్పియున్నారు. కాననోయి యర్జునా! బ్రహ్మమనఁగా నక్షరుండగు విరాట్పురుషుఁడనియు, అధ్యాత్మమనఁగాఁ ద్రిగుణాత్మకమగు ప్రకృతియనెడు స్త్రీయనియు, ఈ ప్రకృతిపురుషుల సంయోగమే జగదుత్పత్తికారణమగు కర్మయనియుఁ జెప్పఁదగియున్నది.

శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుష శ్చాధిదైవతం ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర ॥ 4

అర్థము :— దేహభృతాంవర! = దేహధారులలో శ్రేష్ఠుఁడవగు నోయర్జునా, అధిభూతమ్=అధిభూతమనునది, క్షరః + భావః = నశించునట్టి స్వభావముగలది

అధిదైవమ్ + చ = అధిదైవమన్ననో, పురుషః=(అక్షరుండగు) విరాట్పురుషుఁడు, అత్ర + దేహే=ఈదేహమునందు, అధియజ్ఞః=అధియజ్ఞుఁడనువాఁడు, అహమ్ + ఏవ=నేనే.

ఓయియర్జునా! ఇఁకను, అధిభూతమెద్ది యనఁగా, క్షరత్వము అనఁగా నహంకారాది చతుర్వింశతి తత్త్వసముదాయము. దీనికి క్షరమని పేరుగలుగుటకుఁ గారణమేమనఁగా,

"క॥ క్షరమంద్రు దానివలనను
క్షరియించిన తత్త్వములను జనవత్సలయ
య్యిరువది నాల్గింటిని దర
తరమ విభాగించి చెప్పెదం దెలియంగన్॥" (భార. శాంతి ౬ ఆ. ౬)

అనునట్లు ఇదివఱకు నేఁజెప్పినయక్షరము, అనఁగా, పరబ్రహ్మమునుండి క్షరియించినవి (ఉత్పన్నములైనవి) గనుక వానికి క్షరమను నామము గలిగెను. ఆచతుర్వింశతి తత్త్వములెవ్వియనఁగా,

"సీ॥ జ్ఞానేంద్రియములైదు జానుగాఁగర్మేంద్రియములైదు పృథ్వ్యాద్యదులైదుభూతములు గంధముఖగుణములునైదు బుధ్యాద్యహంకరణ చతుష్టయమునుగూడు
కొని యిరువదినాలుగును జతుర్వింశతి తత్త్వంబు లయ్యెను ధరణియందు"

అనునట్లు, శ్రోత్రత్వక్చక్షుః జిహ్వాఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియములైదును, వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియములైదును, పృథివ్యప్తేజో వాయురాకాశములనెడు మహాభూతములైదును, శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు నింద్రియ విషయములైదును, మనోబుద్ధి చిత్తాహంకారము లనెడు నంతఃకరణములఁ నాల్గును జేరి యిరువదినాలుగు తత్త్వము లనఁబడుచున్నవి.

"క॥ క్షరమ య్యిరువది నాలుగు
నరనాథా యక్షరంబునకు నెయ్యెడలన్
క్షరభావము లే దయ్యె
క్షరవిలాసములు నూజె క్షరతత్త్వమ్ముల్". (భార. శాంతి. ౬ ఆ. ౯)

అనునట్లాయిరువదినాలుగు తత్త్వములును నక్షరమగు నాపరబ్రహ్మమువలనఁ గలిగిన వియే; అనఁగా, నాపరబ్రహ్మముయొక్క విలాసములేయయ్యున్నవి. అయినను, అవిక్షరత్వము, అనఁగా, నశించెడు స్వభావముగలవియగుటచే వానికి క్షరమనెడు పేరుగలిగెను. ఆ యిరువదినాలుగు తత్త్వములకు నావలనుండెడు యిరువదియైదవ

తత్త్వమగు నాత్మకు, అనఁగా, పరబ్రహ్మకు నట్టిక్షరత్వము (నశించెడుస్వభావము) లేదుగనుక నాపరబ్రహ్మమునకు నక్షరమను నామముగలిగెను. క్షరములగు నాయిరువది నాలుగు తత్త్వములును, నక్షరమగు నీయిరువదియైదవ తత్త్వమును జేరియే యీదేహమగుచున్నది. అనఁగా, ఆయిరువదినాలుగు తత్త్వములుచేరి దేహమును, ఆయిరువదియైదవ తత్త్వము దేహియును, అనఁగా, ఆదేహమున నివసించెడు జీవాత్మయు నగుచున్నవి.

ఇఁకను, అధియజ్ఞుఁడెవఁడనఁగా, ఇపుడు నేఁజెప్పినప్రకార మీదేహమున నివసించియుండెడు దేహియే; అనఁగా నక్షరుఁడనగు నేనే అయియున్నాను.

అర్జు — అయ్యా! ఇట్లు చెప్పితివిగదా; దీనింబట్టిచూడఁగా నీప్రపంచమునందలి సమస్తదేవ - మనుష్య - తిర్యక్ - జంతుదేహములయందుండెడు నాత్మ నీవేయైయున్నట్లగపడుచున్నది. అట్టి నీవే అధియజ్ఞుఁడవనియు. అనఁగా నట్టిదేహధారులవలనఁ జేయఁబడుయజ్ఞములకు, అనఁగా, క్రతువులు మొదలగుపూజలకు నధిష్ఠానదేవతవు నీవేయని చెప్పుచున్నావుగదా, అట్లైనయెడలఁ బూజించెడువాఁడును బూజింపఁబడెడువాఁడును నీవే యైనట్లేర్పడుచున్నదే అదియెట్లగును ?

కృ — అదియెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

“ క. విను సత్త్వరజస్తమముల
యనుసరణమువలన వివిధమగు యోనిగణం
బున జెలసిన యాతత్త్వము
దనుఁజూడఁగలేకయవియ తాననియుండున్.” (భార. శాంతి. ౬. అ౧౨)

అనునట్లు, ఇరువదియైదవతత్త్వమును, అక్షరమునగు నాపరబ్రహ్మము ప్రకృతితో సంబంధించి నపుడు ప్రకృతిగుణములగు సత్త్వరజస్తమముల సంపర్కముచే విమోహితుఁడై తన్నుఁదాఁదెలిసికొనఁజాలక యాప్రకృతిగుణములే తానని యెంచికొనును. అట్లు తనయందాగుణముల నారోపించికొనినవాఁడై

“ ఉ. సత్త్వరజస్తమోగుణవశస్థితి నక్షర మర్త్యధర్మసం
గిత్వము మధ్యకర్మతయుఁ, గిల్బిషకృత్యము నొందియొంది ది
వ్యత్వ నరత్వ గో మృగ ఖగాదిక తిర్య గనేక హీనజం
తుత్వములన్ సుఖంబులును దుఃఖములున్ నరకంబులుంగనున్.”

(భార. శాంతి. ౬ ఆ. ౧౩)

అనునట్లు సత్త్వగుణమువలనఁ బుణ్యకర్మలఁ జేయుచుఁ దదనుగుణ్యములగు

దేవతాజన్మలనెత్తి సుఖించుచును, రజోగుణమువలనఁ బుణ్యపాపకర్మల మిశ్రమముఁగ జేయుచుఁ దదనుగుణ్యములగు మానవజన్మలనెత్తి సుఖదుఃఖముల ననుభవింపుచును, తమోగుణమువలనఁ గేవల దుష్కర్మలనే చేయుచుఁ దదనుగుణ్యములగు పశుపక్ష్యాది తిర్యగ్జన్మలనెత్తి నరకముల ననుభవింపుచుండును. కావున

" చ. క్రతువులఁ దీర్థయాత్రలను రాత్ర్యశనంబుల భూమిశయ్యలన్
వ్రతపరినిష్ఠలన్ జడలు వల్కలముల్ వివిధంపుదండముల్
సతతము దాల్చుటన్ వపువుసంకటపాటునఁ బెట్టునాద్య మ
చ్యుత మమలంబు దాను దనుఁ జూడక యక్షరమప్రబుద్ధమై."

(భార. శాంతి. ౬అ. ౧౪.)

అనునట్లు, ప్రకృతిసంబంధము గలిగి దేహస్థుఁడగు నాత్మ తానే యక్షరుఁ డనియు, పరబ్రహ్మమనియుఁ దెలిసికొనఁజాలక తనకంటె వేరగు పరమాత్మ యొకఁ డున్నాఁడనియెడు భ్రమతోనట్టి పరమాత్మనుద్దేశించి యజ్ఞములు – తీర్థయాత్రలు – ఉపవాసములు – మొదలగునవి చేయుచు వ్యర్థముగాఁ దనశరీరమును గష్టపెట్టుకొనును.

అర్జు — అయ్యా! ఇట్లుచెప్పితివిగదా, దీనింబట్టిచూడఁగా నక్షరమగుఁ బర బ్రహ్మముగూడఁ బ్రకృతిసంబంధమువలన నజ్ఞానముచే నావరింపఁబడి తనకంటె వేఱగు పరమాత్మ మతియొకటి కలదనియెంచి వ్యర్థముగాఁ గ్రతువ్రతాదులచే శరీ రమును సంకటపెట్టుచున్నట్లును, అట్టిక్రతువ్రతాదులచేఁ బూజించెడువాఁడును, బూజింపఁబడెడువాఁడు (అధియజ్ఞుఁడు) ను, ఆపరబ్రహ్మ స్వరూపుఁడవగు నీవేయై యున్నట్లును నగపడుచున్నది. ఇందువలన నీప్రపంచమునందలి దేహధారులగు సమస్త జంతువులయందుండెడు జీవాత్మయే పరమాత్మయుఁగా నున్నట్లేర్పడుచున్నదిగదా, అట్లైనయెడల

" క. అనుపమ మజర మతీంద్రియ
మనామయ మనంత మమల మనవెలుఁగునొకం
డని వేదశాస్త్రములచే
వినియుండుదు వానిఁదెలుపవే కృపనాకున్." (భార. శాంతి. ౬అ. ౨౪)

అనునట్లు దేహధారులగు జీవాత్మలకంటె వేఱగువాఁడును, జననమరణాదులు లేనివాఁడును, ఉపమానరహితుఁడును, అతీంద్రియుఁడును, అనామయుఁడును, అనంతుండును, అమలుఁడును అగువాఁడొకఁడు వేఱుగ నున్నాఁడని వేదశాస్త్ర ములు చెప్పుచున్నవే, అట్లు చెప్పుటకుఁ గారణమేమి?

కృ — అవును, అటు వేదశాస్త్రములు చెప్పుటయు వాస్తవమే; ఇప్పుడు నేఁ జెప్పినప్రకారము సమస్తదేహములయందుండు వాఁడును, వేదశాస్త్రములయందుఁ జెప్పంబడినప్రకారముప్రత్యేకముగ నుండువాఁడును నాపరమాత్మయేయైయున్నాఁడు. అదెట్లనఁగా నింకనొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఇంతకుముందు నీకు నేను బరమాత్మ యపరంజివంటి వాఁడనియుఁ జీవాత్మ బంగారువంటివాఁడనియుఁ జెప్పియుంటిని గదా, జ్ఞాపకమున్నదా ! (చూ.2–16)

అర్జు — ఆహా ! జ్ఞాపకమున్నది. పరమాత్మ యపరంజివలె నిర్వికారుండనియు, జీవాత్మ యితరలోహములతోఁ గలసి యాయపరంజియగు బంగారమువలెఁ బ్రకృతితోఁగలసిన పరమాత్మయనియుఁ జెప్పియుంటివిగదా ?

కృ — అవునుగదా, నీవద్ద పదిమణుగుల యెత్తుగల స్వచ్ఛమైన యపరంజి ముద్దయొకటి యున్నదని యెంచికొనుము. ఆముద్దలోనుండి యొకమణుఁగు తూనికగల యపరంజిమాత్ర మెత్తి దాని నితరలోహములతో మిశ్రమము చేసి దానితో ననేకవిధములగు నాభరణములఁ జెయించియున్నా వనుకొనుము. అప్పటికి నీయొద్దనుండిన యాయపరంజియే యీయన్ని యాభరణముల యందున్నదా లేదా ?

అర్జు — ఆహా ఉన్నది.

కృ — మంచిది. అట్లైనయెడల నాయాభరణములలోనుండు నపరంజికంటె వేఱైనదియు, దానివలె నితరలోహసంపర్కము లేదనియు. స్వచ్ఛమైనదియు నగు నపరంజికూడ నీయొద్దనున్నదా లేదా ?

అర్జు — ఆహా, ఉన్నది. నాయొద్ద మొదటనుండిన యపరంజి అట్టి స్వచ్ఛమైనదేకదా ? దానిలోనుండి దశాంశము, అనఁగా, నొకమణుఁగు మాత్రమే గదా నేనాభరణముల కుపయోగించుకొన్నది, తక్కినతొమ్మిది మణుఁగుల యపరంజియు నట్లే స్వచ్ఛముగ నున్నదిగదా ?

కృ — అవును గదా, అప్పటికిందువలననేమి యేర్పడుచున్నదనఁగా, నీవద్ద నుండెడు నపరంజి యేవిధమైన లేక స్వచ్ఛమైనదిగఁ గొంతయు, రజితాదులతో మిశ్రమమై యనేకవిధాభరణరూపముగఁ గొంతయు నున్నట్లును, అట్టియాభరణరూపముగ నుండెడు నపరంజికంటె స్వచ్ఛమైనదనియు, ముద్దగనుండునట్టి యపరంజి ప్రత్యేకమైనదియునని యేర్పడుచున్నది గదా ?

అర్జు — అవును అట్లే. యేర్పడుచున్నది.

కృ — మంచిది ఒకవేళ నీ యొద్దనుండెడు నాభరణములలో నొకదానిని

నాయాభరణరూపమును జెడఁగొట్టి మొదటి యపరంజిముద్దలోఁ జేర్పవలెనని యోచించినయెడల నప్పు డేమి సేయుదువు !

అర్జు — అయాభరణమును గరఁగినయెడల బంగారమగుచున్నదికదా ? ఆబంగార మితరలోహములతో మిశ్రమమైయుండుటచే దానిని వెంటనే యాయపరంజి ముద్దలోఁజేర్చుటకు వీలుపడదు గనుక దానిని పుటములు వేసి యాపుటములచే దాని యందుండెడు మలినమంతయు నిశ్శేషముగ హరించి స్వచ్ఛమైనయపరంజి యైన పిమ్మట నా మొదటి యపరంజి ముద్దలోఁజేర్చుకొందును.

కృ — అవునుగదా, అట్లే యీపరమాత్మ నీద్దనుండు నపరంజిముద్దవంటి దనియు, అపరమాత్మయొక్క యంశము ప్రకృతితో సంబంధపడి యీసమస్తప్రపంచముగఁ బరిణమించి యిపుడు నీవద్ద సమస్తాభరణరూపముగ నుండు బంగారమువంటి దనియు నెఱుంగుము. కాన నాపరమాత్మ యీప్రపంచమునందలి సమస్తభూతముల యందు జీవాత్మస్వరూపముగనుండుటయేగాక వానికంటె విలక్షణుఁడుగను, అనగాఁ బ్రత్యేకమైనవాఁడుగను గూడ నుంచున్నాఁడని యెఱుంగుము. అయితే, అట్లు భూతస్థుఁడగు జీవాత్మకును భూతవిలక్షణుఁడగు పరమాత్మకును గలిగియుండు భేద మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

“ క. జనవర, శుక్లము లోహిత
ము ను గృష్ణము నైన వర్ణముల నక్షరమొం
దును సత్త్వరజస్తమముల
యను సారంబున నవర్ణమయ్యు వికృతమై. ( భార. శాంతి. ౬ ఆ. ౧౨)

అనునట్లాపరమాత్మయొక్క యంశము ప్రకృతితో సంబంధించినపు డాప్రకృతి యందలి త్రిగుణములవలన వికారమును జెందినదగుచున్నది. అట్టివికారము నెప్పుడు చెందుచున్నదో అప్పుడు.

“ క. అమృతము నజరము నభవము
నమలము నగు తన్ను మృతము–నాహితభవమున్
సమధికజరమునుమలసహి
తముఁగా నక్షరము మమతఁ దలఁచు నరేంద్రా !

( భార. శాంతి. ౬ ఆ. ౧౫ )

అనున ట్లహంకార మమకారములు, అనఁగా, నేను, నాది యనెడు దురభిమానమును జెందినదై జననమరణాదులులేనితన్ను నట్టిజననమరణాదులు గలదానిఁగ భావించుకొనుచు.

" ఆ. తనకుఁదానబంధ మొనరించుకొనియెడు
పొత్తినూలు కాయ పురువుభంగి
నగుణమయ్యు సగుణతావాప్తిఁబొందు న
క్షరము ప్రకృతిగుణము సంక్రమించి. (భార. శాంతి. ౬ ఆ. ౧౯)

అనునట్లు పట్టుపురుగెట్లైతే తనవలన నుత్పత్తియగునూలుతోఁజుట్టుకొని దానిలో నుండి వెడలి రాఁజాలకుండునో యట్లే యక్షరమగు నీపరమాత్మయును స్వకల్పితమగు ప్రకృతిసంబంధము చే నగుణమగు తన్ను సగుణముగా భావించుకొనుచుండును. అయితే,

" క. అగుణంబయ్యును నిమ్మెయిఁ
బ్రగుణతఁ బ్రాపించు నక్షరమహంకార
సగుణం బూదిన విడిచినఁ
దెగునన్నియు నిర్వికారదీపంబునగున్." (భార. శాంతి. ౬ ఆ. ౧౫)

అనునట్లు అట్టి యహంకారమమకారరూపమగు దురభిమానము నెప్పుడువిడుచుచున్నదో అప్పుడు ప్రకృతి సంబంధముచేఁగలిగినవికారము పోయినదై,

" ఆ. అమలవాయుసేవనము నిర్మలత్వంబు
గలుగఁగాఁబడాలుకళలఁబూర్ణఁ
దగు సుధాంశుమాడ్కి నక్షర మమలి నా
ఖండశాంతి బోధఘనత వెలుఁగు." (భార. శాంతి. ౬ ఆ. ౨౦)

అనునట్లు మబ్బుచేనావరింపఁబడిన చంద్రబింబ మామబ్బు గాలిచే నెగురఁగొట్టఁబడినపుడెట్లు షోడశకళాపరిపూర్ణమై ప్రకాశించునో అట్లే యజ్ఞానమనెడు మబ్బుచే విడువఁబడినదై సుజ్ఞానరూపముగఁ బ్రకాశించును. ఇట్లగుటయే జీవన్ముక్తి యనఁబడును. ఇట్టిజీవన్ముక్తినిబొందినదేహి యెప్పుడైతే పాంచభౌతికమగు నీదేహమును విడుచునో, అప్పుడు నీదేహవిముక్తిని బొందినవాఁడగును. అనఁగాఁ బరమాత్మలో నైక్యమగు ననుట.

శ్లో॥ అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతినాస్త్యత్రసంశయః ॥ 5

అర్థము :— యః=ఎవఁడు, అన్తకాలే+చ=మరణకాలమందైనను, మామ్+ఏ=నన్నే, స్మరన్=ధ్యానించుచు, కళేబరమ్=దేహమును, ముక్త్వా=విడిచి, ప్రయాతి=పోవుచున్నాఁడో, సః=వాఁడు, మద్భావమ్=నాస్వరూపమును, యాతి=

పొందుచున్నాఁడు, అత్ర=ఈవిషయమునందు, సంశయః=అనుమానము, న+అస్తి=లేదు.

ఓయియర్జునా! ఇపుడు నేఁజెప్పినదానివలన నక్షరమగు నాపరమాత్మయే పరబ్రహ్మము (విరాట్పురుషుఁడు) అనియు, నాపరబ్రహ్మమువలనఁగలిగిన త్రిగుణాత్మకమగు ప్రకృతియే అధ్యాత్మమనియు, జగదుత్పత్తికారణమగు నా ప్రకృతి పురుషుల సంయోగమే కర్మయనియు, అప్రకృతిసంబంధమగు నహంకారాది చతుర్వింశతి తత్త్వములే అక్షరస్వభావముగల యధిభూతమనియు, అప్రకృతితోఁ గలిసియుండు నట్టిదియు నక్షరస్వభావముగలదియు నిరువదియైదవ తత్త్వమునగు నాపరబ్రహ్మమే అధిదైవతమనియు, మఱియు నాపరబ్రహ్మమే యధియజ్ఞుఁడనియు, అట్టి పరబ్రహ్మమే నేను గాన నవియన్నియు నాస్వరూపములేయనియు నిపుడు తెలిసికొంటివిగదా! కనుక నెవఁడైతే నాస్వరూపమిట్టిదని మరణకాలమందైనను తెలిసికొని నన్ను ధ్యానించుచుఁ గళేబరమును విడుచుచున్నాఁడో, అట్టివాఁడు సాయుజ్యమును అనఁగా జననమరణరాహిత్యమగు మోక్షమును బొందగలఁడు. ఇందు కేమియు సంశయములేదు.

అర్జు — అయ్యా! యిట్లుచెప్పితివిగదా, దీనింబట్టిచూడఁగా నెవరైన మొదటి నుండి నీదుస్వరూపము నెఱుఁగకయు నిన్ను ధ్యానింపకయు నుండి, మరణకాలము నందుమాత్రము నీదు నిజస్వరూపమిట్టిదని యెఱిఁగి నిన్ను ధ్యానించినయెడల నిన్ను బొందఁగలఁడని యర్థమగుచున్నదే ఇదియేనా నీయభిప్రాయము? లేక, సదా నీస్వరూపమును ధ్యానింపుచుండి యంత్యకాలమందుఁగూడ ధ్యానించినవాఁడు నీస్వరూపమును బొందుననియా?

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ ।
తం త మేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥　　6

అర్థము :— హేకౌన్తేయ=ఓయర్జునా, (యః)=ఎవఁడు, అన్తే=మరణకాలమందు, యమ్+యమ్+భావమ్=ఏయేస్వరూపమును, స్మరన్=స్మరించుచు, కళేబరమ్=దేహమును, త్యజతి=విడుచుచున్నాఁడో, (సః)=వాఁడు, సదా=ఎల్లప్పుడును, తద్భావభావితః+అపి+వా=ఆస్వరూపమునే ధ్యానించినవాఁడైనను కాకపోయినను, తమ్+తమ్+ఏవ=ఆయాస్వరూపమునే, ఏతి=పొందుచున్నాఁడు.

కృ — ఓయియర్జునా! ఎవఁడైనను సదా నన్నే ధ్యానింపుచుండి, యంత్య

కాలమునందుఁగూడ నాస్మరణనే చేయుచుఁ బ్రాణమువిడిచిన యెడల నట్టివాఁడు నన్ను బొందఁగలఁడని సాధారణముగఁ దెలివి హీనులకుఁగూడఁ దెలియదగిఁ యుండఁగా సమస్తధర్మములనెఱిఁగిన నీకిది యొకవిషయముగఁ జెప్పవలసిన యగత్య ముండదుగదా ! కనుక నీకిపుడు నేఁజెప్పిన విషయము మొందటినుండి నన్ను స్మరింపక పోయినను అంత్యకాలమందైనను నాస్వరూపము నెఱిఁగి యచంచలభక్తితో నన్ను స్మరించినవానికే యన్వయించుచున్నదని యెఱుంగుము. ఏలయనగా నెవడైనను అంత్యకాలమందు అనఁగా ప్రాణ ప్రయాణసమయమందు నేయేస్వరూపమునందు దృష్టినిలిపి స్మరింపుచుఁ బ్రాణము విడుచుచున్నాఁడో వాఁడంతకుముందు సదా ఆరూపమును ధ్యానించినవాఁడైననుసరే, కాకున్ననుసరే, వానికిఁ దప్పక యా స్వరూపమే కలుగును. ఇఁదుకు దృష్టాంత మేమనఁగా, పూర్వకాలమునఁ బ్రసిద్ధి నొందిన భరతచక్రవర్తి భగవంతునియందచంచలభక్తిగలవాఁడై యాభగవంతుని ననేక విధముల నారాధించి తుదకు దారపుత్రాదులనుగూడ విసర్జించి వనమునకేగి యచటఁ దదేక నిష్ఠాగరిష్ఠుఁడై తపమొనరించియు ఆవనమునందొక లేడిపిల్లను బెంచినవాఁడై

“ మ. భరతుండల్లన నంత్యకాలమునె సంప్రాపింపఁగా నప్పుడా
హరిణంబుంగడు భక్తిఁ బుత్రుగతిసత్యాసక్తి వీక్షింపనా
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహంబంతటంబాసి తా
హరిణీగర్భమునంజనించి హరిణంబైయొప్పె బూర్వస్మృతిన్.”

ఇట్లు భరతుండు హరిణీగర్భంబునంబుట్టియు భగవదారాధనసామర్థ్యంబునం దన మృగజన్మ కారణంబుఁ దెలిసి కడుందాపంబు నొందుచు నిట్లనియె

ఉ. రాజులుఁ బ్రస్తుతింప సురరాజసమానుఁడనై తనూజుల
ప్రాజులఁజేసి, తాపసులు రాజఋషీంద్రుఁడటంచుఁ బల్కఁగాఁ
దేజమునొంది యాహరిణదేహమునందలి ప్రీతిఁజేసినా
యోజచెడంగ నేఁజెడితి యోగిజనంబులలోన బేలనై.”

(భాగ. స్కంధము ౫. ౧౧౪. ౧౧౬)

అని చింతించెను. ఇదిలోకప్రసిద్ధమైన సంగతియేగదా ? దీనివలన నెవఁడేని సదా భగద్ధ్యానముఁ జేయుచుండినను నంత్యకాలమం దా భగవంతుని మఱచి మఱి యొక స్వరూపమును ధ్యానించినయెడల నట్టివాని కంత్యకాలమందు స్మరించుచుండిన యాస్వరూపమే సిద్ధించుచుండుననియు భగవత్సాయుజ్యముకలుగనేరదనియు స్పష్ట మగుచున్నదిగదా ? ఇదియటుండనిమ్ము. మఱియొకసంగతిఁ జెప్పుచున్నాను వినుము. పూర్వము ఖట్వాంగుఁడను రాజు మిగులఁ బరాక్రమశాలియై రాజ్యమునేలుచు

మొదటినుండి భగవద్విచారముచేయనివాఁడైనను అంత్యకాలము సమీపించినపుడతని పూర్వజన్మకృత పుణ్యవశమునఁ బరమవైరాగ్యశీలుఁడై భగవంతునియం దచంచల భక్తిఁజేసి మోక్షమును బొందినదియును లోకప్రసిద్ధమైన సంగతియేగదా ? కాన నీ రెండు దృష్టాంతముల వలనను నెవఁడైనను సదా భగవద్భక్తిచేసిననుసరే, చేయకున్ననుసరే, అంత్యకాలమందు మాత్ర మితర చింతలుమాని యచంచలభక్తితో నాభగవంతుఁడనగు నన్నే స్మరించుచుఁ బ్రాణమువిడిచినయెడల నాదుసాయుజ్యము నొందుటకేమియు సందియములేదని తెలిసికొనఁ గలవు గదా ? కనుకనేగదా నేనీకింతకు ముందుగూడ "స్థిత్వాస్యామంతకాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి" అని చెప్పియున్నాను (చూ. 2-72). జ్ఞాపకమున్నదా ?

శ్లో॥ తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ ।
మ య్యర్పితమనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః ॥ 7

అర్థము :— తస్మాత్ = కాబట్టి, సర్వేషు + కాలేషు = సర్వకాలములయందును, మామ్ + అనుస్మర = నన్నే ధ్యానింపుచుండుము, మయి + అర్పితమనోబుద్ధిః + (సన్) = నాయందే చేర్చిన మనస్సుగలవాఁడవై, యుధ్య + చ = యుద్ధమునుగూడఁజేయుము, మామ్ + ఏవ + ఏష్యసి = నన్నే పొందఁగలవు, అసంశయః = నిస్సంశయము.

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక నోయి యర్జునా! నీవు సర్వకాలసర్వావస్థలయందును నన్నే స్మరింపుచుండుము. అట్లు నన్ను స్మరింపుచునే యుద్ధమునుగూడఁ జేయుము. అట్లు చేసితివేని నీవీయుద్ధమునఁ జచ్చిననుసరే, లేక, తదనంతరము నీయాయుష్కాలము తీరి దేహధర్మమునొందిననుసరే, నీవునన్నే పొందఁగలవు. ఇందున కెంతమాత్రము సందేహింపవలసినదిలేదు.

అర్జు — ఇంతదనుక నీవు చెప్పుచుండిన విషయమునుబట్టి చూడఁగా నిన్ను సదా స్మరించిననుసరే, స్మరింపకుండిననుసరే, అంత్యకాలమందు మాత్రము నీస్మరణఁ జేసినయెడల నిన్నుఁ బొందవచ్చునని నీయభిప్రాయమైనట్లగపడుచున్నదే? అట్లైన యెడల నిపుడు సదా నీస్మరణఁజేయుచుండవలసినట్లు నన్నుఁ బ్రేరేపించవలసిన కారణ మేమి ? నేనును నట్లే యంత్యకాలమందు నీస్మరణఁజేసి నిన్నేల పొందఁగూడదు ?

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థాఽనుచిన్తయన్ ॥ 8

అర్థము :— హే పార్థ !=ఓయియర్జునా !, అభ్యాసయోగయుక్తేన= అభ్యాసమనెడు యోగముతోఁ గూడినదియు, న+అన్యగామినా = ఇతరవిషయములను బొందనిదియునగు, చేతసా = మనస్సుచేత, అనుచిన్తయన్ = చింతింపుచున్నవాఁడై, దివ్యమ్ = అప్రాకృతుఁడైనట్టియు, పరమమ్ = శ్రేష్ఠుఁడైనట్టియు, పురుషమ్ = విరాట్పురుషుని, యాతి = పొందుచున్నాఁడు.

కృ — ఓయియర్జునా ! ఎవఁడైనను సదా నన్ను స్మరింపకున్నను అంత్యకాలము నందుమాత్ర మచంచల భక్తితో స్మరించినయెడల నన్నుఁ బొందుటకేలాటియభ్యంతరములేని మాటయే వాస్తవము. అయితే అట్లుచేసి కడతేరవచ్చునుగదా, ఇప్పటి నుండి యేల స్మరింపవలెనని యెంచి తాత్సారముగ నుండఁగూడదు. ఏలయనఁగా, దేహ మనోదారుఢ్యములు చక్కఁగానుండునపుడు నన్ను స్మరింపుచుండినను మరణ కాలమునందుఁ గఫవాతపిత్తాదులచే మిగులబాధనొందుచు దేహమనో దారుఢ్యములు రెండును దప్పియుండుటయేగాక అట్టిసమయమున దారపుత్రాదుల యెడలను గృహ క్షేత్రారామవిత్తాదులయందును నెక్కుడు మమకారము గలుగుచుండును. కాన నా కాలమున నట్టి స్మరణగలుగుట మిగుల దుర్లభము. అయితే, మొదటి నుండి మనస్సును జలింపనీక నన్నే ధ్యానింపుచు వచ్చినయెడల నట్టి యభ్యాసవశమున నది వానికి స్వభావముగ నేర్పడును. అట్టివాని కంత్యకాలమున దేహమనోదారుఢ్యములు తప్పియుండినను అట్టిస్వభావబలముచే వానికా సమయమం దప్రయత్నముగనైన నా స్మరణగలుగవచ్చును. ఇందుచేతనేగదా భరతుఁడు లేడి జన్మమెత్తినపుడును, బ్రాహ్మణజన్మ మెత్తినపుడును, బూర్వజన్మపుణ్యవశమువలన నందలిస్మృతి గలిగినవాఁడై ప్రపంచమందలి యేవిషయము నొల్లక జడత్వము వహించి సదా నన్నే ధ్యానింపుచుండెను. కాన నెవఁడైతే సర్వకాల సర్వావస్థలయందును నన్నే ధ్యానముచేయుట యభ్యసించుచున్నాఁడో యట్టివాని కంత్యకాలమందును నా యభ్యాసవశమునఁ జిత్తము చలింపక నాదు స్మరణయే కలుగును. కాన నట్టివాఁడా యంతిమస్మృతిచే నప్రాకృతుఁడను విరాట్పురుషుఁడనునగు నన్నే పొందఁగలఁడు.

శ్లో॥ కవిం పురాణ మనుశాసితార మణో రణీయాంస మనుస్మరే ద్యః
సర్వస్య ధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్ ॥ 9

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ।
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి
దివ్యమ్ ॥ 10

అర్థము :— యః=ఎవఁడు, ప్రయాణకాలే=ప్రాణ ప్రయాణ కాలమునందు, అచలేన+మనసా = చలింపని మనస్సుచేతనైనను, యోగబలేన+చ+ఏవ= అభ్యాసవశముచేతనైనను, భక్త్యా+యుక్తః+(సన్) = భక్తితోఁ గూడినవాఁడై, ప్రాణమ్=ప్రాణమును, భ్రువోః+మధ్యే=భ్రూమధ్యమందు, సమ్యక్+ఆవేశ్య= చక్కఁగా నిలిపి, కవిమ్=సర్వజ్ఞుఁడును, పురాణమ్=అనాదియైనవాఁడును, అను శాసితారమ్=జగన్నియామకుఁడును, అణోః+అణీయాంసమ్=అణువులోనణువును, సర్వస్య+ధాతారమ్=సమస్తమును రక్షించువాఁడును, అచిన్త్యరూపమ్=చింతింప నలవిగాని స్వరూపముగలవాఁడును, తమసః+పరస్తాత్=ప్రళయ కాలమందలి పెంజీకటి కవ్వల, ఆదిత్యవర్ణమ్=సూర్యునివలెఁ బ్రకాశించువాఁడును, దివ్యమ్= అప్రాకృతుఁడునైన, పరమ్+పురుషమ్=పరమపురుషుని, అనుస్మరేత్=స్మరించు చున్నాఁడో, సః=వాఁడు, తమ్=ఆపరమపురుషుని, ఉపైతి=పొందుచున్నాఁడు.

ఆ విరాట్పురుషుఁ డెట్టివాఁడనగా సర్వజ్ఞుఁడును, పురాణ పురుషుఁడును. అనఁగా నాద్యంతములులేక యనాదిగానుండువాఁడును, జగన్నియామకుఁడును. అనఁగా, జగత్తునంతటిని నిచ్ఛామాత్రముచే సృజించువాఁడును, అట్లు సృజింపఁబడిన జగత్తునంతటిని రక్షించువాఁడును, అనఁగా నెంతకొద్దిజంతువైనను ఎంతగొప్పజంతువు నైననుసరే, దేనిదేని కేయేవేళల నెట్లుజరుగవలెనో దానిదానికాయావేళల నట్లుజరు పుచు నేమరక రక్షించువాఁడును, అణువులోనణువుగా నుండెడువాఁడును, ఇదమి త్థమని నిర్దేశించుటకు నలవిగాని స్వరూపముగలవాఁడును,

"క॥ లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగినతుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వఁడు
నేకాకృతి వెలుగునతని నే సేవింతున్॥" (భాగ. ౮ స్కం. ౭౨)

అనునట్లు, ఈసమస్తప్రపంచము నశించినపిమ్మట, అనఁగా బ్రళయమునొంది పెంజీకటిగప్పినపిమ్మటగూడ నట్టి పెంజీకటికవ్వలఁ దానొక్కఁడుమాత్రము సూర్యుని వలెఁ బ్రకాశించుచుండెడు వాఁడునునైయుంచున్నాఁడు. కాన నట్టి యప్రాకృతుఁ డగు పరమపురుషుని నెవఁడైతే ప్రాణ ప్రయాణకాలమందు వాని పూర్వజన్మ సంస్కార వశమున నపుడుగలిగిన మనోనిశ్చలత్వముచేతఁగాని, లేక యదివఱకు నెడ తెగక చేయుచుండిన యోగాభ్యాసవశముననఁగాని యచంచలమైన భక్తిగలవాఁడై ప్రాణాయామపూర్వకముగ అనఁగా బ్రాణవాయువును భ్రూమధ్యమందు నిలిపి స్మరింపుచున్నాఁడో యట్టివాఁ డాపరమపురుషునిఁ బొందఁగలఁడు.

అర్జు :— అయ్యా! అచంచలభక్తితోఁ గూడినవాఁడై ప్రాణాయామపూర్వకముగ నాపరమపురుషుని స్మరింపవలెనని చెప్పితివిగదా, అట్లు చెప్పుటకుఁ గారణ మేమి? భక్తితో స్మరించునపుడు ప్రాణాయామమునుగూడ నేలఁజేయవలయును ఆప్రాణాయామమనఁగా నెట్టిది?

శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సఙ్గ్రహేణ ప్రవక్ష్యే॥ 11

అర్థము :— వేదవిదః=వేదవేత్తలు, యత్=దేనిని, అక్షరమ్=చలనములేనిదానిఁగా, వదన్తి=చెప్పుచున్నారో, వీతరాగాః=రాగరహితులైన, యతయః=యతులు, యత్=దేనిని, విశన్తి=ప్రవేశింపుచున్నారో (అవలంబించుచున్నారో), యత్=దేనిని, ఇచ్ఛన్తః=ఇచ్ఛగించినవారగుచు, బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచారివ్రతమును, చరన్తి = ఆచరింపుచున్నారో, తత్ + పదమ్ = ఆప్రయత్నమును (మార్గమును), తే=నీకొఱకు, సఙ్గ్రహేణ=సంక్షేపముగా, ప్రవక్ష్యే=చెప్పుచున్నాను.

కృ — ఓయియర్జునా! ఎవఁడైననుసరే ఇతరకాలములయందెంత భక్తియుతుఁడై భగవంతుని ధ్యానించుచుండినను, ప్రాణప్రయాణ సమయమందు మాత్రమట్టి భక్తి నిలుపుటకష్టము. ఏలయనఁగా,

“ సీ. అతిరోగపీడితుండై మందమగుజఠరాగ్నిచే మిగుల నల్పాసియగుచు
మెఱసివాయువుచేత మీదికినెగసిన కన్నులు కఫమునఁ గప్పఁబడిన
నాళంబులను గంఠనాళంబునను ఘురఘురయను శబ్దంబు దొరయ బంధు
జనులమధ్యంబున శయనించి బహువిధములఁ దన్నుఁబిలువంగఁ బలుకలేక

గీ. చటులతర కాలపాశ వశంగతాత్ముఁ
డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు
చింత వికలములైన హృషీకములను
గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁడగుచు.

క. వెడరూపుఁ దాల్చి బాంధవు
లడలఁగ నిర్యాణమునకు నభిముఖుఁడై యి
ల్వెడలఁగఁ జాలక శునకము
వడువునఁగుడుచుచును మేను వడవడవడఁకన్;”

(భాగ. 3 స్కం. 30, 30).

అనునట్లు, అట్టిసమయమున నతిరోగపీడితుండును, మందగించిన జఠరాగ్ని గలవాఁడునునై, వాయువుచేత నరములీడ్వఁబడుచుండ మిడిగ్రుడ్లుగలవాఁడై కంఠమునఁ గఫ మడ్డగింపఁగా గుఱుకపెట్టుచు నపుడు బంధుజనులందఱుఁ దన్ను బరివేష్టించి రోదనము సేయుచుండ నేదియుఁ దోఁచక యింద్రియపటుత్వము దప్పినవాఁడును, తాను దరిద్రుఁడుగానుండినయెడలఁ దనతదనంతరము తనదారపుత్రాదు లెట్లు జీవింతురో యనెడు చింతయును, ధనికుఁడుగానుండినయెడలఁ దనగృహారామక్షేత్రాదులును, ధనకనకవస్తువాహనాదు లేమగునో యనియెడు చింతయును గలవాఁడై, కాలపాశము దన్ను లాగుచుండ, వీరలనందఱను విడిపోజాలక ప్రాణము గొట్టుకలాడుచుండును. కాన నట్టి సమయమున నెంతభక్తిపరునకైనను మనస్సును జలింపనీక భగవంతునియందు నిలిపి ధ్యానముచేయుట కష్టసాధ్యముగ నుండును. అయితే, అట్టిసమయమునఁ బ్రాణాయామముఁ జేసినయెడల నట్లు మనస్సునిలుపుటకు సాధ్యపడఁగలదు. కనుకనే, వేదవేత్త లగువారు మరణకాలమందుఁ బ్రాణాయామమే చలనములేని మార్గమని చెప్పియున్నారు. ఇంతియకాక కామాద్యరిషడ్వర్గమును జయించిన యతులు సయితమీమార్గమునే యవలంబింపుచున్నారు. అనఁగా, మరణకాలమందుఁ బ్రాణాయామము సేయుచుఁ బ్రాణములను విడుచుచున్నారు. మఱికొందఱు ప్రాణప్రయాణకాలమున నీషణత్రయముచేమనస్సుచలింపఁకుండవలయుననియుఁ బ్రాణాయామమును సులభముగఁ జేయఁ దగియుండవలెననియుఁ గోరికెగలవారై తదనుగుణ్యమగు బ్రహ్మచర్యవ్రతమునే యాచరించు చున్నారు. అనఁగా, గృహస్థాశ్రమము నంగీకరించినయెడల దారపుత్రాదికమగు నీషణత్రయముచే మనస్సు చలింపబడుచుండునుగనుక నట్టిమనస్సును మరణకాలమందు నిశ్చలముగ నుంచుకొనుటకును, ప్రాణాయామమును సులభముగ నాచరించుటకును, వీలుపడదనెడుభయము చేతనే యట్టి గృహస్థాశ్రమము నవలంబింపక జీవితకాలమంతయు బ్రహ్మచర్యవ్రతమునే యవలంబించుచున్నారు. కాన నట్లు ముముక్షువులకుఁ బరమపదమును బొందుట కేమార్గమునైతే చలనములేక యుండునని వేదవిదులు చెప్పుచున్నారో, రాగద్వేషరహితులగు యతులు పరమపదమును జెందుట కేమార్గమునైతే యవలంబించుచున్నారో, మఱియు జ్ఞానులగు కొందఱట్టి బరమపదమును బొందుటకు నేమార్గము నవలంబింపఁగోరినవారై యందున కనుగుణ్యమగు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నారో, అట్టి యీప్రాణాయామమనెడి మార్గము నీకు సులభముగ బోధపడునట్లు సంగ్రహముగఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥12

అర్జు:— అయ్యా! అచంచలభక్తితోఁ గూడినవాఁడై ప్రాణాయామపూర్వకముగ నాపరమపురుషుని స్మరింపవలెనని చెప్పితివిగదా, అట్లు చెప్పుటకుఁ గారణ మేమి? భక్తితో స్మరించునపుడు ప్రాణాయామమునుగూడ నేలఁజేయవలయును ఆప్రాణాయామమనఁగా నెట్టిది?

శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సఙ్గ్రహేణ ప్రవక్ష్యే॥ 11

అర్థము :— వేదవిదః=వేదవేత్తలు, యత్=దేనిని, అక్షరమ్=చలనములేని దానిఁగా, వదన్తి=చెప్పుచున్నారో, వీతరాగాః=రాగరహితులైన, యతయః=యతులు, యత్=దేనిని, విశన్తి=ప్రవేశింపుచున్నారో (అవలంబించుచున్నారో), యత్=దేనిని, ఇచ్ఛన్తః=ఇచ్ఛగించినవారగుచు, బ్రహ్మచర్యమ్ = బ్రహ్మచారివ్రతమును, చరన్తి = ఆచరింపుచున్నారో, తత్ + పదమ్ = ఆప్రయత్నమును (మార్గమును), తే=నీకొఱకు, సఙ్గ్రహేణ=సంక్షేపముగా, ప్రవక్ష్యే=చెప్పుచున్నాను.

కృ — ఓయియర్జునా! ఎవఁడైననుసరే ఇతరకాలములయందెంత భక్తియుతుఁడై భగవంతుని ధ్యానించుచుండినను, ప్రాణప్రయాణ సమయమందు మాత్రమట్టి భక్తి నిలుపుటకష్టము. ఏలయనఁగా,

“ సీ. అతిరోగపీడితుండై మందమగుజఠరాగ్నిచే మిగుల నల్పాశియగుచు
మెఱసివాయువుచేత మీదికినెగసిన కన్నులు కఫమునఁ గప్పఁ బడిన
నాళంబులను గంఠ నాళంబునను ఘురఘురయను శబ్దంబు దొరయ బంధు
జనులమధ్యంబున శయనించి బహువిధములఁ దన్నుఁబిలువంగఁ బలుకలేక

గీ. చటులతర కాలపాశ వశంగతాత్ముఁ
డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు
చింత వికలములైన హృషీకములను
గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁడగుచు.

క. వెడరూపుఁ దాల్చి బాంధవు
లడలఁగ నిర్యాణమునకు నభిముఖుఁడై యి
ల్వెడలఁగఁ జాలక శునకము
వడువునఁగుడుచుచును మేను వడవడవడఁకన్.”

(భాగ. 3 స్కం. ౯౨౩, ౯౨౪).

అనునట్లు, అట్టిసమయమున నతిరోగపీడితుండును, మందగించిన జఠరాగ్ని గలవాఁడునునై, వాయువుచేత నరములీడ్వఁబడుచుండ మిడిగ్రుడ్లుగలవాఁడై కంఠమునఁ గఫ మడ్డగింపఁగా గుఱుకవెట్టుచు నప్పుడు బంధుజనులందఱుఁ దన్నుఁ బరివేష్టించి రోదనము సేయుచుండ నేదియుఁ దోఁచక యింద్రియపటుత్వము దప్పినవాఁడును, తాను దరిద్రుఁడుగానుండినయెడలఁ దనతదనంతరము తనదారపుత్రాదులెట్లు జీవింతురో యనెడు చింతయును, ధనికుఁడుగానుండినయెడలఁ దనగృహారామక్షేత్రాదులును, ధనకనకవస్తువాహనాదు లేమగునో యనియెడు చింతయును గలవాఁడై, కాలపాశము దన్నులాగుచుండ, వీరలనందఱను విడిపోజాలక ప్రాణము గొట్టుకలాడుచుండును. కాన నట్టి సమయమున నెంతభక్తిపరునకైనను మనస్సును జలింపనీక భగవంతునియందు నిలిపి ధ్యానముచేయుట కష్టసాధ్యముగనుండును. అయితే, అట్టిసమయమునఁ బ్రాణాయామముఁ జేసినయెడల నట్లు మనస్సునిలుపుటకు సాధ్యపడఁగలదు. కనుకనే, వేదవేత్తలగువారు మరణకాలమందుఁ బ్రాణాయామమే చలనములేని మార్గమని చెప్పియున్నారు. ఇంతియకాక కామాద్యరిషడ్వర్గమును జయించిన యతులు సయితమీమార్గమునే యవలంబింపుచున్నారు. అనఁగా, మరణకాలమందుఁ బ్రాణాయామము సేయుచుఁ బ్రాణములను విడుచుచున్నారు. మఱికొందఱు ప్రాణప్రయాణకాలమున నీషణత్రయముచే మనస్సు చలింపకుండవలయుననియుఁ బ్రాణాయామమును సులభముగఁ జేయఁ దగియుండవలెననియుఁ గోరికగలవారై తదనుగుణ్యమగు బ్రహ్మచర్యవ్రతమునే యాచరించుచున్నారు. అనఁగా, గృహస్థాశ్రమము నంగీకరించినయెడల దారపుత్రాదికమగు నీషణత్రయముచే మనస్సు చలింపబడుచుండునుగనుక నట్టిమనస్సును మరణకాలమందు నిశ్చలముగ నుంచుకొనుటకును, ప్రాణాయామమును సులభముగ నాచరించుటకును, వీలుపడదనెడుభయము చేతనే యట్టి గృహస్థాశ్రమము నవలంబింపక జీవితకాలమంతేయు బ్రహ్మచర్యవ్రతమునే యవలంబించుచున్నారు. కాన నట్లు ముముక్షువులకుఁ బరమపదమును బొందుట కేమార్గమునైతే చలనములేక యుండునని వేదవిదులు చెప్పుచున్నారో, రాగద్వేషరహితులగు యతులు పరమపదమును జెందుట కేమార్గమునైతే యవలంబించుచున్నారో, మఱియు జ్ఞానులగు కొందఱట్టి బరమపదమును బొందుటకు నేమార్గము నవలంబింపఁగోరినవారై యందున కనుగుణ్యమగు బ్రహ్మచర్యవ్రతము నాచరించుచున్నారో, అట్టి యీప్రాణాయామమనెడి మార్గము నీకు సులభముగ బోధపడునట్లు సంగ్రహముగఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్॥12

శ్లో॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మా మనుస్మరన్ !
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్॥ 13

అర్థము :— సర్వద్వారాణి = సమస్తద్వారములను (నవరంధ్రములను), సంయమ్య = బిగఁబట్టి, మనః = మనస్సును, హృది = హృదయకమలమందు, నిరుధ్య+చ = నిరోధించి, ఆత్మనః = తనయొక్క, ప్రాణమ్ = ప్రాణవాయువును, మూర్ధ్ని = కపాలమునందు (సహస్రారమందు), ఆధాయ = నిలిపి, యోగధారణమ్ = యోగధారణమును (సమాధిని), ఆస్థితః+(సన్) = పొందినవాఁడై, బ్రహ్మ=పరబ్రహ్మవాచకమగు, ఓమ్+ఇతి+ఏకాక్షరమ్=ఓమ్ అనెడుఁ బ్రణవమును, వ్యాహరన్=ఉచ్చరింపుచు, మామ్=(అబ్రహ్మస్వరూపుడనగు) నన్ను, అనుస్మరన్ = స్మరింపుచు, యః = ఎవఁడు, దేహమ్ = శరీరమును, త్యజన్ = విడిచినవాఁడై, ప్రయాతి = పోవుచున్నాఁడో, సః = వాఁడు, పరమామ్+గతిమ్ =పరమపదమును (మోక్షమును), యాతి= పొందుచున్నాఁడు.

అప్రాణాయామమెట్టిదనఁగా, నవద్వారములను బిగఁబట్టి రేచక పూరకములనెడు వాయుసంచారములను నిలిపి, అనఁగా ఉచ్ఛ్వాసనిశ్వాసములను బంధించి అనఁగా నితర యేవిషయములయందును బ్రవేశింపకుండ నిరోధించి, ప్రాణవాయువును స్తంభించి సిరస్సునకెక్కించి దృష్టిని భ్రూమధ్యమందు నిలుపవలయును. ఇట్లు నిలుపుటయే యోగధారణ యనఁబడును. అట్టియోగమును ధరించి సమాధి నిష్టయందున్నవాఁడై ప్రణవోచ్చారణఁ జేయుచు, అనఁగా, పరబ్రహ్మప్రతిపాదకమగు (ఓమ్) అను నేకాక్షరమును స్మరింపుచు నాప్రణవ స్వరూపుఁడనగు నన్ను ధ్యానింపుచుఁ బ్రాణము విడువవలయును. అట్లెవఁడు విడుచుచున్నాఁడో, వాఁడు నాస్థానమగు పరమపదమును బొందఁగలఁడు. అదెట్లనఁగా, ఎప్పుడైతే నవద్వారములను బిగఁబట్టి ప్రాణవాయువును సిరస్సునకెక్కించి దృష్టిని భ్రూమధ్యమున నిలుపుచున్నాఁడో అప్పుడువానికి నెదుటనుండు వానిలో నేదియుఁ గనఁబడుట గాని వినఁబడుటఁగాని యుండదు. కాన నపుడు వానింబరివేష్టించి యేడ్చుచుండెడు బంధుజనులను దృష్టించి చూచుటగాని వారల రోదనధ్వనుల వినుటగాని యుండదు. కాన వారలయెడల మనస్సుచలింపక తాను లక్ష్యముంచియుండు పరబ్రహ్మయందే మనస్సు నిలకడగా నుండును. అట్టి నిలకడగలమనస్సుతో ధ్యానింపుచు నాపరబ్రహ్మ ప్రతిపాదకమగు ప్రణవము నుచ్చరింపుచుఁ బ్రాణము విడిచినయెడల నాపరబ్రహ్మమును బొందుట కేమియు సంశయము లేదు.

శ్లో॥ అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః॥ 14

అర్థము :— హేపార్థ! = ఓయియర్జునా!, యః = ఎవఁడు, నిత్యశః = ప్రతిదినమును, సతతమ్ = ఎల్లప్పుడు, అనన్యచేతాః (సన్) = ఇతరచింతలేనివాఁడగుచు, మామ్ = నన్ను, స్మరతి = స్మరించుచున్నాఁడో, తస్య = అట్టి, నిత్యయుక్తస్య= నిరంతరధ్యానపరుఁడైన, యోగినః = యోగికి, అహమ్ = నేను, సులభః = సులభుఁడను (సులభముగాఁ బొందఁబడఁదగినవాఁడను).

అయితే ప్రాణప్రయాణ సమయమునందట్లు ప్రాణాయామపరుఁడై యచంచలభక్తితో నన్నుస్మరించుట మిక్కిలి దుర్లభము. ఒకమాత్రపువానికి సాధ్యపడనేరదు. మఱియెట్టివానికదిసులభ సాధ్యమనఁగా, ఎవఁడైతే దేహదారుఢ్య మనోదారుఢ్యములు రెండును జక్కఁగానుండునప్పుడే యిట్టియోగధారణ నభ్యసించుచున్నాఁడో, వానికది యభ్యాసవశమున మరణకాలమందుగూడ నలవడును. కనుకనే గదా, "అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా। పరమం పురుషందివ్యం యాతిపార్థానుచిన్తయన్॥" (చూ. 8-8) అని యింతకు ముందు చెప్పుటకుఁగారణమైనది. కాఁబట్టి యోయి యర్జునా! ఎవఁడైతే మరణకాలమునకుముందు, జీవితకాలమంతయు నిత్యమునుదప్పక యిట్లు ప్రాణాయామపరుఁడై నిశ్చలచిత్తముతో నన్ను ధ్యానింపుచుండునో అట్టివానికి మరణకాలమందు నయితమట్టి ప్రాణాయామముఁ జేయుటకు సులభ సాధ్యమగునుగాన నట్టివానికి నేను సులభముగఁ బొందఁదగినవాఁడ నగుదును.

శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః॥ 15

అర్థము :— పరమామ్ + సంసిద్ధిమ్=పరమపదమును, గతాః=పొందిన, మహాత్మానః=మహానుభావులు, మామ్ + ఉపేత్య=నన్నుఁబొందినవారై, దుఃఖాలయమ్=దుఃఖభాజనమైనదియు, అశాశ్వతమ్=అనిత్యమైనదియునగు, జన్మ=జన్మమును, పునః=మరల, న + ఆప్నువన్తి=పొందరు.

అయితే, యావజ్జీవ పర్యంత మిట్లుకష్టపడి యోగము నభ్యసించుట మరణకాలమందు మనస్సు చలింపకుండ నన్నుధ్యానించుటకొఱకేగదా! అట్లు నన్ను ధ్యానించుట నాదగు పరమపదమును బొందుటకేగదా! అట్టి పరమపదమును బొందుటవలన గలిగెడు ప్రయోజన మేమంటివేని చెప్పెదవినుము.

"సీ. సూర్య చంద్రానల స్ఫురణలఁ జొరనీక, నిజదీధితిస్ఫూర్తి నివ్వటిల్ల
దివ్యమణిప్రభాదీపితసౌధ విమానగోపురహర్మ్య మండపములు
ప్రసవగుచ్ఛస్వచ్ఛభరిత కామితఫలసంతానపాదపసముదయములు
గాంచనదండసంగత మారుతోద్ధూత తరళవిచిత్ర కేతనచయములుఁ.

గీ. వికచచక్రైరవదరదరవిందగతమ
రందరసపానమోదితేందిందిర ప్ర
భూతమంజుల నినదప్రబుద్ధరాజ
హంసశోభిత వరకమలాకరములు.

సీ. వలనొప్పఁ గానదైవంకేళ వాత్సరమ్మనిపల్కు రాజకీరావళియును
'మహిమసర్వంవిష్ణుమయము జగత్తని' చదివెడు శారికాసముదయంబు
నేపారఁ 'గాజితంతే పుండరీకాక్ష' యని లీలఁబాడు పికావళియును
లలిమీఱఁగా 'మంగళం మధుసూదన' యనుచుఁబల్కెడు మయూరా
వళియును.

గీ. దవిలి క్రౌంచద్వషట్స్వధేద్యాదిశబ్ద
కలితముగ మ్రోయు మధుపనికాయములును
గలిగి యక్షైకదివ్యమంగళవిలాస
మహిమఁజెన్నొందు వైకుంఠమందిరంబు"

(భాగ. ౨ సం. ౨౨౭, ౨౨౮.)

అనునట్టిట్టి పరమపదంబునందుండి పునర్జన్మలేక నిత్యానందము ననుభవింపుచుండుటయే యందువలనఁగలిగెడు పరమప్రయోజనము గానున్నది. పునర్జన్మగలిగిన యెడల నందువలనఁ గలిగెడు చెరుపేమి యందువేని చెప్పెదవినుము. జన్మయెంత యుత్కృష్టమైనదైననుసరే, లేక, యెంతనికృష్టమైనదైననుసరే, అనేకవిధములగు దుఃఖములకుఁ గారణభూతమైనదిగనే యుండును గాని సుఖకరమైనదిగా నుండనేరదు. మఱియు నెట్టిజన్మయైననుసరే యశాశ్వతమైనదియేగాని శాశ్వతమైనది కాదు. కనుక నిట్టి యశాశ్వతమైనట్టియు, దుఃఖకారణమైనట్టియు, జన్మమరలఁ గలుగకుండుటయే యందువలనఁ గలిగెడు పరమప్రయోజనమని యెఱుంగుము.

శ్లో॥ ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున !
మా ముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే॥ 16

అర్థము :— హేఅర్జున !=ఓయియర్జునుఁడా!, ఆబ్రహ్మభువనాత్ + లోకాః= బ్రహ్మలోకము మొదలగు లోకములన్నియు, పునరావర్తినః=పునర్జన్మమునుగలుగఁ

జేయునట్టివి, హే కౌన్తేయ !=ఓయర్జునా !, మామ్ + ఉపేత్య + తు=నన్ను బొందినట్లైనచో, పునర్జన్మ=మరుజన్మము, న + విద్యతే=కలుగదు.

మంచిది, ఒకవేళ స్వర్గాది బ్రహ్మపర్యంతముగల భువర్లోక-సువర్లోక-మహర్లోక-జనలోక-తపోలోక-సత్యలోకము లనెడు యూర్ధ్వలోకములకుఁ బోయిన యెడల నచ్చట శాశ్వతముగ నుండఁగూడదాయని యెంతువేమో. అట్లెంచఁగూడదు. ఏలయనఁగా, ఆయూర్ధ్వలోకములన్నియుఁగూడ నశించునట్టివిగానేయున్నవిగాన నాలోకములకుఁ బోయినవారుగూడ నాలోకము లుండునంతవఱకు నుండినను ఆ లోకములంతమొందినపిదప మరల జన్మనెత్తవలసిన వారుగనే యుంచున్నారు. నన్ను బొందినవారు, అనఁగా, నాదగు పరమపదమును బొందినవారు మాత్రమే పునర్జన్మ రహితులగుచున్నారు.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! ఇచట బ్రహ్మయని చెప్పుటవలన నీభావమేమి ? చతుర్ముఖ బ్రహ్మయనియా ? అట్లైనయెడల నాబ్రహ్మ సమస్తజగత్తునకును సృష్టికర్తగదా ? అట్టిబ్రహ్మయుండెడు సత్యలోకముగూడఁ దక్కినలోకములవలె నశాశ్వతమైనదేనా ?

శ్లో॥ సహస్రయుగపర్యన్త మహ ర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రింయుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః ॥ 17

అర్థము :— (యే) జనాః = ఏజనులు, యత్ + అహః = ఏ పగటిని, సహస్రయుగపర్యన్తం=వేయియుగములు గలదానినిగాను, (యత్) + రాత్రిం= ఏరాత్రిని, యుగసహస్రాన్తం + (చ)=వేయియుగముల, పరిమితిగలదానినిగను, విదుః=ఎఱుఁగుచున్నారో, తే=అట్టివారలు, బ్రహ్మణః = (చతుర్ముఖ) బ్రహ్మయొక్క, అహోరాత్రవిదుః = అహోరాత్రములనెరింగినవారగుదురు.

కృ — ఔను అందులకేమియు సందియము లేదు ఆచతుర్ముఖ బ్రహ్మయుండెడు సత్యలోకముగూడ నశాశ్వతమయినదియే. ఐనను తక్కిన యన్నిలోకముల కంటెనది యెక్కుడు కాలముండును. అదెట్లనఁగా "చతుర్యుగసహస్రాన్తంబ్రాహ్మణోదివముచ్యతే" అనునట్లు, కృత, త్రేత, ద్వాపర, కలియుగములు నాలుగును జేరి యొక మహా యుగమనఁబడుచున్నది అట్టి మహాయుగములువేయిగడచిన యెడల నాచతుర్ముఖ బ్రహ్మకు నొకపగలగుచున్నది.

" గీ. ఆయుగంబులు నాల్గు మహాయుగంబు
నాఁగఁ జనుఁ దత్సహస్రంబు నలువపగలు

దానికొలఁదియ రేయును దీని నెఱుఁగు
ప్రౌఢజనములు సుమ్మహో రాత్రవిదులు.” (భార. శాంతి. ౨ ఆ. ౨౪)

అనునట్లు, అంతియ పరిమితిగల కాల మొక రాత్రి యగుచున్నది. ఇట్టిరాత్రిం బగళ్లు ముప్పది యైనయెడల నొకమాసమును, ఇట్టిమాసములు పండ్రెండైనయెడల నొక సంవత్సరమును నగుచున్నది. ఇట్టి సంవత్సరములునూఱైనయెడల నాబ్రహ్మకుఁ బ్రళయము కలుగును. అదియే బ్రహ్మ ప్రళయ మనంబడును. ఇట్లెవరెఱుఁగుచున్నారో వారలు బ్రహ్మయొక్క యాయుస్సుగూడఁ బరిమితి గలదనియు, ఆబ్రహ్మయుండెడు సత్యలోకముగూడ నంతముగలదనియు నెఱుఁగఁ గలరు. కాన నట్టి బ్రహ్మలోక మునకుఁ బోయెడువారలకుఁ గూడఁ బునర్జన్మము గలుగుననియే యెఱుంగుము.

శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయ న్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥ 18

అర్థము :— వ్యక్తయః = చక్షురాదీంద్రియములకు గోచరించుచుండెడు, సర్వాః=(స్థావరజంగమములు) అన్నియు, అహరాగమే = పగటియారంభమునందు, అవ్యక్తాత్ = చక్షురాదీంద్రియములకుగోచరించని ప్రకృతినుండి, ప్రభవన్తి=పుట్టుచున్నవి. రాత్ర్యాగమే=రాత్రియారంభమునందు, అవ్యక్తసంజ్ఞకే=అవ్యక్తమను పేరుగల, తత్ర+ఏవ=అప్రకృతియందే, ప్రలీయన్తే=లీనమగుచున్నవి.

అదెట్లనఁగా, చతుర్యుగసహస్రము బ్రహ్మకొక పగలగునని చెప్పితినిగదా, అట్టిపగలు గడచినపిమ్మట, అనఁగా కృత, త్రేత, ద్వాపర, కలియుగములు వేయుమాఱులు మాఱఁగా బ్రహ్మకొకపగలగును. అపుడీ ప్రపంచమంతయు జలమయమై యుండుటయ గాక సూర్యచంద్రాదులు ప్రకాశించుటయును లేక గాఢాంధకారము గప్పియుండును. అపుడీప్రపంచమునందలి చరాచరము లన్నియుఁ బ్రకృతియందు లీనమైయుండును. అట్లెప్పుడగుచున్నదో అప్పుడు చతుర్ముఖబ్రహ్మకు రాత్రికాలమారంభమగును. అనఁగా, బ్రహ్మనిద్రించు కాలమగును. అట్లుబ్రహ్మకుఁ బగలెంత కాలము జరిగెనో యంతకాలము, అనఁగా, చతుర్యుగసహస్రకాల పర్యంతమీప్రపంచ మంతయు జలమయమై యంధకారబంధురముగ నుండును. అట్లంతకాలము జరిగిన పిమ్మట బ్రహ్మనిద్రమేలుకొను కాలమగును. అనఁగా బ్రహ్మకుఁ బగటివేళ యారంభమగును. అట్లెప్పుడగుచున్నదో యప్పుడంతవరకుఁ బ్రకృతియందు లీనమైయుండిన చరాచరములన్నియు మరల నుత్పత్తియగును.*

శ్లో॥ భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే॥ 19

అర్థము :— హే పార్థ ! = ఓయి యర్జునా!, సః + అయమ్ = అట్టియీ, భూతగ్రామః + ఏవ = భూతసముదాయమే, అవశః = స్వాతంత్ర్యము లేనిదై, భూత్వా భూత్వా = పుట్టి పుట్టి (అనేక జన్మల నెత్తి), రాత్ర్యాగమే = రాత్రి రాగా, ప్రలీయతే = లీనమగుచున్నది, (పునః) = మరల, అహరాగమే = పగలు రాగా, ప్రభవతి = పుట్టుచున్నది.

అట్లుత్పత్తియైన భూతసముదాయము, అనఁగా, చరాచరములన్నియు, మరల బ్రహ్మకుఁబగటి కాలము జరుగునంత వఱకు, అనఁగా, మరలఁ జతుర్యుగములు వేయి మారులు జరుగునంత వఱకు నస్వాధీనములై యనేక జన్మల నెత్తుచుండును. అనఁగా నాయా ప్రాణులు కొంతకాల మీ ప్రపంచమున నటించి మృతినొంది యటుపిమ్మట వాని వాని సుకృతదుష్కృతములకు ననుగుణ్యములగు జన్మల నెత్తుచుండును. ఇట్లా వేయి యుగములు జరుగునంతవఱకుఁ గర్మపరాధీనములై యసంఖ్యాకములగు జన్మల నెత్తుచు నా వేయి యుగములు పూర్తియై బ్రహ్మకు రాత్రి కాలము రాగానే, అనఁగా, బ్రహ్మ నిద్రించు కాలము రాగానే యా భూతములన్నియుఁ బ్రకృతియందు లీనమై పోవును. అనఁగా, అదివఱకువలెఁ బుట్టుట, చచ్చుట, మరలఁబుట్టుట అను నీవ్యాపారములు లేనివై ప్రకృతియందడఁగి యాప్రకృతి వలెనే యవ్యక్తమై యుండును. అట్లు బ్రహ్మ నిద్రించువఱకు అనఁగా, వేయి మహాయుగముల కాలపర్యంత మాప్రకృతియందు లీనమైయుండి తిరుగా బ్రహ్మ మేలుకొను కాలము వచ్చినపుడు మరల నా ప్రకృతినుండి పుట్టుచుండును.

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్ ।
యంప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ ॥ 21

అర్థము :— తస్మాత్ + అవ్యక్తాత్ = ఆప్రకృతికంటె, పరః = శ్రేష్ఠమైనదియు, అవ్యక్తః = అగోచరమైనదియు, సనాతనః = అనాదియైనదియునగు, అన్యః = మఱియొకటి, యః = ఏదికలదో, సః + భావః + తు = ఆవస్తువన్ననో, సర్వేషు + భూతేషు = సమస్తభూతములు, నశ్యత్సు + (సత్సు) = నశింపుచుండఁగా, న + వినశ్యతి = నశింపదు, (సః + ఏవ) = ఆవస్తువే, అవ్యక్తః = అగోచరమైన, అక్షరః = అక్షరపరబ్రహ్మము, ఇతి + ఉక్తః = అని చెప్పఁబడుచున్నది, యమ్ + ప్రాప్య = ఏపరబ్రహ్మమును బొంది, న + నివర్తన్తే = మరలరో, తమ్ = ఆపరబ్రహ్మమును, పరమామ్ + గతిమ్ = పరమప్రాప్యస్థానమును గా, ఆహుః = చెప్పుదురు, తత్ + (ఏవ) = అదియే, మమ = నాయొక్క, పరమమ్ + ధామ = పరమపదము.

ఇట్లు కాఁగఁగాఁగ నాచతుర్ముఖబ్రహ్మ కీపరిమాణ ప్రకారము నూఱుసంవత్సరములగు నప్పటికి బ్రహ్మ ప్రళయమగును. అనఁగా నాచతుర్ముఖ బ్రహ్మగూడ నంతమునొందును. కాన నట్టి బ్రహ్మలోకమునకుఁ బోయినవారుగూడ నాబ్రహ్మ ప్రళయానంతరము మరల జన్మించవలసినవారుగనే యున్నారు. అయితే, ఇఁక నేలోకమునకుఁబోయిన వారికిఁ బునర్జన్మ గలుగనేరదని యడిగెదవేని చెప్పెద వినుము. ఇపుడు నేఁజెప్పిన ప్రకృతిస్వరూపమగు చతుర్ముఖబ్రహ్మకంటె శ్రేష్ఠమైనదియు, చక్షురాదీంద్రియములకు గోచరించనిదియు, ఇదమిత్థమని నిర్దేశింపఁగూడనిదియు, అనాదియైనదియు, అనఁగా నాద్యంతరహితమైదియునగు వస్తువు మఱియొకటి గలదు. అవస్తువిపుడు నేఁజెప్పిన ప్రకారము సమస్తభూతములు నశించినను, అట్టిభూతముల నుత్పత్తిచేసెడు బ్రహ్మనశించినను, ఆ వస్తువుమాత్ర మెప్పటికిని నశించునది కాదు. కనుకనే దానిని అవ్యక్తుఁడు (కనఁబడనివాఁడు) అనియు, అక్షరుఁడు (నాశములేనివాఁడు) అనియుఁజెప్పుదురు. కాన నదియే పరబ్రహ్మమనఁబడుచున్నది. కాననట్టి పరబ్రహ్మము నెవరు పొందుచున్నారో ఆట్టివారు మరల నీలోకమునకురారు. అనఁగా నట్టివారికిఁ బునర్జన్మము గలుగనేరదనుట. ఏస్థానమును బొంది పునర్జన్మకు రారో, అదియే పరమప్రాప్యస్థానమని పెద్దలు చెప్పుదురు. అదియే నాదియగు పరమపదము (వైకుంఠము) అని యెఱుంగుము.

శ్లో॥ పురుష స్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా ।
యస్యాన్తస్స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥ 22

అర్థము :— హే పార్థ! = ఓయియర్జునా!, భూతాని = ప్రాణులు, యస్య + అన్తస్థాని = ఎవనిలోపలనుంచున్నవో, ఇదమ్ + సర్వమ్ = ఈప్రపంచమంతయు, యేన + తతమ్ = ఎవనిచే వ్యాపింపఁబడియున్నదో, సః + పరః + పురుషః + తు = అట్టిపరమపురుషుఁడన్ననో, అనన్యయా + భక్త్యా = అచంచలభక్తిచేత, లభ్యః = పొందఁబడఁదగినవాఁడు.

అవైకుంఠమెట్లుండుననఁగా,

"సీ. వలనొప్పఁగానదైవంకేశవాత్పర మ్మనిపల్కు రాజకీరావళియును
మహిమసర్వంవిష్ణుమయముజగ త్తని చదివెడు శారికాసముదయంబు
నేపారగాజితంతేపుండరీకాక్ష యని లీలఁబాడు పికావళియును
లలిమీరఁగా మంగళం మధుసూదన యనుచుఁ బల్కెడు మయూరా
వళియును

దవిలి క్రౌంచద్వీపషట్స్వధేత్యాదిశబ్ద
కలితముగ బ్రోయు మధుపనికాయములను
గలిగి యఖిలైకదివ్యమంగళవిలాస
మహిమఁజెన్నొందు వైకుంఠమందిరంబు". (భాగ. ౨ స్కం. ౨౨౫)

అనునట్టి పరమపదమునందలి శుకపికాదులు సయితము సమస్తప్రపంచము పరమపురుషుఁడనగు నా స్వరూపమేయని ఘోషించుచుండును. అట్టి సమస్త ప్రపంచమెవనియం దణఁగియున్నదో, ఈ ప్రపంచమంతటను నెవఁడు వ్యాపించి యున్నాఁడో, అట్టియా పరమపురుషుని నెట్టివాఁడు పొందఁగలఁడనఁగా,

"తే. విష్ణుమాయను దోచునీ విష్టపములు
భిత్తిచిత్రంబువిధమున ఫేనభంగి
బుద్బుదాకృతిగాఁగను బుధుఁడుఁజూని
సరకుసేయక మోక్షంబు తెరువు వెదకు" (భార. శాంతి. ౫ ఆ. ౬౧౨).

అనునట్లు సత్యలోకము వఱకుఁగల యన్నిలోకములును విష్ణుమాయాసంభూతములనియును, గోడలమీఁది చిత్రములవలెను నీటిమీఁదినురుఁగువలెను నీటిబుగ్గలవలెను నశాశ్వతములైనవనియును ఎవఁడెఱిఁగి వానిలో దేనిని సరకుసేయక, వానినపేక్షింపక, వానికన్నిటికిని నావలదియును, ఉత్తమోత్తమమైనదియును, శాశ్వతమైనదియు నగు మోక్షమునే కోరుచుఁ దదితరములగు నేవియుఁ గోరనివాఁడై భక్తిఁజేయుచున్నాఁడో అట్టి యోగిమాత్రమే యాపరమపదమునకుఁ బోఁగలఁడు. కాని తదితరులగు యోగులు భక్తిఁజేసెడువారైనను నట్టి పరమపదమునకుఁ బోఁజాలరు.

అర్జు — అయ్యా! ఇట్లు చెప్పితివిగదా, యోగియనఁగా భగవద్భక్తిఁ జేయువానికే యన్వయించుచున్నదిగదా, అందుఁగొందఱు మాత్రము, అనఁగా, మోక్షేతరమైన చింతలేక భక్తిఁజేయువారు మాత్రమే పరమపదమును జెందఁగలరని చెప్పితివిగదా, తక్కిన యోగులగతి యేమగుచున్నది?

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తించైవ యోగినః ।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥　　23

అర్థము :— హేభరతర్షభ! = ఓయియర్జునా!, యోగినః = యోగులు, యత్ర + కాలే = ఏ కాలమునందు (మార్గమునందు), ప్రయాతాః + (సన్తః) = పోయినవారగుచు, అనావృత్తిమ్ = అపునరావృత్తిని (పునర్జన్మరాహిత్యమును), యాన్తి = పొందుచున్నారో, తమ్ + కాలమ్ + తు = ఆ కాలము (మార్గము)నున్ను, (యత్ర +

కాలే) = ఏ కాలమునందు (మార్గముగుండా), (ప్రయాతాః + సన్తః) = పోయిన వారగుచు, అవృత్తిమ్ = పునరావృత్తిని (పునర్జన్మమును), (యాన్తి) = పొందుచున్నారో, (తమ్ + కాలమ్) + చ + ఏవ = ఆ కాలమును (మార్గమును) గూడ, వక్ష్యామి = చెప్పుచున్నాను.

కృ — అట్టివారలును వారలభక్త్యనుష్ఠానములకుఁ దగినట్లు స్వర్గాది సత్యలోక ముకఱకుఁ గల యూర్ధ్వలోకములకుఁ బోయి యచ్చటఁ జిరకాలమువఱకు భోగము లననుభవించి "క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశన్తి" అనునట్లు మరల నీలోకమున జన్మింతురు. కాన యోగులలో రెండుతెగలవారు గలరనియు, అందొక తెగవారు పునరావర్తరహితమగు పరమపదమునకుఁ బోయెడువారనియు, రెండవతెగవారు పునరావృత్తిసహితమగు స్వర్గాద్యూర్ధ్వలోకములకుఁ బోయెడువారనియు నెఱుంగుము.

అర్జు — అయ్యా! అట్లైనయెడల నారెండు తెగలవారగు యోగులును నూర్ధ్వలోకమునకుఁ బోయెడు మార్గమొకటియే యైయున్నదా, లేక నారెండువిధముల వారికిఁ బ్రత్యేకములగు రెండుమార్గములున్నవా ?

కృ — ఆరెండు తెగలయోగులును బ్రత్యేకమార్గములనే పోవుచుందురు. అందు మొదటి తెగవారు పోయెడుమార్గము అర్చిరాదిమార్గ మనియు, రెండవ తెగవారు పోయెడు మార్గము ధూమాదిమార్గమనియు చెప్పఁబడును. అందు, అర్చిరాదిమార్గమునఁ బోయెడువారికిఁ బునర్జన్మకలుగనేరదు. ధూమాదిమార్గమునఁ బోయెడువారికిఁ బునర్జన్మకలుగును. కాన నారెండు మార్గము లెట్టివైనవియు వివరించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

అర్థము:— అగ్నిః = అగ్న్యభిమానిదేవతయు, జ్యోతిః = జ్యోతిరభిమానిదేవతయు, అహః = దివసాభిమానిదేవతయు, షణ్మాసాః + ఉత్తరాయణమ్ = ఆఱుమాసముల ప్రమాణముగల ఉత్తరాయణాభిమానిదేవతయు నగు సూర్యుఁడు (ఉండునట్టిది), శుక్లం = శుక్లమార్గము, బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలైన, జనాః = జనులు, తత్ర = ఆశుక్లమార్గమునందు, ప్రయాతాః + (సన్తః) = పోయినవారగుచు, బ్రహ్మ = పరబ్రహ్మమును, గచ్ఛన్తి = పొందుచున్నారు. తథా = అలాగుననే,

ధూమః = ధూమాభిమాని దేవతయు, రాత్రిః = రాత్ర్యభిమాని దేవతయు, షణ్మాసాః + దక్షిణాయనమ్ = ఆఱుమాసముల పరిమితిగల దక్షిణాభిమాని దేవతయునగు, చాన్ద్రమసమ్ + జ్యోతిః = చంద్రప్రకాశముగలది, కృష్ణః = కృష్ణమార్గము, తత్ర = ఆమార్గమునందు, ప్రాప్య = పొంది (పోయిఁ ట్టి), యోగీ = యోగి, నివర్తతే = మరలివచ్చుచున్నాఁడు, అనఁగా. పునర్జన్మ బొందుచున్నాఁ డనుట.

అట్లు మొదటితెరగతి యోగులు; అనఁగా, బ్రహ్మజ్ఞానసంపన్నులును, అపర బ్రహ్మమునే పొందఁగోరెడువారును నగు సాంఖ్యులు పోవునట్టి యర్చిరాదిమార్గ మెట్టిదనఁగా అగ్న్యభిమాని దేవతయు, తేజోభిమాని దేవతయు, దివసాభిమాని దేవతయు, ఆఱుమాసముల పరిమితిగల యుత్తరాయణాభిమాని దేవతయునగు సూర్యుని మార్గమైయున్నది. దీనికే శుక్లమార్గమనియు పేరు. ఈమార్గమునఁ బోయెడు వారు పరమపదమును జేరుదురు. అనఁగా, పరబ్రహ్మమును బొందుదురనుట.

అర్జు — అయ్యా! సూర్యమార్గమనఁగా నెట్టిదియో దానివివరించి చెప్పుము.

కృ — ఇపుడు నేఁజెప్పిన సూర్యమార్గము యోగములలో మొదటితెరగతి వారగు సాంఖ్యులు పోవునట్టిది. అదెట్లనఁగా, అట్టి యోగులలో "బహిస్స్పర్శంబులు దపోదండంబునం ద్రోలంగంజడిసి యాన పాత్రరూపంబుగా దీని (సాంఖ్యమును) నవలంబించిన యార్యుండు ప్రజ్ఞాకర్ణధారసామర్థ్యంబున దుఃఖోదకంబును వ్యాధిమృత్యుమహాగ్రాహంబును భయోరగంబును హింసావేగంబును రాగపంకంబును దృష్ణావర్తంబును నానాప్రీతిరత్నంబును సత్యతీరంబును నగు సంసారసాగరంబును నుత్తరించు. అసుకృతి నట సూర్యుండు దన రశ్ముల వహించినపుడు పద్మతంతుసన్నిభంబైనమార్గంబు ప్రవేశించి చనంజన సూక్ష్ముండును శీతలుండును సుగంధియు సుఖస్పర్శుండును సప్తమారుత శ్రేష్ఠుండును నగుపవనుం డెవ్వాని నభః పరమగతిం జేర్చు. నభంబు రజః పరమగతిని, రజస్సు సత్త్వపరమగతిని, సత్త్వంబు నారాయణుని, నారాయణుండు పరమంబునం జేర్చ నందుంగలసి తన్మయుండై యమృతత్వ నిత్యుండగు". (భార. శాంతి. ౫ ఆ. ౬౧౩) కాన నట్లు పరమంబునంగలసినవాఁడు

" క. పునరావర్తనరహితుం
డనఘా పరమాత్ముఁజెందినట్టి పురుషుఁడ
వ్వినుతావస్థను మోక్షుం
బని చెప్పుదురంత కంటె నధికముగలదే!"(భార. శాంతి. ౫. ఆ. ౬౧౯)

అనునట్లు పునరావృత్తిరహితుఁడు, అనగా, పునర్జన్మలేనివాఁడగును. అట్లగుటయే మోక్షమనఁబడును గాన నంతకంటె మేలగు మఱియొకటి లేదుగదా!

ఇఁకను రెండవతెరగతి యోగులేమగుదురనఁగా, వారలును మొదటి రగతి వారి

ష్టులెనే తొలుతఁబునరావృత్తి రహితమగు మోక్షమునే పొందగోరి భక్తిఁజేసెడు వారై యున్నారు. అయితే అట్టి యోగమునాచరించునపు డేదేనియొక కారణముచేఁ జలించినమనస్సుగలవారై యోగభ్రష్టులైన యెడల యేమగుదురని యిదివఱకే నీవు ప్రశ్నచేసి యుంటివిగదా ? (చూ 6-37-38). అందుకు నుత్తరముగా నట్టివారలు పుణ్యలోకములకుఁ బోయి యచటఁ జిర కాలమువఱకు భోగము లనుభవించి మరల నీలోకమున సదాచారసంపన్నులగు శ్రీమంతులవంశమునందుఁగాని, లేక యోగులవంశము నందుఁగాని జన్మింతురని చెప్పియుంటినిగదా ? జ్ఞాపకమున్నదా ? చూ(6-41-42).

అర్జు — అవును. జ్ఞాపకమున్నది.

కృ — అట్టివారలే రెండవతరగతి యోగులని యెఱుఁగుము. కాన నట్టివార లట్టి యోగాభ్యాసమున నేదేని యొక భంగముగలవారై యందువలన మోక్షమున కర్హులు గాకపోవుటచే నట్టి శుక్లమార్గమునఁ బోవుటకనర్హులై, *ధూమాభిమానిదేవతయు, రాత్ర్యభిమానిదేవతయు, ఆఱుమాసముల పరిమితిగల దక్షిణాయనాభిమాని దేవతయు నగు చంద్రునిమార్గమున స్వర్గాది పుణ్యలోకములకుఁ బోవుదురు. అదియే కృష్ణమార్గ మనఁబడును. అట్టిమార్గమునఁ బుణ్యలోకములకుఁబోయెడు యోగులు

" క. ఈ తెరువునఁ జరియించుచు
నే తెఱఁగున నైనఁ దప్పనేనియుఁ బురుషుం
డాతత నాకసుఖము గనుఁ
దో తెంచును మగుడ సద్బుధుల వంశమునన్ ॥ "

(భార. శాంతి ౫. ఆ. ౬—౨౭)

అనునట్లు, ఆలోకములయందలి భోగములననుభవించి మరల నీలోకమున జన్మింతురు. అయితే, అట్టివారు శ్రీమంతులయొక్క—గాని, లేక, జానులయొక్క—గాని వంశములయందే జన్మింతురు గానివారలకు నీచజన్మ కలుగనేరదు.

శ్లో ॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే॥
ఏకయా యాత్యనావృత్తి మన్యయావర్తతే పునః॥ 26

అర్థము :— జగతః=జగత్తునకు (జగత్తునందలి జనులకు), ఏతే=ఈ(పైఁజెప్పఁబడిన), శుక్లకృష్ణే=శుక్ల కృష్ణము లనెడు, గతీ=రెండుమార్గములు, శాశ్వతే=శాశ్వతములైనవియని, మతే+హి = (నా) అభిప్రాయముగదా, ఏకయా=ఒకదానిచేత, అనావృత్తిమ్+యాతి=పునర్జన్మరాహిత్యమును బొందుచున్నాఁడు. అన్యయా=మరియొకదానిచేత, పునః+ఆవర్తతే=మరల పుట్టుచున్నాఁడు.

* ఇచట ధూమమనఁగా, పొగవలె వ్యాపించెడు మంచున కన్వయించుచున్నది.

కాబట్టి యీ రెండుమార్గములు, అనగా నిపుడు నేఁజెప్పిన శుక్ల కృష్ణ మార్గములు రెండును, ఈలోకమునందలి యోగిజనులకు స్థిరముగా నేర్పడియున్నవని యెఱుఁగుము. అనఁగా, యోగులలోఁ గేవల నిర్గుణపరబ్రహ్మోపాసనఁ జేయు సాంఖ్యులగు యోగులు తొలుతఁ జెప్పఁబడిన యర్చిరాది శుక్లమార్గముగుండా పునరావృత్తిరహితమగు మోక్షపదవికిఁ బోయి యచ్చటనే శాశ్వతముగా నుందురనియు, తదితరులగు యోగులు ధూమాది కృష్ణమార్గముగుండా స్వర్గాది పుణ్యలోకములకుఁ బోయి యచటవారివారి సుకృతానుసంఖ్యాములగు భోగముల ననుభవించి మరల నీ లోకమున జన్మింతురనియు నెఱుఁగుము.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!॥　27

అర్థము :— హేపార్థ=ఓయర్జునా, ఏతే+సృతీ=ఈరెండుమార్గములును, జానన్=ఎఱిఁగినట్టి, యోగీ+కశ్చన=యోగియెవ్వఁడును, న+ముహ్యతి=మోసపోఁడు, తస్మాత్=కాఁబట్టి, హేఅర్జునా=ఓయర్జునుఁడా!, సర్వేషు+కాలేషు=సమస్తకాలములయందును, యోగయుక్తః+భవ=యోగయుక్తుడవు గమ్ము.

కావున నోయి యర్జునా! ఈశుక్లకృష్ణమార్గముల రెంటియొక్క సంగతి చక్కఁగా నెఱింగిన యోగులలో నెవఁడును మోసపోనేరఁడు. అనఁగా,

"క. తను నెఱిఁగిన నవ్యక్తము
　చనువునఁబోఁడాత్మఁడజర శాశ్వతవిగతాం
　జనవిమలాచ్యుతపదముం
　గని యక్షరుడగు నిజప్రకాశస్థిరతన్"　(శాంతి. ౬ ఆ. ౧౦౨)

అనునట్లు, అట్టియోగి తన స్వస్వరూపము నెఱింగినవాఁడై ప్రకృతిసంబంధమగు దేనిని గోరక, అజరామరణమును, నిరంజనమును, నిర్మలమును, అచ్యుతమును, శాశ్వతమును నగు మోక్షపదవినే గోరినవాఁడై తన స్థిరమైన జ్ఞానముచేత నట్టిపదమును బొందును. కాన నోయియర్జునా! నీవును సర్వకాల సర్వావస్థలయందును నట్టియోగమునే యాచరించుచుండుము.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీపరంస్థానముపైతిచాద్యమ్॥28

అర్థము :— యోగీ = యోగియగువాఁడు, ఇదమ్+విదిత్వా=ఈయుభయ మార్గములసంగతి నెఱింగినవాఁడై, వేదేషు=వేదములయందును, యజ్ఞేషు=యజ్ఞ

ములయందును, దానేషు=దానములయందును, తపస్సు+చ+ఏవ=తపస్సుల యందును, యత్+పుణ్యఫలమ్=ఏపుణ్యఫలము, ప్రదిష్టమ్=చెప్పఁబడియున్నదో, తత్+సర్వమ్=అదియంతయు, అత్యేతి=అతిక్రమించుచున్నాఁడు, అద్యమ్+పరమ్+స్థానమ్=అదికారణమును, పరమోత్కృష్టమునైన బ్రహ్మమును, ఉపైతి+చ=పొందుచున్నాఁడు.

ఏలయనఁగా, యోగులలో నిట్లు రెండు మార్గములసంగతి చక్కఁగా నెవఁ డెఱుఁగుచున్నాఁడో అట్టివాఁడే సాంఖ్యుఁడనఁబడుచున్నాఁడు.

"చ. జనవరసాంఖ్యమిట్టిది ప్రజాపతిపూజ్యము బ్రహ్మభావభా
జనతఘటింప దీనిసరి సమ్యగుపాయము లెందులేవు నె
మ్మనమున సంశయింపక సమాహితచిత్తత దీని నూది ని
స్తనుడఁగునమ్మహేశునకు దాఁ దనువింకిట వేయునేటికిన్."

(శాంతి. ౧౧ ఆ. ౬౬౨)

అనునట్లు, అల్లెఱుంగుటయే సాంఖ్యమనఁబడుచున్నది. ఈ సాంఖ్యము బ్రహ్మాదులచేతఁగూడఁ బూజింపబడదగినదై యున్నది. ఏలయనఁగా, పరమపదమును జెందుటకుఁదగిన యుపాయము దీనికంటె మంచిది మఱియొకటిలేదు. అనఁగా వేదాధ్యయనము చేయుటవలనను, అశ్వమేధాది యజ్ఞములు చేయుటవలనను, గోదానాది షోడశమహాదానములు చేయుటవలనను, పలువిధములగు తపస్సులు చేయుటవలనను ఏఫలములుగలుగునని శాస్త్రాదులయందుఁ జెప్పఁబడియున్నవో యాఫలములలోనేదియు దీనికంటె మేలైనదిగానేరదు. కనుక నట్టియోగి యాఫలములలో దేనిని నపేక్షింపక త్రోసివేసి యాదికారణమును బరమోత్కృష్టమునైన యాపరబ్రహ్మమునే పొందఁగోరి యందునకుఁ దగిన నిష్ఠనాచరించినవాఁడై యాపరబ్రహ్మమునే పొందుచున్నాఁడు. అనఁగా నశరీరుఁడగు నాపరబ్రహ్మమునకుఁ దానే శరీరమగుచున్నాఁడు. అనఁగా నా పరబ్రహ్మస్వరూపుఁడే యగుచున్నాఁడనుట.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరపరబ్రహ్మయోగో నామ అష్టమోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి అక్షరపరబ్రహ్మయోగంబను
అష్టమాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావబోధిని

## నవమాధ్యాయము

### రాజవిద్యా రాజగుహ్యా యోగము

శ్రీభగవానువాచ :

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ 1

అర్థము :— యత్ = దేనిని, జ్ఞాత్వా = ఎఱిఁగి, అశుభాత్ = దుఃఖరూపమగుసంసారబంధమునుండి, మోక్ష్యసే = విముక్తుఁడవు కాఁగలవో, (తత్) = అట్టి, విజ్ఞానసహితమ్ = అనుభవజ్ఞాన సహితమైనట్టియు, గుహ్యతమమ్ = పరమరహస్యమైనట్టియు, ఇదమ్ = ఈ (ఇఁకను జెప్పఁబోయెడు), జ్ఞానమ్ + తు = జ్ఞానమును గూడ, అనసూయవే = అసూయారహితుఁడవగు (నిసుగులేనివాఁడవగు), తే = నీకొఱకు, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

కృ — ఇది యంతయు నిట్లుండఁగా నిపుడు నేఁజెప్పినదానికంటె నుత్కృష్టమైనదియు ననుభవసిద్ధమైనదియు నగువిషయము (యోగము) మఱియొకటిగలదు. దాని నెవఁడెఱుంగుచున్నాఁడో యట్టివాఁడు దుఃఖరూపమగు నీసంసారబంధము నుండి విముక్తుఁడు కాఁగలఁడు ఇదియే రాజయోగమనఁబడును.

“ క. ఈ రాజ యోగమార్గం
బీరేడు జగంబులందు నెవ్వ రెఱుఁగ రా
త్మారాముల సదపాంగా
పారకృపాయుక్తులైన భక్తులు దక్కన్.” (సీ. రా. ౧౫. ౯౦.)

అనునట్లు, ఆపరమాత్మునియొక్క విశేషకృపకుఁ బాత్రులగు నంతరంగ భక్తులు దప్ప నీపదునాల్గులోకముల యందుండు వార లెవ్వరు నెఱుంగఁజాలరు.

కాన నిది పరమ రహస్యమైన విషయముగా నున్నది. అయితే. నీవు నాయందు భక్తి శ్రద్ధలుగలవాఁడవై యిదివఱకు నేఁజెప్పినదంతయు అసూయ (విసుకు) లేక విను చుంటివి. గాన నీవు నాకు నంతరంగభక్తుఁడవే యగుచున్నావు. కాఁబట్టి నీకు నేనా విషయమునుగూడఁ జెప్పుట యావశ్యకమని నాకుఁ దోఁచుచున్నది. కాన దానింగూడ నీకుఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥ 2

అర్థము :— ఇదమ్ = ఈ చెప్పఁబోయెడుజ్ఞానము, రాజవిద్యా = శ్రేష్ఠమైన విద్యయు, రాజగుహ్యమ్ = పరమరహస్యమైనదియు, పవిత్రమ్ = పావనమైనదియు, ఉత్తమమ్ = ఉత్తమమైనదియు, ప్రత్యక్షావగమమ్ = స్వానుభవమువలనఁ దెలిసికొనఁ దగినదియు, కర్తుమ్ = చేయుటకు, సుసుఖమ్ = అతిసులభమైనదియు, ధర్మ్యమ్ = ధర్మవిరుద్ధముకానిదియు, అవ్యయమ్ = నాశరహితమైనదియు నైయున్నది.

ఇపుడు నేజెప్పఁబోయెడు విషయమెట్టిదనఁగా,

“ శా. ప్రత్యక్షావగమంబుఁ బావనము నభ్యాసంబు గావింపఁగా
సత్యంతోరుసుఖంబు ధర్మ్యమతిగుహ్యం బుత్తమం బాద్యమున్
సత్యం బాగమసిద్ధ మాదిమునిరాట్సంస్తుత్యమున్ వేద్యమున్
నిత్యానందము రాజయోగము మహానిర్వాణ మార్గంబగున్.”

(సీ. రా. ౧ ఆ. ౨౨)

అనునట్లు, ఇదియే రాజవిద్య, అనఁగా, దెలిసికొనవలసిన విషయము లన్నిటిలో మిగుల శ్రేష్ఠమైనదియు రాజగుహ్యము. అనఁగా, పరమరహస్య మైనదియు పవిత్రమైనదియు, సర్వోత్కృష్టమైనదియుగనున్నది. మఱియు నిది యింతకుముందు నేఁజెప్పిన యన్నివిషయములకంటెను సులభముగ, అనఁగా స్వానుభవమువలనఁ దెలిసి కొనఁదగిన విషయముగనున్నది.

శ్లో॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్యమాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥ 3

అర్థము :— హేపరంతప = ఓయియర్జునా !, అస్య = ఈ (ఇపుడు నేఁజెప్పఁబోయెడు), ధర్మస్య = ధర్మముయొక్క (ధర్మమును), అశ్రద్ధధానాః = నమ్మని,

పురుషాః=పురుషులు, మామ్+అప్రాప్య=నన్ను బొందక, మృత్యుసంసారవర్త్మని=మృత్యురూపమగు సంసారమార్గమునందే, * నివర్తన్తే=నిశ్చయముగావర్తింపుదురు.

ఇది యింతసులభముగఁ దెలిసికొనఁదగియుండఁగా నిపుడు నేఁజెప్పిన ప్రకార మెవరును దీని నెఱుఁగ కుండుటకుఁ గారణమేమనఁగా,

" ఆ. రాజగుహ్యమైన రాజయోగంబును
శ్రద్ధధానులగుమ జనములెల్ల
సంశ్రయింపలేక సంసారవనధిలో
మునుగుచుండుదురు విమూఢులగుచు. " (సీ. రా. ౧. ఆ. ౯౯)

అనునట్లు, ఈపరమ రహస్యమగు రాజయోగము యొక్క సత్తా ఇట్టిదని యిదివఱకు నేఁజెప్పినప్రకారము నాయంతరంగభక్తులగు కొందఱు మాత్రమే యెఱుఁగుదురుగాని తదితరులగు వారెవ్వరును నెఱుంగఁజాలరు. కానవారలకీ యోగము నందు నమ్మక ముండనేరదు. అట్లు నమ్మకములేని జనులు నన్నుఁ బొందజాలరు. అనఁగా నాదియగు పరమపదమును (మోక్షమును) బొందఁజాలరు. కాననట్టివారలు దుఃఖకరమగు సంసారము నందు బద్ధులై మరల జనన మరణాములను బొందుచుందురు.

శ్లో॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా।
మత్ స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః॥ 4

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్।
భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥ 5

అర్థము :— ఇదమ్ + సర్వమ్+జగత్ = ఈప్రపంచమంతయు, అవ్యక్త మూర్తినా=అగోచరమూర్తినగు, మయా=నాచేత, తతమ్=వ్యాపింపబడియున్నది, సర్వభూతాని=సమస్తభూతములు, మత్ స్థాని=నాయందున్నవి, అహమ్+చ=నేనన్ననో, తేషు = ఆభూతములయందు, న+అవస్థితః = ఉన్నవాఁడను కాను, భూతాని+చ = భూతములన్ననో, మత్ స్థాని+న = నాయందున్నవికావు, మమ+ఆత్మా+చ = నాస్వరూపమగు పరమాత్మయన్ననో, భూతభావనః = భూతముల నుత్పాదించునట్టిదియు, భూతభృత్ = భూతములను భరించు నట్టిదియు నైనను, భూతస్థః+న = భూతములయందుండునట్టిది కాదు, మే = నాయొక్క, ఐశ్వరమ్+యోగమ్ = అద్భుతమైనశక్తిని, పశ్య=చూడుము.

* నిశ్చయేన+వర్తన్తే = నివర్తన్తే.

ఓయియర్జునా! ఇపుడునేఁ జెప్పఁబోయెడు పరమరహస్యమెద్దియనఁగా చరాచరాత్మకమగు నీప్రపంచమునందలి భూతములన్నియు సూత్రమునందు గ్రుచ్చఁబడిన పూసలవలె నాయందుఁగూర్పఁబడియున్నవని, అనఁగా, అట్టిచరాచరములన్నిటియందును నేను వ్యాపించియున్నవాఁడనని నీకిదివఱకే చెప్పియుంటినిగదా! (చూ. 7–7). అట్లా పూసలయందుఁ గూర్పఁబడియుండెడుసూత్ర మేప్రకారము చూచువారలకు గోచరింపకయుండునో, అట్లే అవ్యక్తమూర్తినగు, అనఁగా, చక్షురాదీంద్రియములకు గోచరింపని వాఁడనైననే నీప్రపంచమందలి చరాచరములన్నిటియందును వ్యాపించియున్నాఁడను. కాన నీప్రపంచమునందలి భూతములన్నియు నాయందున్నవిగను, నేనాభూతములయందున్నవాఁడనుగను నేర్పడుచున్నదిగదా? అట్లుండియు నేనా భూతములయందుండుటగాని, నాయం దాభూతములుండుటగాని లేదు. ఈచమత్కారమును జూచితివా?

అర్జు — అవునయ్యా! ఇది మహావిచిత్రముగానే యున్నది. పరమాత్ముఁడవగు నీవు సమస్తభూతములను సృష్టించి వృద్ధిఁ బొందింపుచున్నవాఁడవయ్యును వానియందు లేనివాఁడనని చెప్పుటచూడఁగా మిగుల వింతగనే యున్నది. ఇది యెట్లైనదియు నాకుఁ జక్కఁగ బోధయగునట్లు వివరించి చెప్పుము.

కృ — అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

“సీ. పావకుండర్చుల భానుండు దీప్తుల నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు
రాక్రియ నాత్మకరావళిచేతఁ బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూప భేదములతో మెఱయించి తగనడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులు దాన యైగుణసంప్రవాహంబునెఱపు
స్త్రీనపుంసక పురుషమూర్తియునుగాక తిర్యగమరనరాదిమూర్తియునుగాక
కర్మగుణభేద సదసత్ప్రకాశి గాక వెనుక నన్నియుఁ దానగువిభుఁదలఁతు”

(భాగ. ౮ స్కం. ౮౯)

అనునట్లు, అగ్నిదేవుఁడు జ్వాలలను, సూర్యుఁడు కిరణములను ఎట్లువ్యాపింపఁజేయుచు మరలవానిని దమలో నడంచికొనుచుందురో, అట్లే నేను బిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తజంతుజాలము నుత్పత్తిచేయుచు, వానిని నామరూపాది భేదములచేఁ బ్రకాశింపఁజేయుచు మరల నశింపఁజేయుచునుండుటయేగాక స్త్రీపున్నపుంసకత్వములుగాని, దేవమనుష్యతిర్యగాది రూపములుగాని గుణకర్మభేదములుగాని లేనివాఁడవయ్యును నివియన్నియుఁ గలిగియున్నవానివలెనే ద్యోతకమగుచుండును. కాన నే నాభూతములయందుండియు నుండనివాఁడనుగను, లేకయు నుండువాఁడనుగను లోకులకుఁ గన్పట్టుచుందును. కనుకనే,

"క॥ ఒకపరి జగముల వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయము గనుచున్
సకలార్థసాక్షి యగు న
య్యకలంకుని నాత్మమయుని నర్థింతు మదిన్ ॥" (భాగ. ౮ స్కం. ౭౪)

అనునట్లు, జ్ఞానులగు ఋష్యాదులుసయితి మొకప్పుడు ప్రపంచము నాయందే యున్నట్లును, మఱియొకప్పు డాప్రపంచము నాకు వేఱుగనున్నట్లును భావించుచు నాదగు నిజమైనస్థితిని ఇదమిత్థమని నిశ్చయింపఁజాలక భ్రమింపుచుందురు.

అర్జు — అటువంటి వారలకుఁగూడ నట్టిభ్రమ కలుగుటకుఁ గారణమేమి?

శ్లో॥ యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥ 6

అర్థము :— యథా = ఏప్రకారముగా, సర్వత్రగః = సర్వవ్యాపకమగు, మహాన్ + వాయుః = మహావాయువు, నిత్యమ్ = నిత్యముగా, ఆకాశస్థితః = ఆకాశము నందడఁగియున్నదో, తథా = అట్లు, సర్వాణి = సమస్తములైన, భూతాని = భూతములు, మత్స్థాని = నాయందు (అడఁగి) యుంచున్నవి, ఇతి = అని, ఉపధారయ = గ్రహింపుము.

కృ — ఆదెట్లనఁగా, ఇందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఓయియర్జునా! సర్వత్ర వ్యాపించియుండెడు మహావాయువు ఆకాశమున నెట్లడఁగి యున్నదో యట్లీసమస్తభూత ప్రపంచమును నాయం దడఁగియున్నదని యెఱుంగుము. అదెట్లనఁగా, ఆకాశములేని చోటును, వాయువులేని చోటును ఉండవుగదా? కాన నొకగదిలోనుండు నాకాశము (Empty space) వాయువు (air) చే నింపఁబడియుంచున్నదిగదా! అట్టి గదిలో నొకఁడు గూర్చుండి తలుపులన్నియు మూసికొనియుండినయెడల నపు డాగదియందు వాయుచలనము లేకపోవుటచే వానికి మిగుల నుమ్మదము గలిగి యిక్కడ బొత్తిగా గాలిలేదని యనుకొనుచున్నాఁడుగదా? అట్లనుకొనినపిమ్మట విసనకఱ్ఱతో విసరుకొన్నయెడల వాని శరీరమునకుఁ జల్లనిగాలి సోకి మిగుల నాప్యాయతను బొందుచు, "ఆహా యిపుడు చల్లనిగాలి తగులుచున్నది. హాయిగా నున్నది" అనుకొనుచు నానందించుచున్నాఁడు గదా! అట్లొకగదిలోఁ గూర్చుండియుండు వానికి బూర్వక్షణమున గాలి లేకుండుటయు, ఉత్తరక్షణమున గాలితగులుటయు నెట్లు సంభవింపఁగలదు? పూర్వక్షణమందు లేని గాలి యుత్తర క్షణమందు గదిలోఁ బ్రవేశించియుండునని తలఁచెదవా?

అర్జు — అట్లు తలంచుటకు వీలులేదు. ఆగది తలుపులన్నియు మూసియుండు నపుడు వెలుపలనుండి గాలి లోపలి కెట్లు ప్రవేశింపఁగలదు ? కాన నట్లు తలఁచుటకు లేదు, అయితే ఆగదిలోనుండువాఁడు మొదట గాలిలేదని తలంచుటకుఁ గారణ మేమనఁగా, ఆగదియందుండెడు గాలి స్తంభించి చలనము లేకయుండుటచే వానిత్వగింద్రియమున కాగాలి సోకకుండుటచే గాలిలేదని వానికిఁదోచుటకుఁ గారణమైనది. తర్వాత వాఁడు విసనకఱ్ఱతో విసరుకొనుటవలన నాగదియందుండెడు వాయువునకుఁ జలనముగలిగి వాని త్వగింద్రియమునకు సోకుటవలన నపుడు గాలియున్నట్లు తలఁచుటకుఁగారణమైనది. కాన నట్లాగదియందుండెడు వారికి వాయువుయొక్క చలనాచలనములనుబట్టి కలిగెడు మనోవికారములే గాని యాగదియం దొకప్పుడు వాయువుండి మఱియొకప్పుడు లేకపోవుట కలుగనేరదు.

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ ॥ 7

అర్థము :— హేకౌన్తేయ!=ఓయియర్జునా!, సర్వభూతాని=సమస్తభూతములు, కల్పక్షయే=కల్పాంతమందు, మామికామ్=నాదియగు, ప్రకృతిమ్=ప్రకృతిని, యాన్తి=పొందుచున్నవి, తాని=ఆభూతములను, పునః=మరల, కల్పాదౌ=కల్పాదియందు, అహమ్=నేను, విసృజామి=విడుచుచున్నాను (సృజింపుచున్నాను.)

కృ — అవునుగదా, అట్లే యీ భూతమయప్రపంచమంతయుఁ గల్పాంతమందు, అనఁగాఁ బ్రళయ కాలమున నాదియగు ప్రకృతియందు లీనమై చలనములేకయుండును. అపుడు నేనుదప్ప మఱియొకవస్తువేదియు నుండదు. కాన, మూయఁబడిన గదియందుఁ జలనములేకయుండెడు వాయు వేప్రకారము ఉండియు లేనిదిగాఁ గనఁబడుచుండునో, ఆప్రకారముగానే నా (ప్రకృతి) యందు లీనమైయుండెడు సమస్తప్రపంచము లేనిదిగనే కనఁబడుచుండును. అట్లు కొంతకాలముండి పైదృష్టాంతములోఁ జెప్పినప్రకారము గదిలో నుండెడువాఁడు వాయుస్పర్శమును గోరినపుడు విసనకఱ్ఱనాడించుటచే నందలివాయువునకుఁ జలనము గలిగి యదివఱకు లేకుండిన వాయువు అప్పుడున్నట్లుతోఁచునో, అట్లే నేను మరలఁ బ్రపంచము నుత్పత్తిచేయఁదలఁచినపుడు నా సంకల్పమనెడు విసనకఱ్ఱచే నా ప్రకృతియందు లీనమై స్తంభించియుండెడు భూతములకుఁ జలనముగలిగి మరలఁ బ్రపంచముగఁ బరిణమించును. కాన నదివఱకు లేని యాప్రపంచమును నేనప్పుడు సృజించినట్లు లోకులు భావింపుదురు.

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః ।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్ ॥ 8

అర్థము :— ప్రకృతేః+వశాత్=ప్రకృత్యధీనముచలన, అవశమ్=స్వతంత్ర శక్తిలేని, ఇమమ్=ఈ, కృత్స్నమ్=సమస్తమైన, భూతగ్రామమ్=భూతసముదాయమును, (అహమ్)=నేను, స్వామ్+ప్రకృతిమ్=నాప్రకృతిని, అవష్టభ్య=అవలంబించి, పునః+పునః=మరలమరల, విసృజామి=సృజించుచున్నాను.

కాననోయియర్జునా! భూతమయమగు నీసమస్త ప్రపంచమును ఇట్లే కల్పాదియం దుత్పన్నమగుచుఁ గల్పాంతమందు లయమగుచు, మరలఁ గల్పాదియం దుత్పన్నమగుచు మరల గల్పాంతమందు లయమగుచు, నిట్లే మరల మరల నుత్పత్తిలయములను బొందుచుండును. అయితే యిట్టి యుత్పత్తిలయము లాప్రపంచమునకుఁ దనంతట సిద్ధించునవి కావు. అనఁగా నాప్రపంచము స్వతంత్రశక్తిచేతనుత్పత్తి యగుటగాని లయమగుటగాని లేదు. మఱిదేనిచే నుత్పత్తిలయములను బొందుచున్నదనఁగా ప్రకృతిచేతనే యట్టి యుత్పత్తి లయములను బొందుచున్నది. అప్రకృతియన్ననో నాస్వాధీనమందుండునట్టిదిగాన నేనాప్రకృతిని నాధారముగఁ జేసికొని దానిచే నీప్రపంచమును సృజించినవాఁడ నగుచున్నానుగాని నాయంతటనేను సృజించెడువాఁడనుగాను, కనుకనేగదా నేనుగూడ నెప్పుడైన దుష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థమై యీలోకమున నవతరించవలసి వచ్చినప్పుడు "ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మ మాయయా" నాదియగు ప్రకృతి నవలంబించి యీలోకమునజననమగుచున్నానని చెప్పుటకుఁగారణమైనది (చూ. 4–6). కనుక నీప్రపంచ మస్వతంత్రమైనదనియు, అనఁగాఁ దనంతట నుత్పత్తియగునది కాదనియు, దానిని నేనుగా నుత్పత్తి చేయుట లేదనియు, అది ప్రకృత్యధీనముగనున్నది గనుక నాప్రకృతిచే నుత్పన్నమగుచున్నదనియు, అయితే అప్రకృతి నాయధీనముగ నుంచున్నదిగనుక నేనే యాప్రకృతి మూలముగ నీప్రపంచమును సృజించినవాఁడనుగ నేర్పడుచున్నాననియు నెఱుంగుము.

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ!
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు ॥ 9

అర్థము :—(అపి)+చ=ఐనను (అట్లు సృజించినవాఁడనైనను), హేధనఞ్జయ!=ఓయర్జునా!, తేషు+కర్మసు=ఆకర్మలయందు, అసక్తమ్=ఆసక్తిలేనివాఁడను, ఉదాసీనవత్+ఆసీనమ్ = సాక్షీభూతుఁడుగ నున్నవాఁడనునైన, మామ్=నన్ను, తాని+కర్మాణి=ఆకర్మలు, న+నిబధ్నన్తి=బంధింపవు.

కావునోయి యర్జునా! ఈసృష్ట్యాది కర్మలను నేను స్వేచ్ఛగఁజేసినవాఁడను గానుగనుకను, ప్రకృతిచేఁ గలుగుచున్నవి గనుకను, అట్టి కర్మలయొక్క ఫలాఫలములయందాసక్తిలేనివాఁడనై కేవల సాక్షిభూతుఁడుగనుంచున్నాను గనుకను ఆకర్మములు నన్ను బంధింపనేరవు. అనఁగా, ఆకర్మలవలని పుణ్యాపాపములు నన్నంటనేరవనుట.

అర్జు — అయ్యా! ఇట్లు చెప్పితివిగదా? ఈసృష్ట్యాదికర్మలు నీచే నేరుగాఁ జేయఁబడకపోయినను, నీసంకల్పాను సారముగ నీస్వాధీనమందుండెడు మాయ (ప్రకృతి)చేఁ జేయఁబడుచున్నవిగదా! అట్టివిషయములో నీప్రకృతిచేఁ జేయఁబడు కర్మలు నీకెట్లుచెందక పోఁగలవు?

కృ — ఓయి యర్జునా! నీవడిగినప్రశ్న సయుక్తికముగనే యున్నది. అయినను "నమాంకర్మాణిలిమ్పన్తినమే కర్మఫలేస్పృహా। ఇతిమాంయోభిజానాతికర్మభిర్నబధ్యతే॥" అనఁగాఁ గర్మఫలములయందు నాకిచ్ఛలేదనియు, కాన నా కర్మలు నన్నంటవనియుఁ ఇట్లు తెలిసికొనిన జ్ఞానిగూడఁ గర్మబద్ధుఁడుగాడనియుఁ నింతకుముందు నేఁ జెప్పియుంటినిగదా? అట్లు నన్నుగాని జ్ఞానినిగాని కర్మఫలమంటక పోవుటకుఁ గలిగియుండు కారణములుగూడ దృష్టాంతసహితముగఁ జెప్పియుంటిని గదా! జ్ఞాపకమున్నదా? (చూ. 4-14).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్।
హేతునాఽనేన కౌన్తేయ జగద్విపరివర్తతే॥ 10

అర్థము :— హేకౌన్తేయ != ఓయర్జునా!, ప్రకృతిః = ప్రకృతి (స్వభావము), సచరాచరమ్ = చరాచరప్రపంచమును, అధ్యక్షేణ + మయా = సాక్షిభూతుఁడనగు నాచేత, అనఁగా, సాక్షిభూతుఁడనైయుండఁగా, సూయతే = కనుచున్నది (సృజింపుచున్నది), అనేన + హేతునా = ఈహేతువుచేతనే, జగత్ = ప్రపంచము, విపరివర్తతే = ప్రవర్తించుచున్నది.

కృ — కనుకనోయియర్జునా! ఈచరాచరప్రపంచమంతయు నీప్రకృతివలననే పుట్టుచున్నది. నేనూరక సాక్షిభూతుఁడనుగ నుంచున్నానుగాని యాసృష్టియందు నాకేమియుఁగర్తృత్వములేదు సరేగదా, ఆప్రపంచనటనముగూడ నాప్రకృతివలననే జరుగుచుండునుగాని దానియందుఁగూడ నాకేమియుఁ గర్తృత్వములేదు. అదెట్లనఁగా నాప్రకృతి త్రిగుణాత్మకమైనదని, అనఁగా, రజస్సత్వ తమోగుణములతోఁ గూడియుండునదియని, యిదివఱకేనీకుఁ జెప్పియుంటినిగదా? కాన నాప్రకృ

తిచేఁ గలిగెడు భూతములన్నియు నా త్రిగుణములచే నాడింపఁబడినవగుచుఁ దదనుగుణ్యములగు పనులఁజేయుచు నాపనులవలనఁ గలిగెడు ఫలాఫలముల ననుభవింపుచు, మరలనట్టి ఫలాఫలముల కనుగుణ్యములగు జన్మల నెత్తుచుండును. కాన నీప్రపంచనటన గూడ నాప్రకృతివలననే జరుగుచున్నదిగాని నావలన జరుగునది కాదు. ఇదియే, ప్రపంచముయొక్క యుత్పత్తి స్థితిలయ కారణములయొక్క నిజమైనస్థితి గానున్నది. అయితే, అజ్ఞానులు దీనిఁదెలిసికొనఁజాలక

" చ. ఒకపరి రుద్రనిర్మితము నొక్కొకవేళ విరించినిర్మితం
బొకయెడ విష్ణునిర్మితము నొక్కొకచో మునినిర్మితంబు నా
నొకకడ శూన్యమై యడఁగు నొక్కొకపట్టునఁ దానకల్గు సృ
ష్టికి నిది యిట్లు పుట్టువని చెప్పఁగరా దినవంశవల్లభా." (వా. రా. 3 అ.)

అనునట్లీప్రపంచసృష్టిని రుద్రుఁడు సేయుచున్నాఁడని కొందఱును, బ్రహ్మ చేయుచున్నాఁడని కొందఱును, విష్ణువు చేయుచున్నాఁడనికొందఱును ఋషులుచేయుచున్నారని కొందఱును, తనంతటనే కలుగుచున్నదని కొందఱును, ఇట్లు పరిపరి విధములుగఁ దలంచుచున్నారుగాని, ఈసృష్టియొక్క నిజమైన కారణమిట్టిదని యెవ్వరు నెఱుంగఁజాలరు.

శ్లో॥ అవజానన్తి మాంమూఢా మానుషీం తను మాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥ 11

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12

అర్థము :— మోఘాశాః=వ్యర్థములైన యాశలుగలవారును, మోఘకర్మాణః=వ్యర్థములైనకర్మలు గలవారును, మోఘజ్ఞానాః = వ్యర్థములైనజ్ఞానముగలవారును, విచేతసః = తెలివిహీనులునునై, రాక్షసీమ్ = రాక్షససంబంధమైనదియు, మోహినీమ్+చ = మోహింపఁజేయునదియునగు, ప్రకృతిమ్ + ఏవ=స్వభావమునే, శ్రితాః = అవలంబించిన, మూఢాః = మూఢులు, మమ = నాయొక్క, పరమ్+భావమ్ = పరతత్త్వమును, అజానన్తం+(సన్తః) = తెలిసికొనఁజాలనివారై, మానుషీమ్+తనుమ్+ఆశ్రితమ్=మనుష్యదేహమును బరిగ్రహించిన, భూతమహేశ్వరమ్=సమస్తభూతములకు నీశ్వరుఁడనైన, మామ్ = నన్ను, అవజానన్తి = అలక్ష్యము చేయుచున్నారు.

కావున నోయియర్జునా! అట్లు ప్రపంచముయొక్క యుత్పత్తి స్థితిలయముల

నిజస్థితినే యెఱుఁగఁజాలనివారలు మనుష్యశరీరమును ధరించియుండు నన్నుఁబరమాత్మనుగ నెట్లెఱుంగఁగలరు? అనఁగా, బొత్తిగ నెఱుంగఁ జాలరనుట. ఏల యనఁగా నట్టి మూఢులు కేవల ప్రకృతి బద్ధులును అసురస్వభావము గలవారునై దంభాహంకారాది దుర్గుణములతోఁ గూడి యుంచున్నారు (చూ. 16–4). కాన వారలు కేవల మాశాపాశబద్ధులై, వ్యర్థములగు కోరికలనే గోరుచుందురు. అనఁగా, ఇహమునందుఁ దుచ్ఛములును క్షణభంగురములునగు దారపుత్రధనధాన్యాదులను, స్రక్చందనవనితాది భోగములను గోరుచుఁ దదనుగుణ్యములగు యజ్ఞతపోదానాది కర్మలనే యాచరింపుచుందురు (చూ–17–5). కాన నట్టి కర్మలన్నియు వ్యర్థములైన వగుచున్నవి. మఱియు నట్టిదురాశలతోఁగూడుకొన్నవారై యందుకుగా నన్నారాధింప నుద్దేశించి యాచరింపఁబడు నాకర్మలచే నన్నారాధించుటకు బదులుగాఁ గృశింప జేయుచున్నారు (చూ. 17–6). కాఁబట్టి యట్టివారల జ్ఞానముగూడ వ్యర్థమైనదే యగుచున్నది. మఱియునట్టి యవివేకులు నామాయవలన నపహరింపఁబడిన జ్ఞానము గలవారై నన్నుఁ బొందఁ జాలరనియు (చూ. 6–15). అట్టివారలకు యోగమాయ వలన గప్పఁబడియుండెడు నేను బ్రకాశింపకుందుననియు (చూ. 7–25). ఇదివరకే చెప్పియుంటినిగదా! కనుక నట్టివారలిట్టి మనుష్యదేహమును బరిగ్రహించియున్న నన్నుబొత్తిగఁదెలిసికొనఁజాలరు. కాఁబట్టి యట్టివారలు తమతోపాటు నన్ను నొక మనుష్యునిగనే భావించి నిర్లక్ష్యముగఁ జాతురేగాని పరమాత్ముఁడనని యెంచి ప్రపత్తి చేయరు. అదెట్లనఁగా నందుకుఁ గొన్ని దృష్టాంతములను జెప్పుచున్నాను వినుము.

నేను బాల్యదశయందుండఁగాఁ గంసునిచేఁ బిలిపింపఁబడి మధురానగర ప్రవేశము సేయునపుడు కంసుని వస్త్రముల నుతికెడు రజకుం డెదురై నందున వానివద్ద నున్న వస్త్రములలోఁ గొన్నిటిని గట్టనిమ్మని యడుగఁగా వాడు నన్ను సామాన్య గొల్లపిల్లకాయనుగా భావించి,

“శా. ఎట్టెట్టా మనుజేంద్రు చేలములు మీకీఁ బాడియే మీరలుం
గట్టం బోలుదురే పయోఘృతదధిగ్రాసంబులన్మత్తులై
యి ట్టాడంజనెఁ గాక గొల్లలకు మీకెప్పాట నోరాడెడిన్
గట్టా ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతి న్బాలకా!
క. మారాజుసొమ్ముఁ గైకొన
నేరాజులు వెరతు రింత యెల్లిదమే నీ
కీరాజరాజగృహమున
నీరాజనమేల గొల్ల యేగుము తలఁగన్”.

(భాగ. ౧౦ పూ. భా. ౧౨౫౬, ౧౨౫౭)

అనియును, కంసునిపంపున నాతో మల్లయుద్ధమునకుఁ దలపడిన చాణూరుఁడు నన్నుఁ గేవల గోపబాలకునిగా నెంచి,

"శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడవిసిగో నాపాటియే నీవు వి
ఖ్యాతుండ న్బలజుండ సద్గుణుఁడ సత్కర్మ స్వభావుండ నీ
కేతాదృగ్విభవంబులెల్లఁ గలవే యీవీటఁ బోరాడుట
ల్వ్రేతల్బ్రాచఁగఁ గుప్పిగంతు లిడుటే వీక్షింపు గోపార్భకా!".
(భాగ. ౧౦. పూ. భా. ౧౩౩౭)

అనియును, మీయన్నయగు ధర్మరాజు మున్ను రాజసూయ యాగంబుసేయు కాలంబున నాకగ్రతాంబూలం బివ్వసమకట్టినపుడు నన్ను సామాన్యగోపకునిగ నెంచియుండు శిశుపాలుఁడలిగి,

"వివేకరహితులై గోపాలబాలునిం బూజసేయుటకు నెట్లు సమ్మతించితిరి? పురోడాశంబు సృగాలంబున కర్హంబగునే? "(భాగ. ౧౦, ఉ. భా. ౭౮౯)

అనియును, ఇట్లనేకు లనేకవిధంబుల నన్ను దూలనాడి యవమానించిన సంగతి నీవెఱిఁగియే యుందువుగదా?

శ్లో॥ మహాత్మాన స్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥　　13

అర్థము:- హేపార్థ!=ఓయియర్జునా!, మహాత్మానః+తు=మహాత్ములన్ననో, దైవీమ్+ప్రకృతిమ్=దేవస్వభావమును, ఆశ్రితాః=అవలంబించినవారై, మామ్=నన్ను, భూతాదిమ్=భూతములకు నాదికారణమైనవానిఁగను, అవ్యయమ్=నాశరహితునిగను, జ్ఞాత్వా=ఎఱిఁగి, అనన్యమనసః=ఇతరచింతలు లేనివారై, భజన్తి=భజింపుచున్నారు.

ఇఁకను నన్నెఱిఁగెడి వారలెట్టి వారలనఁగా, దేవాంశసంభూతులగు మహాత్ములెఱుంగఁగలరు. వారలెట్టివారనఁగా, భయరహితులును, చిత్తశుద్ధిగలవారును, జ్ఞానదాన దమస్స్వాధ్యాయ యజ్ఞతపస్సులు గలవారును, ఋజుభావముగలవారును, అహింసాపరులును, సత్యవంతులును, క్రోధరహితులును, సర్వసంగపరిత్యాగులును, పరదోషముల నెంచనివారును, భూతదయగలవారును, లోభత్వము లేనివారును, వాఙ్మాధుర్యమును లజ్జయుఁగలవారును, చాపల్యరహితులును, గాంభీర్యము - ఓర్పు - ధైర్యము - శౌచము - మొదలగు సుగుణసంపత్తి గలవారును, ద్రోహము-

గర్వము – మొదలగు దుర్గుణములు లేనివారునునై యుంచున్నారు (చూ. 16-1-2-3). కనుక నట్టివారు నేను మనుష్యశరీరమును ధరించి యున్నవాఁడనైనను, కేవలమనుష్యమాత్రుఁడనుగాననియు, సమస్తభూత ప్రపంచమునకు నాది కారణుఁడును, నాశరహితుఁడును, లీలామానుష విగ్రహుఁడునునగు విరాట్పురుషుఁడననియు నెఱుంగఁగలరు. కాననట్టివారు నన్ననచంచలభక్తితోఁ బ్రపత్తిచేయుదురు. ఇట్టి మహానుభావులెవరైనదియుఁగూడఁ దెలియఁదగిన కొన్ని దృష్టాంతములను జెప్పుచున్నాను వినుము.

మున్ను కంసుఁడు నన్నుఁ జంపించుటకుగానుద్దేశించి ధనుర్యాగ మిషమీద నన్నును బలరామునిని బిలుచుకురమ్మని యక్రూరునింబంపఁగా నతఁడు పరమభాగవతోత్తముఁడును, నాయవతారమహిమనెఱింగినవాఁడును గాన బృందావనంబునకుఁ జనుదెంచుచుఁ దనలోఁ దానిట్లని చింతించె,

"ఉ. ఎట్టితపంబు సేయఁ బడె నెట్టిచరిత్రము లబ్ధమయ్యెనో
యెట్టిధనంబు లర్థులకు నీఁ బడెనో తొలిబామునందు నా
యట్టి వివేకహీనునకు నాది మునీంద్రులు యోగదృష్టులన్
బట్టఁగలేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁజూడఁ గల్గెడిన్."
(భాగ. ౧౦, పూ. భా. ౧౧౮౮)

అనియును, నాయవతారమహిమ నెఱిఁగి నాయందెప్పుడు భక్తిసేయుచుండెడు వారలలో విదురుఁడు,

"మ. జననంబెందునులేని యీశ్వరుఁడు దా జన్మించుటెల్ల న్విరో
ధినిరాసార్థము వీతకర్ముఁడగు నద్దేవుండు కర్మప్రవ
ర్తనుఁడౌటెల్లఁ జరాచరప్రకట భూతశ్రేణులన్గర్మవ
ర్తనులం జేయఁదలంచికాక కలవే దైత్యారికింగర్మముల్.

క. హరిపరగులకెల్లఁ బూజ్యుఁడు
హరిలీలామనుజుఁడును గుణాతీతుఁడునై
పరఁగిన భవకర్మంబులఁ
బొరయండట హరికిఁగర్మములు లీలలగున్.

క. మదిఁదన శాసనమిడినిజ
పదములు సేవించు లోకపాలాదులు పెం
పొదవింప యదుకులంబున
మదయించెను భువిని బలసహాయదరుఁడగుచున్." (భాగ. 3. ౭౨-౭౪.)

అనియును; ఉద్ధవుఁడు

"క. విమలమతిఁదలప నెవ్వని
బొమముడిమాత్రమున నిఖిలభూదేవీభా
రముమాను నట్టి హరిపద
కమలమరందంబుఁ గ్రోలుఘనుఁ డెవ్వాఁడో!

క. మందప్రజ్ఞుఁడనై గో
విందుని మురదైత్యహరుని విష్ణునిఁబరమా
నందుని నందతనూజుని
మందరధరుఁ జిత్తమందు మఱతునెయెంయన్॥

సీ. అట్టిసరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు సుభగుండు త్రైలోక్యసుందరుండు
కమనీయసాగర కన్యకాకుచ కుంకుమాంకిత విపులబాహాంతరుండు
సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్త పద్మరాగారుణ పాదపీఠుఁ
డజుఁ డనంతుఁడు సమానాధిక విరహితుం డిద్ధమూర్తిత్రయాధీశ్వరుండు
నైనహరి యుగ్రసేనుని నఖిలరాజ్య
రుచిరసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టి
భృత్యభావంబునొంది సంప్రీతి నతని
పనువుసేయుట కెపుడు నామనము గుందు"

అనియును; కురువృద్ధుండునుఁ నాకంతరంగభక్తుండునునగు భీష్ముండు,

"మ. యదువంశంబున వాసుదేవుఁడనఁ గ్రీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావలిఁ గూల్చి పార్థునకు సారథ్యంబు త్రైలోక్యస
మ్మదమారంగ నొనర్చి దేవమునిసమ్మానోద్ధతిన్ భూభరం
బు దొలంగింపఁగఁ జేయఁబుట్టిన హరిన్ బూజింతుఁ గృష్ణాత్మునిన్."

అనియును; నన్నుస్తోత్రము చేసియున్నారు. ఇదిగాక, నేను బాల్యమందు కంసుని పంపున మధురానగరప్రవేశము సేయుచు రజకునిం గని వస్త్రంబులడిగి. వానిచే నవమానితుండనైనసంగతి యింతకుముందు చెప్పితినిగదా? అట్లవమానింప బడినవెంటనే నేను బలరామసహితముగ మాలాకారుండగు సుదామునింటికిఁ బోఁగా నతఁడు నాయవతారరహస్యమెఱిఁగినవాఁడు గాన, గ్రక్కునలేచి మ్రొక్కి,

"ఉ. పావనమయ్యెనాకులము పండెఁ దపంబు గృహంబు లక్ష్మికి
న్సేవితమయ్యె నిష్టములు సేకుఱె విశ్వనిదానమూర్తులై

భూవలయంబు గావనిటు పుట్టినమీరలు రాకఁజేసినే
నేవిధమాచరింతుఁ బను లెయ్యవి బంట నెఱుంగఁ జెప్పరే."

అనిపలికి మాయిరువురినిం గుసుమదామంబుల నలంకరింప నేనత్యంతప్రీతుండనై కోరినవరంబిచ్చెద వేడుమనిన నతండు

"క. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును
దాపసమందార నాకు దయసేయఁగదే."

అని వేడుకొనియున్నాఁడు. ఇంతయేల, ఓయి యర్జునా! మీయన్నదమ్ములైదుగురిలో సహదేవుఁడు తప్ప తక్కినవలుగురును నన్ను మీబంధువుగను ఆప్తునిగను నెంచియుందురేగాని నాయవతారరహస్యమిట్టిదని యెఱుంగరు. సహదేవుఁడు మాత్రముదాని నెఱుంగును, అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము. మీయన్నధర్మరాజు రాజసూయయాగము సేయునపుడు, అగ్రపూజార్హులెవ్వరని యాలోచింపుచుండు సమయంబున సహదేవుండు నన్నుఁజూపి

"యిమ్మహాత్ముని సంతుష్టుం జేసిన భువనంబులన్నియుం బరితుష్టిం బొందునని చెప్పి ధర్మరాజుంజూచి యిట్లనియె

ఉ. కాలము దేశముం గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయుం జగ
జ్జాలము దైవము న్గురువు సాంఖ్యము మంత్రము యజ్ఞ మాహుతు
ల్వేళలు విప్రులుం జననవృద్ధిలయంబు లహేతుభూతము
ల్లీలలుఁ దానయై తగ వెలింగెడు నెక్కటి తేజమీశుఁడున్.

చ. ఇతఁడె యితండు గన్నులొకయించుక మోడ్చిన నీచరాచర
స్థితభువనంబులన్నియు నశించు నితం డవి విచ్చిచూచిన
న్వితతములై జనించుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడునైనయట్టియీఁ
గ్రతుఫలదుండు గా కొరుఁ డొకండెటు లర్హుఁడు శిష్టపూజకున్

ఉ. ఈపురుషోత్తమున్ జగదధీశు ననంతుని సర్వశక్తుఁజి
ద్రూపకు నగ్రపూజఁ బరితోషితుఁ జేయసమస్తలోకము
ల్వేపరితుష్టిఁ బొందుఁ బృథివీవర! కావున నీవు కృష్ణునిన్
శ్రీపతిఁ బూజసేయు మెడసేయక మాటలు వేయునేటికిన్."

(భాగ. ౧౦. ఉ. భా. ౭౭౭-౭౮౦.)

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14

అర్థము :— దృఢవ్రతాః=దృఢవ్రతులును. యతన్తః+చ = నన్ను పొందుటకు యత్నించుచున్నవారును నైన, (కేచిత్)=కొందఱు, మామ్=నన్ను, సతతమ్=ఎల్లప్పుడును, కీర్తయన్తః=కీర్తించుచున్నవారును, నమస్యన్తః+చ=నమస్కరించుచున్నవారునై, భక్త్యా=భక్తిచేత, నిత్యయుక్తాః=ఎప్పుడును నాయందే చిత్తమును జేర్చినవారై, మామ్=నన్ను, ఉపాసతే=సేవించుచున్నారు.

కావున నట్టివారలు నేను కేవలము మనుష్యమాత్రుఁడనుగాననియు, లీలామానుషరూపమును ధరించిన పరాత్పరుఁడననియు నెఱింగినమహాత్ములైయున్నారు. అట్లు నన్నెఱింగినందున వారికిఁ గలిగెడుఫలమేమనఁగా, నేనుతప్పతక్కిన యీదృశ్యప్రపంచమంతయును నసద్వస్తువని యెఱింగినవారై నన్నే పొందఁ గోరుదురు. అనఁగా నాపదవియగు మోక్షమునే పొందఁ గోరుదురు. అట్టి కోరికగలవారగుటచే నందుకుఁ బ్రయత్నించుటయందు దృఢమైన పూనికగలవారలై నాయందు భక్తిఁ జేయుచు, నన్నే ధ్యానించుచు, నాయందే చిత్తముఁ జేర్చినవారై సదా నా గుణానుభవమునే చేయుచుందురు. అందుఁ గొందఱు

"మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వము న్వందనా
ర్చనముల్ సేవయు నాత్మలోనెఱుకయున్ సంకీర్తన
ల్చింతనంబను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ము హరిన్నమ్మి స
జ్జనుఁడైయుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా!"
(భాగ. ౭. స్కం ౧౬౭.)

అనునట్లు, వందనాది నవవిధకృత్యములచే న న్నారాధించుచుందురు.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్ ॥ 15

అర్థము :— అన్యే=మఱికొందఱు, విశ్వతోముఖమ్=సర్వాంతర్యామియైన, మామ్=నన్ను, ఏకత్వేన=అద్వైతభావచేతను, పృథక్త్వేన=ద్వైతభావముచేతను, బహుధా=బహువిధరూపములుఁగలవాఁడనను భావచేతను, జ్ఞానయజ్ఞేన+చ+అపి=జ్ఞానయజ్ఞము చేతనైనను, యజన్తః+(సన్తః)=పూజించుచున్నవారై, ఉపాసతే=సేవించుచున్నారు.

మఱికొందఱేమి చేయుచుందురనఁగా, నాకును దమకును, అనఁగా, నాయందుండెడు పరమాత్మకును తమయందుండెడు జీవాత్మకును నేలాటి భేదము లేదనియును, జీవాత్మ పరమాత్మయొక్క యంశమే గాని వేఱు కాదనియును, అద్వైతభావముగలవారై యుపాసింతురు. ఇంకఁ గొందఱుఁ, పరమాత్ముఁడనైన నాకును, జీవాత్మలనైన తమకును భేదముగలదనియును, పరమాత్ముఁడనైన నేను ఉపాస్యుఁడననియు, జీవాత్మలనైన తాము ఉపాసకులనియు నెంచి ద్వైతభావముతో నారాధింతురు. మఱికొందఱు నన్ను బ్రహ్మ-విష్ణు-మహేశ్వరా ద్యనేకరూపములు గలవానిగ భావించి పూజింతురు. మఱికొందఱు "వాసుదేవస్సర్వమ్" అనునట్లీచరాచరాత్మకమగు ప్రపంచమంతయు భగవత్స్వరూపమే యనెడు జ్ఞానయజ్ఞముచేతను నారాధింతురు. ఇట్లు సర్వాంతర్యామియగు నన్ను నేకు లనేకవిధములుగ భావించి యుపాసింపుచుందురు.

అర్జు — అయ్యా, కొందఱు జ్ఞానయజ్ఞముచే నారాధింతురని చెప్పితివిగదా, అది యెట్లో వివరించి చెప్పుము.

శ్లో॥ అహం క్రతురహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్ ।
మంత్రోఽహమహ మేవాజ్య మహ మగ్ని రహంహుతమ్ ॥ 16

అర్థము :— అహమ్ + క్రతుః = క్రతువు నేనే, అహమ్ + యజ్ఞః = యజ్ఞము నేనే, అహమ్స్వధా = స్వధ నేనే, అహమ్ + ఔషధమ్ = ఔషధము నేనే, అహమ్ + మన్త్రః = మంత్రము నేనే, అహమ్ + అజ్యమ్ = అజ్యము నేనే, అహమ్ + అగ్నిః = అగ్ని నేనే, అహమ్ + ఏవ + హుతమ్ = హోమకర్మము నేనే (అయియున్నాను).

కృ — ఇంతకుముందు హోమసాధనంబులును, హోమద్రవ్యంబులును, హోమకర్మమును, హోమకర్తయును, అగ్నియు, ఇవియన్నియు బ్రహ్మస్వరూపమే యనినీకుఁ జెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా ? (చూ. 4-24).

అర్జు — అవును జ్ఞాపకమున్నది. బ్రహ్మజ్ఞానసంపన్నునకు నీచరాచరప్రపంచమంతయుఁ బరబ్రహ్మస్వరూపముగనే యగపడుచుండునుగనుక నట్టిఁ వాఁడాయన్నియుఁ బరబ్రహ్మస్వరూపముగనే యెఱుంగుచున్నాఁడని చెప్పియుంటివిగదా ?

కృ — మంచిది. అట్టిపరబ్రహ్మమే నేననియును జెప్పియుంటినిగదా ? కాబట్టి జ్ఞానులగువారు సమస్తక్రతువులును, యజ్ఞములును, పితృదేవతలకర్పించెడు స్వధయును, అట్టియజ్ఞాదులయందలి యగ్నియును, ఆయగ్నియందు వేల్చఁబడు అన్నము-

ఆజ్యము - మొదలగు హవిస్సును, ఆట్టి యజ్ఞములయందుపయోగించెడు మంత్రములను, హోమకర్మమును—ఇవియన్నియు నాస్వరూపములేయని తెలిసికొన్నవారై నన్ను నచంచలభక్తితో ధ్యానించిన మాత్రముచేతనే సమస్తయజ్ఞముల నాచరించినవారుగ భావించుచున్నారు. కనుకనట్టివారు జ్ఞానయజ్ఞమును జేసినవారగుచున్నారు.

శ్లో॥ పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్ర మోఙ్కార ఋక్సామ యజు రేవచ ॥ 17

అర్థము:— అస్య + జగతః = ఈజగత్తునకు, పితా = తండ్రియును, మాతా = తల్లియును, పితామహః = తాతయును, ధాతా = రక్షకుఁడును, వేద్యమ్ = తెలిసికొనఁదగిన, పవిత్రమ్ = పవిత్రమైనవస్తువును, ఓఙ్కారః = ప్రణవమును, ఋక్సామయజూః = ఋగ్యజుస్సామవేదములును, అహమ్ + ఏవ = నేనే.

ఇంతేకాము సుమా, ఆట్టివారుమఱియు నన్నేమిగా నెఱుఁగుచురనఁగా, ఈ ప్రపంచమున కంతటికిని నేనే తండ్రిననియు, తల్లిననియు, తాతననియు. అనఁగా నీ ప్రపంచమునకు నుత్పత్తిస్థానము నేనేయనియు, ఈప్రపంచమునంతటిని రక్షించెడు వాఁడు నేనేయనియు, ఈలోకమునఁ దెలిసికొనఁ బడఁదగిన సమస్తవస్తువులలో మిక్కిలి పవిత్రమైనవస్తువు నేనేయనియు, సమస్తమంత్రములకును ప్రణవమగు నోంకారము నాస్వరూపమేయనియు, ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును, నా స్వరూపములే యనియు నెఱుంగుదురు.

శ్లో॥ గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్।
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్॥ 18

అర్థము:— గతిః = గతియును, భర్తా = రక్షకుఁడును, ప్రభుః = ఈశ్వరుఁడును, సాక్షీ = సాక్షియును, నివాసః = ఉనికిపట్టును, శరణమ్ = ఆశ్రయింపదగినవాఁడును, సుహృత్ = హితుఁడును, ప్రభవః = ఉత్పత్తిస్థానమును, ప్రళయః = లయస్థానమును, స్థానమ్ = స్థితియును, నిధానమ్ = నిక్షేపమును, అవ్యయమ్ = నాశరహితమైన, బీజమ్ = బీజమును, (అహమేవ) = నేనే.

అట్టివారలు నన్ను మఱియు నేమిగా నెఱుఁగుదురనఁగా, సకల జనులకుఁ బొందఁదగిన పురుషార్థములన్నిటిలో మేలైన పురుషార్థము నేనేయనియు, ఈప్రపంచమునఁ బిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్త జంతుజాలమునకును, రక్షకుఁడును, ఈశ్వరుఁడును నేనే యనియును, అట్టిజంతువులయందు సాక్షిభూతుఁడుగా నుండు వాఁడును, జంతువులకన్నిటికిని యునికిపట్టును, ఆశ్రయస్థానమును, మేలుగోరువాఁ

డును నేనే యనియును, అట్టి సమస్తభూతములకు నుత్పత్తి స్థితిలయకర్తయును, నిక్షేపమును నేనేయనియును, ఈప్రపంచోత్పత్తికి ఆదికారణమును నాశరహితమగు బీజమును నేనే యనియును నెఱుంగుము.

శ్లో॥ తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున !॥ 19

అర్థము:— హేఅర్జున ! = ఓయియర్జునుఁడా, అహమ్+తపామి = తపింపఁజేయువాఁడను నేనే, అహమ్ = నేను, వర్షమ్ = వర్షమును, ఉత్సృజామి + నిగృహ్ణామి + చ = కురిపించెడువాఁడును నిలిపెడువాఁడును నేనే, అమృతంచ + మృత్యుశ్చ = జీవనాధారమును, మరణకారణమును, సత్ + అసత్ + చ = సదసత్పదార్థములు రెండును, అహమ్ + ఏవ = నేనే (అయ్యున్నాను.)

మఱియు నట్టివాఁడ నేనే సూర్యరూపమున నీలోకమునఁ జెటినిఁ దపింపఁ జేయుదుననియు, వరుణరూపమున వర్షింతు ననియు ఒకప్పుడు పుష్కలముగ వర్షించి సకలభూతములకును జీవనాధారములగు సస్యాదుల ఫలింపఁ జేయువాఁడును, మఱి యొకప్పుడు వర్షమును బిగఁబట్టియట్టి సస్యాదులు ఫలింపకుండఁజేసి తద్వారా ననేక జంతువులు మృతినొందునట్లు చేయువాఁడునూ నేనేయనియును, ఇదిగాక యీప్రపంచమునందుఁగల సత్పదార్థము, అనఁగా నెప్పటికిని నాశములేక శాశ్వతముగానుండు నట్టిదియగు నాత్మయును అసత్పదార్థము, అనఁగా నశించునట్టి స్వభావముగల యచేతన పదార్థముఁగూడ నేనే యనియును ఎఱుంగుము. కనుకనే నీ తమ్ముఁడగు సహదేవుఁడిట్టి నామర్మము నెఱిఁగియుండుటంబట్టియే ఇంతకుముందు నేఁజెప్పిన ప్రకారము, మీయన్నయగు ధర్మరాజు రాజసూయయాగంబు సేయుకాలంబున నగ్రపూజార్హులెవ్వరని విచారించుచుండఁగా నన్నుఁజూపి

" ఉ. కాలముదేశమున్ గ్రతువుఁగర్మముఁ గర్తయు భోక్తయుం జగ
జ్జాలముదైవమున్గురువు సాంఖ్యము యజ్ఞము మంత్రమాహుతు
ల్వేళలు విప్రులుం జననవృద్ధిలయంబుల హేతుభూతము
ల్లీలలు దానయై తగ వెలింగెడు నెక్కటితేజమీశుఁడున్."

అనే మొదలైన సంగతులు చెప్పియున్నాఁడు. కాఁబట్టి యోయియర్జునా ! ఇట్లు నన్నెఱిఁగి యెవరుస్మరింపుచున్నారో, అట్టివారన్ని యజ్ఞములను జేసినవారే యగుచున్నారు గనుక నట్టివారి యొఱుకయే జ్ఞానయజ్ఞమనఁబడుచున్నది.

అర్జు— అయితే యీలోకమున ననేకులు సులభమగు నీజ్ఞానయజ్ఞమును జేయక

వేదోక్తములును మిగుల కాయక్లేశకరములునగు నగ్నిష్టోమాద్యనేక యజ్ఞముల వేదోక్తప్రకారముగ సమస్తపరికరముల నొడఁగూర్చికొని యాచరించుటకు జూచుచున్నాముగదా, అట్టేల చేయుచున్నారు ? అందువలనవారికిఁ గలిగెడు ప్రయోజన మెట్టిది ?

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా
స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక మశ్నన్తి దివ్యాన్ దివి
దేవభోగాన్ ॥ 20

అర్థము :— (యే)=ఎవరు, త్రైవిద్యాః=ఋగ్యజుస్సామములను మూడువేదముల నెఱిఁగినవారై, యజ్ఞైః=ఆవేదములయందుఁ జెప్పఁబడియుండు యజ్ఞముల చేత, మామ్=నన్ను, ఇష్ట్వా=పూజించి, సోమపాః=సోమపానము చేసినవారును, పూతపాపాః=గతకల్మషులునునై, స్వర్గతిమ్=స్వర్గప్రాప్తిని, ప్రార్థయన్తే=ప్రార్థించుచున్నారో, తే=అట్టివారు, పుణ్యమ్=పవిత్రమైన; సురేన్ద్రలోకమ్=దేవేంద్రలోకమును, ఆసాద్య=పొంది, దివి=ఆదేవేంద్రలోకమునందు, దివ్యాన్=దివ్యములగు, దేవభోగాన్=దేవతాభోగములను, అశ్నన్తి=అనుభవించుచున్నారు.

కృ — ఓయియర్జునా ! ఇప్పుడు నీవడిగిన ప్రశ్నకు సమాధానమును జెప్పుచున్నాను వినుము. కామాత్ములగు వారలు స్వర్గాదిభోగములనే ఉత్తమ పురుషార్థములుగా నెంచి, అట్టిస్వర్గాదిభోగములనిచ్చు యజ్ఞాదులనుగూర్చి చెప్పెడు వేదవాక్యములనే ప్రమాణములుగా నెంచి వానినాచరించు చుందురనియును, అట్టివార లవివేకులనియును, వారలచిత్తము సమాధియందు స్థిరముగా నుండదనియును, ఇంతకుముందు చెప్పియుంటినిగదా, (చూ. 2-42-43-44) జ్ఞాపకమున్నదిగదా?

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — అట్లెవరైతే స్వర్గాది భోగముల నపేక్షించు చున్నారోవారు ఋగ్యజుస్సామవేదములలో ఇంద్రాదిదేవతా ప్రీత్యర్థముగాఁ జెప్పఁబడియుండెడు నగ్నిష్టోమాది యజ్ఞముల నాచరింతురు. ఆయింద్రాది దేవతలును నాస్వరూపులేగనుక నట్టి దేవతల నారాధించువారు నన్నే యారాధించినవారగుచున్నారు. కనుక నట్టియజ్ఞముల నెవ్వరైతే యాచరించి సోమపానము సేయుచున్నారో, అట్టివారలు గతకల్మషులై వారల యాప్సితార్థమును బొందుదురు. అనఁగా, వారలు కోరినప్రకారము దేవేంద్రలోకమును బొంది యందు దేవతలచే ననుభవింపబడఁదగిన సమస్త భోగముల ననుభవింతురు.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥21

అర్థము :— తే=అట్టివారు, విశాలమ్ = విశాలమైన. తమ్+స్వర్గలోకమ్=ఆ దేవేంద్రలోకమును, భుక్త్వా=అనుభవించి, పుణ్యే+క్షీణే+ (సతి)=పుణ్యము క్షీణించినదగుచుండఁగా, మర్త్యలోకమ్+విశన్తి=భూలోకమునకు వచ్చుచున్నారు, ఏవమ్=ఈప్రకారముగా, త్రయీధర్మమ్+అనుప్రపన్నాః=కామ్యఫలప్రదంబులగు వేదోక్తకర్మననుష్ఠించునట్టి. కామకామాః=కామాత్మకులు, గతాగతమ్=రాకపోకలను (జననమరణములను), లభన్తే=పొందుచున్నారు.

అట్లువారలు ఆమహత్తైన దేవేంద్రలోకమున వారివారి సుకృతముల పరిమితికి ననుగుణ్యములగు భోగముల ననుభవింపుచుండి వారిపుణ్యములు క్షీణించిన వెంటనే (అనఁగా, వారివారి సుకృతములకుఁ దగినంత కాలము వఱకు భోగముల ననుభవించిన పిమ్మట) మరల నీభూలోకమునకు వత్తురు. అనఁగా, మర్త్యలోకమున జన్మింతురు. కాఁబట్టి యెవరు కామాత్మకులై స్వర్గాది భోగముల నపేక్షింపుచు నట్టిఫలముల నివ్వఁదగిన వేదోక్తకర్మల నాచరించుచున్నారో, అట్టివార లిపుడు నేఁజెప్పిన ప్రకారము రాకపోకలను (జనన మరణములను) బొందుచుందురు అనఁగా, అట్టివారు స్వర్గలోకమునకుఁ బోయి యచ్చటఁ గొంతకాలమువఱకు గముల ననుభవించి మరల నీభూలోకమున జన్మింపుచు, మరల నట్టి పుణ్యకార్యములు చేసి స్వర్గలోకమునకుఁ బోవుచు, మరల నీలోకమున జన్మించుచు నుందురే కాని జననమరణరాహిత్యమగు ముక్తినిఁ బొందఁజాలరు.

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥ 22

అర్థము :— అనన్యాః = అన్యగతికులుగాక (ఇతరదేవతల నాశ్రయింపక), మామ్=నన్ను, చిన్తయన్తః=చింతింపుచు, యే+జనాః=ఏజనులు, పర్యుపాసతే=ఉపాసింపుచున్నారో. నిత్యాభియుక్తానామ్ = ఎల్లప్పుడును నాయందే చిత్తమును జేర్చియుండునట్టి, తేషామ్=వారలయొక్క, యోగక్షేమమ్=యోగక్షేమమును, అహమ్=నేను, వహామి=వహించుచున్నాను.

అటుగాక, యెవరైతే యితర దేవతల నాశ్రయింపక యెల్లప్పుడును నాయందే చిత్తమును జేర్చినవారై నన్నే ధ్యానింపుచున్నారో, అట్టివారి యోగక్షేమములను నేనే వహించుచున్నాను. అనఁగా, అట్టివారి కెప్పుడెప్పు డేదేది క్షేమకరముగానుండునో అప్పుడప్పుడు దానిదాని నొడఁగూర్చుచుందును.

అర్జు — అయ్యా! ఇట్లు చెప్పితివిగదా, నిన్నాశ్రయించెడు వారలయొక్క సిరిసంపత్తులను నీవు హరింపఁజేయుదువని లోకవాదుక గలిగియుండుటయేగాక అందు కనుగుణ్యముగ నీవు గోపకాంతల చెంతకు నుద్ధవుని బంపినపుడా గోపికలలోనొకతె

"ఉ. పన్నగ మింటిపైకెగసి పాఱువిహంగములైన వీనులం
ద న్నొకమాటు విన్న గృహదారసుతాదులఁబాపి విత్తసం
పన్నత డించి సంసరణ పద్ధతిఁబాపెడు వాఁడు నిత్యకాం
క్షన్నెజీనున్న మాబ్రతుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా!"

(భాగ. ౧౦. స్కం. ౧౪౬౧)

అని నిష్ఠురోక్తులాడినట్టును వినియున్నాను. దీనింబట్టి చూడఁగా నిపుడు నీవు చెప్పెడి మాటలు కేవలవిరుద్ధములుగాఁ గనఁబడుచున్నవే, ఇందుకు గారణమేమి?

కృ — ఇదివఱకు విన్న విషయమును, ఇపుడు నేఁ జెప్పినవిషయమును పరస్పర విరుద్ధములుగా నున్నట్లగపడినను, ఆవిరెండును యథార్థములేగాని యబద్ధములుగావు. నన్నాశ్రయించెడి వారి సిరిసంపత్తులను హరింపఁజేయుట వారలక్షేమముకొఱకేగాని వేఱుగాదు. అదెట్లనఁగా నిందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

ఒకగొల్లవాఁడు తన పశువులను పొలములో మేపుకొని సాయంకాలమున నింటికిఁ దోలుకొనిపోవునపు డాపశువులు పోవుచుండెడు మార్గమున కిరుప్రక్కల నుండుపొలములలో పుంజీకరించియుండుపైర్లను జూచి యాపశువు లత్యుత్సాహముతో నాపైరులలోఁబడి మేయఁబోవ గమకించునపు డాపసులవాఁ డేమిచేయును?

అర్జు — ఆపశువుల నాపైరులలోనికిఁ బోనివ్వక మరలించి మార్గముననే నడిపించును.

కృ — అట్లుచేయుటకుఁ గారణమేమి? ఆపశువుల నాపైరులలో నేల మేయనియ్యఁగూడదు?

అర్జు — అవియట్లు మేసినయెడల నాపశువులను ఆపైరుకాపరి పట్టిబంధించి బందెలదొడ్డి కంపునుగనుక.

కృ — మంచిది, ఆగొల్లవాని కాపశువులతోపాటు కాపరిలేని మఱికొన్ని పశువులును, ఆమార్గముననే పోవుచు ఆపైర్లలోఁబడి మేయఁబోవుచున్నవి; అప్పుడా గొల్లవాఁ డాపశువులనుగూడా నదేప్రకారము మరలించునా?

అర్జు — అట్లుచేయఁడు, అవితనకు సంబంధించినవి కావుగనుక నవియెట్లు పోయినను, వానికేమిగతి సంభవించినను, తనకు నిమిత్తములేదనియెంచి యుపేక్ష చేయుచున్నాఁడు.

కృ — మంచిది, అట్లువాఁడాపశువుల జోలికిఁబోక తమను మాత్రమే పైర్లలో మేయనీక మరలించుటను జూచి యాగొల్లవానిపశువు లేమి యెంచుచుఁదగియుండును?

అర్జు — తమయెడల నిర్దయుఁడై తమను గష్టపెట్టుచున్నాఁడని యెంచుచుఁదగి యుండును.

కృ — మంచిది, ఇట్లు నిర్బంధించుచు తోలుకొనిపోఁబడిన యాపశువుల నాగొల్లవాఁ డావలనేమి చేయుచున్నాఁడు?

అర్జు — తనయింటికిఁ జేర్చుకుని యచ్చట వానికట్టుమట్టుస్థలమును శుభ్రపఱచి దేనిదేని కట్టుమట్టున దాని దానిఁగట్టివేసి వానినన్నిటినిఁ జక్కఁగాఁదోమి కుడితి నీరుద్రావించి కసవు మొదలగు మేతల వానిముందఱవైచి రాత్రికాలమందు వానిసమీపమునఁబరుండి యప్పుడప్పుడులేచి వానికి మేతవేయుచు, వానికి దోమకాటు మొదలగు బాధలు గలుగకుండ పొగవేయుట మొదలగు పనులఁజేయుచు వానినిఁజక్కఁగఁగాపాడుచుండును.

కృ — మంచిది, కాపరిలేమిచేఁ బైరులలోఁబడి మేయుచుండిన పశువుల గతి యేమగుచున్నదో తెలియునా?

అర్జు — ఆపశువులు వాని యిచ్చవచ్చినట్లు పైర్లలోఁబడి యత్యుత్సాహమున అంకెలు వేయుచు మేయుచుండఁగా నాపైరుకావలివాఁడు పొంచుచు వచ్చి వానింబట్టి బంధించి బందెల దొడ్డిలోఁ దోలును. అందుపైని యవి యాబందెలదొడ్డిలో మేత, నీళ్లు లేక పేడ మొదలగు వానితో మిగుల నసహ్యాకరమగు రొంపిలో నిలుచుచు దోమలు మొదలగు వానిచే మిగుల బాధల నొందుచుండును.

కృ — అవునుగదా, అట్లేయీప్రపంచమున జనులు దారపుత్రబంధుమిత్ర ధనధాన్యాది సంపదలచే విఱ్ఱవీగుచు గర్వించి కామాద్యరిషడ్వర్గమునకులోనై యనేక దుష్కృత్యముల నాచరించుచు తుదకుయమునిచేఁజిక్కి నరకబాధలననుభవింతురు గాన, నన్నాశ్రయించెడు వారల నట్లుచెడకుండఁ గాపాడుటకై, యట్టి కామాద్యరిషడ్వర్గములకుఁగారణభూతములైన యైశ్వర్యాదులను హరించుచున్నాను. కాని నేనట్లు చేయుట వారల క్షేమము కొఱకే యని యెఱుంగుము. కనుకనే నేనొకప్పుడు మెచ్చినందునకుఁ బ్రసన్నుండనై నీకభీష్టంబులగు వరంబు లడుగుమనిన నతండిట్లు స్తుతియించె.

"క. నీమాయఁజిక్కి పురుష
శ్రీమూర్తిగ జగమునిన్ను సేవింపదు వి
త్తామయ గృహాగతమైసుఖ
తామసమై కామవంచితంబై యీశా!

ఉ. పూని యనేకజన్మములఁ బొందిన పొందు దన పుణ్యకర్మసం
తానము చేతఁ గొమ్మనుఘాస్థలిఁ బుట్టి ప్రవృద్ధదేహుఁడై
మానవుఁడై గృహాశ్రముఁడు ముందుఁ దజంబు తృణాక్షిలాషియై
కానక పోయి నూరెఁడు కైవడి నీపదభక్తిహీనుఁడై.

క. తరుణీపుత్రధనాదుల
మరగి మహారాజ్య విభవమదమత్తుఁడనై
నరిత ను లుపుఁడనకునా
కరయఁగ బహుకాలమీశ! యూరడి పోయెన్.

క. ఘటకమ్యసన్నిభంబగు
చటులకళేబరముఁ జొచ్చి జనపతినంచు
న్నటుచతురంగంబులతో
నిటునటుఁ దిరుగుదును నిన్ను నెఱుఁగమి నీశా!

ఆ. వివిధకామభోగవిషయలాలసుమత్తు
నప్రమత్త వృత్తినంతకుండ
నైన నీవు వేళ యరసి త్రుంచుదువు సర్ప
మొదిగి మూషికంబు నోడియున్నట్లు.

క. నరవర సంజ్ఞితమై రథ
కరిసేవితమైనయొడలు కాలగతి న్భీ
కరమృగభక్షితమై
దుస్తర విట్క్రిమి భస్మసంగతంబగు నీశా!

ఆ. సకల దిశలు గెలిచి సములువర్ణింపంగఁ
జారుపీఠ మెక్కి సార్వభౌముఁ
డైన నతుల గృహములందుఁ గ్రీడాసక్తి
వృత్తినుండు నిన్ను వెదకలేఁడు.

ఆ. మానసంబుఁ గట్టి మహితభోగంబులు
మాని యింద్రియముల మదము లడఁచి
తపము చేసి యింద్రతయ గోరుఁ గాని నీ
యమృతపదముఁ గోరఁ డజ్ఞుఁ డీశ!

సీ. సంసారియైయున్న జనునకు నీశ్వర నీకృప యెప్పుడు నెఱయఁగల్గు
నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు బంధమోక్షుఁ డైనఁ బ్రాప్తమగును

సత్సంగమంబు సత్సంగమంబున నీమీ భక్తిసిద్ధించు నీభక్తివలన
సన్ముక్తియగు నాకు సత్సంగమమునకంటె మునురాజ్యబంధనిర్మూలనంబు
గలిగినది దేవ నీయనుగ్రహముగాదె
కృష్ణ! నీసేవగాని తక్కినవి వలదు
ముక్తిసంధాయివగు నిన్నుమట్టుఁగొలిచి
యాత్మబంధంబుగోసనే యార్యుఁడెందు ?

వ. కావున రజస్సత్వ తమోగుణంబులచేతను బంధంబులగు నైశ్వర్య శత్రుమరణ ధర్మాది విశేషంబులు విడిచి యీశ్వరుండును విజ్ఞానఘనుండును నిరంజనుండును నిర్గుణుండును నద్వయుండును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెద. చిర కాలంబు కర్మఫలంబులచేత నార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండనై తృష్ణఁబాయక శత్రువులైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతియెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భయుంజేసి రక్షింపుము. ” (భాగ. ౧౦. పూ. భా. ౧౬౫౩—౧౬౬౨)

అర్జు — అయ్యా! ఇట్లు చెప్పితివిగదా, నీకు బాల్యస్నేహుండును పరమ భక్తుండును పరమదరిద్రుండును నైన కుచేలునకు నఖిలైశ్వర్యములిచ్చి యుండలేదా! నీవిట్టిపని విషయములోఁ జేయుచుండఁగా నిప్పుడు నీవుచెప్పినదానికిఁ గేవల విరుద్ధముగానున్నట్లగపడుచున్నదే, ఇతనివిషయములో నిట్లుచేయుటకుఁ గారణమేమి ?

కృ — అవును. అతఁ డైశ్వర్యకాముఁడై నన్ను సేవించినవాఁడు కాఁడనియును, తనభార్యవలనఁ బ్రేరితుండై యామెయుత్సాహంబునకై నావద్దికివచ్చిన వాఁడనియును, అతని కెట్టిసంపదలిచ్చినను, అందుచే నేలాటివికారమునుజెందక సదానన్నే భజింపఁగల మనోదార్ఢ్యముగల వాఁడనియును నెఱుఁగుదునుగనుక నట్టి సంపదల నిచ్చినాను. అట్లిచ్చినసంగతినియాతనికిఁ దెలియకుండఁగనే యతనిని రిక్తహస్తములతోఁ బంపఁగా నతఁడు ఐశ్వర్యమునుగోరి వచ్చినవాఁడు కాఁడు గనుకనే తనయూరికి మరలి పోవు నపుడు మార్గములో

“ఉ. శ్రీనిధియిట్టునన్ను బచరించి ఘనంబుగ విత్తమేమియు
నీ్నని తెలంగుగానఁబడె నెన్నదరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరడని కాకశ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధిసర్వవస్తు పరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే॥ ”

(భాగ. 10. స్క. ౧౦౧౯)

అని యనుకొనుచుఁ దృప్తిఁజెందినమనస్సుతో నేగెను. అట్లుపోయితనయూరు చేరి చూచుటఁదన యింటఁగలిగియుండిన యష్టైశ్వర్యమును జూచి యవియంతయు

నాసంకల్పంబుననే కలిగినవి నిశ్చయించుకొన్నవాఁడై యాభోగములయం దాసక్తచిత్తుఁడుగాక సదా నన్నే ధ్యానించుచుండెను. కాన నట్టివానికిం దైశ్వర్య ములైన నివ్వఁగలను. ఇందునకుగూడ నొకదృష్టాంతమును జెప్పెదను వినుము.

అదెట్లనఁగా, ఇదివరకుమందు నేఁజెప్పిన దృష్టాంతములోని గొల్లవాఁడు తన పశువుల నంటికిఁదోలుకొని పోవునపు డామార్గమున కిరుప్రక్కలనుండు పైర్లలోఁ బడి మేయనీయక కాపాడుచు వచ్చునని చెప్పియుంటినికదా ? అయితే ఆపశువు లలో నొకానొకటి దొంగతనముగా నుండుటయుఁ గలదు. అదెట్లనఁగా, అపశువు వేరైన పైరులోఁ బడి దొంగతనముగా మేయునపుడు మిగుల మెలఁకువ గలిగి యాపైరు కాపరి మొదలగు వారెవరైనఁ దన్నుఁ బట్టుకొన వత్తురేమో యని యొక కంటఁ గనిపెట్టుచునే మేయుచుండును. అట్లెవరైనఁ దన్నుఁ బట్టుకొన గమకించిన మొదల వెంటనే యాసడిఁ గని వారలచేతికిఁ జిక్కక పరుగిడి తన యింటికిఁ జేరును. కనుక నాగొల్లవాఁడు తనపశువులలో నట్టి శక్తి గలదానిని మాత్రము రాత్రిపూట పలుపుఁ దప్పించి పైర్లలోఁ దనిచ్ఛగ మేయుటకు విడిచి పెట్టును. ఏలయనఁగా, ఆపశువెక్కడ దొంగమేపు మేసినను ఎవరిచేతను జిక్కకవిడక తెల్లవారక మునుపే తన యింటికి వచ్చి చేరఁ గలదనియెడు ధైర్యము వానికిఁ గలదు గనుక నట్లు చేయు చున్నాఁడు. కాఁబట్టి, ఓయి యర్జునా ! నాభక్తులలోఁ గూడ నొకానొకఁ డట్టి శక్తి గలవాఁడై యుండును, అదెట్లనఁగా, అట్టివాఁడు దైహికములగు సమస్త సుఖములననుభవించు చుండినను అవియన్నియు నశాశ్వతములనియు, తుచ్ఛములనియు నెఱిఁగిన వాఁడై వానియం దాసక్తచిత్తుఁడుగాక సదా నాయందే చిత్తముంచిన వాఁడై ప్రకృతిబద్ధుఁడుగాక యంత్యకాలమున ననుఁజేరఁగలఁడు. కాఁబట్టి నాభక్త లలో నట్టిశక్తిగల వానికి మాత్ర మట్టి యైశ్వర్యములనైన నిత్తును. కుచేలుఁడట్టి శక్తి గలవాఁడు గనుకనే యతని కట్టి యైశ్వర్యముల నిచ్చుటకుఁ గారణమైనది.

అర్జు — అయ్యా ! ఇట్లు చెప్పితివిగదా, ఈలోకమున ననేకు లనేకవిధములగు నితరదేవతలను భక్తి శ్రద్ధలతో నారాధించుచున్నారు గదా, వారల గతియేమి ?

శ్లో ॥ యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥ 23

అర్థము :— హే కౌన్తేయ ! = ఓయర్జునా !, యే + అపి = ఏవారైతే, అన్యదేవతా భక్తాః + (సన్తః) = నాకంటెనితరదేవతలయెడ భక్తిగల వారలగుచు, శ్రద్ధయా + అన్వితాః = శ్రద్ధతోఁ గూడినవారై, యజన్తే = పూజించుచున్నారో, తే + అపి =

(అట్టి)వారలుగూడ, మామ్+ఏవ=నన్నే, అవిధిపూర్వకమ్=విధ్యుక్తమార్గము నను లంఘింపక, యజన్తే=ఆరాధింపుచున్నారు (ఆరాధించువారగుచున్నారు.)

కృ — అవును, నీవుచెప్పినట్లు ఈలోకమున ననేకు లనేకవిధములగు నన్యదేవతల నారాధించు చుండుటనిజమే ; అయితే, ఓయియర్జునా ! ఇంతకుముందు నేను, ఎవం డెవం డే యేకోరికలగలవాండై యేయేదేవతలను భక్తిశ్రద్ధలతో నారాధించు చున్నాండో, వాని వానికాయా దేవతలయం దట్టి శ్రద్ధాభక్తులను నేనేస్థిరపరచుచున్నాననియు (చూ 7. 21), మఱియునట్టివారలలో నెవరెవరేయేవిధముగ, అనంగా, నేయేరూపముగ భావించి నన్నారాధించుచున్నారో, వారివారి నాయా రూపముతో ననుగ్రహింపుచున్నాననియు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా ? (చూ 4. 11).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — ఈలోకమునందుంగల దేవమనుష్య తిర్యగ్రూపములన్నియు నాస్వరూపము లేగనుక నెవరెవరు భక్తిశ్రద్ధలుగలవారై, ఏయేదేవతాస్వరూపము నారాధించినను. అట్టియారాధనములన్నియు నాకేచెందుచున్నవి. కనుక నట్టివారును నన్నే యారాధించినవారలగుచున్నారు. అయితే, అట్టివారలుచేసెడు నారాధనము విధ్యుక్తప్రకారము క్రమమైనయారాధనము కానేరదు.

శ్లో ॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ
న తు మామభిజానన్తి తత్త్వేనాత శ్చ్యవన్తి తే॥ 24

అర్థము :— హి=ఏలయనంగా, సర్వయజ్ఞానామ్=సమస్తవిధములగు నారాధనములకు, భోక్తా+చ=అనుభవించువాండును, ప్రభుః+చ=యజమానుండును, అహమ్+ఏవ=నేనే, తు=అయినను, మామ్=నన్ను, తత్త్వేన=యథార్థముగా, న+అభిజానన్తి = ఎఱుంగరు, అతః = ఈకారణమువలన, తే = (అట్టి)వారలు, చ్యవన్తి=జాఱుచున్నారు (ప్రసర్జన్మమును బొందుచున్నారు).

ఏలయనంగా.

"ఉ. కాలము దేశమున్ గ్రతువు గర్మము గర్తయుభోక్తయుం జగ
జ్జాలము దైవము న్గుణపు సాంఖ్యము మంత్రము యజ్ఞమాహుతు
ల్వేళలు విప్రులుం జననవృద్ధిలయంబుల హేతు భూతము
ల్లీలలుదానయైతగ వెలింగెడునెక్కటి తేజమీశుడున్. "

(భాగ. 10 స్కం.)

అనునట్లు, ఈప్రపంచమునఁగల జనులలో నెవరెవరేయే దేవతల నుద్దేశించి యేయేవిధములగు నారాధనలఁ జేసినను, ఆదేవతలన్నియు నాస్వరూపములే గనుక నట్టియారాధన లన్నియు నాకే చెందుచున్నవి. కనుక నాయారాధనల ననుభవించువాఁడును, అందులకుఁ దగిన ఫలము నిచ్చువాఁడు నేనే యగుచున్నాను. అయినను, మూఢులగు వారట్టి నానిజస్వరూపము నెఱుఁగఁజాలక యేదేని కొన్ని ఫలముల నపేక్షించి యాఫలముల నియ్యఁదగిన దేవతల నారాధించి యాఫలములను బొందుదురు. అయితే, అట్టిఫలములన్నియు మోక్షేతరములగునవియే గనుక నట్టిఫలములఁ బొందెడు వారలకు మరల జన్మము కలుగుచుండును.

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః ।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్॥25

అర్థము :— దేవవ్రతాః=దేవతల నారాధించువారు, దేవాన్=(ఆ) దేవతలను, యాన్తి=పొందుచున్నారు. పితృవ్రతాః=పితృదేవతల నారాధించువారు, పితౄన్=(ఆ) పితృదేవతలను, యాన్తి=పొందుచున్నారు, భూతేజ్యాః=భూతముల నారాధించువారును, భూతాని=(ఆ) భూతములను, యాన్తి=పొందుచున్నారు, మద్యాజినోఽపి=నన్నారాధించువారన్ననో. మామ్=నన్ను, యాన్తి=పొందుచున్నారు.

అదెట్లనఁగా, ఇంద్రాదిదేవతల నగ్నిష్టోమాది క్రతువులచే నారాధించెడువారలు స్వర్గలోకమునకుఁ బోయి యచ్చటదేవత లనుభవించెడు భోగముల ననుభవింతురు. పితృదేవతలఁ దర్పణాదులచే నారాధించెడువారా పితృదేవతలుండెడి లోకమునకుఁ బోయి యచ్చటివార లనుభవించెడు సుఖము ననుభవింతురు. భూతగణము నారాధించెడువారాలోకమునకుఁ బోయి యందలి సుఖము ననుభవింతురు. అయితే, అట్టి స్వర్గాది భోగములను గోరెడువారు అల్పబుద్ధిగలవారనియు, వారు కోరెడు ఫలములు అంతము గలవనియు, (చూ. 7-23). కనుక నింద్రాది లోకములకుఁ బోయెడువారు ఆయా లోకములలో వారు వారు చేసికొనిన పుణ్యము క్షీణించిన వెంటనే తిరుగా మర్త్యలోకమునకు వత్తురనియు (చూ. 9-21). ఇంతకుముందు చెప్పియుంటినిగదా ! కాఁబట్టి వారలు మరల నీలోకమున జన్మించవలసి వచ్చును.

అట్లుగాక నా నిజస్వరూపమిట్టిదని యథార్థముగా నెఱిఁగి నన్నే యెవరైతే యారాధించుచున్నారో, అట్టివారలు నన్నే పొందుదురు. అనఁగా, నాదియగు పరమపదమును బొందుదురనుట. ఆపరమపదము నెవరు పొందుచున్నారో అట్టివారలకు మరల జననమరణాదులు కలుగనేరవు.

శ్లో॥ పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి ।
తదహంభక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥ 26

అర్థము :— యః=ఎవఁడు, మే=నాకు, పత్రమ్=దళమునుగాని, పుష్పమ్=పుష్పమునుగాని, ఫలమ్=ఫలమునుగాని, తోయమ్=ఉదకమునుగాని, భక్త్యా=భక్తితో, ప్రయచ్ఛతి=సమర్పించుచున్నాఁడో, ప్రయతాత్మనః = పరిశుద్ధాంతఃకరణుండగు, తస్య=వానియొక్క, భక్త్యుపహృతమ్=భక్తితో సమర్పింపఁబడిన, తత్=దానిని (అపత్రమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని లేక తోయమునుగాని), అహమ్=నేను, అశ్నామి=భుజించుచున్నాను.

ఆయితే, ఓయి యర్జునా! స్వల్పఫలప్రదాతలగు నింద్రాది దేవతా ప్రీత్యర్థముగఁజేయఁబడు క్రతువులు మొదలగువానికే యనేకవిధములగు ద్రవ్య సామగ్రులు క్రియాకలాపములు కావలసి యుండఁగా, శాశ్వతఫలమగు మోక్షమునిచ్చెడు నన్నారాధించుట కెట్టిద్రవ్యసామగ్రులును, క్రియాకలాపములును కావలసి వచ్చునోయని యాలోచింతువేని చెప్పెదవినుము. నన్నారాధించుటకట్టి ద్రవ్యోపకరణాదులేవియు నక్కరలేదు. కాన నతిసులభము. అదెట్లనఁగా, నాకు భక్తియే ప్రధానముగాని నన్నారాధించుటకుగా నుపయోగించెడు వస్తుసామగ్రులుగాని, చేసెడుక్రియలుగాని ప్రధానములుగావు. కనుక,

"క॥ దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైన బాయనిభక్తి
న్గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగను నేనుభుజింతున్॥" (భాగ. ౧౦ స్క.)

అనునట్లు ఎవడైననుసరే నాయెడలభక్తిగలిగి, తనశక్త్యానుసారముగ నేమిసమర్పించినను, అనఁగా, తుదకు నొకతులసిదళమునుగాని, పుష్పమునుగాని, ఫలమునుగాని, లేక జలమునుగాని సమర్పించినయెడల, దానిని మిగులరుచికరమగు పదార్థముగ నెంచి ప్రీతితో నంగీకరింతునుగాని, యట్టిభక్తిలేక యెట్టిపూజలుచేసినను, ఏలాటి పదార్థములు సమర్పించినను వానిని నేను ప్రియముతో నంగీకరింపను. ఇందుకు నిదర్శనముగ నేనిదివఱకుఁ గుచేలుఁడు నాకర్పించుటకుఁగాఁదన జీర్ణవస్త్రంబు కొంగున ముడిచితెచ్చినయడుకుల నతఁడు నాకిచ్చుటకు సంకోచింపుచుండినను, ఆకొంగుముడిని నేనే విప్పియందుండు నడుకులలోఁబిడికెడెత్తియెంతోప్రీతితో నారగించినసంగతి నీవు వినియేయుందువుగదా? కనుక నట్టిభక్తిలేక చేసెడు

పూజలన్నియు "భక్తిలేనిపూజ పత్రిచేటు", "చిత్తశుద్ధిలేని శివపూజలేలరా" అను నట్లు వ్యర్థములగుచున్నవి. కనుకనే ద్రవ్యసాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానస్వరూప మైన యజ్ఞమే శ్రేష్ఠమైనదని నీకు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 4-33).

అర్జు — అవు: జ్ఞాపకమున్నది.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి. దదాసియత్ ।
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్ ॥ 27

అన్వయము — హేకౌన్తేయ! = ఓయియర్జునా!, యత్ + కరోషి = దేనింజేయు చున్నావో, యత్ + అశ్నాసి = దేనిందినుచున్నావో, యత్ + జుహోషి = దేనిని వేల్చుచున్నావో, యత్ + దదాసి = దేనిని దానమిచ్చుచున్నావో, యత్ + తప స్యసి = దేనిని జపించుచున్నావో, తత్ = దానిని, మదర్పణమ్ + కురుష్వ = నాకర్పించుము.

కృ — ఇంతయేల, నాయందు భక్తిగలవారల కిపుడు నేఁజెప్పిన ప్రకారము పత్రాదులనుగూడ నాకొఱకై సంపాదించి సమర్పించవలసిన యగత్యముగూడ నుండదు. అట్టివారలు ఆత్మార్థముగాఁ బ్రతిదినమును జేయుచుండెడు భోజనాది నిత్యకృత్యములనైన నాకర్పించినఁజాలును. కావున నోయి యర్జునా! నీవు ప్రతిదిన మును జేయుచుండు పనులన్నిటిని నాకర్పించుచుండుము. అనఁగా, నీవెప్పు డేపదార్థములను భుజించినను, హోమాగ్నియం దెప్పు డేహవిస్సును వేల్చినను, ఎప్పుడెవరి కేమిదానము చేసినను, ఎప్పు డేజపతపవ్రతాదుల నాచరించినను, అవి యన్నియు నాప్రీత్యర్థముగాఁ జేయఁబడినట్లు మనసా యూహించి నాకర్పితము లుగాఁ జేయుచుండుము.

శ్లో॥ శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ 28

అర్థము:— ఏవమ్ = ఇట్లు (పైఁజెప్పఁబడినప్రకారము), త్వమ్ = నీవు, సన్న్యాసయోగయుక్తాత్మా = సన్న్యాసయోగముతోఁగూడినమనస్సుగలవాడవై, శుభాశుభఫలైః = పుణ్యపాపములే ఫలములుగాఁగల, కర్మబన్ధనైః = కర్మబంధముల చేత, మోక్ష్యసే = విడువఁబడఁగలవు, విముక్తః = (అట్లు) విడువఁబడినవాఁడవై, మామ్ + ఉపైష్యసి = నన్నుఁబొందఁగలవు.

ఇట్లు నీవాచరించెడు సమస్తకర్మలనా కర్పణ చేయుటవలనఁగలిగెడు ప్రయోజన మేమనఁగా, ఆ కర్మఫలములను నీవు మనసా సన్న్యసించిన వాఁడవగుదువు అనఁగా, అట్టి కర్మలయొక్క ఫలాఫలములతో నీకు నిమిత్యము లేదని మనస్సుచేత వదలుకొన్న వాఁడవగుదువు. అట్టి మనస్సన్న్యాసము నెప్పు డవలంబించు చున్నావో అప్పుడా కర్మఫలములగు పుణ్యపాపములు నిన్నంట నేరవు. జనన మరణాది సంసార బంధములకుఁ బుణ్య పాపములే కారణభూతములైనవి గనుక నట్టి పుణ్య పాపములు నిన్నెప్పు డంటక పోవుచున్నవో, అప్పుడే జననమరణాది సంసార బంధములనుండి విముక్తుఁడ వగుదువు. అనఁగా, జననమరణాదులు గలుగ నేరవనుట. అట్టి జనన మరణాదు లెప్పుడు లేకపోవుచున్నవో, అప్పుడు నన్ను బొందిన వాఁడ వగుచున్నావు. అనఁగా, నావలెనే నీవును బరమాత్మస్వరూపుఁడ వగుదువనుట.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి నప్రియః ।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాఽప్యహమ్॥ 29

అర్థము :— అహమ్ = నేను, సర్వభూతేషు = సమస్తభూతములయందు, సమః = సమానుఁడను (సమభావముగలవాఁడను), మే = నాకు, ద్వేష్యః = ద్వేషింపఁదగినవాఁడు. న+అస్తి = లేఁడు, ప్రియః = ప్రియుఁడు, న = లేఁడు. యే + తు = ఎవ్వరైతే, భక్త్యా = భక్తితోడ, మామ్ = నన్ను, భజన్తి=భజింపుచున్నారో, తే = వారలు, మయి = నాయందు, (వర్తన్తే) = వర్తింపుచున్నారు, తేషు+చ= వారలయందును, అహమ్+అపి = నేనును, (వర్తే) = వర్తింపుచున్నాను.

అయితే, ఓయియర్జునా! నేనిట్లు చెప్పుటవలన నేనును ఇతరులవలెనే రాగద్వేషములు గలవాఁడనై కొందఱియెడల ప్రియమును, మఱికొందఱియెడల నప్రియమును గలిగియుందునని యోచించెదవేమో, అట్లెంచఁదగదు. ఎవరియొక్కయు పాపమునుగాని పుణ్యమునుగాని నేనుగ్రహించుటలేదని యిదివఱకే నీకుఁ జెప్పియున్నానుగదా? (చూ. 5. 15). కనుక నేను సమస్తభూతములయెడలను సమానభావముగలవాఁడనైయే యుంచున్నాను. నాకు నొకనియెడలఁ బ్రియముగాని మఱియొకనియెడల నప్రియముగాని యుండవలసిన కారణములేదు. అయితే, "యేషాం త్వన్తగతం పాపమ్" ఎవరియొక్క పాపములైతే వారుచేసెడి పుణ్యకర్మలవలన నశింపుచున్నవో, అట్టివారు సుఖదుఃఖాది ద్వంద్వరహితులై దృఢచిత్తముతో నన్ను భజింతురని యిదివఱకే నీకుఁ జెప్పియుంటినిగదా (చూ. 7. 28). అట్టి మహానుభావులే నన్ను భజింతురు. "మామేవయేప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే"

అట్లు నన్నే యెవరుభజింపుచున్నారో వారలు నామాయను దరింతురనియును చెప్పి యుంటినిగదా ? (చూ. 7–14). అట్లు నామాయను దరించిన వారెప్పుడగుచున్నారో, అప్పుడే "మద్భక్తా యాన్తిమా మపి" అని యిదివఱకు నేను జెప్పియుండుప్రకారము (చూ. 7–23) అట్టివారు నన్నుబొందుచున్నారు. అట్లు నన్నుఁబొందిన వారు "మామ పేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ నాప్నువన్తి మహాత్మానస్సం సిద్ధిం పర మాంగతాః॥" (చూ. 8–15). అని యిదివఱకే నేను నీకుఁ జెప్పి యున్నట్లు పునర్జన్మము నొందరు. మఱియుగు చున్నారనఁగా, "వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః। బహవో జ్ఞాన తపసా పూతా మద్భావ మాగతాః॥"(చూ. 4.10) అని యిదివఱకే చెప్పియున్నానుగదా ? కనుక నిర్లిప్తులై తే రాగద్వేషాదులు లేని వారలై నన్నే యాశ్రయించి భజింపుచున్నారో అట్టివారు నాస్వరూపులగుదురు. కనుక నట్టివారు నాయందున్నవారును, నేను వారియందున్నవాఁడను అగుచున్నాము. కనుక నెవరెవరు పుణ్యకర్మలఁ జేయుచుందురో, వారివారి కాయా పుణ్యకర్మలే యిట్టి పర్యవసానమును గలుగఁ జేయుచున్నవిగాని నేను వారల క్షేమి యుఁ జేయుటలేదు.

అర్జు — అయ్యా ! ఇట్లు చెప్పితివి గదా, ఇందువలన నేమి యేర్పడుచున్న దనఁగా ఎవ్వరైనను సరే వారివారి కులాచార మతాచారముల ననుసరించి విద్యుక్త ప్రకారముగా పుణ్యకర్మలనాచరించుటవలన నాపుణ్యకర్మలచే నశింపఁజేయఁబడిన పాపముగల వారలై నిన్ను భజించి కడతేర వలసినవారై యున్న ట్లగపడుచున్నది గదా ? ఒకవేళ నెవ్వరైన నట్టికర్మలేవియు నాచరింపకయు, తమ వర్ణాశ్రమాచార ముల ననుష్ఠింపకయు, మనస్సుచేతమాత్రము నిన్ను స్మరింపుచుండినయెడల నట్టి వారలగతి యేమగును ?

శ్లో॥ అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధు రేవ స మన్తవ్యస్సమ్య గ్వ్యవసితో హి సః ॥ 30

అర్థము: — సుదురాచారః + అపి = మిక్కిలిదురాచారముగలవాఁడైనను, మామ్=నన్ను, అనన్యభాక్=అనన్యగతికుఁడగుచు. భజతే + చేత్=భజించినయెడల, సః=అట్టివాఁడు, సమ్యక్ + వ్యవసితః + హి=(నాయెడల) దృఢమైన యధ్యవసాయముగలవాఁ డగుచున్నాఁడుగదా, తస్మాత్=అకారణమువలన, సః=వాఁడు, సాధుః + ఏవ=(సదాచారసంపన్నుఁడగు సజ్జనుఁడే), (ఇతి)=అని, మన్తవ్యః=తలఁపఁ దగి యున్నాఁడు.

కృ — ఓయి యర్జునా ! అట్లుకేవల దురాచార పరుఁడుగా నుండెడు వాఁడై

నను నేనే గతియని నమ్మినవాఁడై నన్నుఁదప్ప నితర యేదైవము నాశ్రయింపక నన్నే భజింపుచుండినయెడల నట్టివాఁడు సదాచార సంపన్నుఁడగు సజ్జనుఁడేయని యెంచఁదగియుంచున్నాఁడు. అదెట్లనఁగా నిందునకొక దృష్టాంతమును జెప్పుచున్నానువినుము. నీయెదుట నుదకముతో నింపఁబడియుండు మూఁడు చెంబులున్న ట్లెంచికొనుము. అందొకటి వెలుపలను లోపలనుగూడఁ జక్కఁగా దోమఁబడి రెండువైపులను శుభ్రముగా నుండునదియు, రెండవది వెలుపలమాత్రము చక్కఁగా దోమఁబడి తళతళలాడుచు లోపల పాచి మొదలగు కశ్మలముతోఁగూడినదగను, మూఁడవది లోపలమాత్రము శుభ్రముగానుండునట్లు తోమఁబడి వెలుపల మలినసహితమై అసహ్యముగానుండునట్టిది యనియు నెంచికొనుము. అమూఁడు చెంబులలో నుండు నుదకములో దేనియందలి యుదకము ఉపయోగార్హముగ నుండును ? దేని యందలి యుదకము యుపయోగార్హముగ నుండదు ?

అర్జు — మొదటి పక్షము రెండువైపులను శుభ్రముగాఁ దోమఁబడియుండు చెంబులోని యుదకము ఉపయోగార్హముగ నుండును. రెండవ చెంబు వెలుపల శుభ్రముగా నుండినను లోపల మలినముగా నుండుటవలన దానియందలి యుదకము గూడ మాలిన్యము గలదిగానే యుండును గాన దాని యందలి యుదక ముపయోగార్హముగా నుండనేరదు. ఇఁకను మూఁడవచెంబులో నుండెడు నుదకమన్ననో వెలుపలి వైపునఁ జూచుటకు నసహ్యకరముగా నుండినను లోపల మిగుల శుభ్రముగా నుండుటంబట్టి యందలి యుదకముగూడ మిగుల శుభ్రముగానే యుండును. కాఁబట్టి దానియందలి యుదకము మొదటి చెంబులోని యుదకముతో పాటు ఉపయోగార్హముగనే యుండునని తలఁచెదను.

కృ — అవునుగదా, అట్లే "ఆత్మశుద్ధిలేని యాచార మదియేల । భాండశుద్ధిలేని పాకమేల । చిత్తశుద్ధిలేని శివపూజలేలరా । విశ్వదాభిరామ వినురవేమ'" అనునట్లు బాహ్యమునకు మాత్రము స్నానసంధ్యాద్యనుష్ఠానాదివర్ణాశ్రమాచార ధర్మముల యథావిధిగ నెరవేర్చికొనుచు, చిత్తమును నాయందుఁ జేర్పక దుర్విషయములయందు. అనఁగా, పరస్త్రీగమన, పరద్రవ్యాపహార, పరహింసాది కృత్యములయందుఁ బవర్తింపఁ జేయువానికంటెను, బాహ్యమున నట్టి స్నానసంధ్యాద్యనుష్ఠానములులేని వాఁడును, అతిమలినాంగుఁడును, మలినవస్త్రధరుండును, అపేయపానము, అభక్ష్యభోజనము మొదలగు కృత్యంబులఁ జేయువాఁడును నగుచు, కేవలమురాచార పరుఁడుగా నితరులకగపడు చుండినను, చిత్తమునందుమాత్రము నేనేపరమ ప్రాప్యమని యెంచి యితర దేవతల నాశ్రయింపక సదానన్నే భజింపుచుండెడు వాఁడే శ్రేష్ఠుఁడగుచున్నాఁడు. అట్టివాఁడు సదాచార సంపన్నుఁడును, చిత్తశుద్ధిగలవాఁడును

నగు సజ్జనునితో సమానుఁడేయని చెప్పదగి యుంచున్నాఁడు. ఇందుకు నిదర్శనముగా నిదివఱకు నేఁజెప్పియుండెడు జడభరతుని వృత్తాంతమును జ్ఞాపకమునకుఁ దెచ్చుకొంటివేని యీవిషయము నీకుఁ జక్కఁగా బోధపడగలదు.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

అర్థము :— (సః)=అట్టివాఁడు, క్షిప్రమ్=అతి త్వరగా, ధర్మాత్మా=ధర్మాత్ముఁడు, భవతి=అగుచున్నాఁడు, శశ్వత్=శాశ్వతమైన, శాన్తిమ్=చిత్తశాన్తిని, నిగచ్ఛతి=పొందుచున్నాఁడు, హేకౌన్తేయ!=ఓయియర్జునా!, మే=నాయొక్క, భక్తః=భక్తుఁడు, న+ప్రణశ్యతి=నాశమునొందఁడు, (ఇతి)=అని, ప్రతిజానీహి=ప్రతిజ్ఞ చేయుము.

అదెట్లనఁగా "అనన్యచేతాస్సతతం యోమాం స్మరతినిత్యశః । తస్యాహం సులభః ప్రార్థ । నిత్యయుక్తస్య యోగినః" ఎవఁడైతే యితరచింతలు లేనివాఁడై యెల్లప్పుడు నన్ను స్మరించుచున్నాఁడో, అట్టివానికి నేను సులభుఁడనని యిదివఱకేనీకుఁ జెప్పియున్నానుగదా? (చూ.8–14). అట్లు వీడును నితర చింతలమాని నన్నే భజించెడువాఁడు గనుక వానికి నేను సులభుఁడ నగుచున్నాను.

అనఁగా నావిషయమగు జ్ఞానమును సులభముగాఁ బొందఁగలఁడు. అట్టిజ్ఞానము నెప్పుడు పొందుచున్నాఁడో, అప్పుడా జ్ఞానమనెడు తెప్పచేత సమస్తములగు మహాపాతకములనుగూడ దాటవచ్చుననియు నిదివఱకే చెప్పియున్నాను గదా (చూ.4–36). కాఁబట్టి అట్టివాని పాపములన్నియు వెంటనే నశింపఁగలవు. పాపము లెప్పుడు నశించెనో అప్పుడు వాఁడు ధర్మాత్ముఁడగుచున్నాడు గదా, ఇంతియగాక చిత్తశాఁతిని బొందుచున్నాఁడు. అనఁగా, వాని మనస్సేవిధమైన వికారముల నొందక నెమ్మదిగలదిగా నుండును. ఓయియర్జునా! ఇంతదూరము నేఁజెప్పియు నీవిషయమున నీవేమైన సందేహించెదవేమో, అట్లెంతమాత్రము సందేహింపఁ బనిలేదు. దృఢముగా నమ్ముము. ఈవిషయమున నీవెంత దృఢముగా నమ్మవచ్చుననఁగా, ఇపుడు నే జెప్పిన ప్రకారము నాయందు భక్తిగలవాఁ డెట్టివాడైనను, ఎంతయనాచారపరుఁడైనను సరే యెప్పటికిని నశింపఁడని నీవుగట్టిగా నమ్ముటయేగాక యితరులను గూడ నట్లే నమ్మించుటకు వారల యెదుట ప్రతిజ్ఞ చేయవచ్చును.

అర్జు — అయ్యా! ఇప్పుడు నీవు చెప్పిన ప్రకారము దురాచారవంతుఁడనఁగా సత్కులమునందు జన్మించి యాకులమునందుఁగల యాచారముల యథావిధిగా నాచరింపక విరుద్ధాచారముల నాచరించెడు వానికి మాత్రమే యన్వయింపుచున్నదా?

లేక అనాచారములుగల నీచకులమునందే పుట్టి యకులమునందుఁగల యానాచారముల నాచరించువానికిఁ గూడ నన్వయింపుచున్నదా ?

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం
గతిమ్ ॥ 32

అర్థము :— హేపార్థ ! = ఓయియర్జునా !, స్త్రియః = స్త్రీలును, వైశ్యాః = వైశ్యులును, తథా = అలాగుననే, శూద్రాః = శూద్రులును, యే + అపి = ఎవరైతే, పాపయోనయః + స్యుః = (చండాలాది) నీచ జన్మగలవారగుచున్నారో, తే + అపి = వారును, మామ్ = నన్ను, వ్యపాశ్రిత్య = ఆశ్రయించి, పరామ్ + గతిమ్ = పరమపదమును, యాన్తి + హి = పొందుచున్నారుగదా.

కృ — ఇపుడు నేఁజెప్పిన దురాచారపరులనఁగా సత్కుల సంభూతులుగా నుండి దురాచారముల నాచరించు వారికి మాత్రమే కాదు. ఎట్టికులమునందుఁ బుట్టిన వారికైనను సరే యన్వయింపుచున్నది. అదెట్లనఁగా, ఏకులమునందుఁ బుట్టిన వారైనను సరే స్త్రీలును, వైశ్యులును, శూద్రులును, వీరలకు బ్రహ్మ క్షత్రియకులముల యందుఁ బుట్టిన వారికివలె స్నానసంధ్యాద్యనుష్ఠానములును, వేదాధ్యయనాదులును, ఈ మొదలగు నాచారములు విధ్యుక్తములు కావుగదా ? అందువలన వారలట్టి యాచారముల నాచరింపరుగదా ! అట్టి యాచారములు వారలాచరింపక పోయినను నన్నాశ్రయించి భజించినయెడల నట్టివారలు గూడ సదాచార సంపన్నులుగా నుండి నన్ను భజించెడు వారలు పొందఁదగిన పరమపదమునే పొందఁగలరు. ఓయి యర్జునా ! ఇంతయేల, కేవల నీచజన్మగల చండాలాదులుగూడ నితర చింతలు లేక నన్నే యాశ్రయించి భజించిన యెడల నట్టివారలు నైతము పరమపదమును బొందఁ గలరు. ఇందుల ఫలితార్థ మేమనఁగా, ఎవరైనను సరే, తమతమ వర్ణాశ్రమాచార ధర్మములను బట్టి వారువా రనుష్ఠించెడు బహిరాచారము లెంత శ్రేష్ఠములుగా నుండినను చిత్తశుద్ధి లేనివారును నాయందు భక్తిఁ జేయని వారును నైన యెడల నట్టివార లింతకుముందు చెప్పఁబడిన దృష్టాంతము (చూ. 9–30) లోని ఇండవచెంబు, అనగా వెలుపల శుభ్రముగాఁ దోమఁబడి లోపల నతి మలినముగా నుండు చెంబులోని యుదక మెట్లు పానాది కృత్యములకు నర్హము గాక యుండునో, అట్లే నాది యగు పరమపదమును జెందుట కర్హులు గారనియు, అట్లుగాక, వారలనుష్ఠించెడు బహిరాచారము లెంత నింద్యములుగను, హేయములుగను నుండినను చిత్తశుద్ధిగలిగినన్ను

భజించిన యెడల నట్టివారుపై దృష్టాంతములోని మూడవ చెంబు, అనఁగా వెలుపల మిగుల నసహ్యముగ నుండినను లోపలఁ జక్కఁగాఁ దోమఁబడి శుభ్రముగా నుండు చెంబులోని యుదక మెట్లు స్నానాది కృత్యములకు యోగ్యముగా నుండునో, అట్లే నాది యగు పరమపదమును జెందుట కర్హులుగా నుందురనియు నేర్పడుచున్నది గదా ?

శ్లో॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా ।
అనిత్యమసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ 33

అర్థము :— పుణ్యాః=పుణ్యవంతులును, భక్తాః=భక్తులునగు, బ్రాహ్మణాః=బ్రాహ్మణులును, తథా=అలాగుననే, రాజర్షయః=రాజఋషులును, కిమ్+పునః=(పరమపదమును బొందుదురని) మరల చెప్పనేల !, (తస్మాత్)=కాఁబట్టి, అనిత్యమ్ = అశాశ్వతమైనదియు, అసుఖమ్ = సుఖకరము కానిదియు నగు, ఇమమ్+లోకమ్=ఈలోకమును, ప్రాప్య=పొంది (పొందినవాఁడవగుటచే), మామ్=నన్ను, భజస్వ=భజింపుము.

అట్లుండఁగా, పూర్వజన్మ పుణ్యవశంబున శ్రేష్ఠములగు బ్రహ్మ క్షత్రియ వంశములయందుఁ బుట్టి ఆవర్ణాశ్రమాచార ధర్మంబుల యథావిధిగా ననుష్ఠించుటయేగాక అందుకుఁ దోడుగా చిత్తశుద్ధియు నాయందలి భక్తియు గూడఁ గలిగి యుండెడు వారి విషయమై మరలఁ జెప్పనేల ? అట్టివారు పైదృష్టాంతము లోని మొదటిచెంబు, అనఁగా, వెలుపలను లోపలఁగూడ శుభ్రముగఁ దోమఁబడి యుండు చెంబులోని యుదకమెట్లు స్నానాదికృత్యముల కత్యంత యుపయుక్తముగా నుండునో, అట్లే నాది యగు పరమపదమును బొందుటకు మిక్కిలి యర్హులుగానుందురు గదా ? కాఁబట్టి యోయర్జునా ! నీవును నీపూర్వజన్మ సుకృతమువలన నట్టిశ్రేష్ఠమగు క్షత్రియవంశమునఁబుట్టుటయుగాక, యాకులమునందుఁగల సదాచారములను యథావిధిగా ననుష్ఠించిన వాఁడవై యున్నావుగదా ? ఇందునకుదోడుగా నాయందు భక్తిగలిగి నన్నుభజించితివేని, అనిత్యమును సుఖములేనిదియునగు నీలోకమున మరల జన్మింప నగత్యము లేనివాఁడవై శాశ్వతమును నిత్యానందపదవియునగు నాపరమపదమును బొందఁగలవుగాన నన్ను భజింపుము.

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ ! నిన్నేవిధముగా భజించిననట్టి పదవిని బొందవచ్చునో సెలవిమ్ము ?

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మా మే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ 34

అర్థము :— మన్మనాః=నాయందుఁ జేర్చినమనస్సుగలవాఁడవును, మద్భక్తః=నాయందు భక్తిగలవాఁడవును, మద్యాజీ=నన్నారాధించెడువాఁడవును, భవ=అగుము, మామ్=నన్ను, నమస్కురు=నమస్కరింపుము, ఏవమ్=ఈవిధముగా, ఆత్మానమ్=మనస్సును, యుక్త్వా=నాయందుఁజేర్చి, మత్పరాయణః + (సన్)=నన్నే పరమప్రాప్యంబుగ నెంచినవాఁడవగుచు, మామ్ + ఏవ=నన్నే, ఏష్యసి=పొందఁగలవు.

కృ — నాయెడల భక్తిగలవాఁడవై నీచిత్తమును సదా నాయందే చేర్చి నన్నే స్మరింపుచు పూజింపుచు నమస్కరింపుచుండుము. ఇట్లు చేయుచురాగా కొంత కాలమునకు నీమనస్సు నాయందే లయించి నాకంటెనితరమగు దేనియందును నీకు నాసక్తియుండనేరదు. పూర్వకాలంబున నాకు పరమభక్తుఁడగు ప్రహ్లాదుండు నాయందు లయించిన మనస్సుగలవాఁడై యుండెను. అవైఖరిని నీవు విన్నయెడల నాయందుమనస్సు లయించుటయనగా నెట్టిదైనదియునీకుఁదెలియగలదు. అదెట్లనగా

"సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁజేరినయట్లైనఁ జెలి కాంద్రనెవ్వరిఁ జేరమఱచు
నసురారి తనభ్రోలనాడినయట్లైన నసురబాలురతోడ నాడమఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ బరభాషలకు మారుపలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ జొక్కిసమస్తంబు జూడమఱచు.

గీ. హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినట్లైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడతలేకయు నుండును జడునిభంగి" (భాగ. 2 స్కం. ౭-౨-౨)

కావున నీవును అట్టిలక్షణములుగలవాఁడవగుదువు. అట్లెప్పుడగుచున్నావో, అప్పుడే నీవు పరమపదమును బొందఁగలవు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా రాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి రాజవిద్యా రాజగుహ్య యోగంబను
నవమాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతాగర్భితభావబోధిని



## దశమాధ్యాయము



## విభూతి యోగము

**శ్రీభగవానువాచ :**

శ్లో॥ భూయ ఏవ మహాబాహో ! శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥ 1

అర్థము :— హేమహాబాహో=ఓయి యర్జునా!, ప్రీయమాణాయ=ప్రీతితో వినుచున్న, తే=నీకు, భూయః=మఱియు, హితకామ్యయా+ఏవ=మేలు చేయవలెననెడు కోరికతోనే, అహమ్ = నేను, యత్ + వక్ష్యామి = దేనిని జెప్పబోవుచున్నానో, (తత్) = అట్టి, మే + పరమమ్ + వచః = నాపరమోత్కృష్టమైన వాక్యమును, శృణు=వినుము.

కృ — ఓయియర్జునా ! ఇంతకుముందు నీవునన్ను గురువుగ భావించి "శిష్యస్తేహంశాధి మాంత్వాంప్రపన్నమ్" అని చెప్పియుంటివిగదా? (చూ 2-7 . దానికను గుణ్యముగ నేనింతవఱకుఁ జెప్పుచువచ్చిన విషయముల నన్నిటిని నీవు మిక్కిలి ప్రీతితో వినుచుంటివి గాననీయందు భక్తిశ్రద్ధలుగల సచ్ఛిష్యుని లక్షణము లమరి యుండుటం బట్టి యట్టిశిష్యుని యెడల సద్గురువునకు నానాటఁ బ్రేమ యతిశయించుట సహజముగాన నట్లే నీయెడల నాకును బ్రేమయతిశయించుచు, నీకు మఱింత మేలు గలుగఁ జేయఁదగిన విషయములను జెప్పవలయుననెడు కోరికె పుట్టుచున్నది. కాఁబట్టి యింతకుముందు నేఁజెప్పిన విషయములకంటె నుత్కృష్టములగు మఱికొన్ని విషయములఁ జెప్పఁ బూనుకున్నాను గాన వానిని గమనించి వినుము.

శ్లో॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥ 2

అర్థము :— మే = నాయొక్క, ప్రభవమ్ = ఉత్పత్తిని, సురగణాః = దేవగణము ,, న+విదుః = ఎఱుఁగరు. మహర్షయః = ఋషిసమూహములు, న+(విదుః) = ఎఱుఁగరు, హి = ఏలయనఁగా, అహమ్ = నేను, సర్వశః = అన్నివిధములచేతను, దేవానామ్ = దేవతలకును, మహర్షీణామ్+చ = మహర్షులకును, ఆదిః = మొదటివాఁడను.

ఓయియర్జునా! ఒకప్పుడు బ్రహ్మ నారదునకు నామాయాశక్తినిగుఱించి చెప్పడములో దానిశక్తియిట్టిదని తానెఱుఁగకపోవుట సరేగదా నేనుసైత మెఱుఁగనని చెప్పినట్లు నీకింతకుముందు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 5 15. సంభాషణ.)

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక నాయుత్పత్తి నీలోకమునందలి మనుష్యమాత్రులగు మీరెఱుఁగకపోవుట ప్రసిద్ధమైనవిషయమేగదా? పరలోకమునందలి దేవతలు మహర్షులు మొదలగువారుగూడ నెఱుఁగఁజాలరు. ఏలయనఁగా, ఏవిధముచేతఁజూచినను నేనే యీ దేవతలకును మహర్షులకునుగూడ మొదటివాఁడనుగనున్నాను. అదెట్లనఁగా, ఈలోకముతోపాటు స్వర్గాదిసత్యలోకమువఱకుఁగల యూర్ధ్వలోకములన్నియుఁగూడ నశించునవియే యనియు, నేనుమాత్రము నశించువాఁడను గానని యు నీకిదివఱకే చెప్పియుంటినిగదా (చూ. 8, 16, 17, 18, 19, 20). కాన నాయూర్ధ్వలోకనివాసులగు దేవాదులుగూడ నాలోకములతోపాటు యుత్పత్తి స్థితి లయములు గలవారలయ్యేయున్నారు. ఇట్లు వార లుత్పత్తి లయములను బొందుచుండఁగా నేనుమాత్రమట్టి యుత్పత్తిని లయములు లేనివాఁడనై యుండుటంబట్టి వారలయుత్పత్తిని నే నెఱుంగుదును గాన నాయుత్పత్తిని వారలెఱుంగఁజాలరుగదా, కనుక, నేను వారలకందఱకును నాదిపురుషుఁడనని చెప్పుటకుఁ గారణమైనది.

శ్లో॥ యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

అర్థము:— మర్త్యేషు = మనుష్యులయందు, యః = ఎవఁడు, లోకమహేశ్వరమ్ = లోకమునకు నియామకుఁడనైన, మామ్ = నన్ను, అజమ్ = పుట్టువులేనివానిగను, అనాదిమ్+చ = ఆదిలేనివానిగను, వేత్తి = ఎఱుఁగుచున్నాఁడో, సః = వాఁడు, అసమ్మూఢః+(సన్) = మోహరహితుఁడై, సర్వపాపైః = సమస్తపాపములచేత, ప్రముచ్యతే = విడువఁబడుచున్నాఁడు.

కనుక నోయియర్జునా! ఈలోకమునందలి మనుష్యులలో నెవఁడైతే

“ చ. సరసగతి న్మునీంద్రులుఁ బ్రసన్న శరీర హృషీకమానస
స్ఫురణ గలప్పు డవ్విభుని భూ కళాకలిత స్వరూపముం
దరమిడిచూతురు ... ... ... ...” (భాగ. ౨ స్కం. ౧౧౧)

అనునట్లు, జ్ఞానముగలవాఁడై, ఇపుడు నేఁజెప్పినప్రకారము నన్ను పుట్టువులేనివానిగను, ఆద్యంత రహితునిగను తెలుఁగుటయగాక ఈ సమస్త ప్రపంచముల యొక్క యుత్పత్తి స్థితిలయములు నాసంకల్పమువలననే గలుగుచున్నవనియు నెఱుఁగుచున్నాఁడో, అట్టివాఁడే మోహ రహితుఁ డగుచున్నాఁడు. అనఁగా, నామాయను ధరించినవాఁడగుచున్నాఁడు. కాననట్లు నామాయను ధరించిన వాఁడెప్పు డగుచున్నాఁడో, అప్పుడే వాఁ డాగామిసంచిత ప్రారబ్ధములగు సమస్త పాపములనుండి విముక్తుఁ డగుచున్నాఁడు.

శ్లో॥ బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః।
సుఖం దుఃఖం భవో భావో భయం చాభయమేవ చ॥ 4

శ్లో॥ అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ 5

అర్థము:— భూతానామ్ = భూతములకు, బుద్ధిః = బుద్ధి, జ్ఞానమ్=జ్ఞానము, అసమ్మోహః = మోహరాహిత్యము, క్షమా = ఓర్పు, సత్యమ్=సత్యము, దమః= బాహ్యేంద్రియనిగ్రహము, శమః = అంతరింద్రియనిగ్రహము, సుఖమ్ = సుఖము, దుఃఖమ్ = దుఃఖము, భవః = పుట్టువు, అభావః = నాశము, భయమ్+చ = భయమును, అభయమ్+ఏవ+చ = భయములేకపోవుట, అహింసా = హింసచేయకపోవుటయు, సమతా=సమచిత్తత్వమును, తుష్టిః = సంతుష్టియు, తపః = తపస్సును, దానమ్ = దానమును, కీయశః = కీర్తియు, అయశః = అపకీర్తియు, భవాః = (ఈమొదలైన) గుణములు, పృథగ్విధాః = నానావిధములుగ, మత్తః+ఏవ = నావలననే, భవన్తి=కలుగుచున్నవి.

ఇంతేకాదుసుమా, నాదులీలావిభూతి విషయమునుగుఱించి యింతకంటె నెక్కుడుగఁదెలిసిన వారుగూడ నున్నారు.

అదెట్లనఁగా, ఈప్రపంచమునందలి సమస్తప్రాణులయందును ననేక విధములగు గుణము లుంచున్నవి. అవియెవ్వియనఁగా (బుద్ధిః) యుక్తాయుక్తపర్యాలోచన

చేయఁదగినశక్తియు, (జ్ఞానమ్) ఆత్మానాత్మవివేకమును, (అసమ్మోహః) భ్రాంతిరాహిత్యము, అనఁగా నొక వస్తువును జూచి మఱియొక వస్తువునుగా భ్రమింపకుండుటయు, (క్షమా) తన కొరులవలనఁ జేయఁబడిన యపకారమును సహించి వారలకుఁ బ్రత్యపకారమును జేయకుండుటయు, (సత్యమ్) అనృతమాడకుండుటయు, (దమః) బాహ్యేంద్రియనిగ్రహమును, (శమః) అంతరింద్రియనిగ్రహమును, (సుఖమ్) మనోదేహములకు నిష్టమగు స్థితియు. (దుఃఖమ్) మనోదేహములకు బాధకరమగు స్థితియు (భవః) పుట్టువు అనఁగా నుత్పత్తియు, (అభావః) నాశమును, (భయమ్) భీతియు, (అభయమ్) భీతిలేకుండుటయు, (అహింసా) ఇతర ప్రాణులకు బాధకరములగు పనులఁ జేయకుండుటయు, (సమతా) సమస్తప్రాణుల యందును సమానభావము గలిగియుండుటయు, (తుష్టిః) మనస్సంతుష్టియు, (తపః) తపస్సు. అనఁగా. శరీర కార్శ్యములగు కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతముల నాచరించుటయు, (దానమ్) తనకుఁగల విద్యాధనముల నితరుల కుచితముగ నిచ్చుటయు, (యశః) యశస్సు, అనఁగా సత్కార్యములచేఁ బొగడ్తకెక్కుటయు, (అయశః) అపయశస్సు, అనఁగా, దుష్కార్యములఁ జేయుటచే నిందింపఁబడుటయు ఈమొదలగు ననేక విధములగు గుణాగుణములు గలిగి యుంచున్నవిగదా ? వానిలోఁ గొన్ని సుగుణములు కొందఱి యందును. కొన్ని దుర్గుణములు కొందఱియందును, సుగుణ దుర్గుణములు మిశ్రమములుగఁ గొందఱియందును, నుండుటను జూచుచున్నాముగదా ! ఇట్లు వారివారి యందుండెడు నాయా గుణములు నావలననే గలుగుచున్నవి యనియు,

శ్లో॥ మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసాజాతా యేషాంలోక ఇమాఃప్రజాః ॥ 6

శ్లో॥ ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తితత్త్వతః ।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7

అర్థము :— లోకే=లోకమునందు, ఇమాః + ప్రజాః=ఈప్రజలు, యేషామ్ + జాతాః=ఎవరివలనబుట్టిరో (అట్టి), పూర్వే=పూర్వికులైన, సప్తమహర్షయః=సప్తమహర్షులను, చత్వారః=నలువురగు సనకాదులును, తథా=అలాగుననే, మనవః=స్వాయంభువాది మనువులును, మద్భావాః=మద్గతభావనులై, మానసాః=(నా) మనస్సువలనఁ బుట్టినవారుగా నున్నారు, మమ=నాయొక్క, ఏతామ్ + విభూతిమ్=ఈవిభూతిని, యోగమ్ + చ = యోగమును, తత్త్వతః=యథార్థముగా, యః + వేత్తి=ఎవఁడెఱుఁగుచున్నాఁడో, సః=వాఁడు, అవికంపేన=చలింపని,

యోగేన=యోగముచేత, యుజ్యతే=కూర్పఁబడుచున్నాఁడు, అత్ర=ఈవిషయమునందు, సంశయః=సందేహము, న=లేదు.

మఱియు, భృగ్వాదిసప్తమహర్షులును, బ్రహ్మమానసపుత్రులగు సనక — సనందన — సనత్సుజాత — సనత్కుమారులు నలువురును, స్వాయంభువు మొదలు గాఁగల పదునలువురు మనువులును, నాసంకల్పమువలననే పుట్టి సదా నన్నే ధ్యానించు చుండిరి. వీరివలననే యీలోకమునందలి తక్కిన ప్రజలందఱు నుత్పత్తియైరనియు, ఈప్రకారము, అనఁగా నిపుడు నేఁ జెప్పినప్రకారము నాదు లీలావిభూతియు యోగ మహిమయు నిట్టిదని నిశ్చయముగ నెవఁడెఱుఁగుచున్నాఁడో, అట్టివానిమనస్సు యోగమున నిశ్చలముగ నుండఁగలదు. దీనికి సంశయములేదు.

అర్జు — అయ్యా! ఈప్రపంచ నటనయంతయు నీదు లీలావిభూతియేయని సర్వసాధారణముగ నందఱు నెఱిఁగియే యున్నారుగదా? అట్లుగాన నీవిప్పుడు చెప్పినదానింబట్టి యోచింపఁగా నందఱి మనస్సును యోగమున నిశ్చలముగ నిలిచి యుండవలసి యున్నదిగదా?

కృ — ఓహో నీవట్లెంచుచున్నావు కాఁబోలును, అది కాదు నాయభిప్రాయము. ఈప్రపంచ నటన యంతయు నాదు లీలావిభూతియేయని యందఱు నెఱిఁగియుండు విషయమే గాని వేఱు కాదు. అయినను, ఆవిషయకమగు నిశ్చయజ్ఞానము సర్వత్ర అనఁగా సర్వకాల సర్వావస్థలయందును నందఱకు నుండనేరదు. అదెట్లనఁగా, ఇందునకు దృష్టాంతముగనొక కథఁ జెప్పుచున్నాను వినుము.

ఒకగ్రామమున నాత్మజ్ఞానియు నంతరంగభక్తుఁడునగు పరమభాగవతోత్తముఁ డొకఁడుండెను. అతఁడు సదా భగవంతునియందే దృష్టినిలిపి యాత్మావలోకనముఁ జేసికొనుచు నితరజనులతోఁగూడి చరింపకయుండెను. ఇట్లుండ నతని యోగ్యత నెఱుఁగని మూఢజనులు కొందఱతని చర్యలనుబట్టి యతనియెడల నసూయాపరులై యుండిరి. ఇట్లుండ నొకానొక సమయమున నేదియో యొక మిషకల్పించుకొని యామిషమీఁద నందఱునొకటిగాఁగూడి యతని నూరినుండి వెడలఁగొట్టిరి. అప్పు డతఁడు నిరపరాధియగు తనయందు నిర్నిమిత్తముగ నాజనులందఱు ద్వేషించి యూరు వెడలఁగొట్టుట కేవలము భగవత్ప్రేరణ వలనఁ గలిగినదేగాని తన దోషమువలనఁ గాని వారి దోషము వలనఁగాని జరిగినది కాదనియు, ఇట్లు వారలకుఁ దన యెడల దురభిప్రాయము గలుగుటఁ జూడఁగా, భగవంతుఁడు దనకేదియో మేలునే చేయఁదలచి యట్టి బుద్ధి వారికిఁ బుట్టించె ననియు, నిశ్చయించుకొన్నవాఁడై సంతోషముగనే యా యూరు విడిచి యడవికి వెళ్ళిపోయెను. అట్లు పోవునపుడు తనకుఁ గాలమును

మేలుకొల్పుటకుఁగా నొక కోడిపుంజును, ప్రొద్దు పుచ్చుకొనుటకుఁగా భగవద్విషయకమగు నొక గ్రంథమును, రాత్రి కాలమునం దా గ్రంథమును జదువుకొనుటకుగా నొక లాంతరునుగూడఁ దీసికొనిపోయెను. అట్లు తీసికొనిపోయి యా గ్రామ సమీపమునందుండెడు నొక యడవిని జేరి యచట నొక పొదరింట నేల శుభ్రపఱచుకొని యా సమీపమునఁ గోడిపుంజును గట్టివేసి చీకటిపడినంతట నా లాంతరులో దీపము వెలిగించి యా వెలుతురున నా గ్రంథము నవలోకించుకొనుచుండెను. ఇట్లుండఁ గొంతసేపటికి నొక నక్క వచ్చి యా కోడిపుంజును బట్టి చంపి యీడ్చుకొనిపోయెను. అప్పుడతం డది చూచి, అహో, ఇదియేమి చిత్రము నాకు జనుల సహాయము లేకపోయినను, ఈ కోడిపుంజైనను సహాయముగా నుండునని తలంచినందుకు దీనింగూడ లేకుండునట్లు భగవంతుఁడు సంకల్పించినట్లున్నది. ఆ భగవంతుఁ డిదియును నెదియో యొక మేలు కొఱకే చేసియుండవచ్చునని యెంచి మరల గ్రంథావలోకనముఁ జేసికొనుచుండెను. ఇట్లుండ మఱి కొంతసేపటికి నకస్మాత్తుగ నొక పెద్దసుడిగాలి గొట్టి లాంతరులోని దీపమారిపోయెను. అప్పుడతఁ డీదీపపు సహాయముగూడ నాకుండుట భగవంతున కిష్టము లేదు కాఁబోలును, ఇదియు నాయనయొక్క లీలావిభూతియేగాని వేఱుగాదు, నేనెప్పుడును భగవంతునే నమ్మి యాయననే పరమప్రాప్యముగ నెంచి తదిరములగు వేనిని లక్ష్యము సేయకయుండిన నాయెడల నా భగవంతుఁ డిట్లు జరిగించుట నాకొక కీడు చేయుటకని యెంచఁగూడదు. దీనివలన నేదియో యొక మేలు చేయఁగోరియే యిట్లు చేసి యుండవచ్చునని నిశ్చయించుకొన్నవాఁడై నిదురవోయెను. తర్వాతఁ గొంతసేపటికిఁ దెల్లవారఁగా నిదురమేల్కొని లేచిచూడఁగాఁ దాను బరుండిన పొదకు సమీపమున నుండు నొక బాటలో నా రాత్రి పరుండిన కొందఱు బాటసారులు చంపబడి వారి సొత్తులు దోఁచఁబడి యుండుటయును, అచటికిఁ గొంత దూరమున నుండిన తన గ్రామముఁ బేయుఁ దగులబడిపోయి యందనేక జనులును సొత్తులును నశించిపోయి యుండుటను గూడఁ జూచినవాఁడై తనలోఁ దానిట్లు తలపోసికొనెను, ఆహా! ఏమి యీ భగవంతుని చిత్రము, ఈ గ్రామమున కిట్టి విపత్తు గలుగనైయుండుట వలననే కాఁబోలు నన్నిట్టి విపత్తునుండి తొలఁగించుటకుఁగా వారలకు నాయెడల నిర్హేతుకముగ నిట్టి ద్వేషబుద్ధి పుట్టించి నన్నీ గ్రామమునుండి వెడలఁగొట్టించెను. నే నీ యడవిలో నుండఁగా నచట బాటసారులను దోఁచిన చోరులకు నేనుండు చోటు తెలియకుండుటకును, వారిచే నేలాటి బాధయు నాకుఁ గలుగకుండుటకును, నాయొద్ద నుండిన కోడిపుంజును దీపమును లేకుండునట్లు చేసెను; కనుక భగవంతుఁడు తన్ను నమ్మినవారి కెప్పుడును గీడు చేయఁడనియును, ఒకవేళ నేదైనఁ గీడు సంభవించినను, అది యేదియో యొక మేలు కొఱకైయే భగవంతుఁడు చేసి యుండుననియు నాకిది

పఱుకుఁగలిగి యుండిన నమ్మిక మిప్పుడుస్థిరపడినది గదా యనియెంచి తనలోఁదానా నందించినవాఁడాయెను. కనుక నోయి యర్జునా! ఇపుడు నేజెప్పిన విషయములలో నల్పజ్ఞానియగు వాఁడిట్లు తలఁచఁగలఁడా? ఇట్టిబాధలకోర్చి భగవంతుని గాని, తనకుఁ బ్రత్యక్షముగ నపకారము చేసిన జనులనుగాని దూషింపక యింతనిబ్బరముగ నుండఁ గలఁడా?

అర్జు — అల్పజ్ఞానియగు వాడిట్లు తలఁచి యింత నిబ్బరముగ నుండఁజాలడు.

శ్లో॥ అహం సర్వస్యప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే।
ఇతిమత్వాభజన్తే మాం బుధా భావసమన్వితాః॥　　　　8

అర్థము:— అహమ్=నేను, సర్వస్య = సమస్తప్రపంచమునకు, ప్రభవః= ఉత్పత్తి కారణము, సర్వమ్=సమస్తప్రపంచము, మత్తః=నావలననే, ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది, ఇతి=అని, మత్వా=తలఁచి, బుధాః=జ్ఞానులు, భావసమన్వితాః+(సన్తః) = నాయందలిభక్తిభావముతోఁ గూడినవారై, మామ్+భజన్తే=నన్ను భజింపుచున్నారు.

కృ — కనుక నోయియర్జునా! ఇపుడు నేఁజెప్పినయోగివంటి జ్ఞానులుగానుండెడుఁ వారలీప్రపంచమంతటికిని యుత్పత్తి స్థానము నేనే యనియును, ఈప్రపంచ నటన యంతయు నావలననే జరుగుచున్నదనియునెంచి నాయెడల భక్తిభావము గలవారై.

"ఉ. విశ్వభవస్థితిప్రళయ వేళలయందు వికారసత్వము
స్వాశ్వము నీవయైనిఖిల విశ్వము లోలి సృజింతు విందిరా
ధీశ్వర యీశకేశవ త్రయీ మయ దివ్యశరీర దేవనీ
శాశ్వత లీల లిట్టివని సన్నుతిసేయఁగ మాకు శక్యమే॥"
(భాగ. 3 స్కం. ४3౬)

అని కొనియాడుచు సదా నన్ను భజింపుచుందురు.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తిచ॥　　　　9

అర్థము:— (తే)=అట్టినాభక్తులు, మచ్చిత్తాః = నాయందుంచఁబడినచిత్తము గలవారును, మద్గతప్రాణాః=నన్నుబొందినప్రాణములుగలవారును, నిత్యం=యెల్లప్పుడును, మామ్=నన్ను (నాచరిత్రమును), పరస్పరమ్=ఒకరికొకరు, బోధయన్తః=

బోధించు వారును, కథయన్తః+చ=చెప్పుకొనుచుండువారునై, తుష్యన్తి+చ= తృప్తులగుదురు, రమన్తి+చ=ఆనందింపుదురు.

మఱియునట్టి నాభక్తులు లేమి చేయుచుందురనఁగా, సదా నాయందే చిత్తము గలవారును, పంచ ప్రాణములు నాయందేయుంచిన వారునై సదా నన్నే ధ్యానింపుచు నా గుణానుభవము సేయుచుండుటయే గాక, అంతటితోఁ దృప్తినొందక నాచరిత్రంబులను, అనఁగా, నేనొనరించియుండెడు ననేకములగు నద్భుత కార్యంబుల నొకరితో నొకరు పలువిధములుగఁ జెప్పికొనుచు కొనియాడుకొనుచు నానందింపుచుందురు. అట్టివార లొకరితోనొకరు నా విషయములను గుఱించి చేసికొనెడు సంభాషణ మెట్లుండు ననఁగా,

"క. ఇతరకథావర్ణనముల
నతిహేయత నొందెఁ జిత్తమనఘాత్మరమా
పతిచరితామృతరతిసం
స్మృతివేదన లెల్లఁ బాయజేయుమునీంద్రా!

మ. అవివేకానుగతస్వకార్యజలవేలాకీర్ణమై మిత్రబం
ధువధూపుత్రజలగ్రహోగ్రయుతమై దుర్దాంతసంసారదు
ర్భవపాథోధిఁ దరించువారెహరిసంబంధ క్రియాలోలభా
గవతానుగ్రహనావలేని యధముల్గారుణ్య సంధాయకా!

క. సరసిరుహోదరుమంగళ
చరితామృత మాత్మఁగ్రోలు జనుఁడితరకథా
గరళముఁగ్రోలునె హరిసం
స్మరణము జీవులకు నఖిలసౌఖ్యదమనఘా!

క. శ్రీవనితాధిపనామక
థావిముఖుల కిహముఁబరము దప్పి వ్యధపలు
బోవుదురు నరకమునకు
న్వావిరి నేవారిఁ జూచి వగతు మునీంద్రా!

క. ఏనరుఁడే నొకనిమిషం
బైనన్వృథావాదగతిని హరిపదకమల
ధ్యానానందుఁడుగాఁడే
నానరునకు నాయువల్పమగు మునినాథా."

(భాగ. ౩ స్కం. ౧౫౬, ౧౫౭, ౧౫౧, ౧౫౩)

అనే మొదలైన విషయములతోఁ గూడియుండును.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగంతం యేన మా ముపయాన్తి తే॥ 10

అర్థము :— తే=వారలు (అట్టినాభక్తులు), యేన=దేనిచేత, మామ్=నన్ను, ఉపయాన్తి=పొందుచున్నారో (పొందఁగలరో), తమ్+బుద్ధియోగమ్=అట్టిజ్ఞాన యోగమును, సతతయుక్తానామ్ = నిత్యయుక్తులైనట్టియు, ప్రీతిపూర్వకమ్=ప్రీతి పూర్వకముగా, భజతామ్=నన్ను భజించునట్టియు, తేషామ్=వారలకు, దదామి= ఇచ్చుచున్నాను.

అయితే, నాకంతరంగభక్తులగునట్టివారిలోసయితమనేకులు నానిజస్వరూప మిట్టిదని యెఱుఁగజాలక యనేకవిధములగు సంశయములుగలిగి మిగుల డోలాయ మాన మనస్కులై యుందురు. అదెట్లనఁగా,

"క. అగుణునకు నిర్వికారికి
జగదవనోద్భవవినాశ సత్కర్మములుం
దగులీలలెట్టు లాతఁడు
సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ!

గీ. హరియు నెపుడు నివృత్తుఁడత్యంతతృప్తుఁ
డగుట వర్తించు టెట్లు క్రీడాములందు
మఱియుఁ ద్రిగుణాత్మకంబైన మాయఁగూడి
యఖిల జగములఁ గల్పించెననుట యెట్లు?

సీ. అమ్మాయచేత నీయఖిలంబుసృజియించి పాలించిపొలియించిపరమపురుషుఁ
డనఘాత్మ దేశకాలావస్థలందును నితరులయందు నహీనమైన
జ్ఞానస్వభావంబుఁ బూని యాప్రకృతితో నెబ్భంగిఁగలసెఁదానేకమయ్యుఁ
గోరి సమస్తశరీరంబులందును జీవరూపమున వసించియున్న
జీవునకుదుర్భగక్లేశసిద్ధి యెట్టి
కర్మమునసంభవించెను గడఁగినాకు
చిత్తమజ్ఞానదుర్గమస్థితిఁ గలంగి
యధికఖేదంబునొందెడు ననఘచరిత!" (భాగ. 3 స్కం. ౨౩౧, ౨౩౩)

అని యీప్రకారముగా ననేకవిధములగు సంశయములు గలవారలై యుందురు. అయితే "సంశయాత్మా వినశ్యతి" సంశయము గలవాఁడు నశించును, అని యిది

వఱకే చెప్పియుంటివిగదా ? కనుక నట్లు సంశయాత్ములుగా నుండు నంతవఱకు నన్నుఁ బొందుటకు, అనఁగా మోక్షమును బొందుట కర్హులుకారు గనుకను, నాయెడలఁ బ్రీతిగలిగి సదా నాయందే చిత్తమునుజేర్చి నన్నే భజింపుచుండెడి వారలట్లు సంశయాత్ములై నశించుట నాకిష్టములేదు గనుకను, దేనిచేతనైతే వారలు సంశయరహితులై నానిజస్వరూపము నెఱింగి నన్నుఁబొందఁగలరో, అట్టియఖండజ్ఞానమును నేనే వారలకుఁ గలుగఁజేయుచున్నాను.

శ్లో॥ తేషా మేవానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11

అర్థము :— అహమ్=నేను, అనుకమ్పార్థమ్=కనికరముకొఱకు (కనికరించినవాఁడనై), తేషామ్+ఏవ=వారలకుమాత్రమే, అజ్ఞానజమ్=అజ్ఞానమువలనఁగలిగిన, తమః=అంధకారమును, ఆత్మభావస్థః=(వారల) అంతఃకరణమునందున్నవాఁడనై, భాస్వతా=ప్రకాశింపుచున్న, జ్ఞానదీపేన=జ్ఞానమనెడుదీపముచేత, నాశయామి=నశింపఁజేయుచున్నాను.

అదెట్లు చేయుదు వనఁగా, వారలమనస్సున నేనుండి జ్ఞానమును ప్రకాశింపఁజేసి యదివఱకు నజ్ఞానముచే వారల బుద్ధికి స్ఫురింపకుండునట్టి నా సంబంధములగు విషయములన్నియుఁ జక్కఁగా స్ఫురించునట్లుచేసి యందువలన వారల సంశయములన్నియుఁదొలఁగఁజేసి యందువలన వారలు నానిజస్వరూపము నెఱిఁగి నన్నుఁబొందఁదగినవారలనుగాఁజేయుదును. అయితే, ఇట్లు సాధకులుగా నుండెడువారి విషయములో మాత్రమే చేయుదునుగాని తదితరులవిషయములో చేయను.

అర్జు — అయ్యా ! ఇట్లుచెప్పితివిగదా, “ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ” నేను సర్వసముఁడను నాకెవరును ద్వేషింపఁదగినవారుగాని ప్రేమింపఁదగినవారుగాని లేరనియింతకుముందు చెప్పియుంటివే (చూ. 9–29). దానికిది ప్రత్యక్షవిరుద్ధముగనున్నట్లగపడుచున్నదే కారణమేమి ?

కృ — ఓయియర్జునా ! నేనట్లుచెప్పినది వాస్తవమే, అయితే అదెంబడిగనే మఱియొక సంగతినిగూడఁ జెప్పియున్నాను దాని నీవు మరచినావు కాఁబోలును. అదేమనఁగా, “ యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ” ఎవరైతే నన్ను భక్తితో భజింపుదురో వారలు నాయందును, నేనువారలయందును ఉన్నవారమగుదుము అనియునుగూడఁ జెప్పియుండలేదా ? (చూ. 9–29). ఇదియునుంగాక, ఎవరైతే అనన్యగతికులై సదా నన్నే స్మరింపుచు భజింపుచుందురో అట్టినాభక్తుల

యోగక్షేమమును నేనే వహించుచున్నానని నీకు నుగూర్చి చెప్పియుంటినిగదా. జ్ఞాపకమున్నదా? (చూ. 9-22).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక నట్లనన్యగతికులై నాయందు భక్తిచేసెడు వారలు సంశయాత్మకులై చెడిపోవునట్లుండు నెడల వారలయెడల నాకుం గనికరము గలుగుట సహజమేగదా! కాన నట్టివారలయెడల నేను కనికరము గలవాఁడనై వారలను నుద్ధరింపఁ జేయుటకుగా వారి కిట్టి సహాయమును సేయుట నాకు నావశ్యకమైనపనిగా నున్నదని యెఱుంగుము. అది యెట్లనఁగా నీమనస్సునకు జక్కఁగ నర్థమగునట్లు దగిన దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము:

ఓయర్జునా! ఒక యుపాధ్యాయుని యొద్దఁగొందఱు విద్యార్థులు చదువుకొనుచున్నారు. ఆయుపాధ్యాయుఁడా విద్యార్థులందఱియెడలను సమభావము గలవాఁడై వారికందఱికిని సమముగనే పాఠములఁ జెప్పుచున్నాఁడు. అయినను, అందొకఁడు మాత్రము చక్కని బుద్ధికుశలతగలవాఁడగుటచే నాయుపాధ్యాయుఁడు చెప్పెడు విషయములన్నిటిని చక్కఁగా గ్రహించి పరీక్షకాలమునఁ దానివ్వఁబోయెడు ప్రశ్నలకన్నిటికిని సదుత్తరములు వ్రాసి యాపరీక్షలోఁ దేఱుటకుశక్తిగల వాఁడగుచున్నాఁడు. మఱియొకఁ డట్టి సామర్థ్యములేనివాఁడైనను దన యుపాధ్యాయునియెడల మిగులభక్తిశ్రద్ధలుగలవాఁడై యాయన యాజ్ఞల నెఱవేర్చుచు నాయనయొక్క కృపకుఁ బాత్రుఁడగుచున్నాఁడు. అయితే, వానిబుద్ధి మొదటి వాని బుద్ధివలె నంతసూక్ష్మమైనది కాకపోవుటచే నాతనివలె నతఁడు పరీక్షలోఁ దేఱఁజాలఁడని యాయుపాధ్యాయుఁ డెఱుంగుచున్నాఁడు. అప్పుడా యుపాధ్యాయుఁడు వానియెడలఁ గనికరించి, 'అయ్యో! వీఁడు నాకత్యంతప్రియశిష్యుఁడై యుండియుఁ బరీక్షలోఁ దేఱఁజాలకున్నాఁడే' యని చింతించి వానిఁగూడ నెట్లైన నాపరీక్షలోఁ దేఱునట్లు చేయవలయునని యెంచినవాఁడై పరీక్షకాలమందుఁ దానివ్వఁబోయెడు ప్రశ్నలను, ఆప్రశ్నలకు వ్రాయవలసినసదుత్తరములను ముందుగా నాయుపాధ్యాయుఁడా విద్యార్థికిమాత్రము రహస్యముగఁ జెప్పుచున్నాఁడు, అనియెంచికొనుము. అట్టిప్రియశిష్యున కాయుపాధ్యాయుఁడిట్టి సహాయమును జేయఁబూనుకొనుట సహజమైన విషయమని యెంచెదవా లేక, అసహజమైన విషయమని యెంచెదవా!

అర్జు — సహజమైన విషయమనియే చెప్పఁదగియున్నది. ఏలయనఁగా నట్టిభక్తి శ్రద్ధలతో నంతకాలమువఱకుఁ దన్నాశ్రయించి శుశ్రూషఁజేయుచుండిన ప్రియశిష్యుఁ

వాఁడు దక్కినవారితోఁబాటు పరీక్షలోఁ గృతార్థుఁడు గాక వ్యర్థుఁడగుట యాయుపాధ్యాయునకు మిగుల దుఃఖకరమైన సంగతిగదా ?

కృ — మంచిది, అట్లాయుపాధ్యాయుఁడా విద్యార్థికిమాత్రమట్టి సహాయము రహస్యముగఁ జేయుటవలన నతనికిఁ దక్కిన విద్యార్థులయెడల ద్వేషబుద్ధిగలదని యెంచవచ్చునా ?

అర్జు — అట్లెంచఁగూడదు. ఏలయనఁగా, వారలట్లు తన్నాశ్రయించక పోవుట చేత వారలకట్టిసహాయము చేయక పోయెనేగాని ద్వేషబుద్ధి చేతఁగాదు.

కృ — అవునుగదా! అట్లే నాకంతరంగ భక్తులుగానుండెడు వారిలోఁగూడ నఖండజ్ఞానముగల కొందఱు మాత్రమే జననమరణరాహిత్యమగు మోక్షమున కర్హులై యుందురు. తక్కినవార లట్టి యఖండజ్ఞానము లేమిచే సంశయాత్మకులై మోక్షమున కనర్హులగుదురు గాన వారలత్యంత భక్తిశ్రద్ధలతో నన్నాశ్రయించియు వ్యర్థులగుచున్నారేయని కనికరించి వారలకుమాత్రము నేనట్టి సహాయమును జేయుచున్నాను. అనఁగా, వారలహృదయముల యందు నేనుండి వారల యజ్ఞానమును దొలఁగించి యఖండ జ్ఞానసంపన్నులఁ జేయుదును.

అర్జున ఉవాచ :

శ్లో॥ పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥ 12

శ్లో॥ అహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥ 13

అర్థము:— భవాన్ = నీవు, పరమ్ + బ్రహ్మ = పరబ్రహ్మవనియు, పరమ్ + ధామ = పరంధాముఁడవనియు, పరమమ్ + పవిత్రమ్ = పరమపావనుఁడనియును, శాశ్వతమ్ + దివ్యమ్ + పురుషమ్ = శాశ్వతుఁడవగు దివ్యపురుషుండవనియు, ఆది దేవమ్ = దేవతలలో మొదటివాఁడవనియు, అజమ్ = పుట్టువులేనివాఁడవనియు, విభుమ్ = (సమస్తమునకు) ప్రభుఁడవనియు, త్వామ్ = నిన్ను, దేవర్షిః + నారదః = దేవర్షియగు నారదుఁడు, అసితః = అసితుఁడు, దేవలః = దేవలుఁడు, వ్యాసః = వ్యాసుఁడు (మొదలగు), సర్వే + ఋషయః = సమస్తఋషులును, ఆహుః = చెప్పుచున్నారు. తథా + ఏవ = ఆప్రకారముగానే, స్వయమ్ + చ = స్వయముగా (నీవును), మే = నాకు, బ్రవీషి = చెప్పుచున్నావు.

శ్లో॥ స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ! ।
భూతభావన భూతేశ! దేవదేవ జగత్పతే! 15

అర్థము:— భూతభావన = సమస్తప్రాణులను సృజించినవాఁడవును, భూతేశ! = సమస్తప్రాణులను పరిపాలించి రక్షించువాఁడవును, దేవదేవ = దేవతలకు దేవుఁడవైనవాఁడవును, జగత్పతే = జగన్నాథుఁడవునైన, హే పురుషోత్తమ! = ఓ పురుషోత్తముఁడా! ఆత్మానమ్ = నిన్ను, ఆత్మనా = నీచేత, స్వయమ్ = స్వయముగా, త్వమ్ + ఏవ = నీవే, వేత్థ = ఎఱుగుదువు.

ఓ పురుషోత్తమా! నీ వెట్టివాఁడవనఁగా, ఆకాశమున వాయువెట్లడఁగియున్నదో, అట్లే పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తభూతములును నీయందే యడఁగియున్నవి. వానిని నీసంకల్పమాత్రముచేత సృజింతువు, పోషింతువు, లయింపఁజేయుచుందువు. అట్లుండియు నాభూతములకు విలక్షణుఁడవై యున్నావు (చూ. 10-4, 5, 6, 7, 8). మఱియు నీవు దేవదేవుఁడవు. అనఁగా, దేవతలకు నాదిదేవుఁడవుగను. జగత్తుకంతటికిని ప్రభువుగను నుండువాఁడవు. అంతే కాక నీవు దేవతలకును మహర్షులకును నాదిపురుషుఁడవనయము. కనుక నీయుత్పత్తిని నట్టిదేవతలు మహర్షులునైన తెలిసికొనఁజాలరనియు నీవే చెప్పియున్నావుగదా! (చూ. 10-2). కాఁబట్టి, ఇట్టి నీయొక్క ప్రభావము నీవే యెఱుంగుదువుగాని నీకంటె నన్యులెఱుఁగలు కెట్లు సాధ్యపడఁగలదు!

శ్లో॥ వక్తు మర్హ స్య శేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

అర్థము:— త్వమ్ = నీవు, యాభిః + విభూతిభిః = ఏమహిమలచేత, ఇమాన్ + లోకాన్ = ఈలోకములను, వ్యాప్యతిష్ఠసి = వ్యాపించియున్నావో, ఆత్మవిభూతయః = అట్టి నీమహిమలు, దివ్యాః + హి = దివ్యములైనవిగదా, (తస్మాత్) = కాఁబట్టి, (తాః) = వానిని (ఆమహిమలను), అశేషేణ = నిశ్శేషముగా, వక్తుమ్ = చెప్పుటకు. (త్వమేవ) = నీవే. అర్హసి = తగుదువు.

స్వామీ! సమస్తలోకముల యందుఁగల చరాచరములన్నిటిలో నీవు వ్యాపించియున్నావు గదా? అట్టి నీవు దేనిదేనియందే యేరూపముతో వ్యాపించి యేలాటి మహిమలఁ జూపుచున్నావో, అట్టిమహిమలన్నియు నత్యద్భుతములైనవియు, అగమ్యగోచరములైనవియుగ నుంచున్నవిగదా! అట్టి నీమహిమలను చతుర్ముఖబ్రహ్మ సయితము జగత్సృష్టి కాలమందుఁ దెలిసికొనఁజాలక నిన్నుగూర్చి తపంబు సేసి

నట్లును, ఆతపంబునకు మెచ్చి నీవు సాక్షాత్కరించి వలయువరంబుల వేఁడుమని యానతిచ్చినట్లును, అప్పుడా బ్రహ్మ.

"దేవా! సర్వభూతాంతర్యామివైన నీకు నమస్కరించి మదీయ వాంఛితంబు విన్నవించెద నవధరింపుము. అవ్యక్త రూపంబులై తెలుపఁగు భవదీయస్థూల సూక్ష్మ రూపంబులు నానాశక్త్యుప బృంహితంబులైన బ్రహ్మాదిరూపంబులు నీయంత నీవే ధరియించి జగదుత్పత్తి స్థితి లయంబులం దంతు కీటకంబునుంబోలెఁ గావించుచు నమోఘ సంకల్పుండవై లీలా విభూతిం బ్రకటించుమహిమంబుఁ దెలియునట్టి పరిజ్ఞానంబుఁ గృపసేయుము." (భాగ. ౨ స్కం.)

అని వేడినట్లును నిదివఱకుఁ బెద్దలవలన వినియున్నాను. అందు కనుగుణ్యముగ నీవును. ఇంతకు ముందు నీమహిమలను దేవతలును మహర్షులును గూడ నెఱుఁగఁజాలరని చెప్పియుంటివిగదా ! (చూ. 10-2). కనుక నిట్టి నీ మహిమలను సవిస్తరముగఁ దెలుపఁజేయుటకు నీవే తగుదువుగాని యన్యుల కెట్లు సాధ్యపడఁగలదు !

శ్లో॥ కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్ ।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవ! న్మయా ॥ 17

అర్థము :— హేభగవన్ = ఓభగవంతుఁడా!, (త్వమ్)=నీవు, మయా=నాచేత, కేషు + కేషు + చ + భావేషు = ఏయేవిభూతులయందు (ఏయేరూపములు గలవాఁడవుగా). చిన్త్యః + అసి = చింతింపఁదగినవాఁడవగుచున్నావు, హేయోగిన్ = ఓయోగీశ్వరా, అహమ్=నేను, త్వామ్=నిన్ను, కథమ్=(ఎట్లు) ఏయేరూపములు గలవానినిగా, సదా + పరిచిన్తయన్ = సదాధ్యానము చేయుచు, విద్యామ్=తెలిసికొనఁగలను !

ఓస్వామీ! నేనిట్లడుగుటకుఁ గారణమేమనఁగా, నీయొక్క లీలా విభూతుల నంతములుగా నుంచున్నవిగదా ? ఇట్టి నీలీలా విభూతులను దేవతలును మహర్షులును గూడ నెఱుఁగఁజాలరని నీవే చెప్పియున్నావుగదా, ఇట్టివిషయములో కించిద్జ్ఞుఁడనగు నేనెట్లెఱుఁగఁగలను ? అయినను, నీయందే మనసు నిలిపి భక్తిచేసి నిన్నుఁ బూజింపుచు నీకు నమస్కారములు సేయుచు సదా నిన్నే ధ్యానింపుచుండిన యెడల నిన్నుఁ బొందఁగలనని చెప్పియుంటివిగదా ! (చూ. 9. 34). అట్లు చేయుటలో, అనంతరూపివగు నిన్ను నీయన్ని రూపములతోడను ధ్యానించుటకు సాధ్యపడదుగదా ? కనుక నట్టి రూపములలో ముఖ్యములగు కొన్నిటిని మాత్రము, అనఁగా, నేయేరూపములతో నిన్ను ధ్యానింపఁదగి యుంచున్నదో, ఏయేరూపము

లతో సదా ధ్యానించినయెడల నేనునిన్నుఁ జేరఁగలనో అట్టి నీరూపములను దెలిసి కొనఁదలచినవాఁడనై యున్నాను.

శ్లో॥ విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన !
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥ 18

అర్థము:— హే జనార్దన ! = ఓ కృష్ణమూర్తీ!, ఆత్మనః = నీయొక్క, యోగమ్ = సర్వజ్ఞత్వాదివిశేషమును, విభూతిమ్ + చ = లీలావిభూతియును, విస్తరేణ = సవిస్తారముగా, భూయః + కథయ = మరలఁజెప్పుము. హి = ఏలయనఁగా, అమృతమ్ = నీవాక్యామృతమును, శృణ్వతః + మే = వినుచున్న నాకు, తృప్తిః + న + అస్తి = తనివి లేకున్నది.

ఓ జనార్దనా ! ఇట్టి యనంతములగు నీలీలా విభూతులను సర్వజ్ఞత్వాదివిశేషములను గుఱించి నీవిదివఱకే అనేక పర్యాయములు చెప్పియున్నావు. అయినను,

“ తే. భూరివిజ్ఞాన నిధులగు నారదాది
నిర్మలాత్ములకైన వర్ణింపరాని
హరికథామృతపానంబునందు విసివి
యొల్లననువాఁడె పో వెఱ్ఱిగొల్లఁడనఘ !” (భాగ. 3 స్కం. ౧౯-౨౫)

అనునట్లు, ఈలోకమున నెంతవెఱ్ఱివాఁడైనను నారదాది మహాత్ములకునైతము వర్ణింపనలవిగాని నీయద్భుతమహిమలను గుఱించిన సత్కథామృతమును “ శ్రుతిపుటాంజలిచేత నెంత ద్రాగినను” విసుగుఁజెందక యింకను వినవలయుననియే కోరుచుండునుగాని తృప్తినొందఁగలఁడా ! అట్లే, నాకును నీవాక్యామృతము నెంతగ్రోలినను తనివి దీరకున్నది. కాన నో జనార్దనా ! నాయందు దయచేసి నీయద్భుత లీలావిభూతులను మరల సవిస్తరముగ సెలవిమ్ము.

శ్రీ భగవానువాచ:

శ్లో॥ హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ ! నాస్త్యన్తో విస్తరస్య మే ॥ 19

అర్థము:— హే కురుశ్రేష్ఠ ! = ఓయర్జునా !, మే = నాయొక్క, విస్తరస్య = లీలావిభూతివిస్తారమునకు, అన్తః = అంతము, న + అస్తి + హి = లేదుగదా ! హన్త = (అయినను) ఇప్పుడు, తే = నీకు, దివ్యాః = దివ్యములైనట్టియు, ప్రాధాన్యః = ముఖ్యములైనట్టియు, ఆత్మవిభూతయః = నాలీలావిభూతులను, కథయిష్యామి = చెప్పుచున్నాను.

కృష్ణ:— ఓయి యర్జునా! ఈ ప్రపంచంబునందుగల సమస్త చరాచరంబులును నా లీలావిభూతిలోఁ జేరినవిగనే యున్నవి. వానికి నాద్యంతములు లేవు. కనుక నవి యన్నియు సవిస్తరముగా నీకుఁ జెప్పుటకు సాధ్యపడదు. అయినను, నీవిట్లు ప్రార్థించుటచేత నిట్టి నాలీలా విభూతిలో శ్రేష్ఠములైనవియు ముఖ్యములైనవియు నగు కొన్నిటిని మాత్రము చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః।
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మన్త ఏవచ॥ 20

అర్థము:— హేగుడాకేశ! = ఓయియర్జునా!, సర్వభూతాశయస్థితః = సకలభూతములయందు నంతర్యామిగానుండునట్టి, ఆత్మా = జీవాత్మ, అహమ్ = నేను, భూతానామ్ = భూతములయొక్క, ఆదిః + చ = ఆదియును (సృష్టియును), మధ్యమ్ + చ = మధ్యమును (స్థితియును), అన్తః + చ = అంతమును (లయమును) అహమ్ + ఏవ = నేనే (నావలననే) కలుగుచున్నది.

ఓయర్జునా! ఈలోకమున సమస్తభూతములయందును జీవాత్మరూపముతో నంతర్యామిగా నుండెడువాఁడను నేనే యనియు, సమస్తభూతములయొక్క యుత్పత్తిస్థితిలయములకుఁ గారణభూతుఁడను నేనే యనియు, అనఁగా, నావలననే యీ ప్రపంచమునందలి సమస్తభూతములు సృజింపఁబడుచు, రక్షింపఁబడుచు, నాశము చేయఁబడుచున్నవనియు నెఱుఁగుము.

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ॥ 21

అర్థము:— ఆదిత్యానామ్ = ద్వాదశాదిత్యులలో, విష్ణుః = విష్ణువనువాఁడను, జ్యోతిషామ్ = ప్రకాశింపఁజేయువానిలో, అంశుమాన్ = కిరణములుగల, రవిః = సూర్యుఁడను, అహమ్ + (ఏవ) = నేనే. మరుతామ్ = సప్తమరుత్తులలో. మరీచిః = మరీచియనువాఁడను, నక్షత్రాణామ్ = నక్షత్రములలో, శశీ = చంద్రుఁడను, అహమ్ + (ఏవ) + అస్మి = నేనేఅయ్యున్నాను.

ఓయియర్జునా! ద్వాదశాదిత్యులగు, ఇంద్రుఁడు-ధాత - పర్జన్యుఁడు-త్వష్ట-పూషుఁడు-అర్యముఁడు - భగుఁడు - వివస్వంతుఁడు - విష్ణువు - అంశుమంతుఁడు-వరుణుఁడు - మిత్రుఁడు అను వారలలో ముఖ్యుఁడగు విష్ణువు నేను. ఈజగత్తునందుఁ బ్రకాశమును గలుగఁజేయు వానిలో కిరణములుగల సూర్యుఁడు మొదటివాఁడు

గనుక నట్టిసూర్యుఁడను నేనే. సప్తమరుత్తులను ఆవహుఁడు - ప్రవహుఁడు - నివహుఁడు - పరావహుఁడు - ఉద్వహుఁడు - సంవహుఁడు - మరీచి అను వారిలలో మరీచి యనువాఁడు ముఖ్యుఁడుగాన నట్టి మరీచి నేనే. రాత్రికాలములయందుఁ ప్రకాశము నిచ్చుచుండెడు నక్షత్రములన్నిటిలో చంద్రుఁడు మొదటివాఁడుగా నున్నాఁడు గనుక నట్టిచంద్రుఁడను నేనె యయ్యున్నాను.

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥ 22

అర్థము :— వేదానామ్=వేదములలో, సామవేదః=సామవేదము, అస్మి=అగుచున్నాను, దేవానామ్=దేవతలలో, వాసవః=ఇంద్రుఁడు, అస్మి=(నేనే) అగుచున్నాను, ఇన్ద్రియాణామ్=ఇన్ద్రియములలో, మనః+చ=మనస్సును, అస్మి=(నేనే) అగుచున్నాను, భూతానామ్=భూతములలో, చేతనా=చైతన్యము, అస్మి=(నేనే) అగుచున్నాను.

ఋగ్యజుస్సామాథర్వణము లనెడు నాలుగు వేదములయందును సామమను వేదము నేనె అయ్యున్నాను. దేవతలకుఁ బ్రభువుగా నుండెడు నింద్రుఁడను నేనే. జ్ఞానేంద్రియములగు త్వక్-చక్షు-శ్రోత్ర-జిహ్వా-ఘ్రాణము లనెడు పంచేంద్రియములును మనస్సుయొక్క తోడ్పాటులేక యేపనియును జేయఁజాలవు గనుక నామన స్సనబడు ఇంద్రియమని నామము గలిగెను గాన నట్టిజ్ఞానేంద్రియములలో నది ప్రధానమైనదిగా నుండుట వలన నది నాస్వరూపమై యున్నది. మఱియు నీప్రపంచమునందలి సమస్తభూతములలో నేదియు చైతన్యము లేకపోవుచు సంతనజిశ్ను నేమియుఁ జేయఁజాలదుగాన నట్టిసమస్తభూతములయందుండెడు చైతన్యము నేనేయైయున్నాను.

శ్లో॥ రుద్రాణాం శఙ్కరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్ ॥ 32

అర్థము :— అహమ్=నేను, రుద్రాణాం=ఏకాదశరుద్రులలో, శఙ్కరః=శంకరుఁడను, యక్షరక్షసామ్=యక్షరాక్షసులలో, విత్తేశః+చ=కుబేరుఁడను, అస్మి=అగుచున్నాను, వసూనామ్=అష్టవసువులలో, పావకః=అగ్నియు, శిఖరిణామ్=పర్వతములలో, మేరుః+చ=మేరుపర్వతమును, అస్మి=అగుచున్నాను.

ఓయియర్జునా! ఏకాదశ రుద్రులలో, అనఁగా అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట, రుద్రుఁడు, హరుడు, శంకరుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు అను పదునొకండుగురిలో శంకరుఁ

డను రుద్రుఁడు నేనే. యక్షరాక్షసులలో కుబేరుఁడు అధిపతిగనుక నట్టి కుబేరుఁడు నేనే. అష్టవసువులగు అపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, పావకుడు, ప్రభాసుఁడు అను నెనిమిదిమందిలో పావకుఁడను వాఁడు శ్రేష్ఠుఁడుగనుక నట్టిపావకుఁడను నేనే. మఱియు నున్నతములగు పర్వతములలో మేరుపర్వత మత్యున్నతమైనది గనుక నట్టి మేరుపర్వతము నేనే యగుచున్నాను.

శ్లో॥ పురోధసాంచముఖ్యం మాం విద్ధిపార్థ బృహస్పతిమ్ ।
సేనానీనామహంస్కన్ధ స్సరసామస్మిసాగరః ॥ 24

అర్థము :— హే పార్థ !=ఓ యర్జునా ! మామ్=నన్ను, పురోధసామ్=పురోహితులలో, ముఖ్యమ్=శ్రేష్ఠుఁడగు, బృహస్పతిమ్=బృహస్పతినిగా, విద్ధి=ఎఱుఁగుము, అహమ్=నేను, సేనానీనామ్=సేనానాయకులలో, స్కన్దః=కుమారస్వామియు, సరసామ్=సరస్సులలో, సాగరః+చ=సముద్రమును, అస్మి=అగుచున్నాను.

ఓయి యర్జునా ! పురోహితులలో బృహస్పతి దేవతలకుఁ బురోహితుఁడుగా నుండుటయే గాక, సమస్తవిద్యలయందును నిపుణుఁడై వాక్పతియను నామాంతరమును గూడఁ జెందియుండుటంబట్టి మిక్కిలి శ్రేష్ఠుఁడై యున్నాడుగదా, కనుకనట్టి బృహస్పతి నేనేయని యెఱుంగుము. సేనానాయకులలో కుమారస్వామి మిక్కిలిశ్రేష్ఠుఁడై యుండుటయే గాక, దేవతలకు సేనాధిపతియైయున్నాఁడు. కనుక నట్టి కుమారస్వామి నేనే. ఇదిగాక, ఈప్రపంచమునందలి సరస్సు లన్నిటికంటె సముద్రము మిక్కిలిగొప్పదిగను, ఎప్పుడును నీరింకుట మొదలగు మార్పులు లేనిదిగను నుంచున్నది గనుక నట్టి సముద్రము నేనే అయ్యున్నాను.

శ్లో॥ మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః ॥ 25

అర్థము :— అహమ్ = నేను, మహర్షీణామ్ = మహర్షులలో, భృగుః=భృగుమహర్షియును, గిరామ్=వాక్కులలో, ఏకమ్+అక్షరమ్ = ఏకాక్షరము (ప్రణవమును), అస్మి = అగుచున్నాను. యజ్ఞానామ్ = యజ్ఞములలో, జపయజ్ఞః = జపయజ్ఞమును, స్థావరాణామ్ = స్థావరములలో, హిమాలయః = హిమాచలమును, అస్మి = అగుచున్నాను.

భృగ్వాది సప్తమహర్షులలో భృగుమహర్షి మొదటివాఁడుగనుకనట్టి భృగుమహర్షియు, వాక్కులన్నిటిలో ఏకాక్షరమును, ప్రణవమును అయిన ఓంకారము శ్రేష్ఠమైనది గనుక నటి ఓంకారమును, సమస్త యజ్ఞములలో జపయజ్ఞముకంటె

శ్రేష్ఠమైనది మఱియొకటిలేదుగనుక నట్టిజపయజ్ఞమును, స్థావరములగు పర్వతము లన్నిటిలో హిమవత్పర్వతము మిక్కిలి గొప్పదిగనుక నట్టి హిమాలయమును నేనే యని యెఱుంగుము.

శ్లో॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః॥ 26

అర్థము:— సర్వవృక్షాణాం = సమస్తవృక్షములలో, అశ్వత్థః = రావిచెట్టును, దేవర్షీణామ్ = దేవర్షులలో, నారదః + చ = నారదుఁడును, గన్ధర్వాణామ్ = గన్ధర్వులలో, చిత్రరథః = చిత్రరథుఁడును, సిద్ధానామ్ = సిద్ధులలో, కపిలః + మునిః = కపిలుఁడును, (అస్మి) = అగుచున్నాను.

ఈప్రపంచమునఁగల వృక్షములన్నిటిలో అశ్వత్థవృక్షమును నాస్వరూపముగ భావించి జనులావృక్షమునకుఁ బ్రదక్షిణములఁజేయుచుందురుగదా, కానట్టి యశ్వత్థ వృక్షము నేనే యనియు, దేవర్షులలోఁ ద్రిలోకసంచారియుఁ ద్రికాలవేత్తయునగు నారదుఁడు శ్రేష్ఠుఁడుగదా, కనుక నట్టి నారదుఁడు నేనే యనియు, గంధర్వులలో చిత్రరథుఁడనువాఁడు శ్రేష్ఠుఁడుగదా, కనుక నట్టిచిత్రరథుఁడు నేనే యనియు, దేవహూతిగర్భమున నాయంశమున నవతరించిన కపిలమహాముని సిద్ధులలో శ్రేష్ఠుఁడు గదా, కనుక నట్టి కపిలమహాముని నేనే యనియు నెఱుంగుము.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానామ్ విద్ధి మా మమృతోద్భవమ్।
ఐరావతమ్ గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥ 27

అర్థము:— మామ్ = నన్ను, అశ్వానామ్ = గుఱ్ఱములలో, అమృతోద్భవమ్ = అమృతములోఁబుట్టిన, ఉచ్చైశ్శ్రవమ్ = ఉచ్చైశ్శ్రవముగను, గజేన్ద్రాణామ్ = ఏనుగులలో, ఐరావతమ్ = ఐరావతముగను, నరాణామ్ = నరులలో, నరాధిపమ్ + చ = రాజుగను, విద్ధి = ఎఱుఁగుము.

దేవతలును రాక్షసులును సముద్ర మథనము చేయు కాలమందు, అమృతముతోఁ గూడ నుద్భవించి దేవేంద్రునికి వాహనముగానుండునట్టి ఉచ్చైశ్శ్రవమను నశ్వము గుఱ్ఱములన్నిటిలో శ్రేష్ఠమైనదిగదా, కనుక నట్టి యుచ్చైశ్శ్రవమును, ఆయమృతోనే యుత్పత్తియై దేవేంద్రునికి ముఖ్యవాహనముగానుండెడు ఐరావతమను తెల్లయేనుఁగు గజములలో శ్రేష్ఠమైనదిగదా, కనుకనట్టి యైరావతమును, ఈలోకమున జనులను బాలించుచుండెడురాజు తక్కినమనుష్యులందఱికంటెను శ్రేష్ఠుఁడుగదా, కనుక నట్టిరాజును నేనే యని యెఱుంగుము.

శ్లో॥ ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజన శ్చాస్మి కన్దర్ప స్సర్పాణా మస్మి వాసుకిః ॥ 28

అర్థము:— అహమ్ = నేను, ఆయుధానామ్ = ఆయుధములలో, వజ్రమ్ = వజ్రాయుధమును, ధేనూనామ్ = ఆవులలో, కామధుక్ + చ = కామధేనువును, అస్మి = అగుచున్నాను, ప్రజనః = ప్రజలయుత్పత్తికిఁ గారణభూతుఁడైన, కన్దర్పః = మన్మథుఁడను. అస్మి = అగుచున్నాను, సర్పాణామ్ = సర్పములలో, వాసుకిః = వాసుకియనుసర్పము, అస్మి = అగుచున్నాను.

ఆయుధములలో, దేవేంద్రుఁడు ధరించియుండెడు వజ్రాయుధము సమస్త పర్వతములయొక్క ఱెక్కలను దెగఁగొట్టినదిగదా, దానినిమించిన యాయుధము మఱియొకటి లేదుగదా, కాఁబట్టి యట్టి వజ్రాయుధము నేనే. ఆవులన్నియుఁ బాలు మాత్రమే పితుకుచుండఁగా, కామధేనువను యావుమాత్ర మెవరెవరేమి కోరిన నవి యెల్లను బితుకుచున్నదిగదా, కనుక ఆవులన్నిటిలో నట్టి కామధేనువు నేనే. ఈప్రపంచమున స్త్రీపురుషసంయోగము లేనిది ప్రజల యుత్పత్తి కానేరదుగదా, అట్టి సంయోగమునకు స్త్రీ పురుషులను బ్రేరేపించువాఁడు మన్మథుఁడుగదా, ఇందువలన నామన్మథుఁడు ప్రజలసృష్టికిఁ గారణభూతుఁడగుచున్నాఁడుగదా, కాఁబట్టి యామన్మథుఁడు నేనే యని యెఱుంగుము. మనుష్యులకు రాజెట్లధిపతియో, అట్లే సర్పములలో వాసుకియను సర్పమధిపతిగనుక నట్టి వాసుకియను సర్పము నేనేయని యెఱుంగుము.

శ్లో॥ అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహం ।
పితౄణా మర్యమా చాస్మి యమస్సంయమతా మహమ్ ॥ 29

అర్థము :— అహమ్ = నేను, నాగానామ్ = నాగుపాములలో, అనన్తః + చ = అనంతుఁడును, యాదసామ్ = జలదేవతలలో, వరుణః = వరుణుఁడును, అస్మి = అగుచున్నాను, అహమ్ = నేను, పితౄణామ్ = పితృదేవతలలో, అర్యమా + చ = అర్యముఁడును, సంయమతామ్ = శిక్షించువారిలో, యమః = యమధర్మరాజును, అస్మి = అగుచున్నాను.

ఓయియర్జునా! ఇపుడు నేఁజెప్పినవాసుకిపడగలేని సాధారణసర్పములకురాజు. ఇఁకను పడగలుగల నాగసర్పములకన్నిటికి అనంతుఁడు రాజైయున్నాఁడు. ఆయనంతుఁడెట్టివాఁడనఁగా నాకు పాన్పుగానుండెడు నాదిశేషుఁడై యున్నాడు. కనుక నట్టియనంతుఁడు నేనే యనియెఱుఁగుము. మఱియును, జల దేవతలలో వరుణుఁడనువాఁడే సమస్తప్రపంచమునందును వర్షమును గురిపించి సమస్తజంతువులకును జీవనాధారము

లగు సస్యాదులను ఫలింపఁ జేయువాఁడు గనుక నట్టి వరుణుఁడును, పితృదేవతలలో నర్యముఁడను వాఁడు ముఖ్యుఁడు గనుక నట్టి యర్యముఁడును, తప్పుచేసినవారల దండించు వారిలో మొదటివాఁడు యమధర్మరాజు గనుక నట్టి యముఁడును నేనే యనియెఱుఁగుము.

శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్ ।
మృగాణాంచ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥ 30

అర్థము :— అహమ్=నేను, దైత్యానామ్=రాక్షసులలో, ప్రహ్లాదః=ప్రహ్లాదుఁడును, కలయతామ్=లెక్కపెట్టువారిలలో కాలః+చ=కాలమును, అస్మి=అగుచున్నాను, అహమ్=నేను, మృగాణామ్,=మృగములలో, మృగేన్ద్రః+చ= సింహమును, పక్షిణామ్ = పక్షులలో, వైనతేయః+చ = గరుత్మంతుఁడును, (అస్మి)=అగుచున్నాను.

మఱియునో యియర్జునా! దితివంశస్థులగు రాక్షసులునన్ను ద్వేషించువారిలోఁ జేరినవారుగదా! అట్టి యసుర వంశంబునంబుట్టిన ప్రహ్లాదుఁడునాకత్యంత భక్తుఁడు గనుక నాప్రహ్లాదుఁడు నేనేయనియు, లెక్కపెట్టువారిలో కాలమెప్పుడు, అనగా, విసుగు-విరామము లేక యెల్లప్పుడు నొకక్షణము వెనుక మఱియొకక్షణమును, ఒక గడియ వెనుక మరియొక గడియయును, ఒక ఝాము వెనుక మఱియొకఝామును సదా జరుపుచునే లెక్కపెట్టుచుండును గాననట్టి కాలము నాస్వరూపమేయనియు, మనుష్యులకు రాజెట్లధిపతియో, అట్లేమృగములకు సింహమధిపతి గనుక నట్టి సింహము నేనె యనియు పక్షులకన్నిటికిని వినతాపుత్రుఁడగు గరుత్మంతు డధిపతి గనుక నట్టిగరుత్మంతుఁడును నేనేయనియు నెఱుంగుము.

శ్లో॥ పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్ ।
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ॥ 31

అర్థము :— అహమ్=నేను, పవతామ్=వేగవంతులలో, పవనః = వాయువును, శస్త్రభృతామ్ = ధనుర్ధరులలో, రామః = శ్రీరాముఁడును, అస్మి= అగుచున్నాను, ఝషాణామ్=జలచరములలో, మకరః+చ=మొసలియు, అస్మి= అగుచున్నాను, స్రోతసామ్ = నదులలో, జాహ్నవీ=గంగానది, అస్మి = అగుచున్నాను.

వేగవంతులలో వాయువును మించినవారు లేరుగదా? కనుక నట్టివాయువు నేనని యెఱుంగుము. ధనుర్ధరులలో శ్రీరాముఁడు హరుని విల్లువిఱిచినవాఁడును,

పరశురాముని భంగపరచినవాఁడును, సప్తతాళములనొకబాణముతోఁగూలవేసినవాఁడును నైయున్నాఁడుగదా! కనుక నట్టి శ్రీరాముఁడు నేనేయని యెఱుఁగుము. జలచరములలో మొసలికంటె నెక్కుడు బలము గలది మఱియొకటిలేదుగదా! కాఁబట్టి యట్టి మొసలి నేనేయని యెఱుంగుము. నదులలో గంగానదికంటె పవిత్రమైనది మఱియొకటి లేదుగదా? కాఁబట్టి యా గంగానది నేనేయని యెఱుంగుము.

శ్లో॥ సర్గాణా మాది రన్తశ్చ మధ్యం చైవాహ మర్జున!
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్॥ 32

అర్థము :— హే అర్జున=ఓయియర్జునా, సర్గాణామ్=సృష్టులకు, ఆదిః+మధ్యః+చ+అన్తః+చ=ఆదిమధ్యాంతములు, అహమ్+ఏవ=నేనే, విద్యానామ్=విద్యలలో, అధ్యాత్మవిద్యా=ఆత్మజ్ఞానము గలుగఁజేయు విద్యయును, ప్రవదతామ్=వాద-జల్ప-వితండములలో, వాదః=వాదము, అహమ్+(ఏవ)=నేనే (అయ్యున్నాను).

ఓయియర్జునా! సమస్తప్రపంచముయొక్క ఆదియు (సృష్టికర్తయు), మధ్యమును (సంరక్షణకర్తయు), అంతమును (సంహారకర్తయు) నేనేయని యెఱుంగుము. ఇట్టి నన్నెఱుంగఁజేయు విద్యయేదికలదో, అదియే విద్యలన్నిటిలో శ్రేష్ఠమైన విద్యగనుక నట్టి యధ్యాత్మవిద్యయును నేనేయని యెఱుంగుము. ఇఁక నీప్రపంచమున జరిగెడు వాదములలో మూఁడువిధములుగలవు. అదెట్లనఁగా, ఏదైననొకవిషయమును గుఱించి తెలిసికొనవలయుననెడి యపేక్షతో నొకరితో నొకరు ప్రశ్నోత్తరముల రూపముగఁజేయు వాగ్వివాదము వాదమనబడుచున్నది. ఉపయుక్తములేని మాటలాడుట జల్ప మనఁబడుచున్నది. స్వపక్షపాతముగ వాదించుట వితండమనబడుచున్నది. ఈమూఁడింటిలో మొదటిదియగు వాదము శ్రేష్ఠమైనదిగనుక నట్టి వాదము నాస్వరూపమని యెఱుఁగుము.

శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి ద్వన్ద్వ స్సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః॥ 33

అర్థము :— అహమ్=నేను, అక్షరాణామ్=అక్షరములలో, అకారః=అకారము (అ అనువర్ణము), సామాసికస్య=(పదముల) సమాసము (కూడిక) లో, ద్వన్ద్వః+చ=ద్వన్ద్వసమాసమును, అస్మి=అగుచున్నాను, అక్షయః=నాశములేని (శాశ్వతమైన), కాలః=కాలమును, విశ్వతోముఖః=అంతట (నలుదిక్కుల) ముఖములుగల, ధాతా+చ=బ్రహ్మయును, అహమ్+ఏవ=నేనే (అయ్యున్నాను).

అక్షరములలో మొదటిదియగు (అ) అనునక్షరము నాస్వరూపమే యని యెఱుంగుము. కనుకనే నాకు అకారవాచ్యుఁడను నామాంతరమును గలదు. సమాసములలో ద్వంద్వసమాసము నాస్వరూపమే యని యెఱుంగుము. యుగములెన్ని మాఱినను కాలమెప్పటికిని మాఱక యొకటేతీరుగ నుండునుగాన నట్టి కాలము నాస్వరూపమేయని యెఱుంగుము. కాఁబట్టియే నన్ను లోకులు కాలస్వరూపుఁడ నని చెప్పుదురు. ఇదిగాక విశ్వతోముఖుఁడును (అనఁగా చతుర్ముఖుఁడును), సృష్టికర్తయునగు బ్రహ్మయు నేనేయని యెఱుంగుము.

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥ 34

అర్థము :— అహమ్=నేను, సర్వహరః= (ప్రపంచమున జీవించుచుండెడు) సమస్తజంతువులను హరించునట్టి, మృత్యుః+చ=మృత్యుదేవతయును, భవిష్యతామ్=ఇఁకముందు ఉత్పత్తికాఁగల సమస్తజంతువులయొక్క, ఉద్భవః+చ=పుట్టుకయును, నారీణామ్=స్త్రీలయొక్క, కీర్తిః=యశస్సును, శ్రీః=సంపదయును, వాక్=(మృదువైన) వాక్కును, స్మృతిః=జ్ఞాపకశక్తియును, మేధా=దారణశక్తిగలబుద్ధియును, ధృతిః=ధైర్యమును, క్షమా+చ=ఓర్పును, అస్మి=అగుచున్నాను.

అట్లు బ్రహ్మచేసృజింపఁబడి జీవింపుచుండెడు సమస్తజంతువులయొక్క ప్రాణములను హరించెడు మృత్యుదేవతయును నేనేయని యెఱుంగుము. అనఁగా నేనే బ్రహ్మగానుండి సమస్తజంతువులను ఉత్పత్తిచేయుచుందుననియు, మరల నాజంతువులను మృత్యుదేవతనై హరింతుననియు, మరల నాజంతువులను ఉత్పత్తిచేయువాఁడునుగూడ నేనేయనియు నెఱుంగుము. ఇదిగాక, స్త్రీలలో కీర్తివంతులును, ఐశ్వర్యవంతులును, పరుల మనసు నొవ్వకుండునట్లు మృదువుగ సంభాషించువారును, జ్ఞాపకశక్తిగలవారును, మేధావంతమైన బుద్ధిగలవారును, ధైర్యముగలవారును, ఓర్పుగలవారును అరుదుగానుందురు. అనఁగా నట్టిసుగుణములు స్త్రీలయందు దరుదుగా నుండుననుట. కనుక నట్టిగుణము లేస్త్రీయందుండుచున్నవో ఆ స్త్రీయందు నాయంశ మున్నట్లెంచికొనుము.

శ్లో॥ బృహత్సామ తథాసామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥ 35

అర్థము :— అహమ్ = నేను, సామ్నామ్ = సామగానములలో, బృహ

త్సామ = బృహత్సామమును, ఛన్దసామ్ = ఛన్దస్సులలో, గాయత్రీ=గాయత్రి యును, (అస్మి)=అగుచున్నాను, తథా=అలాగుననే, అహమ్=నేను, మాసానాం= మాసములలో, మార్గశీర్షః = మార్గశీర్ష మాసమును. ఋతూనామ్=ఋతువులలో, కుసుమాకరః=వసంతఋతువును, (అస్మి)=అగుచున్నాను.

ఓయి యర్జునా! ఇంతకుముందు నేను ఋగ్యజుస్సామాథర్వణము లనెడు నాలుగు వేదములలో సామమనెడు వేదము నాస్వరూపమని చెప్పియుంటినిగదా? అట్టి సామవేదములో బృహత్సామమను ఋక్కు మోక్షప్రతిపాదకమైనదిగాన నాబృహత్సామమే నేనని యెఱుంగుము. అట్లే ఛందస్సులలో గాయత్రిమంత్రము శ్రేష్ఠమైనది గనుక నట్టి గాయత్రి మంత్రము నాస్వరూపమే యని యెఱుంగుము. ఇది గాక, చైత్రాది పండ్రెండు మాసములలో మార్గశీర్ష మాసమునందు విశేషవానలు గాని యెండలుగాని లేక జనులకు మిగుల సౌఖ్యకరముగ నుండుటయగాక సమస్త మైనను బండి మనుష్యులకును పశుపక్ష్యాదులకును పుష్కలముగ నాహారపదార్థములు గలిగి యుండుటయు మొదలగు కారణములచే నామాసము మిగుల శ్రేష్ఠమైనదిగా నున్నది. కాన నట్టి మార్గశీర్ష మాసము నాస్వరూపమే యని యెఱుంగుము. ఇదిగాక, షడ్ఋతువులలో వసంతఋతువునందు సమశీతోష్ణముగనుండుటయేగాక, సమస్త వృక్షములను చిగిరించి-పుష్పించి-ఫలప్రదములుగా నుండుటంబట్టి జనులకు మనో ల్లాసకరముగ నుండును గాన నట్టివసంతఋతువు నాస్వరూపమే యని యెఱుంగుము.

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్।
జయోఽహమ్ వ్యవసాయోఽహమ్ సత్త్వం సత్త్వవతా
మహమ్॥ 36

అర్థము :— అహమ్ = నేను, ఛలయతామ్ = వంచకవ్యాపారములలో, ద్యూతమ్=జూదము, అస్మి=అగుచున్నాను, తేజస్వినామ్=తేజోవంతులయొక్క, తేజః=తేజస్సు, అస్మి=అగుచున్నాను, జయః=జయమును, వ్యవసాయః=ఉద్యోగ మును, సత్త్వవతామ్=సాత్త్వికులయొక్క, సత్త్వమ్=సత్త్వగుణమును, అహమ్+ (ఏవ)+అస్మి=నేనే అగుచున్నాను.

ఓయియర్జునా! వంచకవ్యాపారములలో జూదమెట్టిదనఁగా, ఎట్టి లక్షాధి కారులనైనను సరే క్షణమాత్రములోలోన భిక్షాధికారులఁజేయుశక్తిగలది. కాన నిది నాస్వరూపమని యెఱుంగుము. అయితే, వంచకత్వము నీచమైనదిగదా, ఇట్టిదినాస్వ రూపమెట్లగునని నీకు సంశయము గలుగవచ్చును గాన నందుకు సమాధానమును

జెప్పుచున్నాను వినుము. ఈలోకమున జనులుసర్వసాధారణముగఁ గాయక్లేశములఁ గలుగజేయు ననేకవిధములగు వ్యాపారములఁ జేయుచు నందు వలనఁగలిగెడు లాభ నష్టములచేఁ గొందఱు ద్రవ్యవంతులగుటయు, కొందఱు ద్రవ్యహీను లగుటయుఁ జూచుచున్నాముగదా? అట్టి వ్యాపారము లేవియుఁజేయక హాయిగాఁగుడిచికూర్చుండి యుండెడు వారలలోఁగూడ క్షణమాత్రమున లక్షాధికారులను భిక్షాధికారులుగను, భిక్షాధికారులను లక్షాధికారులుగను, జేయఁదగిన వ్యాపారము జూదమొకటి తప్ప మఱియేదియు లేదు గదా? కనుక నట్టివారిలో నెవరినైన నేదేని యొక కారణమును బట్టి వారల మేలుకొఱకుఁగాని, లేక, వారలకీడుకొఱకుగాని ద్రవ్యవంతులుగనో లేక ద్రవ్యహీనులుగనో క్షణమాత్రముచేఁ జేయవలయునని నేను సంకల్పించినయెడల నట్టి వారి కట్టిజూదమునందాసక్తిఁ బుట్టించి యందు నాసంకల్పానుగుణ్యములుగ వారలకు జయాపజయముల నిచ్చుచుందును. కనుక నట్టి జూదము నాస్వరూపమని చెప్పుటకు గారణమైనది. ఇదిగాక, తేజస్వులయొక్క తేజస్సు నేనేయని, అనగా, నాయంశము లేనిది యట్టి తేజస్సు వారలకుఁ గలుగదని యెఱుంగుము. మఱియు నిత్యే జయశీలురగు వారలయొక్క జయమును, ఏదేని యొకవ్యాపారము నవలంబించి యందువలన నభి వృద్ధినొందునట్టి వారియొక్క వ్యాపారమును నేనేయని యెఱుంగుము. మఱియు సాత్త్వికులలో నుండెడు సత్త్వగుణము తక్కిన యన్నిగుణములకంటె శ్రేష్ఠమైనదియు, మోక్షప్రదమైనదియుఁ గనుక నట్టిసత్త్వగుణము నాస్వరూపమేయని యెఱుంగుము.

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః॥ 37

అర్థము:— అహమ్=నేను, వృష్ణీనామ్ = వృష్ణివంశస్థులగు యాదవులలో, వాసుదేవః=వసుదేవపుత్రుఁడను, పాణ్డవానామ్=పాణ్డవులలో, ధనంజయః=ధనంజయుఁడను, మునీనామ్=ఋషులలో, వ్యాసః + అపి = వ్యాసమహర్షియును, కవీనామ్=కవులలో, ఉశనాకవిః=శుక్రుఁడును, అస్మి=అగుచున్నాను.

ఓయియర్జునా! వృష్ణివంశస్థులగుయాదవులలో వసుదేవపుత్రుఁడనై కృష్ణుఁడను నామమునువహించి యిపుడునీకు సారథ్యము చేయుచున్న నేనైయున్నాను. ఇదిగాక పాణ్డుపుత్రులలో ధనంజయుఁ డనుపేరఁబరుగుచున్న నీవే నేనైయున్నాను. అదెట్లనగా, పరబ్రహ్మస్వరూపులగు నర నారాయణులలో నరుఁడు నీవుగను నారాయణుఁడు నేనుగను నవతరించియున్నాము. ఇదిగాక, ఋషులలో భృగుమహర్షియు, నారదమహర్షియు నాస్వరూపులే యని యింతకుముందు చెప్పియు

న్నానుగదా? (చూ 10. 25, 27). ఓరలే కాక వ్యాసమహర్షియు నాస్వరూపుఁడేయై యున్నాఁడు. అనఁగా, నేనే వ్యాసమహర్షిగా నవతరించి యున్నాను. కనుకనే "వ్యాసో నారాయణో హరిః" అని పెద్దలు చెప్పియున్నారు. భృగుమహర్షి నాయంశజుఁడని యిదివఱకే చెప్పియుంటినిగదా? అట్టి భృగుమహర్షి యొక్క పుత్రుఁడును, కవులలో శ్రేష్ఠుఁడును నగు శుక్రుఁడును నాస్వరూపుడే యని యెఱుఁగుము.

శ్లో॥ దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషితామ్ ।
మౌనంచాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥ 38

అర్థము:— దమయతాం = దండించువారలయొక్క, దణ్డః = దండనీతి, అస్మి = అగుచున్నాను, జిగీషితామ్ = జయింప నిచ్ఛగలవారలయొక్క, నీతిః= జయోపాయము, అస్మి = అగుచున్నాను. గుహ్యానామ్ = రహస్యములలో, మౌనమ్ + చ = మౌనమును, అస్మి = అగుచున్నాను, జ్ఞానవతామ్ = జ్ఞానవంతుల యొక్క, జ్ఞానమ్ = జ్ఞానము, అహమ్ + ఏవ = నేనే (అగుచున్నాను).

మఱియు నోయియర్జునా! ఈలోకమున దురాత్ములుగానుండి నేరములను జేసెడివారిని శిక్షించుటకు రాజులు మొదలగువార లేర్పడి యున్నారుగదా? అట్టి వార లాయానేరస్థుని నేరములయొక్క పరిమితికిఁదగినట్టి శిక్షల విధించుటకుఁగా నొకనీతి (నియమము) నేర్పఱచుకొని యుంచున్నారుగదా? అట్టి దండనీతి నేనే యని యెఱుంగుము. అనఁగా, ఆయా నేరములకుఁ దగినట్లాయాశిక్షల విధించునట్లు ప్రేరేపించువాఁడను నేనే యని యెఱుంగుము. ఇదిగాక, యుద్ధాదులలో జయింపఁ గోరెడువార లట్టిజయమును బొందుటకుఁదగిన సామ-దాన-భేద-దండముల నెడు చతురుపాయముల నుపయోగింతురు గదా? అట్టియుపాయములు నేనే యని యెఱుంగుము. అనఁగా, అట్టియుపాయములను వారలకుఁదోపింపఁ జేయువాఁడను నేనేయైయున్నాను. ఇదిగాక, ఒకఁడు మఱియొకని కేదేని యొకరహస్యము నెంతభద్రముగఁ జెప్పినను, అదియెప్పటికైనను బయలుపడక మానదు. కాన నట్లు చెప్పక మౌనముగనుండుటయే శ్రేష్ఠముగదా? కాఁబట్టి, అట్టిరహస్యములలో మౌనము నాస్వరూపమని యెఱుంగుము. అనఁగా నాకృపాకటాక్షబలిమి లేనియెడల నెవఁడైనను సరే యేదేని యొక రహస్యమును దాచికొనఁజాలఁడు. కనుకనే, నాకటాక్షమునకుఁ బాత్రులుగానుండెడు జ్ఞానులుమాత్రమే యెప్పుడును మౌనమును ధరించియుండశక్తులగుచున్నారు. ఇదిగాక, జ్ఞానవంతులు వారికిఁగలిగియుండెడు జ్ఞానముచేత నేగదా సంసార సాగరమును దరించుచున్నారు? కాన నట్టిజ్ఞానము నాస్వరూపమేయనియెఱుంగుము.

శ్లో॥ య చ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున! ।
న త దస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥ 39

55

అర్థము:— అపిచ = మఱియును (విశేషముగాఁజెప్పనేల), హే అర్జున! = ఓయర్జునుఁడా!, సర్వభూతానామ్ = సమస్తభూతములకు, బీజమ్ = ఉత్పత్తికారణము, యత్ = ఏదియో, తత్ + (సర్వమ్) = అదియంతయు, అహమ్ = నేను, మయా + వినా = నను వినాగా (నాకంటె వేరైన), చరాచరమ్ + భూతమ్ = చరాచరాత్మకమైనవస్తువు, యత్ + స్యాత్ = ఏదికలదో, తత్ = అది (అట్టివస్తువు), న + అస్తి = లేనేలేదు.

ఓయియర్జునా! యింతవఱకు నేనిన్ని విషయముల నీకుఁ జెప్పితినిగదా. ఇఁక విశేషించిచెప్పనేల? సంగ్రహముగా నొక్కమాటఁ జెప్పుచున్నానువినుము. అదేమనఁగా, ఈప్రపంచమునఁగల సమస్తభూతములకు నేదియుత్పత్తికారణముగా నుంచున్నదో, అదియంతయు నేనే యని యెఱుంగుము. అనఁగా, నావలనఁగాక మఱి యొకవిధముగా నుత్పత్తియయ్యెడు వస్తువొక్కటియైననుండదని యెఱుంగుము. కనుక నీప్రపంచమందలి చరాచరాత్మకమగు సమస్తవస్తువులును నాయంశాసంభూతము లైనవేగాని నన్నువినాగా నేదియు నుండదని రూఢిగా నమ్ముము.

శ్లో॥ నాన్తోఽస్తిమమ దివ్యానాం విభూతీనాం పరన్తప!।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా॥ 40

అర్థము:— హేపరంతప! = ఓయియర్జునా!, మమ = నాయొక్క, దివ్యానాం = దివ్యములైన, విభూతీనాం = లీలావిభూతులకు, అన్తః = అంతము, న + అస్తి = లేదు. విభూతయః = అట్టి లీలావిభూతులయొక్క, ఏషః = ఈ (ఇంతవఱకుఁజెప్పబడిన, విస్తరః + తు = వివరణమన్ననో, ఉద్దేశతః = (నీకు) గుఱుతుకుఁగాను, మయా = నాచేత, ప్రోక్తః = చెప్పఁబడినది.

ఓయియర్జునా! నాయొక్క లీలావిభూతులు దివ్యములైనవిగను, అంతము లేనివిగను నున్నవి. కనుక వానినన్నిటిని సవిస్తారముగా నీకుఁ జెప్పుటకు సాధ్యపడదు. అయినను, ఇప్పుడు ముఖ్యములగు వానిలోఁ గొన్నిటినిమాత్రము నీకుఁ జెప్పియున్నానుగదా? ఈకొన్నియైనను జెప్పుటకుఁ గారణమేమనఁగా, ఈప్రపంచమునందలి సమస్తచరాచరములయందును నేనెట్లు వ్యాపించియున్నానో దానిం దెలిసికొనుటకు దగినమార్గమును నీకుఁజూపుటకుఁగా గుఱుతుకొఱకు చెప్పడమైనది.

శ్లో॥ యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా।
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్॥ 41

అర్థము:— యత్ + యత్ + సత్త్వమ్ = ఏయేవస్తువు, విభూతిమత్ = ఐశ్వర్యవంతమైనదిఁగాని, శ్రీమత్ = కాంతియుక్తమైనదిగఁగాని, ఊర్జితమ్ + ఏవ + వా =

దృఢమైనదిగఁగాని (యుంచున్నదో), తత్ + తత్ = అయ్యది (అయావస్తువు), మమ = నాయొక్క, తేజోంశసమ్భవమ్ = తేజస్సువలనఁ గలిగినదానిఁగా, త్వమ్ + అవగచ్ఛ = నీవు తెలిసికొనుము.

అట్టిగుణము తెద్దియనఁగా, ఇపుడు (10-19. మొదలు 39 వఱకు.) నేఁజెప్పిన ప్రకార మీచతుర్దశ భువనముల యందును గలస్థావర జంగమాత్మకములగు వస్తువులలో నెయ్యది యైశ్వర్య వంతముగ నుంచున్నదో, ఎయ్యది శోభాయుక్తమైనదిగ నుంచున్నదో, ఎయ్యది మిగుల బలమైనదిగ నుంచున్నదో అట్టి ప్రతివస్తువును నా తేజస్సు వలననే గలిగినదిగా నెఱుంగుము. అనఁగా నాయా వస్తువునందుండెడు నైశ్వర్యమును, శోభయును, దారుఢ్యమును నాయంశమేయని యెఱుంగుము. అనఁగా, నాయంశమావస్తువునందు లేకయే యావస్తువున కట్టి యైశ్వర్యముగాని, శోభగాని, ధార్ఢ్యముగాని కలుగనేరదనుట.

శ్లో॥ అథ వా బహునై తేన కిం జ్ఞాతేన తవార్జున ! ।
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ 42

అర్థము:— అథవా = లేక (అట్లు కాదేని), బహునా = విస్తారమైన, ఏతేన + జ్ఞానేన = ఈజ్ఞానముచేత, తవ + కిమ్ = నీకేమిప్రయోజనము ?, హేఅర్జున ! = ఓయియర్జునుఁడా !, ఇదమ్ + కృత్స్నమ్ + జగత్ = ఈప్రపంచమంతయు, ఏకాంశేన = ఒక్కయంశముచేతనే, అహమ్ = నేను, విష్టభ్య + స్థితః = నిలిపియున్నాను.

ఇంతయేల! ఇంత వివరముగ నేను చెప్పుటవలనను, నీవు తెలిసికొనుటవలనను ప్రయోజనమేమియులేదు. ఏలయనఁగా, అనంతములగు నాలీలావిభూతులన్నిటిని సాంతముగఁ జెప్పుటకు నాకు సాధ్యపడదు సరేకదా, వాని నన్నిటినివిన్నను జ్ఞాపక ముంచుకొనుటకు నీకును సాధ్యపడదు. కనుక నోయియర్జునా! నీకు ముఖ్యమగు సారాంశమొక్కటి చెప్పుచున్నాను వినుము. అదేమనఁగా, ఈప్రపంచమంతయు నాయంశములలో నొకస్వల్పభాగముచే నిలుపఁబడియున్నదని యెఱుంగుము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి విభూతియోగంబను
దశమాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావ బోధిని

## ఏకాదశాధ్యాయము

### విశ్వరూప సందర్శన యోగము

**అర్జున ఉవాచ :**

శ్లో॥ మదనుగ్రహాయ పరమమ్ గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తంవచస్తేన మోహోఽయంవిగతోమమ ॥ 1

అర్థము :— మదనుగ్రహాయ = నన్ననుగ్రహించుటకొఱకు, పరమమ్ + గుహ్యమ్ = పరమరహస్యమైనదియు, అధ్యాత్మసుజ్ఞితమ్ = అధ్యాత్మమను పేరుగలదియునగు, యత్ + వచః = ఏవాక్యము, త్వయా + ఉక్తమ్ = నీచేఁజెప్పఁబడినదో, తేన = ఆవాక్యముచేత, మమ = నాయొక్క, అయమ్ + మోహః = ఈయజ్ఞానము, విగతః = విడిచిపోయినది.

అర్జునుఁడు — అయ్యా కృష్ణమూర్తీ! నీవు నన్ననుగ్రహించుటకొఱకు, అనఁగా నిపుడు నాకు నజ్ఞానముచేఁ గలిగియుండెడు బంధుమిత్రాదులయందలి మమకారమును, నేను వారలఁ జంపఁబోవుచున్నాననియెడు నహంకారమును, కామక్రోధాద్యరిషడ్వర్గములను బోఁగొట్టి నన్ను సంసారబంధవిముక్తుని గావించి మోక్షార్హునిగఁ జేయదలఁచి నీవింతవఱకు నేయేవాక్యములఁ జెప్పితివో, ఆవాక్యముల నన్నిటిని వినినంతమాత్రముచేతనే నాకుఁ గలిగియుండిన యజ్ఞానమంతయుఁ దొలఁగిపోయినది.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష ! మహాత్మ్యమపి చావ్యయమ్ ॥ 2

అర్థము :— హేకమలపత్రాక్ష = ఓరాజీవనేత్రా, భూతానాం = భూతముల యొక్క, భవాప్యయౌ = ఉత్పత్తిలయములును, (తవ) = నీయొక్క, అవ్యయమ్ =

నాశరహితమైన, మహాత్మ్యమ్ + అపి + చ = మహిమయును, మయా = నాచేత, త్వత్తః = నీవలన, విస్తరశః = సవిస్తరముగా, శ్రుతౌ + హి = వినఁబడినదిగదా ?

ఓకమలపత్రాక్షా ! నీవలన సమస్తభూతములయొక్క యుత్పత్తిలయములను వినుటయేగాక నీమహాత్మ్యమునుగూడ, అనఁగా నీచరాచర ప్రపంచమంతటికిని నీవే సృష్టిస్థితిలయములకు కర్తవుగానుండియు నాసృష్ట్యాదికర్మలు నిన్నంటకుండుటయు, సమస్తభూతములయందును నీవు మణులలోని సూత్రమువలె వ్యాపించియుండియు నట్టిభూతప్రపంచముకంటె విలక్షణుండుగ నుండుటయు, నీవీసమస్తప్రపంచమునకు నాదికారణుఁడవుగానుండియు నీయుత్పత్తిస్థానమును దేవతలు మహర్షులు మొదలగువారు సయితము మెఱుఁగలేకుండుటయు, ఈ మొదలగు నీయద్భుత మహిమలనుగూడ నీవలననే సవిస్తరముగ వింటినిగదా ?

శ్లో॥ ఏవ మేత ద్యథాత్థత్వ మాత్మానం పరమేశ్వర !
ద్రష్టు మిచ్ఛామి తేరూప మైశ్వరం పురుషోత్తమ॥  3

అర్థము:— హేపరమేశ్వర ! = పరమేశ్వరుఁడవగు నోకృష్ణమూర్తీ !, ఆత్మానమ్ = నిన్నుగూర్చి, త్వమ్ + యథా + ఆత్థ = నీవెట్లుచెప్పితివో, ఏవమ్ + ఏతత్ = అదియట్లేయుండును, హేపురుషోత్తమ ! = ఓపురుషోత్తముఁడా !, తే + ఐశ్వరమ్ + రూపమ్ = నీయీశ్వరస్వరూపమును, ద్రష్టుమ్ + ఇచ్ఛామి = చూడఁగోరుచున్నాను.

ఓ పరమేశ్వరా ! నీలీలావిభూతులను గుఱించి నీవెట్లెట్లుచెప్పియున్నావో, అనఁగా నేయేవిభూతి యెంతయద్భుతమైనదిగనున్నట్లు చెప్పియున్నావో, ఆయా విభూతి యంత యద్భుతమైనదిగనేయుండును. అందుకు సంశయము లేదు. కనుక నోపురుషోత్తమా ! అట్టి నీయద్భుతమగు విశ్వరూపమును నేను జూడఁగోరుచున్నాను.

శ్లో॥ మన్యసే యదితచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో !
యోగేశ్వర తతోమేత్వం దర్శయాత్మాన మవ్యయమ్॥  4

అర్థము:— హేయోగేశ్వర + ప్రభో = యోగీశ్వరుఁడవగు నోప్రభూ !, తతః = (నేనట్లుచూడఁగోరుచున్నాను) గనుక, తత్ = అట్టివిశ్వరూపము, మయా + ద్రష్టుమ్ = నాచేఁజూడఁబడుటకు, శక్యమ్ + ఇతి = శక్యమని, త్వమ్ + మన్యసే + యది = నీవుతలఁచెదవేని, అవ్యయమ్ + ఆత్మానమ్ = అవ్యయమగు నీరూపమును, మే + దర్శయ = నాకుఁజూపుము.

అయితే, దేవతలు-మహర్షులు-మొదలగువారలే నిన్నెఱుఁగజాలరని యింతకు ముందు చెప్పియుంటివిగదా ? (చూ. 10-2). అట్లుండ, మనుష్యమాత్రుఁడనగు నాకు

నీవిశ్వరూపమును జూచుటకు సాధ్యమగునాయని సంశయించుచున్నాఁడను. కాన నో యోగీశ్వరా! అట్టిత్యద్భుతమును, మహదాకృతియునగు నీవిశ్వరూపమును నేను జూచుటకు సాధ్యపడఁగలదని నీవుతలఁచెదవేని దయచేసి యట్టి యవ్యయమగు నీవిశ్వరూపమును నాకుఁదర్శింప జేయవలయునని ప్రార్థించుచున్నాఁడను. కాన నోమహాప్రభో!

"మ. అతిగుహ్యంబిది నీవుభూరికృపనీ యధ్యాత్మముంగానఁ జే
సితి నాకిమ్మెయి విన్కిఁగొంతభ్రమవాసెన్ యోగివ్యాధ్యేయమై
యతులైశ్వర్యవిభూతి నొప్పు భవదీయంబైన రూపంబు సూ
చు తలంపెత్తెదుఁ జోలునేని దయఁజక్షుఃప్రీతిగావింపవే!"
(భార. భీష్మ. ౧ ఆ. ౨౦౭)

శ్రీభగవానువాచ :

శ్లో॥ పశ్యమేపార్థ! రూపాణి శతశోఽథసహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥ 5

అర్థము:— హేపార్థ! = ఓయర్జునా!, శతశః + అథ + సహస్రశః = అసంఖ్యాకములుగ, నానావిధాని = అనేకవిధములైనవియు, నానావర్ణాకృతీని = అనేకవర్ణములును అకృతులునుగలవియు, దివ్యాని + చ = దివ్యములునగు, మే + రూపాణి = నారూపములను, పశ్య = చూడుము.

కృ — ఓయి యర్జునా! నీవింతదూరము ప్రార్థేయపడి యడిగికొనుచున్నావు గనుక, దేవాదులకైనఁ జూచుటకునలవిగాని నావిశ్వరూపమును నీకుఁజూపెదచున్నాను. అదియెట్లుండుననఁగా,

"క. నానాస్ఫుటవర్ణంబులు
నానాభంగులునుగలుగు నారూపములో
నానాశ్చర్యవిధంబులు
గానఁ గనఁగుఁ జూపెదం బ్రకాశస్ఫూర్తిన్." (భార. భీష్మ ౧ఆ. ౨౦౯.)

అనునట్లు, నూర్లకొలఁదియు, వేలకొలఁదియు, పెక్కుమాటలేల, ఇన్నియన్ని యని లెక్కింపనలవిగాని సంఖ్యలుగల దివ్యరూపములుగలదిగా నుండును. అందనేక విధములగువర్ణములును, ఆకారములును గలిగి యత్యద్భుతముగా నుండును. అట్లనంతములగు దివ్యరూపములతోఁగూడియుండెడు నావిశ్వరూపమును నీకుఁ జూపుచున్నాను చూడుము.

శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుత స్తథా।
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణిభారత॥ 6

అర్థము :— హేభారత ! = ఓయర్జునా !, ఆదిత్యాన్ = ద్వాదశాదిత్యులను, వసూన్ = అష్టవసువులను, రుద్రాన్ = ఏకాదశరుద్రులను, అశ్వినౌ = అశ్వినీదేవతలను, మరుతః = సప్తమరుత్తులను, పశ్య = చూడుము. తథా = అలాగుననే, అదృష్టపూర్వాణి = పూర్వ మెన్నడును జూడఁబడనివియగు, బహూని + ఆశ్చర్యాణి = అనేక యద్భుతములను, పశ్య = చూడుము.

ఓయర్జునా ! ఇంతకుముందు ద్వాదశాదిత్యులలో విష్ణువు నేననియు, అష్టవసువులలో పావకుఁడు నేనేయనియు, ఏకాదశరుద్రులలో శంకరుఁడు నేననియు, అశ్వినీ దేవతలు నేననియు, సప్తమరుత్తులలో మరీచియనువాఁడు నేననియు చెప్పియుంటిని గదా ? (చూ. 10. 21, 23). అట్టి యాదిత్యులు-వసువులు-రుద్రులు-అశ్వినులు-మరుత్తులు—అందఱును, నాస్వరూపులే ఆయ్యున్నారు. అయితే, వారివారిలో ముఖ్యులగు నొకొక్కని మాత్రము చెప్పియుంటిని. కాన నిపుడు నేనీకుఁజూపఁ బోయెడు విశ్వరూపములో, అట్టి యాదిత్యులను-వసువులను-రుద్రులను-అశ్వినులను-మరుత్తులను అందఱినిఁ జూచుటయేగాక, మఱియు నీవిదివఱకెప్పుడును విని కని యెఱుఁగని యనేకములగు నద్భుతములనుగూడఁ జూడఁగలవు.

శ్లో॥ ఇహైకస్థం జగ త్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ ! య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి ॥ 7

అర్థము :— హేగుడాకేశ !=ఓయర్జునా !, సచరాచరమ్=చరాచరాత్మకమైన, కృత్స్నమ్ + జగత్ = ప్రపంచము, అన్యత్ + యత్ =మఱియుదేనిని, ద్రష్టుమ్ + ఇచ్ఛసి=చూడఁగోరుచున్నావో, (తత్) + చ=దానినిగూడ, ఇహ=ఈ (ఇపుడు నేఁజూపబోయెడు), మమ + దేహే = నావిశ్వరూపమునందు, అద్య = ఇప్పుడు, ఏకస్థమ్=ఒక్కచో నున్నదానినిగా, పశ్య=చూడుము.

ఓయియర్జునా! ఇట్లువీరు వారని నిర్దేశించి చెప్పనేల ? ఈ ప్రపంచమునందలి పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్త జరాయుజ- అండజ- స్వేదజాది జంగమంబులును, సమస్తస్థావరంబులును, అనఁగా, చరాచరాత్మకమగు నీప్రపంచమంతయు నాకుక్షియందేయుంచున్నదిగాన వానినన్నిటినిని, ఇంకను నీవుచూడఁగోరెడు మఱియేదైన నున్నయెడల వానినిగూడ నిపుడు నేనీకుఁ జూపఁబోయెడు నా విశ్వరూపమునందొక్కచోటునఁ జూడఁగలవు.

శ్లో॥ నతు మాం శక్యసే ద్రష్టు మనే నైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్ ॥ 8

అర్థము :—అనేన + చక్షుషా ఏవ=ఈమాంసచక్షువులతో. మామ్ + ద్రష్టుమ్= నన్నుఁ జూచుటకు, న + శక్యసే=శక్తుఁడవు కానేరవు, (కిన్) + తు=మరియున్ననో, దివ్యమ్ + చక్షుః = దివ్యదృష్టిని, తే + దదామి = నీకునిచ్చుచున్నాను. మే + యోగమ్ + ఐశ్వరమ్=నాయోగమహిమను, పశ్య=చూడుము.

అయితే :

"క. వినుమానుషచక్షుర్గతిఁ
కనుఁగొనశక్యంబుగాదు– గావునదానిం
గనుటకయి దివ్యచక్షు
ర్జననంబొనరింతునీకు– శత్రువిదారీ ॥" (భార. భీ. ౧. ౨౧౦)

యిపుడు నీకుఁగలిగియుండునవి ప్రాకృతము లగు మాంస చక్షువులుఁ గనుక నా చక్షువులతో నప్రాకృతమును దివ్యము నగు నావిశ్వరూపమును జూచుటకు సాధ్యపడదు. కాన నే నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. దానితోఁ జూచితివేని నా యోగమహిమ యెట్టిదైనదియుఁ గనుఁగొనఁగలవు.

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥ 9

అర్థము :— హేరాజన్ = ఓధృతరాష్ట్రమహారాజా!, మహాయోగేశ్వరః= మహాయోగమహిమగల, హరిః=శ్రీకృష్ణమూర్తి, ఏవమ్ + ఉక్త్వా=ఇట్లుచెప్పి, తతః = పిమ్మట, పరమ్ + ఐశ్వరమ్ + రూపమ్ = శ్రేష్ఠమగు విశ్వరూపమును, పార్థాయ=అర్జునునికొఱకు, దర్శయామాస=చూపెను.

సంజయుఁడు — అయ్యా! ధృతరాష్ట్రమహారాజా! మహామహిమగల యా కృష్ణమూర్తి, ఇట్లు (పైశ్లోకమునఁ జెప్పఁబడినప్రకారము) చెప్పి, అటుపిమ్మట సర్వోత్కృష్టమైనదియు, మహామహిమగలదియునగు తనవిశ్వరూపమును అర్జుననకుఁ జూపెను.

శ్లో॥ అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్ ।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10

అర్థము:— అనేకవక్త్రనయనమ్ = అనేక ముఖములును, నేత్రములును గలదిగను, అనేకాద్భుతదర్శనమ్ = అనేకములగువింతలఁ జూపునదిగను, అనేకదివ్యాభరణమ్ = అనేకదివ్యాభరణములచే నలంకరింపఁ బడినదిగను, దివ్యానేకోద్యతాయుధమ్ = అనేకదివ్యాయుధములను ధరించినదిగను, (ఉండెను).

అప్పుడా విశ్వరూపము, అనేక ముఖములతోడను, అనేక నేత్రములతోడను, అద్భుతము లగు ననేక చమత్కారములతోడను, గూడుకొని యుండుటయ గాక యనేక విధములగు దివ్యాభరణములచే నలంకరింపఁబడి శృంగారముగను, అనేక విధము లగు నాయుధములఁ బూని మిగుల భయంకరముగను ఉండెను.

శ్లో॥ దివ్యమాలామ్బరధరమ్ దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥ 11

అర్థము :— దివ్యమాల్యామ్బరధరమ్=దివ్యములగు పుష్పమాలికలను వస్త్రములను ధరించినదియును, దివ్యగన్ధానులేపనమ్=సుగంధ యుక్తమగు శ్రీచందన పూతగలదియును, సర్వాశ్చర్యకరమ్=మిక్కిలి యాశ్చర్యకరమైనదియు, దేవమ్=కాంతి యుక్తమైనదియు, అనన్తమ్=అంతము లేనిదియు, విశ్వతోముఖమ్=అంతట ముఖములు గలదియు (నై యుండెను).

మఱియు నావిశ్వరూపము దివ్యములగు పుష్పమాలికలతో నలంకరింపఁబడి, దివ్యపరిమళగంధ లేపనము గలిగి, మిక్కిలి కాంతియుక్తమైనదిగను, అనేక విధము లగు నాశ్చర్య వస్తువులఁ జూపట్టుచు, అన్నిదిక్కుల ముఖములు గలిగి యంతట వ్యాపించినదై అంతములేక యుండెను.

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా ।
యది భా స్సదృశీసా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥ 12

అర్థము :— దివి=ఆకాశమునందు, యుగపత్=ఒక్కమాటుగా, సూర్యసహస్రస్య + భాః=వేయిసూర్యుల కాంతి, ఉద్యతా + భవేత్ + యది=బైలుదేరిన యెడల, సా = ఆ కాంతి, తస్య + మహాత్మనః + భాసః = ఆమహాత్ముని కాంతికి, సదృశీ + స్యాత్ =సమానమగును.

అయ్యా! ధృతరాష్ట్ర మహారాజా! ఆ విశ్వరూపముయొక్క కాంతి యెట్లుండెననఁగా, వేయిసూర్యు లొక్కమాటున నాకాశమున నుదయించినయెడల నాసూర్యులందఱి యొక్క కాంతు లొక్కటిగాఁ జేరిన యెడల నెంతప్రకాశము

గలదిగానుండునో, అంతప్రకాశముగలదిగా నుండెను. అనఁగా నారూపమును జూచు వారల కన్నులఁ మిఱుమిట్లు గొనుచుండెను.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా ॥ 13

అర్థము :— తదా=అప్పుడు, పాణ్డవః=అర్జునుఁడు, దేవదేవస్య=దేవదేవుఁడగు కృష్ణమూర్తియొక్క, తత్ర+శరీరే=ఆవిశ్వరూపమునందు, అనేకధా=నానావిధము లుగ, ప్రవిభక్తమ్=విభజింపఁ బడియుండెడు, కృత్స్నమ్+జగత్=సమస్తప్రపంచము, ఏకస్థమ్=ఒక్కచోటనున్న దానిఁగా, అపశ్యత్=చూచెను.

అట్లు దేవదేవుఁడగు శ్రీకృష్ణమూర్తి కనుపఱచిన యావిశ్వరూపమునందు, అర్జునుఁ డప్పుడు నానావిధ చరాచరాత్మకమగు ప్రపంచమంతయు నొక్కచోటునఁ జూచెను. అనఁగా, దేవతలు, రాక్షసులు, మనుష్యులు, పశువులు, పక్షులు, మృగములు, మఱియు క్రిమికీటకాద్యనేక జీవజంతువులును, పర్వతములు మొదలగు స్థావరములును, వీని నన్నిటి నొక్కచోటుగాఁ జూచినవాఁడాయెను.

శ్లో॥ తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత ॥ 14

అర్థము :— తతః=పిమ్మట, సః+ధనఞ్జయః=ఆయర్జునుఁడు, విస్మయావిష్టః = విస్మయముతోఁగూడిన వాఁడగుచు, హృష్టరోమా=పులకాంకితదేహుఁడై, దేవమ్=దేవుఁడగు శ్రీకృష్ణమూర్తిని, శిరసా+ప్రణమ్య=సాష్టాంగముగా నమస్కరించి, కృతాఞ్జలిః+(సన్)=అంజలిబద్ధుఁడై, అభాషత=(ఇట్లు) పలికెను.

ఓయీ ధృతరాష్ట్రమహారాజా! అట్లర్జునుఁ డత్యద్భుతమగు నావిశ్వరూపమును సందర్శించిన వెంటనే, మిగుల నాశ్చర్యము నొందినవాఁడును, పులకాంకిత శరీరుండునునై దేవదేవుఁడగు నావిశ్వరూపునకు సాష్టాంగనమస్కార మొనరించి లేచి నిలచి ముకుళిత కరకమలుండై యిట్లు నుతింపసాగెను.

అర్జున ఉవాచ :

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాం స్తథా
భూతవిశేషసఙ్ఘాన్ ।
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వా
నురగాంశ్చ దివ్యాన్ ॥ 15

అర్థము :— హేదేవ! = ఓస్వామీ!, సర్వాన్ + దేవాన్ = సమస్తదేవతలను, కమలాసనస్థమ్ = కమలాసనుఁడును, ఈశమ్ = సృష్టికర్తయునగు, బ్రహ్మాణమ్ = బ్రహ్మను, సర్వాన్ + ఋషీన్ = సమస్తఋషులను, దివ్యాన్ + ఉరగాన్ + చ = దివ్యములగు సర్పములను, తథా = అలాగుననే, భూతవిశేషసఙ్ఘాన్ + చ = అనేకవిధములగు ప్రాణికోట్లను, తవ + దేహే = నీదేహమునందు, పశ్యామి = చూచుచున్నాను.

అర్జునుఁడు :— ఓస్వామీ! ఇపుడు నీవు ధరించియుండెడు మహోత్కృష్టమగు నీవిశ్వరూపమునం దొకవైపున జగత్సృష్టికర్తయును కమలాసనుఁడును నగు చతుర్ముఖబ్రహ్మయు, మఱియొకవైపున నింద్రాది సమస్తదేవతలును, ఇంకొకచోట భృగ్వాది సమస్తఋషులును, వేఱొక్కయెడ నాదిశేషువు వాసుకి మొదలగు దివ్యసర్పములును గన్పట్టుచున్నారు. అట్లే మఱియు ననేకవిధములగు ప్రాణికోట్లును, అనఁగా, జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజములును, భూచర, ఖేచర, జలచరాదులునగు సమస్త జీవజంతువులనుగూడ నాదేహమునందే చూచుచున్నాను.

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతో౽-
నన్తరూపమ్ ।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర!
విశ్వరూప ॥ 16

అర్థము:— హేవిశ్వరూప! = విశ్వమేరూపముగాఁగలవాఁడా!, త్వామ్ = నన్ను, సర్వతః = అంతట, అనన్తబాహూదరవక్త్రనేత్రమ్ = అనేక భుజములు - ఉదరములు - ముఖములు - నేత్రములుగలవాఁడవుగను, అనన్తరూపమ్ = అనేకరూపములు గలవాఁడవుగను, పశ్యామి = చూచుచున్నాను, హేవిశ్వేశ్వర! = విశ్వమునకుఁ బ్రభువగు నోస్వామీ!, తవ = నీయొక్క, ఆదిమ్ = మొదలును, న + పశ్యామి = చూడఁజాలకున్నాను. మధ్యమ్ = మధ్యమును, న + (పశ్యామి) = చూడఁజాలకున్నాను, పునః = మఱియు, అన్తమ్ = తుదను, న + (పశ్యామి) = చూడఁజాలకున్నాను.

ఓ స్వామీ! నీవు ప్రపంచస్వరూపుఁడవుగా నున్నావు. అనఁగా, ప్రపంచమే నీదేహముగా నున్నట్లగపడుచున్నది. ఏలయనఁగా, ఏవైపునఁ జూచినను అనేక భుజములతోడను, అనేకములగు నుదరములతోడను, అనేక ముఖములతోడను, అనేక నేత్రములతోడను ప్రకాశింపుచు, అనంతరూపములు గలవాఁడవై యున్నావు. ఓ విశ్వేశ్వర! ఇట్టి నీకు మొదలేదైనదియు, నడుమేదైనదియు, తుది యేదైనదియు తెలిసికొనఁజాలకున్నాను. కాన నీవు ఆది మధ్యాంత రహితుఁడవుగా నున్నావు.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్కద్యుతి
మప్రమేయమ్॥ 17

అర్థము :— త్వామ్=నిన్ను, సమన్తాత్=అంతట, కిరీటినమ్=కిరీటముగలవానిఁగను, గదినమ్=గదాయుధముగల వానిఁగను, చక్రిణమ్+చ=చక్రాయుధము గలవానిఁగను, తేజోరాశిమ్=తేజోరాశిగను, సర్వతః+దీప్తిమన్తమ్=అంతట నిండిన దీప్తులుగలవానిగను, దీప్తానలార్కద్యుతిమ్=జ్వలించెడు సూర్యాగ్నుల కాంతి వంటి కాంతిగలవానిఁగను, దుర్నిరీక్ష్యమ్=చూడశక్యము గానివానిఁగను, అప్రమేయమ్=అప్రమేయునిగను, పశ్యామి=చూచుచున్నాను.

ఓ స్వామీ ! ఏతట్టు చూచినను, నీవు కిరీటము - చక్రము - గద - మొదలగు నాయుధములను ధరించి తేజోరాశివై, ప్రజ్వలింపుచున్న యగ్నివలెను, ప్రకాశింపుచున్న సూర్యునివలెను, విశేషకాంతియుక్తుఁడవై యున్నావు. ఇట్టి నీ తేజస్సును జూచుటకు కండ్లు మిఱుమిట్లు గొనుచున్నవి. మఱియు నీవు అప్రమేయుఁడవుగా నున్నావు. అనఁగా, ఇట్టి వాఁడవని తెలిసికొనుటకు సాధ్యపడకయున్నది. కనుక,

"సీ. దేవ నీదగు దివ్యదేహంబునందు సురాసుర గంధర్వులాదిగాఁగఁ
గల దేవయోనులుఁ గమలాసనుఁడును సచరాచరంబైన జగము నాకుఁ
దోఁచె మొగంబులు దోర్దండములును బొదములుఁ గన్నులు ననేకములు గంటి
మకుటాది భూషణనికరంబుఁ జక్ర గదాద్యాయుధములు మాల్యాంబరములుఁ

ఆ. బెక్కు గానవచ్చె నక్కజమై యిది
నడుము మొదలు తుది యనంగరాదు
తేజ మప్రమేయ దేదీప్యమాన ని
ర్వికృతిమహిమ దుర్నిరీక్ష్యమయ్యె."

(భార. భీష్మ. ౧ ఆ. ౨౧౨)

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానం।
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో
మతో మే॥ 18

అర్థము:— త్వమ్+వేదితవ్యమ్+పరమమ్+అక్షరమ్ = తెలియఁదగినపర బ్రహ్మము నీవే, త్వమ్+అస్యవిశ్వస్య+పరమమ్+నిధానమ్ = ఈ ప్రపంచమున కాధారభూతుఁడవు నీవే, త్వమ్+అవ్యయః = అవ్యయుఁడవు నీవే, శాశ్వతధర్మ

గోప్తా = శాశ్వతధర్మసంరక్షణకర్తయు నీవే, త్వమ్ + సనాతనః + పురుషః = సనాతనపురుషుఁడవు నీవే, (ఇతి) మే + మతః = అని నాయభిప్రాయము.

ఓస్వామీ! సకలవేదపురాణశాస్త్రములచేతను, గురూపదేశముచేతను దెలిసికొనఁదగిన పరబ్రహ్మము నీవే యనియు. ఈ ప్రపంచమునకు సృష్టిస్థితిలయకర్తయును, ముఖ్య ఆధారభూతుఁడవును నీవేయనియు, ఈచరాచర ప్రపంచమంతయు నశించినను దానితోపాటు నశింపక యెప్పటికిని శాశ్వతముగనుండు వాఁడును, అట్టి యీప్రపంచము యొక్క యుత్పత్తి స్థితి లయములను మరల మరల జరుపుచుండుట యనెడు శాశ్వతధర్మమును విడువక జరుపుచుండెడువాఁడును నీవేయనియును సనాతనుఁడెగు పరమపురుషుఁడు నీవేయనియును నాకిపుడు దోఁచుచున్నది.

శ్లో॥ అనాదిమధ్యాన్తమనన్తవీర్యమనన్తబాహుంశశిసూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్॥ 19

అర్థము:— త్వామ్=నిన్ను, అనాదిమధ్యాన్తమ్ = ఆదిమధ్యాంతరహితునిగను, అనన్తవీర్యమ్=అమితశౌర్యము గలవానిఁగను, అనన్తబాహుమ్=అనేకభుజములుగలవానిఁగను, శశిసూర్యనేత్రమ్ = చంద్రసూర్యులే నేత్రములుగాఁగలవానిఁగను, దీప్తహుతాశవక్త్రమ్ = అగ్నివలె జ్వలించెడు ముఖముగలవానిఁగను, స్వతేజసా = నీతేజస్సుచేత, ఇదమ్ + విశ్వమ్ = ఈప్రపంచమును, తపన్తమ్ = తపింపఁజేయుచున్నవానిఁగను, పశ్యామి = చూచుచున్నాను.

ఓ స్వామీ! నిరూపమును జూఁడఁజూడ నిది యాది యనియును, ఇది మధ్యమనియును, ఇది యంతమనియును దెలిసికొనఁ జాలకున్నాను. అహా యేమి నీసామర్థ్యము! ఈప్రపంచమున కంతటికిని వెలుతురునిచ్చెడు చంద్రసూర్యులే నీయొక్క రెండునేత్రములుగా నున్నట్లగపడుచున్నారు. నీబాహువులన్ననో, ఇన్ని యన్ని యని లెక్కింప నలవిగాక యున్నవి. నీయొక్క ముఖకాంతులన్ననో అగ్నిజ్వాలలవలెఁ బ్రకాశింపుచున్నవి. నీతేజస్సు దుర్భరమై యీలోకము నంతటినిఁ దపింపఁజేయుచున్నది.

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మన్తరం హి వ్యాప్తం త్వయై కేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వాఽ ద్భుతం రూప ముగ్రం త వేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్!॥ 20

అర్థము:— హే మహాత్మన్ ! = మహాత్ముఁడవగు నోస్వామీ !, ద్యావాపృథివ్యోః + ఇదమ్ + అన్తరమ్ = భూమ్యాకాశముల మధ్యప్రదేశమంతయు, ఏకేన + త్వయా = నీయొక్కని చేతనే, వ్యాప్తమ్ + హి = వ్యాపింపఁబడియున్నదిగదా, సర్వాః + దిశః చ = సమస్తదిక్కులును, (త్వయా) + వ్యాప్తాః + హి = నీచేవ్యాపింపఁబడియున్నవిగదా ?, తవ = నీయొక్క, ఉగ్రమ్ = భయంకరమైనదియు, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు నగు. ఇదమ్ + రూపమ్ = ఈరూపమును, దృష్ట్వా = చూచి, లోకత్రయమ్ = ముల్లోకమును, ప్రవ్యథితమ్ = మిక్కిలి వ్యథను బెందినది.

ఓమహాత్మా ! భూమ్యాకాశములును, ఈరెంటి నడుమనుండు నంతరిక్షమును, సమస్త దిక్కులును, నీయొక్కని చేతనే వ్యాపింపఁబడియున్నవి. అనఁగా, భూమియందును, ఆకాశమునందును, ఈరెంటిమధ్యప్రదేశమగు నంతరిక్షము నందును, మఱియు నేదిక్కునఁ జూచినను నీస్వరూపమే కనఁబడుచున్నది. ఇట్టి యాశ్చర్య భయోత్పాదకము లగు నీరూపమునుజూచి ముల్లోకముల వారును మిగుల భయపడుచున్నారు.

శ్లో॥ అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి ।
స్వస్తీ త్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ 21

అర్థము:— అమీ + సురసఙ్ఘాః = ఈదేవతాసమూహములు, త్వామ్ + విశన్తి + హి = నిన్నుఁబ్రవేశించుచున్నవిగదా ?. కేచిత్ + భీతాః + (సన్తః) = కొందఱు భీతులై, ప్రాఞ్జలయః + గృణన్తి = అంజలిబద్ధులై ప్రార్థించుచున్నారు. మహర్షిసిద్ధసఙ్ఘాః = మహర్షిసిద్ధసమూహములు, స్వస్తి + ఇతి + ఉక్త్వా = స్వస్తియని చెప్పుచు, త్వామ్ = నిన్ను, పుష్కలాభిః + స్తుతిభిః = అనేక స్తవములచేత, స్తువన్తి = స్తోత్రము చేయుచున్నారు.

ఇదిగో! ఇచట నొకవైపునఁ గొందఱు దేవతలు గుంపులు గుంపులుగా నీవిశ్వరూపములోఁ బ్రవేశించుచున్నారు. అచటఁ (మఱియొకవైపున) గొందఱు భయభ్రాంతులై హస్తములు జోడించుకొని రక్షించుమని వేడుకొనుచున్నారు. మఱియొకచోట మహర్షులును సిద్ధులును గుంపులు గుంపులుగఁ గూడి స్వస్తివాచకముల బలుకుచు, నీయనంతకల్యాణగుణముల ననేకవిధములుగ వర్ణించుచు స్తోత్రము చేయుచున్నారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥ 22

అర్థము:— రుద్రాదిత్యాః = రుద్రులును ఆదిత్యులును, వసవః = వసువులును, సాధ్యాః + చ = సాధ్యులును, యే = ఎవరో, (తే) = వారును, విశ్వే = విశ్వే దేవతలును, అశ్వినౌ = అశ్వినీదేవతలును. మరుతః + చ = మరుత్తులును, ఉష్మపాః + చ = పితృదేవతలును, గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘాః + చ = గంధర్వులయొక్కయు, యక్షులయొక్కయు, అసురులయొక్కయు, సిద్ధులయొక్కయు సమూహములును, సర్వే + ఏవ = వీరందఱును, విస్మితాః = విస్మితులగుచు, త్వామ్ + వీక్షన్తే = నిన్ను జూచుచున్నారు.

ఇదిగాక, అజుఁడు మొదలగు నేకాదశరుద్రులును, ఇంద్రాదిద్వాదశాదిత్యులును, అపుఁడు మొదలగు నష్టవసువులును, పన్నిద్దరు గణదేవతలగు సాధ్యులును, విశ్వేదేవతలు పదుగురును, అశ్వినీదేవతలును, ఆవహుఁడు మొదలగు సప్తమరుత్తులును, అర్యముఁడు మొదలగు పితృదేవతలును, మఱియు, గంధర్వులయొక్కయు, యక్షుల యొక్కయు, రాక్షసులయొక్కయు, సిద్ధులయొక్కయు సమూహములును, పైఁ జెప్పఁబడిన వీరందఱును, ఆశ్చర్యయుక్తమానసులై నిన్నిట్టిట్టని వర్ణింపఁ జాలక నిశ్చేష్టితులై యూరక చూచుచున్నారు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో! బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాళం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్॥ 23

అర్థము:— హే మహాబాహో! = ఓస్వామీ!, తే = నీయొక్క, బహువక్త్రనేత్రమ్ = అనేకముఖములు నేత్రములు గలదియు, బహుబాహూరుపాదమ్ = అనేకచేతులు, తొడలు పాదములు గలదియు, బహూదరమ్ = అనేకకడుపులు గలదియు, బహుదంష్ట్రాకరాళమ్ = భయంకరములగు ననేక కోరలుగలదియునగు, మహత్ + రూపమ్ = గొప్పరూపమును, దృష్ట్వా = చూచి, లోకాః = లోకులు, ప్రవ్యథితాః = మిగులభయపడుచున్నారు, తథా = అలాగుననే, అహమ్ = నేనును (భయపడుచున్నాను.)

అజానుబాహుఁడవగు నోస్వామీ ! అనేకముఖములును, అనేక నేత్రములును, అనేక బాహువులును, అనేకతొడలును, అనేక పాదములును, అనేక కడుపులును, అనేక కోరలును గలిగి మిగుల భయంకరముగానుండునట్టి యీ నీ మహత్తరమైన విశ్వరూపమును జూచి లోకులందఱును మిగుల భయభ్రాంతులై గడగడ వణకుచున్నారు. అట్లే నాకును నీమహద్రూపమును జూచుటకు మిగుల భయంకరముగా నున్నది.

శ్లో॥ నభస్స్పృశం దీప్త మనేకవర్ణం వ్యాత్తాననం దీప్త విశాల నేత్రమ్ ।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో ! ॥ 24

అర్థము:— హేవిష్ణో! = ఓవిష్ణుమూర్తీ!, నభస్స్పృశమ్ = నక్షత్రమండలమును దాకుచున్నవాఁడవును, దీప్తమ్ = ప్రకాశించుచున్నవాఁడవును, అనేకవర్ణమ్ = అనేక వర్ణములు గలవాఁడవును, వ్యాత్తాననమ్ = తెఱువఁబడిన నోరుగలవాఁడవును, దీప్తవిశాలనేత్రమ్ = జ్వలించుచున్న గొప్ప నేత్రములుగలవాఁడవును (అగు), త్వామ్ + దృష్ట్వా = నిన్నుఁ జూచి, ప్రవ్యథితాన్తరాత్మా = దిగులు జెందిన మనస్సుగలవాఁడనై, ధృతిమ్ + శమమ్ + చ = ధైర్యమును శమమును, న + విన్దామి + హి = పొందకున్నానుగదా.

ఓ స్వామీ ! నీస్వరూపము భూమినుండి యాకాశమువఱకును వ్యాపించియుండుటయేగాక మిగుల దీప్తికలదిగను, అనేకరంగులు గలదిగను నున్నది. మఱియు, తెఱువఁబడియుండు నోరును, ప్రజ్వలించుచుండెడు గొప్పనేత్రములుగలిగి మిగుల భయంకరముగ నున్నది. ఇట్టి భయంకరస్వరూపుఁడవగు నిన్నుఁ జూచి నేను మిగుల భయము నొందినవాఁడనై ధైర్యస్థైర్యములు లేకయున్నాను.

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస!॥ 25

అర్థము :— హేదేవేశ = ఓదేవదేవా, తే = నీయొక్క, దంష్ట్రాకరాళాని = కోరలచే భయంకరమైనవియు, కాలానలసన్నిభాని = ప్రళయాగ్నినిబోలియున్నవియునగు, ముఖాని + చ = ముఖములనుగూడ, దృష్ట్వా = చూచి, దిశః + నజానే =

దిగ్భ్రమఁజెందియున్నాను, శర్మచ + నైవలభే = సుఖమును జెందకున్నాను, (తస్మాత్) = కాఁబట్టి, హేజగన్నివాస! = ఓజగన్నాయకా, ప్రసీద=ప్రసన్నుఁడ వగుము.

ఓ దేవాధిదేవా! ఇఁకను నీ వదనములను జూచినచో, మిగులభయంకరము లగు ననేకకోరలుగలిగి ప్రళయకాలమున నంతటిని దహించు నగ్నివలె నిప్పులు గ్రక్కుచున్నవి. ఇట్టి భయంకరములగు నీ ముఖములఁ జూచినంత మాత్రముచేతనే, నేను దిక్కుదోచక దిగులుఁజెందిన వాఁడనై మిగులఁ గష్టపడుచున్నాను. కనుక నో జగన్నివాసా! శాంతాకారమగు మునుపటి నీ దివ్యమంగళ విగ్రహ స్వరూపమును ధరించి నాదిగులుమాన్పి యనుగ్రహింపుము.

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా స్సర్వే
సహైవావనిపాలసఙ్ఘైః।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ సహాస్మదీయై రపి
యోధముఖ్యైః॥ 26

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాళాని
భయానకాని।
కేచి ద్విలగ్నా దశనాన్తరేషు సన్దృశ్యన్తే చూర్ణితై
రుత్తమాఙ్గైః॥ 27

అర్థము :— అమీ + ధృతరాష్ట్రస్యపుత్రాః + సర్వే = ఈధృతరాష్ట్రపుత్రు లందఱును, అవనిపాలసఙ్ఘైః + సహ + ఏవ = (ఇతర) రాజుల సమూహములతోఁ గూడ, తథా = అలాగుననే, అసౌ + భీష్మః = ఈభీష్ముఁడును, ద్రోణః = ద్రోణుఁడును, సూతపుత్రః + చ = కర్ణుఁడును, యోధముఖ్యైః = యోధవీరులగు, అస్మదీయైః + అపి + సహ = నావారలతోఁగూడను, త్వామ్ + త్వరమాణాః + (సన్తః) = నిన్నుగూర్చి త్వరపడుచున్న వారగుచు, తే = నీయొక్క, దంష్ట్రాకరాళాని + భయానకాని = కోరలచే మిగుల భయంకరములుగా నుండెడు, వక్త్రాణి = ముఖములను (నోళ్ళయందు), విశన్తి = చొచ్చుచున్నారు, దశనాన్తరేషు = పండ్ల సందులయందు, విలగ్నాః = తగులుకొన్నవారై, కేచిత్ = కొందఱు, చూర్ణితైః + ఉత్తమాఙ్గైః = నలిగి పోయిన శిరస్సులతో, సన్దృశ్యన్తే = కనఁబడుచున్నారు.

ఓ స్వామీ! ఇదిగో; ఇచట నాయెదుటనున్న ధృతరాష్ట్రపుత్రులందఱును, వారికి యుద్ధమునందు సహాయభూతులుగా వచ్చియుండెడు నితరరాజులతోఁగూడ, పెద్దకోరలతో మిగుల భయంకరములుగా నుండెడు నీవదన గహ్వరములయందు వడి వడిగా వచ్చి ప్రవేశించుచున్నారు. వారలే కాదుసుమా, ఈకౌరవ సైన్యమునకు నాయకుఁడును - యుద్ధవిశారదుఁడును - మాకందఱకును పితామహుఁడునగు భీష్ముఁడును, మాకందఱకు ధనురాచార్యుఁడగు ద్రోణుఁడును, దుర్యోధనుఁడెవని భుజబలమునందు ముఖ్యముగ నమ్మకముంచి యీయుద్ధమునకుఁ బూనుకొనెనో, అట్టి కర్ణుఁడునుగూడ వారలతోపాటు నీవదన గహ్వరములయందుఁ బ్రవేశించుచున్నారు. మఱియు, నాసైన్యము నందలివారిలోఁగూడ యుద్ధవిశారదులుగా నుండెడు ననేకులు నట్లే నీ వదన గహ్వరములయందుఁ బ్రవేశించుచున్నారు. అట్లు ప్రవేశించుచుండెడు వారిలోఁ గొందఱు భయంకరములగు నీదంతముల సందులలో నిఱికికొని యాదంత సంఘట్టనలచే నజ్జు నజ్జుగాఁ జేయఁబడిన శిరస్సులు గలవారలై మిగుల ఘోరములగు రూపములతోఁ గన్పట్టుచున్నారు.

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్ర మేవాభి

ముఖా ద్రవన్తి।

తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥ 28

అర్థము:- నదీనామ్ + బహవః + అమ్బువేగాః = అనేకనదుల ప్రవాహములు, యథా = ఏప్రకారముగా, సముద్రమ్ + ఏవ + అభిముఖాః = సముద్రాభిముఖము లయ్యే, ద్రవన్తి = పాఱుచున్నవో, తథా = అప్రకారముగనే, అమీ + నరలోక వీరాః = ఈరాజులందఱు, తవ = నీయొక్క, అభిజ్వలన్తి + వక్త్రాణి = జ్వలించుచున్న వదనములను, విశన్తి = చొచ్చుచున్నారు.

ఓస్వామీ! వీరలిట్లు ప్రవేశించుటఁ జూడఁగా నెట్లున్నదనఁగా, ఈప్రపంచమునందుఁగల నదులలో నేనదియొక్కడఁ బట్టినదైనను సరె ఏయే ముఖముగ నెన్ని వంకలుగఁ బాఱుచుండునదియైనను సరే, అట్టి యన్నినదులయొక్క ప్రవాహములును తుదకు సముద్రోన్ముఖములై యాసముద్రమున నెట్లు ప్రవేశించుచున్నవో, అట్లే యీ యుభయసైన్యములలోని రాజులు నీవైపున వడివడిగఁ బాఱి నిప్పులఁగ్రక్కుచుండెడు నీవదన గహ్వరములయందుఁ బ్రవేశించుచున్నారు.

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగాః।

తథైవ నాశాయ విశన్తిలోకా స్తవాపివక్త్రాణిసమృద్ధవేగాః॥ 29

అర్థము:— పతఙ్గాః = మిడుతలు, నాశాయ = నశించుటకొఱకు, సమృద్ధవేగాః = అతివేగముగలవై, ప్రదీప్తమ్ + జ్వలనమ్ = మండుచున్నయగ్నిని, యథా + విశన్తి = ఎట్లు ప్రవేశించుచున్నవో, తథా + ఏవ = ఆవిధముగానే, లోకాః + అపి = (ఈ) జనులగూడ, నాశాయ = నశించుటకొఱకు, సమృద్ధవేగాః = అతివేగముగలవారై, తవ + వక్త్రాణి = నీవదనములను, విశన్తి = ప్రవేశించుచున్నారు.

మఱియు నీ జనులిట్లతివేగముగ వచ్చి జ్వలించుచుండెడు నీవదన గహ్వరముల యందుఁ బ్రవేశించుట యెట్లున్నదనఁగా మిడుతలు ప్రజ్వలించుచుండెడు నగ్నింజూచి భ్రమిసి యతివేగముగ వచ్చి యాయగ్నిలోఁబడి నశించుట ననుకరించుచున్నది.

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానస్సమన్తాల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః।
తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥ 30

అర్థము:— హేవిష్ణో! = ఓవిష్ణుమూర్తీ!, సమన్తాత్ = అంతటను (అన్నివైపులనుండెడు), లోకాన్ + సమగ్రాన్ = (ఈ) జనుల నందఱిని, జ్వలద్భిః = జ్వలించుచున్న, వదనైః = వదనములచేత, గ్రసమానః = భక్షించుచున్నవాఁడవై, లేలిహ్యసే = రుచిఁజూచుచున్నావు, తవ = నీయొక్క, ఉగ్రాః + భాసః = ఉగ్రములగు కిరణములు, తేజోభిః = దీప్తులచేత, జగత్ + సమగ్రమ్ = ప్రపంచమంతటను, ఆపూర్య = నిండి (వ్యాపించి), ప్రతపన్తి = తపింపఁజేయుచున్నవి.

దీనింజూడ నెట్లున్నదనఁగా నొకఁడనేక విధములగు మాంసఖండములను దన చుట్టునుంచికొని యందేదే మాంస మెట్టిరుచి గలదియోయని వాని యందొక్కొక దానిని నమలుచు, చప్పరింపుచు, రుచిఁజూచురీతిగా నీవు నలుప్రక్కలనుండెడు జనుల నందఱిని నీనాలుకలతో నీవదనగహ్వరములలోని కీడ్చుకొని భయంకరములగు నీకోరలతో నమలుచు రుచిజూచుచున్నట్లగపడుచున్నది. సర్వవ్యాపివగు నోమహాత్మా! ఇట్టి భయంకరములగు నీముఖజ్వాలలు జగత్తంతటఁబరవి లోకులను దపింపఁజేయుచున్నవి.

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తు తే దేవవర! ప్రసీద।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ 31

అర్థము:— హేదేవవర! = ఓదేవదేవా!, ఉగ్రరూపః + భవాన్ = ఉగ్రరూపుఁడవగునీవు, కః = ఎవఁడవో, మే + ఆఖ్యాహి = నాకుఁజెప్పుము. హి =

ఏలయనఁగా, తవ+ప్రవృత్తిమ్ = నీవ్యాపారమును, న+ప్రజానామి = ఎఱుఁగకున్నాను. (తస్మాత్) = కనుక, ఆద్యమ్+భవన్తమ్ = ఆదిపురుషుఁడవగు నిన్ను, విజ్ఞాతుమ్+ఇచ్ఛామి = తెలియఁగోరుచున్నాను, తే= నీకు, నమః+అస్తు = వందనమగుగాక (నమస్కరింపుచున్నాను), ప్రసీద = అనుగ్రహింపుము.

కనుక నో దేవదేవా!

"మ. అనలజ్వాలలు పర్వ నీముఖములం దాధార్తరాష్ట్రవ్రజం
బును భీష్మాదులు నిర్దిసంగఁగు నీ భూపాలలోకంబుగ్ర
క్కునఁనొక్కుమ్మడివచ్చి చొచ్చెదరు నాకుంజెప్పవే యెవ్వరో
యని శకించెద నిన్ను భూరికరుణాయత్తైకచిత్తుండ వై."
(భార. భీష్మ. ౧అ. ౨౧౫.)

ఈజగత్తునకంతటికిని యాదిపురుషుఁడవును, సృష్టికర్తయునగు నీవిప్పుడిట్టి భయంకరాకారమును దాల్చుటకేమి కారణమైనదియు, ఏమిపని చేయఁబూని యిప్పుడిట్టి ఘోరరూపుఁడవైనదియు నెఱుఁగఁజాలకున్నాను. కాఁబట్టి నీవెవరైనదియు ఈధార్తరాష్ట్రాదులిట్లేల నీవదనములయందుఁ బ్రవేశించుచున్నారో యదియునెఱుంగఁగోరి నీకు నమస్కరించి యడుగుచున్నాను. నాయెడల ననుగ్రహించి చెప్పుము.

శ్రీభగవా నువాచ:

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 32

అర్థము:— అహమ్=నేను, లోకక్షయకృత్=జననాశమును జేయువాఁడనై, ప్రవృద్ధః=ప్రజలినట్టి, కాలః+అస్మి=కాలుఁడనైయున్నాను, ఇహ=ఇచ్చట (ఈ యుద్ధభూమియందుఁ జేరియున్న), లోకాన్=జనులను, సమాహర్తుమ్=సంహరించుటకొఱకు, ప్రవృత్తః=ఉద్యోగించినవాఁడను, ప్రత్యనీకేషు=ఎదిరిసైన్యములయందు, యే+యోధాః=ఏయోధులు, అవస్థితాః=ఉన్నారో, (తే)+సర్వే=వారందఱు, త్వాం+ఋతే+అపి=నిన్ను విడిచియు (నీచే విడువఁబడియు), న+భవిష్యన్తి=జీవింపఁబోరు.

కృ — ఓయియర్జునా! నే నీలోకమునకు సృష్టిస్థితిలయ కర్తనని యిదివఱకే నీకుఁజెప్పియుంటినిగదా? అఁదు మూఁడవదియగు లోకక్షయమును జేయఁబూనిన

వాఁడనై యందుకుఁ దగిన ట్లిపుడు నీవు చూచుచున్నట్టి భయంకరాకారమును వహించి విజృంభించియున్నాఁడను. కనుక నన్నిపుడు క్షయకరుండగు కాలునిగా నెఱుంగుము. ఇపుడిట్టి స్వరూపమును దాల్చుటకుఁ గారణమేమనఁగా, ఇపుడీయుభయపక్షముల యందుఁ జేరియుండు జనులను సంహరించుటకు నుద్యోగించినవాఁడనై, యిట్టి రూపమును ధరించినాఁడను. నీ ప్రతిపక్ష సైన్యమునందలి భీష్మ ద్రోణాది యోధవరులను నీవు చంపవలసినవాఁడవై యున్నట్లెంచి వారల నెట్లు వధింతునని వ్యసనపడుచుంటివిగదా? ఇదిగో చూడు ఇపుడు వారందఱును నాచే సంహరింపఁ బడఁబోవుచున్నారు. అందుకైయే నేనీరూపమును దాల్చియున్నాను. కాన నోయి యర్జునా! నీవు వారలతో యుద్ధము సేయుట మానినను వారలు జీవింపఁబోరు.

శ్లో॥ తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూ
న్భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ
సవ్యసాచిన్ ॥ 33

అర్థము :— ఏతే=వీరలు, పూర్వమ్+ఏవ= ఇదివఱకే, మయా+ఏవ= నాచేతనే, నిహతాః=చంపఁబడిరి, తస్మాత్= కాఁబట్టి, హేసవ్యసాచిన్=ఓయి యర్జునా!, త్వమ్ = నీవు, నిమిత్తమాత్రమ్ = నిమిత్తమాత్రము, భవ = అగుము, శత్రూన్+జిత్వా=శత్రులజయించి, యశః+లభస్వ=యశస్సునొందుము, సమృద్ధమ్ + రాజ్యమ్ = నిష్కంటకమైన రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము, ఉత్తిష్ఠ=(యుద్ధమునకు) లెమ్ము.

. ఏల యనఁగా, ఈ యోధవరులందఱును భయంకరములగు నావదన గహ్వరములయందుఁ బ్రవేశించుటయును, అందుఁ గొందఱు నా కోరలలోఁజిక్కువడి నలుగుటయును, నీవే చూచియున్నావుగదా? (చూ. 11-26-27-29). కనుక వీరలిదివఱకే నాచేతనే హతులై యున్నారు. అనఁగా, హతముగావలసినవారుగ నిర్ణయింపఁబడియున్నారు. అయితే, ఇట్టివిషయములో నిన్నేల యుద్ధమునకుఁ బురికొల్పుచున్నాననఁగాఁ, "నిందలేక బొందిపోదు" అనెడు లోకోక్తిప్రకారము ప్రతివాని మరణమునకు నేదేనియొక ప్రత్యక్షకారణ ముండవలెను గనుక నీయోధవరుల మరణమునకు నీవు నిమిత్తమాత్రముండుటకై యిట్లుచేయుచున్నాఁడను. కాన నోయి యర్జునా! నీవట్లు నిమిత్తమాత్రముంటివేని శత్రువుల జయించి యశోవంతుఁడవై నిష్కంటకమును, ధనకనకవస్తువాహనాది సమస్త భాగ్యములచే నిండినదియు నగు రాజ్యమునేలుచు సుఖించగలవుగాన యుద్ధమునకు లెమ్ము.

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34

అర్థము:— మయా + హతాన్ = నాచే హతులైన, ద్రోణమ్ + చ = ద్రోణుని, భీష్మమ్ + చ = భీష్ముని, జయద్రథం + చ = జయద్రథుని, కర్ణమ్ = కర్ణుని, తథా = అలాగుననే, అన్యాన్ + యోధవీరాన్ + అపి = తక్కిన యోధవీరులను, త్వమ్ + జహి = నీవు చంపుము. మా వ్యథిష్ఠా = భయపడకుము. రణే = యుద్ధమునందు, సపత్నాన్ = (నీ) శత్రువులను, జేతాసి = జయింపఁగలవు. (తస్మాత్) = కాఁబట్టి, యుధ్యస్వ = యుద్ధము చేయుము.

అయితే, ఒకవేళ నీవు శత్రు సైన్యమునందు నీకు ధనురాచార్యుఁడగు ద్రోణుఁడును, పితామహుఁడును బరశురాముని జయించిన బలశాలియు నగు భీష్ముఁడును, ఈశ్వరవరము నొందిన జయద్రథుఁడును సహజ కవచ కుండల మండితుండగు కర్ణుండును ఉన్నారుగదా వీరల నెట్లు జయించఁగలనని సందేహించెదవు గాఁబోలును. అట్లింతమాత్రము సందేహింపఁబనిలేదు. ఏలయనఁగా, ఈ భీష్మాదులెట్టి బలపరాక్రమశాలులైనను నాచే నిదివఱకే హతులైయున్నవారు గనుక నట్టి వారిని జంపుట నీకుఁ గష్టసాధ్యము గానేరదు. మఱెట్లనఁగా, చచ్చినవారిని జాతితోఁ గొట్టుట యెట్టిదో యట్టిదే. కాఁబట్టి వారలఁ జూచి బెదరకుము. నీశత్రువులను నీవు తప్పక జయింపఁగలవు. ఇందుకేమియు సందియములేదు. కనుక యుద్ధము చేయుము.

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35

అర్థము:— కేశవస్య = కృష్ణమూర్తియొక్క, ఏతమ్ + వచనమ్ = ఈవాక్యమును, శ్రుత్వా = విని, కిరీటీ = అర్జునుఁడు, వేపమానః = వణఁకుచున్నవాఁడును, కృతాఞ్జలిః = ముకుళితకరకమలుఁడునునై, కృష్ణమ్ = శ్రీకృష్ణుని, నమస్కృత్వా = నమస్కరించి, భీతభీతః = మిక్కిలి భయపడినవాఁడగుచు, ప్రణమ్య = నమ్రుఁడై, సగద్గదమ్ = గద్గదస్వరముతో, భూయః + ఏవ = మరల, ఆహ = (ఇట్లు) పలికెను.

సంజయుఁడు — ఓధృతరాష్ట్ర మహారాజా! విశ్వరూపధారియగు శ్రీకృష్ణమూర్తి చెప్పిన యీవాక్యములను విన్నతోడనే అర్జునుఁడు భయకంపితగాత్రుఁడై గడగడవడఁకుచు ముకుళిత కరకమలుండై శ్రీకృష్ణభగవానులకు నమస్కరించి భయసంభ్రమములతోఁ గూడినవాఁడును నమ్రుఁడునై గద్గదకంఠముతో మరలనిట్లని విన్నవించెను.

అర్జున ఉవాచ :

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః॥ 36

అర్థము:- హే హృషీకేశ! = ఓకృష్ణమూర్తీ!, తవ = నీయొక్క, ప్రకీర్త్యా = నామసంకీర్తనముచేత, జగత్ = జగత్తు, ప్రహృష్యతి = సంతోషించుచున్నది. అనురజ్యతే + చ = అనురాగము బొందుచున్నది. రక్షాంసి = రాక్షసులు, భీతాని = భయభ్రాంతులై, దిశః = నలుదిక్కులనుగూర్చి, ద్రవన్తి = పరుగిడుచున్నారు. సర్వే = సమస్తములైన, సిద్ధసఙ్ఘాః = సిద్ధసమూహములు, నమస్యన్తి + చ = నమస్కరింపుచున్నారు. (ఏతాని) = ఇవియన్నియు, స్థానే = తగియున్నవి.

అర్జు — ఓహృషీకేశా! మహాప్రభో! నీ యీ విశ్వరూపమునందనేకములగు నద్భుతములను జూచితినిగదా, అనఁగా, ఒకవైపున నీభక్తజనులందఱు నిన్ననేకవిధములుగ స్తోత్రము సేయుచు నానందపరవశులై యుండుటయు, మఱియొకవైపున క్రూరులును దురాత్ములునగు నసురులు నీరూపమును జూచి భయభ్రాంతులై నలుదిక్కులను పరుగిడుచుండుటయు, ఇంకొకవైపున సిద్ధులు సాధ్యులు మొదలగు దేవగణము లన్నియు నీకు నమస్కృతు లొనర్చుచుండుటయుఁ జూచితినిగదా? ఇవియన్నియు నీరూపమునకుఁ దగినవే యున్నవి. అవెట్లనఁగా, నీరూపము సుజనుల కానందజనకముగను, కుజనులకు భయంకరముగను సిద్ధాది దేవగణముల కభయప్రదముగను ఉండుటచే వారివారి కావిధముగఁ జేయుట యుక్తమేకదా?

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త! దేవేశ! జగన్నివాస! త్వమక్షరం సదసత్తత్పరం యత్॥ 37

అర్థము:- (హే) అనన్త! (హే) దేవేశ! (హే) జగన్నివాస! (హే) మహాత్మన్ = అనన్తమూర్తివియు, దేవదేవుఁడవును, జగదంతర్యామివియు నగునో మహా

నుభావా!, సత్ = సత్పదార్థమును, అసత్ = అసత్పదార్థమును. తత్పరం + చ = ఆరెంటికిని బరమైనదియును, యత్ = ఏదికలదో (అట్టి), అక్షరమ్ = నాశరహితమైన పరబ్రహ్మము, త్వమ్ + (ఏవ) = నీవే అయ్యున్నావు (కనుకనట్టి), బ్రహ్మణః + అపి = (సృష్టికర్తయగు) చతుర్ముఖబ్రహ్మకుఁగూడ, ఆదికర్త్రే = ఆదికారణుఁడవైనట్టియు, తే = నీకొఱకు, కస్మాత్ = ఏల, న + నమేరన్ = నమస్కరింపకుందురు ?

మఱియు నో మహానుభావా! నీవు అనంతమూర్తివియు, దేవదేవుఁడవును, జగదంతర్యామివియునై యుండుటయగాక, ఈజగత్తునందలి యసత్పదార్థములును, అనఁగా, నశించునవియునుఁ అచేతనములునగుఁ జతుర్వింశతి తత్త్వములును, సత్పదార్థంబును, అనఁగా, నాచతుర్వింశతి తత్త్వములకుఁ జైతన్యమును గలుగఁజేయునట్టిదియుఁ బంచవింశతితత్త్వంబనంబరగునట్టిదియునగు జీవాత్మయును, ఈసదసత్తులు రెంటికిని బరమైనదియు షడ్వింశతి తత్త్వంబనంబరగు నట్టిదియునగుఁ బరమాత్మయును నీవేయై యున్నావుగదా ? మఱియు నీప్రపంచమునకు సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మకుఁగూడ నీవే యాదికారణుఁడవై యున్నావుగదా? కనుక నిట్టి సర్వోత్కృష్టుఁడవును అక్షరుఁడవు నగు నీకెవరైనను సరే యేల నమస్కరింపకుందురు ?

శ్లో॥ త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వ మనన్తరూప ! ॥ 38

అర్థము :— (హే) అనన్తరూప ! = ఓఅనన్తమూర్తీ, త్వమ్ = నీవు, ఆదిదేవః = దేవతలలో మొదటివాఁడవు, పురాణః + పురుషః = పురాణపురుషుఁడవు, అస్య + విశ్వస్య = ఈప్రపంచమునకు, త్వమ్ = నీవు, పరమ్ + నిధానమ్ = పరమావధివి, వేత్తా = సమస్తము నెఱిగినవాఁడవును, వేద్యం + చ = జ్ఞానులచే నెఱుఁగఁబడఁదగినవాఁడవును, పరమ్ + ధామ + చ = పరమపదమును, త్వమేవ + అసి = నీవే అయ్యున్నావు, విశ్వమ్ = ఈప్రపంచమంతయు, త్వయా = నీచేత, తతమ్ = వ్యాపింపఁబడియున్నది.

మఱియు నీవెట్టివాఁడవనఁగా, ఆదిదేవుఁడవు అనఁగా, దేవతలలో మొదటివాఁడవు. అనన్తరూపుఁడవును అనఁగా, లెక్కింపనలవిగాని రూపములుగల వాఁడవును, పురాణపురుషుఁడవును – అనఁగా జగదుత్పత్తికి ముందే యుండినవాఁడవును, ఈ ప్రపంచమునకు ముఖ్యాధారభూతుఁడవును, సమస్తము నెఱిఁగిన వాఁడవును అనఁగా, జ్ఞానానంద స్వరూపుడవును జ్ఞానులచే నెఱుఁగఁబడఁదగినవాఁడవును

అయ్యున్నావు. ఈప్రపంచమంతయు నీచే వ్యాపింపఁబడియున్నది. అనఁగా, నీ స్వరూపముగాని దీ ప్రపంచమున నణుమాత్రమైనను లేదనుట.

శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః ప్రజాపతి
స్త్వం ప్రపితామహశ్చ ।
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః పున శ్చ భూయోఽపి
నమో నమ స్తే ॥ 39

అర్థము :— త్వమ్=నీవు, వాయుః=వాయువును, యమః=యముఁడును, అగ్నిః=అగ్నియును, వరుణః=వరుణుఁడును, శశాఙ్కః=చంద్రుఁడును, ప్రజాపతిః=చతుర్ముఖబ్రహ్మయును. ప్రపితామహః=అబ్రహ్మకుఁ దండ్రియును, (అసి)=అయియున్నావు, తే=నీకు, సహస్రకృత్వః=వేయిమారులు, నమః + నమః + అస్తు = నమస్కారములగుఁగాక, పునః + చ + భూయః + అపి = మరలమరల, తే=నీకు, నమోనమః=నమస్కారము_నమస్కారము.

అదెట్లనఁగా, ఈసమస్తప్రపంచమునకును సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మయును, అబ్రహ్మకుఁ దండ్రియును నీవే అయ్యున్నావు. అట్లాబ్రహ్మచే సృజింపఁబడిన సమస్తజంతువులకు ముఖ్యప్రాణాధారభూతులగు వాయుదేవుఁడును, అగ్నిదేవుఁడును, వరుణదేవుఁడును, చంద్రుఁడును నీవే అయ్యున్నావు. మరల నట్టి సమస్తజంతువులను లయింపఁజేయునట్టి యముఁడును నీవే అయ్యున్నావు. అనఁగా నీ లోకము నందలి సమస్త జంతువులను బ్రహ్మరూపముతో సృజింపుచు, వాయువు. అగ్ని, వరుణ రూపములతోఁ బోషింపుచు యమరూపముతో సంహరింపుచున్నావు. ఆహా, ఏమి నీ చమత్కారము' ఇట్టి నీకు నేనెన్ని నమస్కారములు చేసినను జాలదు. కనుక నోమహాప్రభో ! ఇదిగో నీకు వేయి నమస్కారములు సేయుచున్నాఁడను. ఈ వేయి నమస్కారములుగూడఁ జాలదు గనుక మరల మరల నమస్కరించుచున్నాఁడను.

శ్లో॥ నమః పురస్తా దథ పృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ !
అనన్తవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి
తతోఽసిసర్వః ॥ 40

అర్థము :— త్వమ్=నీవు, అనన్తవీర్యామితవిక్రమః + సన్ =అమితశౌర్య పరాక్రమములుగలవాఁడవై, సర్వమ్ + సమాప్నోషి=సమస్తమును వ్యాపించియున్నాఁడవు, తతః = అ కారణమువలన ; సర్వః + అసి = సర్వస్వరూపుఁడవై యున్నావు,

(తస్మాత్)=కాఁబట్టి, హేసర్వ=సర్వ స్వరూపుఁడవగు నోస్వామీ!, తే=నీకు, పురస్తాత్=ఎదుటను, పృష్ఠతః=వెనుకను, నమః+(అస్తు)=నమస్కారమగుఁగాక, అథ=పిమ్మట, తే=నీకు, సర్వతః+ఏవ=అన్నిదిక్కులను గూడ, నమః+అస్తు=నమస్కార మగుఁగాక.

ఓస్వామీ! నీవు మితిలేని శౌర్యపరాక్రమములుఁగలవాఁడవై అన్నిటియందును వ్యాపించియున్నాఁడవు. కనుక సర్వస్వరూపుఁడవై యేదిక్కునఁజూచినను నీవే కనఁబడుచున్నావు. కనుక నిట్టి నీకు నెదుటనుండి నమస్కరించుట మాత్రము చాలదు. కాబట్టి నీకు వెనుకప్రక్కలను గూడ నమస్కరించుచున్నాను.

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం య దుక్తం హే కృష్ణ! హే
యాదవ! హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదా
త్ప్రణయేన వాపి॥ 41

శ్లో॥ యచ్చాపహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసన
భోజనేషు।
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం త త్క్షామయే త్వా మహ
మప్రమేయమ్॥ 42

అర్థము:- హేఅచ్యుత!=ఓ అచ్యుతుఁడా!, తవ = నీయొక్క, ఇదమ్ + మహిమానమ్=ఈమహాత్మ్యమును, అజానతా + మయా=ఎఱుఁగనినాచేత, ప్రమాదాత్=అజ్ఞానమువలనఁగాని, ప్రణయేన + వా + అపి=చనవుచేతఁగాని, సఖా + ఇతి + మత్వా=సఖుఁడవనితలఁచి, ప్రసభమ్=నిర్లక్ష్యముగ, హేకృష్ణ!=ఓకృష్ణుఁడా!, హేయాదవ!=ఓయాదవుఁడా!, హేసఖే=ఓచెలికాఁడా, ఇతి=అని, యత్ + ఉక్తమ్=చెప్పబడినదేదికలదో(దానిని), విహారశయ్యాసనభోజనేషు=విహరించు కాలమందును, శయనించుకాలమందును, కూర్చుండుకాలమందును, భుజించుకాలమందును, ఏకః=ఒంటరిపాటునగాని, అథవా=లేక, తత్సమక్షమ్ + అపి=పరులయెదుటఁగాని, అపహాసార్థమ్=పరిహాసముకొఱకు, అసత్కృతః + అసి = అవమానింపఁబడితివను నది, యత్=ఏదికలదో, తత్ + చ=దానిని, అప్రమేయమ్=అప్రమేయుఁడవగు, త్వామ్ + నిన్ను, అహమ్=నేను, క్షామయే=క్షమింపఁ బ్రార్థింపుఁ చున్నాఁడను.

ఓమహనీయమూర్తీ! నీవిట్టి మహామహిమలు గలవాఁడవని యింతకుముందెఱుం

గక, మూఢుఁడనై నీవు నాతోపాటు కేవల మనుష్య మాత్రుఁడవనియు, నాకు బంధువును చెలికాఁడవుననియు నెంచి చనవుచేత నిన్నప్పుడప్పుడు ఓకృష్ణా! ఓయాదవుఁడా! ఓసఖుఁడా! అని యలక్ష్యముగఁ బిలుచు చుంటినిగదా ? ఇంతియగాక మన మిరువురము నొంటరి పాటునగాని, లేక, ఇతరులతోఁగూడిగాని విహరించు నపుడును, శయనించునపుడును, కూర్చుండి మాటలాడుచుండు నపుడును, భోజనము సేయునపుడును, సాధారణముగ నీలోకమున బావమరుదులుగా నుండెడివార లొకరి నొకరు పరిహసించి కొనుచుండెడు రీతిని నిన్ను నే ననేకవిధములగు మేలములాడుచుం టినిగదా ? ఇపుడు నీ యీ విశ్వరూపమును జూచిన తోఁడనే యిట్టి మహామహిమ గల నీయెడల నేనింతకుమును జరిపిన చర్యలన్నియు మహాపచారములని తోఁచి మిగుల భయపడుచున్నాను. అయితే ఆ యపచారములన్నియు నజ్ఞానముచే జేసినవాఁడను గాని నీ మాహాత్మ్యము నెఱిఁగి చేసినవాఁడను గాను. కాఁబట్టి, ఓమహాప్రభో ! నాయెడలఁ గృపాళుఁడవై, అట్టి నాసమస్తాపరాధములను క్షమించి రక్షింపవలయు నని నేనతిదీనుఁడనై కరుణాసముద్రుఁడవగు నిన్నేనేకవిధములఁ బ్రార్థింపుఁచున్నాఁడను. కనుక నోస్వామీ !

"క. నిను నెఱుఁగకుండి యాదవుఁ
డని సఖుఁడని మేనబావ యని యేను సభా
జనములు సల్లాపంబులు
నొనరించుచు మేలమాడుచుండుదు నెపుడున్.

తే. మఱియు బెక్కులు లోకసామాన్యభంగు
లాచరించితి నీదెస నంతెపట్టు
దల్లిదండ్రులు ప్రజలకు దప్పుదారు
లెల్లసైరించు నట్లుసహింపవలయు." (భార. భీష్మ. ౧ ఆ. ౨౧౭,౨౧౮.)

శ్లో॥ పితాసి లోకస్య చరాచరస్య త్వ మస్య పూజ్య శ్చ గురు
ర్గరీయాన్ ।
న త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్య
ప్రతిమప్రభావ ! 43

అర్థము :— హే అప్రతిమప్రభావ!=అసమానప్రభావముగలవాఁడా!, త్వమ్= నీవు, అస్య = ఈ, చరాచరస్య=చరాచరాత్మకమగు, లోకస్య=ప్రపంచమునకు, పితా=తండ్రియును, పూజ్యః=పూజ్యుఁడవును, గురుః=గురువును, గరీయాన్ +

న=శ్రేష్ఠుఁడవును, అసి=అయ్యున్నావు, లోకత్రయే+అపి=త్రిభువనములయం దును, త్వత్+సమః=నీతోసమానుఁడు, న+అస్తి=లేడు, అభ్యధికః=నీకంటె అధికుఁడైనవాఁడు, అన్యః=మఱియొకఁడు, కుతః=ఎట్లుకలుగును ?

ఓస్వామీ! ఈచరాచర ప్రపంచమునకంతటికిని నీవే తండ్రియును, గురువును, పూజ్యుఁడవును, శ్రేష్ఠుఁడవును అయ్యున్నావు. స్వర్గ మర్త్య పాతాళ లోకముల యందెందును నీతో సమానుఁడు లేడు గదా ? ఇట్టి యసమాన ప్రభావముగల నీకంటె నధికుఁడగు వాఁడు మఱియొకఁ డెట్లుకలుగును.

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా
మహ మీశ మీడ్యమ్ ॥
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ!
సోఢుమ్॥ 44

అర్థము :— హేదేవ! = ఓస్వామీ!, పుత్రస్య = పుత్రునియొక్క (తప్పును), పితా+ఇవ=తండ్రివలెను. సఖ్యుః=చెలికానియొక్క (తప్పును), సఖా+ఇవ= చెలికాఁడువలెను, ప్రియాయాః = ప్రియురాలియొక్క (తప్పును), ప్రియః + (ఇవ)=ప్రియుఁడువలెను, (మమ)=(నాయొక్కతప్పును), సోఢుమ్=క్షమించుటకు, (త్వమేవ) := (నీవే), అర్హసి = తగుదువు, తస్మాత్ = కాఁబట్టి, అహమ్=నేను, కాయమ్=శరీరమును. ప్రణిధాయ=క్రిందవైచి (సాష్టాంగముగా), ప్రణమ్య=నమ స్కరించి, ఈశమ్ = ప్రభుఁడవైనట్టియు, ఈడ్యమ్ = స్తోత్రార్హుఁడవైనట్టియు. త్వామ్ = నిన్ను. ప్రసాదయే = క్షమింపఁ బ్రార్థించుచున్నాఁడను.

కనుక నోస్వామీ ! పుత్రునియొక్క తప్పును క్షమింపఁ దండ్రియును, చెలికాని తప్పు క్షమింపఁ జెలికాఁడును, ప్రియురాలగు భార్యయొక్క తప్పును క్షమింపఁ బ్రియుఁడగు భర్తయును ఎట్లరు్హలైయున్నారో, అట్లు నాతప్పును క్షమింప నర్హుఁడగు ప్రభువు నీవే కాని మఱియొకఁడు కాఁడు. కాఁబట్టి నేను నీకు సాష్టాంగముగా నమస్కరించి నాతప్పుల నన్నిటిని క్షమించువట్లు ప్రార్థించు చున్నాఁడను.

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మిదృష్ట్వా భయేన చ ప్రవ్యథితం
మనోమే ।
త దేవ మే దర్శయ దేవ! రూపం ప్రసీద దేవేశ !
జగన్నివాస ! 45

అర్థము :— అదృష్టపూర్వమ్=మునుపెన్నఁడును జూడని యీవిశ్వరూపమును, దృష్ట్వా=చూచి, హృషితః+అస్మి=ఆనందించినవాఁడనగుచున్నాను, మే+మనః=నామనస్సు. భయేన+ప్రవ్యథితమ్+చ=భయముచే మిగుల వ్యథనుగూడఁ జెందుచున్నది, హే దేవ!=ఓస్వామీ!, మే=నాకు. తత్+రూపమ్+ఏవ=మునుపటిరూపమునే. దర్శయ=చూపుము, హే దేవ! దేవేశ! జగన్నివాస!=జగదంతర్యామివగు నో దేవా!, ప్రసీద=అనుగ్రహింపుము.

ఓ దేవా! ఇదివఱకెన్నఁడును జూడని యీ మహదాకారమును జూడఁగా నా మనంబున నానంద భయంబులు రెండును బెనఁగొనుచున్నయవి. అదెట్లనఁగా, ఈ రూపమునందుండెడు ననేకములగు నద్భుతములను వినోదములను జూడఁజూడ నానందమును, నిప్పులఁ గ్రక్కుచుండెడు నేత్రములను పెద్దకోరలను ఆకోరలచే నీయుభయ సైన్యంబులయందలి జనులు నజ్జునుజ్జుగా నమలఁబడుచుండుటయును జూడఁగా మిగుల భయమును గలుగుచున్నవి. ఇట్టి భయంకర రూపమును జూడఁజాలకున్నాను. కాఁబట్టి, ఓ దేవదేవా! ఓ జగన్నివాసా! నాయెడలఁ బ్రసన్నుండవై యీ భయంకరాకృతిని మాని మునుపటి సౌశీల్య సౌకుమార్యాది లక్షణములు గల దివ్యమంగళవిగ్రహరూపమును ధరించి సేవ యొసఁగఁ బ్రార్థించెద.

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే ॥ 46

అర్థము:— తథా+ఏవ = మునుపటివలెనే, కిరీటినమ్ = కిరీటమును ధరించి నట్టియు, గదినమ్ = గదనుధరించినట్టియు, చక్రహస్తమ్=చక్రమును ధరించినట్టియు, త్వామ్+ద్రష్టుమ్ = నిన్నుఁజూచుటకు, అహమ్+ఇచ్ఛామి=నేనుగోరుచున్నాను. (తస్మాత్)=కాఁబట్టి, హే సహస్రబాహో=ఓ వేయిభుజములుగలవాఁడా, హే విశ్వమూర్తే=ఓవిశ్వరూపుఁడా. చతుర్భుజేన=నాలుగుభుజములుగల, తేన+రూపేణ+ఏవ = ఆ (మునుపటి) రూపముతోడనే, భవ = అగుము.

అనఁగా, ఈ విశ్వరూపమును ధరించకముందు దివ్యమకుటముతో నలంకరింపఁబడిన యొక శిరస్సును, శంఖచక్ర గదాద్యాయుధముల ధరించిన చతుర్భుజములును గలిగి, నీలమేఘశ్యాముఁడవును, రాజీవనేత్రుఁడవును, పీతాంబర ధరుఁడవును స్మేరాననుండవునై సాక్షాన్మన్మథ మన్మథునివలె సేవ యొసఁగుచుండిన నీదివ్యమంగళవిగ్రహ

మును మరల దర్శింపనిశ్చయించుచున్నాఁడను. కాన నో మహానుభావా ! నాయెడఁ ననుగ్రహించి సహస్రభుజములతోఁగూడి మిగుల భయంకరముగానుండు నీ విశ్వరూపము నుపసంహరించి ఆనందజనకమగు నీపూర్వరూపమునే ధరింపుము.

**శ్రీభగవానువాచ :**

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత
మాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనన్తమాద్యం యన్మే త్వదన్యేన
నదృష్టపూర్వమ్ ॥ 47

అర్థము :- హేఅర్జున !=ఓయిఅర్జునా !, ప్రసన్నేన+మయా = ప్రసన్నుఁడనగు నాచేత, ఆత్మయోగాత్=నాయోగబలమువలన, తవ=నీకు, దర్శితమ్+యత్= చూపఁబడినదేది కలదో (అట్టి), మే = నాయొక్క, ఇదమ్+పరమ్+రూపమ్= ఈశ్రేష్ఠమైన రూపము, తేజోమయమ్ = తేజోమయమైనదియు, విశ్వమ్=ప్రపంచ స్వరూపమైనదియు, ఆద్యమ్ = మొదటిదియు, అనన్తమ్ = అంతములేనిదియు, త్వత్+అన్యేన=నీకంటె నితరునిచే, నదృష్టపూర్వమ్ = మును వెప్పుడును జూడఁబడనిదియు (నైయున్నది.)

కృ — ఓయియర్జునా ! నేను నీకీరూపమును జూపుటకుఁ గారణ మేమనఁగా నీ వింతకుమును నావిశ్వరూపమును జూపుమని ప్రార్థించియుంటివిగదా? (చూ 11.3). ఆరూప మీ మనుష్యలోకమున నెవరును జూచుటకు సాధ్యపడునది కాకపోయినను, నీవు నాకత్యంత ప్రియుఁడ వగుటచే నీయెడల ననుగ్రహించి నీయాశ్రితము నీడేర్పఁ గోరి నాయోగ మాయాబలముచే నీకుఁ జూపఁబడినది. ఈరూపమెట్టిదనఁగా, నేను ధరించెడు నన్నిరూపములలో మొదటిదియు, అనఁగా, సర్వోత్కృష్టమైనదియు, ప్రపంచమే శరీరముగాఁగలదియు, తేజోమయమైనదియు, అంతము లేనిదియునై యున్నది. ఈరూపమును నీవు తప్ప నితరులెవ్వరు నిదివఱకుఁజూచినదిలేదు.

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై ర్న చ క్రియాభి ర్న
తపోభి రుగ్రైః ।
ఏవంరూప శ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన
కురుప్రవీర ! 48

అర్థము :— హేకురుప్రవీర = కురువంశశ్రేష్ఠుఁడవగు నోయర్జునా !, ఏవమ్ +

రూపః = ఇట్టిరూపముగల. అహమ్ = నేను, నృలోకే = మర్త్యలోకమునందు, త్వత్ + అన్యేన = నీకంటె నితరుని చేత, వేదయజ్ఞాధ్యయనైః = వేదపాఠము-యజ్ఞము-అధ్యయనము-వీనినాచరించుటవలన, ద్రష్టుమ్ = చూచుటకు, న + శక్యః = సాధ్యపడు వాడను గాను, దానైః = దానములఁ జేయుటవలన, న = (చూచుటకు సాధ్యపడువాఁడను) కాను, క్రియాభిః = శ్రౌతస్మార్త నిత్య నైమిత్తికాది కర్మల నాచరించుటవలన, న = (చూచుటకు సాధ్యపడువాఁడను) కాను, ఉగ్రైః + తపోభిః + చ = ఉగ్రములగు తపస్సులఁ జేయుటవలనను, న = (చూచుటకు సాధ్యపడు వాఁడను) కాను.

ఏలయనఁగా, ఓయి యర్జునా! ఈ మర్త్యలోకంబున నెవరే గాని యెట్టి వేదాంతవేత్తలైననుసరే, ఎట్టి యజ్ఞములఁజేసిన వారైననుసరే, ఎట్టి వేదాధ్యయన పరులైననుసరే, గో-భూ-హిరణ్యాద్యనేక విధములగు దానముల నెన్నిటిని జేసినవారైననుసరే, శ్రౌత-స్మార్త-నిత్య-నైమిత్తికాది కర్మల నెంత యథావిధిగ నాచరించిన వారైననుసరే, కాయక్లేశముల కోర్చి యత్యుగ్రములగు తపస్సుల నెన్నిటిని జేసిన వారైననుసరే, ఇపుడు నీవు చూచుచున్న యీ నావిశ్వరూపమును జూడఁజాలరు. అనఁగా నెట్టివారలకైన నిట్టిదర్శనమివ్వననుట. ఇట్లేరికిని సందర్శింపరాని యీవిశ్వరూపమును నీకుమాత్రము సందర్శింపఁజేసినాఁడను. కాన నీమర్త్యలోకమున నీవుతప్ప నితరులెవ్వరు నీవిశ్వరూపమును జూచినది లేదని చెప్పుటకుఁ గారణమైనది.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం
ఘోర మీదృ ఙ్మమేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం త దేవ మే రూప మిదం
ప్రపశ్య॥ 49

అర్థము :— ఈదృక్ + ఘోరమ్ = ఇట్టి భయంకరమైన, మమ + ఇదమ్ + (రూ)పమ్ = నాఈరూపమును, దృష్ట్వా = చూచి, తే + వ్యథా + మా = నీకు భయము వలదు, విమూఢభావః + చ + మా = మూఢత్వమును వలదు, త్వమ్ = నీవు, వ్యపేతభీః = నిర్భయుఁడవును, ప్రీతమనాః = ప్రీతినొందిన మనస్సుగలవాడవునై, మే = నాయొక్క, తత్ + ఇదమ్‌రూపమ్‌ఏవ = ఇపుడు నే ధరించఁబోయెడు పూర్వరూపమునే, పునః + ప్రపశ్య = మరలఁ జూడుము.

ఓయి యర్జునా! ఇట్లు భూలోకమున నెంత మహనీయులకైనను దర్శింపరాని యీ విశ్వరూపమును నీకు మాత్రము దర్శింపఁజేయుటవలన నాకు నీ యెడల నరవా

దఱికెంతొ నెంత యెక్కుడు ప్రేమ గలిగియుండునదియు నీవే యూహింపఁగలవు గదా ? ఇట్టి విషయములలో నీవు నా ఘోరరూపమును జూచి యేల భయపడవలెను ! నారూప మెంత భయంకరమైనదిగ నున్నను దానివలన నీకేమి చెరుపుగలుగును ? నీ వెంత మాత్రమును భయము నొందవలదు. కనుక, తెలివిఁదెచ్చుకొని భయమునువిడిచి నిర్భయముగా నుండుము. నీవు కోరినప్రకారము నీమనస్సున కానందము గలుగఁజేయుట కొఱకు మునుపటి సౌమ్యరూపమును మరల ధరించుచున్నాను. ఇదిగో చూడుము.

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకం రూపం
దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పున స్సౌమ్యవపు
ర్మహాత్మా॥ 50

అర్థము :— వాసుదేవః=శ్రీకృష్ణమూర్తి, అర్జునమ్=అర్జునునిగూర్చి, ఇతి+ఉక్త్వా=ఇట్లుచెప్పి, తథా=అలాగుననె, భూయః=మరల, స్వకం+రూపమ్+తన మునుపటిరూపమును, దర్శయామాస=చూపెను, మహాత్మా=మహాత్ముఁడగు నా కృష్ణమూర్తి, పునః=మరల, సౌమ్యవపుః+భూత్వా=సౌమ్యరూపమును దాల్చినవాఁడై, భీతమ్=ఏనమ్=భీతుఁడగు నీయర్జునుని, అశ్వాసయామాస+చ=ఓదార్చెను.

సంజయుఁడు—అయ్యా ధృతరాష్ట్రమహారాజా! మహాత్ముఁడగు నాకృష్ణమూర్తి యర్జునునిం గూర్చి యిట్లుచెప్పి యావెంటనే అర్జునుని ప్రార్థనప్రకారము మానుష రూపమును జూపెను. అనఁగా, నీలమేఘశ్యాముండును, అరవిందనేత్రుండును, స్మేరాననుండును, చతుర్భుజుండును, మకుటకుండలాద్యాభరణ భూషితుండును, పీతాంబరవసనుండును, శంఖచక్రపాణియును, గదాధరుండునునై దర్శనమొసంగెను. ఇట్లు సౌమ్యాకృతిని ధరించినవాఁడై యామహాత్ముఁడు భీతిచే వడఁకుచుండిన యా యర్జునుని భయపడకుమని మరల నోదార్చెను.

అర్జున ఉవాచ :

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన !
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః॥ 51

అర్థము :—హేజనార్దన!=ఓకృష్ణమూర్తీ!, తవ=నీయొక్క, సౌమ్యమ్=సౌమ్యమైన, ఇదమ్=ఈ (ఇప్పుడుచూపిన). మానుషమ్+రూపమ్=మనుష్యరూపమును,

దృష్ట్వా=చూచి, సచేతాః=మనస్సుతోఁ గూడినవాఁడను, ప్రకృతిమ్+గతః=ప్రకృతితోఁ గలసినవాఁడనునై, ఇదానీమ్=ఇప్పుడు, సంవృత్తః+అస్మి=స్వస్థత నొందినవాఁడ నైతిని.

అర్జు — ఓ జనార్దనా! కృపాళుఁడవగు నీవు నాప్రార్థన నంగీకరించి యిపుడు ధరించిన సౌమ్యమగు నీ మానుషరూపమును జూచినపిమ్మట నిదివఱకు నాకుఁ గలిగియుండిన భయము విడిచి నామనస్సు తేటగించినందున నిపుడు నేను స్వస్థత నొందినవాఁడ నైతిని.

శ్రీభగవానువాచ :

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ।
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః॥　　52

అర్థము :— మమ=నాయొక్క, యత్=ఏరూపమును, దృష్టవాన్+అసి=చూచినవాఁడవైతివో, ఇదమ్+రూప=(అట్టి) ఈవిశ్వరూపము, సుదుర్దర్శమ్=చూచుటకు సాధ్యము కానిది, దేవాః+అపి=దేవతలుసైతము, నిత్యమ్=ఎల్లప్పుడును, అస్య+రూపస్య=ఈరూపముయొక్క (ఈరూపమును), దర్శనకాఙ్క్షిణః=దర్శింప గోరినవారగుచున్నారు.

కృ— ఓయి యర్జునా! ఇపుడు నీవు దర్శించిన విశ్వరూపమెవరికిని దర్శింప నలవియైనది కాదు. మనుష్యుల కలవి గాకుండుట సరేకదా, ఈరూపమును దర్శింప వలెనని సదా కోరుచుండెడు దేవతలకుసైత మలవి కాదుసుమా!

శ్లో॥ నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా॥　　53

అర్థము :— (త్వమ్)=నీవు, మామ్=నన్ను, యథా+దృష్టవాన్+అసి=ఏవిధముగా (ఏరూపముతో) చూచినవాఁడవైతివో, ఏవమ్+విధః+అహమ్=ఇట్టి విశ్వరూపుఁడనగు నేను, వేదైః+ద్రష్టుమ్+శక్యఃమ్+న=వేదాధ్యయనపరులచే జూడఁబడుటకుఁ శక్యుఁడను గాను, తపసా+న=తపస్సంపన్నులచేఁ జూడఁబడుటకు శక్యుఁడను గాను, దానేన+న=దానపరులచేఁ జూడఁబడుటకు శక్యుఁడను గాను, ఇజ్యయా+చ+న=యజ్ఞములఁ జేసినవారిచేతనుగూడఁ జూడఁబడుటకు శక్యుఁడను గాను.

ఏలయనఁగా,

"మ. ఉపవాసవ్రత శౌచశీలముఖ సంధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర ద

చ్చపుభక్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వ లేకుండినన్.''
(భాగ. ౨ స్కం. ౨౧౪)

అని పూర్వము బ్రహ్మ నారదునికిఁ జెప్పియున్నట్లు, ఎట్టివేదాధ్యయనపరులై ననుసరే, ఎంత ఘోరతపస్సులను జేసినవారైననుసరే, ఎటువంటి గొప్పదానములను జేసినవారైననుసరే, ఏలాటి గొప్పయజ్ఞములను జేసినవారైననుసరే, నాయెడల నిజమైన భక్తిలేనివారైనయెడల నిపుడు నీవుచూచిన నావిశ్వరూపమును జూడఁజాలరు.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప!॥ 54

అర్థము :— హేపరంతప ! అర్జున=శత్రుభీకరుఁడవగు నోయర్జునా!, ఏవమ్+విధః+అహమ్=ఇట్టి విశ్వరూపమును ధరించిన నేను, అనన్యయా + భక్త్యా + తు=అచ్చపు భక్తిచేతనే, తత్త్వేన=యదార్థముగా, జ్ఞాతుమ్=ఎఱుఁగుటకును, ద్రష్టుమ్+చ = చూచుటకును, ప్రవేష్టుమ్ + చ =(నాలో) ప్రవేశించుటకును, శక్యః=శక్యుఁడను (అగుచున్నాను).

ఇఁక నెట్టివార లిట్టినావిశ్వరూపమును దర్శించుటకును, ఆరూపములో నైక్యమగుటకును, అనఁగా మోక్షమును బొందుటకును, అర్హులగుదురనఁగా,

''సీ. చర్చింప నరుల కీజన్మకర్మాయుర్మనో వచనంబుల దేవదేవుఁ
డఖిల విశ్వాత్మకుండైన గోవిందుండు విలసిల్లుభక్తి సేవింపఁబడిన
నవియ పో జన్మకర్మాయుర్మనో వచనములను ధరణి నెన్నంగఁదగును
వనరుహనాభసేవారహితములైన జననోపనయన దీక్షాకృతంబు

గీ. లైనజన్మంబు లేల దీర్ఘాయు వేల
వేదచోదితమగు కర్మవితతి యేల
జపతపశ్శ్రుత వాగ్విలాసంబు లేల
మహిత నానావధాన సామర్థ్య మేల''. (భాగ. ౪ స్కం. ౯౫౨)

అనునట్లు, తపోయజ్ఞ దాన వేదాధ్యయనాదులఁ జేసినవారైననుసరే, కాకపోయిననుసరే నాయెడల నచ్చపు భక్తిగలవారైనయెడల నట్టివారలు మాత్రమే యర్హులగుదురు. కనుక నేగదా.

''మ. వినుమంభోజభవుండు మున్ను మదిలో వేదంబు మువ్మాఱు
నెమ్మనమందుం దలపోసి యంతయుఁ బరామర్శించి మోక్షంబు ద

క్రియానమార్గంబున లేదటంచు హరిభక్తిం జింతచేసెన్ జనా
ర్దను నాత్మాకృతి నిర్వికారుఁడగుచున్ దన్మార్గనిష్ణాతయై॥''
(భాగ. ౩, స్కం. 3౫)

అనునట్లు మన్నాభీకమలసంభవుండగు చతుర్ముఖ బ్రహ్మ సయితము మితర యేయుపాయముచేతను నన్ను గనఁజాలక భక్తిఁజేసినవాఁడాయెను.

అర్జు — ఓస్వామీ! అట్లైనయెడల నీలోకమున ననేకులు నీయెడల భక్తిగల వారలై నిన్నర్చించుచు నీ ప్రీత్యర్థ మనేకములగు తపో యజ్ఞ దానాదుల నాచరింపు చుండుటను జూచుచున్నాముగదా? అట్టివారలందఱు నీ విశ్వరూపమును దర్శించు టకును, నిను బొందుటకును నర్హులేగదా?

శ్లో॥ మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాణ్డవ!॥ 55

అర్థము :— హే పాణ్డవ! = పాండుపుత్రుఁడ వగునోయర్జునా!, మత్కర్మ కృత్ = నాకుఁ బ్రీతికరములగుఁ గర్మలనే చేయువాఁడును, మత్పరమః = నన్నే పరమప్రాప్యముగ నెంచియుండువాఁడును, సఙ్గవర్జితః = దారపుత్ర బంధుమిత్ర ధన కనక వస్తు వాహనాదులయందలి మమకారమును విడిచినవాఁడును, సర్వభూతేషు = సమస్తప్రాణులయందును, నిర్వైరః = వైరములేనివాఁడును, యః = ఎవఁడో. సః + మద్భక్తః = అట్టినాభక్తుఁడు. మామ్ + ఏతి = నన్ను బొందుచున్నాఁడు.

కృ — ఓహూ!! నీవట్లెంచుచున్నావాఁడేమి? అదికాదు నాయభిప్రా యము. ఈలోకమున ననేకులు నాయందు భక్తిగలవారై నాప్రీత్యర్థ మనేకములగు కర్మలఁ జేయుచుండుట వాస్తవమే! అయితే; అట్టివారిలోఁ బ్రతివానియందు నేదేని యొక లోపముండక మానదు. అదెట్లనఁగా,

"క. శ్రుతధనకుల కర్మసము
న్నత మదములఁజేసి సజ్జన వ్రతతికిసం
తతమును నెగ్గొనరించుచు
మతులర్థింజేయుపూజ మతిగొనఁడెంచున్.' (భాగ. ౪. స్కం. ౯౬౨.)

అనునట్లు, కొందఱు పండితులమనియు, కొందఱుధనికులమనియు, కొందఱు కులవంతులమనియు, మఱికొందఱు తామనేకసత్కర్మలఁ జేసినవారమనియు నెంచి కొనుచు గర్వించి సజ్జనుల నవమానింపుచుందురు. కనుక నట్టి కుత్సితబుద్ధిగలవారలు చేసెడు భక్తియును పూజలును నిష్ప్రయోజనములు కనుకనోయియర్జునా! నాభక్తులలోల

నెవఁడైతే సర్వసంగపరిత్యాగియై, అనఁగా, దార, పుత్ర, బంధు, మిత్ర, ధన, కనక, వస్తు, వాహనాదులయందలి మమకారమును బొత్తిగ విడిచినవాఁడై నన్నే పరమ ప్రాప్యముగ నెంచి నాకుఁ బ్రీతికరములగు కర్మలనుమాత్రమే యాచరింపుచు సమస్త ప్రాణులకును హితమునే కోరువాఁడును, ఏప్రాణి యెడలను ద్వేషబుద్ధిలేనివాఁడును నై యుంచున్నాఁడో అట్టివాఁడు మాత్రమే నన్నుఁబొందఁగలఁడు. అయితే. అట్టి వాఁ డీ లోకమున నుండుట యరుదు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనయోగో నామ ఏకాదశోఽధ్యాయః
ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి విశ్వరూప సందర్శనయోగంబను
ఏకాదశాధ్యాయము.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భితభావబోధిని



## ద్వాదశాధ్యాయము



## భక్తియోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥ 1

అర్థము :— ఏవమ్=ఈ ప్రకారము (ఇంతకుముందచ్చటచ్చటఁ జెప్పఁబడినప్రకారము), యేభక్తాః = ఏభక్తులు, త్వామ్ =(సగుణుఁడవుగా సేవనొసంగుచుండెడు) నిన్ను, సతతయుక్తాః=సదానీయందే మనస్సుఁజేర్చినవారలై, పర్యుపాసతే=ఉపాసనఁజేయుచున్నారో, యే+చ+అపి=ఎవరైతే, అవ్యక్తమ్=ఇన్ద్రియములకు గోచరింపని, అక్షరమ్=పరబ్రహ్మమును, (పర్యుపాసతే)=ఉపాసన సేయుచున్నారో, తేషామ్ = (ఈరెండు తెగల) వారలలో, కే=ఎవరు, యోగవిత్తమాః = లెస్సగా యోగము నెఱిఁగినవారు ?

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! ఇదివఱకు నీవు చెప్పియుండు విషయములనన్నిటిని బట్టిచూడఁగా నిన్నుపాసనసేయు వారలలో రెండు తెగల వారున్నట్లేర్పడు చున్నది. అదెట్లనఁగా, రామకృష్ణాద్యవతారముల నెత్తి సమస్తకల్యాణ గుణగణ పరిపూర్ణుండవై దివ్యమంగళ విగ్రహముతో చేతనులకు సేవ యొసంగు చుండెడు నిన్నెవరెవ రే యేరూపమున లక్ష్యముంచుచున్నారో వారు వారాయా రూపముతో ధ్యానింపుచు సదా నీయందే చిత్తమునుజేర్చి భజింపు చుండెడు వారు కొందఱును, అట్లుగాక, నిన్ను, (అవ్యక్తమును) అనఁగా నింద్రియములకు గోచరింపనిదియును, (అక్షరమును) అనఁగా నాశరహితమైనదియు నగు పరబ్రహ్మమునుగా భావించి యుపాసనఁ జేయుచున్నవారు కొందఱునునై యున్నట్లేర్పడుచున్నది. ఇందు

మొదటి తెగవారు సగుణోపాసకులుగను, రెండవ తెగవారు నిర్గుణోపాసకులుగను నేర్పడుచున్నారుగదా ? ఇట్టి రెండు తెగలుగానుండెడు వారిలోనే తెగవారు యోగులలో శ్రేష్ఠులనఁబడుదురు ?

శ్రీభగవానువాచ :

శ్లో॥ మయ్యావేశ్యమనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥ 2

అర్థము :— యే=ఎవరు, మయి = నాయందు, మనః+ఆవేశ్య = మనస్సు నిలిపి, నిత్యయుక్తాః = నిరంతర సమాహిత చిత్తులును, పరయా + శ్రద్ధయా + ఉపేతాః=మిక్కిలి శ్రద్ధతోఁ గూడినవారునునై, మామ్+ఉపాసతే=నన్నుపాసించుచున్నారో, తే=(అట్టి)వారు యుక్తతమాః=యోగిశ్రేష్ఠులు (అని), మే+మతాః=నాకు సమ్మతులు.

కృ — ఓయి యర్జునా ! ఇపుడు నీవుచెప్పిన రెండు తెగల వారిలలో సగుణోపాసకులెట్టివారలనఁగా, నే నిపుడు నీకు సందర్శింపఁ జేసినట్టి విశ్వరూపముగల వాఁడనని యెఱిఁగిన వారైనను, అట్టిరూపముతో నన్నుపాసించుటకు శక్తులుగాఁజాలక, అప్పుడప్పుడు నేను దుష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థమై యీభూలోకమున నవతరించునపుడు పరిగ్రహించిన లీలామానుష విగ్రహములలో, ఒక్కొకరొక్కొక రూపమునందిచ్ఛఁగొని యారూపమునే నాయొక్క దివ్యమంగళ విగ్రహమునుగా భావించి సేవింపుచు, అట్టి యవతార కాలమున నేనొనర్చియుండెడు ననేకములగు మానుష చర్యలను బట్టె యనంతకల్యాణ గుణగణ పరిపూర్ణుఁడనుగ భావించి పదే పదేస్మరించుట యేగాక, అంతటితో తనివి నొందక యొకరితో నొకరు చెప్పుకొని యానందింపుచుందురు. ఇట్లు, అరూపుఁడనగు నన్ను సరూపునిగను, అగుణుఁడనగు నన్ను సగుణునిగను భావించి సదాచిత్తమును నాయందే చేర్చి, అట్టి నారూప గుణములనే సదా ధ్యానించి కొనియాడుచు నానఁదింపుచుందురు. కనుక,

"శ్లో॥ అనన్యచేతాస్సతతం యోమాంస్మరతినిత్యశః।
తస్యాహంసులభఃపార్థ ! నిత్యయుక్తస్యయోగినః"

అని నేనింతకుముందు చెప్పియున్న ప్రకారము (చూ. 8. 14.) అట్టి భక్తులు నన్ను సులభముగఁ బొందఁదగి యుండుటయేగాక, "యేభజంతితు మాంభక్త్యా మయితే తేషుచాప్యహమ్" (చూ. 9–29) అని యింతకుముందు నేఁజెప్పియున్న ప్రకారము వారలయందు నేనును. నాయందు వారలును ఉన్నవారలగుచున్నాము. కాఁబట్టి.

"మ. ఉపవాసవ్రతశౌచశీలముఖ సంధ్యోపాసనాగ్నిక్రియా
జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి సేకూరద
చ్చపుభక్తిన్ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁబాపఘ్ను జరేశు నచ్యుతుని నర్థిం గొల్వ కేకుండినన్"
(భాగ. ౭ స్కం. ౨౧౮)

అనునట్లు, మోక్షప్రాప్తికి నాయందలి భక్తి ముఖ్యమైనది గావున నట్టి భక్తిగల వారలు మిగుల శ్రేష్ఠులని చెప్పఁదగియున్నారు. వీరలే సగుణోపాసకులనఁ బడుదురు.

శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగ మచిన్త్యంచ కూటస్థ మచలం ధ్రువమ్॥ 3

శ్లో॥ సన్నియ మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః॥ 4

అర్థము :- యే + తు = ఎవరైతే, ఇన్ద్రియగ్రామమ్ = ఇంద్రియసమూహమును, సన్నియమ్య = చక్కఁగానియమించి, అనిర్దేశ్యమ్ = నిర్దేశింపఁగూడనిదియు, అవ్యక్తమ్ = వ్యక్తము కానిదియు, సర్వత్రగమ్ = అంతట వ్యాపించియున్నదియు, అచిన్త్యమ్ = చింతింపఁగూడనిదియు, కూటస్థమ్ = కూటస్థమైనదియు, అచలమ్ = చలింపనిదియు, ధ్రువమ్ + చ = ధ్రువమైనదియు నగు, అక్షరమ్ = నిర్గుణబ్రహ్మమును, పర్యుపాసతే = ఉపాసించుచున్నారో, తే = (అట్టి) వారలు. సర్వత్ర = సమస్త భూతముల యందును, సమబుద్ధయః = సమబుద్ధిగలవారును, సర్వభూతహితేరతాః + (సన్తః) = సమస్తభూతములకు హితముగోరెడువారునగుచు, మామ్ + ఏవ = నన్నే, ప్రాప్నువన్తి = పొందుచున్నారు.

ఇఁకను నిర్గుణోపాసకు లెట్టివారనఁగా ఇంద్రియ నిగ్రహులై, (అనిర్దేశ్యమ్) ప్రత్యక్షాది షట్ప్రమాణములచే నిట్టి దట్టిదని నిర్దేశింపఁగూడనిదియు, (అవ్యక్తమ్) చక్షురాదీంద్రియములకు గోచరింపనిదియు, (సర్వత్రగమ్) పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సమస్తభూతములయందును వ్యాపించియుండునదియు, (అచిన్త్యమ్) మనస్సుచే నిట్టి దట్టిదని యూహింపఁగూడనిదియు, (కూటస్థమ్) ఎల్లకాలము నొక్కరీతిగనే యుండునట్టిదియు, (అచలమ్) చలింపనిదియు, (ధ్రువమ్) ఎడతెగని దియునగు నిర్గుణబ్రహ్మమును ఉపాసించెడు వారలై యున్నారు. అట్టివారలు,

"సీ. ఏదేశమున నైన నేకాలమున నైన నేమి సేయుచు నైన నెట్టు లైన
నఖిలవికారంబు లావిద్యకంబులు నేనవి కామంచె నిష్ప్రపంచ

నిర్వికల్పాఖండ నిశ్చలనిర్మలా వ్యయ సచ్చిదానందమయనిరీహ
పరిపూర్ణ నిర్గుణ ప్రత్యగాత్మాభిన్న పరమాత్ముఁడ నటంచుఁ బరమనిష్ఠ

తే. శాంతిశాంతంబుగ దను గాంచు సజ్జనునకు
మంత్రతంత్రంబు లేల కర్మంబు లేల
జపతపోవ్రత దానయజ్ఞంబు లేల
నామవర్ణాశ్రమాభిమానంబు లేల!" (సీ. రా. ౨ ఆ. ౧౨౮)

అనునట్లు తనయందును, తక్కిన సమస్తభూతంబులయందును వ్యాపించి యుండునది యాపరమాత్మ యొక్కటియే గాని తదితరమైన దేదియు లేదనియుఁ దెలిసికొని సదా యాత్మానుభవమునే చేయుచుందురు. కనుకనే, అట్టి వారలకుఁ గర్మతోఁ బనిలేదనియు, కర్మ నాచరించుటవలన నొక ప్రయోజనముగాని, చేయక పోవుటవలన నొక లోపముగాని లేదనియు, మఱియు నట్టివారేవిషయమును గుఱించియైనను సరే దేనిని నాశ్రయింపవలసిన యగత్యము లేదనియు నింతకుముందు చెప్పియుంటినిగదా? (చూ. 3, 17-18). కాఁబట్టి యట్టివారలకు సమస్తభూతముల యందును, శత్రుత్వ మిత్రత్వములు లేక సమభావము కలిగి యుండుటయగాక యట్టి భూతములన్నిటికిని నెప్పుడును హితమునే గోరుచుందురు. ఏలయనఁగా, ఒకఁడు తనయందలి యాత్మకును, తక్కిన సమస్తజంతువులయందలి యాత్మకును భేదము లేదని యెప్పుడెఱుఁగుచున్నాఁడో, అప్పుడితర యేజంతువునకైనను సరే యేదైనఁ గీడు గలిగినయెడల నాకీడు తనకుఁ గలిగినట్లే భావించునుగదా? ఎవఁడైనఁ దనకుఁ దాను హితమునే గోరుచుండునుగాని కీడును గోరఁడుగదా? కనుకనే నిస్సంశయాత్మకులగు మహర్షులఁ సమస్త జీవకోట్లకును హితము నొనరించుట యందాసక్తిగల వారలై మోక్షమును బొందుదురని యింతకుముందు నీకునేఁజెప్పుటకుఁ గారణమైనది. (చూ. 5-25). కాఁబట్టి యోయియర్జునా! అట్టి మహానుభావులు నన్నే పొందుచున్నారు. అనఁగా వారేనేను నేనేవారనియు, వారలకును నాకును భేదములేదనియు నెఱుంగుము.

అర్జు — అయ్యా! ఇందువలన నేర్పడియెడు ఫలితార్థమేమనఁగా, సగుణోపాసకులు నీకత్యంత ప్రియులనియు, నిర్గుణోపాసకులు నీ స్వరూపులే యనియు నేర్పడుచున్నదిగదా? కాఁబట్టి సగుణోపాసకులకంటె నిర్గుణోపాసకులే శ్రేష్ఠతరమైనవారై యుండఁగా, అట్టి నిర్గుణోపాసన నవలంబించెడు సాంఖ్యయోగము నవలంభించుటకు నన్నుఁ బ్రేరేపించుటకు బదులుగా సగుణోపాసన నవలంబించెడు నిష్కామకర్మయోగమునకుఁ బురికొల్పుచున్నావే, ఇందుకుఁ గారణమేమి?

శ్లో॥ క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥ 5

అర్థము:—అవ్యక్తాసక్తచేతసామ్=నిర్గుణోపాసనయందాసక్తచిత్తులగు; తేషామ్=వారలకు, అధికతరః+క్లేశః = మిక్కిలికష్టము, హి = ఏలయనఁగా, దేహవద్భిః = దేహాభిమానులచే, అవ్యక్తా+గతిః = నిర్గుణోపాసనామార్గము, దుఃఖమ్+అవాప్యతే=కష్టముగాఁ బొందఁబడుచున్నది.

కృ — అట్లుచేయుటకుఁ గారణమేమనఁగా, దేహాభిమానముగల వారలకు నిర్గుణోపాసనఁ జేయుట మిగులఁ గష్టసాధ్యము. అయితే యీలోకమున ముముక్షువులగు వారలెంత వైరాగ్యశీలులైననుసరే, ఎంత ఇంద్రియ నిగ్రహశక్తిగలవారైనను సరే, ఎంతరాగద్వేషరహితులైనను సరే, దేహాభిమానమును మాత్రము బొత్తిగ విడుచుట కష్టసాధ్యము. అట్లు దేహాభిమానమును బొత్తిగ విడువనివారికి సగుణోపాసనామార్గముకంటె నిర్గుణోపాసనామార్గము మిగులఁ గష్టతరముగా నుండును. కాఁబట్టి యీరెంటిలో సులభ సాధ్యమగు సగుణోపాసనమును నీకుబోధించుటకుఁ గారణమైనది.

ఈవిషయమును గుఱించి పూర్వము జనకచక్రవర్తికిని శుకమహర్షికిని జరిగియుండు సంభాషణమును జెప్పుచున్నాను. అదివింటివేని, ఈనిర్గుణ సగుణోపాసనలనఁదగు సాంఖ్యకర్మయోగములు రెంటిలో నేది యాచరించుట మేలైనదియు నీవే యూహించి కొనఁగలవు. అదెట్లనిన, పూర్వకాలంబున శుకమహర్షి సర్వసంగ పరిత్యాగియై తనతండ్రిని యెడబాసి వనమునకుఁ బోవ గమకించి జనకచక్రవర్తి యొద్దకు బోవఁగా నాజనకచక్రవర్తి యిట్లని విచారించె. అయ్యా, శుకమహర్షీ!

"శ్లో॥ పితుస్సఙ్గం పరిత్యజ్య త్వంవనంగన్తుమిచ్ఛసి
మృగైస్సహానుసఙ్గస్తే భవితా తేనసంశయః."

నీవు, ఏకాంగిగా నుండుటకై నీతండ్రి సాంగత్యమును విడిచిపెట్టి వనమున కేగఁదలఁచి యున్నావుగదా? ఆవనమునందు మృగముల సాంగత్యము గలుగుచున్నదే యందు కేమిచేయగలవు? మఱియు

"శ్లో॥ మహాభూతానిసర్వత్ర నిస్సఙ్గః క్వభవిష్యసి
ఆహారార్థంసదాచిన్తా నిశ్చితాంస్త్యక్ష్యసే కదా మునే."

ఒకవేళ నావనములను గూడవిడిచి మఱియెచ్చటికైనఁ బోదమని యాలోచించెదవేమో, అన్నిచోట్లను మహాభూతములచే నిండియుండఁగా నీవెచ్చటికిఁ

బోయినను నీకు నిస్సంగత్వమెట్లు గలుగును? ఇంతియగాక; గృహమునందువలె వనమునం దాహారపదార్థములు వలయునప్పుడు చిక్కవుగదా? కనుక సదా క్షుద్బాధచే బీడింపఁబడుచు నాహారమును వెదకి కొనవలసినవాఁడవై యుండఁగా నిశ్చింతంగా నెట్లుండఁగలవు? అయితే, ఒకవేళ క్షుద్బాధను దీర్పఁగల ఫలాదు లెచ్చట సమృద్ధిగఁ జిక్కఁగలవో యట్టివనమునందుండవచ్చునని యోచించెదవేమో, అట్లైనను,

"శ్లో॥ దండాజినకృతాచింతా యథాతేవవనేపిచ
తథైవరాజ్యచిన్తామే చిన్తయానస్యవానవా."

నీదండకమండల కృష్ణాజినములను భద్రపరచుకొను విషయమునందైనను నీకు చింతగలిగియే యుండునుగదా, అనఁగా, దండమునకు చెదలంటునేమో. కమండలములోని యుదకము నేవైన మృగములు ద్రాగించునేమో, కృష్ణాజినమును కుక్కలు నక్కలు మొదలగునవి యీడ్చుకొనిపోవునేమో యనియు, కావున వానిని గాపాడుకొనవలయు ననియెడు చింతయైన నెప్పుడును వనమునందు నీకెట్లు గలిగియుండునో, అట్లే నాకును జనులు చెడకుండ రాజ్యమును గాపాడుకొనవలయు ననియెడు చింత గలిగియుంచున్నది. కాబట్టి చింతావిషయములో వనమునందుండెడు నీవు రాజ్యము నేలుచుండెడు నాతో సముఁడవే కాని నాకంటె శ్రేష్ఠుఁడవు కావు సరేకదా? మఱి కొన్ని విషయములను బట్టి చూడఁగా నీకంటె నేనే శ్రేష్ఠుఁడనని చెప్పవలసియున్నది. అదెట్లనఁగా,

"శ్లో॥ వికల్పోపహతస్త్వంవై దూరదేశముపాగతః । నమేవికల్పసందేహో నిర్వికల్పోస్మిసర్వథా॥" నీవు వికల్పము (సందేహము) తోఁ గూడిన మనస్సుగలవాఁడవై యుండుటచే దూరదేశమునకుఁబోయి యవస్థపడుచున్నావు. నాకన్ననో యట్టి సందేహమేమియులేదు గనుక నింటనుండియే సుఖింపుచున్నాను. అదెట్లన్ననో, "శ్లో॥ సుఖంస్వపి మివిప్రాహం సుఖంభుఞ్జామిసర్వదా। నబద్ధోస్మీతిబుద్ధ్యాహంసర్వదైవసుఖీమునే॥" సుఖముగా నిద్రింపుచున్నాను. సుఖముగా భుజింపుచున్నాను, నేను బద్ధుఁడనుగాను అనియెడు నమ్మకము గలిగియున్నవాఁడనుగాన నేనెప్పుడును సుఖమునే యనుభవింపుచున్నాను. ఇఁకను నీవన్ననో,

"శ్లో॥ త్వంతుదుఃఖీసదైవాసీ బద్ధోహమితిశంకయా
ఇతిశంకాంపరిత్యజ్య సుఖీభవసమాహితః."

బద్ధుఁడవై యున్నట్లు సందేహించుచున్నావుగనుక సదా దుఃఖమునే యనుభవింపుచున్నావు. కనుక శంకను విడిచితివేని సుఖపడఁగలవు. కనుక నోశుకమహర్షీ!

“శ్లో॥ దేహోఽయం మమ బన్ధోఽయం న మమేతి చ ముక్తతా ।
తథా ధనం గృహం రాజ్యం న మమేతి చ నిశ్చయః.”

“ఈ దేహము నాది” అనుకొనుటయే బంధహేతువు, “నాది కాదు” అనుకొనుటయే బంధవిముక్తి కనుకనే నీ దేహము గాని, ఈ ధనము గాని, ఈ గృహము గాని, ఈ రాజ్యము గాని నాది కాదనియెడు నిశ్చయము గలవాఁడనై యున్నాను. అని జనకచక్రవర్తి శుకమహర్షికిం జెప్పియున్నాఁడు. కాఁబట్టి యోయియర్జునా! నిర్గుణోపాసన సేయుట మహాకష్టమని యెఱుంగుము.

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ 6

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ! మయ్యావేశితచేతసామ్ ॥ 7

అర్థము :— హే పార్థ! = ఓ యర్జునా!, యే + తు = ఎవరైతే, సర్వాణి + కర్మాణి = సమస్తకర్మములను, మయి + సన్న్యస్య = నాయందర్పించి, మత్పరాః = నాయందుఁ జేర్చిన చిత్తముగలవారగుచు, అనన్యేన + యోగేన = ఇతరచింత లేవియు లేక, మామ్ + ఏవ + ధ్యాయన్తః = నన్నే ధ్యానింపుచున్నవారై, ఉపాసతే = ఉపాసించుచున్నారో, మయి + ఆవేశితచేతసామ్ = (అట్లు) నాయందు జేర్పఁబడిన చిత్తముగల, తేషామ్ = వారలకు. అహమ్ = నేను, న + చిరాత్ = శీఘ్రముగా, మృత్యుసంసారసాగరాత్ = మరణకారణమగు సంసారసాగరమునుండి, సముద్ధర్తా = ఉద్ధరించువాఁడను, భవామి = అగుచున్నాను.

ఇఁకను సగుణోపాసనఁ జేయువారన్నో, వారు చేయు సమస్తకర్మములను నాయందర్పించి సదా నాయందే చిత్తమును జేర్చినవారై యితర చింత లేవియు లేక నన్నే ధ్యానింపుచుందురు. అట్లెవరు చేయుచున్నారో వారి యోగక్షేమములను నేనే వహించుచున్నానని యింతకుముందే నీకుఁ జెప్పియున్నానుగదా? (చూ. 9-22) కాఁబట్టి యట్టివారలయొక్క భవబంధములనెల్ల బాపి జననమరణ రూపకమగు సంసార సాగరమును దాటించుచున్నాను. కనుక నట్టివారు శీఘ్రముగఁ దరించఁగలరు.

అర్జు — అయ్యా! ఇంతకుముందు సగుణోపాసకుఁడు నీకు మిక్కిలి ప్రియుఁడనియు (చూ. 12-2), నిర్గుణోపాసకుఁడు నీ స్వరూపుఁడే యనియు (చూ. 12-3-4), చెప్పియుంటివిగదా? ఇపుడు నీవు చెప్పెడు విషయములనుబట్టి చూడఁగా నట్టి యా యిరువురిలో సగుణోపాసకుఁడై నిన్ను భజించెడువానికి

మాత్రము నీవు సహాయభూతుఁడవుగా నుండి సంసారసాగరమునుండి శీఘ్రముగఁ దరింపఁజేయునట్లును, నిర్గుణోపాసకుఁడగు వాని కట్టిసహాయ మేమియుఁ జేయకుండు నట్లును గనఁబడుచున్నదే, అందుకుఁ గారణమేమి ?

కృ — అవును అదినిజమే. సగుణోపాసకుఁడు నా సహాయమువలనను, నిర్గుణోపాసకుఁడు స్వతంత్ర శక్తిచేతను, తరించవలసినవారై యున్నారు. అదెట్లనఁగా నిర్గుణోపాసకుఁడు,

"తే. గీ. అతుల మమలంబు విశ్వ మచ్యుతము బరము
నైన పరమాత్మ రూపంబు నేనె కాని యన్య మొక్కటిలేదని
యాత్మఁదలఁచు." (వా. రా. 3 అ.)

అనునట్లు, నేనే పరమాత్మ స్వరూపుఁడను, నాకంటె నితరమైన దేదియును లేదు అనియెడు భావముఁతోఁ గూడిన వాఁడై నేనే తానుగను తానే నేనుగను భావించికొనుచున్నాఁడు గాన నట్టివాఁడు నా సహాయమును గోరక యే తన స్వశక్తి చేతనే సంసారసాగరమును దరించుటకుఁ బ్రయత్నముఁ జేయుచున్నాఁడు. ఇఁకను సగుణోపాసకుఁడన్ననో తాఁజేయు కర్మల నన్నిటిని నాకు నర్పణముచేసి సదా నన్నే ధ్యానించుచు తన్ను కడతేర్చవలసిన భారము నాయందే మోపుఁచున్నాఁడు. ఈయుభయుల వైఖరి యోచించి చూడఁడ నెట్లున్నదనఁగా, పూర్ణముగాఁ బ్రవహింపుచుండెడు నొకగొప్పనదిని దాటుటకుగా నిద్దరుపురుషులు ప్రయత్నించి యుండొకఁడు, ఈతియందు మిగుల సమర్థుఁడగుటచే నితర యోసహాయమును గోరక తనంతట నీదిపోఁగల ననియెడు నమ్మకముతో నానదిలోదిగుచున్నాఁడు. రెండవవాఁడు, ఈతలో మొదటివానికి నున్నంత సమర్థత లేమింజేసి మొదటివానివలె సాహసించి దిగఁజాలక యొక తెప్పకొయ్య నాధారముగాఁ జేసికొని దిగుచున్నాఁడు. ఈ యుభయులు నానదిని కడవెళ్ళ నీది యావలిగట్టు చేరినయెడల రెండవవానికంటె మొదటివాఁడు శ్రేష్ఠుఁడగుచున్నాఁడు గదా? అట్లే నిర్గుణ సగుణోపాసకు లిరువురిలో మొదటివాఁడగు నిర్గుణోపాసకుఁడు తన స్వశక్తిచేతను, సగుణోపాసకుఁడు నన్నాధారముగఁ జేసికొని నాయందు భారము వేసియును సంసారసాగరమును దరింపఁ బ్రయత్నించుచు వారై యున్నారు. కాఁబట్టి వారిరువురు నట్లు తరించినయెడల నందులో మొదటివాఁడగు నిర్గుణోపాసకుఁడు రెండవవాఁడగు సగుణోపాసకునికంటె శ్రేష్ఠుఁడని, అనఁగా, మొదటివాఁడు నా స్వరూపుఁడేయనియు, రెండవవాఁడు నాకత్యంత ప్రియుఁడనియు, వేరుగాఁ జెప్పనేల? అయితే, ఇపుడు నేఁజెప్పిన దృష్టాంతము

లోని మొదటివాఁడు, ఈతలో నెంత నిపుణుఁడైనను, నిరాధారుఁడుగా నుండుటచే నొకానొకవేళ నానదీప్రవాహ వేగమునకుఁ దట్టుకొనఁజాలకయో, మఱి యేహేతువుచేతనైనను సరే తన చేతులయొక్కయు, కాళ్ళయొక్కయు, బలముడిగి యానది కడవెళ్ళ నీదఁజాలక మధ్యమునిగి పోవుటయును గలదుగదా? అట్లే నిర్గుణోపాసకులయందును, గొంద ఱేదేని యొక కారణముచేఁ జలింపఁబడిన బుద్ధిగలవారై చెడఁగలరు.

ఇఁకను, తెప్పకొయ్య నాధారము చేసికొని నదిలోఁ దిగిన వాఁడన్ననో, తెప్పకొయ్యమీఁదఁ దనభారమును మోపికొనుచు నీదుచున్నాఁడుగాన వాని చేతుల యొక్కయు, కాళ్లయొక్కయు బలము తగ్గవలసిన కారణములేదు. ఒకవేళ తగ్గినను మొదటివానివలె మునిగిపోక యా తెప్పకొయ్యమీఁద భారముమోపి కొంతసేపు యీత మాని విశ్రమించుచు మరల నీదుకొనుచు మెల్లమెల్లఁగఁ బోయి యావలిగట్టు చేరఁగలఁడుగదా! అట్లే, సగుణోపాసకుఁడు నాయందు భారముమోపినవాఁడు గాన నట్టివానికి నొకానొకవేళ బుద్ధి చలించినను, నేను వానిం జెడనీక మంచిమార్గమునకుఁ ద్రిప్పి కడతేర్చుచుందును. కనుక నిట్లే స్వయముగా నీదఁగలిగిన మొదటి వాఁడును, తన స్వశక్తిని నమ్మక, రెండవవానివలెనే తాను నొక తెప్పకొయ్య నాధారముగఁ జేసికొని యుండినయెడల నెట్లు తప్పక ఆవలియొడ్డుకుఁ జేరఁగలఁడో, అట్లే, నిర్గుణోపాసనా శక్తిగలవాఁడును సగుణోపాసన చేసినయెడలఁ దప్పక కడతేరఁ గలఁడుగదా? కాన నిందువలన నెవఁడైననుసరే సంసారసాగరమును దరించుటకు నిర్గుణోపాసనా మార్గము నవలంబించుటకంటె సగుణోపాసనా మార్గము నవలంబించుటయే మేలని యేర్పడుచున్నదిగదా?

శ్లో॥ మ య్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మ య్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ 8

అర్థము :— మయి + ఏవ = నాయందే, మనః + ఆధత్స్వ = మనస్సునుంచుము. మయి + బుద్ధిమ్ + నివేశయ = నాయందే బుద్ధినిలుపుము, అత ఊర్ధ్వమ్ = అటుపిమ్మట, మయి + ఏవ = నాయందే, నివసిష్యసి = నివసింపఁగలవు, న + సంశయః = సందేహము లేదు.

కనుక నోయిఅర్జునా! నీవు నట్లే సగుణోపాసనామార్గము నవలంబించిన వాఁడవై నాయందే బుద్ధి నిలిపి మనస్సుచేత నెల్లప్పుడును నన్నే ధ్యానింపుచుండుము. అట్లు చేసితివేని నీ దేహమును విడిచిన పిమ్మట నా సాయుజ్యమును పొందఁగలవు. ఇందున కేమాత్రమును సంశయములేదు.

అర్జు — అయ్యా ! మనస్సు చపలస్వభావము గలదిగదా ! కనుక దాని నెల్లప్పుడును నీయందే నిలుపలేక పోయినయెడల నేమి చేయవలయును ?

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయిస్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ॥ 9

అర్థము :— హేధనఞ్జయ!=ఓయియర్జునా!, అథ=పిమ్మట(అట్లుగాక), మయి=నాయందు, చిత్తమ్=మనస్సును, స్థిరమ్+సమాధాతుమ్=స్థిరముగా నిలుపుటకు, న+శక్నోషి+(యది)=అశక్తుఁడవైతివేని, తతః=అటుపిమ్మట, అభ్యాసయోగేన=అభ్యాసయోగముచేత, మామ్+అప్తుమ్=నన్నుఁబొందుటకు, ఇచ్ఛ=ఇచ్ఛయింపుము

కృ — ఓయియర్జునా! ఇంతకుముందు నీ విట్లే,

"శ్లో. చంచలంహిమనః కృష్ణప్రమాథి బలవద్దృఢమ్
తస్యాహంనిగ్రహం మన్యేవాయోరివసుదుష్కరమ్"

అని ప్రశ్న చేసినందుకు, నేను

"శ్లో. అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహంచలమ్
అభ్యాసేనతు కౌన్తేయవైరాగ్యేణచగృహ్యతే"

అని చెప్పియున్నాను జ్ఞాపకమున్నదా ? (చూ. 6 34-35).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కాన నట్లు నీమనస్సు నాయందెల్లప్పుడు నిలువక పోయినయెడల నేమి చేయవలయుననఁగా, అట్లు మనస్సును నిలుపుటకు నభ్యాసము చేయుచు రావలయును. అదెట్లనఁగా,

"శ్లో. యతోయతోనిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్।
తతస్తతోనియమ్యైత దాత్మన్యేవవశంనయేత్ ॥"

అని యిదివఱకే నీకుఁ జెప్పియున్నానుగదా, అది జ్ఞాపకములోనున్నదా !

(చూ. 6-26)

అర్జు — అవును, జ్ఞాపకమున్నది.

కృ — ఇపుడు నేఁజెప్పెడు నభ్యాసమనఁగా నదియేయని యెఱుంగుము. కనుక నట్లు మనసెప్పుడెప్పు డేయేవిషయములయందుఁ బ్రవర్తింపుచున్నదో, అప్పుడప్పుడాయా విషయములనుండి మరలించుకొనుచు రావలయును. అట్లు చేయుచు

వచ్చితివేని కొంతకాలమునకు నీమనస్సు చపలతను మాని నీ స్వాధీనమునందుండఁ గలదు. అప్పుడు నీమనస్సును నాయందు స్థిరముగా నిలుపఁగలశక్తి నీకుఁ గలుగును.

అర్జు — అయ్యా! ఇపుడు నీవు చెప్పినదంతయు మానసికమైయున్నది. ఆ మనస్సు అభ్యాసము వలననుగూడ స్వాధీనము కానియెడల నేమిచేయవచ్చును?

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థ మపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి॥ 10

అభ్యాసే + అపి = అభ్యాసముచేయుటయందును, అసమర్థః + అసి + (చేత్) = సమర్థతలేనివాడవైతివేని, మత్కర్మపరః = నాకర్మలను జేయుటయందాసక్తిగలవాఁడవు, భవ = అగుము. మదర్థమ్ = నాకొఱకు, కర్మాణి = కర్మములను. కుర్వన్ + అపి = చేయుచున్నను, సిద్ధిమ్ + అవాప్స్యసి = సిద్ధినిబొందఁగలవు.

కృ — అట్లు అభ్యాసము సేయుటకుఁగూడ నీకు శక్తిలేకపోయినయెడల నంతకంటె సులభోపాయము మఱి యొకటిగలదు. దానిం జెప్పుచున్నాను వినుము. అదే మనఁగా. నా విషయకములగు అనఁగా, నా ప్రీత్యర్థము కాయిక కర్మలనైన నాచరింపుము. అనఁగా నన్నారాధించుట, నా ప్రీత్యర్థమై వ్రతముల నాచరించుట, దానాది సత్కర్మల నాచరించుట, ఈమొదలగువానిని జేయుము. అట్లుచేయుచుంటివేని యందువలనఁ గ్రమక్రమముగ నీకు నాయందు భక్తి స్థిరముగ నిలుచును. అటుపిమ్మట నీకు నాయందు మనస్సు నిలుపుటకు సాధ్యపడఁగలదు.

అర్జు — అయ్యా! ఒకవేళ నట్లు చేయుటకునుగూడ శక్తి లేకపోయినయెడల నేమియుపాయము గలదు?

శ్లో॥ అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ 11

అర్థము:— అథ = పిమ్మట (అట్లు కాదేని). మద్యోగమ్ + ఆశ్రితః = నన్నుగూర్చినయోగము నవలంబించినవాఁడవై, ఏతత్ + అపి = ఇదియును, కర్తుమ్ = చేయుటకు, అశక్తః + అసి + (చేత్) = అశక్తుఁడవైతివేని, తతః = అటుపిమ్మట, యతాత్మవాన్ = నియతమనస్కుఁడవై, సర్వకర్మఫలత్యాగమ్ = సమస్తకర్మముల ఫలములను విడిచిపెట్టుటను, కురు = చేయుము.

కృ — ఓయియర్జునా! అట్టి కాయికకర్మములనైనను నీవు నా ప్రీత్యర్థమై ప్రయత్నపూర్వకముగఁ జేయుటకు శక్తిలేనివాఁడవైతివేని పోనిమ్ము. అదియును నక్కఱలేదు. అంతకంటె సులభమగు మఱియొక యుపాయమును జెప్పెద వినుము.

అదేమనిన, నీవు ప్రతిదినమును నిత్యనైమిత్తికాద్యనేక కర్మల విధ్యుక్తముగ నాచరింపుచునే యున్నావుగదా. అట్లాచరించెడు సమస్త కర్మలయొక్క ఫలములయందాసక్తచిత్తుఁడవుగాక యుండుము. అట్లు చేసితివేని సర్వకర్మ ఫలత్యాగము చేసినవాఁడ వగుదువు. అనఁగా నట్టి యన్ని కర్మములను నాకర్పించిన వాఁడ వగుదువు. కనుకనేగదా, ఇంతకుముందు

"శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వమదర్పణమ్."

అని చెప్పియున్నాను జ్ఞాపకమున్నదా? (చూ. 9. 27.)

అర్జు — అవును. జ్ఞాపకమున్నది. అయితే, అట్లు సర్వకర్మఫలత్యాగము నేయుటయెట్లు? అందువలన నాకర్మములు నీకెట్లర్పితము లగుచున్నవి?

కృ — సర్వకర్మ ఫలత్యాగము చేయుట యెట్లనఁగా, నీవు ప్రతిదినమును నీవర్ణాశ్రమాచార ధర్మముల ననుసరించి విధ్యుక్తప్రకార మాచరించెడు నిత్య నైమిత్తికాది కర్మలన్నియు సూత్రధారునిచే బొమ్మలాడించఁబడినట్లు (చూ. 18. 61.), భగవంతునివలన నీచేఁ జేయింపఁబడు చున్నవేగాని యాకర్మలయొక్క కర్తృత్వము నీకు లేదనియెడు మనో నిశ్చయము గలిగియుంటివేని యాకర్మలయొక్క ఫలము లగు పుణ్యపాపములు నాకర్పితము లగుచున్నవే గాని నీకంటనేరవు. కనుకనేగదా,

"శ్లో. యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయంకర్మబన్ధనః
తదర్థం కర్మకౌన్తేయముక్తసఙ్గస్సమాచర."

అని యింతకుముందు చెప్పుటకు గారణమైనది జ్ఞాపకమున్నదా? (చూ 3. 9.)

అర్జు — అవును జ్ఞాపకమున్నది. అయితే, అట్లు సర్వకర్మఫలత్యాగము చేసినంతమాత్రము చేతనే యెవఁడైన నెట్లు కడతేరఁగలఁడు?

శ్లో॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే ।
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్ ॥ 12

అర్థము :— హి = ఏలయనఁగా, అభ్యాసాత్ = అభ్యాసముకంటె. జ్ఞానమ్ = జ్ఞానము, శ్రేయః = శ్రేష్ఠమైనది, జ్ఞానాత్ = జ్ఞానముకంటె, ధ్యానమ్ = ధ్యానము, విశిష్యతే = శ్రేష్ఠమైనదగుచున్నది, ధ్యానాత్ = ధ్యానముకంటె, కర్మఫలత్యాగః = కర్మఫలత్యాగము, (విశిష్యతే) = విశేషమైన దగుచున్నది, త్యాగాత్ + అనన్తరమ్ = కర్మఫలత్యాగమును జేసినవెనుక, శాన్తిః + (భవతి) = చిత్తశాంతికలుగుచున్నది.

కృ — ఓహో, అట్లెంచుచున్నావా యేమి? అందువలనఁగలిగెడు ప్రయోజనము మఱిదేనివలనను గలుగ నేరదు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నానువినుము.

ఈ లోకమున నెవరైనను సరే యోగాభ్యాసము సేయుట యెందుకు?

అర్జు — జ్ఞానము కొఱకు. అనఁగా, సదసద్వివేకముకొఱకు.

కృ — అప్పటికి, అభ్యాసముకంటెజ్ఞానము శ్రేష్ఠమైనదికదా?

అర్జు — అవును, అభ్యాసముయొక్క ఫలమే జ్ఞానముగనుక దానికంటె నిదియే శ్రేష్ఠమైన దగుచున్నది.

కృ — అవునుగదా, అట్లు జ్ఞానమంకురించినంతమాత్రము చేతనే ఇఁక మన క్షేమని గర్వించి యూరకున్న యెడల

"తే. కొంద ఱాత్మతత్త్వము నెఱుంగుదుమటంచు
గర్వులై నిక్క చిత్తనిగ్రహము లేమి
నుపరతిసుఖంబుగానక విపులవిషయ
రాగలోలతఁ జెడుదు రూరక మహాత్మ!" (సీ. రా. 3 ఆ. ౧౪౦).

అనునట్లు, సంపూర్ణ వైరాగ్యమును, చిత్తనిగ్రహమునందు సంపూర్ణశక్తి యును గలుగఁ జాలదుగనుక నాజ్ఞానము మిఱిరి స్థిరపడుటకుఁ గాను ధ్యానము సేయు చుండవలయును. కనుక నట్టి జ్ఞానమునకంటె ధ్యానము శ్రేష్ఠమైనదగు చున్నదిగదా? ఇఁకను, అట్టి ధ్యానముచే సుదిర్థినజ్ఞానమువలన నహంకార మమకారము లుడుగును. అట్లహంకార మమకారము లుడిగినవానికిఁ దాఁ జేయుకర్మములయందుఁ గర్తృత్వా భిమానమును, అందలి ఫలాపేక్షయును, దనంతట విడిచి పోవును. కనుక నట్టి ధ్యానముకంటె సర్వ కర్మ ఫలత్యాగము శ్రేష్ఠమైన దగుచున్నది.

"యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్,"

అని యిదివఱకే నీకుఁ జెప్పియున్నాను గదా? (చూ. 5. 12.) కనుకనట్లు సర్వకర్మఫలత్యాగ మెప్పుడు చేయుచున్నాఁడో, అప్పుడే వానికిఁ జిత్త శాంతి గలుగుచున్నది. అనఁగా, వాని మనస్సు కామ క్రోధాదులచేతను, సుఖదుఃఖాది ద్వంద్వములచేతను జలింపఁబడక నెమ్మదిగా నుండును. అట్టి దశ నెప్పుడు పొందు చున్నాఁడో అప్పుడు వాఁడు మోక్షార్హుఁడగును. కనుక నోయి యర్జునా! ఇందు వలన నేమియేర్పడుచున్న దనఁగా, ముముక్షువగువాఁడు సర్వకర్మ ఫలత్యాగమును ముఖ్యముగాఁ జేయవలయును అట్లు సర్వకర్మ ఫలత్యాగము సేయువాని లక్షణము లెట్లుండు ననఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానామ్ మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖ సుఖః క్షమీ ॥ 13

శ్లో॥ సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మ య్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః ॥ 14

అర్థము :— సర్వభూతానామ్=సమస్తభూతములకు, అద్వేష్టా=ద్వేషములేనివాఁడును, మైత్రః=మిత్రత్వముగలవాఁడును, కరుణః=కారుణ్యము గలవాఁడును, నిర్మమః=మమకార రహితుఁడును, నిరహఙ్కారః=అహంకారరహితుఁడును, సమదుఃఖసుఖః=సుఖదుఃఖములయందు సమబుద్ధి గలవాఁడును, క్షమీ=ఓర్పుగలవాఁడును, సతతమ్+సన్తుష్టః=నిత్యసంతోషియు, యతాత్మా=మనో నిగ్రహుఁడును, దృఢనిశ్చయః=నిశ్చయజ్ఞానముగలవాఁడును, మయి+అర్పితమనోబుద్ధిః=నాయందర్పించిన మనోబుద్ధులు గలవాఁడును, యః=ఎవఁడో, సః+యోగీ+ఏవ=అట్టినిష్కామకర్మానుష్ఠాన పరుఁడగు యోగియే, మద్భక్తః=నాకు భక్తుఁడును, మే=నాకు, ప్రియః+చ=ప్రియుఁడును (అగుచున్నాఁడు).

సమస్త భూతముల యందును స్నేహద్వేషములు లేనివాఁడై కరుణగలిగియుండవలెను. అనఁగా, తనకు మేలుచేసెడు వారియెడల స్నేహభావమును, కీడుచేసెడు వారియెడల ద్వేషమును ఉంచక అందఱియెడలను సమబుద్ధిగలవాఁడై యుండుటయగాక వారలయెడల దయార్ద్రహృదయుఁడై యుండవలెను. మఱియు నహంకార మమకారములు లేనివాఁడై యుండవలెను. అనఁగా, ఇది నేఁజేయుచున్నాననే మొదలగు కర్తృత్వాభిమానముగాని, ఇది నాదియనెడు మమకారముగాని లేనివాఁడైయుండవలెను. మఱియు నితరులు తనకెట్టి కీడుచేసినను వారలకుఁ బ్రతికీడును జేయక యోర్చికొని యుండవలయును. ఇట్టివాని మనస్సెప్పుడును సంతుష్టి నొందుచుండునేగాని దుఃఖమునొందదు గాన నిట్టి లక్షణములు గలవాఁడెవఁడో, అట్టివాఁడే నిష్కామకర్మయోగి యనఁబడును. అనఁగా సర్వకర్మ ఫలత్యాగి యనఁబడును. కాన నట్టివాఁడే నాకు భక్తుఁడును, మిక్కిలి ప్రియుఁడునగుచున్నాఁడు.

శ్లో॥ యస్మా న్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః ॥15

అర్థము :— యస్మాత్=ఎవనివలన, లోకః=జనము, నోద్విజతే=భయము నొందదో, యః=ఎవఁడు, లోకాత్=జనమువలన, నోద్విజతే+చ=భయము

నొందఁడో, యః=ఎవఁడు, హర్షామర్షభయోద్వేగైః+ముక్తః=సంతోష-రోష-భయములచేఁ గలఁతనొందని మనస్సుగలవాఁడో, సః+చ=(అట్టి) వాఁడును, మే+ప్రియః=నాకుఁ బ్రియుఁడు.

మఱియు, నట్టివాఁడెట్లుండు ననఁగా, అట్టివాఁడు సమస్తభూతములును దన వంటివేయని యెఱిఁగినవాఁడైయుండును (చూ. 6-29). కాన నట్టి యితరయేజంతు వునకేలాటి బాధకలిగినను, ఆబాధ తనకుఁగలిగినట్లే యెంచికొనును (చూ. 6-32). కాన నట్టివాడు స్వయముగా నితరయేజంతువునకును నేలాటి బాధయును గలుగఁ జేయఁడు గదా? కాఁబట్టి యట్టివానివలన లోకమునకు, అనఁగా, ఇతరజనులకు గాని, లేక, పశుపక్ష్యాది యితరజీవజంతువులకుగాని యేలాటి భయమును గలుగ నేరదు. అట్లితరజంతువులకు నేలాటి భయమును వానివలన నెప్పుడు కలుగక పోయెనో అప్పుడాజంతువులలో నేదియు వానియెడలఁ గ్రూరస్వభావము గలిగి యుండవలసిన కారణముండెదుగాన నవి వానికేమియు నపకారము సేయనేరవు. కాఁబట్టి యిట్టి యితరజంతువులను జూచి యట్టివాఁడు భయము నొందవలసిన కారణ ముండనేరదు. మఱియు నట్టివాఁడు ప్రియమును బొందినపుడు సంతసించుటయు, అప్రియమును బొందినపుడు దుఃఖించుటయు లేదని యింతకుముందే చెప్పయుుం టినిగదా, (చూ. 5-20). కనుక నట్టివానిమనస్సు హర్షామర్షభయములచేఁ గలఁత నొందకుండును. కాన నిట్టి లక్షణములు గలవాఁడే సర్వకర్మఫలత్యాగమును జేయుటకు నర్హుఁడగును గాన నట్టివాఁడు నాకుఁ బ్రియుఁడు.

శ్లో॥ అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః॥ 16

అర్థము :— యః+మద్భక్తః=ఏ నాభక్తుఁడు, అనపేక్షః=దేనియందు నపేక్ష లేనివాఁడును, శుచిః=చిత్తశుద్ధిగలవాఁడును, దక్షః=ఇంద్రియ మనోనిగ్రహముఁ జేయుటయందు సమర్థుఁడును, ఉదాసీనః=ఎందును దగులనివాఁడును, గతవ్యథః= మనోవ్యాకులము లేనివాఁడును, సర్వారమ్భపరిత్యాగీ=సమస్త కామ్యకర్మములను వదలినవాఁడును (అగుచున్నాఁడో), సః=వాఁడు, మే+ప్రియః=నాకుఁ బ్రియుఁడు.

అట్టి నాభక్తుఁడు మఱియు నెట్లుండుననఁగా, ఇహలోకసౌఖ్యమునకుఁగాని పరలోకసౌఖ్యమునకుఁగాని యుపయోగించెడు వానిలో నేదియు నపేక్షింపనివాఁ డును, పరిశుద్ధాంతఃకరణుండును, తనమనస్సును ఇంద్రియములవెంబడి విషయమున మీఁదికిఁ బోనీక మరలించుకొనుటయందతిసమర్థుఁడును, మంచిచెడుగులలో దేని యందును దగులము నొందని వాఁడునునై యుండును. కాన నట్టివాని కేవిధమైల

మనోవ్యాకులము నుండనేరదుసరేకదా, అట్టివాఁడు సమస్తకామ్యకర్మములను వదలినవాఁడగుచున్నాఁడు. అనఁగా, స్వప్రయోజనార్థమై యేకర్మము నాచరింపక తానాచరించెడు కర్మలన్నియు భగవదర్పితములే చేయుచుండును. కావున నట్టివాఁడు

"క. అపరిగ్రహాసర్వారం
భపరిత్యాగములుఁగలుగు పండితునకు దుః
ఖపుఁదెరువు వాటిలదు మో
క్షపదము చొప్పడి తదాత్మక సుఖంబొందున్."

(భార. శాంతి. ౬ అ. ౩౧౩)

అనునట్లు, ఏవిధమైన మనోవ్యాకులమును లేనివాఁడై నాయందు జిత్తమును దృఢముగా నిలుపఁగలుగును. కాన నట్టివాఁడు నాకుఁబ్రియుఁడు.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ 17

అర్థము :— యః=ఎవఁడు, న+హృష్యతి=సంతోషింపఁడో, న+ద్వేష్టి=ద్వేషింపఁడో, న+శోచతి=దుఃఖింపఁడో, న+కాంక్షతి=కోరఁడో, యః=ఎవఁడు, శుభాశుభపరిత్యాగీ=శుభాశుభములను వదలినవాఁడో, సః+భక్తిమాన్=అట్టిభక్తుఁడు, మే+ప్రియః=నాకుఁబ్రియుఁడు.

మఱియు నిట్టి లక్షణములు గలవాఁడు తనకుఁ బ్రియము సేకూరినపుడు సంతోషించుటయు, అప్రియము చేకూరినపుడు ద్వేషించుటయు, కష్టము గలిగినపుడు దుఃఖించుటయు, దేనినైన నపేక్షించుటయు నుండదుగాన నట్టివాఁడు

"తే. గీ. అఖిలవిషయానభిస్నేహుఁడగుచు శుభము
నొంది మురియక యశుభంబు నొంది కినియ
కుండు నెవ్వాఁడు సమతనప్పండితుండు
సంస్థితప్రజ్ఞుఁడగు జూవె జనవరేణ్య"

(సీ. రా. 3 అ. ౧౪౫)

అనునట్లు, శుభాశుభములలో నెప్పుడేదిగలిగినను, దానిచే నేలాటిమనోవికారమును బొందకుండును. ఇట్టిలక్షణములు గలవాఁడు స్థితప్రజ్ఞుఁడని యింతకు ముందు నీకుఁ జెప్పియుంటినిగదా ? (చూ. 2-57) (5-20). కాఁబట్టి యోయియర్జునా ! ఇట్టి లక్షణములుగల భక్తుఁడెవఁడో వాఁడు నాకుఁ బ్రియుఁడు

శ్లో॥ సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః ॥ 18

శ్లో॥ తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19

అర్థము:— శత్రౌ + చ = శత్రువునందును, మిత్రే + చ = మిత్రునియందును, తథా = అలాగుననే, మానావమానయోః = మానావమానములయందును, సమః= సమభావము గలవాఁడును, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణసుఖదుఃఖములయందు, సమః = సమభావముగలవాఁడును, సఙ్గవివర్జితః = దేనియందు నాసక్తిలేనివాఁడును, తుల్యనిన్దాస్తుతిః=దూషణభూషణలయందు సమభావముగలవాఁడును, మౌనీ = మౌనముగలవాఁడును మితభాషియు), యేనకేనచిత్ + సన్తుష్టః=ఎప్పుడేది లభించినను దానితోఁదృప్తినొందువాఁడును, అనికేతనః = నివాసస్థలము లేనివాఁడును, స్థిరమతిః = చలింపక స్థిరముగానుండు మనస్సుగలవాఁడును, భక్తిమాన్=(నాయందు) భక్తిగలవాఁడునునగు, నరః=మనుజుఁడు, మే + ప్రియః = నాకుఁబ్రియుఁడు.

మఱియు నట్టివాని లక్షణము లెట్లుండుననఁగా. ఇంతకుముందు నేనే నీకుఁ జెప్పిన విషయములలో విద్యావినయ సంపన్నులగు బ్రాహ్మణులయందును, గోవులందును, ఏనుగులయందును, శునకములయందును, శ్వపచులయందును, సమదృష్టి గలవారు పండితులనియు, (చూ. 5. 18.) అట్టివారిలోను మిత్రులు-శత్రులు-బంధువులు-సాధువులు-పాపులు మొదలగువారియందు సమబుద్ధిగలవారు శ్రేష్ఠులనియును (చూ. 6. 9.), మఱియు నట్టివారు శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు మొదలగు ద్వంద్వములయందు సమభావము గలవారై యుందురనియు (చూ. 6. 7.) చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా?

అర్జు — అవును. జ్ఞాపకమున్నది.

కృ — కనుక నట్లు తనకు హానింజేయు శత్రువునందును, తనకు మేలుచేయు మిత్రునియందును సమబుద్ధిగలవాఁడును, మానావమానములయందు సముఁడును, అనఁగా, తన్ను సన్మానించువారియెడలఁ బ్రీతియు అవమానించువారియెడల నప్రీతియు లేనివాఁడై తన్ను భూషించువారిని దూషించువారిని దుల్యముగాఁ జూచుచుండును. మఱియు నట్టివాఁడు సుఖదుఃఖకారణములగు శీతోష్ణాది ద్వంద్వములవలన నేలాటి మనోవికారమును జెందకయు, దారపుత్ర బంధుమిత్రాదుల యెడలను ధనధాన్య గృహక్షేత్రా రామాదులయెడలను మమకారముంచకయు, ఏవేళ కేది భగవదిచ్ఛాను

మనోవ్యాకులము నుండనేరదుసరేకదా, అట్టివాఁడు సమస్తకామ్యకర్మములను వదలినవాఁడగుచున్నాఁడు. అనఁగా, స్వప్రయోజనార్థమై యేకర్మము నాచరింపక తానాచరించెడు కర్మలన్నియు భగవదర్పితములే చేయుచుండును. కావున నట్టివాఁడు

"క. అపరిగ్రహాసర్వారం
భపరిత్యాగములుగలుగు పండితునకు దుః
ఖపుఁదెరువువాటిలదు మో
క్షపదము చొప్పడి తదాత్మక సుఖంబొందున్."

(భార. శాంతి. ౬ ఆ. ౩౧౩)

అనునట్లు, ఏవిధమైన మనోవ్యాకులమును లేనివాఁడై నాయందు జిత్తమును దృఢముగా నిలుపఁగలుగును. కాన నట్టివాఁడు నాకుఁ బ్రియుఁడు.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః ॥ 17

అర్థము :— యః=ఎవఁడు, న+హృష్యతి=సంతోషింపఁడో, న+ద్వేష్టి=ద్వేషింపఁడో, న+శోచతి=దుఃఖింపఁడో, న+కాంక్షతి=కోరఁడో, యః=ఎవఁడు, శుభాశుభపరిత్యాగీ=శుభాశుభములను వదలినవాఁడో, సః+భక్తిమాన్=అట్టిభక్తుఁడు, మే+ప్రియః=నాకుఁ బ్రియుఁడు.

మఱియు నిట్టి లక్షణములు గలవాఁడు తనకుఁ బ్రియము సేకూరినపుడు సంతోషించుటయు, అప్రియము చేకూరినపుడు ద్వేషించుటయు, కష్టము గలిగినపుడు దుఃఖించుటయు, దేనినైన నపేక్షించుటయు నుండదుగాన నట్టివాఁడు

"తే. గీ. అఖిలవిషయానభిస్నేహుఁడగుచు శుభము
నొంది మఱియుక యశుభంబు నొంది కినియ
కుండు నెవ్వాఁడు సమతనప్పఁడితుండు
సంస్థితప్రజ్ఞుఁడగు జూవె జనవరేణ్య"

(నీ. రా. ౩ ఆ. ౧౭౫)

అనునట్లు, శుభాశుభములలో నెప్పుడేదిగలిగినను, దానిచే నేలాటిమనోవికారమును బొందకుండును. ఇట్టిలక్షణములు గలవాఁడు స్థితప్రజ్ఞుఁడని యింతకు ముందు నీకుఁ జెప్పియుంటినికదా? (చూ. 2–57) (5–20). కాఁబట్టి యోయియర్జునా! ఇట్టి లక్షణములుగల భక్తుఁడెవఁడో వాఁడు నాకుఁ బ్రియుఁడు

శ్లో॥ సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః ॥ 18

శ్లో॥ తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19

అర్థము:— శత్రౌ + చ = శత్రువునందును, మిత్రే + చ = మిత్రునియందును, తథా = అలాగుననే, మానావమానయోః = మానావమానములయందును, సమః= సమభావము గలవాఁడును, శీతోష్ణసుఖదుఃఖేషు = శీతోష్ణసుఖదుఃఖములయందు, సమః = సమభావముగలవాఁడును, సఙ్గవివర్జితః = దేనియందు నాసక్తిలేనివాఁడును, తుల్యనిన్దాస్తుతిః=దూషణభూషణలయందు సమభావముగలవాఁడును, మౌనీ = మౌనముగలవాఁడును మితభాషియు), యేనకేనచిత్ + సన్తుష్టః=ఎప్పుడేది లభించినను దానితోఁదృప్తినొందువాఁడును, అనికేతనః = నివాసస్థలము లేనివాఁడును, స్థిరమతిః = చలింపక స్థిరముగానుండు మనస్సుగలవాఁడును, భక్తిమాన్=(నాయందు) భక్తిగలవాఁడునునగు, నరః=మనుజుఁడు, మే + ప్రియః = నాకుఁబ్రియుఁడు.

మఱియు నట్టివాని లక్షణము లెట్లుండుననఁగా. ఇంతకుముందు నేనే నీకుఁ జెప్పిన విషయములలో విద్యావినయ సంపన్నులగు బ్రాహ్మణులయందును, గోవులందును, ఏనుగులయందును, శునకములయందును, శ్వపచులయందును, సమదృష్టి గలవారు పండితులనియు, (చూ. 5. 18.) అట్టివారిలోను మిత్రులు-శత్రులు-బంధువులు-సాధువులు-పాపులు మొదలగువారియందు సమబుద్ధిగలవారు శ్రేష్ఠులనియును (చూ. 6. 9.), మఱియు నట్టివారు శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు మొదలగు ద్వంద్వములయందు సమభావము గలవారై యుందురనియు (చూ. 6. 7.) చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా ?

అర్జు — అవును. జ్ఞాపకమున్నది.

కృ — కనుక నట్లు తనకు హానింజేయు శత్రువునందును, తనకు మేలుచేయు మిత్రునియందును సమబుద్ధిగలవాఁడును, మానావమానములయందు సముఁడును, అనఁగా, తన్ను సన్మానించువారియెడలఁ బ్రీతియు అవమానించువారియెడల నప్రీతియు లేనివాఁడై తన్ను భూషించువారినిని దూషించువారినిని దుల్యముగాఁ జూచుచుండును. మఱియు నట్టివాఁడు సుఖదుఃఖకారణములగు శీతోష్ణాది ద్వంద్వములవలన నేలాటి మనోవికారమును జెందకయు, దారపుత్ర బంధుమిత్రాదుల యెడలను ధనధాన్య గృహక్షేత్రా రామాదులయెడలను మమకారముంచకయు, ఏవేళకేది భగవదిచ్ఛాను

సారముగఁ దనకు లభ్యపడుచున్నదో దానితోఁ దృప్తినొందిన మనస్సుగలవాఁడై మితభాషిత్వము గలిగియుండును. మఱియు నట్టి వాఁడు అనికేతనుఁడై యుండును. అనఁగా, తాను జీవించియుండుట స్వల్పకాలము గనుక నట్టి స్వల్పకాలమును గడపుటకుఁగా దనకు శాశ్వతములగు నిండ్లు వాకిండ్లు మొదలగునవి కావలయునని కోరిక యెట్టిదోటనైనను నిశ్చింతగాఁ గాలము గడపుచుండును. కనుక నిట్టి స్థిరచిత్తముగల భక్తుఁడెవఁడో, అట్టివాఁడే నాకుఁ బ్రియుఁడు.

శ్లో॥ యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః॥ 20

అర్థము :—యే + తు=ఎవరైతే, శ్రద్దదానాః=శ్రద్ధావంతులును,మత్పరమాః= నాయందే చిత్తముంచిన వారునునై, ఇదమ్ = ఈ (ఇపుడు నేఁజెప్పిన), ధర్మ్యామృతమ్=మోక్షసాధనమైనధర్మమును, యథోక్తమ్=యథావిధిగా, పర్యుపాసతే= ఆచరింపుచున్నారో, తే+భక్తాః = అట్టిభక్తులు, మే = నాకు, అతీవ+ప్రియాః= మిక్కిలి ప్రియులు.

ఇపుడు నేఁ జెప్పినదంతయు మోక్షమునకు సాధకములైన ధర్మములు. కనుక నీధర్మముల నెవరైతే యథావిధిగా, అనఁగా, (శ్లో 13 మొదలు 19 వఱకుఁ జెప్పఁబడియుండు ప్రకారము) శ్రద్ధావంతులై నాయందే చిత్తముంచి యాచరింపుచున్నారో అట్టి నాభక్తులు నాకత్యంత ప్రియులై యుంచున్నారు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ ద్వాదశోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి భక్తియోగంబను
ద్వాదశాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతాగర్భితభావబోధిని

## త్రయోదశాధ్యాయము

### క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ।
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ!॥ * 1

అర్థము :— హే కేశవ! = ఓకృష్ణమూర్తీ! ప్రకృతిమ్ = ప్రకృతియనుదానిని, పురుషమ్ + ఏవ + చ = పురుషుఁడనువానిని, క్షేత్రమ్ = క్షేత్రమనుదానిని, క్షేత్రజ్ఞమ్ + ఏవ + చ = క్షేత్రజ్ఞుఁడనువానిని, జ్ఞానమ్ = జ్ఞానమనుదానిని, జ్ఞేయమ్ + చ = తెలిసికొనవలసినదానిని, ఏతత్ = ఇదియంతయు. వేదితుమ్ = తెలిసికొనుటకు. ఇచ్ఛామి = కోరుచున్నాను.

అర్జు — అయ్యా, కృష్ణమూర్తీ! ఇంతవఱకు నీవు చెప్పుచువచ్చిన విషయములలో ప్రకృతి—పురుషుఁడు—క్షేత్రము—క్షేత్రజ్ఞుఁడు—జ్ఞానము—జ్ఞేయము అను నీవిషయములను గుఱించి యచ్చటచ్చట సందర్భాను సారముగఁ బ్రస్తాపించియున్నావుగదా, వీనిలో, ప్రకృతియనఁగా నెట్టిదైనదియు, పురుషుఁడనఁగా నెట్టివాఁడైనదియు, క్షేత్రమనఁగా నెట్టిదైనదియు, క్షేత్రజ్ఞుఁడనఁగా నెట్టివాఁడైనదియు, జ్ఞానమనఁగా నెట్టిదైనదియు, జ్ఞేయమనఁగా నెట్టిదైనదియు చక్కఁగాఁ దెలిసికొనఁగోరుచున్నానుగాన దయచేసి వానినన్నిటిని వివరించి చెప్పుము.

శ్రీభగవానువాచ :

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మి త్యభిధీయతే।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 2

* ఇది ప్రక్షిప్తశ్లోకమని పండితుల మతము:— సం.

అర్థము :— హేకౌన్తేయ! = ఓయర్జునా!, ఇదమ్ + శరీరం = ఈదేహము, క్షేత్రమ్ + ఇతి = క్షేత్రమని, అభిధీయతే = చెప్పఁబడుచున్నది, ఏతత్ = దీనిని, యః + వేత్తి = ఎవఁ డెఱుఁగుచున్నాఁడో, తమ్ = వానిని, క్షేత్రజ్ఞః + ఇతి = క్షేత్రజ్ఞుఁడని, తద్విదః = ఆవిషయము నెఱిఁగినవారు, ప్రాహుః = చెప్పుదురు.

కృ — ఓయియర్జునా! ఈలోకమున మనుష్య—పశు—పక్షి—క్రిమి—కీటకాది సమస్తజంతువులు ధరించి యుండెడు పాంచభౌతిక దేహమే క్షేత్రమనఁబడుచున్నది. ఈ దేహమునందు నివసించి యుండెడు జీవాత్మయే క్షేత్రజ్ఞుఁడు, అనఁగా, క్షేత్రము నెఱిఁగినవాఁడు అని తత్త్వవేత్తలు చెప్పుదురు. మఱియు,

"వ. క్షేత్రంబనన వ్యక్తంబనం బ్రకృతియనం బ్రధానం బనం బరఁగు తత్త్వం బొక్కటియ. దాని న సత్త్వంబు నండ్రు. జీవుఁడా క్షేత్రంబు నెఱింగినవాఁడు గావున క్షేత్రజ్ఞుఁడును నవ్యక్తపురంబున వసియించుటం జేసి పురుషుండు నన వెలుంగు." (భాగ. శాంతి. ౬. ఆ ౪౩.) అనునట్లు, ఈ క్షేత్రంబునకే అవ్యక్తంబనియు, ప్రకృతియనియు, ప్రధానంబనియు, సత్త్వంబనియుఁ జెప్పుదురు. జీవుండు (జీవాత్మ) ఆ క్షేత్రంబునందుండి దాని నెఱింగెడు వాఁడు గావున క్షేత్రజ్ఞుఁడనియు, నవద్వారములుగల పురమువంటిది యగు నా క్షేత్రంబున వసియించుటం జేసి పురుషుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

అర్జు — అయ్యా! క్షేత్రజ్ఞుఁడనఁగా క్షేత్రము నెఱిఁగెడువాఁడని యర్థమగుచున్నదిగదా? ఇందువలన దేహస్థుఁడగు జీవుఁడు దేహము నెఱుఁగుచున్నాఁడని యర్థమగుచున్నదిగదా? దీనిభావమేమి? వివరించి చెప్పుడు.

కృ — జీవుఁడు దేహము నెఱుఁగుట యనఁగా, ఏదేహమునందుండెడు జీవుఁడా దేహమునకు నెఱిఁగెడు శక్తిని గలుగఁజేయుచున్నాఁ డనుట. అదెట్లనఁగా, ఒక నిర్జీవ కళేబరమునకును జీవసహిత కళేబరమువలెనే శ్రోత్ర — త్వక్ — చక్షు — జిహ్వా— ఘ్రాణంబు లనియెడు జ్ఞానేంద్రియంబులును, వాక్—పాణి—పాద—పాయు—ఉపస్థలనియెడు కర్మేంద్రియములును గలిగియుంచున్నవిగదా; ఆఇంద్రియములతో నేమైన పనిఁజేయుచున్నదా? అనఁగా, నేత్రములతోఁ జూచుట, చెవులతో వినుట, ముక్కుతో నాఘ్రాణించుట, జిహ్వతో రుచిఁజూచుట, త్వక్కుతో స్పృశించుట మొదలగు పనులఁ జేయుట గలదా!

అర్జు — లేదు. జీవసహితమైన శరీరమునకు మాత్రమే యట్లు చేయుటకు శక్తి కలదుగాని జీవరహిత శరీరమునకట్టి శక్తి గలుగనేరదు.

కృ — అవునుగదా, ఇందువలన నేమి యేర్పడుచున్నదనఁగా, ఏశరీరము

యొక్కగాని యింద్రియములలో నేదియే యింద్రియమునకు నాయా విషయమును తెలిసికొనుశక్తి యాశరీరస్థుఁడగు జీవునివలననే గలుగుచున్నదిగాని స్వతంత్రశక్తిచే నెఱుఁగజాలవని యేర్పడుచున్నదిగదా!

అర్జు — అవును.

కృ — కనుక దీనినే క్షేత్రము నెఱుఁగుటయని చెప్పఁబడుచున్నది. కనుక నోయి యర్జునా! ఇపుడు నీకు క్షేత్రమనఁగా నెట్టిదైనదియు, క్షేత్రజ్ఞుఁడనఁగా నెట్టి వాఁడైనదియు, చక్కగా బోధపడినదిగదా!

అర్జు — అవును క్షేత్రమనఁగా నీపాంచభౌతిక శరీరమునియు, క్షేత్రజ్ఞుఁడనఁగా నట్టి శరీరమునందుండెడు జీవుఁడనియుఁ దెలిసినది.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్త జ్జ్ఞానం మతం మమ॥ ౩

అర్థము:— అపి + చ = మఱియును, హే భారత! = ఓయియర్జునా!, సర్వక్షేత్రేషు = సమస్త దేహములయందు (ఉండెడు), క్షేత్రజ్ఞమ్ = క్షేత్రజ్ఞుని (జీవుని), మామ్ = నన్నుగా, విద్ధి = ఎఱుఁగుము. క్షేత్రక్షేత్రజ్ఞయోః + జ్ఞానమ్ = దేహాత్మల యొక్క వివరము నెఱుఁగుట, యత్ = ఏదికలదో, తత్ + జ్ఞానమ్ + (ఇతి) = అదియేజ్ఞానమని, మమ + మతమ్ = నాయభిప్రాయము.

కృ — మంచిది. ఇంతకు ముందు నీకు మఱియొక సంగతి చెప్పియున్నాను. అదేమనఁగా, నాదియగు ప్రకృతి స్థూలసూక్ష్మములని రెండువిధములు గలదనియు, అందు సూక్ష్మ ప్రకృతియనునది జీవభూతాత్మకమై ప్రపంచమునంతటిని ధరింపుచున్నదనియు, కనుకనే నేనీ సమస్తప్రపంచమునకును సృష్టిస్థితిలయ కారణకర్తనై సమస్త భూతముల యందును మణులలోని సూత్రమువలె వ్యాపించి యున్నాననియుఁ జెప్పి యుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (మా. 7. 5-6-7)

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక నీప్రపంచమునందు క్షేత్రమని చెప్పఁబడు శరీరములన్నిటిలో నివసింపుచు క్షేత్రజ్ఞుఁడని చెప్పఁబడు జీవాత్మనేనేయని, అనఁగా, నాయంశమే యని యెఱుంగుము. ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులకుఁ గలిగియుండెడు సంబంధమిట్టిదని యెఱుఁగుట యేదికలదో, అదియే జ్ఞానమని నాయభిప్రాయము. కనుకనే

"క. వినుమాత్ముఁడు క్షేత్రజ్ఞుం
డనభూతాత్ముఁడనఁబుఁరుషుఁడనఁబరమేశుం
డన బుద్ధిసాక్షియనఁగా
జననరహితుఁడనఁగఁ బరగు శాంతిప్రవణా!" (భార. శాంతి. ౪ అ. ౧౨౨)

అనునట్లు, క్షేత్రజ్ఞుఁడే పరమాత్మయనియు. జీవాత్మయనియు, పురుషుఁడనియు, పరమేశుఁడనియు, బుద్ధియనియు, సాక్షియనియు, జననరహితుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 4

అర్థము :— తత్ + క్షేత్రమ్ = ఆక్షేత్రము (శరీరము), యత్ + చ = ఏదియో, యాదృక్ + చ = ఏలాటిదో, యద్వికారి = ఏలాటివికారముగలదియో, యతః + చ + యత్ = దేనివలనఁబుట్టినదో, సః + చ = ఆక్షేత్రజ్ఞుఁడును (జీవుఁడును), యః = ఎవఁడో, యత్ + ప్రభావః + చ = ఎట్టిప్రభావముకలవాఁడో, తత్ = దానిని (ఆవిషయమును), మే = నావలన, సమాసేన = సంగ్రహముగా, శృణు = వినుము.

ఓయియర్జునా! ఇప్పుడు నేఁజెప్పెడి యీక్షేత్రము, అనఁగా, శరీరము ఏదైనదియు, ఏలాటి స్వరూపముగలది యైనదియు, ఎప్పుడెప్పుడేలాటి వికారములను (మార్పులను) బొందుచుండునదియు, దేనివలన నేవిధముగా నుత్పన్నమగునదియు నీకు సంగ్రహముగాఁ జెప్పుచున్నాను వినుము. మఱియు నాక్షేత్రమునందు నివసించెడు క్షేత్రజ్ఞుడు (జీవుఁడు) ఎవఁడైనదియు, ఎట్టివాఁడైనదియు, వానిప్రభావ మెట్టిదైనదియు, ఈమొదలగు విషయముల నన్నిటిని నీకుఁ జక్కఁగా బోధపడునట్టుల సంగ్రహముగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥ 5

అర్థము :— ఋషిభిః = ఋషులచేత, బహుధా = పలువిధములుగను, వివిధైః + ఛన్దోభిః = నానావిధములగు వేదములచేత, పృథక్ = ప్రత్యేకముగాను, హేతుమద్భిః = సయుక్తికములును, వినిశ్చితైః = నిశ్చితార్థములు గలవియునగు, బ్రహ్మసూత్రపదైః + చ + ఏవ = బ్రహ్మసూత్రపదములచేతను, గీతమ్ = చెప్పఁబడియున్నది.

ఓయియర్జునా! ఇప్పుడు నేను నీకుఁ జెప్పఁబూనుకొన్న యీక్షేత్రక్షేత్రజ్ఞుల విషయమును నేనిప్పుడు నూతనముగఁ గల్పించి చెప్పఁబోవుచున్నానని యెంచెదవు

గాఁబోలును, అన్వేషించవలెను. ఈక్షేత్రక్షేత్రజ్ఞులవిషయము నిదివఱకే యనేకమంది ఋషులు బహువిధములుగా వర్ణించియుంటయేగాక, చతుర్వేదములలోఁ బ్రతిదాని యందును బ్రత్యేకముగా విస్తరింపఁబడియున్నది. ఒకవేళ నావేదశ్రుతులు గూడఁ బ్రమాణములు గావని నీవు తలఁచే యెడల నట్టి వేదములయందుమాత్రమేగాక, అట్టి వేదోపనిషదర్థ ప్రతిపాదకంబులును. సంశయ రహితమగు నట్లు సహేతుకముగ వ్రాయఁబడినవియునగు బ్రహ్మసూత్రములయందును గూడఁ జెప్పఁబడియున్నది. కనుక నింకుల వివరమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ 6

శ్లో॥ ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనాధృతిః ।
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ 7

అర్థము :— మహాభూతాని=పంచమహాభూతములు, అహఙ్కారః=అహంకారము, బుద్ధిః=బుద్ధి, అవ్యక్తమ్+ఏవ+చ=మూలప్రకృతియు, దశ+ఇన్ద్రియాణి=దశేంద్రియములు, ఏకమ్ + చ = (ఒక్కటియు నంతరింద్రియంబునగు) మనస్సు, ఇన్ద్రియగోచరాః+పఞ్చ+చ=ఇంద్రియవిషయంబులైదును, ఇచ్ఛా=ఇచ్ఛయు, ద్వేషః=ద్వేషమును, సుఖమ్=సుఖము, దుఃఖమ్=దుఃఖము, చేతనా=తెలివి, ధృతిః=ధైర్యము, ఏతత్+సఙ్ఘాతః=ఈ(పైఁజెప్పఁబడినయన్నిటియొక్క) కూడిక, సవికారమ్=వికారసహితమైన, క్షేత్రమ్+(ఇతి)=క్షేత్రము (శరీరము)అని, సమాసేన=సంగ్రహముగా, ఉదాహృతమ్=చెప్పఁబడినది.

అట్లనఁగా,

"సీ. జ్ఞానేంద్రియములైదు నాలుగాఁగ కర్మేంద్రియములైదు పృథ్వ్యాదులైదు భూత
ములు గంధముఖగుణములైదు బుద్ధ్యాద్య, హంకరణ చతుష్టయ
మును గూడు
కొని యిరువదినాల్గును జతుర్వింశతి, తత్త్వంబులయ్యెను ధరణియందు."

అనునట్లు, శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములైదును, వాక్పాణి పాదపాయూపస్థలనెడు కర్మేంద్రియములైదును, పృథివ్యప్తేజోవాయురాకాశములనెడు మహాభూతంబులైదును, శబ్దస్పర్శ రూప రసగంధంబులనెడు నింద్రియవిషయంబులైదును, మనోబుద్ధి చిత్తాహంకారంబులనెడు నంతఃకరణములు నాల్గును

"క. వినుమాత్ముఁడు క్షేత్రజ్ఞుం
డనభూతాత్ముఁడనఁ బురుషుఁడనఁ బరమేశుఁ
డన బుద్ధిసాక్షి యనఁగా
జనవరహితుఁడనఁగఁ బరగు శాంతిప్రవణా!" (భార. శాంతి. ౪ ఆ. ౧౨౨)

అనునట్లు, క్షేత్రజ్ఞుఁడే పరమాత్మయనియు, జీవాత్మయనియు, పురుషుఁడనియు, పరమేశుఁడనియు, బుద్ధియనియు, సాక్షియనియు, జనవరహితుఁడనియుఁ జెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥ 4

అర్థము :— తత్ + క్షేత్రమ్ = ఆ క్షేత్రము (శరీరము), యత్ + చ = ఏదియో, యాదృక్ + చ = ఏలాటిదో, యద్వికారి = ఏలాటివికారముగలదియో, యతః + చ + యత్ = దేనివలనఁబుట్టినదో, సః + చ = ఆ క్షేత్రజ్ఞుఁడును (జీవుఁడును), యః = ఎవఁడో, యత్ + ప్రభావః + చ = ఎట్టిప్రభావముకలవాఁడో, తత్ = దానిని (ఆవిషయమును), మే = నావలన, సమాసేన = సంగ్రహముగా, శృణు = వినుము.

ఓయియర్జునా! ఇప్పుడు నేఁజెప్పిన యా క్షేత్రము, అనఁగా, శరీరము ఏదైనదియు, ఏలాటి స్వరూపముగలది యైనదియు, ఎప్పుడెప్పుడేలాటి వికారములను (మార్పులను) బొందుచుండునదియు, దేనివలన నేవిధముగా నుత్పన్నమగునదియు నీకు సంగ్రహముగాఁ జెప్పుచున్నాను వినుము. మఱియు నా క్షేత్రమునందు నివసించెడు క్షేత్రజ్ఞుడు (జీవుఁడు) ఎవఁడైనదియు, ఎట్టివాఁడైనదియు, వాని ప్రభావ మెట్టిదైనదియు, ఈ మొదలగు విషయముల నన్నిటిని నీకుఁ జక్కఁగా బోధపడునట్టుల సంగ్రహముగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥ 5

అర్థము :— ఋషిభిః = ఋషులచేత, బహుధా = పలువిధములుగను, వివిధైః + ఛన్దోభిః = నానావిధములగు వేదములచేత, పృథక్ = ప్రత్యేకముగాను, హేతుమద్భిః = సయుక్తికములును, వినిశ్చితైః = నిశ్చితార్థములు గలవియునగు, బ్రహ్మసూత్రపదైః + చ + ఏవ = బ్రహ్మసూత్రపదములచేతను, గీతమ్ = చెప్పఁబడియున్నది.

ఓయియర్జునా! ఇప్పుడు నేను నీకుఁ జెప్పఁబూనుకొన్న యీ క్షేత్రక్షేత్రజ్ఞుల విషయమును నేనిప్పుడు నూతనముగఁ గల్పించి చెప్పఁబోవుచున్నానని యెంచెదవు

గాఁబోలును, అన్లెంచవలదు. ఈ క్షేత్రక్షేత్రజ్ఞులవిషయము నిదివఱకే యనేకమంది ఋషులు బహువిధములుగా వర్ణించియుంటిరేగాక, చతుర్వేదములలోఁ బ్రతిదానియందును బ్రత్యేకముగా విస్తరింపఁబడియున్నది. ఒకవేళ నావేదశ్రుతులు గూడఁ బ్రమాణములు గావని నీవు తలఁచేయెడల నట్టి వేదములయందు మాత్రమేగాక, అట్టి వేదోపనిషదర్థ ప్రతిపాదకంబులును, సంశయ రహితమగు నట్లు సహేతుకముగ వ్రాయఁబడినవియునగు బ్రహ్మసూత్రములయందును గూడఁ జెప్పఁబడియున్నది. కనుక నిందుల వివరమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ 6

శ్లో॥ ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనాధృతిః ।
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ 7

అర్థము :— మహాభూతాని=పంచమహాభూతములు, అహఙ్కారః=అహంకారము, బుద్ధిః=బుద్ధి, అవ్యక్తమ్+ఏవ+చ=మూలప్రకృతియు, దశ+ఇన్ద్రియాణి=దశేంద్రియములు, ఏకమ్ + చ = (ఒక్కటియు నంతరింద్రియంబునగు) మనస్సు, ఇన్ద్రియగోచరాః+పఞ్చ+చ=ఇంద్రియవిషయంబులైదును, ఇచ్ఛా=ఇచ్ఛయు, ద్వేషః=ద్వేషమును, సుఖమ్=సుఖము, దుఃఖమ్=దుఃఖము, చేతనా=తెలివి, ధృతిః=ధైర్యము, ఏతత్+సఙ్ఘాతః=ఈ(పైఁజెప్పఁబడినయన్నిటియొక్క) కూడిక, సవికారమ్=వికారసహితమైన, క్షేత్రమ్+(ఇతి)=క్షేత్రము (శరీరము)అని, సమాసేన=సంగ్రహముగా, ఉదాహృతమ్=చెప్పఁబడినది.

అట్లనఁగా,

"సీ. జ్ఞానేంద్రియములైదు జానుగాఁగర్మేంద్రియములైదు పృథ్వ్యాద్యములైదు భూతములు గంధముఖగుణములైదు బుద్ధ్యహంకరణ చతుష్టయమును గూడు
కొని యిరువదినాలుగును జతుర్వింశతి, తత్త్వంబులయ్యెను ధరణియందు."

అనునట్లు, శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములైదును, వాక్పాణి పాదపాయూపస్థలనెడు కర్మేంద్రియములైదును, పృథివ్యప్తేజోవాయురాకాశములనెడు మహాభూతంబులైదును, శబ్దస్పర్శ రూప రసగంధంబులనెడు నింద్రియవిషయంబులైదును, మనోబుద్ధి చిత్తాహంకారంబులనెడు నంతఃకరణములు నాల్గును

జేరి యిరువదినాలుగు తత్త్వములనఁబడుచున్నవి. ఈ యిరువదినాలుగు తత్త్వములతోఁ గూడ నంతఃకరణ ధర్మంబులగు నిచ్ఛాద్వేషంబులు, సుఖదుఃఖంబులు, జ్ఞానధైర్యంబులు మొదలుగాఁగల వికారములుగూడి శరీరమగుచున్నది. ఇట్టి శరీరమే క్షేత్రమని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ అమానిత్వ మదం భిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥ 8

అర్థము :— అమానిత్వమ్=ఆత్మస్తుతి లేకుండుట, అదంభిత్వమ్=డంబము లేకుండుట, అహింసా=పరులను హింసింపకుండుట, క్షాంతిః=ఓర్పుగలిగియుండుట. ఆర్జవమ్ = ఋజుభావము, ఆచార్యోపాసనమ్=గురుశుశ్రూష, శౌచమ్ = బాహ్యాభ్యంతరశుద్ధి, స్థైర్యమ్=చిత్తచాంచల్యములేకుండుట, ఆత్మవినిగ్రహః=మనోనిగ్రహము.

ఓయియర్జునా ! క్షేత్రమిట్టిదని సంగ్రహముగాఁ జెప్పితినిగదా, ఇఁకను జ్ఞానమెట్టిదనఁగా నిపుడు నేఁజెప్పఁబోయెడు లక్షణములు గలది యేదో, అదియే జ్ఞానమనఁబడును. ఆలక్షణము లెవ్వియనఁగా.

1. (అమానిత్వము) అనఁగా, ఆత్మస్తుతి పరనిందలేకయుండుట.

2. (అదంభిత్వము) అనఁగా, తాను జేసిన ధర్మము మొదలగు గొప్ప కార్యములను గుఱించి తానే ప్రకటించుకొనకయుండుట.

3. (అహింసా) అనఁగా, ఇతర మనుష్యులయొక్కయు, తక్కిన జీవజంతువులయొక్కయు మనస్సునుగాని దేహమునుగాని నొప్పింపకుండుట.

4. (క్షాంతి) అనఁగా, ఇతరులు తనకుఁ జేసెడు నపకారమునకు నోర్చుకొని వారలకుఁ బ్రత్యపకారము సేయకుండుట.

5. (ఆర్జవము) అనఁగా, కపటస్వభావము లేకయుండుట.

6. (ఆచార్యోపాసనము) అనఁగా, తనకు మోక్షమార్గము నుపదేశించెడు గురువునెడల భక్తిశ్రద్ధలుగలిగి శుశ్రూషచేయుట.

7. (శౌచము) అనఁగా, బాహ్యాభ్యంతరశుద్ధి గలిగియుండుట. అనఁగా, బాహ్యమందు స్నాన సంధ్యాద్యనుష్ఠానముల యథావిధిగ జరుపుచు నంతఃకరణమునందుఁ గామ క్రోధాద్యనేకవిధములగు మనో మాలిన్యములులేక యుండుట.

8. (స్థైర్యము) అనఁగా, చిత్తచాంచల్యము లేకయుండుట.

9. (ఆత్మవినిగ్రహము) అనఁగా, మనస్సును ఇంద్రియముల వెంబడి విషయముల మీఁదికిఁ బోనీక నివారింపఁగల శక్తి గలిగియుండుట.

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥ 9

అర్థము:— ఇన్ద్రియార్థేషు + వైరాగ్యమ్ = ఇంద్రియవిషయములయందు విరక్తి, అనహఙ్కారః + ఏవ + చ = అహంకారము లేకుండుటయు, జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ = జనన మరణాదులవలనఁ గలిగెడు దోషము నెఱుంగుటయు,

10. ఇంద్రియ విషయముల యందు విరక్తిగలిగియుండుట.

11. (అహంకారరాహిత్యము) అనఁగా, ఇది నేఁ జేయుచున్నాను, ఈవస్తువును నేను సంపాదించినాను, వీరిని నేను బోషించుచున్నాను, అనే మొదలగు నభిమానము లేక సమస్తమును భగవదిచ్ఛానుసారముగ జరుగుచున్నదని యెంచుట.

13. ఇది గాక

" శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః ।
సంసారసాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రతః ॥ "

అనునట్లు ఈలోకమున జన్మించినది మొదలు మరణము నొందువఱకును దుఃఖములనే యనుభవింపవలసి యుంచున్నదని యెఱుఁగుట. ఎట్లనఁగా, జన్మించుటకు ముందు మాతృగర్భనరకబాధ ననుభవించుట, జన్మించిన వెనుక శైశవమునందు మలమూత్రాదులలోఁ బొరలుట, యౌవనమున దారపుత్రాదులచేఁ గలిగెడు దుఃఖము ననుభవించుట, వార్ధక్యమున దేహేంద్రియాదుల పటుత్వముదప్పి బాధనొందుటయ గాక తన దారపుత్రాది స్వజనము చేతఁగూడ నిరాకరింపఁబడుట; పైఁజెప్పఁబడిన యన్ని దశలయందు నప్పుడప్పుడు గలిగెడు దేహజన్యములగు వ్యాధులచేతను, ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములనెడు తాపత్రయముచేతను బాధపడుట; అంత్యకాలమున మరణవేదన ననుభవించుట, ఇట్లు జననముమొదలు మరణపర్యంతము దుఃఖపరంపరల ననుభవించుటయే గాని సుఖమేమియు లేదని తెలిసికొనుట.

శ్లో॥ అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥ 10

అర్థము:— అసక్తిః = (మోక్షేతరములగు) నేవస్తువులయందు నాసక్తిలేకయుండుట, పుత్రదారగృహాదిషు = ఆలుబిడ్డలు యిండ్లు మొదలగువానియందు,

అనభిష్వఙ్గః = తగులములేనివాఁడై యుండుట. నిత్యమ్=ఎల్లప్పుడును, ఇష్టానిష్టోపపత్తిషు=ఇష్టానిష్టములయందు, సమచిత్తత్వమ్ + చ=సమబుద్ధి గలిగియుండుటయు.

13. మోక్షేతరములగు నైహికాముష్మిక సుఖముల నిచ్చెడు దేనియందును నాసక్తి లేకయుండుట.

14. "శ్లో॥ ఋణానుబన్ధరూపేణ పశుపత్నిసుతాలయః" అనునట్లు, దారపుత్రాది బంధువులును, పశుభృత్య నికరంబులును, గృహారామక్షేత్రాదులును, ధనధాన్యాదులును ఋణాను, బంధమువలన వచ్చుచుఁ బోవుచుండునవియే గాని శాశ్వతములుగావని యెఱిఁగి వాని యందభిమాన ముంచకుండుటయు.

15. తనకిష్టము చేకూరినపుడు సంతసించుటయు, కష్టము కలిగినపుడు దుఃఖించుటయులేక, యిష్టానిష్టము లన్నియుఁ గాలానుగుణ్యముగఁ దటస్థించుచున్నవనియెడు నిశ్చయజ్ఞానముగలవాఁడై, వానియెడల సమభావము గలిగి యుండుట.

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥ 11

అర్థము:— మయి = నాయందు, అనన్యయోగేన = నాకంటె నితరమగు దేనియందును మనస్సును జేర్చనివాఁడై అవ్యభిచారిణీ=వ్యభిచరించని, భక్తిః + చ= భక్తిగలిగియుండుటయు, వివిక్తదేశసేవిత్వమ్ = విజనస్థలములయందుండఁగోరుట, జనసంసది = జనసమూహమునందు, అరతిః = ప్రియములేకుండుటయు,

16. నాకంటె నితరమగు దేనియందును జిత్తమును జేర్చనివాఁడై, అనఁగా, నన్నే పరమపురుషార్థముగ నెంచినవాఁడై నాయెడల నవ్యభిచారిణియగు భక్తిగలిగి యుండుట. అవ్యభిచారిణియగు భక్తి యెట్టిదనఁగా, ఈలోకమున వ్యభిచరించెడు స్త్రీలు, అనఁగా, తమభర్తలయెడల మిగుల భక్త్యనురాగము లున్నట్లభినయించుచు సమయమయినపుడు రహస్యముగఁ బరపురుష సాంగత్యము సేయుచుండెడు స్త్రీలు కొందఱు, పతివ్రతలు అనఁగా అట్టిపరపురుషసాంగత్యము నెప్పుడును మనసుననైనను స్మరింపక తమభర్తలనే సాక్షాద్భగవత్స్వరూపులనుగ భావించి వారియెడల నిజమైన భక్త్యనురాగములు గలిగియుండు స్త్రీలు కొందఱు నుండుటను జూచుచున్నాము గదా! అట్లే నాభక్తులలోఁగూడ రెండుతెగల వారున్నారు. అదెట్లనఁగా, నన్ను సేవింపుచుండియు నొకానొకసమయమున నేదేనియొక స్వల్ప కారణమునుబట్టి యన్యదేవతల నారాధించెడువారు కొందఱును, ఎల్లప్పుడు నన్యదేవతల నారాధింపక సర్వదా నాయందే భారమువేసి నన్నేనమ్మి యారాధించెడు వారుకొందఱునుంచు

న్నారు. కాని వారిలో రెండవ తెగవారు చేసెడుభక్తి వ్యభిచరించని భక్తియనబడు చున్నది. కాన నట్టి భక్తిగలిగియుండుట.

17. (వివిక్తదేశసేవిత్వము) అనగా, విజనస్థలములయందుండగోరుట.

18. (అరతిర్జనసంసది) జనసమ్మర్దముగల చోటనుండిన యెడలతాను జేయు భగవత్చింతనమునకు ప్రతిబంధకముగా నుండును గనుకనట్టి జనసమ్మర్దము లేని యేకాంత స్థలములయందుండగోరుట,

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతజ్జ్ఞానమితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥ 12

అర్థము :— అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్=సదాఆత్మానుభవము చేయుచుండుట, తత్త్వజ్ఞానార్థదర్శనమ్=తత్త్వజ్ఞానమువలన గలిగెడు ప్రయోజనమిట్టిదని యెఱుగుట, ఏతత్ = ఇది, జ్ఞానమ్ + ఇతి=జ్ఞానమని, ప్రోక్తమ్ = చెప్పబడినది, అతః + అన్యథా + యత్ = దీనికివేఱైనదేదికలదో (అది), అజ్ఞానమ్ = అజ్ఞానము (అనబడుచున్నది).

19. (అధ్యాత్మజ్ఞాననిత్యత్వమ్) అనగా ఎల్లప్పుడును ఆత్మానుభవమునే చేయుచుండుట.

20. (తత్త్వజ్ఞానార్థదర్శనమ్) అనగా తత్త్వజ్ఞానమువలనగలిగెడు ప్రయోజన మిట్టిదని తెలిసికొనుట.

ఓయి యర్జునా! ఈ యిరువది లక్షణములను జేరి జ్ఞానమనబడుచున్నది. అనగా, జ్ఞానియనువానియం దీలక్షణములుండుననుట. అయితే, అట్టి జ్ఞానులలోఁ గొందఱి యందీలక్షణము లన్నియును, మఱికొందఱియం దీలక్షణములలోఁ గొన్ని మాత్రము ఉండును. అట్లుకొన్ని లక్షణములు మాత్రముండువాఁడు సామాన్య జ్ఞానియనియు, అన్ని లక్షణములుండువాఁడు సంపూర్ణజ్ఞానియనియుఁ జెప్పఁబడి యుంచున్నాఁడు. ఈ లక్షణములకు విరుద్ధములగు లక్షణము లేవిగలవో, అవియన్నియు యజ్ఞానమనబడును. అనగా అజ్ఞానియొక్క లక్షణములని చెప్పఁబడును.

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే ॥ 13

అర్థము :— యత్ = ఏది, జ్ఞేయమ్ = ఎఱుగఁదగినదో, యత్ = దేనిని, జ్ఞాత్వా=ఎఱిఁగి( తెలిసికొనినయెడల), అమృతమ్+అశ్నుతే = మోక్షమునుబొందు

చున్నాఁడో, (యత్)=ఏది, అనాది=ఆదిలేనిదనియు, మత్పరమ్ + బ్రహ్మ = (ఇప్పుడు సగుణబ్రహ్మముగానుండు) నాకంటె శ్రేష్ఠమగు (నిర్గుణబ్రహ్మమనియు), న+సత్ = సత్పదార్థము కాదనియు, న+సత్ = అసత్పదార్థము కాదనియు, ఉచ్యతే=చెప్పఁబడుచున్నదో, తత్=దానిని, ప్రవక్ష్యామి=చెప్పుచున్నాను.

ఓయియర్జునా! జ్ఞానమిట్టిదని నీకుఁదెలియఁజెప్పితినిగదా. ఇఁకనుజ్ఞేయము, అనఁగా తెలిసికొనవలసిన వస్తువెట్టిదైనదియుఁ జెప్పుచున్నాను వినుము. అదెట్టి దనఁగా, దానినెఱిఁగిన పిమ్మట మరల జనన మరణాదులు లేని మోక్షమును బొంద వచ్చును. మఱియునది యెట్టిదనఁగా నాద్యంతములు లేనిదియు, సత్తనిగాని, అస త్తనిగాని నిర్ధారణ చేయుటకు వల్లపడనిదియునై యున్నది. ఇంతియగాక, ఇపుడు సగుణుఁడనుగాఁ గనుపడుచుండెడు నాకంటె శ్రేష్ఠమైనదియగు నిర్గుణబ్రహ్మముగా నుంచున్నది. కాన నట్టిదానిని జెప్పుచున్నాను వినుము.

అర్జు — అయ్యా! ఏవస్తువైనను సరే సత్పదార్థము కానియెడల నసత్పదార్థము గను, అసత్పదార్థము కానియెడల సత్పదార్థముగను, యుండవలెనుగదా! సత్తు— అసత్తులు రెండును గాకుండెడు పదార్థముగూడ నొకటియుండునా?

కృ — ఉండును. అయితే, ఇపుడునేఁ జెప్పఁబోయెడుఁ పరబ్రహ్మము మాత్ర మట్టిదిగానున్నట్లు తోఁచుచుండును. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఓయి యర్జునా! మేడిచెట్టు పుష్పించుటకలదా?

అర్జు — లేదు. మేడిచెట్టు పుష్పించుట నేనెప్పుడును వినికని యెఱుఁగను.

కృ — మంచిది, ఆచెట్టునఁగాయలు గాయుచున్నవిగదా?

అర్జు — అవును. కాయుచునే యున్నవి.

కృ — పుష్పములేనిది కాయలెట్లు కాచును?

అర్జు — కారణములేక కార్యమెట్లు గలుగనేరదో, అట్లే పుష్పములేక కాయ పుట్టనేరదుగాన నీమేడిచెట్టునకుఁగూడ పుష్పము కలిగియే యుండవచ్చును. అయితే ఆపుష్ప మెవరికిని గోచరించునది కాదు గాన నాచెట్టునకు పుష్పములేదని చెప్పుటకుఁ గారణమైనది.

కృ — అవునుగదా, అట్లే పరబ్రహ్మమును నప్రమేయమైనవస్తువు. అనఁగా, ప్రత్యక్షాది షట్ప్రమాణములకు గోచరించని వస్తువు అని యిదివఱకే నీకుఁజెప్పియు న్నానుగదా? (చూ. 2–18). కనుక నిది యసత్తు (లేనిపదార్థము) గాఁదోఁచు చుండును. అయితే యీ జగదుత్పత్తిస్థితిలయములు జరుగుచుండుటను జూచు చున్నాము గనుక నిట్టి యుత్పత్తికిఁ గారణభూతమైన యొకవస్తువు ఉండవలయు

నని యు, అదియే పరబ్రహ్మమనియు నూహింపఁదగియున్నది గనుక నాపరబ్రహ్మము సత్తు (కలిగినపదార్థము) గాఁదోచుచుండును.

అర్జు— అయ్యా! ఇంతకుముందు నీవే యీసమస్తప్రపంచమునకును సృష్టిస్థితిలయ కర్తయగుఁబరబ్రహ్మముగాఁ జెప్పుచువచ్చి యిప్పుడు నీకంటె శ్రేష్ఠమైన పరబ్రహ్మ మొకటి యున్నట్లు చెప్పుచున్నావే కారణమేమి? ఈ పరబ్రహ్మలిద్దరున్నారాయేమి?

కృ— లేదు లేదు, పరబ్రహ్మమొక్కఁడే: ఆపరబ్రహ్మమే నేను. అయితే, ఇప్పుడు నేను చక్షురాదీంద్రియములకు గోచరించెడు దివ్యమంగళ విగ్రహరూపముతో చేతనులకు సేవ యొసగుచుండుటంబట్టి సగుణబ్రహ్మముగా నున్నాను. అయితే యీరూపము

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

అని యింతకుముందు నే నీకుఁజెప్పియున్న ప్రకారము భూభారనివారణార్థమయ్యును, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థమయ్యును పరిగ్రహింపఁబడినదేగాని నా నిజస్వరూపముగాదు. నిర్గుణబ్రహ్మమే నానిజస్వరూపమై యున్నది. కనుక నట్లు చెప్పుటకుఁ గారణమైనది.

అయితే, అట్లు నిర్గుణముగను, అప్రమేయముగను నుండెడు నానిజస్వరూపమును దెలిసికొనుటకు నుపాయమేమనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ 14

అర్థము:— తత్=ఆనిర్గుణపరబ్రహ్మము, లోకే=లోకమునందు, సర్వతః=అంతటఁ (సమస్త జంతువులయందును), పాణిపాదమ్=పాణిపాదములుగను, సర్వతః=అంతట (అన్నిజంతువులయందు), అక్షిశిరోముఖమ్=నేత్రశిరోముఖములుగను, సర్వతః=అంతట (అన్ని జంతువులయందు), శ్రుతిమత్=కర్ణములుగను, సర్వమ్+ఆవృత్య=సమస్త ప్రపంచము నావరించి, తిష్ఠతి=ఉంచున్నది.

ఓయి యర్జునా! ఈప్రపంచమునందలి జీవజంతువులలో అండజములు (గ్రుడ్డులోనుండి యుత్పత్తియగునవి), స్వేదజములు (చెమటవలన నుత్పత్తియగునవి), జరాయుజములు (మావివల్ల నుత్పత్తియగునవి) అని త్రివిధములగు జంతువులున్నవిగదా, అందొక్కొక్క విధమునందనేకలక్షల రకములును, అట్టిరకములలో నొక్కొక్క

రకములం దనేకకోట్ల సంఖ్యలుగల జంతువులుంచున్నవిగదా. ఈజంతువులన్నిటికిని, కాళ్ళు—చేతులు—శిరస్సులు—ముఖములు—నేత్రములు—చెవులు—మొదలగు నవయవములు గలిగి యుంచున్నవిగదా, అట్టి యవయవములన్నియు నాయా జంతువులు సజీవములుగా నుండునంతవఱకును వానివాని పనుల నవి యవి చేయుచుండుటయును, అనఁగా, నేత్రములతోఁ జూచుట, చెవులతో వినుట, చేతులతోఁ బనిచేయుట, కాళ్ళతో నడుచుట మొదలగుపనులఁ జేయుచుండుటయును, నిర్జీవమైన వెంటనే యట్టిపనులేవియుఁ జేయకుండుటయుఁ జూచుచున్నాముగదా, అది యెందువల్లనో తెలియునా?

అర్జు — అవును తెలియును. ఆయాజంతువులయందు జీవాత్మయుండునంతవఱకాజీవాత్మచే నాపనులు చేయింపఁబడుచున్నవి ఆజీవాత్మ యాకళేబరము నెప్పుడు విడిచిపోవుచున్నదో అప్పుడాకళేబరముయొక్క యవయవము లేపనియును జేయఁజాలవు.

కృ — మంచిది, ఆకళేబరము లన్నిటి యందుండెడు జీవాత్మ యొక్కటియే యనియు, ఆజీవాత్మ పరమాత్మయొక్క యంశమే గాని వేరైనది కాదనియు నింతకుముందు చెప్పియున్నానుగదా (చూ. 2. 16). జ్ఞాపకమున్నదా ?

అర్జు — అహా జ్ఞాపకమున్నది.

కృ — అవునుగదా, ఇందువలన నేమి యేర్పడుచున్నదనఁగా, ఆ పరమాత్మ యొక్కఁడే యిన్ని జీవజంతువులయొక్క యవయవముల యందుండి వానినన్నిటిని యాడించుచున్నాఁడని యేర్పడుచున్నదిగదా ?

అర్జు — అవును.

కృ— కాఁబట్టి యాపరమాత్మ యాసమస్త జంతువులయొక్క సమస్తేంద్రియాద్యవయవ రూపకముగా నున్నాఁడని తెలిసికొనఁదగి యుంచున్నాఁడు.

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥ 15

అర్థము :— సర్వేన్ద్రియగుణాభాసమ్ = సకలేన్ద్రియములయొక్క గుణములను బ్రకాశింపఁజేయు నట్టిదియు, సర్వేన్ద్రియవివర్జితమ్=సకలేంద్రియములును లేనిదియు, అసక్తమ్=దేనియందును నంటనిదియు, సర్వభృత్ + చ + ఏవ=సమస్తజగత్తునుభరించు నట్టిదియును. నిర్గుణమ్=గుణరహితమైనదియు, గుణభోక్తృచ=గుణముల ననుభవించు నదియును (అయియున్నది).

అయితే, ఓయి యర్జునా ! ఇట్లు నేఁజెప్పుటవలన నాపరబ్రహ్మము ఇంద్రియాద్యవయవములే శరీరముగాఁగల వాఁడనియెంచఁగూడదు. ఏలయనఁగా నొకనికిఁ జక్షు

రాదీంద్రియములకు గోచరింపఁదగిన రూపమే లేనపుడు, ఇంద్రియము లెట్లుండును ? మ టేమనిన, ఇంద్రియగుణాభాసుఁడుగానుంచున్నాఁడు, అనఁగా నేయే యింద్రియమునందుఁ బ్రవర్తించునపుడాయా యింద్రియగుణ చేష్టితములను బ్రకాశింపఁ జేయు వాఁడై యున్నాఁడు. అదెట్లనఁగా,

"గీ॥ గాజుకుప్పెలోనఁ గడగుచు దీపంబు
ఎట్టులుండు నాత్మ యట్టులుండుఁ
దెలిసినట్టివారి దేహంబులందుల
విశ్వదాభిరామ వినర వేమ ! ॥ "

అనునట్లు ఒకదీపము తనయందుస్వతస్సిద్ధములగు రంగులేవియులేనిదైనను, ఏయేరంగుగల గాజుకుప్పెయందుంచఁబడినప్పు డాయారంగుతో నెట్లు ప్రకాశింపు చుండునో, అనఁగా, ఎఱ్ఱరంగుగల కుప్పెలో నుండునప్పు డెఱ్ఱ దీపముగను, పచ్చరంగు గల కుప్పెలోనుండునపుడు పచ్చదీపముగను, తెల్లరంగు కుప్పెలోనుండునపుడు తెల్ల దీపముగను నెట్లు ప్రకాశించుచుండునో యట్లే యీ పరమాత్మ యంశమగు జీవాత్మ యును నెప్పు డెప్పు డేయే యింద్రియమునఁ బ్రవర్తింపుచున్నదో అప్పుడప్పు డాయా యింద్రియమును బ్రకాశింపఁ జేయుచుండును. అనఁగా, నేత్రేంద్రియమునఁ బ్రవర్తింపు చున్నపుడుచూచుచును, కర్ణేంద్రియమునందుఁ బ్రవర్తించునపుడువినుచును, జిహ్వేం ద్రియమునందుఁ బ్రవర్తించునపుడు చవిగొనుచును. ఈప్రకారమే సమస్త జ్ఞానేంద్రియ కర్మేంద్రియములలో నేయే యింద్రియమునందుఁ బ్రవర్తించునపు డాయాయింద్రియ మును బ్రకాశింపఁ జేయుచుండును. మఱియు నా గాజుకుప్పె యందుండెడు దీప మెట్లైతే దానియందంటకయే దాని యందంతట నిండియున్నట్లగపడుచుండునో. అట్లే యీపరమాత్మయును నీప్రపంచమునందలి సమస్తచరాచరములయందు నిండి యున్నట్లగుపడుచుండినను వానిలో దేనియందును నంటకయే యుండును. మఱియు నీపరమాత్మ నిర్గుణమైనదైనను, అనఁగా, సత్త్వరజస్తమోగుణములలో నేదియు లేనిదైనను, ఏయే క్షేత్రము (శరీరము) నందుండు నప్పు డాయాఘటమునకుఁ బ్రారబ్ధ వశమునలభించెడు గుణముల ననుభవింపుచుండును. అనఁగా ఆయాగుణములు గల దానివలెనే యగపడుచుండును.

శ్లో॥ బహి రన్త శ్చ భూతానా మచరం చర మేవ చ ।
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥ 16

అర్థము :— భూతానామ్=భూతములయొక్క, బహిః=వెలుపలను, అన్తః+ చ=లోపలను (ఉండునట్టిదియును), అచరమ్=స్థావరరూపమైనదియు, చరమ్+

ఏవ + చ=జంగమరూపమైనదియు, తత్=అపరమాత్మ, సూక్ష్మత్వాత్=సూక్ష్మరూపము గలదియగుటచేత, అవిజ్ఞేయమ్=ఎఱుఁగఁబడఁగూడనిదియు, తత్=అపరమాత్మ, దూరస్థమ్ + చ=దూరముగానుండునట్టిదియును, అన్తికే + చ=సమీపముగానుండునట్టిదియును (ఐయున్నది).

మఱియు నాపరమాత్మ యెట్టిదనఁగా, చరాచరములగు సమస్తభూతముల యందును నంతర్భూతమై యుండుటయెగాక వానివెలుపలగూడ నుండును. అది స్థావరరూపమైనదియు, జంగమరూపమైనదియు నైయుండును. ఇదిగాక యీ పరమాత్మ మిగుల సూక్ష్మస్వరూపముగలదిగానుండుటవలన నజ్ఞానులకుఁ దెలియకుండును. దాని తత్త్వము నెఱుఁగని యజ్ఞానుల కది దూరముగ నున్నట్లగపడును. దానితత్త్వమిట్టిదని యెఱిఁగెడు జ్ఞానులన్నచో, దానిని దమలో నుండునట్టిదిగా నెఱింగినవారగుచున్నారు. కాన వారలకది యత్యంత సమీపములో నున్నది యగుచున్నది.

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥ 17

అర్థము:— తత్ =అపరమాత్మ, అవిభక్తమ్ + చ=విభజింపఁబడనిదియనియు, భూతేషు = భూతములయందు, విభక్తమ్ + ఇవ + స్థితమ్ + చ = విభజింపఁబడిన దానివలె నుండునట్టిదియనియు, భూతభర్తృ + చ=(సమస్త, భూతములనుబోషించునట్టిది యనియు. గ్రసిష్ణు=(సమస్తభూతములను) మ్రింగునట్టిదియనియు, ప్రభవిష్ణు + చ=(అట్లు మ్రింగఁబడిన భూతములను) మరలఁ బుట్టించునట్టిది యనియు. జ్ఞేయమ్= ఎఱుఁగఁదగియున్నది.

మఱియు నాపరమాత్మ యెట్టివాఁడనఁగా, అవిభక్తుఁడైయుండినను, అనఁగా, అద్వితీయమై సర్వముఁ దానయైయుండినను, భూతములయందు విభజింపఁబడినవానివలె నగపడుచుండును. అదెట్లనఁగా, సముద్రోదక మొక్కటియైనను, పెద్దవి-చిన్నవి-మొదలగు ననేకవిధములగు భాండములలోఁ బోయఁబడినపు డాయాభాండముల యందుండు నంతవఱకును బ్రత్యేకించఁబడినట్లట్లగపడుచుండునో అట్లే దేవ-నర-పశు-పక్ష్యాది భూతములయందున్నవాఁడై యనేక రూపములుగ విభజింపఁబడినవాఁడుగా నగపడుచుండును. అట్లుండియు,

“ క. నర్తకుని భంగి పెక్కగు
మూర్తులలో నెవ్వఁడాడు ”

అనునట్లు, అనేక వేషములతో నాడెడు పగటివేషగాఁడు, ఒక్కఁడే యెట్లై

యున్నాఁడో అట్లే, అనేకములగు జంతువులరూపములతోఁ బ్రకాశించుచుండెడు నాపరమాత్మ యొక్కఁడేయై యున్నాఁడు. మఱియు నాపరమాత్మయే సమస్తభూతములను బోషించువాఁడును, లయింపఁజేయువాఁడును, మరల సృజించువాఁడును నై యున్నాఁడని యెఱుఁగుము. (చూ. 10. 34.)

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యమ్ హృది సర్వస్య విష్ఠితమ్॥　18

అర్థము:— తత్ = ఆపరమాత్మ, జ్యోతిషామ్+అపి = ప్రకాశించెడువస్తువులగు సూర్యచంద్రాదులకుఁగూడ, జ్యోతిః = ప్రకాశమునిచ్చునదియు, తమసః+పరమ్+ఉచ్యతే = పెంజీకటి కావలనుండు నట్టిదియని చెప్పఁబడునట్టిది, జ్ఞానమ్ = అమానిత్వాది యిరువదిలక్షణములుగలది, జ్ఞేయమ్ = (అందరిచే) నెఱుఁగఁబడదగినది, జ్ఞానగమ్యమ్ = అమానిత్వాది లక్షణములచేతఁ బొందఁబడఁదగినది, సర్వస్య= సమస్తజంతువులయొక్క, హృది = హృదయమునందు, విష్ఠితమ్ = ఉండునట్టిది.

మఱియు నాపరమాత్మ యెట్టిదనఁగా నీలోకమునఁ బ్రకాశించుచుండెడు సూర్యచంద్రాదులలో నుండెడు ప్రకాశము, అనఁగా, ఆసూర్యచంద్రాదులకుఁబ్రకాశమును గలుగఁ జేయునదియును, అజ్ఞానరూపకమగు ప్రకృతికంటె శ్రేష్ఠమైనదియు, ఆప్రకృతిచే నుత్పన్నమగు సమస్తప్రపంచమును నశించి గాఢాంధకారము గప్పి నప్పుడట్టి పెంజీకటి కవ్వలఁ బ్రకాశించు నట్టిదియునని చెప్పఁబడుచున్నది. మఱియునోయి యర్జునా! ఇంతకుముందు, అమానిత్వాది యిరువది లక్షణములుచేరి జ్ఞాన మనఁబడుచున్నదని నీకుఁ జెప్పియుంటినిగదా, (చూ. 13. 8-9-10-11-12). అట్టిజ్ఞానమును, అట్టి జ్ఞానముచేఁ దెలిసికొనఁ బడఁదగిన వస్తువేదిగలదో యదియును, అట్టిజ్ఞానముచేఁ బొందఁబడఁదగినవస్తువేదియో యదియును, ఆపరమాత్మయేయై యున్నది. ఇదిగాక యోయియర్జునా! సమస్తభూతముల హృదయముల యందుండెడి పరమాత్మ నేనే యని చెప్పియుంటినిగదా, (10. 20). కనుక నాపరమాత్మ సమస్తభూతములయొక్క హృదయము నందుండు నట్టిదియనియు నెఱుంగుము.

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥　19

అర్థము :— ఇతి=ఈ (పైఁజెప్పఁబడిన) ప్రకారము, క్షేత్రమ్=క్షేత్రమును, తథా=అలాగుననే, జ్ఞానమ్=జ్ఞానమును, జ్ఞేయమ్+చ=జ్ఞేయమును, సమాసతః=

సంగ్రహముగా, ఉక్తమ్=చెప్పఁబడినది, మద్భక్తః=నాభక్తుఁడు, ఏతత్ + విజ్ఞాయ=దీనినెఱిఁగినవాఁడై, మద్భావాయ=నా భావమును బొందుటకొఱకు, ఉపపద్యతే=అర్హుఁడగుచున్నాఁడు.

ఓయి యర్జునా! ఇట్లు పృథివ్యాదిభూతములైదును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పదియును, ఇంద్రియ విషయములైదును, అంతఃకరణ చతుష్టయమునుజేరి యిరువదినాలుగు తత్త్వములగుచున్నవనియు (చూ. 13. 6), ఆ యిరువదినాలుగు తత్త్వములును ఇచ్ఛా ద్వేషాది వికారములతోఁ గూడ శరీరమగుచున్నదనియు (చూ 13. 7), అట్టి శరీరమే క్షేత్రమనఁబడుచున్నదనియు (13–2), ఇఁకను అమానిత్వాది యిరువది లక్షణములును జేరి జ్ఞానమనఁబడుచున్నదనియు, (చూ. 13. 8–9–10–11–12), సర్వాంతర్యామిగా నుండెడు పరమాత్మయే జ్ఞేయమనియు, అనఁగా పైఁజెప్పఁబడిన జ్ఞానముచేఁ దెలిసికొనఁదగిన వస్తువనియు (13. 13–14–15–16–17–18) నీకు సంగ్రహముగాఁ జెప్పితినిగదా, నాభక్తులగు వారలలో నెవఁడైతే యీ విషయములను జక్కఁగాఁ దెలిసికొనుచున్నాఁడో అట్టివాఁడే నాసాయుజ్యమును బొందుటకు నర్హుఁడగుచున్నాఁడు గాని తదితరుఁడు కాఁజాలఁడు.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్ ॥ 20

అర్థము :— ప్రకృతిమ్=మూలప్రకృతిని, పురుషమ్ + చ + ఏవ=పరమపురుషునిని, ఉభౌ + అపి=(ఈ) యుభయులను, అనాదీ=ఆదిలేనివియని, విద్ధి=ఎఱుఁగుము, వికారాన్ + చ=మనోబుద్ధీంద్రియ వికారములగు సుఖ దుఃఖాదులను, గుణాన్ + చ + ఏవ=సత్త్వరజస్తమోగుణములను, ప్రకృతిసంభవాన్=ప్రకృతివలనఁ బుట్టినవానిఁగా, విద్ధి=ఎఱుఁగుము.

ఓయి యర్జునా! యింతకుముందు నీవు తెలిసికొనఁగోరిన విషయములు ప్రకృతి, పురుషుఁడు, క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము, జ్ఞేయము అని యాఱుగదా (చూ. 13. 1), ఆయాఱులో క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము, జ్ఞేయము అను నాలుగు చెప్పియైనదిగదా, ఇఁకను ప్రకృతి, పురుషుఁడు అను రెండువిషయములను గుఱించిమాత్రము చెప్పవలసి యున్నదిగదా, వానినిగూడఁ జెప్పుచున్నాను వినుము.

ప్రకృతియనఁగా మాయ. దీనికే అవిద్యయనియు, అజ్ఞానమనియు, మూల ప్రకృతియనియు నామాంతరములు గలవు. క్షేత్రమనఁగా నిదియే. పురుషుఁడనఁగా నిర్గుణ పరబ్రహ్మము. ఈనిర్గుణ పరబ్రహ్మమునకే పరమపురుషుఁడనియు, పరమా

త్మయనియు నామాంతరములు గలవు. ఈపరమాత్మయే ప్రకృతితో సంబంధించి యుండునపుడు జీవాత్మయనియు, క్షేత్రజ్ఞుఁడనియుఁ జెప్పంబడు. ఈరెండును అనాదిగా నుండునవియే గాని యొకప్పుడుండి మఱియొకప్పుడు లేక పోవునవిగావు. ఈరెంటియొక్క సంయోగమువలననే సమస్తభూతమయ ప్రపంచము లుత్పన్నములగుచుండును. అయితే యీ ప్రపంచమునందలి సమస్తభూతములయందును సత్త్వరజస్తమోగుణములను, ఈగుణములవలనఁ గలిగెడు కామక్రోధాద్యనేక వికారములను జూచుచున్నాముగదా, నిర్గుణమైన పరబ్రహ్మ సంయోగము వలనఁగలిగిన భూతములయందిట్టి గుణవికారము లుండుటకుఁ గారణమేమని యోచింతువేని చెప్పెదవినుము. ఈ సత్త్వరజస్తమోగుణములును, ఈగుణములవలనఁ గలిగెడు వికారములును, ప్రకృతి సంబంధమైనవే గాని పురుషుని సంబంధమైనవి కావని యెఱుంగుము.

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే ।
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥ 21

అర్థము :— ప్రకృతిః = మాయ (క్షేత్రము), కార్యకారణకర్తృత్వే = కార్యకారణములను గలుగఁజేయుటయందు, హేతుః + (ఇతి) = హేతువని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది, పురుషః = పురుషుఁడు (క్షేత్రజ్ఞుఁడగుజీవుఁడు), సుఖదుఃఖానామ్ = సుఖదుఃఖములయొక్క, భోక్తృత్వే = అనుభవించుటయందు, హేతుః + (ఇతి) = హేతువని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

అయితే యీ పరమాత్మ నిర్గుణుఁడై యుండినను, ప్రకృతి సంబంధముగలిగి జీవాత్మగా నుండునంతవఱకును, అనఁగా, ప్రకృతిసంబంధమగు శరీరము (క్షేత్రము) న నివసించి క్షేత్రజ్ఞుఁడుగా నుండునంతవఱకును, ఆ ప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములచేఁ జేయఁబడు సుకృత దుష్కృతములయొక్క ఫలములగు సుఖదుఃఖాదులను, ఇనుమునుగూడి యగ్ని సమ్మెటదెబ్బల ననుభవించిన ట్లనుభవించుచుండును. కనుకనే కార్యకారణ కర్తృత్వము, అనఁగా, సుకృత దుష్కృతములను జేయుట ప్రకృతియొక్క పనియనియు, అట్టి సుకృత దుష్కృతములయొక్క ఫలములగు పుణ్యపాపములవలనఁ గలిగెడు సుఖదుఃఖముల ననుభవించుట పురుషుని (జీవుని) యొక్క పనియనియుఁ జెప్పఁబడుచున్నది.

అర్జు — అయ్యా! పురుషుడని చెప్పఁబడు జీవాత్మ నిర్గుణమగు పరమాత్మయొక్క యంశమే గాని వేఱు కాదని చెప్పియుంటివిగదా, అట్టి యీజీవాత్మకుఁ బ్రకృతి గుణముల వలనఁ గలిగెడు సుఖదుఃఖాది వికారములయొక్క యనుభవ మెట్లు గలుగును?

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజా న్గుణాన్ ।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు॥ 22

అర్థము :— పురుషః=పురుషుఁడు (జీవుడు). ప్రకృతిస్థః+హి = ప్రకృతియం దున్నవాఁడుగదా, (తస్మాత్) = ఆకారణమువలన, ప్రకృతిజాన్+గుణాన్= ప్రకృతిసంబంధములగు గుణములను. భుఙ్క్తే=అనుభవించుచున్నాఁడు, అస్య= ఈపురుషునికి(జీవునికి), గుణసఙ్గః=(ఆప్రకృతి) గుణములయందలి యాసక్తి, సదసద్యోని జన్మసు = ఉత్కృష్టనికృష్టజన్మల (కలుగజేయుట)యందు, కారణమ్ = కారణము (అగుచున్నది).

కృ — అవును, జీవాత్మయనఁగా పరమాత్మయొక్క యంశమే. ఈజీవాత్మకే పురుషుఁడనియును పేరు. పరమాత్మయేలాటిగుణములు లేనిదైనదియును వాస్తవమే. కనుక నాపరమాత్మ యంశమగు జీవాత్మయు నిర్గుణమైనదిగానే యుండవలయును. అయితే, ఆపరమాత్మ ప్రకృతితో సంబంధించి యున్నప్పుడు గదా జీవాత్మయనియు, పురుషుఁడనియు, క్షేత్రజ్ఞుఁడనియుఁ జెప్పఁబడుచున్నది? కనుక పురుషుఁడనఁగాఁ బ్రకృతితోఁ గూడుకొని యుండు పరమాత్మ యగుచున్నదిగదా? కాఁబట్టి యట్లు ప్రకృతితోఁ గూడుకొని యుండునంతవఱకును నాయాత్మయా ప్రకృతి సంబంధములగు గుణముల ననుభవింపుచునేయుండును. అనఁగాఁ నిర్గుణమగు నాయాత్మ ప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములు గలదానివలనే ప్రకాశింపుచుండును. అదెట్లనఁగా నిందున కొకదృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. పరమాత్మ సముద్రము వంటిదనియు, జీవాత్మ యా సముద్రోదకమునుండి ప్రత్యేకించఁబడి యితర వస్తువు నందుంచఁబడిన బిందువువంటిదనియు నెఱుంగుము. అట్లుంచఁబడిన యనేకబిందువులలో నెయ్యది యేయే వస్తువునందుంచఁ బడుచున్నదో, ఆయా వస్తువు నందుండు రంగుగలదిగా, అనఁగా తెల్లకాకితము మొదలగు వస్తువుల యందుంచఁబడిన బిందువు తెలుపువర్ణముగలదిగను, నల్ల కాకితము మొదలగు వస్తువులయందుంచఁ బడిన బిందువు నలుపు వర్ణముగలదిగను, ఎఱ్ఱ కాకితము మొదలగు వస్తువులయందుంచఁబడిన బిందువు ఎఱుపువర్ణము గలదిగను, పచ్చకాకితము మొదలగు వస్తువుల యందుంచఁబడిన బిందువు పసుపువర్ణము గలదిగను ఎట్లు ప్రకాశించుచుండునో, అట్లే పరమాత్మ యొక్క యంశమగు జీవాత్మయుఁ బ్రకృతి సంబంధము గలిగి యుండు నంతవఱకును నాప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములు గలదిగానే యగపడుచుండును. ఏవస్తువు నందైన నుంచఁబడిన యొకబిందు వావస్తువునుండి తొలఁగించఁబడినపు డాబిందు వావస్తువుయొక్క రంగును విడిచి స్వచ్ఛమైనదిగా నెట్లు

ప్రకాశించునో, అట్లే పురుషుఁడనఁబడు జీవాత్మయుఁ బ్రకృతి సంబంధమగు క్షేత్రమును (దేహమును) విడిచినపుడా ప్రకృతికి విలక్షణుఁడును, పరమపురుషుఁడు నని చెప్పఁబడు పరమాత్మవలెనే నిర్గుణుఁడును నిర్వికారుఁడును నై ప్రకాశించును.

అర్జు — అయ్యా! అట్లే దేహమునందుండెడు జీవాత్మ యాదేహమును విడిచిన తోడనే నిర్గుణమగు పరమాత్మతో సమానమైనయెడల నట్టి నిర్గుణ పరబ్రహ్మములో గలియ వలయునుగదా? అనఁగా, మోక్షమును బొందవలెను గదా? అట్లుండ ననేక వేల జీవాత్మలలో నొకానొకటి మాత్రె మట్టిమోక్షమును బొందుననియు, తక్కిన జీవాత్మలన్నియు మరల నీ భూమియందు జన్మించుననియు పెద్దలు చెప్పచున్నారే, అందుకుఁ గారణమేమి?

కృ — అవును. అట్లు జరుగుట వాస్తవమేను. అందునకుఁ గారణమేమనఁగాఁ జెప్పచున్నాను వినుము. ఇంతకుముందు చెప్పబడిన దృష్టాంతములోని యుదక బిందువులుండెడు వస్తువులలోఁ గొన్ని గట్టిరంగు గలవిగను, అనఁగా, ద్రవపదార్థములచేఁ గరఁగకుండునట్టి రంగుగలవిగను, మఱికొన్ని ద్రవపదార్థములు సోకిన యెడలఁ గరగునట్టి రంగు గలవిగను యుంచున్నవిగదా! వానిలో గట్టిరంగుగల వస్తువుల యందుంచఁబడిన బిందువు లావస్తువులయొక్క రంగుతోఁగలియక వానియందుండు నంతవఱకు మాత్రమా వస్తువులయందలి రంగుగలవిగనే ప్రకాశించుచు, ఆవస్తువు నుండి వేరుపఱుపఁబడినపుడా రంగు లేనిదియై నిర్మలముగా నుండుటయును, రెండవ రకం వస్తువులయందుంచబడిన బిందువు లావస్తువులయందలి రంగులతో సక్తములై ఆవస్తువులయందుండునంతవఱకు నారంగులు గలదిగఁ బ్రకాశింపుచుండుటయేగాక యావస్తువులనుండి వేరుపఱుపఁబడినపిమ్మట నయిన మావస్తువులరంగులతో మిశ్రమములై మలినముగానుండుటయును జూచుచున్నాముగదా? అట్లే ప్రకృతి సంబంధములగు దేహములయందుండెడు జీవాత్మలలో నెవ్వవి యింతకుముందు నేఁజెప్పినప్రకారము (చూ. 3. 27) అహంకారమమకారయుక్తములై యాప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములచేఁ జేయఁబడుచుండు పనులను దాముచేయుచున్నట్లు భావింపుచున్నవో, అట్టి జీవాత్మలా దేహములను విడిచినపిమ్మటఁగూడ నాప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములచేఁ జేయఁబడిన సుకృత దుష్కృతముల యొక్క ఫలములగు పుణ్యపాపములతో నంటియే యుండును గాన నాజీవాత్మలకు మరల నట్టి పుణ్య పాపములకనుగుణ్యములగు నుత్కృష్ట నికృష్ట జన్మలు గలుగుచునే యుండును.

64

శ్లో॥ ఉపద్రష్టాఽనుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః ॥ 23

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 24

అర్థము:— పరః + పురుషః = పరమపురుషుఁడు, పరమాత్మ, అస్మిన్ + దేహే = ఈదేహమునందు, ఉపద్రష్టా = (సాక్షిభూతుఁడుగా) చూచుచుండెడువాఁడును, అనుమంతా = అనుమోదించువాఁడును, భర్తా = భరించువాఁడును, భోక్తా = అనుభవించువాఁడును, మహేశ్వరః + చ = నియామకుఁడును, పరమాత్మా + అపి + చ = పరమాత్మయును, ఇతి + ఉక్తః = అనిచెప్పఁబడుచున్నాఁడు. యః = ఎవఁడు, పురుషమ్ = పురుషుని (జీవాత్మను), గుణైః + సహ = త్రిగుణాత్మకమైన, ప్రకృతిమ్ + చ = ప్రకృతినిని, ఏవమ్ = ఇట్లు (పైఁజెప్పఁబడినప్రకారము), వేత్తి = ఎఱుఁగుచున్నాఁడో, సః = వాఁడు, సర్వదా + వర్తమానః + అపి = అన్నివిధముల (అనఁగా శాస్త్రసమ్మతముగాగాని శాస్త్రవిరుద్ధముగాగాని ఏవిధముగా) ప్రవర్తించిన వాఁడైనను, భూయః = మరల, న + అభిజాయతే = జన్మించఁడు.

ఇట్లుగాక యెవఁడైతే, అనఁగా నే దేహమునందుండెడు పురుషుఁడు (జీవాత్మ) యైతే, తాను పరమాత్మయొక్క యంశమేగాని వేరు కాదనియు, కనుక నింతకుముందు నేఁజెప్పినప్రకారము (చూ. 9. 18.) అట్టిపరమాత్మ స్వరూపుఁడగు తాను ప్రకృతి సంబంధమైన యీపాంచభౌతిక దేహమునందుండి యుపద్రష్టగను, అనఁగా, ప్రకృతిచేఁ జేయఁబడుచుండు పనులను సాక్షిభూతుఁడై చూచువాఁడుగను; అనుమంతగను, అనఁగా, ఆప్రకృతిచేఁజేయఁబడు కార్యములకుననుమోదించు (హర్షించు) వాఁడుగను; భర్తగను, అనఁగా, ఆప్రకృతిచేయు కార్యములకుఁ దానేయాధారభూతుఁడుగను, అనఁగా, ప్రకృతిసంబంధములగు చతుర్వింశతి తత్త్వములతోఁ గూడియుండునట్టి యీదేహము అట్టి ప్రకృతికి విలక్షణుండును పంచవింశతి తత్త్వమునగు తనతోఁ గూడక యేకార్యమును జేయఁజాలదు గనుక నాప్రకృతి. సేయు పనులకుఁ దానే యాధారభూతుఁడనియును; భోక్తగను, అనఁగా, ప్రకృతి సేయుపనులతోఁ దనకే లాటి సంబంధము లేకపోయినను, ఆపనులయొక్క ఫలములగు సుఖదుఃఖముల ననుభవించువాఁడు తానేయనియును; మహేశ్వరుఁడనియును, అనఁగా, తాను లేకయే ప్రకృతి యేమియుఁ జేయఁజాలదు గనుక నది చేయుపనుల కన్నిటికిని దానే నియామకుఁడుగ నున్నట్లును; ఇట్లు ప్రకృతి కార్యములన్నిటిలోఁ దాను సంబంధించి

యుండియు నాప్రకృతి గుణములతో సంబంధపడక విలక్షణుడుగానుండెడు పరమాత్మ తానేయనియును, ఎఱుంగుచున్నాడో, అట్టిపురుషుడు (జీవాత్మ) ఏవిధముగా ప్రవర్తించినను సరే. అనగా, శాస్త్రవిహితముగ ప్రవర్తించినను సరే-లేక-శాస్త్రవిరుద్ధముగ ప్రవర్తించినను సరే కర్మబద్ధుడు కానేరడు. (చూ. 4. 14; 5. 7; 6. 31) కనుకనట్టివానికి మరల జన్మ కలుగనేరదు. అనగా నట్టివాని జీవాత్మ పైజెప్పబడిన దృష్టాంతములోని యుదకబిందువులలో రంగుతో సక్తముకాని యుదకబిందువువలె నిర్మలముగానుండును. అసక్తుడై కర్మనాచరించెడువాడు పరమును బొందునని యింతకుముందు చెప్పియుంటిని గదా ! (చూ. 3. 19.) కాన నట్టి జీవాత్మ యీదేహమును విడిచినతోడనే పరమాత్మలో గలియును. అనగా, మోక్షమును బొందుననుట.

అర్జు — అయ్యా! ఏదైన నొకదానిని జేయునట్లు నియమించు వాడొకడును, చేయించువాడొకడును, చేయువాడొకడును, ఆమోదించువాడొకడును, అందలిఫలముల ననుభవించువాడొకడును నైయుండుట సహజముగా నుండునుగాని, ఇన్ని పనుల నొక్కడే చేయుటకు సాధ్యపడదు గదా ! అట్లుండ నీయన్ని పనుల నాపరమాత్మయొక్కడే యెట్లు చేయగలడు ? ఆపరమాత్మయొక్కడే యట్లు చేయుచున్నాడని యెట్లు తెలిసికొనదగును ?

శ్లో॥ ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా।
అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ 25

అర్థము :— ఆత్మానమ్=పరమాత్మను, ఆత్మని=తనయందు (తనయందున్న వానినిగా), ఆత్మనా=మనస్సుచేత, కేచిత్=కొందఱు. ధ్యానేన=ధ్యానయోగము చేతను, అన్యే=మఱికొందఱు, సాఙ్ఖ్యేన+యోగేన=సాంఖ్యయోగముచేతను, అపరే=మఱికొందఱు, కర్మయోగేన+చ=కర్మయోగముచేతను, పశ్యన్తి=చూచుచున్నారు.

కృ — అవును, అట్లుచేయుట యసాధ్యముగ నున్నట్లే యగపడును. అయినను మహాత్ములుగానుండెడు కొందఱు అఖండజ్ఞాన సంపన్నులై యీపరమాత్మస్వరూపమిట్టిదని తెలిసికొని సదా యాపరమాత్మనే ధ్యానముచేయుచును, అనగా, నాపరమాత్మయందు లయించిన చిత్తము గలవారై యుండుదురుగాన నట్టి ధ్యానయోగులా పరమాత్మయే జీవాత్మస్వరూపుడై తమయందున్నాడనియు, కనుక తామా పరమాత్మస్వరూపులేయనియు, అట్లే తమకంటె నితరములగు సమస్త జంతువులును

నాపరమాత్మ స్వరూపములే యనియు నెఱుఁగుచున్నారు. కాన నట్టివారలే ప్రపంచమునందలి జీవజంతువులలో నెప్పుడెయ్యది యేయే పనిఁజేసిన నప్పుడప్పుడాయాపని యాపరమాత్మయే చేయుచున్నట్లెఱుంగుదురు.

సాంఖ్యయోగులగు మఱికొందఱు పైఁ జెప్పఁబడిన ధ్యానయోగుల కున్నంత యఖండజ్ఞానమును వారవలంబించెడు సాంఖ్యయోగమువలనఁ గ్రమక్రమముగఁబొందఁదగిన వారై యున్నారు గాన నట్టివారును నాపరమాత్మయే యన్నిపనులను జేయుచున్నట్లెఱుంగఁగలరు. మఱియు నట్టి సాంఖ్య యోగులకంటెఁ దక్కువ స్థితిలో నుండెడు కర్మయోగులు (నిష్కామకర్మానుష్ఠానపరులు)ను క్రమక్రమముగ సాంఖ్యయోగులును ధ్యానయోగులును గాఁదగియున్నారు గనుక నట్టివారుగూడ నాపరమాత్మయే యన్నిపనులఁ జేయుచున్నట్లెఱుంగఁ గలరు.

అర్జు — అయ్యా! ఇపుడు నీవు చెప్పిన యీ మూడు తరగతులవారును ఈలోకమున బహుకొద్దిమందిగ నుందురుగదా, ఇట్టి వీరలు మాత్రమే యట్లెఱుంగఁగలరా? లేక, వీరికంటె నితరులగు వారలలోఁగూడ నెవరైన నట్లెఱుంగఁదగినవారుందురా?

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపిచాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ 26

అర్థము :— ఏవమ్=ఇట్లు(పైఁజెప్పఁబడిన ధ్యాన సాంఖ్య కర్మయోగములవలన), అజానన్తః= తెలిసికొనఁ జాలనివారలైన, అన్యే+తు=ఇతరులన్ననో, అన్యేభ్యః= (జ్ఞానులగు) ఇతరులవలన, శ్రుత్వా=విని (ఉపదేశమును బొంది), ఉపాసతే=ఉపాసనఁజేయుదురు, శ్రుతిపరాయణాః=(అట్లు) వినుటయందాసక్తిగల, తే+అపి+చ=వారలుగూడ, మృత్యుమ్=మృత్యురూపమగు సంసార సాగరమును. అతితరన్తి+ఏవ=తప్పక దాటుదురు.

కృ — ఔను, అట్టి వారును గలరు. అదెట్లనఁగా, ఈలోకమున గొందఱుపైఁ జెప్పబడిన మూడు తరగతులలోఁ జేరినవారు గాకపోయినను, అనఁగా, కర్మ, సాంఖ్య, ధ్యానయోగములలో దేని నవలంబించిన వారు గాకపోయినను, భగవద్విషయమును తెలిసికొనుటయందాసక్తిగల వారలై యట్టి విషయములను దమకు బోధింపఁదగిన సద్గురువుల నాశ్రయించి వారలు చెప్పెడు విషయములనాసక్తితో విందురు. అట్లెవరాసక్తితో వినుచున్నారో అట్టివారలకుఁ గ్రమక్రమముగ జ్ఞానోదయము గలుగును. అట్లు వినుచు రాగరాగ జ్ఞాన మతిశయించి వారలును పైఁజెప్పఁబడిన మూడు తరగతుల వారితోపాటు పరమాత్మ స్వరూపమిట్టిదని తెలిసికొనఁ గలరు. కాన

నట్టివారు గూడ మృత్యురూపమగు సంసారసాగరమును దరింపఁగలరు. ఇందుకు సందియమేమియు లేదు.

శ్లో॥ యావ త్సఞ్జాయతే కించి త్సత్త్వమ్ స్థావరజఙ్గమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్త ద్విద్ధి భరతర్షభ ! ॥ 27

అర్థము :— హేభరతర్షభ ! = భరతవంశశ్రేష్ఠుఁడవగునో యర్జునా, స్థావరజఙ్గమమ్ = స్థావరజంగమాత్మకమగు !, (యత్) + కిఞ్చిత్ = ఏవస్తువైనను, సత్త్వమ్ = ప్రాణముగలదిగా, యావత్ + సఞ్జాయతే = ఎంతవఱకుంచున్నదో, (తావత్) = (అంతవఱకు), తత్ = అది (అట్లు ప్రాణసహితమైయుండు వస్తువు), క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్ = క్షేత్రక్షేత్రజ్ఞులసంయోగము వలనఁ గలిగినదిగా, విద్ధి = ఎఱుఁగుము.

ఓయియర్జునా ! పెక్కు మాటలేల ? ఈవిషయమును సులభముగఁ దెలిసికొనఁదగిన సూక్ష్మమార్గమును జెప్పుచున్నాను వినుము. అదెట్లనిన, ఇంతకుముందీశరీరమే క్షేత్రమనియు; ఈక్షేత్రము నందుండి యెఱిఁగెడివాఁడే, అనఁగా శరీరమునందుండి దీనికి నెఱిఁగెడి శక్తియును, లేక యేదైన నొకపనిని జేసెడు శక్తియును గలుగఁజేసెడు వాఁడునగు జీవుఁడే క్షేత్రజ్ఞుఁడనియు, అట్లన్ని దేహముల యందుండెడు జీవాత్మయనఁగా పరమాత్ముఁడ నగునేనే, అనఁగా, నాయొక్క యంశమే కాని వేఱుకాదనియు చెప్పియుంటినిగదా ! జ్ఞాపకమున్నదా ! (చూ. 13. 2, 3).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — ఇందువలన నేమి యేర్పడుచున్నదనఁగా, క్షేత్రమనెడు దేహమునందు క్షేత్రజ్ఞుఁడనెడు జీవుఁడుండు నంతవఱకే యాశరీర మేదేని యొకపని చేయఁగలుగును గాని, ఆజీవుఁడు లేనపు డేమియుఁ జేయఁజాలదని యేర్పడుచున్నదిగదా ?

అర్జు — అవును. అట్లే యేర్పడుచున్నది.

కృ — కనుక నిందువలన నేర్పడియెడు ఫలితార్థమేమనఁగా, స్థావరాత్మకములగు వృక్షాదులయందును, జంగమాత్మకములగు నర-మృగ-పశు-పక్ష్యాదులయందును నేదియైననుసరే సత్త్వముగలదిగా నున్నంతవఱకు, అనఁగా నేదేని యొకపనిని జేయఁగలిగి యుండునంతవఱకు దానియందుఁ బ్రాణమున్నట్లు, అనఁగా, దానిశరీరమనెడు క్షేత్రమునకు క్షేత్రజ్ఞుఁడగు పరమాత్మయొక్క సంయోగము గలిగియున్నట్లును, ఆక్షేత్రము (శరీరము) చేయుచుండు పనులన్నియు దానియందుండెడు క్షేత్రజ్ఞునిచేఁ (పరమాత్మచే) జేయింపఁబడుచున్నట్లును నేర్పడుచున్నదిగదా ?

అర్జు — అవును, ప్రతిజీవజంతువునం దుండెడు జీవాత్మ యాపరమాత్మయొక్క యంశమే గనుక నట్టి ప్రతిజంతువు సేయుచుండు పనుల నాపరమాత్మయే చేయుచున్న ట్లెంచఁదగియున్నది.

కృ — అవునుగదా! మంచిది, ఇపుడు నీయెదుటనుండు మనుష్యులలో రాముఁడను నొకఁడు సోముఁడనువానిం గొట్టుటకు భీముఁడనువానిని ప్రేరేపించుటంజేసి యాభీముఁడనువాఁడాసోముఁడను వానింగొట్టుచున్నాఁడు, అందుచే సోముఁడు బాధనొందుచున్నాఁడు, అదిచూచి యాసోమునికి విహితుఁడగు రంగడు దుఃఖించుచున్నాఁడు, అహితుఁడగు లింగడు సంతోషించుచున్నాడు అనియెంచికొనుము. ఇందువలన నీవేమి తెలిసికొనుచున్నావు?

అర్జు — పరమాత్మయొక్కఁడే యిన్నిశరీరములయందును జీవాత్మస్వరూపముగనుండి పనిచేయుచున్నవాఁడు గనుక నాపరమాత్మయే ఏకకాలమందు రాముని యందుండి ప్రేరేపణయు, భీమునియందుండి కొట్టుటయు, సోమునియందుండి బాధనొందుటయు, రంగనియందుండి దుఃఖించుటయు, లింగనియందుండిసంతోషించుటయు చేయుచున్నాఁడని యెంచఁగలను.

కృ — అవునుగదా? కనుకనే, ఈదేహమునందుండెడు పరమాత్మ ఉపద్రష్ట యనియు, అనుమంతయనియు, భర్తయనియు, భోక్తయనియు, చెప్పుటకుఁ గారణమైనది. (చూ. 13. 23)

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తమ్ పరమేశ్వరమ్।
వినశ్య త్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ 28

అర్థము:— సర్వేషు+భూతేషు = సమస్తభూతములయందు, తిష్ఠన్తమ్ = ఉండునట్టియు, వినశ్యత్సు = (అభూతములు) నశించినను, అవినశ్యన్తమ్ = (తాను) నశింపకుండునట్టియు, పరమేశ్వరమ్ = పరమాత్మను, సమమ్ = సమునిఁగా (సమబుద్ధితో), యః+పశ్యతి = ఎవఁడు చూచుచున్నాఁడో, సః+పశ్యతి = వాఁడు చూచుచున్నాఁడు (అనఁగా అట్టివాఁడే పరమాత్మయొక్క నిజస్వరూపము నెఱిఁగినవాఁడనుట).

కాఁబట్టి, ఎవఁడైతే యీప్రపంచమునందలి సమస్త జీవజంతువులయందు నాపరమాత్మయొక్కఁడేయుండి వాని నాడించుచున్నాఁడనియు, అవియన్నియునశించినను వానియందుండెడు నాపరమాత్మమాత్రము నశింపక శాశ్వతముగా నుండుననియు నెఱిఁగి అట్టి జంతువులలో నెయ్యది యెప్పుడెప్పుడేమేపని చేసినను వానియెడల

రాగద్వేషము లుంచక సమభావముగలిగి ప్రవర్తించుచున్నాఁడో, అనఁగా, తన కుప కారము చేసెడువారియెడల ననురాగమును, అపకారము చేసెడువారియెడల ద్వేష బుద్ధియునుంచక, అట్టి యుపకారాపకారములన్నిటిని నాభగవంతుఁడే ఆయారూప ములతోఁ జేయుచున్నాఁడనియు, ఇవియన్నియు నాభగవంతుని లీలలే కాని మఱి యొకటి కాదనియు నెంచి యుపకారులయెడల స్నేహమును, అపకారులయెడల ద్వేషమును ఉంచక, యాయుభయులయెడలను సమభావముగలవాఁడైయుండునో అట్టివాఁడే భగత్స్వరూపమును నిజముగ నెఱిఁగినవాఁడగును.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్॥ 29

అర్థము :— హి=ఏలయనఁగా, సర్వత్ర + సమవస్థితమ్=అన్ని జంతువుల యం దుండునట్టి, ఈశ్వరమ్ = ఈశ్వరుని, సమమ్ + పశ్యన్ = సమభావముతోఁ జూచు చున్నవాఁడై, ఆత్మానమ్=తన్ను, ఆత్మనా=తనచేత, న + హినస్తి=హింసించి కొనఁడు, తతః=అందువలన, పరామ్ + గతిమ్=పరమపదమును, యాతి=పొందు చున్నాఁడు.

అట్లెవఁడైతే తనయందును ఇతరములగు సమస్తజంతువులయందును నుండెడువాఁడా పరమాత్మ యొక్కఁడే యని యెఱుఁగుచున్నాఁడో వాఁడు తనకంటె నితరములగు నన్ని జంతువులను దనవంటివేయని యెంచి వానియెడల సమబుద్ధిగలవాఁడైయుండును. కనుక నట్టివాఁ డితర యేజంతువునకు నేలాటిబాధకలిగినను, ఆబాధ తనకుఁగలిగినట్లు భావించఁగలఁడు. అట్లొక జంతువుకు మఱియొక జంతువుచేఁ గలిగెడు బాధనే తనకుఁ గలిగినబాధగా నెంచెడువాఁడు తనంతటఁ దానే మఱియొక జంతువునకు హింసఁగలుగఁజేసినయెడలఁ దన్నుఁదానే హింసించుకొన్నవాఁడగుచున్నాఁడుగదా! అట్లెవఁడైనఁ దన్నుఁ దానే హింసించుకొనఁజూచునా ? మాడడుగదా ? కాఁబట్టి వాఁడెప్పుడును ఇతరులకుబాధకరములగుపనులఁ జేయఁ బూనుకొనఁడు. కనుక నట్టి వాఁడు “ అహింసా పరమోధర్మః ” అనుప్రమాణానుసారముగ ధర్మములన్నిటిలో నుత్తమమగు ధర్మమును నెఱపినవాఁడగుచున్నాఁడు. కాన నట్టివాఁడు పరమపదమును బొందఁగలఁడు.

అర్జు — అయ్యా ! ఈలోకమున నిపుడు నీవు చెప్పినప్రకార మాత్మజ్ఞానము గలిగి పరమాత్మస్వరూపమిట్టిదని తెలిసికొని యహింసాపరులుగానుండెడు వారలు మిక్కిలియరుదుగను, ఇతరప్రాణులకు ననేకవిధములగు బాధలఁ గలుగఁజేయుచుండు

వారనేకులుగను ఉండుటఁ జూచుచున్నాముగదా? అట్లు హింసాపరులుగా నుండెడు వారియందును, వారివలన హింసింపఁబడెడు వారియందును ఉండెడువాఁడాపరమాత్మయొక్కఁడేయైయుండఁగా, అట్టిపరమాత్మ తన్నుదాను హింసించుకొనుపనులనేల చేయవలయును ?

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తదాత్మాన మకర్తారం స పశ్యతి ॥ 30

అర్థము:— సర్వశః = (ఈలోకమునందు) అంతట లేక అన్నివిధములైన, కర్మాణి = కర్మములు, ప్రకృత్యైవచ = ప్రకృతిచేతనే, క్రియమాణాని = చేయఁబడుచున్నవి, (ఇతి) = (అని). యః = ఎవఁడు, (యదా) = (ఎప్పుడు), పశ్యతి = చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో), సః = వాఁడు, తదా = అప్పుడు, ఆత్మానమ్ = ఆత్మను (క్షేత్రజ్ఞుని), అకర్తారమ్ = కర్తగానివానిగా, పశ్యతి = చూచుచున్నాఁడు (తెలిసికొనుచున్నాఁడు).

కృ — ఓయి యర్జునా! ఈలోకమునందలి సమస్తజీవజంతువులు చేయుచుండెడు పనులన్నియు నాజంతువులయందుండెడు నాత్మయే చేయుచున్నట్లు నీవెంచుచున్నావు కాఁబోలును. అట్లెంతమాత్రమెంచవలదు. మఱేమనిన, ఈలోకమునందలి జంతువులకు నీశ్వరుఁడు కర్మలనుగాని, ఆకర్మలయొక్క కర్తృత్వముగాని, ఆకర్మలయొక్క ఫలములతోఁటి సంబంధమునుగాని సృజింపలేదనియు, ఆకర్మలన్నియుఁ బ్రకృతి (స్వభావము) చేఁ జేయఁబడుచున్నవనియు, ఇంతకుముందు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 5. 14).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — మంచిది, ఇదిగాక, కార్యకారణ కర్తృత్వము ప్రకృతిదనియు, అందలి ఫలములగు సుఖదుఃఖముల యనుభవము పురుషునిది (జీవునిది) యనియుఁగూడఁ జెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 13. 21.)

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కాఁబట్టి, ఈలోకమునందలి జీవజంతువులలో నెయ్యది యెప్పుడెప్పుడేయేపనులఁ జేయుచుండినను, ఆయాపనులన్నియు నాయా జంతువునందుండెడు ప్రకృతి (స్వభావము) చేతనే చేయఁబడుచుండునని యెఱుంగుము. అట్లెవఁడెప్పుడెఱుఁగుచున్నాఁడో, అప్పుడు వాఁడీప్రపంచమునందలి జీవజంతువులచేఁ జేయబడుచుండెడు సమస్తకార్యములలో దేనికిని జీవాత్మకర్తగాదని యెఱిఁగినవాఁడగుచున్నాఁడు.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా॥ 31

అర్థము :— (యః)=ఎవఁడు, యదా=ఎప్పుడు, భూతపృథగ్భావమ్=నానావిధ భూతప్రపంచమును, ఏకస్థమ్=ఒక్కదానియందున్న దానిగను (ఒక యాత్మవలననే కల్పింపఁబడినదానిఁగను), తతః+ఏవ=ఆయొక్క యాత్మవలననే, విస్తారమ్+చ=విస్తరించుచున్న దానిఁగను. అనుపశ్యతి=చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో), (సః)=(వాఁడు), తదా=అప్పుడు, బ్రహ్మ=బ్రహ్మమును (పరబ్రహ్మస్వరూపమును), సమ్పద్యతే=పొందుచున్నాఁడు.

ఇట్లెఱుఁగుటలో మఱియొక విశేషము గలదు. అదేమనఁగా జెప్పుచున్నాను వినుము. ఈసమస్త భూతప్రపంచమునకును ఉత్పత్తి స్థితిలయ స్థానములు నేనేయనియు, నాకంటె వేఱైనది మఱియొకటి లేదనియు, కాన నొక్కదారమనేక విధములగు పూసలయందుఁ గ్రుచ్చఁబడి వానియన్నిటియందెట్లు వ్యాపించియున్నదో. అట్లే నేను సమస్త భూతములయందు వ్యాపించియున్నాననియు నింతకుముందు నీకుఁ జెప్పియుంటినిగదా. జ్ఞాపకమున్నదా ! (చూ. 7. 6, 7 .

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కాన నట్లెఱుఁగుట మాత్రమే గాక, ఈజీవాత్మయనఁగా పరమాత్మయొక్క యంశమే గాని వేరు కాదనియు, అనఁగా నాపరమాత్మ యొక్కఁడే జీవాత్మస్వరూపముతో నీప్రపంచమునందలి నానావిధములగు దేవ, దానవ, మనుష్య, పశు, పక్షి, జలచర, క్రిమి, కీటకాది సమస్తజంతువులయందును వ్యాపించియున్నాఁడనియు అనఁగా, ఈ నానావిధములగు జంతుజాలములన్నియు నాపరమాత్మవలననే కల్పింపఁబడి యాడింపఁబడుచున్నవనియు, ఆపరమాత్మవలననే వృద్ధినొందింపఁబడుచున్నవనియు నెప్పుడెఱుఁగుచున్నాఁడో, అప్పుడువాఁడు సాక్షాత్తుగ నాపరబ్రహ్మస్వరూపియే యగుచున్నాఁడు.

అర్జు — ఆహా! ఇట్లు పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తజంతువుల యందుండి వానిని సూత్రధారుఁడు బొమ్మల నాడించునట్లాడించుచుండెడు నాత్మకు, ఆజంతువులు సేయుచుండెడు పనులయందలి కర్తృత్వము లేకపోవుటయు, ప్రకృతికి మాత్ర మాకర్తృత్వము గలిగి యుండుటయుఁ జూడఁగా మిగుల వింతయగుచున్నది.

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ! న కరోతి న లిప్యతే॥ 32

అర్థము :— హే కౌన్తేయ ! = ఓయర్జునా !, అవ్యయః = నాశరహితుఁడైన, అయమ్ + పరమాత్మ=ఈపరమాత్మ, శరీరస్థః + అపి=దేహమునందున్నవాఁడైనను, అనాదిత్వాత్ =ఆది లేనివాఁడగుటచేతను, నిర్గుణత్వాత్ =గుణరహితుఁడగుటచేతను, న + కరోతి=(కర్మముల) చేయువాఁడు కాఁడు, న + లిప్యతే=(కర్మఫలములచే) అంటఁబడఁడు.

కృ — ఓహో ! అట్లైనయెడల నందుకుఁ దగిన సమాధానమును జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా ! పృథివ్యాది భూతములైదును, జ్ఞానేంద్రియములైదును, కర్మేంద్రియములైదును, ఇంద్రియ విషయంబులైదును, మనోబుద్ధిచిత్తాహంకారంబులు నాల్గును, ఈ యిరువదినాల్గు తత్త్వంబులును జేరి రాగద్వేష సుఖదుఃఖాది వికారములతోఁ గూడి క్షేత్రమనఁబడుచున్నదనియు (చూ. 13. 6, 7), ఈక్షేత్రమునకే శరీరమనెడు నామాంతరము గలదనియు, ఇట్టి శరీరమునందు సాక్షీభూతుఁడుగ నుండి దానిని యాడించువాఁడే క్షేత్రజ్ఞుఁడనియు (చూ. 13. 2), అట్టి క్షేత్రజ్ఞుఁడే పరమాత్మయు పురుషుఁడు నగు నేననియు (చూ. 13–3) ఇంతకుముందు చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా ?

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — మంచిది, అట్టి ప్రకృతి పురుషు లిరువురును అనాదిగానుండెడువారనియు, అందుఁ బ్రకృతిమాత్రమే త్రిగుణములకును, అనఁగా సత్త్వరజస్తమోగుణములకును ఆగుణములవలన మనోబుద్ధీంద్రియములకుఁ గలిగెడు వికారములకును సంబంధించియుండుననియును గూడఁ జెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా ? (చూ. 13. 20).

అర్జు — అవును, జ్ఞాపకమున్నది.

కృ— ఇందువలన నేమి యేర్పడుచున్నదో యెఱుఁగుదువా ?

అర్జు— ఇందువలన, పురుషుఁడు (ఆత్మ) అనాదియైనవాఁడనియు, గుణరహితుఁడనియు. అనఁగా, సత్త్వరజస్తమస్సులనెడు మూఁడుగుణములలో నేదిగాని, ఆగుణములవలనఁ గలిగెడు వికారములుగాని లేనివాఁడనియు నేర్పడుచున్నది

కృ — అవునుగదా ? అట్లనాదియైన వాఁడగుటచేతను, నిర్గుణుఁ డగుటచేతను, త్రిగుణాత్మకమగు ప్రకృతి సంబంధమైన శరీరము నందుండినవాఁడైనను, ఆశరీరముచేఁ జేయఁబడు కర్మలలో దేనియొక్కయు కర్తృత్వముగాని, ఫలముగాని యీపరమాత్మకుఁ జెందనేరదు.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే।
సర్వత్రాఽవస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥ 33

అర్థము :— ఆకాశమ్=ఆకాశము, సర్వగతమ్=సమస్త వస్తువుల యందును వ్యాపించియుండియు. సౌక్ష్మ్యాత్=సూక్ష్మమైనదగుటవలన, యథా=ఏప్రకారము, నోపలిప్యతే=అంటఁబడదో, తథా=అలాగుననే, ఆత్మా=పరమాత్మ, సర్వత్ర+దేహే=సమస్తశరీరములయందు, అవస్థితః=ఉండినవాఁడయ్యును, నోపలిప్యతే=అంటఁబడడు.

అదెట్లనఁగా, ఇందునకొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! ఈలోకమునందలి ఘట పటాది సమస్తవస్తువులయందును ఆకాశమున్నదా లేదా ?

అర్జు — అన్నిటియందున్నది.

కృ — మంచిది, అట్లన్నిటియందున్నప్పుడు, ఏవస్తువునందుండెడు నాకాశమునకు ఆవస్తువునందు సుగుణ దుర్గుణములు, సురూపకురూపములు. సుగంధ దుర్గంధములు ఈమొదలగు వికారము లేవియుండినను సరే ఆవికారము లంటుచున్నవా ?

అర్జు — "ఆకాశం గగనం శూన్యం" అనునట్లది కేవల సూక్ష్మమైనవస్తువు అనఁగా రూపరహితమైన వస్తువైయుండఁగా దానికా వికారములలో నెద్దియైనను సరే యెట్లంటఁగలదు ?

కృ — అవునుగదా, పరమాత్మయు నట్లే రూపరహితుఁడును, గుణరహితుఁడునైయుండుట యెఱుఁగుదువుగదా ?

అర్జు — అవును ఎఱుఁగుదును.

కృ — కనుక నట్టిపరమాత్మయు నెట్టి శరీరము (క్షేత్రము) నఁదున్న వాఁడైనను సరే ఆ శరీరమునందు గల ప్రకృతిసంబంధమైన గుణములచే నంటఁబడఁడని యెఱుంగుము. ఇందునకు మఱియొక దృష్టాంతముగలదు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!॥ 34

అర్థము:—హేభారత!=ఓయియర్జునా!, యథా=ఎట్లు, ఏకః+రవిః=ఒక్కఁడైనసూర్యుఁడు, ఇమమ్+కృత్స్నమ్+లోకమ్=ఈసమస్తప్రపంచమును, ప్రకాశయతి=ప్రకాశింపఁ జేయుచున్నాఁడో, తథా=అట్లు, క్షేత్రీ=క్షేత్రజ్ఞుఁడగు పర

మాత్మ. కృత్స్నమ్ + క్షేత్రమ్ = సమస్తశరీరమును, ప్రకాశయతి = ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

ఓయి అర్జునా ! ఒక్క సూర్యుని చేతనే యీప్రపంచమంతయుఁ బ్రకాశింపఁజేయఁబడుచుండుట నెఱుఁగుదువుగదా, అనఁగా, ఈ ప్రపంచమునందలి సమస్తదేశములయందును పట్టణములయందును పల్లెలయందును గృహములయందును ఆగృహములయందుండెడు సమస్త వస్తువులయందును నాయొక్క సూర్యుని కిరణములే యేక కాలమందు వ్యాపించి వానిని బ్రకాశింపఁ జేయుచుండుట నెఱుంగుదువుగదా ? అట్లే వస్తువునందు వ్యాపించెడు కిరణముల కావస్తువు నందుండెడు సుగుణ-దుర్గుణ-సురూప-కురూప-సుగంధ-దుర్గంధాది వికారములంటుచున్నవా ?

అర్జు — లేదు.

కృ — మంచిది. ఈప్రపంచమునందలి సమస్త క్షేత్రములయందు (శరీరములయందు) పరమాత్మనగు నేనొక్కఁడనే వ్యాపించియున్నానని యింతకుముందు చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా ! (చూ. 13-3).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కాఁబట్టి సమస్తశరీరముల యందుండునట్టి యీపరమాత్మయు నట్లే యీశరీరములను బ్రకాశింపఁజేయుచుండినను, అనఁగా, వానియందుండి వానిచే సమస్త కర్మములను జేయించుచుండినను, ఆయాశరీరములయందుండు ప్రకృతి సంబంధములగు గుణవికారము లాపరమాత్మ కంటనేరవు.

ఈ విషయము నతిసులభముగఁ దెలిసికొనఁదగిన దృష్టాంతము మఱియొకటి గలదు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

" గీ. గాజుకుప్పెలోనఁ గడఁగుచుదీపం బదెట్టు
లుండు నాత్మ యట్టులుండుఁ
దెలిసినట్టివారి దేహంబులందుల
విశ్వదాభిరామ వినరవేమ. "

అనునట్లు, ఒకదీపమును, తెలుపు-ఎఱుపు-నలుపు-మొదలగు ననేకవిధములగు రంగులుగల గాజుకుప్పెలలో నొక్కొకదానియందుఁ గొంతకొంత సేపుంచుచువచ్చిన యెడల నాదీప మేయేరంగుగలకుప్పెలో నుండునపు డాయారంగుగలదిగా బ్రకాశింపుచు దానియందుండి తొలఁగించఁబడినపు డారంగులేక నిర్మలమైనదిగాఁ బ్రకాశింపుచుండుటను జూచియుందువుగదా, అందువలన నేమి తెలిసికొనుచున్నావు ?

అర్జు — అరంగు లాకుప్పెలయందుండునవియేగాని దీపమునందు లేవనియు, ఆదీప మేరంగుగల కుప్పెయందుండునపు డారంగుతోఁ బ్రకాశింపుచుండినను ఆరంగా దీపమున కంటుట లేదనియుఁ దెలిసికొనుచున్నాఁడను.

కృ — అవునుగదా ? అట్లే పరమాత్మయు జీవాత్మ (క్షేత్రజ్ఞ) స్వరూపముతో సమస్తదేహముల (క్షేత్రముల) యందుఁ బ్రకాశించుచుండినను, ఆశరీరముల యందలి ప్రకృతి గుణసంబంధములగు వికారములచే నంటఁబడదని యెఱుంగుము.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరమ్ ॥ ౩౫

అర్థము:— ఏవమ్ = ఇట్లు, యే = ఎవరు, క్షేత్రక్షేత్రజ్ఞయోః = క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క, అన్తరమ్ = భేదమును, భూతప్రకృతిమోక్షం + చ = భూతములకు సంబంధించియుండు ప్రకృతినుండి విముక్తినొందఁదగినయుపాయమును, జ్ఞానచక్షుషా = జ్ఞానదృష్టిచేత, విదుః = ఎఱుఁగుచున్నారో, తే = వారు. పరమ్ = పరమపదమును, యాన్తి = పొందుచున్నారు.

కనుక నోయి యర్జునా !. ఇట్లు, అనఁగా నిపుడు నేఁ జెప్పిన ప్రకారము క్షేత్రమనియెడు పాంచభౌతిక శరీరమునకును, అట్టి శరీరమునందు జీవాత్మ స్వరూపముగ నుండి క్షేత్రజ్ఞుఁడనఁబడు పరమాత్మకును గలభేదమును, అట్టి శరీరములయందుండియు బ్రకృతిబద్ధుఁడుగాకయుండుటకుఁ దగిన యుపాయమును జ్ఞానదృష్టిచే నెవఁ డెఱుఁగుచున్నాఁడో, అట్టివాఁడు మోక్షమును బొందఁగలఁడు.

అర్జు — అయ్యా ! ప్రకృతిసంబంధమగు దేహమునందుండు జీవుఁడా ప్రకృతిచే బద్ధుఁడుగాక విలక్షణుఁడుగ నుండుటకుఁ దగిన యుపాయము నెట్లెఱుఁగ నగును ?

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగంబను
త్రయోదశాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతాగర్భితభావబోధిని

## చతుర్దశాధ్యాయము

### గుణత్రయవిభాగయోగము

శ్రీభగవానువాచ:

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ ।
యజ్జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥ 1

అర్థము:— మునయః + సర్వే = మునులందఱును, యత్ + జ్ఞాత్వా = దేని నెఱిఁగి, ఇతః = ఇందువలన (ఇట్లెఱుఁగుటవలన), పరామ్ + సిద్ధిమ్ = పరమపదమును, గతాః = పొందిరో (అట్టిదియు), పరమ్ = శ్రేష్ఠమైనదియు, జ్ఞానానామ్ = జ్ఞానములలో, ఉత్తమమ్ = ఉత్తమమైనదియునగు, జ్ఞానమ్ = జ్ఞానమును, భూయః = మరల, ప్రవక్ష్యామి = చెప్పుచున్నాను.

కృ — ఓయి యర్జునా! ప్రకృతిసంబంధమగు దేహమునందుండు జీవుఁడా ప్రకృతిచే బద్ధుఁడుగాక విలక్షణుఁడుగ నుండుటకుఁదగిన యుపాయము నెట్లెఱుఁగ నగునని యడిగితివిగదా? (చూ. 13-35 సంభాషణ). ఆవిషయమునుగూర్చి చెప్పుచున్నాను వినుము.

క్షేత్రజ్ఞుఁడనియుఁ బురుషుఁడనియుఁ జెప్పఁబడుజీవుఁడు క్షేత్రమనియెడు పాంచభౌతిక శరీరమునందుండుటచేతను, ఆశరీరము ప్రకృతిబద్ధమైన దగుటచేతను, ఆప్రకృతిగుణముల నాజీవుఁ డనుభవించుననియు, అట్లనుభవించునపు డాజీవుఁ డాసక్తినొందినయెడల నదియే పునర్జన్మమునకుఁ గారణమగుననియు నింతకుముందు చెప్పియుంటినిగదా? (చూ. 13-22). ఇందువలన, పాంచభౌతిక దేహస్థుఁడగు నొక జీవుఁ డాదేహమునకు సంబంధించిన ప్రకృతిగుణముల ననుభవింపుచుండినను, ఆగుణములయందాసక్తచిత్తుఁడు గాకుఁడినయెడల నాజీవునికిఁ బునర్జన్మగలుఁగ నేరదని

యేర్పడుచున్నదిగదా ? కనుక, ప్రకృతిగుణము లెట్టివైనదియు, ఆవిదేహస్థుఁడగు జీవుని నెట్లు బంధించునదియు, వాని నెట్లు నివర్తింపఁజేయవచ్చునో యదియు నెఱుఁగుట యేదికలదో, అదియే జ్ఞానములన్నిటిలో నుత్తమమైన జ్ఞానమగుచున్నది. అదెట్లనఁగా, ఇట్టి యెఱుక లేనివారలు మఱి యెట్టిజ్ఞానముగలవారై తపోయజ్ఞదానాది యెట్టిసత్కర్మల నాచరించినను, ఆయాసత్కర్మలకుఁ దగిన ఫలములను బొందఁగలుగుదురే కాని, జననమరణరాహిత్యమగు మోక్షమును బొందఁజాలరు. ఇఁకను, ఈ యెఱుకగలవారన్నో, అట్టి తపోయజ్ఞదానాదిసత్కర్మల నాచరించినవారైనను సరే కాకపోయిననుసరే,

“ క. స్థావరముల జంగమముల
నావిభుఁడు వసించు నతనియందున విని స
ర్గావాసతనుండును ద
ద్భావన మెఱుఁగుట తదైక్యపదముం జేర్చున్.”(భార.శాంతి.౫.ఆ ౧౧౦).

అనునట్లు, నాసాయుజ్యమునొందఁగలరు. కనుకనే, ఋషులందఱును ఈజ్ఞానమునే ముఖ్యముగ సంపాదించినవారై, ఇందువలననే పరమపదమును బొందఁ కలిగిరి. కనుక నోయి యర్జునా! అట్టి సర్వోత్కృష్టమైన జ్ఞానమునుగూర్చి నీకిదివఱ గప్పుడప్పుడు సంగ్రహముగఁ జెప్పుచువచ్చినను, దానినిపుడు నీకుఁ జక్కఁగ బోధపడునట్లు విపులముగను సంపూర్ణముగను మరలఁ జెప్పఁబోవుచున్నాను. గాన శ్రద్ధతో నాకర్ణింపుము.

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమసాధర్మ్య మాగతాః ।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ ॥ 2

అర్థము :— ఇదమ్+జ్ఞానమ్ = ఈజ్ఞానమును, ఉపాశ్రిత్య = ఆశ్రయించి (పొంది), మమ+సాధర్మ్యమ్ = నాసాయుజ్యమును, ఆగతాః = పొందినవారు, సర్గే+అపి=జగత్సృష్టికాలమందును, న+ఉపజాయన్తే=జన్మించరు, ప్రళయే+చ = ప్రళయకాలమునందును, న+వ్యథన్తి = వ్యథనొందరు (చావరు).

ఓయి యర్జునా! నాసాయుజ్యమును గలుగఁజేయుటవలన నీజ్ఞానమునకిట్టి సర్వోత్కృష్టత గలుగుటకుఁ గారణమేమనఁగా, నాసాయుజ్యము నొందుటకంటె నెక్కుడు ఫలమేదియులేదు. అదెట్లనఁగా, ఎవరైతే యీజ్ఞానముగలవారై యందువలన నాసాయుజ్యము నొందుచున్నారో, అట్టివార లీప్రపంచముండునంతవఱకును మరల

జన్మించుటలేదు సరేకదా? బ్రహ్మప్రళయ కాలమునం దీప్రపంచమంతయు నశించి మరల నూతనప్రపంచము సృష్టింపఁబడు నపుడుగూడ జన్మించరు. అనఁగా నీప్రపంచ మెన్నిమారులు సృష్టిప్రళయముల నొందినను వారలీప్రపంచోత్పత్తి కాలమునందు జన్మించుటగాని, ప్రళయ కాలమునందు నశించుటగాని కలుగనేరదు. కనుక నిట్టి సాయుజ్యపదవిని గలుగఁజేయునది యగుటచే నీజ్ఞానము సర్వోత్కృష్టమైనదని చెప్పుటకుఁ గారణమైనది. అజ్ఞానమెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ మమ యోనిర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహం ।
సమ్భవ స్సర్వభూతానాం తతో భవతి భారత ! ॥ 3

అర్థము:— హేభారత! = ఓయి యర్జునా, మమ = నాయొక్క, మహత్ + బ్రహ్మ = స్థూల ప్రకృతి. అనఁగా మూలప్రకృతి, యోనిః = గర్భాధానస్థానము, అహమ్ = నేను, తస్మిన్ = ఆ (ప్రకృతియనెడు) యోనియందు, గర్భమ్ = (చైతన్య మనెడు) బీజమును (అనఁగా - నాసూక్ష్మప్రకృతిని), దధామి = ఉంచుచున్నాను, తతః = అందువలన, సర్వభూతానామ్ = సమస్తభూతముల, సమ్భవః = ఉత్పత్తి, భవతి = కలుగుచున్నది.

అదెట్లనఁగా, ఓయియర్జునా! నాదు ప్రకృతి పృథవ్యాది పంచభూతములును, మనోబుధ్యహంకారములును జేరి యెనిమిది విధములైనదిగ నున్నదనియు, దీనికంటె శ్రేష్ఠమైనదియు జీవభూతమైనదియు మఱియొక ప్రకృతి గలదనియు, ఇంతకుముందు చెప్పియుంటినిగదా. జ్ఞాపకమున్నదా? (చూ. 7 4–5)

అర్జు— అవును. జ్ఞాపకమున్నది.

కృ— వీనిలో మొదటిది స్థూలప్రకృతి–లేక–మూల ప్రకృతియనియు, రెండవది సూక్ష్మప్రకృతియనియు నెఱుంగుము. ఈ రెంటియొక్క సంయోగము (కూడిక) వలననే యీసమస్తభూతములు నుత్పన్నములగుచున్నవి కనుక జగత్సృష్టిఁజేయుటలో నాదు నీస్థూలప్రకృతి యోనివంటిదియు సూక్ష్మప్రకృతి బీజమువంటిదియునై యున్నవి. అనఁగా, స్త్రీపురుష సంయోగకాలమున నా స్త్రీయొక్క గర్భమునందుఁ బురుషుఁడు రేతస్సును విడుచుటఁచే బిండోత్పత్తి యెట్లగుచున్నదో, అట్లే, ఈస్థూలప్రకృతియందు నాసూక్ష్మప్రకృతియగు చైతన్యము నుంచుచున్నాను. అట్లు చేయుటవలన సమస్తభూతోత్పత్తి యగుచున్నది. ఇట్లు చేయుటయే సృష్టి కర్మ యనఁబడుచున్నది. కనుకనే "భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః" అని యింతకుముందు చెప్పుటకుఁ గారణమైనది. (చూ. 8. 3). కనుక,

"క. నరనారీ సంబంధము
వఱసగదా పురుషునకును బ్రకృతికి నన్యో
న్యరమణ మది సర్వజనన
కర మిట్టుల శ్రుతులుసెప్పఁ గారుణ్యనిధీ!"

(భార. శాంతి. ౩. ఆ. ౨౫.)

అని పూర్వము వసిష్ఠమహర్షి జనకచక్రవర్తికిఁ జెప్పినట్లు, ప్రకృతియనెడు స్త్రీతోఁ బరమాత్మయనెడు పురుషుఁడనైన నేను గలసి యాప్రకృతియందు నాయంశ మగు జీవాత్మయనెడు బీజము నుంచుటవలన నీ సమస్తప్రపంచ ముత్పన్నమగుచున్నది.

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సమ్భవ న్తియాః ।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥ 4

అర్థము:— హేకౌన్తేయ!=ఓయియర్జునా!, సర్వయోనిషు=సమస్తయోనుల యందును, యాః + మూర్తయః = ఏశరీరములు, సమ్భవన్తి = పుట్టుచున్నవో, తాసామ్=ఆమూర్తులకు, మహత్ + బ్రహ్మ=స్థూలప్రకృతి, యోనిః=గర్భాధాన స్థానము అనఁగా తల్లి, అహమ్=నేను, బీజప్రదః=గర్భాధానము సేయునట్టి, పితా=తండ్రిని.

కనుక నోయి యర్జునా! ఈ ప్రపంచమునంగల దేవ, మనుష్య, పశు, మృగ, పక్షి, క్రిమి, కీటకాది సమస్తజంతువుల యోనులయం దుత్పన్నములయ్యెడు దేహముల కన్నిటికిని నా స్థూలప్రకృతియే యోని (మాతృస్థానము) అనియు, అట్టి యోనియందు చైతన్యమనెడు బీజమునుంచెడు వాఁడనగు నేను తండ్రిని (పితృస్థానము) అనియు నెఱుంగుము. అనఁగా నా జంతువులన్నియుఁ బ్రకృతియనెడు స్త్రీయొక్కయుఁ బురుషుఁడనగు నాయొక్కయు సంయోగమువలననే గలుగుచున్నవనుట. కనుకనే "బీజం మాంసర్వభూతానామ్ విద్ధిపార్థసనాతనమ్" అని యింతకుముందు చెప్పుటకుఁ గారణమైనది. (మా. 7.10).

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః ।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహిన మవ్యయమ్॥ 5

అర్థము:— హేమహాబాహో!=ఓయియర్జునా!, అవ్యయమ్=నాశరహితుఁడైన, దేహినమ్=ఒక దేహస్థుఁడగు నాత్మను, దేహే=(ఆ) దేహమునందు (ఉండునంతవఱకు), ప్రకృతిసమ్భవాః=(ఆ దేహమునకు సంబంధించిన) ప్రకృతివలనఁ బుట్టిన,

సత్త్వమ్ + రజః + తమః + ఇతి + గుణాః = సత్త్వరజస్తమోగుణములు, నిబధ్నన్తి = బంధింపుచుండును.

అయితే, నేను అవ్యయుఁడను నిర్గుణుఁడను గనుక నట్లాప్రకృతియావరింపఁబడెదు నా యంశమగు జీవాత్మయు నిర్గుణుఁడుగా నుండునని యెంచెదవు గాఁబోలును, అట్లెంచదగదు. ఏలయనఁగా, పృథివ్యాది పంచమహాభూతములును మనోబుధ్యహంకారములును గలసి ప్రకృతియగుచున్నదని యింతకుముందు చెప్పియుంటిని గదా (చూ. 7–4). అట్టి ప్రకృతి సంబంధములగు పంచమహాభూతములును అహంకరణ చతుష్టయమును దశేంద్రియములతోడను విషయంబులతోడను గలసి చతుర్వింశతి తత్త్వము లగుచున్నవనియు ఆ చతుర్వింశతి తత్త్వములును రాగద్వేషాది వికారములతోఁగూడి దేహమగుచున్నదనియు, ఈ దేహమునకే క్షేత్రమని నామాంతరము గలదనియుఁ జెప్పియుంటినిగదా (చూ. 13. 6–7). ఇదిగాక, సత్త్వరజస్తమోగుణములు మూడును, ఆగుణములవలనఁ గలిగెడు వికారములను ప్రకృతి సంబంధములనియును గూడఁ జెప్పియుంటినిగదా (చూ. 13–20). కనుక, ఇందువలన నీ దేహము ప్రకృతివలనఁ గలిగినదనియు, కాన నాప్రకృతి సంబంధములగు సత్త్వరజస్తమోగుణములు మూడును నీదేహమున కాపాదించియే యుండుననియు నేర్పడుచున్నదిగదా ?

అర్జు — అవును.

కృ — మంచిది, ప్రకృతిసంబంధమగు నట్టి దేహమునందుండెడు నాత్మయాదేహము నంటియుండెడు ప్రకృతిగుణముల ననుభవింపుచున్నాఁడనియును జెప్పియుంటినిగదా (చూ. 13. 21)

అర్జు — అవును.

కృ — కాఁబట్టి నేను నిర్గుణుఁడనైనను, నాయంశమగు జీవుఁడేదేని యొక దేహమునందుండి దేహియను పేరఁబరగుచుండెడువాఁడు గనుక నట్లే దేహమున నుంచున్నాఁడో ఆదేహమున నుండునంతవఱకు నాదేహసంబంధములగు ప్రకృతిగుణములచే బద్ధుఁడగుచునే యుండును.

అర్జు — ఆప్రకృతిగుణములచే నాజీవుఁడు బద్ధుఁడగుటయెట్లు ? అనఁగా, ఆజీవుఁడేయే గుణములచే బద్ధుఁడగునపు డేయేవిధముగాఁ బ్రకాశింపుచుండును ?

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్ ।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ! 6

అర్థము :— అనఘ ! = పాపరహితుఁడవగు నోయర్జునా!, తత్ర = ఆ సత్త్వరజస్తమస్సులనెడు మూఁడుగుణములలో, సత్త్వమ్ = (మొదటిదియగు) సత్త్వగుణము, నిర్మలత్వాత్ = నిర్మలమైనదగుటవలన, ప్రకాశకమ్ = ప్రకాశింపఁజేయునదియు, అనామయమ్ = ఆరోగ్యకరమైనదియునై, సుఖసఙ్గేన = సుఖముతోఁగూడుటచేతను, జ్ఞానసఙ్గేన + చ = జ్ఞానముతోఁగూడుటచేతను. బధ్నాతి = బంధించుచున్నది.

కృ — ఓయి యర్జునా! నీవిపు డడిగిన విషయమును గుఱించి చెప్పుచున్నాను వినుము.

ప్రకృతిసంబంధములగు సత్త్వరజస్తమోగుణములలో మొదటిదియగు సత్త్వగుణమెట్టిదనఁగా నిర్మలమైనది, అనఁగా, నేలాటిదోషమును లేక స్వచ్ఛముగానుండు నట్టిది. కనుక,

“తే. స్మృతియు సంప్రీతియును బ్రసన్నతయు మతియు
నీదృఢతములు సత్త్వగుణోచితములు” (భార. శాంతి. ౪. ఆ. ౨౫౭)

అనునట్లు, అట్టి కేవలసత్త్వగుణములనే కలిగియుండు దేహమునందుండెడు దేహి (జీవుఁడు) యెట్లుండుననఁగా అట్టిదేహికి బుద్ధివికాసమును, ప్రసన్నత్వమును కలిగియుండుటయ గాక, మనోవ్యాధి దేహవ్యాధి మొదలగు పీడలు లేనివాఁడై సుఖముగానుండును. వానికట్టి శరీర మనస్సౌఖ్యములు కలుగుటకుఁ గారణమేమనఁగా, ఈలోకమున సాధారణముగ రాగద్వేషములవలన మనోజాడ్యమును, జిహ్వాచాపల్య గుహ్యాచాపల్యములవలన దేహజాడ్యమును కలుగుచున్నవిగదా? కేవల సత్త్వగుణప్రధానునకట్టి రాగద్వేషములును జిహ్వాచాపల్య గుహ్యాచాపల్యములును నుండవుగాన వానికట్టి మనోజాడ్య దేహజాడ్యములు కలుగనేరవు. ఈ రెండువిధములగు పీడలెప్పుడు లేకపోవుచున్నవో అప్పుడు

“క. వినుము నృపహర్షంబు ప్రీయుం
బనూనసుఖయుక్తి నిర్భరానందము శాం
తి నిరూఢియునఁగ మనమునఁ
బను గొను నవి సాత్త్వికాఖ్యభావంబులగున్.” (భార. శాంతి. ౪.ఆ.౩౫౦)

అనునట్లు వాని మనస్సీలాటిలక్షణములచే నతినిర్మలమైనదై సుఖించును. అట్టి మనస్సౌఖ్యమెప్పుడు కలుగుచున్నదో అప్పుడు వానిబుద్ధి చక్కఁగా వికసించినదై యుక్తాయుక్తవివేచనమును, ఆత్మావలోకనమును జేయును. అందువలన వానికి జ్ఞానముత్పన్నమగును. కనుక, కేవలసత్త్వగుణప్రధానమగు దేహమునందుండెడు జీవుని నా సత్త్వగుణ మీవిధముగ బంధించుచున్నది. అనఁగా నట్టిలక్షణములుగలవాఁడగుచున్నాఁడని భావము.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్॥ 7

అర్థము :— హే కౌన్తేయ! = ఓయిఅర్జున!, రజః=రజోగుణము, తృష్ణాసఙ్గసముద్భవమ్=ఆశాపాశములచేఁగలుగునదియనియు, రాగాత్మకమ్=(కనుక)ప్రాప్త విషయములయెడలఁ బ్రీతిఁగలుగఁజేయునదియనియు, విద్ధి = ఎఱుఁగుము, (తతః) = ఆ కారణమువలన, తత్ = ఆరజోగుణము, దేహినమ్=దేహస్థుఁడగుజీవుని, కర్మసఙ్గేన=(కోరినవానిని సంపాదించుటకును, ప్రాప్తించినవానిని గాపాడుటకును దగిన) కర్మములయందలి యాసక్తిచేత, నిబధ్నాతి = బంధింపుచున్నది.

ఇఁకను రెండవది యగు రజోగుణ మెట్టిదనఁగా, "రాగలోభరోషాదులు రాజసములు" అనునట్లు తృష్ణా సంగముచేఁ గలుగునట్టిది. అనఁగా, ఏవేని విషయములను గోరుటయు, అవి లభించినపుడు వానియెడల మిగుల నాసక్తి గలిగి యుండుటయు మొదలగు లక్షణములు గలదియైయున్నది. కనుక నట్టి రాజస గుణము గలవాఁడు,

"చ. బలమును శౌర్యమున్ మదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖ భాగితా
కలనముఁ జెల్మిసేతయును గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పపుభాషలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్॥"

(భార. అశ్వ. ౨.ఆ. ౧౧౯).

అనునట్లు, బలము, శౌర్యము, సంతోషము, సుఖము, దుఃఖము, కొందఱితో స్నేహము సేయుట, మఱికొందఱితో విరోధించియుండుట, కొన్ని విషయములను గోరుట, మఱికొన్ని విషయములను ద్వేషించుట, ప్రతాపముఁ జూపుట, కొందఱితోఁ గలహించుట, మఱికొందఱియెడల నసూయగలిగి యుండుట, వికల్పపుమాటలాడుట, స్త్రీలయెడల వ్యామోహముగలిగియుండుట, అనృతములాడుట, గర్వించుట మొదలగు లక్షణములు గలిగియుండును. కావున నట్లు రజోగుణప్రధానమగు దేహమునందుండెడు జీవుఁడిట్టిలక్షణములు గలవాఁడై యాలక్షణములకుఁదగిన కర్మములఁజేయుటయందు బంధింపఁబడుచున్నాఁడు. అనఁగా నట్టికర్మములఁజేయు నట్లారజోగుణము చేఁ బ్రేరేపింపఁబడుచున్నాఁడనుట.

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత!॥ 8

అర్థము:— హే భారత! = ఓయియర్జునా!, తమః + తు = తమోగుణ మన్ననో, అజ్ఞానజమ్ = అజ్ఞానమువలనఁ బుట్టిన దానిఁగా, విద్ధి = ఎఱుఁగుము, తత్ = అది (అతమోగుణము), సర్వదేహినామ్ = సమస్తప్రాణులకు, మోహనమ్ = మోహమును గలుగఁజేయునదియై, ప్రమాదాలస్యనిద్రాభిః = పరాకు, సోమరితనము, నిద్ర మొదలగువానిచే, నిబధ్నాతి = బంధించుచున్నది.

ఇఁకను మూడవదియగు తమోగుణమెట్టిదనఁగా, కేవల మజ్ఞానమువలనఁ గలునది. కనుక నట్టితమోగుణము గలవాఁడు,

"క. తలఁపులు గ్రందుగఁ బోవుట
గలగను చేమఱుట భ్రమముగదుసుట జాడ్యం
బలసత యనునీభావం
బులు దామసకోటి యండ్రు బుధులు నరేంద్రా" (భార.శాంతి.౪.ఆ. 31౹-౨)

అనునట్లు, అనేక విధములగుయోచనలు, అనఁగా, ...తెమకోరికలు గలుగుటయును, ఎప్పుడును నిద్రయందాసక్తిగలవాఁడై తూగుచుండుటయును, సోమరితనముచే నేపనియును జేయుటకుఁ బ్రాలుమాలుటయు. ఏవిషయమునైనను గ్రహించుటయుండగాని, లేక, ఏపనినైనను జేయుటయుండుఁగాని పొరపాటుపడుటయు, మందబుద్ధి గలవాఁడై యుండుటయు, ఈ మొదలగు లక్షణములుగలవాఁడైయుండును. అనఁగా, కేవలతమోగుణప్రధానుఁడై ... దేహి (జీవుఁడు) ఇట్టి లక్షణములచే బద్ధుఁడగుచున్నాఁడనుట.

శ్లో॥ సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత!
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత ॥ 9

అర్థము.— హే భారత! = ఓయి యర్జునా, సత్త్వం = సాత్త్వికగుణము, సుఖే + సఞ్జయతి = సుఖమును గలుగఁజేయుచున్నది, రజః = రాజసగుణము, కర్మణి + (సఞ్జయతి) = కర్మములను గలుగఁజేయుచున్నది, తమః + తు = తమోగుణమన్ననో, జ్ఞానమ్ + ఆవృత్య = తెలివినికప్పి, ప్రమాదే + సఞ్జయతి = పొరపాటును గలుగఁ జేయుచున్నది, ఉత = ఆశ్చర్యము.

కనుక నోయియర్జునా! ఈ మూడు గుణములును కేవలములుగా నుండునపుడు, అనఁగా ఒకొక్కటి తక్కిన రెండుగుణములతోఁ గలియక ప్రత్యేకముగా నుండునపుడు, అందొక్కొక దానివలనఁ గలిగెడు ప్రయోజన మేమనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

సత్త్వగుణము మన శ్శరీరములకు రెంటికిని సౌఖ్యమును గలుగఁజేసి యందువలన జ్ఞానోత్పత్తికిఁ గారణ మగుచున్నది. రజోగుణము రాగద్వేషాదులు గలది గనుక నందు కనుగుణ్యములగు వ్యాపారములయందు, అనఁగా, సుకృత దుష్కృతముల యందు సంబంధపడఁజేసి తత్ఫలములగు బుణ్య పాపములకుఁ బాల్పడఁ జేయును. ఇఁకను తమో గుణమన్ననో, అది కేవల యజ్ఞానమే స్వరూపముగాఁ గలదిగనుక, బుద్ధిమాంద్యమును గలుగఁ జేసి యేపనియును జేయకుండునట్లు సోమరితనమును, ఒక వేళ నేదైనఁ జేసినయెడల దానిం బొరపాటుగాఁ (తప్పుగా) జేయుటయును గలుగఁ జేయును.

శ్లో॥ రజ స్తమ శ్చాభిభూయ స త్త్వం భవతి భారత ।।
రజ స్స త్త్వం తమశ్చైవ తమ స్స త్త్వం రజ స్తథా॥ 10

అర్థము :— హేభారత !, ఓ యర్జునా ! = సత్త్వం = సాత్త్వికగుణము, రజః + తమః + చ = రజస్తమోగుణములను, రజః = రాజసగుణము సత్త్వమ్ + తమః + చ = సత్త్వతమోగుణములను, తథా = అలాగునే, తమః = తామసగుణము, సత్త్వమ్ + రజ + చ + ఏవ = సత్త్వ రజోగుణములను, అభిభూయ = అతిక్రమించి, భవతి = కలుగుచున్నది.

అయితే, ఓయియర్జునా !

“ సీ. వేఱ్వేఱ యుండవు వినుఁడు గుణంబు లన్యోన్యసంకలితంబు లగుచుఁబరఁగు
సంగతత్త్వమునన సంసారయాత్రాప్రవర్తనం బొనరించు వానిలోన ”

(భార. ఆశ్వ. ౨ ఆ.౧౨౫)

అనునట్లు, ఈ ప్రపంచమున నెవనియందైనను సరే యీ మూడు గుణములలో నొకటిమాత్రము ప్రత్యేకముగ నుండుట యరుదు. మఱేమనిన, ఈ మూడు గుణములును మిశ్రమములుగా నుండును. ఇంతియగాక యట్లు మిశ్రమములుగా నుండు నప్పుడైనను సమభాగములుగా నుండుటయు నరుదు. మఱేమనిన, అందే దేని యొక్క గుణము తక్కిన రెండుగుణములకంటె నెక్కుడు బలముగలదిగా నుండును. అదెట్లనఁగా,

“ క. విను సాత్త్వికములం దది నెల
కొని రాజసతామసములకును విగతత్త్వం
బొనరించుఁ బదంపడి స
త్త్వనిరూఢబలబోధసంపదకు హేతువగున్ ”

(భార. శాంతి. ౪.ఆ.౨౯౦).

అనునట్లు, సాత్త్వికగుణము హెచ్చుగా నుండునపుడు రాజసతామసగుణములను అణఁచి పెట్టి తానుమాత్రము ప్రకాశించుచుండును. అనఁగా, ఇట్లు సాత్త్వికగుణ మధికము గాఁ గలవానియం దెప్పుడైన నొకానొకవేళ రాజసగుణ లక్షణములగు రాగద్వేషాదులు గాని, తామసగుణ లక్షణములగు ప్రమాదా లస్యాదులుగాని తోఁచినయెడల నవి వెంటనే సాత్త్వికగుణముచే నణఁచి వేయఁబడును. అదెట్లనఁగా, అట్టివాని మనస్సున నొకానొకప్పు డేదేని యొక కారణమువలన రజోగుణసంబంధమగు కోప ముత్పన్న మైనయెడల వానియందుండు సత్త్వగుణ ప్రాబల్యముచే వెంటనే "తనకోపమె తనశత్రువు" అను నార్యోక్తి బుద్ధికి స్ఫురించినవాఁడై యా కోపమును దీర్ఘకాల ముంచికొనక యణఁచివేసి శాంతమును వహించుచున్నాఁడు. మఱియొకప్పు డేదేని యొకపనిఁ జేయుటయందుఁ దమోగుణ లక్షణమగు సోమరితనము దోఁచినయెడల, వెంటనే వానియందుండు సత్త్వగుణ ప్రాబల్యముచే "ఆలస్య మమృతం విషం" అను నార్యోక్తి బుద్ధికి స్ఫురించినవాఁడై యా సోమరితనమును విడచి యాపనిని నెఱవేర్చుచున్నాఁడు. కనుక నట్టి లక్షణములు గలవాఁడు సత్త్వగుణ ప్రధానుఁడని చెప్పబడును. అట్లే, రాజసగుణ మెవని యందెక్కువగా నుంచున్నదో, అట్టివానియం దెప్పుడైన సాత్త్వికలక్షణములగు హర్షము - ప్రియము - మొదలగునవియు, తామసగుణ లక్షణములగు ప్రమాదా లస్యాదులును దోఁచినయెడల నవి వెంటనే రాజసగుణ ప్రాబల్యముచే నణఁచి వేయబడును. కనుక నట్టివాఁడు రజోగుణ ప్రధానుఁడని చెప్పఁబడును. మఱియు నట్లే తామసగుణ మెవని యందెక్కువగ నుంచున్నదో, అట్టివానియం దెప్పుడైన సాత్త్విక లక్షణములగు హర్షప్రియాదులును, రాజస లక్షణములగు రాగద్వేషాదులును దోఁచినయెడల నవి వెంటనే తామసగుణ ప్రాబల్యముచే నణఁచి వేయఁబడును. కనుక నట్టివాఁడు తమోగుణ ప్రధానుఁడని చెప్పఁబడును.

అర్జు — స్వామీ! "ఉప్పుకప్పురంబు నొక్కపోలిక నుండు" అనునట్లు మనుష్యు లందఱు నొక్కరూపుగనే యున్నారుగదా! అట్లుండ నందెవరెవ రేయే గుణ ప్రధానులైనవారియు నెట్లు తెలిసికొనవచ్చును!

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత॥ 11

అర్థము :— అస్మిన్ + దేహే = ఈ దేహమునందు (ఉండునట్టి), సర్వద్వారేషు = (జ్ఞానేంద్రియములగు) శ్రోత్రాది సమస్తద్వారములయందు, యదా = ఎప్పుడు.

ప్రకాశః=ప్రకాశమును, జ్ఞానమ్=జ్ఞానమును, ఉపజాయతే=పుట్టుచున్నదో, తదా=అప్పుడు, సత్త్వమ్=సాత్త్వికగుణము, వివృద్ధమ్+ఇతి=వృద్ధినొందియున్నదని, విద్యాత్=ఎఱుఁగవలయును.

కృ— ఓయి యర్జునా! ఈసత్త్వరజస్తమోగుణములు మూఁడింటిలో నేయేగుణ మెవనియందుఁ బ్రధానమైయున్నదో దానిం దెలిసికొనఁదగిన యుపాయమును జెప్పుచున్నాను వినుము. అదెట్లనఁగా, ఈ దేహమునందుండు నవద్వారముల యందును జ్ఞాన స్వరూపమగు ప్రకాశమెప్పుడు కలుగుచున్నదో, అనఁగా, నోటితో పరులమనసు నొవ్వకుండునట్లు మృదువైన మాటలాడుటయు, చెవులతో గఠినములగు వాక్యములను – దుర్భాషలను విననొల్లక చల్లని వార్తలను భగవద్విషయమగు వార్తలను వినుటయందాసక్తికలిగియుండుటయును, ముక్కుతో సువాసనల నాఘ్రాణించుచు దుర్వాసనల నాఘ్రాణింప నొల్లకుండుటయు, నేత్రములతోఁ జల్లనిచూపు జూచుచుఁ గ్రూరదృష్టి లేకుండుటయు, గుహ్యద్వారము లితరులకు గోచరింపకుండునట్లతిదూర మును రహస్యమునగు ప్రదేశములయందు మలమూత్రవిసర్జనము గావించుటయు, ఈమొదలగు లక్షణము లెపుడుగలుగుచున్నవో, అపుడాద్వారములు ప్రకాశముగలవి యనుట. ఇట్టి ప్రకాశముగలిగియుండువాని మనసుగూడ నిర్మలమైనదియు, యుక్తా యుక్త పరిజ్ఞానము గలదియునై యే యుండును. కనుక నట్లు సమస్తద్వారముల యందుఁబ్రకాశమును, యుక్తాయుక్త పరిజ్ఞానము నెవనియందుఁ గానఁబడుచుండునో, అట్టివాని లక్షణములు మఱియు నెట్లుండుననఁగా,

"సీ. సంతోషమును బ్రకాశత్వంబుఁ బ్రియమును నానందమును గరుణాభిరతియు
క్షమయును సత్యంబు శౌచంబు ధృతియున కార్పణ్యమును దితిక్షయు నహింస
యును నార్జవంబును ననసూయయును గ్రోధరాహిత్యమును నసంరంభతయును
సమత దాక్షిణ్యంబు శ్రద్ధ ధానతయునక్రూరభావంబు హ్రీ గౌరవంబు

తే. సత్త్వజాతంబు లివి పూర్వజన్మసంక
లితములైనట్టి వారహంకృతి మమత్వ
మర్థతృష్ణగామార్తి లేక తులబోధ
భరితులై యూర్ధ్వలోకవైభవము గంద్రు"

(భార. అశ్వ. ౨, అ. ౧౨౨)

అనునట్లు, సంతోషము – ప్రసన్నత్వము – ప్రియము – ఆనందము – కరుణ— ఓర్పు – సత్యము – శుచిత్వము – ధైర్యము – కార్పణ్యము లేకుండుట – తితిక్ష – అహింస – ఆర్జవము – అనసూయ – క్రోధము లేకుండుట – వేగిరపాటు లేకుండుట –

శత్రుమిత్రాదులగు నందఱియెడల సమభావము గలిగియుండుట, లజ్జ, ఇతరుల యెడల గౌరవము మొదలగు లక్షణములు గలవాఁడైయుండును. కాఁబట్టి, ఇట్టిలక్షణము లెప్పుడెవనియందుఁ గలుగుచున్నవో, అప్పుడు వానియందు సత్త్వగుణ మధికమైయున్నదని, అనఁగా, వాఁడు సత్త్వగుణప్రధానుఁడని యెఱుంగవలయును.

శ్లో॥ లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమ స్పృహా ।
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ! 12

అర్థము :— హేభరతర్షభ !=ఓయియర్జునా !, రజసి=రజోగుణము, వివృద్ధే+(సతి)=వృద్ధిఁ బొందినదగుచుండఁగా, లోభః=లుబ్ధత్వమును, కర్మణామ్=కామ్యకర్మములయొక్క, ఆరమ్భః=ప్రారంభించుటయు, ప్రవృత్తిః=ఆపనులయందుఁ బ్రవర్తించుటయు, అశమః=ఇన్ద్రియనిగ్రహము లేకుండుటయు, స్పృహా=ఆశయు, ఏతాని=ఇవి, జాయన్తే=పుట్టుచున్నవి.

ఇఁకను రజోగుణ ప్రాబల్యము నెట్లెఱుంగవలయుననఁగా, ఈరజోగుణమునకు (లోభము) ప్రధాన లక్షణమైయున్నది. లోభమనఁగా, ద్రవ్యము నార్జించుటయం దిచ్ఛయు, అట్లార్జింపఁబడిన ద్రవ్యమును వ్యయముసేయుటయం దయిచ్ఛయుఁగలిగియుండుట. కనుక నారజోగుణము,

"క. పరితాప మనభితోషము
నరేశ్వరాశోచనము జనవ్యాపారా
దర మక్షమ యనియెడునివి
యరయంగా రాజసంబులగు భావంబుల్ "

(భార. శాంతి. ౪. ఆ. 3౫౧)

అనునట్లు, ద్రవ్యము లభింపకపోయినయెడలఁ బరితాపమును, లభించినపుడు దానితోఁ దృప్తినొందకుండుటవలన సంతోషము లేకుండుటయును, లభించిన ద్రవ్యమును అనివార్యముగ! వెచ్చపెట్టవలసివచ్చినపుడును, చోర్యాద్యుపద్రవములచే నష్టమైనపుడును దుఃఖించుటయును గలుగఁజేయును. మఱియు నట్టి రజోగుణము గలవానికి నింద్రియ నిగ్రహశక్తి లేకపోవుటంజేసి యాయింద్రియముల కింపితములగు నన్నివిషయములయందును నపేక్ష (స్పృహ) గలిగియుండును. కనుక నట్టివాఁ డట్టి ద్రవ్యాకర్షణాది కృత్యంబుల కనుగుణ్యంబులగు వ్యాపారంబులయందు, అనఁగా నింతకుముందు నేఁ జెప్పినప్రకారము, "చ. బలమును శౌర్యమున్ మదమున॥ " (చూ. 14-7 సంభాషణ) బలమును జూపుటమొదలగు వ్యాపారములయందు

ప్రవర్తింపుచుండునుగాన నట్టిలక్షణము లెవనియం దగపడుచుండునో యట్టివాఁడు రజోగుణ ప్రధానుఁడని యెఱుంగవలయును.

శ్లో॥ అప్రకాశోఽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన! ॥ 13

అర్థము :— హేకురునన్దన!=ఓయర్జునా!, తమసి=తమోగుణము, వివృద్ధే+(సతి)=వృద్ధినొందినదగుచుండఁగా, అప్రకాశః=బుద్ధిమాంద్యమును, అప్రవృత్తిః+చ=పనిచేయకుండుటయును, ప్రమాదః=పొరపాటును, మోహః+ఏవ+చ=అజ్ఞానమును, ఏతాని=ఇవి, జాయన్తే=కలుగుచున్నవి.

ఇఁకను, తమోగుణప్రాబల్యము గలవాని లక్షణము లెట్లుండుననఁగా (అప్రకాశము) అనఁగా, ఇదియుక్తము - ఇది అయుక్తము - అని తనకుఁ దోఁచుటగాని, ఇతరులు చెప్పినను గ్రహించుటగాని లేక మందబుద్ధి గలవాఁడై యుండుట; (అప్రవృత్తి) అనఁగా, సోమరితనముచే నేపనియును జేయక వ్యర్థముగఁ గాలమును గడపుట; (ప్రమాదము) అనఁగా, ఎప్పుడైన నేదేని యొకపనిని జేసినయెడల నట్లు చేయుటలోఁ బొరపాటునఁదప్పుగాఁజేయుట; (మోహము) అనఁగా, అజ్ఞానముగలిగియుండుట; ఈ మొదలైనలక్షణములుగల వాఁడైయుండును. ఇట్టిలక్షణము లెప్పుడు గలుగుచున్నవో అప్పుడు,

" తే. సత్త్వమడగినచో దమశ్చరణ యొసఁగు
లోభ శోక సమ్మోహనిద్రాభయములు
వికృతి దుర్మానమాధ్యపాపకృతి కోప
శౌర్య మాత్సర్యములు దమ స్సంభవములు. " (భార. అశ్వ. ౨ అ. ౧౧౨)

అనునట్లు, ఈలాటి దుర్లక్షణములు గలవాఁడై యుండును. కాన నిట్టి లక్షణము లెవనియందుఁ గలుగుచున్నవో, వాఁడు తమోగుణ ప్రధానుఁడని యెఱుంగవలయును.

అర్జు — స్వామీ! ఈ మూఁడుగుణములలోఁ నేయేగుణము ప్రధానముగాఁ గలవాఁ డేయే ఫలమును బొందఁగలఁడు?

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
త దోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే॥ 14

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే ।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే॥ 15

అర్థము :— దేహభృత్=దేహధారియగు జీవుఁడు, యదా=ఎప్పుడు, సత్త్వే+ప్రవృద్ధే+తు=సత్త్వగుణమభివృద్ధిగా నుండఁగా, ప్రళయం+యాతి=మరణమును బొందుచున్నాఁడో, తదా=అప్పుడు, ఉత్తమవిదామ్=ఉత్తమజ్ఞానము గలవారల యొక్క- అనఁగా ఉత్తమజ్ఞానులు పొందెడు, అమలాన్+లోకాన్=నిర్మలములైన స్వర్గాదిలోకములను, ప్రతిపద్యతే=పొందుచున్నాఁడు, రజసి+(ప్రవృద్ధే)=రజోగుణమభివృద్ధిగానుండఁగా, ప్రళయమ్+గత్వా=మరణమునొంది, కర్మసఙ్గిషు=కామ్య కర్మాసక్తులగు మనుష్యులలో, జాయతే=జన్మించుచున్నాఁడు. తథా=ఆలాగుననే, తమసి+(ప్రవృద్ధే)=తమోగుణ మభివృద్ధిగానుండఁగా, ప్రలీనః=మృతి నొందినవాఁడు, మూఢయోనిషు=పశ్వాది మూఢయోనులయందు, జాయతే=జన్మించుచున్నాఁడు.

కృ — ఓయి యర్జునా! నీవడిగిన ప్రశ్నకు సమాధానమును జెప్పుచున్నాను వినుము.

" క. సాత్త్వికులకు దివము రజో
మత్త్వకలితవర్తనులకు మధ్యభువనమా
నత్త్వము దామసులకునీ
చత్వకరాధో జగంబు సంప్రాప్తముగున్ " (భార. అశ్వ. ౨. అ. ౧౨౮)

అనునట్లు, సత్త్వగుణప్రధానుఁడగు జీవుఁడు అనఁగా నేదేహము నందు సత్త్వగుణ ప్రాబల్యము గలిగియుండునో అట్టి దేహము నందుండెడు జీవుఁడా దేహమును విడిచిన పిమ్మట, అనఁగా, మరణమునొందిన పిమ్మట, ఉత్తమజ్ఞానులు పొందఁదగిన స్వర్గాది యూర్ధ్వ లోకములను బొంది యచ్చటఁ గేవల సుఖముల ననుభవించుచుండును. రజోగుణ ప్రాబల్యము గలిగియుండు దేహము నందుండెడు జీవుఁడా దేహమును విడిచినపిమ్మట దుఃఖభాజనమును మధ్యలోకము నగు నీమనుష్యలోకమున జన్మించి యాజీవుఁడు పూర్వ దేహమునందుండి చేసిన సుకృత దుష్కృతముల కనుగుణ్యములగు సుఖ దుఃఖముల మిశ్రమములఁగ ననుభవించును. ఇఁకను, తమోగుణ ప్రాబల్యము గలిగియుండు దేహమునందుండి యాదేహమును జాలించిన జీవుఁడెవ్వనో, అధమములును నీచములునగు పశు పక్ష్యాది మూఢ యోనుల యందు జన్మించును. అదెట్లనఁగా,

"ఉ. పాములుఁదేళ్ళునుం బసులుఁ బందులుఁ గుక్కలు మీలుఁ గోళ్ళులుం
జీమలుఁ గాకులం గ్రిములు జింకలు నక్కలు గొంకనక్కలు
న్దోమలు బ్రమాకులుం బొదలు నోవులఁ బీడలఁబొందు వారుమున్
తామసభాగులట్ల మఱి తద్విధజంతువు లెన్నియన్నియున్."

(భార. అశ్వ. -౨౫. ౧౧౪)

అనునట్లు పాములు - తేళ్ళు - పశువులు - పందులు-కుక్కలు - చేపలు - కోళ్ళు - చీమలు - కాకులు - క్రిములు - జింకలు - నక్కలు - దోమలు-బ్రమాకులు మొదలగు మూఢజన్మలనెత్తి కేవల దుఃఖమునే యనుభవించును.

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్ ।
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥ 16

అర్థము:— సుకృతస్య = సుకృతమైన, కర్మణః=కర్మమునకు, సాత్త్వికమ్= సత్త్వగుణసంబంధమైన, నిర్మలమ్ = మలినరహితమైనసుఖము, ఫలము=ఫలమనియు, రజసః+తు = రజోగుణమునకన్ననో, దుఃఖమ్ = దుఃఖము, ఫలమ్= ఫలమనియు, తమసః = తమోగుణమునకు, అజ్ఞానమ్ = అజ్ఞానము, ఫలమ్ = ఫలమనియు, ఆహుః = చెప్పుదురు.

కాబట్టి, ఓయియర్జునా!

"చ. జనవర సౌఖ్యముం బొరసి సాత్త్వికభావసముద్గమంబుసు
మ్మనియును దుఃఖముల్ గదిరినప్పుడు రాజసభావభంగి సు
మ్మనియు జడత్వసంగసమయంబున దామసభావవృత్తిసు
మ్మనియును ద్రోచి వానఁబడ కాత్మరతిన్ నిలుపిచ్చుమోక్షమున్."

(భార. శాంతి. ౪అ. ౩౫౫)

అనునట్లు, సాత్త్విక గుణమువలనఁ గలిగెడు ఫలము సుఖకరమనియు, రాజసగుణమువలన గలిగెడు ఫలము దుఃఖకరమనియు, తామసగుణమువలనఁ గలిగెడుఫలము అజ్ఞానమనియు నార్యులు చెప్పుదురు.

శ్లో॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ॥ 17

అర్థము:-సత్త్వాత్ = సాత్త్వికగుణమువలన, జ్ఞానమ్=జ్ఞానము, సఞ్జాయతే= పుట్టుచున్నది, రజసః=రాజసగుణమువలన, లోభః+ఏవ+చ = లోభమే, (సఞ్జా

యతే) = పుట్టుచున్నది. తమసః = తామసగుణమువలన, ప్రమాదమోహౌ + చ = ప్రమాదమోహములును, భవతః = కలుగుచున్నవి. (తత్) + ఏవ = అదియే (అట్లగుటయే), అజ్ఞానమ్ = అజ్ఞానము (అనఁబడుచున్నది).

అట్లు చెప్పుటకుఁ గారణ మేమనఁగా,

"క. సత్త్వము ప్రదీప మాపర
తత్త్వముఁగాంచుటకు" (భార. ఆశ్వ. ౨౫. ౧౫౯)

అనునట్లు, సత్త్వగుణ మాపరమాత్మ స్వరూపమును దెలిసికొనుటకు దీపము వంటిదై యున్నది. అనఁగా సత్త్వగుణమువలన సదసద్వివేకము, అనఁగా నాపరమాత్మస్వరూపమును దెలిసికొనఁదగిన జ్ఞానముత్పన్నమగుచున్నది. ఇఁకను రజోగుణమువలన నేమి కలుగుచున్నదనఁగా, లోభము మాత్రమే కలుగుచున్నది. లోభమనఁగా ద్రవ్యాదులను విశేషముగ నార్జింపవలయునని యొడు పేరాసయు, అట్లార్జించిన ద్రవ్యమును వెచ్చపెట్టుటయం దిచ్ఛలేకపోవుటయు, మఱియు నప్పటికే యార్జించినను దృప్తినొందక యింకను నార్జింపవలయునని యొడు కోరికయునై యున్నది. ఇట్టి లోభమే రజోగుణమువలనఁ గలిగెడు ఫలములలో ముఖ్యమైనదిగా నున్నది. ఇఁకను, తమోగుణమువలన నేమి గలుగుచున్నదనఁగా, మోహప్రమాదములు గలుగుచున్నవి. మోహమనఁగా విపరీతజ్ఞానము. అనఁగా, ఉన్నదానిని లేనిదానిఁగను, లేనిదానినున్నదానిఁగను గ్రహించుట. ఇట్టి విపరీతజ్ఞానముగలవాఁడేపనిఁ జేసినను పొరపాటు పడక మానఁడుగదా ? కనుక నట్టిమోహమును, అందుల పర్యవసానమగు ప్రమాదమును గలుగుచున్నవి. ఇట్టిమోహప్రమాదములు గలవాఁడు సత్తును అసత్తుగను, అసత్తునుసత్తుగను గ్రహించుచుండును గనుక నట్లు గ్రహించుటయే యజ్ఞానమనఁబడుచున్నది. అనఁగా తమోగుణమువలనఁ గలుగునది కేవలయజ్ఞానమే యని భావము.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః॥ 18

అర్థము :— సత్త్వస్థాః = సత్త్వగుణమునందున్నవారు; ఊర్ధ్వమ్ = స్వర్గాదియూర్ధ్వలోకమును, గచ్ఛన్తి = పొందుచున్నారు. రాజసాః = రజోగుణముగలవారు, మధ్యే = మధ్యమమగు మనుష్యలోకమునందు, తిష్ఠన్తి = ఉంచున్నారు. జఘన్యగుణవృత్తిస్థాః = నికృష్ట గుణవృత్తులుగల, తామసాః = తమోగుణులు, అధః = అధోగతిని లేక అధమజన్మమును, గచ్ఛన్తి = పొందుచున్నారు.

కనుక నోయియర్జునా!

"గలుగుసుపమంబు పేర్కొనియధికంబైన,
స్రోతస్సఫోముఖ స్రుతిరజస్సు
నెంగినప్రముమధ్య – సరణిసత్త్వమువృద్ధిఁ
బొందిన నూర్ధ్వవృత్తిఁ బొందు నవని" (భార.అశ్వ.-౨.౮)

అనునట్లు, జ్ఞానజనకంబైన సత్త్వగుణం బెవరియం దధికముగ నుంచున్నదో వారు ఆనఁగా, సత్త్వగుణ ప్రధాను లెప్పుడును సత్కర్మలనే చేయుచుందురు గనుక నట్టి పుణ్యాత్ములు స్వర్గాదియూర్ధ్వ లోకములను బొందుదురు. అట్లా యూర్ధ్వ లోకములను బొందినవారు, వారివారి సుకృతములకుఁ దగినట్లా యూర్ధ్వలోక సుఖముల ననుభవించి పిమ్మట "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" అనునట్లు మరల నీలోకమున జన్మింతురు. అయితే, అట్లు మరల నీలోకమున జన్మించవలసి వచ్చినను వారల కుత్కృష్ట జన్మమే కలుగునుగాని నీచజన్మ కలుగనేరదు. అదెట్లనఁగా, పుణ్యాత్ములగువార లూర్ధ్వలోక సుఖములను జాలకాల మనుభవించి పిమ్మట శుచిర్భుతులగు శ్రీమంతుల వంశములయందు గాని, లేక యోగుల వంశములయందు గాని జన్మింతురని యింతకుముందు నీకుఁజెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ-5. 41-42).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక నట్లే యీ సత్త్వగుణ ప్రధానులకు మరల నీలోకమున జన్మించవలసి వచ్చినపుడు వారల కుత్కృష్టజన్మమే కలుగును. కనుకనే సత్త్వగుణమువలన గలిగెడు ఫలము సుఖకరమైనదని యింతకు ముందు చెప్పుటకుఁ గారణమైనది. (చూ-14-16).

ఇంకను రజోగుణ ప్రధాను లేమనుచున్నారనఁగా, మధ్యమమగు మనుష్య లోకమున జన్మించి దుఃఖస్వరూపమగు సంసార సాగరంబునందు మునుఁగుచుఁ దేలుచుందురు. కనుకనే రజోగుణమువలనఁ గలిగెడు ఫలము దుఃఖకరమైనదని చెప్పుటకుఁ గారణమైనది. (చూ-14-16).

ఇంకను, తమోగుణప్రధాను లేమగుచున్నారనఁగా, వారివారి దుష్కృతములకుఁ దగినట్లు అధమంబులును, జ్ఞానహీనంబులునగు పశు, మృగ, పక్షి, క్రిమి, కీటకాది హీనజంతువుల యోనులయందు జన్మించి కేవల యజ్ఞానాంధకారంబున నుందురు. కనుకనే తమోగుణమువలనఁ గలిగెడుఫలము కేవల యజ్ఞానమే యని చెప్పుటకుఁ గారణమైనది. (చూ.14-16).

అర్జు — స్వామీ! దీనింబట్టి చూడఁగా, సత్త్వగుణ ప్రధానుఁడుగూడ రజస్తమోగుణ ప్రధానులతో పాటు మరల జన్మించవలసిన వాఁడైయే యున్నట్లగపడు చున్నదిగదా? ఇఁకను బునర్జన్మ రాహిత్యమగు మోక్షమును బొందువాఁ డెవఁడు?

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ 19

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే ॥ 20

అర్థము :—(యః) ఎవఁడు, యదా=ఎప్పుడు, ద్రష్టా=వివేకి (యై) గుణేభ్యః= త్రిగుణములకంటె, అన్యమ్ + కర్తారమ్ = వేఱైనకర్తను, న + అనుపశ్యతి,= చూడఁడో, (ఆత్మానమ్) తన్ను, గుణేభ్యః=త్రిగుణములకంటె.; పరమ్=అన్యునిఁగా, వేత్తి + చ=ఎఱుఁగుచున్నాఁడో, సః + దేహీ=అట్టిజీవుఁడు, (తదా) = అప్పుడు, దేహసముద్భవాన్ =దేహజన్యములగు, ఏతాన్ + త్రీన్ + గుణాన్ = ఈ మూడు గుణములను, అతీత్య = అతిక్రమించినవాఁడై, మద్భావమ్ = నాస్వరూపమును, అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు. (తస్మాత్)=ఆ కారణమువలన, జన్మమృత్యుజరాదుః ఖైః=జననమరణాదులనుండివిముక్తః + (సన్) = విడువఁబడినవాఁడై, అమృతమ్= మోక్షమును, అశ్నుతే=పొందుచున్నాడు.

కృ — ఓయి యర్జునా!

“క. ధర్మార్థ కామగోచర
కర్మములకు సాత్త్వికాదికప్రకర వికా
రోర్ములు హేతువులగు ని
ష్కర్మత కేతదవధూతి గారణము సుఁడీ.” (భార.అశ్వ.-౨ ఆ.౧-౨౯)

అనునట్లు, ఎవనియందైననుసరే సత్త్వరజస్తమోగుణములు మూఁడింటిలో నేదియైన నుండునంతవఱకును వాఁడాయాగుణముల కనుగుణ్యములగు ధర్మార్థ కామ కర్మములను జేయుచునే యుండునుగాన వానిసుకృత దుష్కృతముల కనుగుణ్యము లగు జన్మములు వానికిఁ గలుగుచునే యుండును. కనుక నట్టి మూఁడుగుణములను బొత్తిగ విడిచిన వానికేగాని నైష్కర్మ్యసిద్ధి గలుగనేరదు. అట్టినైష్కర్మ్యసిద్ధిని బొందినవానికేగాని పునర్జన్మ రాహిత్యమగు మోక్షమబ్బనేరదు. కాఁబట్టి, ఎవఁడైనను సరే ఎప్పుడు వివేకము గలవాఁడై తాను జేయుచుండెడు పనులన్నియుఁ దనయం

అనునట్లు, సత్త్వగుణ సంబంధంబులగు సుఖాదుల ననుభవించుచున్నపు డవి సాత్త్వికభావము చేత గలిగినవనియును, రజోగుణసంబంధంబులగు దుఃఖాదుల ననుభవించునపు డవి రాజసభావము చేఁ గలిగినవనియును, తమోగుణసంబంధంబులగు శోకమోహాదుల ననుభవించునపు డవి తామసభావము చేఁ గలిగినవనియును, తనకువానితో నెలాటి సంబంధమును లేదనియు నెంచికొనుచుఁ దనమనస్సును వానియందుఁ దగులము నొందనీక. అనఁగా, ఆసుఖదుఃఖాదులచే నేలాటి వికారము నొందనీక యాత్మానుభవమునందే నిలిపియుంచినయెడల,

"తే. నరుఁడు సుఖదుఃఖముల వెంటఁ బోవనీక
మరలఁచి యాత్మను జేర్చిన మానసంబు
లీనమగు నంద జలములలోన నిడిన
లవణకణము చందమ్మున నవని నాథ!" (భార. శాంతి. ౪ ఆ. ౩౫౭)

అనునట్లు, వానిమనసు నీటిలో నుంచఁబడిన యుప్పుగల్లు కరఁగి యానీటిలో నెట్లు కలిసిపోవునో, అట్లే, ఆపరమాత్మ స్వరూపమునందు లయించిపోవును గాన నట్టివాఁడు మోక్షార్హుఁడగును. కనుకనే "నిస్త్రైగుణ్యోభవార్జున" అని యింతకు ముందు నీకుఁ జెప్పుటకుఁ గారణమైనది. (చూ. 2-45)

అర్జు— అయ్యా! మంచిది. "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్" సత్త్వగుణమువలన జ్ఞానముత్పన్నమగుచున్నదని యింతకుముందు చెప్పియుంటివిగదా! (చూ. 14-17) జ్ఞానము గలిగిననేగాని మోక్షము గలుగనేరదుగదా! అట్టి మోక్షప్రదమగు జ్ఞానమునకు ముఖ్యకారణమగు సాత్త్వికగుణమును గూడఁ దక్కిన రజస్తమోగుణములతో పాటు విడిచిపెట్టినయెడల నట్టివానికి జ్ఞానోత్పత్తియు, తన్మూలకముగ మోక్షమును నెట్లుగలుగును?

కృ— అవును. సత్త్వగుణమువలన జ్ఞానము గలుగుటయు నిజమే, ఆసత్త్వగుణమునుగూడ విడిచిననేగాని మోక్షముగలుగనేరదనుటయు నిజమే, కనుక నేమిచేయవలయుననఁగా.

"తే॥ తటినిఁ దగనుత్తరించునంతకును బోత
మాశ్రయించి తక్కొల్లన యట్లు పురుష
దర్శనము సంభవించునంతకును సత్త్వ
మాదిపిదప దత్సంబంధ ముడుగవలయు." (భార. అశ్వ. ౨. ఆ. ౧౬౪)

అనునట్లు, ముందుగా రజస్తమోగుణములను విడిచిపెట్టి సత్త్వగుణమును మాత్ర మవలంబించవలయును. ఒకఁడొకనదిని దాటునంతవఱకు నొకపడవ నాశ్రయించి

పిమ్మట నాపదవ నెట్లువిడుచుచున్నాఁడో, అట్లే, జ్ఞానోదయమగు నంతవఱకు నా సత్త్వగుణమును మాత్రమాశ్రయించి పిమ్మట దానింగూడవిడిచిపెట్టి త్రిగుణాతీతుఁడు గావలయును. కనుక,

" క. సదసత్ప్రకారనిత్యం
బది దానితెఱం గెఱుంగునాతఁడు విజ్ఞా
నదశావధూతగుణుఁడై
యదీనగతిఁ బొందఁగను నిరామయపదమున్." (భార.అశ్వ. ౨. ఆ. ౧౩౩)

అనునట్లు, సదసద్వివేకియగు వాఁడిట్టి పద్ధతి నవలంబించి త్రిగుణాతీతుఁడై మోక్షమునొందును.

అర్జున ఉవాచ :

శ్లో॥ కైర్లిఙ్గై స్త్రీ న్గుణా నేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథం చైతాం స్త్రీ న్గుణా నతివర్తతే ॥ 21

అర్థము :— హేప్రభో! = ఓప్రభువా!. కైః + లిఙ్గైః = ఏలక్షణములచేత, ఏతాన్ + త్రీన్ + గుణాన్ = ఈమూడుగుణములను, అతీతః + భవతి = అతిక్రమించినవాఁడగుచున్నాఁడు!, ఆచారః + కిమ్ = (అట్టివాని) ఆచారమేమి? ఏతాన్ + త్రీన్ + గుణాన్ = ఈమూడు గుణములను, కథమ్ + అతివర్తతే + చ = ఎట్లుఅతిక్రమించుచున్నాఁడు?

అర్జు — ఓమహాప్రభో! ఇట్టి మూఁడుగుణముల నతిక్రమించిన వాఁడెట్టి లక్షణములు గలవాఁడుగా నుండును? అనఁగా నెట్టిలక్షణములచే నీ మూఁడుగుణముల నతిక్రమించినవాఁడగుచున్నాఁడు? ఈగుణముల నెట్లతిక్రమించుచున్నాఁడు? అట్లతిక్రమించిన వాని నడవడి యెట్లుండును? ఈ విషయముల నన్నిటిని దయచేసి వివరించి చెప్పుము.

శ్రీభగవా నువాచ :

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాణ్డవ!
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22

అర్థము :— హేపాణ్డవ! = ఓయి యర్జున!, (యః) = ఎవఁడు, సంప్రవృత్తాని = సంప్రాప్తములైన, ప్రకాశమ్ + చ = (సత్త్వగుణ సంబంధమగు) ప్రకాశమును, ప్రవృత్తిమ్ + చ = (రజోగుణసంబంధమగు) ప్రవృత్తిని, మోహమ్ + ఏవ + చ = మోహ

ముసైనను, న + ద్వేష్టి=ద్వేషింపఁడో, నివృత్తాని = విడిచిపోయిన యాగుణములను గాని వాని కార్యములను గాని, న + కాంక్షతి=కోరఁడో.

కృ — ఓయి యర్జునా! అట్టి త్రిగుణాతీతుని లక్షణము లెట్లుండుననఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఏపురుషుని యందైనను సరే సత్త్వగుణము ప్రవృద్ధియైనపుడు, ప్రకాశము-జ్ఞానము - మొదలగునవియును, రజోగుణము ప్రవృద్ధియైనపుడు ప్రవృత్తి-లోభము- మొదలగు నవియును, తమోగుణము ప్రవృద్ధియైనపుడు మోహము - ప్రమాదము - మొదలగునవియును గలుగుచుండునని యింతకుముందు చెప్పియుంటినిగదా (చూ. 14-11,12,13). అట్లెప్పుడెప్పు డేయేగుణప్రాబల్యము చేత నేలాటి కార్యములు సంప్రాప్తము లైనను. అప్పుడప్పు డాయాగుణముచే నాయా కార్యములు సంప్రాప్తము లైనవియే గాని తనకేమియు వానితో సంబంధము లేదని యెంచినవాఁడై వానియందు ద్వేషమున్నుంచఁడు. లేక, వానిలో నేవియైన నదివఱకుఁ దనయందుండి నివర్తియైనయెడల వానిని మరలఁ గావలయునని కోరఁడు.

శ్లో॥ ఉదాసీనవ దాసీనో గుణైర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥ 23

అర్థము :— యః=ఎవఁడు, గుణాః + ఏవ=గుణములే, వర్తన్తే + ఇతి=ప్రవర్తింపుచున్నవి యని, ఉదాసీనవత్=సాక్షిభూతునివలె, ఆసీనః + (సన్)=ఉన్నవాఁడగుచు. గుణైః=గుణములచేత న + విచాల్యతే=చలింపఁబడఁడో. యః=ఎవఁడు. నేఙ్గతే=కదలనివాఁడు (అయి), అవతిష్ఠతి=ఉంచున్నాఁడో.

మఱియు నట్టివాఁ డెట్లుండు ననఁగా, అట్లెప్పుడెప్పు డేయేగుణముల ప్రేరకత్వముచేఁ దానేమి చేయుచుండినను. అప్పుడప్పు డాయాపనుల నాయాగుణములే చేయుచున్నవి గాని తానేమియుఁ జేయుట లేదనియు, తాను కేవలసాక్షీభూతుఁడనియునెంచి యాగుణములచే నేమాత్రమును జలింపఁబడక యుండును. అనగా. ఆపనుల వలనఁ గలిగెడు ఫలములు సుఖకరములైనపుడు సంతోషించుటయు, దుఃఖకరములైనపుడు దుఃఖించుటయు, లేక నిర్మలమును నిశ్చలమును నైన మనస్సు గలవాఁడై యుండును.

శ్లో॥ సమదుఃఖ సుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః!
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥ 24

అర్థము:— యః = ఎవఁడు, స్వస్థః + (సన్) = స్వస్థచిత్తముగలవాఁడై, సమదుఃఖసుఖః = సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాఁడును, సమలోష్టాశ్మకాఞ్చనః=

మట్టిగడ్డ—ఱాయి—బంగారు—వీనిని సమముగాఁ జూచువాఁడును, ధీరః+(సన్) = ధీరుఁడై, తుల్యప్రియాప్రియః = ఇష్టానిష్టములయందు సమబుద్ధిగలవాఁడును, తుల్య నిందాత్మసంస్తుతిః = దూషణభూషణలయందు సమభావముగలవాఁడును (అగుచున్నాఁడో).

మఱియు నట్టివాఁ డెట్లుండుననఁగా, స్వస్థచిత్తుఁడై, అనఁగా, శాంతినొందిన చిత్తముగలవాఁడై సుఖము గలిగినపుడు సంతోషించుటయును, కష్టముగలిగినపుడు వ్యసనపడుటయును లేకయుండును. మఱియు నట్టివాఁడు మట్టిపెళ్ల—ఱాయి—మొదలగువానింజూచినపుడు వాని వలనఁ దనకేమియుఁ బ్రయోజనములేదని యెట్లుపేక్షింపఁడో, అట్లే, బంగారు మొదలగు విలవగలవస్తువులను జూచినపుడును వానివలనఁ దనకేమియుఁ బ్రయోజనములేదనియెంచి వానినపేక్షింపఁడు. మఱియు నట్టివాఁడు ధైర్యము నవలంబించినవాఁడై ప్రియాప్రియములయందును, నిందాస్తుతులయందును సమబుద్ధిగలవాఁడైయుండును. అనఁగా, తనకుఁ బ్రియము చేకూరినపుడు సంతసించుటయు, అప్రియము చేకూరినపుడు దుఃఖించుటయు లేకయుండుటయేగాక తన్నొరులు దూషించినను, భూషించినను అట్లు దూషించెడు వారియెడలఁ గోపముగాని, భూషించెడు వారియెడల ననురాగముగాని లేక యాయుభయుల యెడలను సమభావముగలవాఁడై యుండును.

శ్లో॥ మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥ 25

అర్థము:— మానావమానయోః+తుల్యః = మానావమానములయందు సముఁడును, మిత్రారిపక్షయోః+తుల్యః = శత్రుమిత్రులయందు సముఁడును, సర్వారమ్భపరిత్యాగీ = సకలోద్యోగములను విడిచినవాఁడును, (యః) = ఎవఁడో, సః = వాఁడు, గుణాతీతః+ఇతి = గుణాతీతుఁడని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

మఱియు నట్టి వాఁడెట్లుండు ననఁగా. తన్నొరులుమర్యాద చేసినను అమర్యాద చేసినను అట్లు మర్యాదా మర్యాదలఁ జేయు నుభయులయెడలను సమభావముగల వాఁడై యుండును. అనఁగా, మర్యాద సేయువారి యెడలఁ బ్రీతియు, అమర్యాద సేయువారియెడల ద్వేషమును లేకయుండును. మఱియును శత్రుమిత్రులయెడల అనఁగా, తనయందు ద్వేషబుద్ధిగలవారియెడలను స్నేహబుద్ధిగలవారియెడలనుగూడ నట్లే భేదబుద్ధినుంచక సమభావము గలవాఁడై యుండును. కనుక నోయి యర్జునా! ఇట్టి యన్నిలక్షణము లెవనియందుఁ గానఁబడుచున్నవో, అట్టివాఁడే గుణాతీతుఁడని చెప్పఁబడును.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ 26

అర్థము:— యః = ఎవఁడు, అవ్యభిచారేణ = వ్యభిచరించని, భక్తియోగేన = భక్తియోగముచేత, మామ్ + చ = నన్నే, సేవతే = సేవించుచున్నాఁడో, సః = వాఁడు, ఏతాన్ + గుణాన్ = ఈత్రిగుణములను, సమతీత్య = అతిక్రమించి, బ్రహ్మభూయాయ = బ్రహ్మస్వరూపమును బొందుటకొఱకు, కల్పతే = సమర్థుఁడగుచున్నాఁడు.

అట్లు గుణాతీతుఁడైనవాఁడే గాని తదితరుఁడు బ్రహ్మస్వరూపమును బొందుటకు అనఁగా, జననమరణ రాహిత్యమగు మోక్షమును బొందుటకు సమర్థుఁడు గానేరఁడు. అయితే, అట్టి గుణాతీతుఁడెట్టివాడు గాఁగలఁడనఁగా, నన్నెవఁడైతే వ్యభిచరించని భక్తితో సేవించుచున్నాఁడో అట్టివాఁడు మాత్రమే కాఁగలడు గాని తదితరుఁడు కాఁజాలఁడు.

ఓయి యర్జునా! ఈలోకమునఁ గొందఱు స్త్రీలు పరపురుష సాంగత్యము సేయుటచే వ్యభిచారిణులనియు, మఱికొందఱట్టి పరపురుషసాంగత్యము సేయకుండుటచేఁ బతివ్రతలనియుఁ జెప్పఁబడుచున్నారుగదా? అట్లుపరపురుషసాంగత్యము సేయని స్త్రీలలోఁగూడ నొకానొకతె మాత్రమే నిజమైన పతివ్రతె యగును గాని యందఱును గాఁజాలరు. అదెట్లనఁగా,

" క. గడనగల మగనిఁ జూచిన
నడుగులకును మడుగు లిడుదు రతివలు దమలో
గడనుడుగు మగనిఁజూచిన
నడపీనుగు వచ్చెనంచు నగుదురు సుమతీ! " (సు. శ.)

అనునట్లు, ఈలోకమున స్త్రీలలో ననేకులు పరపురుష సాంగత్యము సేయని వారైనను, తమపురుషులు సంపాద్యపరులుగా నుండి తాము కోరినట్లెల్ల నన్నపాన వస్త్రాభరణాదుల నిచ్చుచు సమస్తవిధములగు సుఖములఁ గలుగఁజేయుచుండు నంతవఱకును వారలయెడల నత్యనురాగము గలవారివలె నటించుచు నట్టి సంపాద్యముడిగి తమ యీప్సితముల నెరవేర్పఁజాలనివారైనపుడు వారలఁ దృణీకరింతురు. కాన నట్టివారలు నిజమైన పతివ్రతలని చెప్పుటకు వీలుపడదుగదా? ఇఁకను నిజమైనపతివ్రతలెట్టివారనగా, హరిశ్చంద్రుని భార్యయగు చంద్రమతి – నలుని భార్యయగు దమయంతి మొదలగు వారివలెఁ దమభర్త లెట్టిదశయందుండినను వారలను దైవస్వరూపు

లనుగ భావించి వారితోపాటు తాము ను గష్టసుఖముల ననుభవించుచు వారియెడల నెప్పుడు నెడతెగని భక్త్యనురాగములు గలవారై యుందురు.

కాన నోయియర్జునా! అట్లే నాభక్తులలోఁ గూడఁ గొంద అన్యదేవతల నారాధించుటచే వ్యభిచరించిన భక్తిగలవారగుటసహజమేకదా, అట్లుగాక నన్నుమాత్రమే భజించెడు వారిలో సైతము ఆర్తులు, జిజ్ఞాసులు. అర్థార్థులు, జ్ఞానులు అని నాలుగు తరగతులవారు గలరనియు, వారిలో మొదటి మూడు తరగతులవారు నేదేని యొక కారణమునుబట్టి, అనఁగా, ఈప్సితార్థముకొఱకు నన్ను భజించెడువారును, నాలుగవ తరగతివారు నిష్కారణముగను, అనఁగా నట్టి యీప్సితములేవియు లేనివారై నన్నే పరమప్రాప్యముగనెంచి భజించెడువారును గనుక నా నాల్గవతెగవారు, అనఁగా జ్ఞానులు, తక్కినవారికంటె శ్రేష్ఠులును నాకత్యంత ప్రియులునునై యుండు టయెగాక నాస్వరూపులే యగుచున్నారనియు నింతకుముందు నీకుఁ జెప్పియుంటిని గదా, జ్ఞాపకమున్నదా? (5-16, 17, 18).

అర్జు— అవును, జ్ఞాపకమున్నది.

కృ— కనుక నట్టిజ్ఞానులు చేసెడు భక్తియే వ్యభిచరించని భక్తియని చెప్పఁదగియున్నది. కాన నట్టివారలు మాత్రమే త్రిగుణాతీతులు కాఁగలరుగాని తదన్యులు కాఁజాలరు.

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యాఽవ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥ 27

అర్థము :— అహమ్=నేను, అవ్యయస్య+అమృతస్య+చ=అవ్యయమైన మోక్షస్థానమును, శాశ్వతస్య+ధర్మస్య+చ=శాశ్వత ధర్మస్వరూపమును, ఏకాన్తికస్య+సుఖస్య+చ=నిత్యానందస్వరూపమును (అగు), బ్రహ్మణః=పరబ్రహ్మమునకు, ప్రతిష్ఠా+హి=ఉనికిపట్టుగదా?

అందుకుఁ గారణమేమనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఓయియర్జునా! నాశరహితమైన మోక్షస్థానమును, శాశ్వత ధర్మస్వరూపమును, నిత్యానంద స్వరూపమును నగు పరబ్రహ్మము నేనేగదా? ఇట్టి నా నిజస్వరూపమును జ్ఞానులుమాత్రమే యెఱుఁగుదురుగాన నట్టివారలట్టి నన్నాశ్రయించుటలో నట్టి నిత్యానందపదవియగు మోక్షమునందే లక్ష్యముంచినవారై తదన్యములగు నైహికాముష్మిక సుఖంబులన్నియుఁదుచ్ఛములనియెంచి వానిలో దేని నపేక్షింపక వైరాగ్యశీలురై యుందురు కనుక.

"క. వైరాగ్యం బింతటికిని
గారణ మానందకరము గావున నది చే
కూఱిన సమస్తమును సమ
కూఱంబను దాన పరమగుహ్య మిది సుతా!" (సీ. రా. 3. ఆ. ౧౨౫)

అనునట్లు, అట్టివైరాగ్యము నెప్పుడవలంబించుచున్నారో, అప్పుడావైరాగ్యమనెడు గొడ్డలితో ననాదిగా నుండునట్టిదియుఁ బ్రకృతిజంబునునగు సంసారవృక్షమును సమూలంబుగఁ దెగఁగొట్టఁగలరు. అట్లెప్పుడు చేయుచున్నారో అప్పుడా ప్రకృతిగుణముల నతిక్రమించినవారగుదురు. అనఁగా నిర్గుణ పరబ్రహ్మముతో సమానులగుదురు. కాన నప్పుడా పరబ్రహ్మములో నైక్యమగుటను, అనఁగా, మోక్షమును బొందుట కర్హులగుదురనుట.

అర్జు— అయ్యా! వైరాగ్యమనెడు గొడ్డలితో సంసారవృక్షమును దెగఁగొట్టఁగలరని చెప్పితివిగదా! ఆసంసారవృక్ష మెట్టిదియో వివరింపఁ బ్రార్థింపుచున్నాఁడను.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయ విభాగ యోగో నామ చతుర్దశోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి గుణత్రయ విభాగ యోగంబను
చతుర్దశాధ్యాయము.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భితభావబోధిని

## పంచదశాధ్యాయము

### పురుషోత్తమప్రాప్తియోగము

**శ్రీభగవానువాచ:**

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్ ॥ 1

అర్థము :— యస్య=దేనికి, ఛన్దాంసి=వేదములు, పర్ణాని=ఆకులు గానున్నవో (అట్టి), అశ్వత్థమ్=అశ్వత్థ మనెడు సంసార వృక్షమును, ఊర్ధ్వమూలమ్=పైభాగమునందు వేరుగలదిగను, అధశ్శాఖమ్=క్రిందిభాగమునఁ గొమ్మలు గలదిగను, అవ్యయమ్=నాశరహితమైనదిగను, అనఁగా, ప్రవాహరూపముగ నెప్పటికి నుండునదిగను, ప్రాహుః=చెప్పుదురు. తమ్=ఆయశ్వత్థవృక్షమును, యః=ఎవఁడు, వేద=ఎఱుఁగుచున్నాఁడో, సః+(ఏవ)=వాఁడే, వేదవిత్=వేదము నెఱిఁగినవాఁడు (భవతి)=అగుచున్నఁడు.

కృ — ఓయి యర్జునా! సంసారవృక్షమనఁగా నెట్టిదియో వివరించి చెప్పుమని యడిగితివిగదా, చెప్పుచున్నాను వినుము ఇది యతివింతైన వృక్షము. అదెట్లనఁగా. ఈ లోకమున సర్వసాధారణముగ నన్ని వృక్షములకును మూలము (వేరు) క్రిందిభాగముననను, శాఖలు (కొమ్మలు) పైభాగముననుగదా యుంచున్నవి? ఈ సంసార వృక్షమున కన్నో అట్లు కాదు. మహేమునిన. దీనికి మూలము (వేరు) పైభాగమున నుండుననియు, శాఖలు క్రిందిభాగమున నుండుననియు, వేదములే దీని యాకులనియు, అన్నివృక్షములవలె నిది కొంతకాలమునకు నశింపక ప్రవాహరూపముగ నెప్పటికి నెడఁదెగక యుండుననియు పెద్దలు చెప్పుదురు. దీనికి "అశ్వత్థము" అని పేరు. ఓయి యర్జునా! ఈ సంసార వృక్షము యొక్క మర్మ మిట్టిదని చక్కఁగా నెవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే సకల వేదార్థముల నెఱిఁగిన వాఁడగును గాని తదితరులు కాఁజాలరు.

అర్జు — స్వామీ! ఇది మిగుల విచిత్రముగ నున్నది. ఈ సంసార వృక్షము యొక్క మూలమనఁగా నెద్ది? అది పైభాగమున నెట్లున్నది? దీని శాఖలెవ్వి? అవి క్రిందిభాగమున నెట్లున్నవి? వేదములే దీని యాకులని చెప్పుటకుఁ గారణమేమి? ఇది యెప్పటికిని నశింపక యెట్లుండును? దీనికి "అశ్వత్థము" అనియెడు నామ మెట్లు గలిగెను? ఈవిషయము లన్నియుఁ జక్కఁగ వివరించి చెప్పఁ బ్రార్థింపు చున్నాఁడను.

కృ — ఓయి యర్జునా! సంసారమనఁగా అనుదినము ప్రవాహరూపముగ జరుగుచుండెడు జనన మరణాది ప్రపంచ నటనమునకుఁ బేరు. ఈసంసార మొక వృక్షమునకుఁ బోల్చబడి యున్నది. దీనికిమూలము (వేరు) ఎద్దియనఁగాఁ జెప్పుచున్నాను వినుము. నా సాక్షి భూతత్వముచేత, అనగా, నేను సాక్షిభూతుఁడనై యుండఁగాఁ బ్రకృతివలన నీ ప్రపంచోత్పత్తియు – నటనమును – గలుగుచున్నదని యింతకుముందు చెప్పియుంటినిగదా, (చూ. 9. 10).

కనుక నట్టి ప్రపంచ నటనమనెడు సంసార వృక్షమునకుఁ బ్రకృతియే మూలము (వేరు) అని చెప్పఁబడుచున్నది. కనుకనే దీనికి మూలప్రకృతి యనియును బేరు. అయితే, ఈ ప్రకృతియనెడు యోనియందు పరమాత్ముఁడనగు నాయొక్క యంశమనెడు బీజము నుంచుటవలన దానికీ ప్రపంచోత్పత్తి నటనలఁ జేయు శక్తి గలుగు చున్నదనియును జెప్పియుంటినిగదా, (చూ. 14. 3). కనుకనే

" క. తెఱగొప్ప నఖిలవిశ్వము
పురుషోత్తము దేహమందుఁ బుట్టుం బెరుగున్
విరతిం బొందుచునుండును
గరమర్థిన్ భూతభావి కాలములందున్ ". (భాగ. ౩.స్కం ౩౮౩).

అనునట్లు, ఈ ప్రపంచనటనము పురుషోత్తముఁడనగు నావలననేగలుగుచున్న దనియును బెద్దలు సెప్పుదురు. ఇఁకను నేనెట్టివాఁడననఁగా స్వర్గాది సత్యలోకము వఱకుఁగల యూర్ధ్వలోకము లన్నిటికిఁ బైనుండు పరమాత్ముఁడనుగదా, (చూ. 8.16). కనుక నీసంసారవృక్షమునకు మూలంబగు నీప్రకృతి సమస్త యూర్ధ్వ లోకంబులకుఁ బైనుండు నా స్వాధీనము నందుండి నాయంశమునుగొని నాసంకల్పానుసారముగఁ బని చేయునదిగాన నీ సంసారవృక్ష మూర్ధ్వ మూలము గలదియని చెప్పుటకుఁ గారణమైనది.

ఇఁకను దీనికి (ఈసంసారవృక్షమునకు) శాఖలెవ్వియనఁగా జెప్పుచున్నాను వినుము.

“ సీ. హరియందు నాకాశ మాకాశమున వాయు వనిలంబు వలన హుతాశనుండు
హవ్యవాహనునందు నంబువు లుదకంబు వలన వసుంధరగలిగె ధాత్రి
వలన బహుప్రజావళి యుద్భవంబయ్యె నింతకు మూలమై యెసఁగునట్టి
నారాయణుఁడు చిదానందస్వరూపకుండవ్యయుండజుఁడు ననంతుఁ డాఖ్యుఁ

గీ. డాదిమధ్యాంత శూన్యుం డనాదినిధనుఁ
డతనివలనను సంభూతమైనయట్టి
సృష్టిహేతుప్రకార మీక్షించి తెలియఁ
జాల రెంతటిమును లైన జనవరేణ్య! (భాగ. ౨ స్కం. ౨౬౫.)

వ. అట్టి సర్గంబు నవవిధంబు. అందుఁ బ్రాకృత వైకృత భేదంబులం గాల ద్రవ్యగుణంబులను త్రివిధంబగు భేదంబుచేఁ బ్రకృతి సంక్రమంబు లగుచునుండును. అందు మహత్తత్త్వంబు ప్రథమసర్గంబది నారాయణ సంకాశంబున గుణవైషమ్యంబునం బొందు. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబైన యహంకారతత్త్వంబు ద్వితీయసర్గంబు. శబ్దస్పర్శ రూప రసగంధంబులను పంచతన్మాత్ర ద్రవ్యశక్తి యుక్తంబైన పృథివ్యాది భూత సర్గంబు మూఁడవదియై యుండు. జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులుఁ గర్మేంద్రియంబులైన వాక్పాణి పాద పాయూపస్థలు నను దశవిధేంద్రియ జననంబు చతుర్థసర్గంబు. సాత్త్వికాహంకార జనితంబైన మనోమయ సుమనోగణ సర్గంబైదవసర్గంబై యొప్పు. జీవలోకంబులకు నబుద్ధికృతంబులైన యావరణ విక్షేపంబులం జేయు తామస సర్గం బాఱవదై యుండు. ఇయ్యాఱు నీశ్వరునకు లీలార్థంబులై ప్రాకృత సర్గంబులయ్యె. ఇంక వైకృతసర్గంబు లేడవది మొదలుగాఁ గలవి, వాని వినుపించెద వినుము. పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదులైన వనస్పతులును, పుష్పితంబులై ఫల పాకాంతంబులైన వ్రీహి యవముద్గాద్యోషధులును, ఆరోహణాపేక్షంబులైన మాలతీమల్లికాది లతలును, త్వక్సారంబులైన వేణ్వాదులును, కఠినీభూతమూలంబులును శిఖా విస్తృతంబులునగు లతావిశేషరూపంబులైన వీరుత్తులును, పుష్పవంతంబులై ఫలప్రాప్తంబులగు చూతాది ద్రుమంబులును లోనగునవ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులును దమఃప్రాయంబులునై స్థావరంబులైన యీయాఱు నేడవసర్గంబయ్యె. ఎనిమిదవసర్గం బిరువది యెనిమిది భేదంబులుగలిగి స్వస్థానాది జ్ఞానశూన్యంబులై యాహారాది జ్ఞానమాత్రనిష్ఠంబులై ఘ్రాణంబువలన నెఱుంగందగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబులై వర్తించు ద్విశఫంబులుగల వృషభమహిషాజ కృష్ణసూకరోష్ట్రగవయ రురు మేష ముఖరనవకంబును, ఏకశఫంబుగల ఖరాశ్వాశ్వతర గౌర

శరభచమరాదిషట్కంబును, పంచనఖంబులుగల శునకసృగాల వృకవ్యాఘ్రమార్జాల శశ శల్యక సింహ కపి గజ కూర్మగోధాముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జలచరంబులును, కంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులు మొదలుగాఁగల తిర్యక్సర్గంబును, అర్వాక్స్రోతంబై యేకవిధంబగు మానుషసర్గంబును, రజోగుణప్రేరితంబై కర్మదక్షిణ పక్షంబై దుఃఖం బందును సుఖంబుగోరునిది తొమ్మిదవసర్గంబనంబడు. ఈత్రివిధంబును వైకృతసర్గం బనంబడు.'' (భాగ. 3. స్కం. 288) అనుటల్లు, ఈ ప్రపంచ సృష్టి తొమ్మిదివిధములు గలదిగానున్నది. అయితే, ఒకపనివాఁడు తాఁజేయఁబూనిన పని తనమునకుఁ గావలసిన వస్తుసామగ్రుల ముందు సమకూర్చికొని పిమ్మట నెట్లాపనిని బ్రారంభించుచున్నాఁడో, అట్లే మొదటి యాఱుసర్గంబులును, అనఁగా, మహత్సర్గము—అహంకారసర్గము—భూతసర్గము—ఇంద్రియసర్గము—మనోమయసర్గము—తమస్సర్గము అను నీయాఱును బ్రపంచసృష్టికి జనకరములుగను తక్కిన మూడుసర్గంబులు, అనఁగా, వనస్పత్యాదిసర్గము—తిర్యక్సర్గము—మనుష్యసర్గము అను నీమూడును బ్రపంచ సృష్టిలోఁ జేరినవిగను, ఉండుటంబట్టి యీమూడువర్గంబులు నీసంసారవృక్షమునకు మొదటికొమ్మలు (శాఖలు) అనియు, అందేయేసర్గమునం దంతర్భూతంబులై యుండెడు విభాగంబు లాయాకొమ్మకు పక్కకొమ్మలు (ఉపశాఖలు) అనియు, మఱియు విభాగంబులలో నంతర్భూతంబులై యుండెడు విభాగంబులు రెమ్మలనియుఁ జెప్పఁదగియున్నవి. అదెట్లనఁగా, వివరించి చెప్పుచున్నాను వినుము. వనస్పత్యాదిసర్గము, వృక్షములు — లతలు— ఓషధులు — త్వక్సారంబులు — అని నాలుగువిధములు గలదిగానున్నది గనుక నావనస్పత్యాది సర్గమనెడు మొదటికొమ్మకు నీనాలుగును పక్కకొమ్మలనియు, మఱియు నా నాలుగింటిలో మొదటిదియగు వృక్ష సముదాయమునందుఁ బుష్పింపకయే ఫలించునట్టి అత్తి, మఱ్ఱి, జువ్వి, రావి, పనస మొదలగు వృక్షములు గొన్నియు, పుష్పించి ఫలించెడు మామిడి, నేరేడు, వెలగ మొదలగు వృక్షములు గొన్నియు నుండుటం బట్టి యావృక్ష సముదాయము పుష్పరహితంబులనియుఁ బుష్పసహితంబులనియు రెండువిధములు గలదిగా నేర్పడుచున్నదిగదా! కాఁబట్టి యావృక్షములనెడు పక్కకొమ్మకు పుష్పరహితంబులనియు — పుష్పసహితంబులనియు రెండురెమ్మలుగలవనియు జెప్పఁదగియున్నది. ఇట్లే, "లతలు" అనియెడు పక్కకొమ్మకు ఆరోహణాపేక్షంబులు — కఠినీభూతమూలంబులు అనియెడు రెండు రెమ్మలు గలవనియును, "ఓషధులు" అనియెడు పక్కకొమ్మకు పొట్టుధాన్యములు—గట్టిధాన్యములు— కాయ

ధాన్యములు అనియెడు మూడు రెమ్మలుగలవనియును, "త్వక్సారంబులు" అనియెడు పక్కకొమ్మ యొక్కటియే యనియును జెప్పఁదగియున్నది. ఇఁకను తిర్యక్సర్గంబను మొదటికొమ్మ కన్ననో, భూచరములనియు – ఖేచరములనియు – జలచరములనియు మూడుపక్కకొమ్మలును, వానిలో మొదటిదియగు "భూచరములు" అనియెడుపక్క కొమ్మకు ఏకశఫంబులు, ద్విశఫంబులు, పంచనఖంబులు అనియెడు రెమ్మలుగలవనియును, "ఖేచరములు" అనియెడు పక్కకొమ్మకు ఫలభక్షకంబులు, మాంసభక్షకంబులు, అనియెడు రెమ్మలును గలవనియును: "జలచరములు" అనియెడు పక్కకొమ్మ యొక్కటియే యనియును జెప్పఁదగియున్నది. ఇఁకను మనుష్య సర్గంబు నందన్ననో స్వకల్పితంబులగు దేశాచార వ్యవహారాది భేదంబులు దప్ప సృష్టి కల్పితంబులగు నవయవాది రూపభేదంబులు లేమింజేసి యా శాఖ కుపశాఖలు లేవని చెప్పందగి యున్నది. అయినను, ఈ మనుష్యసర్గమే ప్రపంచ సృష్టియందుఁ బ్రధానమైనదిగను, ప్రపంచ నటనమనెడు నీ సంసారవృక్షమున కాధారభూతమైనదిగను నున్నది. కాన దీనింగూర్చిన మఱికొన్ని విషయములు ముందు వివరించి చెప్పఁ బోవుచున్నాను.

ఓయి యర్జునా! ఇపుడు నేఁ జెప్పిన విషయములవలన నీ సంసార వృక్షమునకు శాఖ లెవ్వియైనవియు, ఉపశాఖ లెవ్వియైనవియుఁ జక్కఁగ బోధపడి యుండును గదా? ఇఁక నీశాఖ లధోముఖములని చెప్పుటకుఁ గారణ మేమనఁగా, ఈ ప్రపంచ సృష్టికి నాధారభూతమును వేరునునగు మూలప్రకృతి సమస్త యూర్ధ్వ లోకములకుఁ బైనుండు పరమాత్ముని యధీనమందుండునది గనుకను, ఇపుడు నే వివరించిన సర్గము లన్నియు దానికిఁ గ్రిందివిగనుకను, ఈ సంసారవృక్ష మధశ్శాఖలు గలది యని చెప్పుటకుఁ గారణమైనది.

ఇఁక నీ సంసారవృక్షమునకు ఆకు లెవ్వియనఁగా, వేదములే ఆకులని చెప్పఁ దగి యున్నది. అదెట్లనఁగాఁ జెప్పుచున్నానువినుము. ఓయి యర్జునా! ఒకచోఁ గొన్ని వృక్షములు, అనఁగా, అత్తి, జువ్వి, రావి, మామిడి, నేరేడు మొదలగు వృక్షములు సమూలముగ నెండి యాకులులేని ప్రమానులు మాత్రము నిలిచియుండు టను నీవు చూచినయెడల నట్లు చూచినవెంటనే వానిలో నెయ్యది యేజాతివృక్ష మైనదియుఁ దెలిసికొనఁగలవా?

అర్జు — అట్టివృక్షముల సమీపమునకుఁజని వాని ప్రమానులను జక్కఁగఁ బరీక్షించినను వానిలో నెయ్యది యేజాతి వృక్షమైనదియుఁ దెలిసికొనుట కష్టసాధ్యమై యుండఁగా, దూరమునందుండి చూచినంత మాత్రముచేత నెట్లు తెలిసికొనవచ్చును!

కృ — మంచిది, ఆ వృక్షములన్నియుఁ బచ్చివిద్దై యాకులతోఁ గూడి యుండిననో ?

అర్జు — అట్లుండినయెడల నా వృక్షముల దూరమునందుండి చూచిన వెంటనే వానిలో నెయ్యది యేజాతివృక్షమైనదియు సులభముగఁ దెలిసికొనవచ్చును.

కృ — అవునుగదా, ఇందువలన నేజాతి వృక్షమైనను సరే దాని యాకుల వలనఁ దెలిసికొనఁదగి యుంచున్నదని యేర్పడుచున్నదిగదా ! అట్లే, ఈ సంసారము యొక్క స్వరూపస్వభావములు వేదములలో వివరింపఁబడి యుండుటంబట్టి యా వేదములీ సంసార మిట్టిదని తెలుపఁగలవు. కాన నా వేదములే దీని యాకులని చెప్పుటకుఁ గారణమైనది.

ఇఁక నీ సంసారవృక్షము అవ్యయమైనదని చెప్పుటకుఁ గారణమేమనఁగా, ఇది ప్రవాహరూపమున నవ్యవహితముగా నుండునట్టిది. అనఁగా, ఒక నది ప్రవాహముగాఁ బారుచుండునపు డానది యందొకచోట నొకప్పుడుండిన జలమాయుత్తర క్షణమున నుండకపోయినను, ఆపైనుండివచ్చెడు జల మాప్రదేశము నాక్రమించుకొనుచుండుటచే నాప్రదేశమెప్పటికిని వెల్తిపడక జలముతో నెట్లు నిండియుండునో, అట్లే, సంసారబద్ధుఁడగు జీవునికి, ఒకజన్మ విడిచినవెంటనే మఱియొక జన్మమును, మరల నాజన్మవిడిచిన వెంటనే మఱియొక జన్మమును కలుగుచునే యుండునుగాని యొకప్పుడు నూరకయుండుటలేదు. కాన నీ సంసార మవ్యయమైనదని చెప్పుటకుఁ గారణమైనది.

ఇఁక నీ సంసారవృక్షమునకు అశ్వత్థమనియెడు నామమెట్లు కలిగినదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. "అశ్వత్థ" పదమునకు రేపటివఱకు నుండునట్టిది కాదు, అనఁగా, క్షణభంగురము అని యర్థము. సంసారవృక్షము నిట్టిదియే గనుక దీని కట్టిపేరు కలిగెను.

అర్జు — అయ్యా ! ఈ సంసారవృక్షము అవ్యయమైనదని యింతకుముందు చెప్పియుంటివిగదా, మరలనిపుడు క్షణభంగురమని చెప్పుచున్నావే, ఇది కేవల పరస్పరవిరుద్ధముగ నున్నదే, ఒకవస్తువే శాశ్వతమైనదిగను క్షణభంగురమైనదిగను ఎట్లుండఁగలదు ?

కృ — ఉండదు ; అయినను, ఈ సంసారవృక్షము మాత్రమట్టి పరస్పర విరుద్ధములగు రెండులక్షణములును గలదియని చెప్పఁదగియున్నది. అదెట్లనఁగా వివరించి చెప్పుచున్నానువినుము. ఓయి యర్జునా ! ఈ భూలోకమున నచ్చటచ్చట భూసారములను బట్టియో, మఱి యే హేతువుచేతనో, వేరులు మిగుల లోతునఁ బారి శాఖోపశాఖలతో విస్తరించి యనేక సంవత్సరములవఱకు, అనఁగా, నూరు, ఇన్నూను సంవ

త్సరములవఱకు జీవించియుండెడు గొప్పవృక్షములను గొన్నిటిని జూచుచున్నాము గదా, వానినట్లే యుండనిచ్చినయెడల మఱి కొంత కాలమువఱకు నట్లే విస్తరింపుచు జీవించి యుండఁగలవుగదా.

అర్జు — అవును, మఱియు నూరిన్నూరేడులవఱకు జీవించియుండఁగలవు.

కృ — మంచిది అట్టి వృక్షములలో నేదేని యొకదానిని పదునైనయొక గొడ్డలితో నడుగునఁ జెఁగొట్టినయెడల నేమి జరుగుచున్నది ?

అర్జు — ఆ వృక్షము వెంటనే క్రిందఁబడ నశించిపోవును.

కృ — మంచిది, అట్టి పదునైన గొడ్డలితో నా వృక్షమను జెఁగొట్టుట కెంత కాలముపట్టును ?

అర్జు — ఎంతో కాలము పట్టదు, ఒక గంట కాలమునకు లోపలనే తెగఁగొట్ట వచ్చును.

కృ — అవునుగదా ? ఇందువలన నేమి యేర్పడుచున్నదనఁగా, బహుకాలము నుండి ప్రబలినదియు, ఇంకను బహుకాలమువఱకు జీవింపఁదగినదియు నగు నొక గొప్పవృక్షము పదునైన యొక గొడ్డలితో ఛేదింపఁ బడుటచే క్షణమాత్రములోఁ గూలిపోఁగలదని యేర్పడుచున్నదిగదా ?

అర్జు — అవును.

కృ — కనుక నోయియర్జునా ! సంసారవృక్షము గూడ నిట్టిదేయని యెఱుంగుము. అనఁగా, సంసార బద్ధుఁడై యింతకుముందనేక జన్మలనెత్తినట్టియు, ఇఁక ముందనేక జన్మల నెత్తఁగల వాఁడైనట్టియు నొకజీవుఁడు గాఢవైరాగ్యమనెడు గొడ్డలిని బూనినయెడల వాని బంధములన్నియు నొక్క క్షణములోఁ దెగిపోవును. అపుడు వాఁడు విముక్తుఁడు కాఁగలఁడు. ఓయి యర్జునా ! ఇంతకుముందు ఖట్వాంగుఁ డను రాజుయొక్క చరిత్రమును నీకుఁ జెప్పియుంటినిగదా ? (చూ-2-72-సంభాషణ). అదియే యిందుకు గొప్ప నిదర్శనము. కాన నా చరిత్రమును నీకు జ్ఞాపకార్థము మరలఁ జెప్పుచున్నాను వినుము. అదెట్లనఁగా,

“సీ. కౌరవేశ్వరతొల్లి ఖట్వాంగుఁ డనువిభుండిల నేడుదీవుల నేలుచుండి
శక్రాది దివిజులు సంగ్రామభూముల నుగ్ర దానవులకు నోడివచ్చి
తమకుఁ దోడడిగిన ధరనుండి దివికేగి దానవవిభుల నందర వధింప
వరమిత్తుమనుచు దేవతలు భాషింపంగ జీవితకాలంబు సెప్పు డిదియ

ఆ. వరము నాకు నొందు వరమొల్ల ననవుఁడు
నాయు వొకముహూర్త మంతతడవు
గలదటంచుఁ బలికె గగనయానమున న
మ్మానవేశ్వరుండు మహికివచ్చి

క. గిరులం బోలెడి కరులను
హరులం దన ప్రాణదయితలై మనియెడు సుం
దరులను హితవరులను
బుధవరులను వర్జించి గాఢవైరాగ్యమునన్

క. గోవిందనామకీర్తనఁ
గావించి భయంబుదక్క ఖట్వాంగధరి
త్రివిభుఁడు సూరగొనియెను
కైవల్యముఁ దొల్లిరెండు గడియలలోనన్." (భాగ. ౨ స్కం. ౯-౧౧)

శ్లో॥ అధ శ్చోర్ధ్వం చ ప్రసృతా స్తస్య శాఖాగుణప్రవృద్ధా విషయ
ప్రవాళాః ।
అధ శ్చ మూలా న్యనుస న్తతాని కర్మానుబన్ధీని మనుష్యలోకే ॥ 2

అర్థము :— మనుష్యలోకే = మనుష్యసర్గమునందు (మనుష్య జన్మమునందు), (తస్య)=(ఆ సంసారవృక్షము యొక్క), **మూలాని** = మూలములు (సన్న వేరులగు జీవాత్మలు), కర్మానుబన్ధీని = కర్మబద్ధములై, అధః + చ = క్రిందనే (భూలోకము నందే), అనుసన్తతాని = నాటుకొనుచున్నవి. (తస్మాత్) = (కాఁబట్టి), తస్య = దాని యొక్క (అనఁగా - మనుష్య సర్గమనెడు నాదిశాఖయొక్క), శాఖాః=ఉపశాఖలు (కర్మఫలానుగుణ్యంబులగు జన్మలనెడు పక్కకొమ్మలు), గుణప్రవృద్ధాః=త్రిగుణములనెడురసములచే వృద్ధినొందినవియు, విషయప్రవాళాః=విషయవాంఛ లనెడు చిగుళ్లుగలవియు (అగుటచే), అధః + చ=అధోముఖముగను, ఊర్ధ్వమ్ + చ=ఊర్ధ్వముఖముగను, ప్రసృతాః=వ్యాపించియున్నవి.

ఓయి యర్జునా! ఈ సంసార వృక్షమునకుఁ గల వనస్పత్యాదిసర్గము, తిర్యక్సర్గము, మనుష్యసర్గము అనియెడు మూడు ఆదిశాఖలలో మనుష్యసర్గమే ప్రధానమైనదనియు, ఈ ప్రపంచనటనమున కాధారభూతమైనదనియు చెప్పియుంటిని గదా? అందుకుఁ గారణ మేమనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఈ మనుష్యసర్గమునందుఁ జేరియుండెడు జీవాత్మలకు మాత్రము కర్మాధికారము గలదు. అనఁగా

నేజీవుఁడైననుసరే మనుష్యజన్మగలిగినపు డేకర్మలఁ జేయుచున్నాఁడో "అవశ్యమనుభోక్తవ్యం ఫలం కర్మ శుభాశుభం" అనునట్లు, ఆజీవుఁ డాకర్మలయొక్క ఫలములగు పుణ్యపాపముల ననుభవించ వలసినవాఁడైయుండుననుట. కనుకనే, మనుష్యలోకము కర్మభూమియనియు, అందలి జీవులు అనఁగా, మనుష్య దేహధారులగు జీవులు కర్మబద్ధులనియు పెద్దలు సెప్పుదురు. అయితే, ఈ జీవాత్మలు పరమాత్మయొక్క యంశములే, అనఁగా, పరమాత్మనుండి చీలిన యణువులేయని యింతకుముందు సందర్భానుసారముగ నచ్చటచ్చటఁ జెప్పియుంటినిగదా? ఆ పరమాత్మయే యీ సంసారవృక్షమునకు నాది మూలమై యున్నట్లిపుడు నేఁజెప్పిన విషయములవలనఁ దెలిసికొనఁ గలవుగదా? ఇందువలన నేమి యేర్పడుచున్నదనఁగా, ఏదేని యొక వృక్షమునకు కుంకటివేరు (ప్రధానమూలము) ను, దానిననుసరించి పక్కవేరులు (సన్నవేరులు) ను, ఎట్లుండునో, అట్లే, ఈ సంసారవృక్షమునకు పరమాత్మ కుంకటివేరుగను, జీవాత్మలు సన్నవేరులుఁగను నున్నట్లేర్పడుచున్నదిగదా? అయితే, సాధారణముగ నన్నివృక్షములకును కుంకటివేరు భూమియందు లోతుగ దిగిపోవుటయు, దాని ననుసరించిన సన్నవేరులుభూమియొక్క పైభాగమునం దడ్డముగ వ్యాపించియుండుటయును గలదు కదా? ఈ సంసారవృక్షమునకన్ననో అట్లుకాదు. మరేమనిన, పరమాత్మయనెడి కుంకటివేరు పైభాగమున నుండునదిగను ఆ పరమాత్మయంశములగు (అణువులగు) జీవాత్మలను సన్నవేరు లా పరమాత్మకుఁ గ్రిందనుండెడు మనుష్యలోకమనియెడు కర్మభూమియందు నాటుకొన్నవిగను నేర్పడుచున్నవి. ఇట్లు నాటుకొనుటవలన నేమి జరుగుచున్నదనఁగా, సారవంతమగు నొక భూమియందుండెడు వృక్షముయొక్క వేరు లాసారమును బీల్చుటచే నావృక్షశాఖ లెట్లు అనలు - కొనలుఁ గలిగి విజృంభించునో, అట్లే ప్రకృతి గుణములను సారముగల యీ కర్మభూమియందలి జీవు లాగుణములయందు సక్తను లగుటంజేసి తదనుగుణ్యంబులగు విషయవాంఛ లనెడు చిగుళ్లుత్పన్నములగును. అట్టి విషయ వాంఛలచేఁ బ్రేరితులై యందుకుఁదగిన సుకర్మదుష్కర్మల నాచరింతురుగాన నాజీవులా కర్మంబులచే బద్ధులగుచుఁ దత్ఫలంబులగు పుణ్యపాపంబుల కనుగుణ్యంబులగు నుత్కృష్ట నికృష్టజన్మల నెత్తుచుందురు. అట్లుత్కృష్టజన్మలనొందిన జీవాత్మలు ఊర్ధ్వగతి గలవియును, నికృష్టజన్మంబుల నొందిన జీవాత్మలుఁ అధోగతి గలవియును అగుటంజేసి, యామనుష్యసర్గంబనెడు నాదిశాఖయొక్క యుపశాఖ లూర్ధ్వముఖముగను అధోముఖముగను బ్రసరించిన వగుచున్నవి. అనఁగా, ఉత్కృష్టజన్మల నెత్తిన జీవాత్మ లూర్ధ్వముఖముగఁ బ్రసరించినవనియు, నికృష్ట జన్మల నెత్తిన

క్రిందికి నధోముఖముగఁ బ్రసరించినదియుఁ జెప్పఁదగియున్నది. (ఇది యొకమఱ్ఱిచెట్టుయొక్క మొదటికొమ్మలయం దుత్పన్నములగు సన్నవేరులు (ఊడలు) అధోముఖముగఁ బ్రసరించి భూమి నంటినవెంటనే దానియందు నాటుకొనియుండి భూసారమును బీల్చుటచే నా పెద్దకొమ్మకు సమముగ, కొనలు ఉత్పన్నములై ఆ కొమ్మలతోఁ గొన్ని యూర్ధ్వముఖముగను మఱికొన్ని యధోముఖముగను బ్రసరించుటచే నా వృక్షము నానాటి విస్తరించుట ననుకరించుచున్నది).

శ్లో॥ న రూప మస్యేహ తథోపలభ్యతే నాన్తో న చాది ర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థ మేనం సువిరూఢమూల మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥ ౩

అర్థము :— ఇహ=ఈలోకమునందు. అస్య=ఈ సంసారవృక్షముయొక్క, రూపమ్=రూపము, తథా=అలాగున (పైన వివరింపఁబడిన విధముగా), న+ఉపలభ్యతే=తెలియఁబడదు. అన్తః=అంతము, న+(ఉపలభ్యతే)=తెలియఁబడదు. ఆదిః+చ=మొదలును, న+(ఉపలభ్యతే)=తెలియఁబడదు. సంప్రతిష్ఠా+చ=స్థితియును, న+(ఉపలభ్యతే)=తెలియఁబడదు. సువిరూఢమూలమ్=లెస్సగాఁ బాఱిన వేరులుగల, ఏనమ్+అశ్వత్థమ్=ఈసంసారమనెడు నశ్వత్థవృక్షమును. దృఢేన=దృఢమైన (చలింపని), అసఙ్గశస్త్రేణ=వైరాగ్యమనెడు కత్తిచేత, ఛిత్త్వా=ఛేదించి.

అయితే, ఓయియర్జునా ! ఈ సంసారవృక్షముయొక్క స్వరూపస్వభావము లిట్టివనిగాని, దీనియొక్క స్థితిగతు లిట్టివనిగాని, దీని యాద్యంతము లిట్టివనిగాని ఈ మర్త్యలోకంబున నెవ్వరు నెఱుంగఁజాలరు. కారణ మేమనఁగా,

“ తే. వినుము నృప, సత్త్వమును రజస్సును దమస్సు
ననఁగ గుణములు ముప్పిరి గొనుచు నాత్మఁ
జుట్టుకొను; నొండుమెయిఁ దెగవిట్టలముగ
నొలయు వైరాగ్య మను కొడవలిన కాని ” (భార. శాంతి. ౪ అ. ౧౯–౨)

అనునట్లు, ఈలోకమునందలి జనులు ముప్పిరిత్రాడువలెఁ బెనఁచికొనియుండు సత్త్వరజస్తమోగుణములచేఁ జుట్టుకొనఁబడిన మనస్సులుగలవారగుటచే నా గుణంబులచేఁ బ్రేరితులై తత్సంబంధంబులగు కర్మంబుల నాచరించుచు కర్మబద్ధులగుచు, మరలఁబుట్టుచు మరల గిట్టుచు నిట్లంతములేని జనన మరణ ప్రవాహంబునంబడి యీదులాడుచుందురు. కాన నట్టివారలకు “ అయ్యీశ్వరుని మాయా వ్యాపారంబుచే నీసృష్టియందు నద్యావర్తంబులంబడి భ్రమించుచున్న మహీరుహంబులంబోలెఁ బూర్వాపరభావంబు లెఱుంగఁబడకుండు. ” కనుక నిట్లనాదిగాఁ బెనఁచికొని

మిక్కిలి లోతుగాఁ బాఱియుండు వేరులుగల యీసంసారవృక్షమును దెగఁ గొట్టుటకు గాఢవైరాగ్యమనెడు గొడ్డలిచేతనేగాని మఱియొక యాయుధముచే సాధ్యపడదు ఆగాఢవైరాగ్యమనునది యెట్టిదైనదియు దానిచే నావృక్షమూలమును దెగఁగొట్టుటయనఁగా నెట్టిదైనదియుఁ జెప్పుచున్నాను వినుము.

" క. కారణము దోషదృష్టియె
వైరాగ్యమునకు జహాస వరరూపము సాం
సారికసుఖముల మరలం
గోరకయుండుటయె సుమ్ము గుఱు కార్యముగున్ " (సీ.రా. 3 ఆ. ౧౨౨)

అనునట్లు. సంసారిక సుఖముల కాధారభూతంబులగు పుత్రమిత్ర కళత్రాదులు-ధనకనక వస్తువాహనాదులు-పశుభృత్యనికరంబులు-గృహక్షేత్రారామాదులు మొదలగునవి యన్నియుఁ బైకి సుఖకరములుగఁ దోఁచినను, పట్టి చూచినచో నవియన్నియు దుఃఖకరములేకాని సుఖకరములు గావని నిజముగ నెఱుఁగుట యేదికలదో, అదియే వైరాగ్యమునకు, అనఁగా, వైరాగ్యమంకురించుటకుఁ గారణమగుచున్నది. అట్లవి యన్నియు నిస్సారములని యెఱిఁగిన వెంటనే వానియెడల మమత్వముంచక యనాసక్తచిత్తుఁడై జహాసగా నుండుటయేదికలదో అదియే వైరాగ్యముయొక్క రూపము. అనఁగా, వైరాగ్య మనఁబడుచున్నది. ఇఁక నట్లవి నిస్సారములని యెఱిఁగి వానియెడల నొకమాఱు నిస్పృహుఁడైన పిదప, కక్కినకూటిని మరలఁదినుట కెవఁడు నెట్లాసింపఁడో, అట్లే మరల నా సంసారసుఖముల నాశింపకుండుట యేదికలదో అదియే సంసారవృక్షమును ఛేదించుట యనఁబడును. కనుక నట్టివైరాగ్యమనెడు నాయుధముచే నీ సంసారవృక్షమును ఛేదింపవలయును.

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తన్తి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ 4

అర్థము :— తతః=(అట్లు ఛేదించిన) పిమ్మట, యస్మిన్=ఏస్థానమందు, గతాః=చేరినవారు, భూయః=మరల, న+నివర్తన్తి=తిరిగిరారో, తత్+పదమ్=ఆస్థానము, పరిమార్గితవ్యమ్ = వెతకఁబడఁదగినది, (తదర్థమ్) = అందుకొఱకు, యతః=ఎవనివలన, పురాణీ=అనాదియైన, ప్రవృత్తిః=సంసారప్రవృత్తి, ప్రసృతా=విస్తరిల్లెనో, తమ్=అట్టి, ఆద్యమ్+పురుషమ్+ఏవ=ఆదిపురుషునే, ప్రపద్యేత్+చ=ప్రపత్తియును జేయవలయును.

అట్టి సంసారవృక్షమును గాఢ వైరాగ్యమను గొడ్డలితో మొదలంటఁ దెగఁగొట్టి సాంసారికమ్ములు పునర్జన్మరాహిత్యముగు మోక్షపదవిని బొందుటకుఁ దగిన ప్రయత్నము చేయవలయును. అందుకేమి చేయవలయుననఁగా, అనాదియగు నీ సంసారవృక్షమును గల్పించి విస్తరింపఁ జేసినవాఁడెవఁడో అట్టి పురుషోత్తముఁడగు శ్రీమన్నారాయణునిఁ బ్రపత్తిచేయవలయును. ఏలయనఁగా,

" సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ను లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక
సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షునుతిరవిప్రభలు లేక,
నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక
తామరసగర్భునకునైన దానవేంద్ర!" (భాగ. ౭ స్కం. ౧౭౦)

అనునట్లు, ఈ ప్రపంచమునకు సృష్టిస్థితిలయకర్తయు నాదిపురుషుఁడు నగు శ్రీమన్నారాయణు నాశ్రయింపక యేరికిని మోక్షపదవిని బొందుటకు సాధ్యపడదు గాన నమ్మహాపురుషునిఁ బ్రపత్తిచేయవలయును. అయితే, ఇట్లు నేఁజెప్పుటవలన గాఢవైరాగ్యసంపన్నులు మాత్రమే అట్టిప్రపత్తిచేయవలయుననియు, తదితరులుచేయఁ గూడదనియు తలంచవలదు. అందఱును, అనఁగా, అట్టివైరాగ్యమును బూనిన వారైనను సరే కాకపోయినను సరే యాపురుషోత్తమునిఁ బ్రపత్తిచేయవచ్చును. అయినను, అట్లు ప్రపత్తి చేయువారిలో వైరాగ్యశీలురై సంసారవృక్షమును దెగఁగొట్టి త్రిగుణాతీతులైన వారుతప్పఁ దక్కినవారందఱును వారివారి భక్తిప్రపత్తులకుఁ దగినట్లూర్ధ్వలోక సుఖముల ననుభవించిమరల జన్మకు వత్తురే కాని పునర్జన్మరాహిత్యమగు మోక్షపదవిని బొందఁజాలరు. ఏలయనఁగా,

" క. గుణమూర్తి మాయ, దానిని
గణుతించెద నన్నుఁ దెగడు గ్రాహ్యత్వంబున్
గుణములఁ బెడఁబాపంగా
గుణాతీత మగువెలుగు గనుఁ దానంతన్." (భార. శాంతి. ౪ ఆ. ౧౫౧)

అనునట్లు, ప్రకృతిబద్ధుఁడగు జీవుఁడా ప్రకృతిసంబంధములగు సత్త్వరజస్తమో గుణములలో దేనితోనైనను సరే అంటియుండునంతవఱకును నిర్గుణపరబ్రహ్మమును

గనఁజాలఁడు. కాన నట్టిగుణములతోఁ గూడియుండు వారగుటంజేసి వారలా నిర్గుణ పరబ్రహ్మమును బొందఁజాలరు.

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః।
ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై ర్గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్ ॥ 5

అర్థము :— నిర్మానమోహాః=అభిమానమును—అవివేకమును — లేనివారును, జితసఙ్గదోషాః = దార, పుత్ర, బంధు, మిత్ర, ధన, ధాన్యాదులయందలి యాసక్తిని విడిచినవారును, అధ్యాత్మనిత్యాః = సదా ఆత్మానుభవమును జేయువారును, వినివృత్తకామాః=కోరికెల నన్నిటిని విడిచినవారును, సుఖదుఃఖసంజ్ఞైః=సుఖదుఃఖ కారణములగు, ద్వన్ద్వైః=శీతోష్ణాది ద్వంద్వములచేత, విముక్తాః=విడువఁబడిన వారును (అయిన), అమూఢాః=అజ్ఞానరహితులు (జ్ఞానులు), అవ్యయమ్=నాశము లేని, తత్ + పదమ్=ఆమోక్షపదవిని, గచ్ఛన్తి=పొందుచున్నారు.

ఇఁకను, గాఢ వైరాగ్యముచే సంసారవృక్షమును దెగఁగొట్టి గుణాతీతులైన వారన్నారో, దేహాభిమాన మానాభిమానములు వదలినవారును, పుత్రమిత్ర కళత్రాదులయందును, ధన కనక వస్తువాహనాదులయందును, పశుభృత్య నికరంబులయందును, గృహక్షేత్రారామాదుల యందును మమకార ముంచనివారును, ఐహికాముష్మిక సుఖంబులలో దేనినిఁ గోరనివారును, సుఖదుఃఖ కారణంబులగు శీతోష్ణంబులు, లాభనష్టంబులు, జయాపజయంబులు, మానావమానంబులు మొదలగు ద్వంద్వములచే నేలాటి వికారమును జెందని మనస్సుగలవారును, అజ్ఞానముచే విడువఁబడినవారును అనఁగా జ్ఞానోదయమైనవారునునై సదా ఆత్మానుభవమునే చేయుచుందురు. అనఁగా నెల్లప్పుడు నా భగవత్స్వరూపమునే మనోదృష్టితోఁ జూచుచు ధ్యానింపుచుందురు. కావున,

" శా. వైరాగ్యంబు దృఢంబుఁజేసి పరతత్త్వజ్ఞానమార్జించి స
ర్వారంభోపరమంబుఁగైకొని తురీయంబంది యీరీతియో
గారూఢుండగువానికిం గలుగునే యాగామియున్ సంచిత
ప్రారబ్ధంబులు సంతతంబును బరబ్రహ్మాత్ముఁడై యుండఁగాన్ ? "

(సీ. రా. 3 ఆ. ౧౨౮)

అనుసట్లు, అట్టి మహానుభావులయొక్క ఆగామి సంచిత ప్రారబ్ధంబులు నశించినవై వారు నిర్గుణ పరబ్రహ్మ స్వరూపులగుదురు. కాన నట్టివారలుమాత్రము నాచేరహితమును నిత్యానందదాయకము నగు మోక్షపదవిని బొందఁగలరు.

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥　　6

అర్థము :— యత్=ఏమోక్షస్థానమును, గత్వా=పొంది, న+నివర్తన్తే=తిరిగి జన్మమురారో, తత్=దానిని, సూర్యః=సూర్యుఁడు, న+భాసయతే=ప్రకాశింపఁజేయఁడు. శశాఙ్కః=చంద్రుఁడు, న+(భాసయతే)=ప్రకాశింపఁజేయఁడు. పావకః=అగ్ని, న+(భాసయతే)=ప్రకాశింపఁజేయఁడు. తత్+(ఏవ)=అదియే, మమ=నాయొక్క, పరమ్+ధామ=పరమపదము.

ఇఁక నామోక్షపదవి యెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. అచట సూర్య చంద్రాగ్నులు ప్రకాశింపుటలేదు. అనఁగా నామోక్షపదవి సూర్య చంద్రాగ్నులచేఁ బ్రకాశింపఁ జేయఁబడు నన్నిలోకములకు నావలదియు, స్వయంప్రకాశమైన దియునై యుండుననుట. అదియే నాడియగు పరమపదము, అనఁగా, సూర్య చంద్రాగ్నులచేఁ బ్రకాశింపఁ జేయఁబడు మర్త్యాది బ్రహ్మలోకమువరకుఁగల సమస్త యూర్ధ్వలోకముల కావలనుండు నేనేయని యెఱుంగుము. ఇట్టి నన్నుఁబొందిన వారికిఁ బునర్జన్మకలుగదని యింతకుముందు చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా ? (చూ. 8-16).

అర్జు — అవును, జ్ఞాపకమున్నది.

కృ — కనుక నిట్టి నాలోనైక్యమగుట యేదికలదో అదియే మోక్షపదవిని బొందుటయని చెప్పఁబడుచున్నది. ఇఁక నేనెట్టివాఁడననఁగా, నిర్గుణుఁడును, నిరంజనుఁడును, నిర్వికారుఁడును, స్వయంప్రకాశుఁడును, అద్వయుండును, నిత్యానంద స్వరూపుఁడు నగు నా పరబ్రహ్మరూపే నేనని యింతకుముందు చెప్పియుంటినిగదా (చూ-14-27). కనుక నిట్టి నన్నుబొందుటకుఁ బ్రకృతిసంబంధమగు మలినమేమియు లేక నావలెనే నిర్గుణుఁడగు జీవునకేగాని తదితరులకు సాధ్యపడదని యెఱుంగుము.

అర్జు — స్వామీ! ఈ ప్రపంచమునందలి జీవాత్మలన్నియుఁ బరమాత్మయగు నీయంశములేకదా? అనఁగా నీలోనుండి ప్రత్యేకించఁబడిన యణువులే కదా? ఇట్టి జీవాత్మలలో నేదేని యొకటి దాని యుత్పత్తిస్థానమగు పరమాత్మలోఁ (నీలో) మరలఁ గలియుట యెంతకష్టసాధ్యమైనపనిగానున్నది! ఆహా యేమి విచిత్రము!!

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ।
మనష్షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ 7

అర్థము :— సనాతనః=అనాదియైన, జీవభూతః=జీవుఁడు (జీవాత్మ), మమ+అంశః+ఏవ=నాయంశమే, జీవలోకే=జంతుజాలమునందు (ఉండి), ప్రకృతిస్థాని=ప్రకృతిసంబంధములగు, మనష్షష్ఠాని=మనస్సుఆఱవదిగాఁగల, ఇంద్రియాణి=ఇంద్రియములను, కర్షతి=ఆకర్షించుచున్నాఁడు.

ఓయి యర్జునా! నీవు చెప్పునది నాస్తవమే: అనాదిగానుండెడు జీవాత్మ పరమాత్మ నగు నాయంశమే, అనఁగా నన్నుండి ప్రత్యేకించఁబడిన యణువేగాని వేఱైనది కాదు. అట్టిజీవాత్మ మరల నాలోఁ గలియుట యేల యింత కష్టసాధ్యమైన పనిగా నున్నదని నీ వాలోచించెదవు కాఁబోలు. అందుకుఁ గారణమును జెప్పుచున్నాను వినుము.

నేను నిర్గుణుఁడ నగుటచే నాయంశమగు నీజీవాత్మయు మొదట నిర్గుణమైనదియే. అయితే, అట్టి నాయంశమును ప్రకృతియందుంచుటచే సమస్త భూతప్రపంచ ముత్పన్నమగుచున్నదని యింతకుముందు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 14. 3)

అర్జు — అవును, జ్ఞాపకమున్నది

కృ — కనుక నందువలన నాజీవునికిఁ బ్రకృతి సంబంధము గలుగుచున్నది. అనఁగా, ప్రకృతి బద్ధుఁడగుచున్నాఁడనుట. అట్లు ప్రకృతిబద్ధుఁడై యుండునంతవఱకు నా ప్రకృతిగుణముల ననుభవింపుచుండు ననియు, అట్లనుభవించునపు డాగుణములయం దాసక్తచిత్తుఁడైన యెడల నదియే సదసద్యోనులయందు జన్మించుటకుఁ గారణమగు ననియును గూడఁ జెప్పియుంటినిగదా, (చూ—13-22). కాఁబట్టి, అట్లు నాయంశము, అనఁగా నన్నుండి ప్రత్యేకించఁబడి ప్రకృతియందుంచఁబడిన యణువగు జీవాత్మ యాప్రకృతి సంబంధములగు శ్రోత్రత్వక్ చక్షుజిహ్వా ఘ్రాణములనెడు పంచేంద్రియములను, ఆఱవదియగు మనస్సునుఆకర్షించును. అదెట్లనఁగా నిందు కొక దృష్టాంతమును జెప్పుచున్నానువినుము.

ఓయి యర్జునా! ఏదైన నొక నిర్మలమైన తెల్లని వస్త్రమునుండి యొక పేలికఁ జించి యాపేలిక నేదేని యొకరంగులో (చాయలో) అద్దినయెడల నేమగుచున్నదిఁ

అర్జు — ఆరంగు నాపేలిక పీల్చుకొని యా రంగుగలదిగా నేర్పడుచున్నది.

కృ — మంచిది, ఆపేలికను మరల నావస్త్రముతోఁ జేర్చికుట్టినయెడల దానితో? గలసి యావస్త్రమంతయు మునుపటివలెఁ దెల్లగానుండునా?

అర్జు — అదెట్లగును? ఆ పేలిక నంటియుండెడు రంగు నిశ్శేషముగ విడిచి పోవునట్లుతికి పిమ్మట నావస్త్రముతోఁ జేర్చి కుట్టినయెడల దానితోఁ గలియునేగాని లేకున్న నెట్లు కలియును?

కృ — అవునుగదా! అట్లే, ప్రకృతి సంబంధమగు దేహమునందుండు నాయంశమగు నణువును. ఆ ప్రకృతి సంబంధములగు షడింద్రియములతోఁగూడి జీవాత్మయను పేరఁబరగుచు నా ప్రకృతి వాసనబొత్తిగ విడుచునంతవఱకును మరల నాలోఁ గలియుటకు నర్హత లేక యుండును.

అర్జు — అయ్యా! ఈ జీవాత్మ యేదైన నొకదేహము నాశ్రయించి యుండు నంతవఱకు మాత్రమే ఆదేహమునకు సంబంధించి యుండెడు నింద్రియములతోఁ గూడి యుండినవాఁడును, ఆదేహమును విడుచునపుడు దానికి సంబంధించియుండు నింద్రియములను, అనఁగా, కండ్లు, ముక్కు, చెవులు, నాలుక, చర్మములనుగూడ విడిచి పెట్టి పోవునవాఁడును అగుచున్నాఁడు గదా? అట్లాదేహమును విడిచినపుడా జీవుఁడు ప్రకృతి సంబంధమును విడిచినవాఁడై నిర్మలుఁడే యగుచున్నాఁడా? లేదా?

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతానిసంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥ 8

అర్థము:— ఈశ్వరః=ఇంద్రియ మనంబులకు నీశ్వరుఁడగు జీవుఁడు, శరీరమ్=(ఏదేనియొక) దేహమును, యత్+అవాప్నోతి=ఎప్పుడుపొందుచున్నాఁడో (అప్పుడును), ఉత్క్రామతి+చ=(ఆదేహమునుండి యెప్పుడు) బైలు వెడలుచున్నాఁడో (అప్పుడును), ఆశయాత్=పుష్పాద్యాశయము నుండి, వాయుః=వాయువు, గన్ధాన్+ఇవ=పరిమళమును గ్రహించునట్లు, ఏతాని=ఈ షడింద్రియములను, గృహీత్వా=గ్రహించుకొని, సంయాతి=పోవుచున్నాఁడు.

కృ — ఓహో! నీ వర్ణించుచున్నావు కాఁబోలును. ఇంద్రియము లనఁగా, నీవు తలఁచునట్లు కన్ను – ముక్కు – చెవి – మొదలగునవి కావు. మఱేమనిన, అవి దేహముయొక్క యవయవములును, ఇంద్రియములకు ఆశ్రయస్థానములునునై యున్నవి ఇఁక నింద్రియము లెవ్వియనఁగా, చూచుట – వినుట – మొదలగు నింద్రియ వ్యాపారములను జరిగించెడు శక్తియే. ఈశక్తి జీవునియందున్నదేగాని యా యవయవములయందు లేదు. కనుకనే జీవుఁ డింద్రియములకు నీశ్వరుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఇందుకు నిదర్శన మేమనఁగా, ఒకఁడు జీవించియుండునపుడు నేత్రములతోఁ జూచుట–చెవితో వినుట–మొదలగు పనుల జేయుచున్నాఁడుగదా?

వాఁడు మృతినొందినపుడు వాని నిర్జీవకళేబరమునందా నేత్రాద్యవయవము లట్లే యుండినను, అవి చూచుట మొదలగు పనులఁజేయుట లేదుకదా? ఇందువలన నేమియేర్పడుచున్నదనఁగా, ఆజీవుఁ డాదేహమును విడిచిపోవునపుడు పుష్పము నందలి సువాసనను వాయువు గొనిపోయినట్లు, తనతోఁగూడ నాశక్తిని దీసికొని పోయినవాఁడగుచున్నాఁడుగదా? అట్లే, ఆజీవుఁడు మఱియొక దేహమునందుఁ బ్రవేశించునపు డాశక్తులతోఁగూడఁ బ్రవేశింపుచున్నాఁడు.

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే॥ 9

అర్థము:— అయమ్=ఈజీవుఁడు, శ్రోత్రమ్=చెవిని, చక్షుః=నేత్రమును, స్పర్శనమ్+చ=చర్మమును, రసనమ్=నాలుకను, ఘ్రాణమ్+ఏవ+చ=ముక్కును, మనః+చ=మనస్సును, అధిష్ఠాయ=ఆశ్రయించి. విషయాన్=ఇంద్రియ విషయములను, ఉపసేవతే=అనుభవింపుచున్నాఁడు.

అట్లు ప్రవేశించి యేమి చేయుచున్నాఁ డనఁగా,

“ సీ. కరణంబు కర్మంబు గర్తయు న్నైతద్విరాజిత కారకత్రయము చేత
నఖిలంబుసంవ్యాప్తమైయుండు, ఘ్రాణాదులును మనంబును బుద్ధియును బ్రవరులు
గరణహేతువులండ్రు; గంధాదివిషయసంతతియు, మంతవ్యబోద్ధవ్యములును
గర్మహేతువులగు; గంపుగొనఁగ, నానఁ, గాన, ముట్టఁగ, వినఁగా, దలంప,

తే. నిశ్చయము దగఁజేయంగ నేర్పు లేదు
కలవు జీవాత్మునకు; నవి కర్తృహేతు
భూతములు; వాన విషయానుభూతి నతఁడు
దొలఁగునిష్టలు మోక్షహేతువులు సుమ్ము! ” (భార.ఆశ్వ.—౨ ఆ. ౫౧)

అనునట్లు, శబ్దాది విషయములు గర్మహేతువులును, ఆ శబ్దాదివిషయవ్యాపారములగు — వినుట — కనుట — చవిగొనుట — ఆఘ్రాణించుట — స్పృశించుట — తలంచుట — నిశ్చయించుట — అను కర్మలఁజేయు కర్త జీవుఁడును, ఆకర్మలనాచరించుటకుఁ దగిన సాధనములు (కొఱముట్లు) దేహావయవములగు చెవి, కన్ను, నాలుక, ముక్కు, త్వక్కు, మనసు, బుద్ధియును నై యుండుటంబట్టి యాజీవుఁ డాయాస్థానము (అవయవము) నాశ్రయించి యాయా పనిని జేయుచుండును. అనఁగా, చెవియందుండి వినుచును, నేత్రమునందుండి కనుచును, జిహ్వాయందుండి చవిఁగొనుచును,

ముక్కునందుండి యాఘ్రాణింపుచును, త్వక్కునందుండి స్పర్శగొనుచును, మనస్సునందుండి తలంచుచును, బుద్ధియందుండి నిశ్చయింపుచును ఉండును.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః ॥ 10

అర్థము :— జ్ఞానచక్షుషః = జ్ఞానదృష్టి గలవారలు, (ఏనమ్) = ఈ జీవుని, ఉత్క్రామన్తమ్ = దేహమునుండి బయలువెడలునపుడును, స్థితమ్ + వా + అపి = దేహమునందుండునపుడును, భుఞ్జానం + వా = విషయముల ననుభవించునపుడును, గుణాన్వితమ్ = గుణములతోఁ గూడియుండువానిఁగా, పశ్యన్తి = చూచుచున్నారు (తెలిసికొనుచున్నారు). విమూఢాః = అజ్ఞానులు, న + అనుపశ్యన్తి = చూడరు (అట్లు తెలిసికొనఁజాలరు).

కాన నోయియర్జునా! ఈ జీవుఁడు దేహస్థుఁడైయుండునపుడు, అనఁగా నొకశరీరము నాశ్రయించి యుండునపుడును, ఆదేహమునందుండి పైనఁజెప్పఁబడిన ప్రకార మాయాయింద్రియముతో నాయావిషయము ననుభవించునపుడును, ఆదేహమునువిడిచిపోవునపుడును, ప్రకృతిబద్ధుఁడైయున్నాఁడని, అనఁగా, ప్రకృతిసంబంధములగు సత్త్వరజస్తమోగుణములచేఁ బ్రేరేపింపఁబడి యీపనులఁ జేయుచున్నాఁడని యజ్ఞానులు దెలిసికొనఁజాలరు. కారణమేమనఁగా,

" క. స్నేహసహవాసములు స
మ్మోహము దలకొలుపఁగాలమున మునుగుచు, గా
ఢాహంకార మమత్వము
లీహఁ బెనుపఁ, బ్రకృతిఁ బురుషుఁడేనను చుండున్ "

(భార. శాంతి. ౬ ఆ. ౧౨౪)

అనునట్లు, అజ్ఞానులు గాఢాహంకార మమకారయుక్తులై యుందురు గానఁ బ్రకృతిచేఁ జేయఁబడు పనులనన్నిటిని దామే చేయుచున్నట్లెంచుదురు. ఇఁకను జ్ఞానులన్నో అట్లెంచరు. మఱేమనఁగా,

" క. అది లెస్సగ విడిచి, ప్రకృతి
కుదకనిభాకలనమును, ఝషోపమ దనకుం
బదిలుఁడయి చూడ నేర్చిన
విదితం బగు దానితోడి వేర్పాటనఘా." (భార. శాంతి. ౬ ఆ. ౧౨౫)

అనునట్లు, ప్రకృతి యుదకమువంటిదనియు, తాను మత్స్యమువంటివాఁడ

నియు, కాన నుదక మందుండియు మత్స్యము వేఱుగా నున్నట్లే ప్రకృతికిని దనకును సంబంధము లేదనియు, కాఁబట్టి యాప్రకృతిగుణములచేఁ జేయఁబడు పనులచేఁ దాను బద్ధుఁడు కాఁడనియు తెలిసికొనఁగలఁడు.

శ్లో॥ యతన్తో యోగిన శ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్ ।
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః ॥ 11

అర్థము :— యతన్తః = (జ్ఞానసిద్ధికొఱకు) యత్నించుచున్న, యోగినః + చ = నిష్కామకర్మానుష్ఠానపరులును, ఆత్మని = తనయందు, అవస్థితమ్ = ఉన్నట్టి, ఏనమ్ = ఈజీవుని, పశ్యన్తి = చూచుచున్నారు. అకృతాత్మానః = చిత్తశుద్ధిలేని, అచేతసః = అవివేకులు, యతన్తః + అపి = యత్నించుచున్నవారయ్యును, ఏనమ్ = ఈయాత్మను, న + పశ్యన్తి = చూడఁజాలరు.

ఓయి యర్జునా! జ్ఞానదృష్టిగలవార లిట్లు తెలిసికొందురని చెప్పితినిగదా? జ్ఞానసిద్ధిని బొందినవారికే గదా యట్టిజ్ఞానదృష్టి కలుగుచున్నది? ఇందువలన వారే యిట్లు తెలికొనఁగలరని యేర్పడుచున్నదిగదా? వీరలే కాదుసుమా! ఇట్టి జ్ఞానసిద్ధిని బొందకపోయినను దానిం బొందుటకుఁ దగిన ప్రయత్నము చేయుచు నందుకుగాను చిత్తశుద్ధిగలిగి నిష్కామకర్మానుష్ఠానపరులై యుండెడు యోగులుఁగూడఁ దమయందుండెడు జీవాత్మయొక్క స్వరూప స్వభావము లిట్టివని తెలిసికొనఁగలరు. అయితే అట్టిప్రయత్నము సేయువారైనను చిత్తశుద్ధిలేని వారైనయెడల నట్టివార లీజీవుని స్వరూప స్వభావము లిట్టివని తెలిసికొనఁజాలరు.

శ్లో॥ య దాదిత్యగతం తేజో జగ ద్భాసయ తేఽఖిలమ్ ।
య చ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ 12

అర్థము :— ఆదిత్యగతమ్ = సూర్యునియందుండునట్టి, యత్ + తేజః = ఏ తేజస్సు, అఖిలమ్ + జగత్ = సమస్త ప్రపంచమును, భాసయతే = ప్రకాశింపఁజేయుచున్నదో, యత్ + తేజః = ఏ తేజస్సు, చన్ద్రమసి = చంద్రునియందును, అగ్నౌ + చ = అగ్నియందును (ఉంచున్నదో), తత్ = దానిని, మామకమ్ = నాద్దిగా, విద్ధి = ఎఱుఁగుము.

ఓయి యర్జునా! ఇపుడునే జెప్పినది త్రిగుణాత్మకమగు ప్రకృతితో సంబంధించినదియు జీవభూతమైనదియునగు నాయంశమైయున్నది. ఇదిగాక దీనికంటె శ్రేష్ఠమైనదియు తేజోమయమైనదియు నగు నాయంశముమఱియొకటిగలదు. అదియెద్ది యనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఈప్రపంచ మంతటికిని పగటియందు సూర్యునివలనను రాత్రియందు చంద్రాగ్నులవలనను గదా ప్రకాశము గలుగుచున్నది? ఆప్రకాశములేనియెడల గాఢాంధకారము వ్యాపించి సమస్త జంతువులును వానివాని వ్యాపారములఁ జేయుటకు వీలులేక యవి జీవించియుండుటయె కష్టసాధ్య మగునుగదా? కనుక నాసూర్యచంద్రాగ్నులయందు నా తేజస్సునుంచి దానిచే నీ లోకమునంతటినిఁ బ్రకాశింపఁ జేయుచున్నాను గాన నామూటియందుండెడు తేజస్సు నాదియేయని యెఱుంగుము.

శ్లో॥ గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా ।
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥ 13

అర్థము :— అహమ్=నేను, గామ్+ఆవిశ్య=భూమిని బ్రవేశించి, ఓజసా=బలముచేత, భూతాని=(సమస్త)భూతములను, ధారయామి+చ=ధరింపుచునున్నాను. రసాత్మకః = రసస్వరూపుఁడగు, సోమః+భూత్వా = చంద్రుఁడనై, సర్వాః+ఓషధీః=సమస్తసస్యములను, పుష్ణామి+చ=వృద్ధిఁబొందింపుచునున్నాను.

ఇదిగాక యీప్రపంచమునందలి సమస్త భూతములను ధరించుటకుఁ దగినశక్తి భూమికిఁ గలిగియుండవలెనుగదా? కాఁబట్టి యాభూమియందు నేను బ్రవేశించి అనఁగా నాయంశమును బ్రవేశపెట్టి దానికట్టి బలమును గలుగఁజేయుచున్నాను. మఱియును నీ ప్రపంచమునం దుండెడు జీవభూతములగు సమస్తజంతువులును జీవించుటకు దగిన పదార్థములు గావలసి యున్నవిగదా, కాఁబట్టి రసస్వరూపుఁడగు చంద్రుని యందు నాయంశమును బ్రవేశపెట్టి యాచంద్రునిచే నట్టి సస్యాదులు వృద్ధినొందు నటులఁ జేయుచున్నాను.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్ ॥ 14

అర్థము :— అహమ్=నేను, వైశ్వానరః+భూత్వా=జఠరాగ్నినై, ప్రాణినామ్=ప్రాణులయొక్క, దేహమ్+ఆశ్రితః+(సన్)=శరీరము నాశ్రయించినవాఁడనై, ప్రాణాపానసమాయుక్తః=ప్రాణాపానవాయువులతోఁ గూడి, చతుర్విధమ్=నాలుగువిధములైన, అన్నమ్=ఆహారమును, పచామి=జీర్ణము సేయుచున్నాను.

ఇఁకను అట్లు వృద్ధినొందింపఁబడిన సస్యాదులం దిని జీర్ణించుకొనినఁగదా జంతువులకు రక్తవృద్ధిగలిగి జీవించియుండుటకుఁ గారణమగును? కాఁబట్టి నాయంశమునే యాజంతువుల దేహములయందుఁ బ్రవేశపెట్టి జఠరాగ్నిరూపముగఁ బ్రకాశింపుచు నాజంతువులు భక్షించెడు చతుర్విధాన్నమును, అనఁగా, భక్ష్య-భోజ్య-లేహ్య

చోష్యము లనెడునాలుగు విధములగు నాహారములను జీర్ణింపఁజేసి యందుచే నాజంతువులయందు రక్తవృద్ధియగునట్లును, ఆరక్తవృద్ధిచే నవిజీవించునట్లును జేయుచుందును.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనం చ
వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్॥ 15

అర్థము :— అహమ్=నేను, సర్వస్య+చ=సమస్తప్రాణులకును, హృది+సన్నివిష్టః=అంతర్యామినై యున్నాను, స్మృతిః=స్మృతియును, జ్ఞానమ్=జ్ఞానమును, అపోహనమ్+చ=మఱపును, మత్తః=నావలననే కలుగుచున్నవి. సర్వైః+వేదైః = సమస్త వేదములచేత, వేద్యః + చ = ఎఱుఁగఁబడఁ దగినవాఁడును, అహమ్+ఏవ=నేనే, వేదాన్తకృత్ = వేదాన్తమును జేసినవాఁడను, వేదవిత్ + చ=వేదము నెఱిఁగినవాఁడను, అహమ్ + ఏవ=నేనే.

కనుక నోయియర్జునా! ఇట్లే నేనీప్రపంచమునంగల సమస్తప్రాణులకు నంతర్యామినై వారల దేహసంరక్షణఁ జేసి పోషింపుచుండుటయగాక వారల జ్ఞప్తి-మఱపు-జ్ఞానము-మొదలగు మనోవ్యాపారములకు గూడ నేనే కారణభూతుఁడనై యున్నాను. ఇంతయేల, సమస్తవేదములును ఎవనినైతే యీ సమస్తప్రపంచమునకు సృష్టి, స్థితిలయకర్తగాఁ దెలియఁజేయుచున్నవో, అట్టివాఁడు నేనేగాని మఱియొకఁడుగాడు. కనుక నట్టిసమస్తవేదాంతముల నెఱిఁగినవాఁడును, ఎఱిఁగించెడువాఁడును నేనేయని యెఱుంగుము.

అర్జు — అయితే, స్వామీ! నీవు కేవల సాక్షీభూతుఁడవై యుండఁగాఁ బ్రకృతివలననే యీసమస్త చరాచరప్రపంచము నుత్పత్తియై ప్రవర్తింపుచున్నదని యింతకుముందు చెప్పియుంటివిగదా? (చూ. 9. 10.). ఇపుడు నీవుచెప్పెడు విషయమునుబట్టి చూడఁగా నీప్రపంచమునందలి సమస్త చరాచరములయందును నీవే యుండి యాడించుచున్న ట్లగపడుచున్నదే, ఇట్టి వ్యత్యస్థమునకుఁ గారణమేమి?

శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ 16

అర్థము :— లోకే = ప్రపంచమునందు, క్షరః+చ = క్షరుఁడనియు, అక్షరః+ఏవ+చ=అక్షరుఁడనియు, ఇమౌ=ఈ (పేర్లుగల), ద్వౌ+పురుషౌ=

ఇద్దరు పురుషులు (కలరు). సర్వాణి+భూతాని = సమస్తభూతములు (అనఁగా సమస్తభూతములయందుఁగల చతుర్వింశతి తత్త్వములు), క్షరః = క్షరుఁడనియు, కూటస్థః=కూటస్థుఁడును-పంచవింశతితత్త్వమును నగు జీవుఁడు, అక్షరః=అక్షరుఁడనియు, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

అవును నేనట్లుచెప్పియుండునది వాస్తవమే, ప్రపంచోత్పత్త్యాది ప్రకృతి కార్యములకు నేను గేవల సాక్షీభూతుఁడనై యుండుటయును నిజమే; అదెట్లనఁగా వివరించి చెప్పుచున్నాను వినుము. ఈలోకమున - క్షరుఁడనియు - అక్షరుఁడనియు నిరువురు పురుషులు గలరు. ఆయిరువురిలో, క్షరుఁడనఁగా నశింపఁదగిన సమస్తభూతములకును, అక్షరుఁడనఁగా నెప్పటికి నశింపనిదియు-నాయంశమునునగు జీవాత్మకును వేరని యెఱుంగుము. అదెట్లనఁగా వివరించి చెప్పుచున్నానువినుము.

"తే. అక్షరము విక్రియాశబలాత్మకత్వ
మొందు, నవ్విక్రియకును బేళ్లొలసెఁ బ్రకృతి
యనఁ బ్రధానంబునాఁగ నవ్యక్తమనఁగ
దానఁ బుట్టు మహన్నామ తత్త్వ మనఘ!

తే. విను, మహంకార మాతత్త్వమున జనించు
దాన భూతపంచకంబును, దద్గుణంబు
లైనశబ్దాదివిషయంబు లైదు నింద్రి
యములుఁ బదియును మనసును నావహిల్లు." (భార. శాంతి. ౬ ఆ. ౭,౮)

అనునట్లు, అక్షరుండనగు నే నెప్పుడు ప్రపంచసృష్టిని సంకల్పించుచున్నానో, అప్పుడు నాయందొక వికారము గలుగుచున్నది; ఆవికారమునకే ప్రకృతి యనియు - ప్రధానమనియు- అవ్యక్తమనియుఁ బేళ్లు. ఆప్రకృతివలన మహత్తత్త్వమును, దానివలన నహంకారతత్త్వమును. ఆయహంకారతత్త్వమువలన పృథివ్యాది పంచభూతంబులును, శబ్దాది పంచవిషయంబులును, జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియము లైదును, మనోబుద్ధులును, యిరువదినాలుగు తత్త్వము లుత్పన్నములగుచున్నవి.

"క. క్షరమయ్యిరువది నాలుగు
నరనాథా యక్షరంబునకు నెయ్యెడలన్
క్షరభావములే దయ్యు
క్షరమువిలాసములు సూవె క్షరతత్త్వమ్ముల్." (భార. శాంతి. ౬ ఆ. ౯)

అనునట్లా యిరువదినాలుగు తత్త్వములును నక్షరమగు నా పరబ్రహ్మమువలనఁ

గలిగినవియే; అనఁగా నా పరబ్రహ్మముయొక్క విలాసములే యయ్యున్నవి. అయినను అవిక్షరత్వము (నశించెడుస్వభావము) గలవి యగుటచే వానికి క్షరమనెడు పేరు గలిగెను. ఆ యిరువదినాలుగుతత్త్వములకు నావలనుండెడు యిరువదియైదవ తత్త్వమగు నాత్మకు నట్టి క్షరత్వము (నశించెడుస్వభావము) లేదు గనుక నాయాత్మకు అక్షరమను నామము గలిగెను. క్షరములును అచేతనంబులునగు నా యిరువదినాలుగు తత్త్వములును, అక్షరమును చైతన్యంబునగు నాయిరువదియైదవ తత్త్వమును జేరియే యొక జీవజంతు వగుచున్నది. అనఁగా నాయిరువదినాలుగుతత్త్వములు చేరి దేహమును, ఆ యిరువది యైదవతత్త్వము దేహియు, అనఁగా, ఆదేహమునందుండెడు జీవాత్మయు నగుచున్నవి. ఇట్టి రెండు తత్త్వములయొక్క సంయోగమువలన నీప్రపంచ నటన జరుగుటంబట్టి యీప్రపంచమునందు క్షరుఁడనియు నక్షరుఁడనియు నిరువురు పురుషులుగలరని చెప్పుటకుఁ గారణమైనది. అనఁగా నీయిరువురు పురుషుల వలన నీప్రపంచనటన జరుగుచున్న దనుట.

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య భిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥ 17

అర్థము:— అవ్యయః=నాశరహితుడైన, యః+ఈశ్వరః=ఏ యీశ్వరుఁడు, లోకత్రయమ్=ముల్లోకములను, ఆవిశ్య=ప్రవేశించి, భిభర్తి=భరింపుచున్నాఁడో (అట్టి), అన్యః=(క్షరాక్షరములకంటె) అన్యుఁడగు, పురుషః+తు=పురుషుఁడన్ననో, ఉత్తమః=ఆయుభయులకంటె శ్రేష్ఠుఁడు, (సః+ఏవ)=వాఁడే, పరమాత్మా+ఇతి=పరమాత్మయని, ఉదాహృతః=చెప్పఁబడుచున్నాడు.

ఓయి యర్జునా! ఇట్టి యిరువదినాలుగు తత్త్వములునుజేరి క్షరుఁడనియు, ఇరువదియైదవ తత్త్వము అక్షరుఁడనియు నామములుగలవారలై పరస్పర సంయోగముచే నీప్రపంచనటన జరిగించుచున్నారుగదా? ఇఁకను,

"క. పురుషోత్తమషడ్వింశక
పరమేశ్వరనామకములు పరగును విను, మా
పరమునకు నదియ నిష్కళ
నిరంజనానందబోధనిత్యం బనఘా." (భార. శాంతి. ౬ ఆ. ౧౪౭)

అనునట్లు, ఈపంచవింశతితత్త్వముల కావలిదియగు షడ్వింశతి తత్త్వ మొకటి గలదు. అది యీక్షరాక్షరములకంటె వేరైనదియు శ్రేష్ఠమైనదియునై యున్నది. కనుక నీతత్త్వమునకుఁ బరమాత్మయనియు, పరమేశ్వరుఁడనియు, పురుషోత్తముఁ

డనియు నామములు గలవు. ఈ పరమపురుషుఁడే ముల్లోకములకును బ్రభువై ఈక్షరాక్షరులచేఁ జరిగించఁబడుచుండెడు ప్రపంచనటనను సాక్షీభూతుఁడై చూచుచున్నాఁడు. ఓయి యర్జునా! నేనే యీపురుషోత్తముఁడనని యెఱుంగుము. కనుక నేనా సాక్షీభూతత్వముచేత నీ ప్రపంచనటన ప్రకృతిచేఁ జేయఁబడుచున్నదని యింతకు ముందు నీకుఁ జెప్పుటకు గారణమైనది. (చూ. 9-10.)

శ్లో॥ యస్మాత్క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః ।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥ 18

అర్థము :— యస్మాత్=ఎందువలన, క్షరమ్=క్షరుఁడను పేరుగల చతుర్వింశతి తత్త్వములను, అతీతః=అతిక్రమించినవాఁడను, అక్షరాత్+అపి=అక్షరుఁ డను పేరుగల పంచవింశతి తత్త్వమునకంటె, ఉత్తమః+చ=శ్రేష్ఠుఁడను (అయితినో), అతః=ఈ కారణమువలన, అహమ్=నేను, లోకే=లోకమునందును, వేదే+చ= వేదమునందును, పురుషోత్తమః+(ఇతి)=పురుషోత్తముఁ డని, ప్రథితః+అస్మి= ప్రసిద్ధుఁడ నై నాఁడను.

ఓయి యర్జునా! నేను క్షరాక్షరు లిరువురికంటె శ్రేష్ఠుఁడననుటకుఁ గారణ మేమనఁగా, అహంకారాది చతుర్వింశతితత్త్వములకుఁగదా క్షరుఁడని పేరు? ఈచతుర్వింశతి తత్త్వములును ఎప్పటికైనను నశించునవియేగాని శాశ్వతముగా నుండునట్టివి కావుగదా? నేనన్ననో, ఎప్పటికిని నాశములేక శాశ్వతముగ నుండునట్టివాఁడనుగదా? కాఁబట్టి యీయిరువదినాలుగు తత్త్వములను, అనఁగా, క్షరుఁడను బురుషుని నతిక్రమించినవాఁడ నగుచున్నాను. ఇఁకను, ఇరువదియైదవ తత్త్వమగు నక్షరుఁడు, అనఁగా, జీవుఁడు శాశ్వతుఁడైనను బ్రాకృతుఁడగుటవలన, అనఁగా, ప్రకృతితో సంబంధించిన వాఁడగుటవలనను, ఇరువదియారవ తత్త్వమగు పరమాత్మనైననేను అప్రాకృతుడను, అనఁగా, ప్రకృతికి విలక్షణుఁడను అయ్యుండుటచేతను, ఆయక్షరుని (జీవుని) కంటెను గూడ శ్రేష్ఠుఁడ నగుచున్నాను. ఇంతియగాక అక్షరుఁడను జీవుఁ డెప్పుడేదేహమున నుంచున్నాఁడో అప్పు డాదేహమునకును దానికి సంబంధించిన యింద్రియాదులకు మాత్రమే యీశ్వరుఁడై యుండఁగా, పరమాత్ముఁడనగు నేను ముల్లోకములకు నీశ్వరుఁ డనై యున్నాను. ఇట్లీక్షరాక్షరులను బురుషు లిరువురికంటె నుత్తముఁడ నగుటంజేసి యీ లోకమునందలి జనులు నన్నుఁ బురుషోత్తముఁ డనుటయుగాక వేదములందును నట్లే చెప్పఁబడియున్నది.

శ్లో॥ యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ! 19

అర్థము :— హేభారత !=ఓయి యర్జునా !, యః=ఎవఁడు, అసమ్మూఢః+(సన్)=అవివేకములేనివాఁడై, మామ్=నన్ను, ఏవమ్=ఇట్లు (పైఁ జెప్పఁబడిన ప్రకారము, పురుషోత్తమమ్=పురుషోత్తమునిగా, జానాతి = ఎఱుఁగుచున్నాఁడో, సః=వాఁడు, సర్వవిత్=సమస్తము నెఱిఁగినవాఁడై, మామ్=నన్ను, సర్వభావేన= అన్ని విధముల చేతను, భజతి=భజించుచున్నాఁడు.

కనుక నోయి యర్జునా ! ఎవఁడైతే అజ్ఞానరహితుఁడై నన్నిట్లెఱుఁగుచున్నాఁడో, అనఁగా నింతకుముందు చెప్పఁబడిన ప్రకారము నేను క్షరుఁడు - అక్షరుఁడు - అను నిరువురు పురుషులకంటె శ్రేష్ఠుఁడననియు, అయితే,

" క. పురుషుని నవ్యక్తము రెం
డురూపులుగఁ జూచు టొప్పెడు తెఱం గతఁడుం
బురుషోత్తముండు నరయఁగ
నిరువురుగారతఁడ యాతఁ డిది నిజము సుమీ."

(భార. శాంతి. ౬ ఆ. ౧౪౬)

అనునట్లు, ఆ యిరువురు పురుషులలో మొదటివాఁడగు ప్రకృతి కంటెను, అనఁగా క్షరుఁడను పేరఁ బరగుచుండెడు చతుర్వింశతి తత్త్వములకంటె వేఱైన వాఁడనని చెప్పఁదగియుండినను, రెండవపురుషుఁడగు పంచవింశతి తత్త్వము కంటె వేఱైనవాఁడను గాననియు, అనఁగా, ఆజీవుఁడు నాయంశమే యనియు, అయితే ఆజీవుఁడు ప్రకృతిబద్ధుఁడై దేహేంద్రియములకు మాత్రమీశ్వరుఁడై యుండఁగా నేను బ్రకృతికి విలక్షణుఁడనై జగత్తునకంతటికి నీశ్వరుఁడనై యుండుటంబట్టి యా జీవుని కంటె వేఱైనవాఁడనుగ నున్నట్లగపడుచుందుననియు నెవఁడెఱుఁగుచున్నాఁడో, అట్టివాఁడు నన్ను సమస్తవిధముల భజించును. అనఁగా, పురుషోత్తముఁడనగు నన్ను భజించుటయె గాక, సమస్తభూతములయందుండెడు జీవాత్మలన్నియు నాస్వరూప ములేయని భావించి వానిలో దేనికిని నెగ్గొనరింపకుండును.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయాఽనఘ !
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యాత్ కృతకృత్యశ్చ భారత ! 20

అర్థము :— అనఘ=పాపరహితుఁడవగు నో యర్జునా, ఇతి=ఇట్లని, గుహ్యతమమ్=అతి రహస్యమైన, ఇదమ్+శాస్త్రమ్=ఈశాస్త్రము, మయా+ఉక్తమ్=

నాచేఁ జెప్పఁబడినది. హేభారత !=ఓయి యర్జునా !, ఏతత్=దీనిని, బుద్ధ్వా= ఎఱిఁగి ? బుద్ధిమాన్ = జ్ఞానవంతుఁడవును, కృతకృత్యః+చ = కృతార్థుఁడవును, స్యాత్=అగుము.

కనుక నోయి యర్జునా ! ఇపుడు నేఁజెప్పిన విషయ మేదిగలదో అదియే రహస్యము లన్నిటిలో నుత్తమమయిన రహస్యము. కనుక దీనిని నీవు చక్కఁగా నెఱుంగుము. ఏమెఱుంగవలయు ననఁగా,

"క. పురుషోత్తముండును బురుషుఁడు
నిరువు రగుట గలదు గలిగెనేనియుఁ బురుషుం
బురుషోత్తమునందుఁ గలపు
తెరవున నేకత్వమహిమ విజ్ఞాత మగున్." (భార. శాంతి. ౬ ఆ. ౧౬౨)

అనునట్లు పురుషుఁ డనుపేర జీవాత్మయు – పురుషోత్తముఁ డనుపేరఁ బర మాత్మయుఁ బ్రకాశింపుచు నిరువురుప్రత్యేక పురుషులుగా నున్నట్లగపడుచుందురనియు అట్లగపడుచుండుట యాపురుషుఁడగు జీవాత్మ ప్రకృతిసంబంధముగలిగియుండు నంత వఱకేయనియు ఆప్రకృతిసంబంధమువిడిచినవెంటనే యాపురుషుఁడను జీవాత్మకును బురుషోత్తముఁడను బరమాత్మకును భేదముండదనియు–అనఁగా నాజీవాత్మయుఁ బరమాత్మస్వరూపమే యగుచున్నదనియు నెఱుంగవలయును. కనుక నోయి యర్జునా ! ఇట్లెప్పు డెఱుఁగుదువో–అప్పుడే కృతకృత్యుఁడవగుదువు. అనఁగా నీలోకములోఁ బొందఁదగిన పురుషార్థములన్నిటిలో నుత్తమ పురుషార్థమగు మోక్షమును బొందుట కర్హుఁడవగుదువు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమప్రాప్తి యోగో నామ పఞ్చదశోఽధ్యాయః

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి పురుషోత్తమప్రాప్తియోగంబను
పంచదశాధ్యాయము.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భగవద్గీతా గర్భిత భావబోధిని

## షోడశాధ్యాయము

### దైవాసుర సంపద్విభాగ యోగము

**శ్రీభగవానువాచ :**

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞ శ్చస్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥ 1

శ్లో॥ అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్ ॥ 2

శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా ।
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత ! 3

అర్థము :– హే భారత !=ఓయి యర్జునా !, దైవీమ్+సమ్పదమ్+అభిజాతస్య=దేవాంశమునందు (దేవగణమునందు) బుట్టినవానికి, అభయమ్=భయము లేకుండుటయు, సత్త్వసంశుద్ధిః=చిత్తశుద్ధియును, జ్ఞానయోగవ్యవస్థితిః=జ్ఞానయోగమునం దుండుటయును, దానమ్=దానమిచ్చుటయును, దమః+చ=బాహ్యేంద్రియ నిగ్రహమును, యజ్ఞః+చ=యజ్ఞమును, స్వాధ్యాయః=వేదాధ్యయనమును, తపః=తపస్సును, ఆర్జవమ్=ఋజుభావమును, అహింసా=పరపీడావర్జనమును, సత్యమ్=సత్యప్రవర్తనమును, అక్రోధః=క్రోధము లేకుండుటయును, త్యాగః=సర్వసంగపరిత్యాగమును, శాన్తిః = చిత్తశాన్తియును, అపైశునమ్=కొండెము చెప్పకుండుటయు, భూతేషు+దయా=సమస్తప్రాణులయెడలఁ గరుణ గలిగియుండుట, అలోలత్వమ్=విషయములయందు మనస్సు వ్యాపింపకుండుటయు, మార్దవమ్=వాఙ్మాధుర్యమును, హ్రీః=లజ్జయు, అచాపలమ్=చాపల్యము లేకుండుటయు, తేజః=తేజస్సును, క్షమా=ఓర్పును, ధృతిః=ధైర్యమును, శౌచమ్=శుచిత్వమును, అద్రోహః=పరులకు

ద్రోహము చేయకుండుటయు, న+అతిమానితా=గర్వము లేకుండుటయు, భవన్తి= కలుగుచున్నవి.

## సంభాషణ

కృ — ఓయి యర్జునా! క్షరాక్షరు లనుపేరఁ బ్రసిద్ధినొందిన ప్రకృతిపురుషు లకును, పురుషోత్తమునకును గల భేదాభేదము లిట్టివని యెఱుఁగుటయే జ్ఞానమనియు, అట్టి జ్ఞానమే మోక్షమునకు సాధనమనియుఁ జెప్పితినిగదా? (చూ. 5-20). అయితే,

" క. ఇది విజ్ఞానము కృత్యము
తుది విజ్ఞానాత్ముఁడునగు దుర్లభము ప్రశాం
తిదశాహీనాత్ముల క
ష్పదమది మోక్షంబు మమత వాసినఁగల్గున్."

(భార. శాంతి. ౩ ఆ. ౧౬౧)

అనునట్లు, శాంతచిత్తులుగాని వారలకట్లెఱుఁగుటకు సాధారణముగ సాధ్య పడదు. మఱియట్టివారికి సాధ్యపడఁగలదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఈ లోకమునందలి మనుష్యులలో దేవాంశసంభూతులు అనఁగా దేవగణము నందుఁ బుట్టినవారు అనియు, అసురాంశసంభూతులు అనఁగా రాక్షసగణమునందుఁ బుట్టినవారు అనియు, రెండు తెగలుగానుందురు. ఆరెండుతెగలవారిలో మొదటి తెగవారగు దేవాంశసంభూతులుమాత్రమే శాంతచిత్తులు గాఁగలరు గాన నట్టివారికి మాత్రమే అట్టి జ్ఞానము కలుగఁగలదుగాని రెండవ తెగవారగు నసురాంశ సంభూ తుల కట్టిజ్ఞానము గలుగనేరదు. కాన నారెండుతెగలవారి లక్షణము లెట్టివైనవియుఁ దెలిసికొనుట యావశ్యకమైయున్నది. కాఁబట్టి యా రెండుతెగలవారి లక్షణము లెట్టి వైనవియు వివరించి చెప్పుచున్నాను వినుము.

అందు దేవాంశసంభూతుల లక్షణములెట్టివనఁగా, 1 (అభయమ్) వార లితరుల మనసుకుఁగాని దేహమునకుఁగాని బాధగలుగఁజేయఁదగిన పనులఁజేయరు గనుకఁ దమ కితరులవలన బాధగలుగునను భయము లేనివారై యుండుట. 2. (సత్త్వసం శుద్ధిః) వారల మనసెప్పుడును దుర్విషయములయందుఁ బ్రవర్తింపదు గనుక నిర్మల మైనదిగా నుండుట. 3 (జ్ఞానయోగవ్యవస్థితిః) వారలు జ్ఞానమును సంపాదించుటయం దిచ్ఛగలవారు గనుక నందుకుఁ దగిన ప్రయత్నమును జేయుచుండుట. 4 (దానమ్) దానము సేయుట. దానమనఁగా, ద్రవ్యోపపత్తిగలిగి యన్నవస్త్రాదులను ధనధాన్యా దులను విశేషముగ నర్థులకిచ్చుటమాత్రమే కాదుసుమా, మఱియును,

" పేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగినిచ్చు నతఁడును బుణ్య
పురుషులనిచెప్పి రార్యులు బుధవరేణ్య!"

అనునట్లు, తాను పేదవాఁడైనను దన శక్తికొలఁది నర్థులకుఁ బ్రీతితో నిచ్చుటయును దానమనఁబడును. కాన నట్లు ప్రీతితో నర్థుల కుపచరించుట. 5 (దమము) అనఁగా,

" క. శీలంబు మైత్రి కరుణ య
లోలుపభావము తితిక్షలోనగు మునిలో
కాలంబనమగు సద్గుణ
జాలంబు దమంబురూప సంపద యధిపా!" (భార.శాంతి. 3 అ. ౪౦౨)

అనునట్లీగుణములుగలవారై యుండుట. 6 (యజ్ఞము) అనఁగా,

" క. విను, పశుయజ్ఞము హింసన
మనంతఫలదంబు గా దహింక్సతిసహితం
బనఘా! వాఙ్మనసమయమ
మనుయాగం బిచ్చు నవ్యయానందంబున్." (భార. శాంతి. ౪ అ. ౨౦౨)

అనునట్లు, వాఙ్మనో నియమంబులే యజ్ఞములలో ప్రధానములైనవిగాని పశుయజ్ఞములు గావుగనుక నట్టి వాఙ్మనో నియమములుగలిగి యుండుట. 7 (స్వాధ్యాయము) అనఁగా, వేదాధ్యయనంబుఁజేయుచుఁ దదర్థ ప్రతిపాదకంబగు భగవత్స్వరూపమును జపించుట. 8 (తపస్సు) అనఁగా,

" ఆ. అధ్వరంబుకంటె నధికంబు దపము ద
పంబుకంటె మేని క్రన్నదనము
నివురఁజేతగా దహింసయు సత్యవా
క్యంబు దమము దయయుఁ గాని యరయ." (భార. శాంతి. ౨ అ. ౩౭౪)

అనునట్లు దేహ కార్శ్యంబులగు కృచ్ఛ్రచాంద్రాయణాదులుమాత్రమే కావు. మరేమనిన, అహింస, సత్యము, దమము, దయ, అనునవియును దపస్సులనఁబడును గాన నట్టితపస్సులు గలిగియుండుట. 9 (ఆర్జవము) అనఁగా, త్రికరణములయందును జక్కఁదనము గలిగియుండుట. 10 (అహింస) అనఁగా, పరులదేహమునకుఁగాని మనమునకుఁగాని నొప్పిగలుగఁదగిన పనులఁజేయకుండుట. 11 (సత్యము) అనఁగా, అనృతమాడకుండుట. 12 (అక్రోధము) అనఁగా, పరులు దన కపకారము చేసినను

వారలయెడలఁ గోపములేక యుండుట. 13 (త్యాగము) అనఁగా, సర్వసంగ పరిత్యాగము. 14 (శాన్తి) అనఁగా, చిత్తశాన్తిగలిగియుండుట. 15 (అపైశునమ్) అనఁగా, పరులదోషముల నొరులతోఁజెప్పకుండుట. 16 (భూతదయ) అనఁగా, సమస్తప్రాణులయందును గరుణగలిగియుండుట. 17 (అలోలత్వము) లోలత్వమనఁగా నింద్రియ విషయములయందు మనస్సునిలిపి సదా వానిని స్మరించుట. కనుక నట్టిలోలత్వము లేకుండుట. 18 (మార్దవము) వాఙ్మార్దవ్యము గలిగియుండుట. 19 (హ్రీః) అనఁగా, ఏదేనియొక యక్రమమునుజేసినయెడల నందుకై లజ్జించుట. 20 (అచాపలం) అనఁగా, జిహ్వాచాపల్య గుహ్యాచాపల్యములులేకయుండుట. 21 (తేజః) తేజస్సు గలిగియుండుట. 22 (క్షమా) అనఁగా. పరులచేఁజేయఁబడు నపకారమునకు బదులు ప్రత్యపకారము సేయుటకుఁదగిన శక్తిగలవాఁడైయుండియు నట్లుచేయక యోర్చుకొని యుండుట. 23 (ధృతి) ధైర్యము అనఁగా, సత్కార్యములు సేయుటలో నేవైన నంతరాయములును కష్టములును గలిగినయెడల వానికి వెరుకఁ డీ యుకధైర్యమునవలంబించిపూనికెతోఁబనిచేయుట. 24 (శౌచము) శుచిత్వము. అనఁగా, స్నానాద్యనుష్ఠానములయథావిధిగ జరుపుచు శుచిస్ఫూతుఁడైయుండుట. 25 (అద్రోహము) అనఁగా, పరులకుద్రోహమును జేయకయుండుట. 26 (నాతిమానితా) గర్వములేక యుండుట. అను నీ మొదలైన సద్గుణములుగలవారై యుండుట.

శ్లో॥ దమ్భో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్య మేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సమ్పద మాసురీమ్ ॥ 4

అర్థము :— హేపార్థ! = ఓయి యర్జునా!, ఆసురీమ్ + సమ్పదమ్ + అభిజాతస్య = రాక్షసగణమునందుఁ బుట్టినవానికి, దమ్భః = డంబమును, దర్పః = గర్వమును, అతిమానః + చ = దురభిమానమును, క్రోధః = కోపమును, పారుష్యమ్ + ఏవ + చ = వాక్కాఠిన్యమును, అజ్ఞానమ్ + చ = అవివేకమును, (భవన్తి) = కలుగుచున్నవి.

ఇఁకను, రాక్షసగణమునందుఁ బుట్టిన వానిలక్షణము లెట్లుండునవఁగాఁ జెప్పుచున్నానువినుము. 1 (దమ్భము) అనఁగా, ప్రతిష్ఠకొఱకుఁ దనస్థితికమించిన వేషముతోఁబ్రవర్తించుట. 2 (దర్పము) అనఁగా, నేను కులవంతుఁడను, నేను విద్యావంతుఁడను, నేను ధనవంతుఁడను, అనే మొదలైన కారణములచే గర్వించుట. 3 (అభిమానము) అనఁగా, పైఁ జెప్పఁబడిన కుల-ధనవిద్యాదులయందుఁ దనకంటె నధికుఁడు లేడని యహంకరించుట. 4 (క్రోధము) అనఁగా, కోపస్వభావము గలిగియుండుట.

5(పారుష్యము)అనఁగా, పైఁజెప్పఁబడిన కారణములచే గర్వమును దురహంకారమును గలవాఁడై యితరులతో నలక్ష్యముగను, కఠినముగను, మాటలాడుట. 6 (అజ్ఞానమ్) అనఁగా, యుక్తాయుక్తపరిజ్ఞానము లేకపోవుట. ఈ మొదలైనదుర్గుణములు గలవాఁడై యుండును.

శ్లో॥ దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా।
మా శుచ స్సమ్పదం దైవీమభిజాతోఽసి పాణ్డవ!॥ 5

అర్థము :— దైవీసమ్పత్ = దేవగణమునందుఁబుట్టుట, విమోక్షాయ = సంసారబంధ మోక్షముకొఱకును, అసురీ=రాక్షసగణమునందు బుట్టుట, నిబన్ధాయ= సంసారబంధము కొఱకును (అని), మతా = నాయభిప్రాయము, హేపాణ్డవ! = ఓయియర్జునా!, (త్వమ్) = నీవు, దైవీ + సమ్పదమ్ + అభిజాతః= దేవగణమునందుఁ బుట్టినవాఁడవు, అసి=అగుచున్నావు. (తస్మాత్) కాఁబట్టి, మాశుచః=దుఃఖింపకుము.

కనుక, దేవగణమునందుఁబుట్టుట జన్మజన్మకు సద్గుణములు హెచ్చుచువచ్చి తుదకు సంపూర్ణజ్ఞానోదయమై యింతకు ముందు చెప్పఁబడిన ప్రకారము ప్రకృతి పురుషులకును పురుషోత్తమునకును గలభేదాభేదముల నెఱుఁగఁదగిన శక్తిగలిగియందు వలన సంసారబంధవిముక్తి కలుగుటకును రాక్షసగణమునందుఁబుట్టుట జన్మజన్మకు దుర్గుణములు హెచ్చుచు నంతకంతకు మఱిమఱియజ్ఞానముబలపడుచు నీచజన్మల నెత్తుచు సంసారబంధము మఱింతబలపడుటకును గారణమగును. అయితే, ఓయి యర్జునా! నీవీ రెండుగణములలో మొదటిదియు శ్రేష్ఠమైనదియునగు దేవగణము నందే పుట్టినవాఁడవైయున్నావు. కాఁబట్టి నీకు సంసారబంధవిముక్తి కలుగఁగలదు. కాన నీవీ విషయమునుగూర్చి చింతింపఁబనిలేదు.

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు॥ 6

అర్థము :— హేపార్థ! = ఓయియర్జునా!, అస్మిన్ + లోకే = ఈలోకము నందు, దైవః = దేవగణమనియు, ఆసురః + ఏవ + చ = రాక్షసగణమనియును ద్వౌ = రెండువిధములగు, భూతసర్గౌ = భూతములసృష్టులు (కలవు). దైవః = (అందు) దేవగణము, విస్తరశః = సవిస్తారముగా, ప్రోక్తః = చెప్పఁబడినది. ఆసు రమ్ = (ఇఁకను) రాక్షసగణమును (గూర్చి), మే = నావలన, శృణు = వినుము.

ఓయి యర్జునా! ఈప్రపంచమునందలి సమస్తభూతములును దేవగణసంభూతములనియును, రాక్షసగణసంభూతములనియును, రెండువిధములుగా సృజింపఁబడియున్నవి. అందు మొదటిదియగు దేవగణమునందుజన్మించిన మనుష్యుల లక్షణములన్నియు విపులముగా నీకిపుడు చెప్పఁబడినవిగదా? ఇఁకను రాక్షసగణమునందు జన్మించిన మనుష్యులయొక్క లక్షణములెట్టివైనవియుఁగూడ విపులముగఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః।
న శౌచం నాపి చాఽఽచారో న సత్యం తేషు విద్యతే॥ 7

అర్థము:— ఆసురాః+జనాః = రాక్షసగణమునఁబుట్టిన జనులు, ప్రవృత్తిమ్+చ =ప్రవృత్తిమార్గమును(కాని), నివృత్తిమ్+చ=నివృత్తిమార్గమును(కాని), న+విదుః = ఎఱుఁగరు. తేషు = వారియందు, శౌచమ్ = శుచిత్వమును, ఆచారః+చ = (మంచి) నడతయును, సత్యమ్+అపి=సత్యమును, న+విద్యతే= ఉండదు.

ఓయి యర్జునా! ఈలోకమున సంసారబద్ధులగు జనులు తరించుటకుఁ బ్రవృత్తియనియు నివృత్తియనియు రెండుమార్గములు గలవుగదా? అందు ప్రవృత్తిమార్గమనఁగా నింద్రియ మనోనిగ్రహముగలిగి నిష్కామకర్మానుష్ఠానము సేయుటయనియు నివృత్తిమార్గమనఁగా నైష్కర్మ్యసిద్ధినొంది సదా భగవద్ధ్యాన పరాయణులై యుండుటయనియు, ఇంతకుముందు చెప్పియుంటినిగదా! రాక్షసగణములోఁబుట్టిన జనుల కీరెండుమార్గములలో నేదియుఁబట్టువడదు. అనఁగా, వారలుతరించెడుమార్గము నెఱుఁగఁజాలరనుట. ఇదిగాక, వారలయందు శుచిత్వమును, అనఁగా, బాహ్యాభ్యంతర శుద్ధియును, ఆచారమును అనఁగా, మంచి నడవడియును, సత్యప్రవర్తనయును గూడ యుండనేరవు.

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్।
అపరస్పరసమ్భూతం కి మన్య త్కామహైతుకమ్॥ 8

అర్థము:— తే=వారలు:(అసురగణసంభూతులు.), జగత్=(ఈ)ప్రపంచము, అసత్యమ్=వేదాది ప్రమాణములునిజముగాఁగలది కాదనియు, అప్రతిష్ఠమ్=(ఒకనిచే) ప్రతిష్ఠింపఁబడినది అనఁగా, సృజింపఁబడినది కాదనియు, అనీశ్వరమ్ = ఈశ్వరుఁడు (నియామకుఁడు) లేనిదనియు, ఆహుః=చెప్పుదురు. (కించ)=(మఱియును), అపరస్పర

సముద్భూతమ్=స్త్రీపురుషులయొక్క పరస్పర సంయోగము వలనఁబుట్టినది, అన్యత్ + కిమ్=మఱియొకటియేది (కలదు)? (తస్మాత్)=కాఁబట్టి, కామహైతుకమ్=కామమే హేతువుగాఁగలది (అనియు), (ఆహుః)=చెప్పుదురు.

ఓయి యర్జునా! అసురగణసంభూతులకుఁ బ్రవృత్తి నివృత్తి మార్గములలో నేదియుఁ బట్టుపడదని చెప్పితిని గదా? అట్లుచెప్పుటకుఁ గారణ మేమనగా, వారలీ ప్రపంచమునకు సృష్టికర్త యొకఁడున్నాఁడనియును - వాని నెఱుఁగుటయే జ్ఞానమనియును - అట్టిజ్ఞానము గలవాఁడే కృతార్థుఁడనియును - ఈ మొదలగు వేదవాక్యము లబద్ధములనియు, ఈజగత్తునకు సృష్టికర్తయే లేడనియు, ఈజగత్తు తనంతటఁ గలిగినదనియు, స్త్రీపురుషులకుఁ గామోద్రేకముచేఁ గలిగెడు పరస్పర సంయోగము లేక యేజంతువును ఉత్పత్తి కానేరదు. గనుక నట్టి సంయోగమే యీజగదుత్పత్తికిఁ గారణమనియు, ఈ మొదలగు సంగతులఁ జెప్పుచు నిరీశ్వరవాదము సేయుదురు. కాన నిట్టి నాస్తిక్యులు మోక్షమనునది యొకటి కలదని యెఱుఁగరు. కనుక నట్టిమోక్షమును బొందవలెననియెడు నపేక్ష వారలకుఁ గలుగనేరదు. అట్టియపేక్ష యెప్పుడు కలుగకపోయెనో అప్పుడు దానిం బొందుటకుఁ దగిన ప్రవృత్తి నివృత్తిమార్గములను వారలెట్లెఱుఁగఁగలరు? ఎఱుఁగఁజాలరుగదా?

శ్లో॥ ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ 9

అర్థము :— ఏతామ్ + దృష్టిమ్=ఇటువంటిదృష్టిని (అభిప్రాయమును), అవష్టభ్య=అవలంబించి, నష్టాత్మానః=చెడుమనస్సుగలవారలును, అల్పబుద్ధయః=స్వల్పబుద్ధిగలవారలునై, జగతః = ప్రపంచమునకు, క్షయాయ = నాశముగలుగఁజేయుటకొఱకును, అహితాః=శత్రువులుగను, ఉగ్రకర్మాణః=క్రూరకర్మలఁజేయువారుగను, ప్రభవన్తి=పుట్టుచున్నారు.

కాఁబట్టి, ఇట్టి దురభిప్రాయముగల వీరలు నష్టాత్ములును, అనఁగా, చెడ్డ మనస్సుగలవారలును, స్వల్పబుద్ధి గలవారలునై యుందురు. ఇట్టి వీరలీజగత్తున కీశ్వరుఁడే లేడని తలఁచెడువారు గనుక నీలోకమున జనులాచరించెడు సుకృత దుష్కృతములకుఁ దగినట్లు మంచి - చెడు - ఫలము లుండవని నమ్మెదురు గనుక నెట్టి దుష్కృత్యములఁ జేయుటకైనను దెగింతురు. అనఁగా, కామోద్రేకముగలవారైనపుడు "కంటికింపైనకాంతను గవయవలయు" అనే మొదలైన తమకుఁదగిన ప్రమాణముల నాధారముగఁ జేసికొని తల్లి - తోఁబుట్టువు - అనియెడు వావివరుసలులేక ప్రవర్తించుటయు

స్వకార్యనిర్వహణార్థమై పరుల కెట్టి బాధకరములైన పనులనైనను జేయుటయు, ఈమొదలైన ఘోరకృత్యములఁ జేయుటకు జంకరు. మఱియు నిట్టివారలు తాము చెడుటయగాక, "తాఁజెడ్డ కోతి వనమెల్లఁ జెఱచు" అనులోకోక్తి ప్రకారముగ నితరులకును నిట్టినాస్తిక్య మతమునుగఱపి వారలఁగూడఁదమతోఁపాటునష్టాత్ములఁ జేయుదురు. కాన నట్టివార లీజగత్తునకు శత్రువులుగ నేర్పడి యీజగత్తును నాశము చేయుటకొఱకు జన్మించినవారగుదురు.

శ్లో॥ కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భ మాన మదాన్వితాః ।
మోహాద్ గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥ 10

అర్థము :— (తే) = వారలు. దమ్భమానమదాన్వితాః = డంబము - దురభిమానము-గర్వము-అనునీదుర్గుణములతోఁ గూడుకొన్నవారై, దుష్పూరమ్=నిండింపఁ గూడని (మితిలేని). కామమ్=కోరికను (ఆశను), ఆశ్రిత్య=అవలంబించి, మోహాత్= అవివేకమువలన, అసద్గ్రాహాన్=సత్పురుషులు కానివారలచే నవలంబింపఁబడఁదగిన విషయములను, గృహీత్వా=గ్రహించి (అవలంబించి), అశుచివ్రతాః+(సన్తః)=నీచవృత్తులుగలవారై, ప్రవర్తన్తే=ప్రవర్తింపుదురు.

మఱియు నట్టివారలేమి చేయుదురనఁగా దంభమానమదయుక్తులై, అనఁగా, తనస్థితికి మించిన వేషభాషలును - దురభిమానమును — గర్వమును గలవారలై మితిలేని కోరికలఁ గోరుచుందురు. అనఁగా, "ఆశకు మేరలేదు కనకాదిసమాన ధనంబు గూడినన్" అనునట్లు, తమకు ధనకనకవస్తువాహనాదు లెంత లభించినను వానితోఁ దృప్తినొందక యింకను సంపాదింపవలె ననెడు కోరిక గలవారై యుందురు. ఇట్టి దురాశను దృప్తినొందింప నెట్టిపనులనైనఁ జేయబూనిన వారై యసద్గ్రాహ్యంబులగు నీచవృత్తులం బ్రవర్తింతురు. అసద్గ్రాహ్యంబులనఁగా, సత్పురుషులచే విసర్జింపఁబడునవియు, అసత్పురుషులచే నవలంబింపఁబడునవియు నింద్యంబులునగు నీచపుపనులు. అవి యెట్టివనఁగా, ఈలోకమునఁ గొందఱు రూపవతులగు భార్యాపుత్రికాది స్వకీయ జనంబుల నొరులకుఁ దార్చియైన ధనకనకవస్తువాహనాదుల నార్జింపఁజూచుటయు, అట్లార్జింపఁబడిన సంపత్తుచే గర్వించి తమకంటె శ్రేష్ఠులు లేరని విఱ్ఱవీగుచుండుటయు వినుచును గనుచు నున్నాముగదా! ఇట్లే తక్కిన యనేకవిధములగు నీచవృత్తులు నూహింపఁదగియున్నవి.

శ్లో॥ చిన్తా మపరిమేయాంచ ప్రళయాన్తా ముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః ॥ 11

అర్థము :— (తే) = వారు, కామోపభోగపరమాః = కోరినదాని ననుభవించుటయందే యాసక్తిగలవారును, ఏతావత్ + ఇతి + నిశ్చితాః = అట్లనుభవించుట కంటె మేలైన పురుషార్థము వేఱొండు లేదని నిశ్చయించినవారును నై, అపరిమేయామ్ = పరిమితిలేనిదియు, ప్రళయాన్తామ్ + చ = మరణకాలమువఱకు విడువనిదియు నగు, చిన్తామ్ = చింతను, ఉపాశ్రితాః = ఆశ్రయించినవారు (అగుదురు).

ఓయియర్జునా! ఇట్లు వీరు తమ కోరికలం బడయుటకుం గా నెట్టి నీచవృత్తుల నైన నవలంబించుటకుం గారణ మేమనంగాఁ జెప్పుచున్నాను వినుము. వీరలు, ఈ ప్రపంచమునకు సృష్టిస్థితిలయకర్తయగు నీశ్వరుఁడు లేఁడనియు, పరలోకమనునది లేదనియు నెంచియుండెడువారు గనుక నీప్రపంచమునందు సజీవులైయుండు వఱకు నెయ్యవి వాంఛితములో అయ్యవి యనుభవించుటకంటె మేలైన పురుషార్థము వేఱొండు లేదనియెడు నిశ్చయబుద్ధిగలవారై యుందురు. కాఁబట్టి యట్టి వాంఛితముల నెవ్విధంబుననైనం బడయఁ జూతురు. అట్లగుటం జేసి వార లెల్లప్పుడును దత్సంబంధమైన చింత యందే కలిగియుందురు. ఆచింతయన్ననో కొంత కాలముండి పిమ్మట విడుచునది కాదు. మఱేమనిన, మరణకాలపర్యంతముండునది. అదెట్లనిన,

"తే. సొమ్ము గోరినయంతన సుఖముగలుగ
దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగెనేని ననేక చింతల నొనర్చుఁ
జెడుటచావుతోఁ దుల్యముయ్యెడును లేల." (భార. శాంతి. ౪ఆ. ౪౩)

అనునట్లు, కోరినయర్థంబులు లభించునంతవఱకు నొకచింతయు, అవిలభించిన యెడల వానిం గాపాడుకొనుటయందును వృద్ధిబొందించుటయందును ననేకవిధములగు చింతలును, అవినష్టమైనయెడల నన్నిటికంటె గొప్పచింతయు, ఇట్లెల్లప్పుడును వారి మనస్సు మరణకాలమువఱకు నుడుగని చింతాపరంపరలచేఁ బీడింపఁబడుచుండును.

శ్లో॥ ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసఞ్చయాన్ ॥ 12

అర్థము :— ఆశాపాశశతైః = అనేకవిధములగు నాశాపాశములచేత, బద్ధాః = కట్టుపడినవారలును, కామక్రోధపరాయణాః = కామక్రోధములే ప్రధానగుణములు గాఁ గలవారలునై, కామభోగార్థమ్ = ఈప్సితముల ననుభవించుటకొఱకు (కావలసిన), అర్థసఞ్చయాన్ = ద్రవ్యములను, అన్యాయేన = అక్రమమైనమార్గము చేతనైనను, ఈహన్తే = (సంపాదింప) కోరుదురు.

ఇట్లనేక విధములగు నాశాపాశములచేఁ గట్టువడి యట్టి యాశాపాశములచే నుత్పన్నములైన కామక్రోధాది దుర్గుణంబులు గలవారలై తాము కోరినవియెల్ల ననుభవించుటయే ప్రధానపురుషార్థముగా నెంచి వానిఁబడయుటకుఁ దగిన ద్రవ్యోపపత్తి యుండినయెడల సరేకదా, లేకపోయినయెడల నాద్రవ్యము నేవిధముగానైనను సరే, అనఁగా నెంతయన్యాయ మార్గముచేతనైనను సరే యార్జింపఁజూతురు. అదెట్లనఁగా పరులను మోసపుచ్చుట; నమ్మకద్రోహము, అనఁగా, పరులు దాచఁబెట్టిన ద్రవ్యము నపహరించుట, అనేకులవద్ద నప్పులు తీసికొని యాద్రవ్యమంతయుఁ దాచబెట్టి వ్యాపారములో నష్టము సంభవించినదని మిషకల్పించి యామిషమీఁద నాద్రవ్యము నెగవేయుట; అన్యాయపు వడ్డికి అప్పులిచ్చి యొకటికి పదిఁతలుగ వారివద్ద పుచ్చుకొనుట, తప్పుసృష్టనలు చేయుట; కూలికి తప్పుప్రమాణములు చేయుట; తప్పుసాక్ష్యములు చెప్పుట; కించి దధికారము గలవారలు తమ యధికారమును దుర్వినియోగపఱచి లంచములు మొదలగునవి పుచ్చుకొనుట; జూదమాడుట; ఇవియేవియుఁ జేయలేని వారలు చోరత్వముచేఁ బరుల ద్రవ్యము నపహరించుట; ఈ మొదలైన యనేకవిధములగు నన్యాయమార్గములచే ద్రవ్యము నార్జింపఁజూతురు. ఓయి యర్జునా! వీరలిట్లిన్ని విధములగు నన్యాయమార్గములచే ద్రవ్యముల నార్జించియు నిట్లుచేసితిమిగదాయని యేమైన సంకోచింతురనుకొందువేమో, అట్లెంతిమాత్రము దలఁపరు సరేకదా, అందుకు బదులుగాఁ దామిట్టిఘన కార్యములఁ జేసితిమనియొరులతోఁ బ్రతిష్ఠకొఱకుఁ జెప్పుకొనుచు నానందింతురు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ఇద మద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథం।
ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్॥　　13

అర్థము:— అద్య=ఇప్పుడు, ఇదమ్=ఇది (ఈద్రవ్యము), మయా+లబ్ధమ్=నాచేఁ బొందఁబడినది, ఇమమ్+మనోరథమ్=ఈకోరికను, ప్రాప్స్యే=పొందఁబోవుచున్నాను, ఇదమ్+అస్తి=(నాకిప్పుడు) ఈ ద్రవ్యమున్నది, ఇదమ్+ధనమ్+అపి=ఈధనము గూడ, పునః=మరల (ఇఁకను), మే=నాకు, భవిష్యతి=రాఁబోవుచున్నది

(వాఁడు నావద్దదాచఁబెట్టిన పదివేల రూపాయలును నావద్ద దాచఁబెట్టినదిలేదని యధికార్ల యెదుటఁ దప్పుసాక్ష్యము పలికించుటచే రూపించితినిగదా) కనుక నిపుడీద్రవ్యము నాకు లభించినది యనియు; (ఇదివరలో నాకొమారుఁడి యొక్కయు కొమార్తెయొక్కయు వివాహ కార్యములు విశేషద్రవ్యము వెత్సపెట్టి

నలుగురిలో నాకుఁ బ్రతిష్ఠగలుగునట్లు ఘనముగా జరిగించవలయునని యెంచియుంటిని గదా) ఇపుడీద్రవ్యమును వెత్సపెట్టి యీనామనోరథమును నెరవేర్చికొనఁబోవుచున్నాను, అనియు, ఇపుడు నాకుండెడు చరస్థిరాస్తులు చేరి రమారమి లక్షరూపాయలవఱకున్నది గదా, ఇదిగాక వ్యాపారమిషమీద లోకులవద్ద రమారమి రెండు లక్షల రూపాయల వఱకు అప్పు తీసియున్నానుగదా, ఈద్రవ్యమంతయు దాఁచి పెట్టి వ్యాపారములో గొప్ప నష్టముసంభవించినదనే మిషమీఁద నెగవేయఁ దలఁచి యున్నాను గనుక నాద్రవ్యముగూడ నాకు రాఁబోవుచున్నది గదా, అప్పటికి, ఇదియు నదియుఁ జేరి మూఁడులక్షలరూపాయల యాస్తి నా కేర్పడఁబోవుచున్నది గదా, యనియు.

శ్లో॥ అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహంబలవా న్సుఖీ॥ 14

అర్థము :— అసౌశత్రుః=ఈశత్రువు, మయా+హతః=నాచే హతము చేయఁబడినాఁడు, అపరాన్+అపి=తక్కినవానినిగూడ, హనిష్యే+చ=హతము చేసెదను, అహమ్+ఈశ్వరః=నేను ప్రభువును, అహమ్+భోగీ=నేను భోగిని, అహమ్=నేను, సిద్ధః=తలచిన కార్యమును సిద్ధిఁబొందింపఁగలవాఁడను, బలవాన్=బలవంతుఁడను, సుఖీ=సుఖిని.

నాకిదివఱలో నిరువురు శత్రువులుండిరి. వారలెప్పుడును నాకుఁ బ్రతిఘటించి నాపనులకు విఘాతములు గలుగఁజేయుచుందురు. ఆయిరువురిలో నొకనిపై, దప్పు సృష్టసఁ జేయించి వాని చరస్థిరరూపకమగు సర్వస్వమును గోలుపోవునట్లుచేసి హతమార్చితిని. నాఁడికఁ దలయెత్తలేడుగాన నాజోలికిఁ రాఁజాలఁడు. తక్కిన వానిని గూడ నిట్లే చేసినపిమ్మట నాప్రయత్నములను భంగపఱచెడు వారెవరునుండరు. కానఁ నేఁ బట్టినది బంగారమగును. అనఁగా, నేఁ దలంచిన కార్యము సిద్ధించక మానదు. అందువలన నేను బలవంతుఁడనై ప్రభువువలె సమస్తభోగములను ననుభవింపుచు సుఖింపఁగలను. అనియును:

శ్లో॥ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥ 15

అర్థము :— (అహమ్)=నేను, ఆఢ్యః=ధనాఢ్యుఁడను, అభిజనవాన్=గొప్ప వంశమునఁ బుట్టినవాఁడను, అస్మి=అయ్యున్నాను, మయా+సదృశః=నాతో సమానుఁడు, అన్యః+కః+అస్తి=అన్యుఁడెవఁడు ?, యక్ష్యే=యజ్ఞముఁజేసెదను.

దాస్యామి = దానమిచ్చెదను, మోదిష్యే = సంతోషించెదను, ఇతి = అని. అజ్ఞాన విమోహితాః = అవివేకముచే మోహితులైనవారును.

నేను గొప్పవంశమునఁ బుట్టినవాఁడనుగదా, నా తాతలును దండ్రులు ననేక గొప్ప కార్యములను జేసి మిక్కిలి ప్రసిద్ధికెక్కినవారై యున్నారుగదా, నాకిప్పుడు వారికంటె నెక్కుడుగ ద్రవ్యమున్నదిగదా, ఇప్పుడు ద్రవ్యోపపత్తియందు నాతో సమానుఁ డెవఁడును లేఁడుగదా, కాఁబట్టి యింతకుముందు నాతాతలును దండ్రులును మఱియు నితరులగు ననేకులును జేసియుండు యజ్ఞములు మొదలగు వానికంటె నెక్కుడగు యజ్ఞములు సంతర్పణలు మొదలగు సత్కార్యములఁ జేసెదను. గొప్ప సంభావనలు మొదలగునవి యిచ్చెదను. ఇట్లు చేయుటవలన నాకు మిక్కిలి ఖ్యాతిగలుగఁగలదు. అట్టి ఖ్యాతినొంది మిగుల సంతోషించఁగలనుగదా, అనే మొదలైన గొంతెమ కోరికలఁగోరుచు మూఢాత్ములై యుందురు.

శ్లో॥ అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥ 16

అర్థము :— అనేకచిత్తవిభ్రాన్తాః = అనేకవిధములగు మనోవికారములుగలవారును, మోహజాలసమావృతాః = మోహమనెడి వలలోఁ జిక్కినవారును, కామభోగేషు = ఈప్సితముల ననుభవించుటయందు. ప్రసక్తాః = మిక్కిలియాసక్తి గలవారునునై, అశుచౌ + నరకే = అసహ్యమగు నరకమునందు, పతన్తి = పడుచున్నారు.

ఇట్లనేకవిధములగు మనోవికారములుగలవారలై "ఇంద్రియంబులచేతఁ బట్టువడి దురవగాహంబులైన కామక్రోధ లోభ మోహమద మత్సరంబులను పాశంబులం గట్టువడి విడివడ సమర్థుండుగాక ప్రాణంబులకంటె మధురాయమానయైన తృష్ణకు లోనై భృత్యతస్కర వణిక్కర్షంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పదార్థంబుల నర్థించుచు, రహస్యసంభోగచాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికా లవిత్రంబులైన కళత్రంబులను, మహనీయ మంజుల మధురాలాపంబులుగలిగి వశులైన శిశువులను, శీలవయోరూపధన్యలగు కన్యలను వినయ వివేకవిద్యాలంకారులైన కుమారులను, కామితఫలప్రదాతలగు భ్రాతలను మమత్వప్రేమదైన్యజనకులైన జననీజనకులను, సకల సౌజన్యసింధువులైన బంధువులను, ధనకనకవస్తువాహన సుందరంబులైన మందిరంబులను, సుకరంబులైన పశుభృత్యనికరంబులను, వంశపరంపరాయత్తంబులైన విత్తంబులను, వర్జింపలేక సంసారంబు నిర్జించు నుపాయంబుఁగానక తంతు వర్గంబున

నిర్గమద్వారశూన్యంబైన మందిరంబుఁజేసి చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబుచందంబున గృహస్థుండు స్వయం కృతకర్మబద్ధుండై శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండై నిజకుటుంబపోషణ పారవశ్యంబున విరక్తిమార్గంబుఁ దెలియనేరక స్వకీయ పరకీయ భిన్నభావంబున నంధకారంబునం బ్రవేశించు" (భాగ ౭. ౧-౨౩.) అని పరమభాగవతోత్తముండగు ప్రహ్లాదుండు మున్ను దన సంగడికాండ్రకు హితోపదేశము సేయుకాలంబునఁ జెప్పియున్నట్లు, మోహమనెడు వలలోఁ జిక్కువడినవారును, ఈప్సితముల ననుభవించుటయం దత్యాసక్తిగలవారునై ఘోరనరకమునఁబడుదురు.

అర్జు — అయ్యా! ఇపుడు నీవు చెప్పిన దుర్లక్షణములుగల వారలలో ననేకు లనేకవిధములగు సత్కర్మల నాచరించుచున్నారుగదా, అనఁగా, యజ్ఞములు - సంతర్పణలు మొదలగు వానింజేయుటయు, సత్రములు, చావిళ్లు, మొదలగువానిం గట్టించుటయు. దేవాలయములు, వనములు, తటాకములు, మొదలగు వానిం బ్రతిష్ఠించుటయు, ఈమొదలగు ననేకవిధ సత్కర్మల నాచరించుటను జూచుచున్నాముగదా? అట్టివారలచే నాచరింపఁబడు నాసత్కార్యము లెవ్విధంబున నార్జింపఁబడిన ద్రవ్యముచే నెట్టియుద్దేశ్యముతోఁ జేయఁబడినవైనను సరే పరులసౌఖ్యమున కుపయోగింపుచునే యున్నవిగదా, అట్లుండ నాసత్కర్మల నాచరించినవారలందుల ఫలములకుఁ బాత్రులుగాక తక్కినవారితోపాటు నరకమునకుఁ బాత్రులగుటకుఁ గారణమేమి?

శ్లో॥ ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమాన మదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనావిధి పూర్వకమ్॥ 17

అర్థము :- తే = వారలు, ఆత్మసమ్భావితాః = తమ్ముఁదామే పొగడికొనెడు వారును స్తబ్ధాః = వినయహీనులును, ధనమానమదాన్వితాః = ధనమువలనఁగలిగిన దురభిమానము, గర్వములతోగూడిన వారునునై, దమ్భేన = డంబముతో, అవిధిపూర్వకమ్ = శాస్త్రోక్తవిధుల ననుసరింపక, నామయజ్ఞైః + యజన్తే = నామకార్థములగు యజ్ఞములజేయుదురు.

కృ — ఓయి యర్జునా! నీవు చెప్పినట్టి వారలలో ననేకు లిట్టి సత్కర్మల నాచరింపుచుండుట నిజమే. అయినను, వారలకట్టి సత్కర్మలవలన ప్రయోజనమేమియుఁ గలుగనేరదు. కారణమేమనఁగా జెప్పుచున్నాను వినుము. వారలు ధనమదాంధులై తమకంటె శ్రేష్ఠులు లేరని గర్వించి తమ్ముఁదామే పొగడికొనుచు,

"ఆ. పోగులుంగరములు పుట్టంబు విడియంబు
కాయపుష్టిమిగులఁ గలిగియున్న
హీనబుద్ధినైన నిందురమ్మందురు
విశ్వదాభిరామ వినరవేమ"

అనునట్లు తమతోపాటు వస్త్రాభరణాదులును బొజ్జకడుపులును గలిగియుండు వేషధారు లెంత యల్పబుద్ధిగలవారైనను సరే, అట్టివారల బహూకరింపుచు,

"ఆ. మాసినతలతోడ మలినవస్త్రముతోడ
నొడలిజిడ్డుతోడ నుండెనేని
యాత్మవేదియైన నట్టెపొమ్మందురు
విశ్వదాభిరామ వినరవేమ."

అనునట్లు అట్టి వేషధారులు గాని యితరు లెట్టియోగ్యతకలవారలైనను సరే వారల యెడల వినయవిహీనులై యలక్ష్యభావమును జూపుదురు. కాన నట్టివారలు యజ్ఞములు — దానములు — మొదలగు నెట్టిసత్కార్యములఁ జేసినను, అవియన్నియుఁ గీర్తిప్రతిష్ఠలకొఱకు డంబముతోఁ జేయఁబడునవియే గాని, పారమార్థికచింతతో శాస్త్రోక్తవిధులననుసరించి చేయఁబడునవి కావు. కాన నట్టి సత్కార్యములతో వారి కేమియుఁ బ్రయోజనముండనేరదు.

ఇఁకను విధ్యుక్తప్రకారముగఁ జేయఁబడు సత్కార్యము లెట్టివనఁగా వేదశాస్త్ర పురాణాదులలోఁ జెప్పఁబడియుండు విధుల ననుసరించి చేయఁబడునవి. ఆవేదశాస్త్రపురాణాదుల యుద్దేశ్యమేమనఁగాఁ జెప్పుచున్నాను వినుము. "న్యాయపథము దప్పకయ ధనంబు గూర్పవలయు" ప్రతిపురుషుఁడును దనకులాచారధర్మముల ననుసరించి న్యాయమార్గము దప్పక ద్రవ్యము నార్జింపవలయును. "కూర్చినయర్థంబుఁ బాత్రమెఱిఁగి యిడఁగవలయును దానును గుడువవలయు" అట్లార్జింపఁబడిన ద్రవ్యమును పాత్రాపాత్రముల నెఱిఁగి దానము సేయవలయును తాము ననుభవింపవలయును. అని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. అట్టివార లార్జించెడు ద్రవ్యమన్ననో, ఇంతకుముందు నేఁ జెప్పినప్రకార మన్యాయమార్గముచేత సంపాదింపబడినదిగా నుండుచున్నది. ఇంతియ గాక యట్లన్యాయముగ నార్జింపఁబడిన ద్రవ్యముచే మదించినవారును దురభిమానగ్రస్తులై తమకంటె శ్రేష్ఠులు లేరని గర్వించి విఱ్ఱవీగుచుఁ దమ్ముఁ దాము పొగడికొనుచుండుటయ గాక, ఇతరు లెట్టి యోగ్యతగలవారైనను సరే వారల నలక్ష్యము సేయుదురు కనుక నట్టివార లట్టి యన్యాయార్జితవిత్తముతో యజ్ఞములు దానములు మొదలగు నెట్టిసత్కార్యముల నెన్ని చేసినను, అవియన్నియు

డంబముతోఁ గీర్తిప్రతిష్ఠలకొఱకు చేయఁబడునవియే గాని పారమార్థిక చింతతోఁ జేయబడినవి కావు. కాన నట్టి కార్యముల వలన వారలకేమియుఁ బ్రయోజనముండదు. అయితే, సత్కర్మల నాచరించెడువారలకు వారివారి కర్మల కనుగుణ్యములగు సద్గతులు గలుగునని వేదములు, శాస్త్రములు, పురాణములు, దెలియఁజేయుచుండఁగా వీరలాచరించెడు సత్కర్మలు నిష్ప్రయోజనములగుటకుఁ గారణమేమని యోచించెదవు గాఁబోలును, అందుకుఁ గారణమును జెప్పుచున్నాను వినుము.

వేదశాస్త్రపురాణాదుల యందలి యుద్దేశ్యమేమనఁగా,

"క. ధనమించుకేని ధర్మ
బునఁ బడసినయట్టిదైన భూవర పాత్రం
బున నిడిన నది మహాఫల
జనకంబగునండ్రు వేదసంవేదిజనుల్

ఆ. ధర్మబద్ధమైన ధనముపాతికయేని
బహుళఫలమునిచ్చుఁ బాపవృత్తి
నార్జితంబుకోటి యైననిష్ఫలమండ్రు
దానశాస్త్రవిదులు మానవేంద్ర." (భార. శాంతి. ౫ ఆ.)

అనునట్లు, ధనముకొంచమైననుసరే ధర్మమార్గముచే సంపాదింపబడినదిగానుండి దానితో సత్పాత్రదానము చేసినయెడల నది

"ఆ. చిత్తశుద్ధిగల్గి చేసినపుణ్యంబు
కొంచెమైన నదియు గొదువకాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకునెంత
విశ్వదాభిరామ వినరవేమ."

అనునట్లు, మహా గొప్పఫలము నిచ్చుననియు, అట్లుగాక యన్యాయమార్గముచే నార్జింపఁబడిన ద్రవ్యము కోటియైనసరే దానితో నెట్టి గొప్ప సత్కర్మల నాచరించినను వానివలన నేమియుఁ బ్రయోజనము లేదనియు నెఱుంగుము. కనుక నిపుడు నేఁజెప్పిన యసురాంశసంభూతులగువార లన్యాయార్జితవిత్తముచేఁ గీర్తిప్రతిష్ఠల కొఱకు డంబముతోఁజేసెడు సత్కర్మలన్నియు నవిధిపూర్వకముగఁ జేయఁబడినవి, అనఁగా, శాస్త్రసమ్మతములుగానివి యగుచున్నవి. కాఁబట్టి యట్టికర్మలవలన వారల కేలాటి ప్రయోజనమును గలుగనేరదు. ఇందుకు నిదర్శనముగ నొక కథగలదు దానిం జెప్పెద నాకర్ణింపుము:

పూర్వకాలంబున నొకఁ డొకరాజకీయంబగు నుద్యోగంబుననుండి గొప్పయధికారమును వహించి యాయధికారంబును దుర్వినియోగపఱచి తన్మూలకంబుగా విశేషద్రవ్య మార్జించి యాద్రవ్యమును వెచ్చపెట్టి కీర్తిప్రతిష్ఠలకొఱకు ననేకములగు సత్రములు – చావిళ్ళు – వనములు – తటాకములు – మొదలగువానిని నిర్మించుటయగాక, అన్నదానాద్యనేకవిధములగు దానములఁగూడఁ జేసెను. ఇట్లుండి కొంతకాలమున కాయుద్యోగంబునుండి తొలఁగింపఁబడి యదివఱకుఁ దానార్జించిన ద్రవ్యమంతయుఁ బైఁజెప్పఁబడిన ప్రకారముగా వెచ్చపెట్టఁబడినందున నిర్ధనుఁడై తన దారపుత్రాదుల పోషణ మొదలగు నిత్యకృత్యము జరుపుకొనుటయే మిగులఁ గష్టతరముగా నేర్పడియెను. అట్టి కాలంబున నాయూరికి సమీపంబున నుండు మఱియొకయూరిలో నొక గొప్పవర్తకుఁడు న్యాయపథముచే విశేషద్రవ్యము నార్జించి యాద్రవ్యముతోఁ దాననేక ధర్మముల జేయుటయగాక యితరు లెవరైనఁ దాముచేసిన ధర్మములను విక్రయింపఁ దలఁచినయెడల నట్టిధర్మంబులఁ గూడఁ గొనసాగెను. ఈ సంగతి విని యానిరుద్యోగస్థుఁడు తా నధికారదశలో నుండునపు డొనర్చిన యనేకధర్మములలో నొకటిని నావర్తకునికి విక్రయించి యాధనముచేఁ దన నిత్యకృత్యము జరుపుకొనఁదలఁచి యావర్తకునియూరు తనయూరికి నొక్కపూట ప్రయాణ దూరములో నున్నందున నొకపూటకుఁ జనబత్యమునకుఁ దగినంతమాత్రము బియ్యము, ఉప్పు, మిరపకాయ, చింతపండు మొదలగుసామగ్రిఁగొని యొకనాఁటి ప్రాతఃకాలంబున బైలువెడలిపోవుచు మధ్యాహ్నకాలమగునప్పటికిఁ వాడుఁబోవుచుండెడు నడవియందు నిర్మలోదకముతోఁ బ్రవహించుచుండు నొకవాగువద్దకిఁజేరి యప్పటికి మిగుల క్షుత్పిపాసాపీడితుఁడగుటంజేసి యచట నిలిచి స్నానసంధ్యాద్యనుష్ఠానంబులం దీర్చికొని దన చేతనుండెడు బియ్యమును బచనముచేసి ఉప్పు మిరపకాయ చింతపండు నొకబండమీద నూరి పచ్చడిచేసికొని దానితో నాయన్నమును భక్షింపఁబోవుచుండెను. ఇంతలో నెండదెబ్బదగిలి క్షుత్పిపాసాపీడితుడై మిగులశ్రమపడుచు నామార్గమునఁ బోవుచుండెడు నొకవృద్ధుఁడదిచూచి యాతనివద్దకుఁబోయి తనబాధనుదెలిపి తనకందుఁ గొంతయన్నం బొసంగి కాపాడవలయునని యాచించెను. అప్పుడతఁడాయన్నము దనకే చాలీచాలకయుండినను, ఆవృద్ధుఁడు పడుచుండెడు క్షుద్బాధను జూచి దయార్ద్రహృదయుఁడై తానువండినయన్నము నాఱు పిడచలుగఁజేసియందు మూడు పిడచల నావృద్ధునకిచ్చి తక్కిన మూడుపిడచలను దానుభక్షించెను. ఆవృద్ధుఁడా మూడుపిడచలయన్నము దిని యావాగులోని నిర్మలోదకమును ద్రావి క్షుత్పిపాసలఁ దీర్చికొని కొంతసేపాక వృక్షముక్రింద విశ్రమించి సేదఁదేఱినవాఁడై తన కన్నమిడిన

వానిం దీవించి లేచిపోయెను. పిమ్మట నానిరుద్యోగియు నచటినుండి బైలుదేఱి సాయంకాలమున కావర్తకుఁడుండు యూరుచేఱి యావర్తకునికిఁ దావచ్చిన కారణమును దెలిపెను. అందు కావర్తకుఁడు సంతసించినవాఁడై యారాత్రియతని యన్నపానాదులం దృప్తుంగావించి మఱునాఁడుదయమున నొకత్రాసుం దెచ్చి యానిరుద్యోగికిఁ జూపి, "అయ్యా నీవు విక్రయింపఁ దలఁచిన ధర్మమేదియో దానినొక తాటియాకు ముక్కమీఁద వ్రాసి యీత్రాసునం దొకవైపున నుంచుము. తక్కినవైపున నేను ధనమునుంచుచు వచ్చెదను. ఇట్లుంచుచుండ రాఁగ రాఁగ నాధర్మముయొక్క విలువకుఁ దగినంత ధనమెప్పుడా రెండవవైపునఁబడుచున్నదో అప్పుడా తాటియాకుచీటి యుండు తక్కెడలేచి యాధనముండు తక్కెడతో సమముగాఁ దూఁగును, కాన నప్పుడా ధనమును నీవును, తాటియాకుచీటిని నేనును, తీసికొందము" అని చెప్పెను. అందుకతఁడు హర్షించి తానొకయూర వేయివరహాలు వెచ్చపెట్టి సత్రము గట్టించిన ధర్మమును విక్రయించఁదలఁచి యాధర్మము నొకతాటియాకు ముక్కపైని వ్రాసి యాతక్కెడయం దొకవైపుననుంచెను. అదియొక వరహాయెత్తైన నుండకపోయెను. దాని నావర్తకుఁడు చూచి యీధర్మమున నేదేని యొకలోపముండవచ్చును గాన నిదియొక్క వరహాకైనను దూఁగకున్నది. కాఁబట్టి దీనిని వదలి మఱియొకధర్మమును విక్రయించుమనెను. అందుపైని యానిరుద్యోగి రెండువేలువరహాలు వెచ్చపెట్టిచేసిన మఱియొకధర్మమును మఱియొక తాటియాకుముక్కమీఁద వ్రాసి యుంచెను. అదియును మొదటిదానివలెనె తూఁగకుండెను. ఇట్లతఁడు నెఱపిన యన్నిధర్మములలో నొక్కొక్కటిగ వ్రాసియుంచఁగా వానిలో నేదియుఁ దూఁగదయ్యె. అందుకతఁడాశ్చర్యపడుచుండఁగా నావర్తకుఁడతనిం జూచి "అయ్యా! ఈధర్మంబులన్నియు నెట్లాచరింపఁబడె"నని యడిగి యతనివలన నాధర్మంబు లాచరింపఁబడిన విధానమంతయుఁ దెలిసికొన్నవాఁడై "అయ్యా! ఈధర్మములన్నియు నన్యాయార్జితద్రవ్యములతోఁ గీర్తిప్రతిష్ఠలకొఱకు నాచరింపఁబడినవేగాని పారమార్థికచింతతో భగవత్ప్రీత్యర్థముగ నాచరింపఁబడినవి గావు. కాఁబట్టి వీనివలన నీకేమియుఁ బ్రయోజనముగలుగ నేరదు. కనుక వీనినన్నిటిని విడిపించుము. ఇఁక నేమిచేయవలయుననఁగా, ఇంతకు ముందు నీవెప్పుడైన కేవల జీవకారుణ్యబుద్ధితో నీకష్టార్జితద్రవ్యమును వెచ్చపెట్టి యేదేనియొక ధర్మమును జేసియుంటివేని యది యెంతస్వల్పమైనదైనను సరే

"చిత్తశుద్ధిగలిగి చేసినపుణ్యంబు
కొంచెమైననదియుఁ గొదువగాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత
విశ్వదాభి రామ వినరవేమ"

అనునట్లు, అనంతఫలము నివ్వఁగలదు. కాన నట్టిదేదైన యున్నయెడలఁ జక్కఁగా నాలోచించి జ్ఞాపకమునకుఁదెచ్చికొని దానిని విక్రయించితివేని యందు వలన నీకు విశేషద్రవ్యలాభముగలుగు" నని చెప్పెను. అందుపైని యతఁడాలోచింపఁగా నాముందటిదినము తాను మార్గమునందడవిలో ముసలివానికి మూడుపిడచలన్నమిడినది తప్పఁదక్కఁన దేదియుఁదోచక పోవుటంబట్టి యావివరము నావర్తకునితోఁ జెప్పెను. అందు కావర్తకుఁడు హర్షించి, "అయ్యా!

"ఆ॥ ఆకలన్నవాని కన్నంబుఁబెట్టిన
హరున కర్పితముగ నారగించు
ధన విహీనున కిడు దానము లటువలె
విశ్వదాభిరామ వినరవేమ"

అనునట్లు, ఇట్టివియే భగవత్ప్రీతికరములైనట్టియు, శాస్త్రసమ్మతములైనట్టియు మంచిధర్మములు. దీనివలన నీకుఁ జాలఁ బ్రయోజనముండవచ్చునని తోఁచుచున్నది. కాన దీని నమ్మెదవా?" అని యడిగెను. అందుపైని యతఁడావర్తకునిం జూచి, "అయ్యా! ఇపుడు నీవు చెప్పెడు మాటలవలన నిదియొక్కటియే నేనీజన్మమునఁ జేసిన కర్మలలో సుకృతమైనదిగ నేర్పడుచున్నదిగదా, దీనిని నీకు విక్రయించి వేసినయెడల ముందుజన్మకు నాకేమియు సుకృతసంచితము లేకపోవునుగదా, అయినను నాకిపుడు ద్రవ్యమత్యావశ్యకముగఁ గావలసియున్నదిగాన నా మూడుపిడచలలో నొక్క పిడచ ధర్మమును మాత్రము నీకు విక్రయించి తక్కిన రెండుపిడచల ధర్మమును నేనుంచుకొనియెద" నని చెప్పెను. అందు కావర్తకుఁడు హర్షించి యట్లే చేయుమనెను. అపు డతఁడా మూడుపిడచలలో నొకపిడచధర్మమును విక్రయించెదనని యొకతాటియాకు ముక్కమీదవ్రాసి యా తక్కెడయం దుంచెను. ఆ తక్కెడ రెండవవైపున నావర్తకుఁడు పదివేలవరహాలనుంచు నంతవఱకు నాతాటియాకుముక్క లేవకపోయెను. పదివేల వరహాలును బూర్తిగా వేయఁబడినపిమ్మట నాచీటియుండు తక్కెడలేచి దానితో సమముగఁ దూగెను. అపు డావర్తకుఁ డాచీటిం బుచ్చికొని యాపదివేలవరహాల నతనికిచ్చిపంపెను. కాన నోయి యర్జునా! శాస్త్రసమ్మతమగు ధర్మసూక్ష్మ మిట్టిదని యెఱుంగుము.

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥ 18

అర్థము:— అహఙ్కారమ్ = దురహంకారమును, బలమ్ = బలమును, దర్పమ్ = గర్వమును, కామమ్ = దురాశయును, క్రోధమ్ = కోపమును,

ఆశ్రితాః = అవలంభించినవారై, ఆత్మపరదేహేషు = తమకంటెనితరములగు దేహములయందుండెడు, మామ్ = నన్ను, అభ్యసూయకాః = అసూయాపరులై, ప్రద్విషన్తః = ద్వేషింతురు.

అయితే, ఇపుడు నేఁజెప్పిన యసురాంశసంభూతు లిట్టి ధర్మసూక్ష్మము నెఱుంగఁజాలక తామన్నిధర్మముల నెఱిఁగి ప్రవర్తించుచున్నామనియెడు నహంకారమును, తమకంటె బలవంతులు లేరనియెడు గర్వమును గలిగి కామక్రోధాదులతోఁ గూడుకొన్నవారై తమ దేహములయందు జీవాత్మస్వరూపముగ నుండెడు నేనే యన్యుల దేహములయందును నుంచున్నానని యెఱుంగఁజాలక యట్టి యన్యుల దేహములయందుండెడు నన్ను నసూయపరులై ద్వేషింతురు. ఏవిధముగ ద్వేషింతురో యదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

అట్టివార లేమిచేయుదురనఁగా,

" ఆ. పోగు లుంగరములు పుట్టంబు విడియంబు
కాయపుష్టి మిగులఁ గలిగియున్న
హీనజాతినైన నింద్రు రమ్మందురు
విశ్వదాభిరామ వినరవేమ."

అనునట్లు, తమతోపాటు మంచివస్త్రాభరణముల ధరించి భోజకపుష్టులు గలిగియుండువారలఁ జూచినయెడల నట్టివార లెట్టి హీనజాతివారైనను, ఎట్టి దుష్ప్రవర్తన గలవారైనను, ఎంత యల్పబుద్ధిగలవారైనను, వారల ననేకవిధముల సన్మానింపుచు,

" ఆ. మాసిన తలతోడ మలినవస్త్రముతోడ
యొడలిజిడ్డుతోడ నుండెనేని
యగ్రజన్మునైన నట్టె పొమ్మందురు
విశ్వదాభిరామ వినరవేమ "

అనునట్లు, మలినాంగులును - మలినవస్త్రధరులును - దీనులు నగు వారలఁజూచినపుడు, వార లెట్టి సత్కులప్రసూనులైనను, ఎట్టి సత్ప్రవర్తనగలవారైనను, ఎట్టి యాత్మజ్ఞానముగలవారైనను, అట్టివారలయెడల నసహ్యపడుచు వారలఁ దమ సమీపమునకు రానీక వెళ్లగొట్టుదురు. మఱియునట్టి ధనమదాంధులగు వారలేవేని శుభాశుభప్రయోజనాదుల జరిగించెడు నెడలఁ దమ్ముస్తోత్రము సేయువారును, తమకుఁ బ్రత్యుపకారము సేయఁదగినవారును, ఈ మొదలగువార లెంత ధనధాన్యసమృద్ధిగలవారైనను, అట్టివారలకు మృష్టాన్నంబును, ఘనమైన సంభావనాదులను ఒసంగుచు,

అట్టిసమయంబుననే కేవలదరిద్రులును, క్షుత్పిపాసాపీడితులును, దీనులునగువార లెంతో యాసఁగొనివచ్చినను వారల కొకతృణమైననివ్వకయు నొకకబలమన్నమైనఁ బెట్టకయుఁ గఠినోక్తులఁ దిట్టి వెళ్లఁగొట్టుదురు.

శ్లో॥ తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు ॥ 19

అర్థము :— ద్విషతః = (నన్ను) ద్వేషించుచున్న, క్రూరాన్ = క్రూరులును, అశుభాన్ = అనాచారపరులునగు, తాన్ + నరాధమాన్ = ఆ నరాధములను, అహమ్ = నేను, అజస్రమ్ = ఎల్లప్పుడును, సంసారేషు = జననమరణప్రవాహ రూపకములగు సంసారములయందు, ఆసురీషు + యోనిషు + ఏవ = అసురయోనుల యందే, క్షిపామి = ఉంచుచున్నాను.

ఆహా, ఇట్టివారల యవివేకమేమని చెప్పుదును. తమయందును, ఆదీనుల యందును, ఉండెడువాఁడు సర్వాంతర్యామియగు నేనే యయ్యుండఁగా, తమ దేహములయందుండెడు నన్ను బహూకరించి మృష్టాన్నములచే నానందింపఁజేయుచు ఆదీనులదేహములయందుండెడు నన్నుఁ దిరస్కరించి క్షోభింపఁ జేయుచున్నారు గదా, ఇంతకంటె నెక్కుడు మూఢత్వమును గ్రూరత్వమును వేఱొండు గలదా ? కాఁబట్టి యోయియర్జునా! అట్టి క్రూరచిత్తులగు నరాధములను జననమరణ ప్రవాహ రూపకమగు సంసారమునందెప్పుడు నసురయోనులయందే జన్మింపుచుండునట్లు చేయుదును.

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మనిజన్మని ।
మా మప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాం గతిమ్ ॥ 20

అర్థము :— హే కౌన్తేయ! = ఓయి యర్జునా!, ఆసురీమ్ + యోనిమ్ + ఆపన్నాః = అసురయోనియందు జన్మించిన, మూఢాః = మూఢులు, మామ్ + అప్రాప్య + ఏవ = నన్నుఁబొందకయే, జన్మనిజన్మని = ప్రతిజన్మయందును, తతః = అంతకంటె (ముందటిజన్మకంటె), అధమామ్ + గతిమ్ = నీచతరమగుజన్మమును, యాన్తి = పొందుచున్నారు.

కనుక నోయి యర్జునా! అట్లసురయోనియందు జన్మించువారలు మూఢాత్ములై యాజన్మమునఁజేసెడు పాపకృత్యములవలన మరల నంతకంటె నీచజన్మ నెత్తుదురు. ఇట్లే

" శ్లో॥ అదత్తదోషేణ భవేద్దరిద్రం
దరిద్రదోషేణ కరోతిపాపమ్
పాపాదవశ్యంనరకంప్రయాతి
పునర్దరిద్రీపునరేవపాపీ ॥ "

అనునట్లు, ప్రతిజన్మయందును ముందుజన్మకంటె నెక్కుడు పాపము నార్జించుచు నంతకంటె నీచతరమగు జన్మల నెత్తుచుందురు. కాన నట్టివారలు నానాట మఱింత యధోగతికిఁ బోవుదురేగాని నన్నెప్పటికిని బొందఁజాలరు.

అర్జు — స్వామీ ! అట్టివారలగతి యెప్పటికిని యంతేనా, లేక యెప్పుడైనఁ దిక్కుఁదెలిసికొని మంచిమార్గమునకు మరలుటకు వీలుగలదా ?

కృ — అవుఁ కలదు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్ ॥ 21

అర్థము :— ఆత్మనః + నాశనమ్ = ఆత్మనాశకమగు, ఇదమ్ = ఈ(పైఁజెప్పఁబడిన), నరకస్య + ద్వారమ్ = నరకహేతువు, కామః + క్రోధః + తథా + లోభః = కామక్రోధలోభములని, త్రివిధమ్ = మూడువిధములు గలది. తస్మాత్ = కాఁబట్టి, ఏతత్ + త్రయమ్ = ఈమూటిని, త్యజేత్ = వర్జింపవలయును.

ఓయి యర్జునా ! ఇపుడు నేఁ జెప్పిన నరకమునకు, అనఁగా, అసురయోనియందు జన్మించుటకు ముఖ్యములగు కారణములు మూడుగలవు. అవియెవ్వి యనఁగా, మొదటిది (కామము) అనఁగా, విషయానుభవమునకు సాధనంబులకు ధనకనక వస్తువాహనాదులలో నేదియైనను సరే భగవదిచ్ఛానుసారముగఁదనకులభించిన వానితోఁ దృప్తి నొందియుండక యేవిధముచేతనైననుసరే యింకను సంపాదింప వలెననియెడు కోరిక. రెండవది (క్రోధము) అనఁగా, అట్లు తాఁగోరినవానిని లభింపఁజేసికొనియెడు విషయములో నేదేని యంతరాయము గలిగినయెడల నందువలనఁబొందెడు మనోవికారము. మూడవది (లోభము) అనఁగా, అట్లార్జింపఁబడినవానిని వ్యయముగాకుండఁ గాపాడుకొనవలయు ననియెడునిచ్ఛ. ఈమూడుదుర్గుణములెవని యందుంచున్నవో వాని నాశనమునకివియే కారణములగుచున్నవి. కాన నీమూటిని ద్యజింపవలయును.

శ్లో॥ ఏతై ర్విముక్తః కౌన్తేయ ! తమోద్వారై స్త్రిభి ర్నరః ।
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥ 22

అర్థము :— హే కౌన్తేయ! = ఓయి యర్జునా!, తమోద్వారైః = నరకహేతువు లైన, ఏతైః + త్రిభిః = ఈ మూఁడు గుణములచేత, విముక్తః + నరః = విడువఁబడిన నరుఁడు, ఆత్మనః = తనకు, శ్రేయః = శ్రేయస్సును (మేలును), ఆచరతి = చేసికొనుచున్నాఁడు, తతః = అందువలన, పరామ్ + గతిమ్ = పరమపదమును, యాతి = పొందుచున్నాఁడు.

ఆట్లెవఁడైతే నరకహేతువులగు నీమూఁడుదుర్గుణములను విడుచుచున్నాఁడో, వాఁడు తనకు శ్రేయస్కరమైనపనిని జేసికొనినవాఁ డగుచున్నాఁడు. అదెట్లనఁగా, ఎవఁడేజన్మమునం దీమూఁడు దుర్గుణములను విడుచుచున్నాఁడో వాఁడాజన్మవిడిచి మరు జన్మకుఁ బోవునపుడంతకంటె నీచతరమగు జన్మ మెత్తుటకు బదులుగ శ్రేష్ఠతరమగు జన్మ మెత్తుటయుగాక మరల నాజన్మయందును నిట్లే యీమూఁడుగుణములను విడిచినవాఁడై మరల నంతకంటె శ్రేష్ఠతరమగు జన్మ మెత్తును. ఇట్లు ప్రతిజన్మయందును గ్రమక్రమముగ హెచ్చుచు వచ్చి తుదకు మోక్షార్హుఁడై పరమపదమును బొందఁగలఁడు.

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతేకామకారతః ।
నససిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిమ్ ॥ 23

అర్థము :— యః = ఎవఁడు, శాస్త్రవిధిమ్ = శాస్త్రోక్తవిధిని, ఉత్సృజ్య = విడిచిపెట్టి, కామకారతః = ఇచ్ఛవచ్చినట్లు, వర్తతే = ప్రవర్తింపుచున్నాఁడో, సః = వాఁడు. సిద్ధిమ్ = యోగసిద్ధిని (జ్ఞానమును), న + అవాప్నోతి = పొందఁడు, సుఖమ్ = (చిత్తశాంతివలనఁ గలిగెడు) సుఖమును, న + (అవాప్నోతి) = పొందఁడు. పరామ్ + గతిమ్ = పరమపదమును, న + (అవాప్నోతి) = పొందఁడు.

అట్లుగాక, ఎవఁడైతే శాస్త్రసమ్మతములగు విధినిషిద్ధముల నవలంబింపక తన యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపుచున్నాఁడో, అనఁగా, కామక్రోధాది దుర్గుణములతోఁ గూడినవాఁడై యాగుణములచేఁ బ్రేరేపింపఁబడి తదనుగుణ్యంబులగు పనులయందుఁ బ్రవర్తింపుచున్నాఁడో యట్టివాఁ డెప్పుడును జ్ఞానసిద్ధిని బొందజాలఁడు. అట్టిజ్ఞానసిద్ధి గలుగకుండుటంతవలనను వానికిఁ జిత్తశాంతి గలుగనేరదు. చిత్తశాంతియెప్పుడు లేకపోయెనో అప్పుడువాని మనస్సనేకవిధములగు వికారములఁ బొందుచుండుటచే వానికిసుఖము గలుగనేరదుగదా? అట్టివాఁడెట్లు మోక్షమును బొందఁగలడు?

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రంప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥ 24

అర్థము :— తస్మాత్ = కాఁబట్టి, కార్యాకార్యవ్యవస్థితౌ = కార్యాకార్యముల నిర్ధారణచేయుటయందు, తే = నీకు, శాస్త్రమ్ = శాస్త్రము, ప్రమాణమ్ = ప్రమా

ణము, శాస్త్రవిధానోక్తమ్=శాస్త్రమునందుఁజెప్పఁబడినదానిని, జ్ఞాత్వా=ఎఱిఁగి, ఇహ=ఈప్రపంచమునందు, కర్మ=కర్మను, కర్తుమ్=చేయుటకు, అర్హసి=తగుదువు.

కనుక నోయియర్జునా! ఈలోకమునఁ గార్యాకార్యముల కన్నిటికిని, అనఁగా, చేయఁదగినపనులకును, చేయఁగూడనిపనులకును వేదశాస్త్రపురాణాదులే ప్రమాణములైయున్నవి. కాన నీవాశాస్త్రములనే ప్రమాణములుగాఁగొని వానివలన నేయేసమయములయం దేయేకర్మ లాచరణీయంబులుగ నేర్పడుచున్నవో, ఆయా కాలంబులయం దాయాకర్మల నాచరింపుచు, యేసమయంబులయం దేయేకర్మలు నిషిద్ధంబులుగ నేర్పడుచున్నవో, ఆయా కాలంబులయం దా యాకర్మల విసర్జింపుచుండవలయునే గాని నీయిచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపఁగూడదు.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసమ్పద్విభాగయోగో నామషోడశోఽధ్యాయః.

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి దైవాసురసంపద్విభాగయోగం బను
షోడశాధ్యాయము.

---

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ భ గ వ ద్గీ తా గ ర్భి త భా వ బో ధి ని

## స ప్త ద శా ధ్యా య ము

### శ్రద్ధాత్రయవిభాగయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ! సత్త్వ మాహో రజ స్తమః ॥ 1

అర్థము :— హేకృష్ణ!=ఓకృష్ణమూర్తీ!, యే=ఎవరు, శాస్త్రవిధిమ్=శాస్త్రోక్త విధానమును, ఉత్సృజ్య=విడిచిపెట్టి (అవలంబింపక పోయినను), శ్రద్ధయా+అన్వితాః=భక్తిశ్రద్ధలతోఁ గూడుకొన్నవారై, యజన్తే=దేవతారాధనాది కృత్యంబులఁజేతురో, తేషామ్=(అట్టి) వారల, నిష్ఠా+తు=ప్రవృత్తియన్ననో, కా=ఎట్టిది?, సత్త్వమ్=సాత్త్వికమా?, అహో+రజః=లేక రాజసమా?, (అహో)+తమః=లేక తామసమా?

అర్జు — అయ్యా కృష్ణమూర్తీ! ఎవఁరైతే శాస్త్రవిధి ననుసరింపక తమ యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపుచుందురో అట్టివారికి జ్ఞానసిద్ధిగాని, సుఖముగాని మోక్షముగాని కలుగనేరదని చెప్పితివిగదా, (చూ. 16–23). ఈలోకమునఁ గొందఱు ద్రవ్యార్జనాదికృత్యములలో శాస్త్రవిధిననుసరింపక పోయినను, దేవతారాధనాదికృత్యంబులను మాత్రము భక్తిశ్రద్ధలతోఁ జేయుటయుఁగలదు కదా? అనఁగా, కొందఱు పరపీడన పరద్రవ్యాపహారాది యక్రమమార్గంబులచే ద్రవ్యము నార్జింపుచుండినను, అట్టిద్రవ్యమును దమయిచ్ఛవచ్చినట్లు కీర్తిప్రతిష్ఠలకొఱకు వెత్సపెట్టక నిజమైన భగవద్భక్తియును భూతదయయును గలవారై దేవతారాధనాది కృత్యంబుల నతిభక్తిశ్రద్ధలతోఁ జేయుటయు, అతిథ్యభ్యాగతుల నతి శ్రద్ధతో నాదరించుటయు, క్షుత్పిపాసాపీడితులగు దీనులయెడలఁ గనికరించి వారల నన్నపానా

దులచేఁ దృష్టినొందించుటయు, ఈ మొదలగు సత్కార్యములఁ జేయుటయుఁ జూచుచున్నాముగదా, ఇట్టివీరల వ్యాపారమెట్టిది యగుచున్నది? సాత్త్వికమా? లేక రాజసమా? లేక తామసమా? అనఁగా, నిట్టి మిశ్రమములగు చర్యలుగల వీరలు సత్త్వగుణ ప్రధానులగు దేవగణ సంభూతులలోఁ జేరినవారగుచున్నారా? లేక రజోగుణప్రధానులగు యసురగణసంభూతులలోఁ జేరినవారగుచున్నారా? లేక తమోగుణ ప్రధానులగు పిశాచగణ సంభూతులలోఁ జేరినవారగుచున్నారా?

శ్రీ భగవానువాచ:

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥ 2

అర్థము:— శ్రద్ధా=శ్రద్ధ (అనునది), దేహినామ్=దేహధారులయొక్క, స్వభావజా=స్వభావమువలనఁ బుట్టునట్టిది (కనుక), సా=అది (అశ్రద్ధ), సాత్త్వికీ= సాత్త్వికశ్రద్ధయనియు, రాజసీ+చ+ఏవ=రాజసశ్రద్ధయనియు, తామసీ+చ+ ఇతి=తామసశ్రద్ధయనియు, త్రివిధా=మూడువిధములు గలదిగా, భవతి=అగుచున్నది. తామ్=దానిని, శృణు=వినుము.

కృ — ఓయి యర్జునా! శ్రద్ధయన నెట్టిదనఁగా, దేహధారులయొక్క స్వభావమువలనఁ బుట్టునదియైయున్నది. స్వభావమనఁగాఁ బ్రకృతిగదా? అప్రకృతి యన్ననో త్రిగుణాత్మకమని, అనఁగా, సత్త్వరజస్తమస్సు లనియెడు మూడు గుణములుఁ గలదియని యింతకుముందు చెప్పియుంటినిగదా? (చూ. 14-5). కనుక నట్టి స్వభావము (ప్రకృతి) వలనఁ బుట్టిన శ్రద్ధయు నట్లే సాత్త్విక, రాజస, తామసములని మూడువిధములు గలదిగానుండును అనఁగా, సత్త్వగుణ ప్రధానుఁడుగా నుండెడు వానికిఁగలిగియుండెడు శ్రద్ధ సాత్త్వికశ్రద్ధయనియు, రజోగుణ ప్రధానుఁడుగానుండెడు వానికిఁగలిగియుండెడు శ్రద్ధ రాజసశ్రద్ధ యనియు, తమోగుణప్రధానుఁడుగా నుండెడువానికిఁ గలిగియుండెడు శ్రద్ధ తామసశ్రద్ధ యనియుఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత!।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవసః॥ 3

అర్థము:— హే భారత! = ఓయియర్జునా!, సర్వస్య=సమస్తప్రాణులకు, శ్రద్ధా=శ్రద్ధయనునది, సత్త్వానురూపా=వారివారి పూర్వజన్మసంస్కారము ననుసరించి, భవతి=కలుగుచున్నది, (తస్మాత్)=కాఁబట్టి, శ్రద్ధామయః=శ్రద్ధతోఁగూడిన, అయమ్=ఈ(ఇపుడు నీవు చెప్పిన), పురుషః=పురుషుఁడు, యః=ఎవఁడు, యత్+

శ్రద్ధః=ఎట్టిశ్రద్ధగలవాఁడో, సః=వాఁడు, సః+ఏవ = అట్టిసత్త్వముగలవాఁడే (అగుచున్నాఁడు).

ఇఁక నాస్వభావమన్ననో, వానివాని పూర్వజన్మ సంస్కారమునకుఁ దగినట్లు కలుగుచుండును. అనఁగా, పూర్వజన్మమునఁ గేవల సుకృతములఁ జేసినవానికి సాత్త్విక స్వభావమును, సుకృతదుష్కృతముల మిశ్రమముగఁ జేసినవానికి రాజసస్వభావమును, కేవలదుష్కృతములఁ జేసినవానికిఁ దామసస్వభావమును గలుగును. కాననాస్వభావము వలనఁగలిగెడు నీశ్రద్ధయును వారివారిపూర్వజన్మ సంస్కారము ననుసరించియే కలుగుచున్నదని చెప్పఁదగియున్నది.

కనుక నోయి యర్జునా! ఇపుడు నీవుచెప్పినవారిలో, అనఁగా, శాస్త్రవిధి ననుసరింపకపోయినను శ్రద్ధాయుక్తులై దేవతారాధనాది కృత్యంబులఁ జేయువారిలో నెవఁడెవఁడెట్టిశ్రద్ధతోఁ బనిచేయుచుండునో వాఁడు వాఁడట్టిస్వభావముగలవాఁడని యెఱుంగుము. అయితే, అభయాది -౨౬ సాత్త్వికలక్షణములుగలవాఁడు దేవగణ సంభూతుఁడని యింతకుముందు చెప్పియుంటినిగదా? (చూ 16. 1, 2, 3). కనుక నెవఁడైతే యట్టిలక్షణములుగల శ్రద్ధతోఁ బనిచేయుచున్నవాఁడుగ నగపడుచున్నాఁడో, వాఁడుశాస్త్రవిధి ననుసరింపకపోయినను దేవగణసంభూతులలోఁ జేరిన వాఁడనియే యెఱుంగుము.

ఇఁక నీ మూఁడువిధములగు శ్రద్ధలలో నెవఁడెట్టి శ్రద్ధగలవాఁడైనదియు నెట్లెఱుంగవచ్చు ననఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః॥ 4

అర్థము:— సాత్త్వికాః = సత్త్వగుణప్రధానులు, దేవాన్ = దేవతలను, యజన్తే = ఆరాధింపుదురు, రాజసాః = రజోగుణప్రధానులు, యక్షరక్షాంసి = యక్షరాక్షసులను, (యజన్తే) = ఆరాధింపుదురు. అన్యే = తక్కినవారలగు, తామసాః+జనాః = తమోగుణప్రధానులగు జనులు, ప్రేతాన్ = ప్రేతములను, భూతగణాన్+చ=భూతగణములను, యజన్తే=ఆరాధింపుదురు.

ఓయి యర్జునా! సాత్త్వికలక్షణములు గలవారలు దేవగణసంభూతులని యింతకుముందు చెప్పియుంటినిగదా, (చూ 16. 2, 3). అట్టివారు ముముక్షువులుగాన నట్టి మోక్ష ప్రదాయకుఁడనగు నన్నుద్దేశించి నాయవతారాద్యనేక దేవతాస్వరూపముల నారాధింతురు. కాననట్లు దేవతారాధనలఁజేయువారలు దేవగణసంభూతులని

యెఱుంగవలయును. రజోగుణప్రధానులగు వారలైహిక సుఖములయందాసక్తిగల వారలై యట్టిఫలముల నియ్యఁదగిన యక్షరాక్షసులను, అనఁగా, ఇంద్రాద్యష్టదిక్పాలకులు – ఆదిత్యాది నవగ్రహములు – మొదలగువారి నారాధింతురు. కానవట్టి యారాధనలఁజేయువార లసురసంభూతులని యెఱుంగవలయును.

ఇఁకను, తమోగుణప్రధానులు మిగుల బుద్ధిమాంద్యముగలవారు గనుక నట్టివారు తుచ్ఛఫలములఁగోరుచు భూతగణములను, అనఁగా, అంకమ్మ – పోలేరమ్మ – కాటేరి – మొదలగు క్షుద్రదేవతలను, చెంచులు మొదలగు మనుష్యులను, సర్పములు మొదలగు తిర్యగ్జంతువులను ఆరాధింతురు. మఱియు నట్టివారు ప్రేతములనుగూడ, అనఁగా, తమవంశస్థులలో మృతినొందిన కొందఱు పిశాచములై తమకేదేనియొక కీడునో – మేలునో – చేయుచున్నారని యెంచి యా పిశాచముల నారాధింతురు. కాన నిట్టియారాధనలఁ జేసెడువారు పిశాచగణసంభూతులని యెఱుంగ వలయును.

అర్జు — స్వామీ! ఇట్లు చెప్పితివిగదా, దీనింబట్టిచూడఁగా నీదు లీలామానుష విగ్రహంబులగు రామకృష్ణాద్యవతార స్వరూపంబుల నారాధించెడు వారలందఱును సత్త్వగుణప్రధానులే యని యెంచవలసినట్లగపడుచున్నదిగదా ? అయితే ఈలోకమున నట్టి నీస్వరూపముల నారాధింపుచును, ఉపవాసాదివ్రతముల ననుష్ఠింపుచును, తపోదానాదిక్రియల నాచరింపుచును ఉండెడివారిలో ననేకులు రజస్సంబంధంబులగు దంభదర్పాహంకారాది గుణములుగలవారై యుండుటయును, వారియందు సాత్త్వికగుణసంబంధములగు శాంతశమదమాదిగుణములు లేకుండుటయును గూడఁ జూచుచున్నాముగదా, ఇట్టి లక్షణములుగల వీర లేగణమునఁ బుట్టినవారని యెంచ వలయును? దేవగణసంభూతులనియా? లేక యసురగణ సంభూతులనియా ?

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః ॥ 5

శ్లో॥ కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః ।
మాం చైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్ ॥ 6

అర్థము :— యే + జనాః=ఏజనులు, దమ్భాహఙ్కారసంయుక్తాః=దంభాహంకారములతోఁ గూడినవారును, కామరాగబలాన్వితాః=కామరాగబలములతోఁ గూడినవారును నై, అశాస్త్రవిహితమ్=శాస్త్రసమ్మతము కానిదియు, ఘోరమ్=తనకును ఇతరులకును బాధకరమైనట్టియు, తపః=తపస్సును, తప్యన్తే=చేయుచున్నారో, అచేతసః=(అట్టి) అవివేకులు, శరీరస్థమ్=(తమ) శరీరములయందుండునట్టి,

భూతగ్రామమ్=ఇంద్రియసమూహమును, అన్తశ్శరీరస్థమ్=(తమ) సూక్ష్మశరీరముల యందుండునట్టి, మామ్+చ=నన్నును, కర్శయన్తః=కృశింపఁజేయువారగుచున్నారు, తాన్=(అట్టి) వారలను, ఆసురనిశ్చయాన్=అసురగణ సంభూతులలోఁ జేరినవారినిగనే, విద్ధి=ఎఱుఁగుము.

కృ — ఓయి యర్జునా! నీవు చెప్పునది వాస్తవమే. ఈలోకమున ననేకులు సాత్త్వికంబులగు శాంతశమదమాది గుణశూన్యులును, రాజసంబులగు — కామ క్రోధ - దంభాహంకారాది గుణయుక్తులునై యుండియు సత్త్వగుణప్రధానుల వలెనే దేవతారాధనాది కృత్యంబులును, ఉపవాసాది వ్రతంబులును ఆచరించుటయుఁగలదు. అట్లు వారలు చేయుట భక్తిశ్రద్ధలచేతఁ గాదు. మఱేమనిన, దంభముకొఱకు, అనఁగా, లోకులచే మెప్పువడయుటకుఁగా నట్లు చేయుదురు. అదెట్లనఁగా, కొందఱు తాము భగవద్భక్తులనియు సదాచారసంపన్నులనియుఁ బొగడ్తనొందుటకై బంగారువిగ్రహములు, వెండి పూజపాత్రలు మొదలగు వానిం జేయించి పోలిశెట్టి యంగడివలె వానిం బఱచిపెట్టి చాలసేపువఱకు పూజావిధానంబుల జరుపుచు నేకాదశి మొదలగు వ్రతదినములయం దుపవాసాది తపంబుల నాచరింపుచుందురు. అయితే, ఇట్లు చేయుచుండునపుడు "చిత్తము శివునిమీఁద భక్తి చెప్పులమీఁద" అనెడు లోకోక్తి ప్రకారము వారల మనస్సు ఒకని నెట్లువంచింతము, మఱియొకని ద్రవ్య మెట్లపహరింతము అనే మొదలగు దురాలోచనలతో నిండియుండును గాని, నాయందుండదు. కాన నట్టిపూజలును — తపములును — శాస్త్రసమ్మతములు గానేరవు సరేగదా, ఘోరములైనవనియును జెప్పఁదగియున్నవి ఏలయనఁగా

"క॥ విను, మశననిగ్రహము దప
మను నభిధానంబుగల మహాధర్మము" (భార. శాంతి. 3 ఆ. ౪౧౪)

అనునట్లు, తపమనఁగా నుపవాసాదులతో నాచరించెడు వ్రతముగదా? అట్టి వ్రతము నాచరించుటవలన నట్టివారలు, దమ చక్షురాదీంద్రియములను శుష్కింపఁ జేయుటయగాక వారలలో సూక్ష్మశరీరస్థుఁడుగను జీవాత్మస్వరూపుఁడుగను ఉండునట్టి నన్నుఁగూడ క్షుత్పిపాసాదిబాధలచేఁ గృశింపఁజేసినవారగుచున్నారు. కనుక నట్టివారలాచరించెడు తపము లశాస్త్రీయములనియుఁ జెప్పుటకుఁ గారణమైనది. అయితే, సాత్త్వికగుణములగు శాంతశమదమాది గుణములు గలవారలాచరించెడు నుపవాసాది వ్రతములు నిట్లే యింద్రియములను — జీవాత్మను క్షోభింపఁజేయవా? అని యోచించెదవేని చెప్పుచున్నాను వినుము. శాంతశమదమాది సాత్త్వికలక్షణములుగలవార లాచరించెడు పూజలు వ్రతములు మొదలగునవి నిజమైన భక్తిశ్రద్ధలతోఁ

జేయఁబడుచున్న విగాన నట్టిప్రజలను, వ్రతములను అచరించునపుడు వారి చిత్తములు నాయందే లయించియుండును. కాఁబట్టి వారలకట్టి యుపవాసాదులవలనఁ గలిగెడు క్షుత్పిపాసాది బాధలుఁ దోపకుండును. కనుకనే

"ఆ. అష్టారంబుకంటె అధికంబు దపము ద
పంబనంగ నేమి ప్రస్న దనము
నిపురఁ జేతగా దహింపయు సత్యవా
క్యంబుదపము దయయుఁ గాని యరయ" (భార. శాంతి. ౨ అ. ౩౪౭)

అని పెద్దలు సెప్పియున్నారు. కనుక నోయియర్జునా! అట్టి శాంత శమ దమాది సాత్త్వికలక్షణరహితులును, దంభాహంకారాది రాజసగుణ సహితులును నై యాచరించెడువారల వ్రతాదులశాస్త్రీయంబులును, ఘోరంబులును, వ్యర్థంబులు ననియు అట్టివ్రతంబుల నాచరించెడు వార లసురగణ సంభూతులలోఁ జేరినవారలే గాని దేవగణసంభూతులలోఁ జేరినవారుగారనియు నెఱుంగుము.

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు ॥ 7

అర్థము:— సర్వస్య=సమస్తమైనవారికిని, ప్రియః=ఇష్టమైన, ఆహారః+తు= ఆహారమును, త్రివిధః=మూడు విధములు గలదిగా, భవతి=అగుచున్నది, తథా= అలాగుననే, యజ్ఞః=యజ్ఞమును, తపః=తపస్సును, దానమ్+అపి=దానమును, (త్రివిధః+భవతి)=మూడు విధములుగలది యగుచున్నది, తేషామ్=ఆయాహారాదుల యొక్క, ఇమమ్=ఈ (ఇఁకను నేఁజెప్పఁబోయెడు), భేదమ్=భేదమును, శృణు= వినుము.

కనుక నోయియర్జునా! ఇందువలన నేమియేర్పడుచున్నదనఁగా, కొందఱు అసురాంశ సంభూతులవలె శాస్త్రవిధి ననుసరింపనివారైనను, నిజమైన భక్తిశ్రద్ధలతో దేవతారాధనాది కృత్యంబులఁ జేయుచుండుటంబట్టి దేవాంశ సంభూతులుగను, మఱికొందఱు దేవాంశసంభూతులవలె శాస్త్రోక్తప్రకారముగఁ దపవ్రతాదుల నాచరించినవారైనను, అట్టి వ్రతాదులను నిజమైన భక్తిశ్రద్ధలు లేక యాచరించుటంబట్టి యసురాంశ సంభూతులుగను నేర్పడుచున్నారుగదా? అయినను, ఈ యొక్క యంశమునుబట్టియే ఎవఁడెవఁ డెట్టిజన్మగలవాఁడైనదియు నూహింప నలవిగాదు సుమా. మఱేమనిన, ఈలోకమున సమస్తజనులకును వారివారి స్వభావగుణములను బట్టి యాహారములును – యజ్ఞములును – తపములును – దానములును – సాత్త్వికము

లనియు రాజసములనియు తామసములనియు మూడు విధములు గలదిగా నుండును. కాన నొక్కొక్కని విషయమున వీని నన్నిటిం జేర్చి చూచినయెడల, అనఁగా, వాఁడెట్టియాహారమునందుఁ బ్రీతిగలవాఁడై యున్నాఁడో, ఎట్టి యజ్ఞములఁ జేయుచున్నాఁడో, ఎట్టితపముల నాచరించుచున్నాఁడో, ఎట్టి దానములనిచ్చుచున్నాఁడో, వీనినన్నిటిని గనిపెంచినయెడల వాఁడెట్టి జన్మగలవాఁడైనదియు, అనఁగా, వాఁడు దేవగణసంభూతుఁడైనదియు లేక యసురగణ సంభూతుఁడైనదియు సులభముగఁ దెలిసికొనవచ్చును. కాననట్టియాహారాదుల భేదములనుగూడ వివరించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనా।
రస్యా స్స్నిగ్ధా స్థ్సిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః ॥ 8

అర్థము :— ఆయుస్సత్త్వ బలారోగ్యసుఖ ప్రీతివివర్ధనాః = ఆయుస్సును, మనోబలమును, దేహబలమును, ఆరోగ్యమును—సుఖమును—ప్రీతిని—వృద్ధిబొందించునవియు, రస్యాః = రసవంతములైనవియు, స్నిగ్ధాః = చమురుగలవియు, స్థిరాః = స్థిరములైనవియు, హృద్యాః = మనోహరములైనవియునగు, ఆహారాః = ఆహార పదార్థములు, సాత్త్వికప్రియాః = సత్త్వగుణప్రధానులకు ప్రియములై యుండును.

ఓయర్జునా! ఆహారపదార్థములలో గొన్ని సాత్త్వికులకుఁ బ్రియములైనవియును, కొన్ని రాజసులకుఁ బ్రియములైనవియు, కొన్ని తామసులకుఁ బ్రియములైనవియు నైయున్నవి. అందు సాత్త్వికులకుఁ బ్రియములైన పదార్థము లెట్టివనఁగా, ఆయుర్వృద్ధినిచ్చునవియు, మనస్సునకును, దేహమునకును బలమును గలుగఁజేయునవియు, దేహమున కారోగ్యమును గలుగఁజేయునవియు, అట్టి యారోగ్యము దేహమునకుఁ గలుగుటవలన నాదేహమునకుఁ సుఖమును మనస్సునకుఁ బ్రియమును వృద్ధినొందింపఁ జేయునవియు, రసవంతములైనవియు చమురుగలిగి కమ్మగా నుండునవియు భుజించెడువారి దేహములయందు చాలకాలమువఱకుండి సత్తువనిచ్చునవియు మనోహరములునైయుండును. అనఁగా నిట్టిపదార్థములయందు సాత్త్వికులకుఁ బ్రీతిగలిగి యుండుననుట.

శ్లో॥ కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥ 9

అర్థము :— కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః = మిక్కిలిచేదు — పులుసు—ఉప్పు—కారము—గలిగియత్యుష్ణముగను—విదాహకంబుగను—ఉండునట్టివియు,

దుఃఖశోకామయప్రదాః = దేహకష్టమును - మనోదుఃఖమును-జాడ్యమును గలుగ జేయునవియునైన, ఆహారాః = ఆహారపదార్థములు, రాజసస్య = రాజసగుణముగల వానికి, ఇష్టాః = ప్రియములైనవి.

ఇఁకను రాజసగుణప్రధానులకెట్టి యాహారములయందుఁ బ్రీతిగలిగి యుండు ననఁగా, మిక్కిలి చేదుగను-పుల్లగను - ఉప్పగను - కారముగను- ఉండునట్టివియును, అత్యుష్ణముగ నుండునట్టివియును, విశేషదాహమును బుట్టించునట్టివియును, దేహము నకుఁగష్టమును మనస్సునకు దుఃఖమును గలుగఁజేయునవియును, అనారోగ్యకరములు నగు పదార్థములయం దిష్టముగలవారై యుందురు.

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్ ॥ 10

అర్థము :— యత్ = ఏది, యాతయామమ్ = చల్లారిపోయినదియు, గత రసమ్ = రసహీనమైనదియు, పూతి = దుర్గంధముగలదియు, పర్యుషితమ్+చ = చల్దియు, ఉచ్ఛిష్టమ్+అపి = ఒకరు తినఁగా మిగిలినదియు, అమేధ్యమ్+చ = అపరిశుద్ధమునై యుంచున్నదో (అట్టి), భోజనమ్ = ఆహారము, తామసప్రియమ్= తమోగుణప్రధానులకిష్టమైనది.

ఇఁకను, తమోగుణప్రధానుల కిష్టమగు నాహార మెట్టిదనఁగా, వంటయైనపిమ్మటఁ జాలకాలము వఱకుంచఁబడి నీళ్ళుగారిచల్లగా బోయినవియు, సారముపోయినవియు, కుళ్ళి, పాసిపోవుటవలన దుర్గంధముగలవియు, చల్దివియు, ఇతరులు తినఁగా మిగిలి నవియు, అపరిశుద్ధములును అగుపదార్థములను భక్షించుటయందుఁ బ్రీతిగలవారై యుందురు.

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్య మేవేతి మనస్స మాధాయ స సాత్త్వికః ॥ 11

అర్థము :— విధిదృష్టః = శాస్త్రోక్తంబగు, యః+యజ్ఞః = ఏయజ్ఞము, యష్టవ్యమ్+ఏవ = చేయఁబడదగినదియే, ఇతి = అని, మనః = మనస్సును, సమా ధాయ = సమాధానపరచి, అఫలాకాంక్షిభిః = ఫలాపేక్షలేనివారిచే, ఇజ్యతే= చేయఁబడుచున్నదో, సః = ఆయజ్ఞము, సాత్త్వికః = సాత్త్వికమైనది.

ఓయి యర్జునా! ఇంతవఱకు నాహారభేదములను జెప్పియైనదిగదా? ఇఁకను యజ్ఞములనుగూర్చి చెప్పుచున్నాను వినుము. ఆయజ్ఞములను సాత్త్విక, రాజస,

తామసములని మూఁడువిధములు గలవిగానున్నవి. అందు సాత్త్వికయజ్ఞ మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఎవఁడైననొకఁడు శాస్త్రోక్తములగు యజ్ఞములలో నేదేని యొక దానింజేయ నుద్దేశించినవాఁడై దానివలనఁ దానొక ఫలమును బొందవలెననెడు కోరికతోఁగాక కేవల భగవత్ప్రీత్యర్థముగఁ జేయ వలయుననియెడు మనోనిశ్చయముతోఁ జేసినయెడల నట్టియజ్ఞము సాత్త్వికయజ్ఞ మనఁ బడుచున్నది.

శ్లో॥ అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥ 12

అర్థము :— హేభరతశ్రేష్ఠ! = ఓయర్జునా!, యత్ = ఏది (ఏయజ్ఞము), ఫలమ్+అభిసన్ధాయ+తు = ఫలమునుద్దేశించియైనను, దమ్భార్థమ్+అపి+చ+ఏవ = కేవల దమ్భముకొఱకైనను, ఇజ్యతే = చేయబడుచున్నదో, తమ్ = దానిని, రాజసమ్+యజ్ఞమ్ = రాజసయజ్ఞమునుగా, విద్ధి = ఎఱుఁగుము.

ఇఁకను రాజసయజ్ఞ మెట్టిదనఁగా జెప్పుచున్నానువినుము. ఓయి యర్జునా! ఈలోకమున ననేకులనేక విధములగు యజ్ఞములఁజేయుచుండుటను జూచుచున్నాము గదా, వారిలో నొకానొకఁడుమాత్రమే ఫలాపేక్షలేనివాఁడై కేవల భగవత్ప్రీత్యర్థ మట్టి యజ్ఞముల నాచరించునుగాని, తక్కినవారందఱు నేదేనియొక ఫలము నుద్దేశించియే యట్టియజ్ఞములనాచరింతురు. అనఁగా, కొందఱైశ్వర్యము కొఱకును, పుత్రసంతానముకొఱకును, ఇట్లనేకవిధములగు నైహికఫలముల నుద్దేశించియు, మఱికొందఱాముష్మికములగు స్వర్గాదిభోగముల నుద్దేశించియు ఆచరింతురు. మఱికొందఱట్లు భగవత్ప్రీత్యర్థమునుగాక ఫలాపేక్షకులునుగాక కేవల దంభముకొఱకు, అనఁగా, తాము సోమయాజులని ప్రతిష్ఠనొందుటకొఱకు చేయుదురు. కాన నిట్టి యుద్దేశ్యములతోఁ జేయఁబడు యజ్ఞములన్నియు రాజసయజ్ఞములని యెఱుంగుము.

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్ ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ 13

అర్థము :— విధిహీనమ్ = విధ్యుక్తముకానిదియు, అసృష్టాన్నమ్ = సృష్టమైన యన్న ప్రదానములేనిదియు, మన్త్రహీనమ్=మంత్రలోపముగలదియు, అదక్షిణమ్= స్వల్పదక్షిణలతోఁజేయబడునదియు, శ్రద్ధావిరహితమ్ = భక్తిశ్రద్ధలతోఁజేయబడనిదియునగు, యజ్ఞమ్ = యజ్ఞము, తామసమ్ = తామసయజ్ఞమని, పరిచక్షతే = చెప్పుదురు.

ఇఁకను, తామస యజ్ఞ మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఈలోకమునఁ గొంద ఱేదేనియొక కారణమునుబట్టి నామకార్థములగు యజ్ఞములనుగూడ నాచరింతురు. అదెట్లనఁగా, శాస్త్రోక్తములగు పరికరముల నుపయోగింపకయు, వచ్చిన జనమునకుఁ దృప్తిగలుగునట్లన్న ప్రదానముచేయకయు, విద్యుక్త ప్రకారము సాంగోపాంగముగ మంత్రకలాపమును జరపకయు, ఋత్విక్కులు మొదలగు వారలకు శాస్త్రోక్తంబులగు దక్షిణలనివ్వక స్వల్ప దక్షిణలనిచ్చుటయు ఇట్టి యశాస్త్రీయములగు పనుల నాచరింపుచు భక్తిశ్రద్ధలు లేనివారై యాచరింతురు. కనుక నటు చేయఁబడు యజ్ఞములు తామసయజ్ఞములని చెప్పఁబడును.

శ్లో॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥ 14

అర్థము:— దేవ ద్విజ గురు ప్రాజ్ఞపూజనం = దేవతలు, బ్రాహ్మణులు, గురువులు, పెద్దలు వీరలను బూజించుటయు, శౌచమ్ = శుచిత్వమును. ఆర్జవమ్ = కిల్బిషము లేకుండుటయు, బ్రహ్మచర్యమ్=బ్రహ్మచర్యవ్రతమును, అహింసా + చ = హింస చేయకుండుటయు, శారీరమ్ + తపః = కాయికతపస్సని, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

ఓయి యర్జునా! యజ్ఞముల భేదము లిట్టివని తెలిసినవిగదా?
ఇఁకను, తపస్సుల భేదములను గూర్చి చెప్పుచున్నానువినుము.

తపస్సనునది, కాయిక తపస్సనియు, వాచికతప స్సనియు, మానసికతపస్సనియు మూడువిధములుఁ గలదిగానున్నది. అందు కాయిక తపస్సెట్టిదనఁగా, దేవతలు, బ్రాహ్మణులు, గురువులు, పెద్దలు మొదలగు వారల భక్తితోఁ బూజించుట; శౌచము గలిగియుండుట, అనఁగా నాయాకాలంబులకుఁ దగినట్లు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులం దీర్చికొని, శుభ్రములగు వస్త్రముల ధరించి శుచిర్భూతుఁడై యుండుట; ఆర్జవము, అనఁగా మనస్సున నేలాటి కిల్బిషమును లేకుండుట; బ్రహ్మచర్యము, అనఁగా,

" సీ. ఋతుకాలముల నాత్మసతియంద రతిసల్పు
భవ్యసీలుడు సదాబ్రహ్మచారి." — (భార. శాంతి, ౪. ఆ. ౩౯౦)

అనునట్లు, పరస్త్రీగమన వర్జితుండై యుండుటయగాక తనభార్యతో నైనను ఋతుకాలములయందు మాత్రము గూడుట; అంహిస, అనఁగా, పరుల మనస్సులకుఁగాని దేహములకుగాని బాధగలుగఁ దగిన పనులఁ జేయకుండుట; ఈ మొదలగు

సద్వృత్తులయందుఁ బ్రవర్తించుట యేదికలదో, అది కాయిక తపస్సని చెప్పబడు చున్నది.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ 15

అర్థము :— అనుద్వేగకరమ్=పరులమనసును నొప్పించనిదియు, సత్యమ్= నిజమైనదియు, ప్రియహితమ్ = ప్రియముగను హితముగను ఉండునట్టిదియు నగు, వాక్యమ్+యత్=వాక్య మేదికలదో, (తత్)+చ=అట్టివాక్యమును, స్వాధ్యాయాభ్యసనం + చ + ఏవ = వేదాధ్యయనమును, పురాణాదుల పఠనమును, వాఙ్మయం+తపః = వాచికతపస్సని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

ఇఁకను వాచిక తపస్సెట్టి దనఁగా,

"క. ఎప్పటి కేది ప్రస్తుతమొ
యప్పటి కామాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుడు సుమతీ॥"

అనునట్లు, ఇతరులమనస్సునకు నొప్పిగలుగకుండునట్లు చల్లనిమాటలాడు టయు, నిజము పలుకుటయు, వినెడువారలకుఁ బ్రియముగను హితవుగను ఉండు నట్లు మాటలాడుటయు, తీరుబాటు కాలములయందు వ్యర్థముగఁ బ్రొద్దుపుచ్చక భగవ ద్విషయములగు గ్రంథాదులఁబఠించుటయు, ఈ మొదలగునవి వాచిక తపస్సని చెప్పఁబడును.

శ్లో॥ మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధి రి త్యేత త్తపో మానస ముచ్యతే ॥ 16

అర్థము :— మనఃప్రసాదః=కలఁతనొందక నిర్మలముగ నుండెడుమనస్సు గలిగి యుండుట, సౌమ్యత్వమ్=ముఖవికాసము గలిగియుండుట, మౌనమ్=మితభాషి త్వము, ఆత్మవినిగ్రహః=మనోనిగ్రహము, భావసంశుద్ధిః=చిత్తశుద్ధిగలిగియుండుట, ఇతి+ఏతత్ = అనునిది, మానసమ్=మానసికమైన, తపః=తపస్సు (అని), ఉచ్యతే=చెప్పబడుచున్నది.

ఇఁకను మానసిక తపస్సెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

మొదటిది—మనః ప్రసాదము, అనఁగా, కలతనొందక నిర్మలముగను శాంత ముగను ఉండునట్టిమనస్సు గలిగియుండుట. రెండవది – సౌమ్యత్వము, అనఁగా అట్టి

మనోనైర్మల్యమును తెలుపదగిన ముఖవికాశము గలిగియుండుట; మూడవది-మౌనము, అనఁగా, అప్రస్తుతపు మాటలాడక మితభాషిత్వముగలిగి యుండుట, నాల్గవది-ఆత్మవినిగ్రహము, అనఁగా, మనస్సును దుర్విషయముల మీఁదికిఁ బోనీక మరలించుట; అయిదవది - భావసంశుద్ధి, అనఁగా, మనసా యొకటితలంచుట వాచాయొకటి చెప్పుట మొదలగునవి లేక నిష్కపటముగా నుండుట; అను నీ మొదలగునవి మానసిక తపస్సనబడును.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥ 17

అర్థము :— అఫలాకాంక్షిభిః = నిష్కామకర్మానుష్ఠానపరులును, యుక్తైః = యోగులునైన, నరైః = నరులచేత, పరయా + శ్రద్ధయా = పరమశ్రద్ధతో, తప్తమ్ = చేయఁబడిన, తత్ = ఆ (పైఁజెప్పఁబడిన), త్రివిధమ్ = మూడువిధములగు, తపః = తపస్సు, సాత్త్వికమ్ = సాత్త్వికతపస్సని, పరిచక్షతే = చెప్పుచున్నారు.

ఇట్లు కాయిక-వాచిక-మానసికంబని త్రివిధంబైన యీతపస్సు, సాత్త్విక-రాజస-తామసంబులని మూడువిధములు గలదిగానున్నది. అందు సాత్త్వికతపస్సెట్టి దనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఓయి యర్జునా! ఎవఁడైతే సమస్తకోరికలను వదలినవాఁడును, కష్టములకు భయపడనివాడును, సుఖములఁ గోరనివాడును, రాగభయక్రోధరహితుఁడును, విషయములయం దభిలాషయుంచక తనంతటఁ దటస్థించెడు శుభాశుభములచేఁ జలింపఁబడని మనస్సుగలవాడును, ఇంద్రియములను విషయముల నుండి కూర్మాంగములవలె మరలించు వాఁడును నైయున్నాఁడో, అట్టివాఁడు నిష్కామకర్మయోగియని యింతకుముందు చెప్పియుంటినిగదా? (చూ. 2-55, 56, 57, 58.) అట్టి నిష్కామకర్మయోగు లిట్టి త్రివిధంబులగు తపస్సులను, అనఁగా, కాయిక-వాచిక-మానసిక-తపస్సులను పరమశ్రద్ధతో నాచరింతురు. సత్త్వగుణ ప్రధానులగునట్టివారిచే నాచరింపఁబడునదిగాన నది సాత్త్వికతపస్సని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ సత్కార మాన పూజార్థం తపో దమ్భేన చైవ యత్।
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్॥ 18

అర్థము :— ఇహ = ఈలోకమునందు, యత్ + తపః = ఏతపస్సు, సత్కార మానపూజార్థమ్ = ఇతరులచే సత్కరింపఁబడుటకును, సన్మానింపఁబడుటకును పూజింపబడుటకునుగాని, దమ్భేన + చ + ఏవ = (లేక) దమ్భముచేతనైననుగాని, క్రియతే =

చేయఁబడుచున్నదో, తత్ = అది (అట్టితపస్సు). రాజసమ్=రాజసతపస్సు (అని), ప్రోక్తమ్=చెప్పఁబడుచున్నది, (తత్) = అట్టితపస్సు, చలమ్ = చలించునట్టిదియు, అధ్రువమ్=స్థిరముగా నుండనిదియు నై యుండును.

ఇఁకను రాజసతపస్సెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఈలోకమునఁ గొందరుమాత్రమే సహజమైన సాత్త్వికగుణముగలవారై పైఁజెప్పఁబడిన ప్రకారము కాయిక, వాచిక, మానసిక, తపస్సుల నాచరింతురు. తక్కినవారిలో ననేకులట్టి సహజసాత్త్వికగుణంబు లేనివారైనను, ఆ సాత్త్వికులు లోకులచేఁ బొందెడు సత్కార సన్మానాదులఁజూచి తాము నట్లే లోకులచే సత్కరింపఁబడ వలయు ననియు, సన్మానింపఁ బడవలయుననియు, పూజింపబడ వలయుననియు ఇట్టి సత్కారాది క్రియలచే ద్రవ్యమార్జింప వలయుననియుఁ గోరినవారై యాసాత్త్వికులవలెనే కాయికవాచికమానసిక తపస్సులనాచరింతురు. అట్లుకాదేని ద్రవ్యోపపత్తిగలవారై యట్టి యార్జనతో నగత్యము లేనివారలు కేవల దంభము కొఱకైనను అట్టి తపస్సంపన్నులైయున్నట్లు నటింతురు. కాన నిట్లాచరింపఁబడుతపస్సు రాజసతపస్సనఁబడును. అయితే, ఇట్టి తపస్సు సహజమైనదిగాక పులినిజూచి నక్క వాత వేసికొనినట్లు సాత్త్వికులఁజూచి యనుకరింపఁబడిన దగుటచే చాల కాలముండనేరదు. అనఁగా, వాఁడెంత ప్రయత్నపూర్వకముగ నట్లు సాత్త్వికులవలెఁ ద్రికరణముల నియమించుకొనుచు వచ్చినను, ఒకానొకప్పు డేమఱుపాటుననైనను దననిజస్వరూపము నగపఱచకమానఁడు. అదెట్లనఁగా నిట్టివేషధారియగు నొకఁడు ప్రయత్నపూర్వకముగ వాఙ్నియమము గలవాఁడై పరులకుఁ బ్రియకరములును సత్యములు నగురీతినిమాటలాడుచుండినను, ఒకానొకప్పు డప్రయత్నముగనైనను వానికిసహజంబులగు పరుషవాక్యంబులును అసత్యవాక్యంబులును పరులమనస్సునకు నొప్పిగలుగఁదగిన వాక్యంబులును వానినోట నుచ్చరింపఁబడుచుండును. ఇట్లే తక్కిన కాయిక మానసిక నియమంబుల యందుఁగూడ వాఁడు జాఱిపడుచుండును. కాన నట్టి సమయంబులయందు వాని నిజస్వరూపము బయలుపడుచుండును.

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్ ॥ 19

అర్థము :— యత్ + తపః = ఏతపస్సు, పరస్య=ఇతరునియొక్క, ఉత్సాదనార్థమ్ = నాశముకొఱకు, మూఢగ్రాహేణ = మూర్ఖపుపట్టుదలతో, ఆత్మనః + పీడయా + వా = తనశరీరమును గష్టపెట్టుకొనుటచేతనైనను, క్రియతే = చేయఁబడు

చున్నదో, తత్ = అది (అట్టితపస్సు), తామసమ్ = తామస తపస్సని, ఉదాహృతమ్ = చెప్పఁబడుచున్నది.

ఇఁకను, తామస తపస్సెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఈలోకమునఁ గొందఱవివేకులు తమకహితులుగా నుండెడివారి నాశమును గోరినవారై తదర్థముగఁ దామేదేని యొక దేవతోపాసనఁ జేయుచు నాదేవతాప్రీత్యర్థముగ నుపవాసాది వ్రతముల నాచరింపుచుఁ దమశరీరములనేకష్టపెట్టుకొనుచుందురు. కాననట్లు మూఢగ్రహపట్టుదలతోఁ దమశరీర కష్టమునకోర్చియైనను బరుల నాశముకొఱకు చేయఁబడు తపస్సు తామస తపస్సనఁబడును.

శ్లో॥ దాతవ్య మితి య ద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలేచ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ 20

అర్థము :- దేశే=(ఏ) ప్రదేశమునందు, కాలే+చ=(ఏ) కాలమునందు, పాత్రే+చ=(ఏ)పాత్రమునందు, యత్+దానమ్=ఏలాటిదానము, దాతవ్యమ్+ఇతి=ఇయ్యఁబడఁదగినదియని (ఎఱిఁగి), అనుపకారిణే=ప్రత్యుపకారము చేయలేనివారికొఱకు, దీయతే=ఇయ్యఁబడుచున్నదో, తత్+దానమ్=అట్టిదానము, సాత్త్వికమ్=సాత్త్వికదానము (అని), స్మృతమ్=ఎంచఁబడుచున్నది.

ఓయి యర్జునా! త్రివిధంబులగు తపస్సు లెట్టివై నవియుఁ జెప్పితినిగదా, ఇట్లే దానముగూడ సాత్త్విక దానమనియు - రాజసదానమనియు - తామసదానమనియు మూఁడువిధములు గలదిగానున్నది. అందు సాత్త్విక దానమెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఏదానమైతే దేశకాలపాత్రంబుల నెఱింగి ప్రత్యుపకారార్థముగాక, అనఁగా నట్టిదానమును బొందెడువానివలన నేదేనియొక ప్రత్యుపకారమును బొందవలెననెడు కోరికగాని, అట్టిదానము సేయుటవలనఁ దనకుఁ బుణ్యమబ్బుననియెడు నపేక్షగాని లేక కేవల జీవకారుణ్యముతోఁ జేయఁబడుచున్నదో అట్టిదానము సాత్త్వికదానమనఁబడును.

అర్జు — అయ్యా! ఇట్లు చెప్పుటవలన దివ్యదేశంబులయందును బుణ్యకాలంబులయందును సద్బ్రాహ్మణులు మొదలగువారి కిచ్చెడు గో-భూ-హిరణ్యాది దానంబులనియా నీభావము ?

కృ — అట్టివిమాత్రమే కాదు. మఱియు నెట్టివనిన, ఏసమయమునం దేప్రదేశంబున నెవని కేది లభింపక పోయినయెడల వాని దేహ, ప్రాణ, మానాదులకు హాని

గలుగఁదగియుండునో, ఆసమయంబున నాప్రదేశంబున నట్టి వానియెడలఁ గరుణించి వాని కది లభింపఁజేయుటచే వాని దేహ, ప్రాణ, మానాదులఁ గాపాడుటకు ముఖ్యముగ నన్వయింపుచున్నది. అదెట్లనఁగా వివరించి చెప్పుచున్నాను వినుము. ఓయియర్జునా! ఒకఁడొకయూరికిఁ బోనుద్దేశించి మార్గములోఁ దాను దినుటకై యన్నపుమూటఁ గట్టికొని యొక యడవిమార్గమునఁ బోవుచు మార్గమధ్యమందొకఁడు కేవలక్షుద్బాధచేఁ బీడితుఁడై లేవఁజాలక పడియుండుటనుజూచి, 'అయ్యో! వీనికిపుడిచ్చోట నన్నమెట్లు దొరకఁగలదు? ఇంక గొంతసేపు అన్నము లేకుండినయెడల వీనిప్రాణము నిలువదే' అని కరుణించి తనవద్దనున్న యన్నపుమూట విప్పి యందుఁ గొంతయన్న మాక్షుధాతురునకిచ్చి వానిప్రాణమును గాపాడుచున్నాఁడు. మఱియొకఁడొక నిర్జల ప్రదేశమునఁబోవుచు నందొకచో నొకఁడు మిగులఁ దప్పిఁగొని నోరెండి నడువఁజాలక యొక చెట్టునీడను బడియుండుటను జూచి 'అయ్యో' పాపము వీనికిపుడు దప్పిఁ దీర్పకపోయినయెడల ప్రాణము నిలువదే' యని కరుణించి తనప్రయాసకోర్చియైనను జలముండు చోటికిఁ బోయి యాజలమును గొనివచ్చి వాని దప్పిఁదీర్చుచున్నాఁడు. ఇంకొకఁ డొకచోఁ గేవల దారిద్రముచేతనైనను, మఱియే హేతువుచేతనైనను వస్త్రవిహీనురాలై యుండుటంజూచి 'అయ్యో, పాపము దీనికి మానభంగమగుచున్నదే' యని కనికరించి తనపైన వస్త్రము నిచ్చివేయుచున్నాఁడు. మఱియొకఁడు చలికాలంబున నొకచో నొకవస్త్రహీనుఁడు చలిచే గడగడవడఁకుచు మిగుల బాధపడుచుండుటను జూచి కనికరించి వాని కొక వస్త్రమును గప్పుకొన నిచ్చుచున్నాఁడు-అని యెంచికొనుము. ఇట్టివి ఆయాస్థలమును, కాలమును, పాత్రమును, గుర్తెఱిఁగి కేవల జీవకారుణ్యముతోఁ జేయఁబడునవి గాన నిట్టివి సాత్త్వికదానములనఁబడును. కనుకనే పుణ్యపురుషులగు ననేకులు ప్రయాణికులయొక్కయు, యాత్రికులయొక్కయు ఉపయోగార్థము మార్గములయందును దివ్యక్షేత్రములయందును సత్రములు చావిళ్లు చలిపందిళ్లు మొదలగునవి నిర్మించుటయగాక యట్టి క్షేత్రాదులయందును, ఉత్సవాది కాలంబులయందును విశేషంబుగ నన్నదానాదులంగూడఁ జేయుచుందురు. కాఁబట్టి,

"క. కావున విను పాత్రము మే
లై విహితాచరణసౌమ్యమగు దానము ధా
త్రీవర, పాత్రముదాతలఁ
దా వెలయించు భువనత్రితయరంజకతన్." (భార. శాంతి. ౧. ఆ ౩౩౮)

అనునట్లు, దేశకాల పాత్రంబుల నెఱిఁగి చేయఁబడు దానము ముల్లోకంబులవారికిని ప్రీతికరమని పెద్దలు సెప్పుదురు.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః ।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥ 21

అర్థము :- యత్ + తు = ఏదానమైతే, ప్రత్యుపకారార్థమ్ = ప్రత్యుపకారము కొఱకుగాని, పునః = మరల, ఫలమ్ = ఫలమును, ఉద్దిశ్య + వా = ఉద్దేశించిగాని, పరిక్లిష్టమ్ + చ = మనఃక్లేశముతో గాని, దీయతే = ఈయఁబడుచున్నదో, తత్ + దానమ్ = అట్టిదానము, రాజసమ్ = రాజసదానమని, స్మృతమ్ = ఎంచబడుచున్నది.

ఓయియర్జునా! సాత్త్వికదాన మెట్టిదైనదియుఁ దెలిసినదిగదా. ఇఁకను రాజస దాన మెట్టిదైనదియుఁ జెప్పుచున్నాను వినుము. ఈలోకమున ద్రవ్యవంతులలో, తమ గృహములలో జరిగెడుశుభాశుభ ప్రయోజన కాలములయందును, దివ్యక్షేత్రములలోఁ దీర్థయాత్రలుచేయు కాలములయందును, సంక్రాంతి మొదలగు పుణ్యకాలములయం దును, గోభూహిరణ్యాది దానంబులం జేయవలసివచ్చినపుడట్లు చేయుటకిష్టము లేక పోయినను, తమ స్థితిగతుల కనుగుణ్యములగు దానముల నట్టికాలములలోఁ జేయక పోయినయెడలఁ దమ బంధుమిత్రాదులలోఁ దమకపఖ్యాతి గలుగునని భయ ముతో విధిలేక చేయవలసి వచ్చెనేయని దుఃఖపడుచు నట్టి దానములఁ జేయువారు గొందఱును; అంతకుముందు తమ్మునాశ్రయించి యుండి తమ కనేకవిధములగు నుపకారములఁ జేసియుండెడు బ్రాహ్మణులు మొదలగువారలకుఁ బ్రత్యుప కారార్థ ముగఁ గాని, లేక, యట్టివారివలన ముందు కేదేనియొకయుపకారమును బొందఁగోరి యందు కొఱకుగాని యట్టికాలములయం దట్టివారి కట్టి దానముల నిచ్చువారు గొంద ఱును; అట్టి కాలములయం దట్టిదానముఁ జేసినయెడలఁ దమకు పరలోక సుఖము గలుగుననియు, మరుజన్మమున నింతకంటె నెక్కుడైశ్వర్యము గలుగుననియు నెంచి యట్టి యపేక్షతో నట్టికాలముల యందట్టి దానముల జేయువారు గొందఱునుగలరు. ఇట్టివారలు చేసెడు దానములు రాజసదానము లనఁబడుచున్నది. కావున

"క. దానవిధి యరయ నసమీ
క్షీనం బగునేనిఁ గీడు సేయుంగురుధా
త్రీనాథ! మఱియుఁ బాత్రం
బైనను గొన్నతని కిచ్చునతనికిమేకా." (భార. శాంతి. ౧. ఆ 333.)

అనునట్లు, ఇట్టిదానములు దానపాత్రులగు సద్బ్రాహ్మణాదుల కియ్యఁ బడిన నైనను, ఇచ్చువారల దురుద్దేశ్యమునుబట్టి యవి యుభయులకును, అనఁగా, ఇచ్చువారికిని బుచ్చుకొనువారికిని బ్రయోజనకరములు గానేరవు.

శ్లో॥ అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్॥ 22

అర్థము :— అసత్కృతమ్=అర్ఘ్యపాద్యాది సత్కార పూర్వకము గానిదియు, అవజ్ఞాతమ్=తిరస్కారభావముతోఁ గూడినదియునై, అదేశకాలే = దానమునకుఁ దగని కాలమునందును ప్రదేశమునందును, అపాత్రేభ్యః + చ=దానపాత్రులు గాని వారికిని, యత్ + దానమ్=ఏదానము, దీయతే=ఇయ్యఁబడుచున్నదో, తత్=అది (ఆదానము), తామసమ్=తామసదానము(అని), ఉదాహృతమ్=చెప్పఁబడుచున్నది.

ఇఁకను తామసదాన మెట్టిదైనదియుఁ జెప్పుచున్నాను వినుము. ఈలోకమున ధనమదాంధులును తమోగుణప్రధానులునగు కొందఱు, ఇపుడు నేజెప్పిన ప్రకారము స్థలనియమమును కాలనియమమును లేనివారై యెక్కడైననుసరే, ఏసమయమందైననుసరే, ఎట్టి యపాత్రులకైననుసరే, నిర్లక్ష్యభావముతో నమర్యాద పూర్వకముగ దానము చేయుదురు గాన నట్టిది తామసదానమనఁబడును.

అర్జు— అయ్యా! అపాత్రులనఁగా నెట్టివారు? అనఁగా: దానమును బుచ్చుకొనుట కెట్టివార లనర్హులు? మఱియు, నట్టిదానమును దిరస్కారభావముతో నమర్యాద పూర్వకముగా నిచ్చుట యనఁగా నెట్టిది? వివరించిచెప్పుడు.

కృ—దానమున కెట్టివార లపాత్రులనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

"సీ. పాడియు నాడియు బ్రదుకువారలఁ, బరిహాసకు, దుర్జను, నంగహీను,
మత్తుని, ముచ్చు, నున్మత్తు, నపుంసకుఁ, జెనఁటి మాటలఁ దేల్చుమనుజుఁ, గులము
చాలమి, వేదంబు చదువమి, నిజవృత్తిహాని, దుర్వృత్తిగలట్టివాని
దానపాత్రంబులఁ గా నియ్యకొనరు పెద్దలు దీనుఁడును విపద్బాధితుండు

"తే. నీగి కర్హులు దయపేర్మి నిచ్చుచోటఁ
గాకయవగుణ మెక్కుడై కానఁబడిన
నిందితాత్ముల కిచ్చుట నిష్ఫలంబు
పాత్రనిశ్చయమిట్టిది పౌరవేంద్ర!" (భార. శాంతి. ౧ ఆ. ౩౭౯.)

అనునట్లు, భగవద్విషయికములుగాక యితరములగు పాటలఁబాడుచు నాటల నాడుచుఁ బ్రతుకువారును, హాస్యము చెప్పువాఁడును, దుర్జనుఁడును, అంగహీనుఁడును, మద్యపానాదులచే మత్తుఁడగువాఁడును, చోరుఁడును, పిచ్చివాఁడును, నపుంసకుఁడును, వ్యర్థపు మాటలతోఁ బ్రొద్దుఁపుచ్చువాఁడును, నీచకులస్థుఁడును బ్రాహ్మణుండైనను వేదాధ్యయనాది నిజకులాచార ధర్మములననుష్ఠింపక దుష్ట

ప్రవర్తనయందుండువాఁడును, ఈ మొదలగువారలు దానమునకుఁ బాత్రులు గానేరరు. కాన నిట్టియపాత్రులకిచ్చెడు దానము,

"ఆ. పునుకఁ గుక్కపిత్తిఁ బోసినపాలు సె
ళ్లధికనింద బొందును నట్లు దుష్ట
మైయపాత్రవిద్యయు మునునీవి వృథవోవు:
నిచ్చుచోటఁ బాత్ర మెఱుఁగవలయు.

తే. పండునకు బిడ్డనిచ్చిన చందమొందు
బూదిలో నేయి వేల్చిన పోల్కి నొకటి
కడవలో నీళ్లు వట్టిన కరణి యగు న
పాత్రజనులకుఁ బెట్టుట పార్థివేంద్ర!"

(భార. శాంతి. ౧. ఆ. ౩౫౧. ౫౩-౫)

అనునట్లు వ్యర్థములగును. అయినను, అట్టివారిలో నెవరైన నేదేనియొక యాపదలోఁ జిక్కి దీనులై యాచించినయెడల నట్టివారలయెడఁ గరుణించుట సాత్త్వికధర్మము గాన నట్టివారికిమాత్రము దయాపూర్వకముగ నిచ్చుట నిష్ప్రయోజనముగానేరదు. ఇఁకను దిరస్కారభావముతో నసూయాపూర్వకముగ నిచ్చుట యెట్టిదనఁగా, ఒకబ్రాహ్మణుని కేదేనియొక వస్త్రదానము లేక హిరణ్యదానము మొదలగువాని నిచ్చునపుడు వినయవిధేయతలతో నాబ్రాహ్మణుని యర్ఘ్యపాద్యాదులచేఁ బూజించి ప్రీతిపూర్వకముగ నిచ్చుటకు బదులుగా "ఓయి తిమ్మణాచార్లు, ఇదిగో, ఈవస్త్రమును దీసికొని వెళ్ళిపో" అని చెప్పి యతనిమీద విసరివేయుట. "బాపనంట! బియ్యమే దొబ్బాల్నట! బంకచక్కలేముండవాయి; యీడ?" అని విసికికొనుచు ముష్టి వేయుట ఈమొదలగునవి. కాన నోయియర్జునా! ఈలాటి దానములచేఁ బుణ్యము నార్జించి కడతేరఁ జూచెడువానిగతి యేమగుననఁగా,

"క. శిల చేవ్రమాను దెప్పగ
జలనిధిఁగడవ దొరఁకొనిన చాడ్పగుఁ బాత్రం
బులు గానియెడల దానం
బులఁ బాపము నిస్తరింప బుద్ధిఁ దలచినన్." (భార. శాంతి ౧. ఆ. ౩౫౦)

అనునట్లు, ఱాయి, చేవ్రమాను మొదలగువానితోఁ దెప్పఁగావించి దానితో నీది సముద్రమును దరింపఁదలచినవాఁ డా సముద్రము నా తెప్పతోఁ దరించుటకు బదులుగ నందు మునిగి యడుగునకుఁ బోయి యెట్లు మరల పైకి తేలకుండునో, అట్లే పుణ్యము నార్జించి యూర్ధ్వలోకమునకుఁ బోవుటకు బదులుగఁ మఱియును బాపము

నార్జించి యధోగతికిఁ బోవును కావున నో యర్జునా! ఎవఁడైనను సరే, తపో యజ్ఞదానంబులనెడు కర్మంబులో దేని నాచరించినను, అది సత్కార్యముగా నుండిననే గాని లేనియెడల ఫలప్రదము కానేరదు.

అర్జు — అయ్యా! తపోయజ్ఞ దానంబులనెడు కర్మంబు లెప్పటికిని సత్కర్మలే గాని దుష్కర్మలు కావుగదా! అట్టి కర్మ నెట్టివాఁడాచరించిన నేమి? ఎట్టి యుద్దేశ్యముతో నాచరించిననేమి? సత్కర్మలుగనే యుండవలసి యుండఁగా, అవి సత్కర్మలుగా నుండిననేగాని ఫలప్రదములు గావని నీవు చెప్పుటఁ జూడఁగా, నవి యొకప్పుడసత్కర్మలగుటకూడఁ గలదని తోఁచుచున్నదే, అట్లవి యసత్కర్మలగుట కూడఁగలదా? అట్లైనయెడల నవి యెప్పుడసత్కర్మలగును?

కృ — ఆకర్మలు శ్రేష్ఠములైనవే అయినను వాని నాచరించెడు యుద్దేశ్య విధానభేదములనుబట్టి యవి యొకప్పు డసత్కర్మలగుటయుఁ గూడఁ గలదు. కాన నట్టి విధానభేదమును నీకు వివరించి చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ 23

అర్థము :— బ్రహ్మణః=పరబ్రహ్మముయొక్క, నిర్దేశః=(నామోచ్చారణను సూచించిన) ఆజ్ఞ, ఓమ్+తత్+సత్+ఇతి=(ఓమ్-తత్-సత్) అని, త్రివిధః=మూఁడువిధములుగలదిగా, స్మృతః=చెప్పఁబడినది, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, తేన=ఆనామోచ్చారణచేత, వేదాః+చ=వేదములు ఉచ్చరించుటయును, యజ్ఞాః+చ=యజ్ఞములు సేయుటయును, పురా=పూర్వము (సృష్ట్యాదికాలమునందు), విహితాః=విధింపఁబడిరి.

ఓయి యర్జునా! పూర్వము, అనఁగా, జగత్సృష్టికాలంబున సృష్టికర్తయగు నాపరబ్రహ్మ తన నామంబీలోకంబున (ఓమ్) అనియు, (తత్) అనియు, (సత్) అనియు మూఁడువిధములుగ నుచ్చరింపవలయునని నిర్దేశించినవాఁడై ఆనామోచ్చరణ పురస్కారంబుగా శబ్ద బ్రహ్మంబగు వేదము నుచ్చరింపవలయుననియు, ఆవేదోక్తంబులగు యజ్ఞాదికర్మంబుల నాచరింపవలయుననియు బ్రాహ్మణులకు విధించెను. చాతుర్వర్ణంబుల వారలుండఁగా నందు బ్రాహ్మణులకు మాత్రమట్లు విధించుటకుఁ గారణమేమనఁగా,

“ తే. క్రతువు సేఁత, సేయించుట; శ్రుతులు గాఢ
నియతిఁ జదువుట, చదివించుటయును; ధనము

లిగి, కొనుబ సత్కర్మంబు లింతవట్టు
నర్హకృత్యంబు లంద్రు ఘరాముసలకు." (భార. శాంతి. ౫. ఆ. ౨౧)

అనునట్లు, యజన - యాజనా - ధ్యయనా - ధ్యాపనా - దాన - పరిగ్రహంబు లనెడు వేదోక్తసత్కర్మంబులను బ్రాహ్మణుఁడే యనుష్ఠించుఁగనుక,

"తే. బ్రాహ్మణునకుఁ బ్రధానవృత్తనము వినుము
నిర్మలజ్ఞానయుక్తుఁడై కర్మనిరతి
నలఘునిష్ఠమై సలుపంగ నలయుదాన
సంశయములెల్లఁ బాయుఁ బ్రసాద మొందు."

(భార. శాంతి. ౫. ఆ. ౧౦౦)

అనునట్లు, ఆవేదోక్తకర్మల నధిక నిష్ఠతో నిర్మలజ్ఞానహేతులై యాచరించవలసినది వారలకు విధియైయున్నందునను, వారలట్లు విధించుటకుఁ గారణమైనదని యూహింపవలయును. అయితే, అట్లు నిర్దేశింపఁబడిన మూడునామములలో మొదటిదియగు (ఓమ్) అనునది సృష్టిస్థితిలయకర్తలగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులగుఁ త్రిమూర్తులను సూచింపఁదగిన అ కార, ఉ కార, మ కారములతోఁ గూడియుండుటం బట్టి యది త్రిమూర్త్యాత్మకమగు సగుణబ్రహ్మంబునకును, (తత్) అనునది నిర్గుణ బ్రహ్మంబునకును, (సత్) అనునది ఆ బ్రహ్మసత్తనియు నన్నిటికంటె శ్రేష్ఠమైనదనియుఁ దెలుపుటకును నన్వయింపఁబడుచున్నవి.

శ్లో॥ తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్॥ 24

అర్థము:— తస్మాత్ = ఆ కారణమువలన, బ్రహ్మవాదినామ్ = వేదవాదరతుల, విధానోక్తాః = వేదమునందు విధింపఁబడిన, యజ్ఞదానతపఃక్రియాః = యజ్ఞదానతపస్సులనెడు కర్మలు, సతతమ్ = ఎల్లప్పుడును, ఓమ్ + ఇతి + ఉదాహృత్య = ఓమ్ అని చెప్పి, ప్రవర్తన్తే = ప్రారంభింపఁబడుచున్నవి.

అయితే, ఓయర్జునా! అట్లు వేదోక్తంబులగు తపోయజ్ఞదాన కర్మంబుల నాచరించెడువారు, రెండుతెగలుగానున్నారు. అదెట్లనఁగా, కొందఱు, ఐహికములగు ధనకనక వస్తువాహనాద్యనేక విధములగు నైశ్వర్యములను, ఆముష్మికములగు స్వర్గాదిభోగములను గోరియుండుటకుఁగాఁ దపోయజ్ఞదానాది కర్మలనాచరింతురు. మఱికొందఱట్టి ఫలముల నేవియుఁగోరక ముముక్షువులై కేవల భగవత్ప్రీత్యర్థముగ నట్టికర్మల నాచరింతురు. ఆయిరుతెగలవారిలో మొదటితెగవారు, అనఁగా

కర్మఫలములఁగోరి తపోయజ్ఞాది కర్మలనాచరించెడువారు వేదవాదు లనఁబడుదురు. ఈవేదవాదరతు లట్టివారలైనదియు నింతకుముందునీకు సవిస్తరముగఁజెప్పియున్నాను గదా! (చూ. 2-42, 43, 44). కనుక నట్టి వారలాచరించెడు యజ్ఞాదికర్మలు పునర్జన్మకారణములగు స్వర్గాదిభోగములను గోరియాచరింపఁబడునవిగాన నట్టి ఫలముల నియ్యఁదగిన సగుణబ్రహ్మము నుపాసించుచు తత్ప్రతిపాదకంబగు నోంకారపురస్కారముగా నట్టివారా కర్మల నాచరింతురు.

శ్లో॥ త ది త్యనభిసన్ధాయ ఫలం యజ్ఞ తపఃక్రియాః ।
దానక్రియా శ్చ వివిధాః క్రియ న్తే మోక్షకాఙ్క్షిభిః ॥　　25

అర్థము :— మోక్షకాఙ్క్షిభిః = మోక్షాపేక్షగలవారిచేత, వివిధాః = నానా విధములైన, యజ్ఞతపఃక్రియాః = యజ్ఞములును తపస్సులును, దానక్రియాః + చ = దానములును, ఫలమ్ + అనభిసన్ధాయ = ఫలమునుగోరకయే, తత్ + ఇతి = (తత్) అను నామోచ్చారణ పురస్కారముగా, క్రియన్తే = చేయఁబడుచున్నవి.

ఇఁకను తెలివిగలవారు, అనఁగా ముముక్షువులై కేవల భగవత్ప్రీత్యర్థమట్టి కర్మలనాచరించెడు వారలేమి చేయుదురనఁగా, అట్టివారలు జ్ఞానులనియు, వారలు కర్మఫలమును విడిచిపెట్టి కర్మబంధమునుండి విడిపింపఁబడినవారై నిరుపద్రవమైన మోక్షస్థానమును బొందుదురనియు నింతకుముందు చెప్పియుంటినిగదా, (చూ. 2. 51). కనుక నట్టివారలే యజ్ఞముల నాచరించినను సరే, ఏతపస్సుల నాచరించినను సరే ఏదానముల నాచరించినను సరే వానిఫలములనుగోరక, భగవదర్పితములుగాఁ జేయుదురు. అట్టిజ్ఞానులు నిర్గుణోపాసకులగుటచే వారలచే నాచరింపఁబడు తపోయజ్ఞాదికర్మలు నిర్గుణబ్రహ్మ ప్రతిపాదకంబగు తచ్ఛబ్దపురస్కారంబుగా నాచరింపఁబడుచున్నవి. అనఁగా నట్టివారలాచరించెడు యజ్ఞాదికర్మలు (తత్) అనే శబ్దమునుచ్చరించి ప్రారంభింతురనుట. అట్టివారలు సాధారణముగ మాటలాడునపుడుగూడ తదర్థము, తదీయులు, తదీయారాధన, తత్పరత, తన్మయత్వము, అవి తచ్ఛబ్దపురస్కారముగ మాటలాడుదురు.

శ్లో॥ సద్భావే సాధుభావే చస ది త్యేతత్ ప్రయుజ్యతే!
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥　　26

అర్థము :— హేపార్థ! = ఓయియర్జునా!, సత్ + ఇతి = సత్ అనెడి, ఏతత్ = ఈశబ్దము (నామము), సద్భావే = (ఆబ్రహ్మము) సత్తైన (శాశ్వతమైన) వస్తువని తెలుపుట యందును, సాధుభావే + చ = (ఆబ్రహ్మము) శ్రేష్ఠమైనవస్తువని

తెలుపుటయందును, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది. తథా = అలాగుననే, ప్రశస్తే = ప్రశస్తమైన (శ్రేష్ఠమైన), కర్మణి + (చ) = కర్మయందునుగూడ, సత్ + శబ్దః = (సత్) అనెడుశబ్దము, యుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది.

ఇఁకను (సత్) అనెడు శబ్దమెప్పు డుపయోగింపఁబడుచున్నదనఁగా, అపర బ్రహ్మమునకైన, అనఁగా నెప్పటికిని శాశ్వతముగ నుండునట్టి వస్తువనియును తెలుపుట కుపయోగింపఁబడుచున్నది. కనుక నోయియర్జునా! అసచ్ఛబ్దము అట్లు పర బ్రహ్మప్రతిపాదకంబుగ నుపయోగింపఁబడుట మాత్రమే గాక, పదిపరములును ప్రశస్తములనగు కర్మలయందును విషయములయందునుగూడ నుపయోగింపబడుచున్నది. అదెట్లనఁగా ఏదైననొక కార్యము మంచిదిగా నున్నయెడల నది సత్కార్యమనియు, యోగ్యనితోఁ జేసెడు సాంగత్యము సత్సాంగత్యమనియు, ఒకమంచి విషయమును సద్విషయమనియు ఎవఁడైన నొకఁడవలంబించెడు వృత్తిమంచిదిగానున్నయెడల నది సద్వృత్తియనియు, ఇట్లే ఏదైననొక విషయముగాని, వస్తువుగాని, కర్మగాని, మంచిదిగను ప్రశస్తమైనదిగను నున్నయెడల నట్టిదానినిగూడ సచ్ఛబ్దపురస్కారముగ నుచ్చరింతురు.

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితి స్స దితి చోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే॥ 27

అర్థము:- యజ్ఞే = యజ్ఞమునందును, తపసి = తపస్సునందును, దానే + చ = దానమునందును (గల), స్థితిః = నిష్ఠ, సత్ + ఇతి = (సత్) అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. తదర్థీయమ్ = భగవత్ప్రీత్యర్థముగఁ జేయఁబడు, కర్మ + చ + ఏవ = కర్మయును, సత్ + ఇతి + ఏవ = (సత్) అనియే, అభిధీయతే = చెప్పఁబడుచున్నది.

కనుక నట్లే యజ్ఞములును తపస్సులును – దానములును – భగవత్ప్రీత్యర్థముగఁ జేయఁబడు కర్మలగుటచేఁ బ్రశస్తములైనవిగనుక నట్టియజ్ఞములయందును, తపస్సుల యందును, దానములయందునుగల నిష్ఠయేదిగలదో, అది సత్ అని చెప్పఁబడు చున్నది. అనఁగా నట్టి యజ్ఞములును, తపస్సులును, దానములును, సత్కర్మలని చెప్పఁబడుచున్నవనుట. ఓయియర్జునా! ఈయజ్ఞములు, తపస్సులు, దానములు మాత్రమే కాదు సుమా, భగవత్ప్రీత్యర్థముగఁ జేయఁబడు నితర మేకార్యమైననుసరే సత్కర్మయనియే చెప్పఁబడుచున్నది.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ! న చ తత్ప్రేత్య నో ఇహ ॥ 28

అర్థము:— హే పార్థ! = ఓయియర్జునా!, అశ్రద్ధయా = అశ్రద్ధతో, హుతమ్ = వేల్చఁబడినయజ్ఞమును, దత్తమ్ = ఈయఁబడిన దానమును, తప్తమ్ + తపః = చేయఁబడినతపస్సును, కృతమ్ + చ = మఱియుఁజేయఁబడిన యితరకర్మమును, యత్ = ఏది (కలదో), తత్ = అది, అసత్ = అసత్తు, ఇతి + ఉచ్యతే = అనిచెప్పఁబడుచున్నది, (తత్) = అది (అట్టికర్మము), న + ప్రేత్య = పరలోకసుఖమునిచ్చునది కాదు, నో + ఇహ + చ = ఇహలోకసుఖమునైన నిచ్చునది కాదు.

అయితే, అట్టిప్రశస్తకర్మలగు తపోయజ్ఞదానములు సయితము అశ్రద్ధతో జేయఁబడినయెడల. అనఁగా, భగవత్ప్రీత్యర్థముగ నుద్దేశించఁబడి భక్తితో శాస్త్రోక్త ప్రకారముగఁ జేయఁబడక, ఇంతకుముందు చెప్పఁబడినట్లు దంభముకొఱకును, కీర్తి ప్రతిష్ఠలకొఱకును నిర్లక్ష్యభావముతోడను జేయఁబడిన యెడల నట్టి తపోయజ్ఞదానంబులు అసత్కర్మలేయగునుగాని సత్కర్మలుగానేరవు. ఓయి యర్జునా! అట్టి తపోయజ్ఞదానంబులుమాత్రమే గావుసుమా, ఇతర యేకర్మమైననుసరే, అనఁగా దేవతారాధనము, నమస్కారము, భగవన్నామసంకీర్తనము మొదలగు నేకర్మమైననుసరే, భక్తిశ్రద్ధలులేక చేయఁబడినయెడల నవి యన్నియు నసత్కర్మలే యగుచున్నవి. కాన నట్టి కర్మలవలన బరలోకసుఖము గలుగనేరదుసరేకదా, ఇహలోకమునందైన నట్టికర్మలవలన నేమియుఁ బ్రయోజనముండనేరదు. కనుకనే, ఇంతకుముందు నేజెప్పినప్రకారము (చూ. 17-21, 22.) రాజసంబులును తామసంబులునగు తపోయజ్ఞదానాది కర్మలు అసత్కర్మలనియు, ఇహపరసౌఖ్యమున కుపయోగించనివనియు నెఱుంగుము.

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః.

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి దైవాసురసంపద్విభాగయోగం బను
సప్తదశాధ్యాయము.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ భగవద్గీతాగర్భితభావబోధిని

## అష్టాదశాధ్యాయము

### మోక్షసన్న్యాసయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో! తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశినిషూదన! ॥ 1

అర్థము:— మహాబాహో! = ఆజానుబాహుఁడవగు, హృషీకేశ! = ఇంద్రియ నియామకుఁడవును, కేశినిషూదన! = కేశియను రాక్షసుని సంహరించినవాఁడవు నైన యో కృష్ణమూర్తీ!, సన్న్యాసస్య = సన్న్యాసముయొక్కయు, త్యాగస్య + చ = త్యాగముయొక్కయు, తత్త్వమ్ = స్వరూపమును (నిజస్థితిని), పృథక్ = వేర్వేఱుగా, వేదితుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = ఇచ్ఛయించుచున్నాను.

అర్జునుఁడు — ఆజానుబాహుండవును, ఇంద్రియనియామకుండవును, కేశి సంహారకుండవునగు నోకృష్ణమూర్తీ! ప్రశస్తములగు తపోయజ్ఞదానాదికర్మలు సయితము శ్రద్ధాలోపమువలన నసత్కర్మలగుచున్నవనియు, అట్టికర్మ లిహమునకును బరమునకును నక్కఱకురావనియును నిపుడు నీవు చెప్పినవాక్యమును (చూ. 17–28) బట్టిచూడఁగా నాకొక యోచన గలుగుచున్నది. అదేమనఁగా, చెప్పుచున్నాను వినుము.

సన్న్యాసకర్మయోగములు రెండును, అనఁగా, కర్మపరిత్యాగము, నిష్కామ కర్మానుష్ఠానము, అను నీరెండును శ్రేయస్కరములేయనియును (చూ. 5–2); కర్మ సన్న్యాసయోగమును, కర్మానుష్ఠానయోగమును ప్రత్యేకములైనవని మూఢులు చెప్పుదురేకాని జ్ఞానులు చెప్పరనియును (చూ. 5–4), ఏపదవిని కర్మసన్న్యా సులు పొందుచున్నారో ఆపదవినే కర్మయోగులును బొందుదురుగానఁ గర్మసన్న్యా సంబునకును గర్మయోగంబునకును భేదములేదనియును (చూ. 5–5), ఇంతకు

ముందు చెప్పియుంటివిగదా? ఇట్లుండ శ్రద్ధాలోపమాత్రంబుచే నప్రయోజకంబులుగాఁ దగిన తపోయజ్ఞదానాదికర్మల నాచరించి తన్మూలకంబుగ వ్యర్థమగు ద్రవ్యవ్యయమును, శరీరకష్టమును గలుగఁజేసికొనుటకంటె నట్టికర్మలేవియు నాచరింపకయే సన్న్యసించియుండినయెడల నేచిక్కునులేక హాయిగా సుఖపడఁగలుగుటయేగాక నిష్కామకర్మానుష్ఠానపరులగు యోగులతోపాటు సద్గతిని యేలఁ బొందఁగూడదు? అనేసంశయము నామనస్సునఁ బొడమచున్నది. కాన నోస్వామీ! ఈసంశయముదీరునట్లు కర్మసన్న్యాసముయొక్కయు, కర్మఫలత్యాగముయొక్కయు భేదమును జక్కఁగాఁ దెలిసికొనఁగోరుచున్నాను. గాన దయచేసి దానింజక్కఁగ వివరించి చెప్పుము.

శ్రీభగవా నువాచ:

శ్లో॥ కామ్యానాం కర్మణాంన్యాసం సన్న్యాసంకవయోవిదుః।
సర్వ కర్మ ఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః॥ 2

అర్థము :— కవయః=(సామాన్యులగు) కొందఱు పండితులు, కామ్యానామ్=ఫలము నుద్దేశించి చేయఁబడునట్టి, కర్మణామ్=కర్మములయొక్క (కర్మములను), న్యాసమ్=వదలుటను, సన్న్యాసమ్+(ఇతి)=సన్న్యాసమని, విదుః=ఎఱుఁగచున్నారు (తలఁచెదరు). విచక్షణాః=(వివేకశీలురగు) మఱికొందఱు పండితులు, సర్వకర్మఫలత్యాగమ్=సమస్తకర్మములయొక్క ఫలమును ద్యజించుట, త్యాగమ్+(ఇతి)=త్యాగము (సన్న్యాసము) అని, ప్రాహుః=చెప్పుదురు.

కృష్ణు — ఓయియర్జునా! ఇపుడు నీవడిగిన ప్రశ్నవలన నీకుఁ గలిగియుండు నభిప్రాయమును గ్రహించినాను. అందుకుఁదగిన సమాధానమును జెప్పెదవినుము. ఈలోకంబునఁ బ్రతిపురుషుఁడు నాచరించవలసిన కర్మలు నిత్యములనియు కామ్యములనియు రెండువిధములు గలవిగానున్నవి. అందు నిత్యకర్మలెట్టివనఁగా, కేవలదేహధారణకర్తవ్యావశ్యకంబులగు స్నానపానఁ భోజనాది కృత్యంబులు. ఇఁకను కామ్యకర్మంబులెట్టివనఁగా, ఐహిక సుఖంబుల నపేక్షించి యందుకుఁగావలసిన ధనధాన్యాదులనార్జింపగోరి చేయఁబడు కృషి (వ్యవసాయము), గోరక్షణము (పశుధనవృద్ధి), వాణిజ్యము (వ్యాపారము), సేవకావృత్తి (ఉద్యోగము) మొదలగునవియు, ఆముష్మికంబులగు స్వర్గాదిభోగములంగోరి చేయంబడు తపోయజ్ఞ దానాదులునై యున్నవి. ఇవిగాక, నైమిత్తిక, ప్రాయశ్చిత్తాద్యనేక యితరకర్మంబులును గలవు. అవియును నేదేనియొక కారణమునుబట్టియో లేక పాపపరిహారార్థమో చేయబడునవి

గాన, కామ్యకర్మంబులలోనే పరిగణములనుచున్నవి. అయితే, ఓయియర్జునా! ఇట్లునేఁ జెప్పుటవలన నింతకుముందు చెప్పిన స్నాన, పాన, భోజనాది కృత్యంబులు గూడ దేహధారణార్థమై చేయఁబడునవిగాన నదియును నొక కారణముగ నేర్పడు చున్నదిగదా? కాఁబట్టియాకర్మలను కామ్యకర్మలు గానేరవాయని యెంచెదవు కాబోలును. అట్లెంచఁదగదు. ఏలయనఁగా, "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అనునట్లు, దేహముండినగదా ఏధర్మము నైన సాధించవచ్చును? కాఁబట్టి, అట్టి దేహధారణార్థమై చేయఁబడు భోజనాదికృత్యంబులు మాత్రము కామ్యకర్మంబులు గావని యెఱుఁగుము. ఇందువలన నొకపురుషుఁడాచరించు కర్మంబులలో నిత్యకర్మంబు లిట్టివనియు, కామ్యకర్మంబులిట్టివనియుఁ జక్కఁగ బోధపడినదిగదా? ఇట్టి కామ్యకర్మంబులఁ ద్యజించుటయే సన్న్యాసమని కొందఱు సామాన్యపండితులు చెప్పుదురు. విచక్షణులగు మఱికొందఱుపండితు లేమిచెప్పుదురనఁగా, సమస్త కర్మల నాచరింపవలసినదేయనియు, అయితే ఆకర్మలయొక్క ఫలములను గోరక వానిని భగవదర్పితములుగఁ జేయవలయుననియు, అట్లు సర్వకర్మఫలత్యాగముచేయుటయే సన్న్యాసమనియుఁ జెప్పుదురు. ఇట్టియిరుతెగలవారును రెండువిధములుగఁ జెప్పుటకుఁ గారణమేమనఁగా జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః ।
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే ॥ 3

అర్థము:— కర్మ=సమస్తకర్మము, దోషవత్=(ఏదేనియొక) దోషముగలదిగ (నెంచి), త్యాజ్యమ్+ఇతి=త్యజింపఁబడఁదగినదియని, ఏకే+మనీషిణః=కొందఱు బుద్ధిమంతులును, యజ్ఞదానతపఃకర్మ=యజ్ఞము, దానము, తపస్సు అనెడు కర్మ (మాత్రము), న+త్యాజ్యమ్+ఇతి=విడువఁబడఁదగినది కాదని, అపరే+చ=మఱి కొందఱును, ప్రాహుః=చెప్పుదురు.

ఓయియర్జునా! ఈలోకమునఁ బ్రతిమనుజుఁడు నాచరించు ప్రతికర్మయందును నేదేనియొక కొద్దిదైనను, గొప్పదైనను దోషము గలుగవచ్చును. ఆదోషములలోఁ గొన్ని బుద్ధిపూర్వకముగ జేయఁబడునవిగను మఱికొన్ని యజ్ఞానకృతములుగను నుండ వచ్చును. అదెట్లనఁగా, వ్యవసాయము సేయునపుడు భూమిలోనుండు ఎఱ్ఱలు మొదలగు ననేకజంతువులను హింసించవలసివచ్చును. పశువులను బాధించవలసివచ్చును. వ్యాపారము సేయునపుడు, అనృతమాడుట మోసముసేయుట మొదలగు దోషములు గలుగవచ్చును. సేవకావృత్తియందు స్వామిద్రోహము మొదలగుదోషములు గలుగవచ్చును. యజ్ఞములు సేయుటలో పశుహింసాది దోషములు గలుగవచ్చును.

తపములు సేయుటలో నుపవాసాదులచేఁ దనయాత్మను క్షోభింపఁజేయవలసివచ్చును. దానము సేయుటలో నపాత్రదానాదిదోషములు గలుగవచ్చును. వేయేల, తాను భుజించుటకుపయోగించెడు కాయలు - పండ్లు - ఆకులు - మొదలగువానిని ఛేదించుటయందును, త్రాగెడు నుదకమునందు నుగూడ ననేకవిధములగు జీవహింసలు గలుగవచ్చును. కనుక నన్నికర్మలును దోషసహితములనియే చెప్పవచ్చును. కాఁబట్టి కొందఱు బుద్ధిమంతులు కేవలదేహధారణావశ్యకములగు కర్మ లనివార్యములగుటచే వానిని మాత్రమాచరించినను, నివారింపఁగూడిన తక్కిన కామ్యకర్మములనన్నిటిని ద్యజించుట యుక్తమని తలఁచి యట్లు చెప్పుదురు. మఱికొందఱు బుద్ధిమంతులు ఏకర్మలనైనను ద్యజింపవచ్చునుగాని, యజ్ఞము-దానము-తపస్సు-అను నీమూడు కర్మలనుమాత్రము త్యజింపఁగూడదని చెప్పుదురు.

అర్జు — అయ్యా! ఈయిరుతెగలవారి యభిప్రాయము లిట్లున్నవిగదా? ఇందులో నేతెగవారి యభిప్రాయము సరియైనదని నీతాత్పర్యము !

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధ స్సంప్రకీర్తితః ॥ 4

శ్లో॥ యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్ ।
యజ్ఞో దాన తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥ 5

శ్లో॥ ఏతా న్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ ।
కర్తవ్యా నితి మే పార్థ! నిశ్చితమ్ మత ముత్తమమ్॥ 6

అర్థము :- హేభరతసత్తమ!=భరతవంశశ్రేష్ఠుఁడవగు నోయర్జునా!, తత్ర + త్యాగే=ఆత్యాగవిషయమునందు, మే + నిశ్చయమ్ = నానిశ్చితాభిప్రాయమును, శృణు=వినుము. యజ్ఞః=యజ్ఞమును, దానమ్=దానమును, తపః + చ=తపస్సును, మనీషిణామ్=బుద్ధిమంతులకు, పావనాని + ఏవ = పావనములైనవియే, (తస్మాత్)= ఆకారణమువలన, తత్ + యజ్ఞదానతపఃకర్మ = ఆయజ్ఞదానతపస్సనెడు కర్మ (మాత్రము), కార్యమ్ + ఏవ = చేయఁదగినదియేగాని, న + త్యాజ్యమ్ = విడువఁదగినది కాదు. హేపార్థ=ఓయర్జునా, అపి + తు=అయినను, ఏతాని + కర్మాణి= ఈకర్మలు, సఙ్గమ్=ఆసక్తియును, ఫలాని + చ=ఫలములను, త్యక్త్వా=విడిచిపెట్టి, కర్తవ్యాని + ఇతి=చేయఁబడఁదగినవని, మే=నాయొక్క, నిశ్చితమ్=నిశ్చితమైన, ఉత్తమమ్ + మతమ్= ఉత్తమాభిప్రాయము, హేపురుషవ్యాఘ్ర=పురుషశ్రేష్ఠుఁడవగు

నోయర్జునా!, త్యాగః + హి = (ఇఁకను) త్యాగమన్ననో, త్రివిధః = మూఁడువిధములు గలదిగా, సంప్రకీర్తితః = చెప్పఁబడియున్నది.

కృ — భరతసత్తముఁడవగు నోయియర్జునా! ఆ త్యాగవిషయమునందు నాయభిప్రాయ మెట్టిదైనదియును జెప్పుచున్నాను వినుము.

యజ్ఞము, దానము, తపము అను నీ మూఁడుకర్మలు అశ్రద్ధతోఁ జేయఁబడిన వైననుసరే, పావనములైన కృత్యంబులే యనిబుద్ధిమంతు లెంతురు. ఏలయనఁగా, అశ్రద్ధతోఁ జేయఁబడినయజ్ఞదానతపంబులు అసత్కార్యంబులనియు, వానివలన నిహమునందును బరము నందును నేమియుఁ బ్రయోజనములేదనియు నింతకుముందు చెప్పియుంటినిగదా (చూ 17—28). అట్లుచెప్పుటవలన నాభావమేమనఁగా, నట్టి కర్మలఫలనఁగలుగవలసిన పుణ్యము వానికిఁ గలుగనేరదనియే కాని యందువలనఁ బాపముగలుగునని కాదు. అదెట్లనఁగా, ఓయియర్జునా! ఇంతకుముందు, నేనునీకు "నహికల్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాతగచ్ఛతి" మంచికార్యముచేయువాని కెప్పటికిని దుర్గతికలుగనేరదని యింతకుముందు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ 6—40).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — అట్లే, యజ్ఞదానతపస్సులును ప్రశస్తమైన (మంచి) కర్మంబులే గనుక వాని నాచరించెడువానికి శ్రద్ధాలోప కారణంబుచేఁ బుణ్యమబ్బక పోయినను, పాపముగలుగ నేరదు గాన నట్టికర్మంబులఁద్యజింపఁ గూడదని నాయభిప్రాయము.

అర్జు — అయ్యా! ఈనీవాక్యము నాకు మిక్కిలి వింతగానున్నది. ఎవఁడైననుసరే పుణ్యపాపములు రెండును లేనికర్మలను ప్రయప్రయాసలఁ జెంది వ్యర్థముగ నేల యాచరింపవలెను?

కృ— అవును. నీవెంచునట్లు శ్రద్ధలేని కర్మలువ్యర్థములే. కనుకనే, ఈయజ్ఞదానతపస్సులు శ్రద్ధాయుక్తుఁడును ఫలాసక్తిరహితుఁడునైయే, యెవఁడైననాచరించవలసినదని నాయొక్క ముఖ్యాభిప్రాయము. అయినను, శ్రద్ధావిరహితుఁడైయాచరించెడువాడును, ఇట్టికర్మల నిష్ప్రయోజనములుగనెంచి త్యజించుటకంటె నాచరించుటయే మేలనియెంచుము. ఏలయనఁగా, అట్లాచరించుటవలనఁ బ్రకృతమునందేమియుఁ బ్రయోజనమున్నట్లుగపడకపోయినను, ముందుకు ప్రయోజనము గలుగవచ్చును. అదెట్లనఁగా జెప్పుచున్నాను వినుము.

ఎప్పుడును మద్యపానము నెఱుఁగనియొకడు దుర్జనసాంగత్యముచే దానినభ్యసించినయెడలఁ దొలుతవానికదిమిగుల వెగటుగను, అయిష్టముగను నుండినను, వాని

సంగడికాండ్ర ప్రోత్సాహముచే నయిష్టముతోనైనను దానినివిడువక యభ్యసింపుచు నచ్చినయెడలఁ గొంతకాలమునకు వానికి దానియందభిరుచిగలిగి మిగుల నాసక్తితో నభ్యసించుచువచ్చుటయు, తుదకువానికా యభ్యాసము స్వభావముగనేర్పడి యదిలేని యెడల బ్రదుకుటయే కష్టముగ నుండునట్లేర్పడుటయును జూచుచున్నాముగదా? అట్లే, ఈయజ్ఞ దానతపస్సులనెడు కర్మలనుగూడ నెవడైన నశ్రద్ధతో నాచరింపుచు వచ్చినను, విడువక యట్లే కొంతకాలమాచరింపుచు వచ్చినయెడలనది వానికభ్యాసవశమున స్వభావముగ నేర్పడి యావల నాకర్మలనత్యంతశ్రద్ధతో నాచరించు నట్లేర్పడవచ్చును గాన దానిఫలన వానికప్పుడు ప్రయోజనము కలుగవచ్చును. కాఁబట్టి యట్టి కర్మలనెవడును విడువక యాచరింపుచునే యుండవలసినదని నాయభిప్రాయము అట్టికర్మల ద్యజించుటకూడ తామస త్యాగమనియు, రాజస త్యాగమనియు, సాత్త్విక త్యాగమనియు మూడువిధములు గలదిగానున్నది గాన వాని విచారమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ 7

అర్థము :— నియతస్య = వేదములవలనను-శాస్త్రములవలనను-నియమింపఁబడి యుండునట్టి, కర్మణః = శ్రౌతకర్మముయొక్కయు, స్మార్తకర్మముయొక్కయు, సన్న్యాసః + తు = పరిత్యాగమన్ననో, న + ఉపపద్యతే = చేయ(తగినది కాదు), మోహాత్ = అవివేకమువలన (చేయబడిన), తస్య = అట్టికర్మముయొక్క, పరిత్యాగః = పరిత్యాగము, తామసః = తామసపరిత్యాగ మని, పరికీర్తితః = చెప్పఁబడుచున్నది.

ఓయి యర్జునా! ఈలోకమున నెవఁడైనఁ గర్మను సన్న్యసింపవలసిన క్రమమెట్టిదనఁగా, ఈవిషయమున వ్యాసమహర్షి తనపుత్రునిఁడగు శుకున కుపదేశించిన పద్ధతిం జెప్పుచున్నానువినుము.

“ సీ. విను మని, మునియిట్టులను బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ యతులు విహిత
కర్మనిష్ఠత సిద్ధిఁ గాంతు రాశ్రమచతుష్కమును జతుష్పదీ ఘటితమైన
నిశ్శ్రేణికుదముట్టు నెల వెక్కుటను నిట్టి క్రమవర్తనము సుకరంపుమార్గ
మాయువు మొదలినాలవపాలు గురుపాల దానునియట్లు సంతోషముఁ బనులఁ.

తే. బ్రీతిఁ జేయుచుఁ గుడిచిన పిదపఁ గుడిచి
శయ్యఁజెందిన నాతని చరణయుగము

గరయుగంబున నొత్తుచుఁ గలితనిద్రుఁ
డైన నిద్రించు బ్రహ్మచర్యాన్వితుండు.

క. రసగంధ ప్రముఖంబుల
చెస వేడుక లేక గురుమతికి వచ్చిన య
ట్టిసమయములఁ బగ వేదా
భ్యసనంబులు సేయుచుండు నాతఁడు నియతిన్''

(భార. శాంతి. ౫ ఆ. ౧౩౬, ౧౩౭.)

అనునట్లు, కర్మలసన్న్యసించి యత్యాశ్రమమును బొందఁగోరెడువాఁడు దొలుత బ్రహ్మచర్యంబును తదనంతరము గృహస్థాశ్రమధర్మంబును, అటుపిమ్మట వానప్రస్థాశ్రమధర్మంబును యథావిధిగజరుపవలయును. అదెట్లనఁగా, తొలుత బ్రహ్మచారిగ నుండి యొకసద్గురువు నాశ్రయించి దాసునివలె నతనికిఁ బరిచర్యసేయుచు నతఁడు నుడిచినపిదపఁ దానుగుడుచుచునతఁడు శయనింపనపుడతని పాదములనొత్తుచు నతఁడిష్టపడి చెప్పునపుడు వేదపాఠమునభ్యసింపుచు నింద్రియవిషయంబులయం దాసక్తి లేనివాఁడై యుండవలయును. అటుపిమ్మట,

" సీ. సవినయంబుగఁ దనశక్తితోఁ గురునకు దక్షిణ యిచ్చి యాతండు పనుపఁ
గా సమావర్తన కార్యంబు నడపి వివాహమై హవ్యకవ్యముల నతిథి
తోషణ బాంధవ పోషణంబుల సత్యభాషల నిజదారపరతఁ బుత్ర
సంశిక్షఁ గ్రతువిశేషంబుల నొకయాయురంశంబు గడపి గృహస్థధర్మ

తే. వృత్తిఁ గృతకృత్యుఁ డగు నగ్ని విడువ కడవిఁ
బూరిపంటలఫల మూలములను భిక్షు
పూజనలు పుచుఁ బరిశిష్టములు భుజించి
తపము సేత వానప్రస్థ ధర్మసరణి.'' (భార. శాంతి. ౫ ఆ. ౧౩౮.)

అనునట్లు, తనశక్తికొలఁది గురుదక్షిణసమర్పించి యతనియాజ్ఞనుబొంది వివాహముచేసికొని యేకపత్నీవ్రతుఁడై నిజదారపుత్ర బంధుమిత్రాదులఁ బోషింపుచు నతిథ్యభ్యాగతులనాదరింపుచుఁ గ్రతువులఁజేయుచు గృహస్థాశ్రమధర్మంబు జరుపవలయును. అటుపిమ్మట నగ్నిసహితంబుగ నడవియందు వాసముచేయుచు నచట యతులకు భిక్షనొసఁగుచు తపస్సుసేయుచు వానప్రస్థాశ్రమంబు నాచరింపవలయును. ఇట్లీమూఁడాశ్రమముల ధర్మంబులను యథావిధిగ నాచరించినపిమ్మట,

" క. వానప్రస్థప్రక్రియఁ
దా నొక పాలాయువునఁ బదంపడి తుదిపా

లైనను సన్న్యాసాను
ష్ఠానమునకుఁ జొచ్చు నతఁడు శాంతాత్మకుఁడై.''
(భా. శాంతి. ప. ౧౪౨.)

అనునట్లు, శాంతినొందిన చిత్తముగలవాఁడగును. అనఁగా, ఇంద్రియవిషయాదులచేఁ జలింపఁబడని మనస్సుగలవాఁడగును గనుక నప్పుడు సన్న్యాసాశ్రమంబు నవలంబించుట కర్హుఁడగును.

ఇట్లుండ నీలోకంబునఁ గొందఱవివేకు లేమిచేయుదురనఁగా, పై జెప్పఁబడిన మూఁడాశ్రమములను యథావిధిగ జరిపి తమచిత్తము పరిపక్వదశను బొందకనునుపే ఏదేనియొక గృహచ్ఛిద్రాది కారణమువలనఁ దత్కాలంబునంబొడమిన స్వల్పవైరాగ్యంబుఁబూని, అట్టిపరిపక్వదశనుబొందని సన్న్యసించినవారింజూచి, పులినిజూచి నక్కవాతవేసికొనినట్లు తామునట్లే సన్న్యసింతురు. ఇట్టివారిమనస్సు సన్న్యాసమునందు చాలకాలము నిలువఁజాలదు కాఁబట్టి, ఇట్టిది కేవల యవివేకముచేఁ జేయఁబడు త్యాగము గనుక నిది తామసత్యాగమనఁబడును. ఇట్టి సన్న్యాసమువలన నేమియుఁ బ్రయోజనము గలుగనేరదు.

శ్లో॥ దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్ ।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలంలభేత్ ॥ 8

అర్థము:— యత్ + కర్మ = ఏకర్మమును, దుఃఖమ్ + ఏవ = కష్టమునుగలుగఁజేయునదియేఅని(తలఁచి), కాయక్లేశభయాత్ = దేహప్రయాసగలుగున నెడుభయముచేత, త్యజేత్ = విడిచిపెట్టుచున్నాఁడో, సః = వాఁడు, రాజసమ్ = రజోగుణసంబంధమైన, (తత్) + త్యాగమ్ = అట్టిత్యాగమును, కృత్వా = చేసియు, త్యాగఫలమ్ = త్యాగఫలమును, న + ఏవ + లభేత్ = పొందనేపొందఁడు.

మఱికొంద ఱేమిచేయుదురనఁగా, దారపుత్రబంధుమిత్రాదుల పోషణ మొదలగువానికిఁ గావలసిన ద్రవ్యసంపాదన మొదలగు కర్మములఁజేయుటకు సోమరితనముచే బద్ధకించినవారై శిఖాయజ్ఞోపవీతములను విసర్జించి కాషాయదండ కమండలముల ధరించి సన్న్యాసివేషమువేసికొని లోకులను మోసపుచ్చి వారివలన పూజింపఁబడుచు భిక్షగొనుచుందురు. ఇట్టిది రాజసత్యాగమనఁబడును. ఇట్టి త్యాగము సేయువారు తామస త్యాగులవలె నేదేని గృహచ్ఛిద్రాది కారణమువలనఁ దత్కాలమునందు బొడమిన స్వల్పవైరాగ్యమైనను లేనివారును, శరీరప్రయాసకు భయపడి కేవల సోమరితనముచేఁ బనులఁ జేయనొల్లక మోసవిధముగఁ బొట్టబోసికొనఁదలచి

యిట్టివేషమును ధరించినవారునుగనుక నిట్టిసన్న్యాసమువలన నేమాత్రమును ప్రయోజనము గలుగనే గలుగ నేరదు.

శ్లో॥ కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున! ।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః ॥ 9

అర్థము :— హేఅర్జునా=ఓయియర్జునుఁడా, నియతమ్=శాస్త్రాదులచే నియమింపఁబడిన, యత్+కర్మ=ఏకర్మము, కార్యమ్+ఏవ=చేయఁదగినదియే, ఇతి=అని, సఙ్గమ్=ఆసక్తియును, ఫలమ్+చ=ఫలమును, త్యక్త్వా=విడిచి, క్రియతే=చేయఁబడుచున్నదో, సః+త్యాగః+ఏవ=అట్టిత్యాగమే, సాత్త్వికః=సాత్త్వికత్యాగమని, మతః=అభిప్రాయము.

ఓయియర్జునా! తామస-రాజసత్యాగము లెట్టివైనవియుఁ జెప్పియైనదిగదా, ఇఁకను సాత్త్వికత్యాగ మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. అది పైఁజెప్పఁబడిన తామస రాజసత్యాగములవలె కర్మాచరణమును త్యజించుటగాదు. మరేమనిన, వేదోక్తంబులగు శ్రౌతకర్మంబులును, శాస్త్రోక్తంబులగు స్మార్తకర్మంబులును, అన్నియుఁ జేయఁబడవలసినవే యనియెడు నిశ్చయబుద్ధిగలవాఁడై, ఎవఁడైతే అట్టి యేకర్మమైనను తనప్రయోజనార్థమని యభిమాన పురస్కారముగగాని, లేక, అందువలన నొకఫలమును దాఁబొందవలెనని యెడు కోరికతోఁగాని చేయక, ఇది విద్యుక్తమైన కర్మగాన దీని భగవత్ప్రీత్యర్థముగఁ జేయవలసినదనియెడు తలంపుతోఁ జేయుచున్నాఁడో, అట్టివాఁ డాకర్మనాచరించియు నాచరించనివాఁడేఁ అనగా, త్యజించినవాఁడే యగుచున్నాఁడు. కాన నట్టివానిత్యాగము సాత్త్వికత్యాగ మనఁబడుచున్నది.

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే ।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥ 10

అర్థము :— సత్త్వసమావిష్టః = సత్త్వగుణప్రధానుఁడగు, త్యాగీ = కర్మఫలత్యాగి, ఛిన్నసంశయః=సంశయరహితుడును, మేధావీ=ధారణాశక్తిగలవాఁడునునై, అకుశలమ్+కర్మ=చేయుటకుఁగష్టమైనట్టిగాని లేక దుఃఖకరమైనట్టిగాని కర్మను, న+ద్వేష్టి=ద్వేషింపబడు (చేయుటమానఁడు), కుశలే=చేయుటకు సులభమైనట్టిగాని లేక సుఖకరమైనట్టిగాని (కర్మయందు), న+అనుషజ్జతే=ఆసక్తుఁడుగాడు.

అట్టి సత్త్వగుణ ప్రధానుఁడు కర్మనాచరించియు నాచరించని వాఁడెట్లగుచున్నాఁడనఁగా, అట్టివాఁడు ధారణాశక్తిగల బుద్ధియుతుఁడై యుండుటంబట్టి వేదోక్తంబులును, శాస్త్రోక్తంబులును, గురూపదిష్టంబులునగు సమస్తకర్మంబులు నాచరింపఁ

దగినవియేయని నమ్ముచున్నాఁడుగాని ఇవి చేయవచ్చునా, లేదా, వీనివలనఁ దనకుఁ బ్రయోజనమున్నదా, లేదా, అనే మొదలైన సంశయముల నుంచికొనఁడు. కాన నట్టివాఁడట్టి యన్నికర్మలను సంకోచింపక యాచరించునేగాని వానిలోఁగష్టములును దుఃఖకరములు నగు కర్మలను విడిచిపెట్టుటయు, సులభములును సుఖకరములు నగు కర్మలనుమాత్ర మాచరించుటయు లేదు. వానివలననొక ప్రయోజనమును గోరఁడు. కాననట్టివాఁడాకర్మల సన్న్యసించినవానితో సమఁడగుచున్నాఁడు.

అర్జు — అయ్యా! ఇట్లు శరీర ప్రయాసకరములగు కర్మలనాచరించి వానిఫలములనుత్యజించి యుట్టికర్మల నాచరించనివానితో సమఁడగుటకంటె, అట్టికర్మల నాచరింపక యేయుండుట మేలుగదా? అట్లుండ నింతప్రయాసపడి యాచరించవలసిన కారణమేమి?

శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే॥ 11

అన్వయము:— హి=ఏలయనఁగా, కర్మాణి=కర్మములను, అశేషతః=నిశ్శేషముగా, త్యక్తుమ్=త్యజించుటకు, దేహభృతా=దేహధారియగువానికి, న+శక్యమ్=శక్యము కాదు, (తస్మాత్)=ఆ కారణమువలన, యః+తు=ఎవఁడైతే, కర్మఫలత్యాగీ=కర్మఫలమును త్యజించుచున్నాఁడో, సః=వాఁడు, త్యాగీ+ఇతి=సన్న్యాసియని, అభిధీయతే=చెప్పఁబడుచున్నాఁడు.

కృ — అట్లు ఫలాభిసంధిరహితముగఁ గర్మనాచరించవలసినదని చెప్పుటకుఁ గారణమేమనఁగా, చెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! ఎవఁడైననుసరే, ఒకప్పుడును కర్మచేయక యుండజాలఁడనియు, వానిస్వభావగుణములు వానిచే నస్వతంత్రముగానైనఁ గర్మలఁ జేయింపుచుండుననియు నింతకుముందు చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా? (చూ. 3-5).

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక దేహధారులగు జీవుల కట్లు కర్మలసన్న్యసించి నిర్గుణోపాసన సేయుటమిగులఁ గష్టతరమనియును జెప్పి యుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (12.5)

అర్జు — అవును, జ్ఞాపకమున్నది.

కృ — కాబట్టి దేహధారులగు జీవులకుగర్మలన్నిటిని సన్న్యసించుటకు సాధ్యపడదు. అట్లన్నికర్మలను సన్న్యసించిననేగాని నిజమైన సన్న్యాసి గానేరఁడు. కాన

నట్లు చేయుటకు బనులుగ నెవఁడైతే శాస్త్రోక్తములు, తనస్వభావాను గుణ్యంబులు నగు సమస్త నిత్యనైమిత్తికాది కర్మంబుల నాచరించుచు నాకర్మఫలముల యందాసక్తినిమాత్రము విడుచుచున్నాఁడో, అట్టివాఁడే సన్న్యాసి యని చెప్పఁబడి యుంచున్నాఁడు.

అర్జు — అయ్యా! కర్మనాచరించువాఁడు కర్మఫలత్యాగ మెందుకు చేయవలెను! చేయని యెడలఁ గలిగెడు బాధక మేమి?

శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥ 12

అర్థము :— అత్యాగినామ్=కర్మఫలత్యాగము సేయనివారలకు, ప్రేత్య=మరణాంతరము, కర్మణః+ఫలమ్=(వారు చేసిన) కర్మయొక్క ఫలము, అనిష్టమ్=అనిష్టమైనదిగనైనను ఇష్టమైనదిగనైనను, మిశ్రమ్+చ = ఇష్టానిష్టములు మిశ్రముగఁ గలదిగనైనను, త్రివిధమ్=(ఇట్లు) మూడువిధములుగలదిగా, భవతి = అగుచున్నది (ఉండును), సన్న్యాసినామ్+తు=కర్మఫలత్యాగము చేసిన వారికన్ననో, క్వచిత్=ఒకప్పుడును, న+(భవతి)=కలుగదు

కృ — ఓయి యర్జునా! కర్మఫలత్యాగ మెవఁడు చేయవలయుననఁగా, ముముక్షువు, అనఁగా మోక్షాపేక్ష గలవాఁడు చేయవలయును. ఏలయనఁగా, అట్లు కర్మఫలత్యాగము చేయనివానికి మరణానంతరము వానివాని సుకృతదుష్కృతములకుఁ దగినట్లులిష్టానిష్ట ఫలములు గలుగును. అదెట్లనఁగా, కేవలసుకృతమును జేసిన వానికి స్వర్గాది యూర్ధ్వలోక సుఖములును, మనుజన్మయం దుత్కృష్ట జన్మమును గలుగును. కేవలదుష్కృతము చేసినవానికి నరకలోక బాధలును మనుజన్మయందుఁ గేవల నీచజన్మమును గలుగును. సుకృత దుష్కృతములను మిశ్రములుగఁ జేసిన వారలకు తదనుగుణ్యములగు స్వర్గాది సుఖములును నరకబాధలును ననుభవించి పిమ్మట కేవల యుత్కృష్టముగాక, కేవలనికృష్టముగాక మధ్యమమగు జన్మములనెత్తి సుఖ దుఃఖముల మిశ్రమములుగ ననుభవింతురు. ఇఁకను, కర్మఫలమును బూర్తిగఁద్యజించిన వారికన్ననో, వారు చేసిన కర్మలు సుకృతములైననుసరే, దుష్కృతములైననుసరే, మిశ్రములైనను సరే, ఆకర్మలన్నియు భగవదర్పితము లగుచున్నవిగాన వానిఫలము లేవియు నాకర్మలఁజేసిన వారికిఁజెంద నేరవు. కనుకనట్టివారు మరల జన్మించవలసిన కారణముండదు.

కాఁబట్టి, ఓయియర్జునా! ముముక్షువులిట్టి జన్మరాహిత్య కారణంబగు కర్మఫల త్యాగమును జేయవలయునని చెప్పుటకుఁ గారణమైనది.

ఆర్జు — అయ్యా! ఇట్లుచెప్పితివిగదా. ఇందువలనఁ గర్మఫలత్యాగము చేయుట ముముక్షువుల కావశ్యకమేయని బోధపడినది. అయితే, ఆకర్మఫలత్యాగ మెట్లుచేయవలయునో, ఆవిషయమునుగూడ దయచేసి చెప్పుము.

శ్లో॥ పఞ్చైతాని మహాబాహో! కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ 13

అర్థము :— హే మహాబాహో=ఆజానుబాహుఁవగు నోయర్జునా!, సర్వకర్మణామ్=సమస్తకర్మములయొక్క, సిద్ధయే = సిద్ధికొఱకు, కృతాన్తే + సాంఖ్యే + ప్రోక్తాని=కర్మసన్న్యాసమును గుఱించిన సాంఖ్యశాస్త్రమునందుఁ జెప్పఁబడిన, ఏతాని=ఈ (ఇఁకఁ జెప్పబోయెడు), పఞ్చ + కారణాని=అయిదు కారణములను, మే=నావలన, నిబోధ=తెలిసికొనుము.

కృ — ఓయియర్జునా! ఇపుడు నీవడిగిన ప్రశ్నఁ జూడఁగా నీయభిప్రాయ మేమిగానున్న ట్లగపడుచున్నదనఁగా, ఈలోకమున నెవఁడేని యొకకర్మ నాచరించినయెడల "అవశ్య మనుభోక్తవ్యం ఫలంకర్మ శుభాశుభం" అనునట్లాకర్మయొక్క ఫలము ననుభవించవలసినవాఁడైయుండఁగా, కర్మనుమాత్ర మాచరించి దానిఫలము దనకంటకుండునట్లేయుపాయముచేతఁ జేసికొనఁగలఁడని సందేహించుచున్నట్లగపడుచున్నది. కాన నందుకుఁదగిన సదుపాయమును జెప్పుచున్నాను వినుము.

ఈలోకమునఁ బ్రతిపురుషుఁడునుజేయు ప్రతికర్మకును, అయిదు కారణములు గలవు. అవి సాంఖ్యశాస్త్రంబునఁ జక్కఁగ వివరింపఁబడియున్నవి. వానింటెలిసికొంటివేని నీకీసంశయము నివర్తింపఁగలదు కాన వానింజెప్పెద వినుము.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥ 14

అర్థము :— అత్ర=ఈ కర్మాచరణ విషయమునందు, అధిష్ఠానమ్=కార్యస్థానము, తథా=అలాగుననే, కర్తా=చేయువాఁడును, పృథక్ + విధమ్=అనేకవిధములైన, కరణం + చ = సాధనసంచయమును, వివిధాః=నానావిధములుగను, పృథక్=వేఱువేఱుగను (ఉండునట్టి), చేష్టాః + చ=చెయువులును (వ్యాపారములును), పఞ్చమమ్=అయిదవదియగు, దైవమ్ + చ + ఏవ=దైవమును (అనునవియే) (కారణాని)=కారణములుగానున్నవి.

ఓయియర్జునా! ఈలోకమున నెవఁడైన నేదేని యొకవ్యాపారమును జేయఁ బూనినయెడల నందుకుఁదగిన పరికరములన్నియు నుండవలెనుగదా? అనఁగా, (1) అట్టివ్యాపారము జేయుటకుఁదగిన శాల - ఇల్లు మొదలగు కార్యస్థానమును; (2) ఆస్థలమునందుండి యావ్యాపారమునకుఁ గావలసిన పనులఁ జేయువాఁడును; (3) ఆపనులనుజేయుటకుఁ దగిన యనేకవిధములగు నుపకరణములు (పనిముట్లును); (4) ఆపనిముట్లతోఁ జేయఁబడు ననేకవిధములగు పనితనములును; (5) అట్టిపనులఁ జేయునట్లు నియమించెడు యజమానియు నుండవలెనుగదా? ఈ యైదు కారణములు గూడిననేగదా యేదేని యొకవ్యాపారము జరుగఁదగియుంచున్నది?

అర్జు — అవును, ఈ యైదు కారణములును గూడిననే గాని యేవ్యాపారమును జరుగనేరదు.

కృ — అవునుగదా? కనుక నీప్రపంచమునఁ బ్రతిపురుషుఁడాచరించెడు ప్రతి కర్మకు నిట్లే యైదు కారణములు గలవని యెఱుంగుము. అట్లనిన, ఈపాంచభౌతిక దేహమే కార్యస్థానము; ఈదేహమునందుండెడు జీవుఁడే కర్త అనఁగా, పనిచేయు వాఁడు; మనోబుద్ధీంద్రియములే ఉపకరణములు: ఈమనోబుద్ధీంద్రియములచేఁ జేయఁ బడుచేష్టలే, అనఁగా, మనస్సుచేఁదలఁచుట, బుద్ధిచే నిశ్చయించుట మొదలగు మనోవ్యాపారములును, చెవిచేవినుట, కంటితోఁజూచుట, ముక్కుతో నాఘ్రాణించుట, జిహ్వతోరుచిఁజూచుట, త్వక్కుతోస్పృశించుట మొదలగు జ్ఞానేంద్రియ వ్యాపారములును; నోటితోమాటలాడుట, చేతులతోఁబనిచేయుట, కాళ్ళతోనడచుట, గుహ్యస్థానములతో మలమూత్ర విసర్జనము సేయుట మొదలగు కర్మేంద్రియ వ్యాపారములును; ఆకర్తయగు జీవునిచేఁ జేయఁబడుపనులును నైయున్నవి. ఇట్టి కార్యస్థానమునందుండి యిట్టియుపకరణములతో నీలాటిపనులను జేయవలసినట్టిజీవునికి నియమించెడువాఁడు దైవము (భగవంతుఁడు) అయ్యున్నాఁడు. కనుక నీయైదు కారణములుగూడిననేగాని యేపురుషుఁడును ఏకర్మనైనను జేయఁజాలఁడు. అనఁగా, నీదేహమునందుండెడుజీవుఁడు దైవముచేఁ బ్రేరేపింపఁబడి తనమనోబుద్ధీంద్రియములతో బ్రతికర్మను జేయుచున్నాఁడనుట.

కనుక నొకకార్యస్థానమునందుండి కూలికిఁబనిచేయువాని పనితనములవలనఁ గలిగెడు లాభనష్టము లాపనుల నియమించెడు యజమానికెట్లు చెందుచున్నవో, అట్లే జీవుఁడును, ఈదేహమునందుండి భగవత్ప్రేరేపణవలనఁ సమస్తకర్మలను జేయుచున్నాఁడుగనుక నట్టికర్మలయొక్క ఫలములగు పుణ్యపాపములాకర్మల నాచరించుట కాజీవునికి బుద్ధిఁబుట్టించిన యాభగవంతునికే చెందఁదగినవై యుంచున్నవి.

శ్లో॥ శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్య హేతవః॥ 15

అర్థము :— నరః = (ఒక) నరుఁడు, శరీరవాఙ్మనోభిః = శరీరము, వాక్కు-మనస్సు వీనిచేత, న్యాయమ్+వా = న్యాయమైనట్టిగాని, విపరీతమ్+వా = అన్యాయమైనట్టిగాని, యత్+కర్మ = ఏకర్మమును, ప్రారభతే = ప్రారంభించుచున్నాఁడో, తస్య = ఆకర్మమునకు, ఏతే = ఈ(పైఁజెప్పఁబడిన), పఞ్చ = ఐదును, హేతవః = కారణములు (అగుచున్నవి.)

కనుక నోయియర్జునా! ఈలోకమున నెవఁడైననుసరే, మానసిక, వాచిక, కాయికములగు కర్మలలో నెప్పుడేది యాచరించినను ఆకర్మ న్యాయమైనదైనను అనఁగా శాస్త్రవిహితమైనదైననుసరే, లేక, అన్యాయమైనదైనను, అనఁగా శాస్త్రవిరుద్ధమైనదైననుసరే, అట్టిప్రతికర్మకును పైఁజెప్పఁబడిన యైదును గారణములుగ నుంచున్నవి. అనఁగా, దేహము అధిష్ఠానముగను, జీవుఁడుకర్తగను, మనోబుద్ధీంద్రియములు కరణములుగను, ఆయింద్రియములయొక్క వ్యాపారములు చేష్టలుగను దైవము నియామకుఁడుగను నుంచున్నారని యెఱుంగుము. అనఁగా నీయైదు కారణములలో నేదేని యొకటి కొఱఁతపడినపుడేలాటికర్మయు జరుగనేరదనుట. అదెట్లనఁగా వివరించి చెప్పుచున్నాను వినుము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అనునట్లు, తొలుత శరీరముండిననే కదా, యేకర్మనైనఁ జేయుటకువీలుపడును? ఆశరీరముండియు నందు జీవుఁడు లేకపోయినయెడల నట్టి నిర్జీవకళేబర మేమిచేయఁగలదు? మంచిది, శరీరముండి యందు జీవుఁడుండినను ఆశరీరమునకు సంబంధించిన యన్నియవయవములును జక్కఁగా నుండిననే కదా ఆయా యవయవములతో నాయాపని చేయఁబడుచుండును? లేనియెడల సాధ్యపడదుగదా? అనఁగా, దేహమును, జీవుఁడునుండియు నాదేహమునకు నేత్రములు లేనియెడలచూచుటయును, చెవులులేనియెడల వినుటయును, కాళ్లులేనియెడల నడుచుటయును, ఇట్టియవయవము లేకపోవుచున్నదో ఆయవయవములతోఁ జేయవలసిన పని జరుపుటకు వీలులేదుగదా? మంచిది, దేహమును-జీవుఁడును సమస్తావయవములును-ఉండియు నాజీవుఁడా యవయవములతో నేలాటిచేష్టలును సేయక యూరకుండినయెడల నేపనియును జరుగనేరదుగదా? మంచిది, ఏదేహము నందుండెడు జీవుఁడాదేహావయవములతో నేదేనియొకపని చేయవలసినట్లు భగవంతుఁడాజీవునికి బుద్ధిఁబుట్టించిననేగదా వాఁడాపనినిజేయఁ బూనుకొనుచున్నాఁడు? కాఁబట్టి ప్రతిపురుషుఁడు సేయు ప్రతికర్మమునకు నీయైదును కారణములని యెఱుంగుము

అర్జు — అయ్యా! ఇదియంతయుసరే, అయితే ఇచట నాకొక సంశయము గలుగుచున్నది. అదేమనఁగా, ఒక నరుఁ డాచరించెడు కర్మ న్యాయమైనదైనను సరే లేక అన్యాయమైనదైననుసరే. అట్టిప్రతికర్మకు నీవైదును కారణములని చెప్పితివి గదా, ఆ యైదు కారణములలోఁ గడపటిది దైవప్రేరేపణయంటివి గదా. అట్లయిన యెడల దైవమేవనికైన న్యాయములగు కర్మలఁజేయుటకుఁ బ్రేరేపించుటము సహజమైనపని గాని. న్యాయవిరుద్ధములగు పనులఁజేయునట్లుగూడఁ బ్రేరేపించునా ?

కృ — ఓయియర్జునా !

శ్లో. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢానిమాయయా." (చూ.18-61)

అనునట్లు, సమస్తభూతములకు నియామకుఁడగు నీశ్వరుఁడు, ఆభూతములహృదయములయందుండి—యంత్రగాఁడు బొమ్మల నాడించిన ట్లాడించుచున్నాఁడుగాన నా యీశ్వరాజ్ఞ లేకయే యెవఁడును నేపనియును జేయఁజాలఁడు. కనుక నొకఁ డాచరించెడు కర్మ న్యాయమేగాని యన్యాయమేగాని—ఆయీశ్వరాజ్ఞవలన జేయఁబడినదనియే యెంచవలసినది. ఇందుకునిదర్శనమేమనఁగా, దుర్యోధనుఁడు రారాజు గదా ? బాగుగా న్యాయాన్యాయపరిశీలనఁ జేయఁజాలని మూఢుఁడు కాఁడుగదా ? అట్లుండియు నతఁడు పాండవులగు మీయెడల జరిగించినవన్నియు నక్రమము లేగదా ? మీయర్ధరాజ్యమునిచ్చివేయుమని — యతని తలిదండ్రులును, విదురుఁడు — భీష్ముఁడు — ద్రోణుఁడు మొదలగువారును — శ్రీకృష్ణద్వైపాయనుఁడు — నారదుఁడు మొదలగు మహర్షులును ఎంతోదూరము బుద్ధిచెప్పిరిగదా, తుదకు నేనును జెప్పితినిగదా, ఇందఱు చెప్పినను వినక తాను జేయఁబూనుకొనిన యక్రమమునందే స్థిరబుద్ధిగలవాఁడైయుండెను గదా ? ఇట్టి యంతటికిని, ఈశ్వరుఁడనగు నేనే కారణభూతుఁడనని యెఱుంగుము అదెట్లనఁగా, నే నీభూభారనివారణార్థమై యవతరించియున్నానని యింతకుముందే చెప్పియుంటినిగదా ? కాఁబట్టి యందుకుఁగా నీగొప్పయుద్ధమును గల్పింపఁబూని యతనికిట్టి దుర్బుద్ధియును తాఁ జేయఁబూనిన యక్రమమునెడల గట్టిపట్టుదలయును గలుగఁజేసితినని యెఱుంగుము.

అర్జు — ఓహో ! ! అట్లైనయెడల నెవఁడైననుసరే, ఏలాటికర్మ నాచరించి. ననుసరే, వానికి పుణ్యపాపము లెక్కఁడివి.

శ్లో॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః ॥ 16

అర్థము:— తత్ర=ఆకర్మవిషయమునందు, ఏవమ్ + సతి=ఇట్లు (అయిదు కారణములు) ఉండఁగా, యః + తు=ఎవఁడైతే, అకృతబుద్ధిత్వాత్=తెలివిమాలిన బుద్ధిగలవాఁడగుటవలన, కేవలమ్ + ఆత్మానమ్=తన్నే, కర్తారమ్=కర్తనుగా, పశ్యతి=చూచుచున్నాఁడో (తలంచుచున్నాఁడో), సః + దుర్మతిః=అట్టిదుర్బుద్ధిగలవాఁడు, న + పశ్యతి=(కర్మయొక్క నిజస్వరూపమును) ఎఱుఁగఁడు.

కృ— అవును, అట్లు ప్రతికర్మకుఁగలిగియుండు నైదైదు కారణములను జక్కఁగ నెఱిఁగి ప్రవర్తించెడు జ్ఞానికి నేలాటిపుణ్యపాపములునంటనేరవుసరే; అయితే, ఈకర్మయొక్క నిజస్వరూపమిట్లుండఁగా నీలోకమునందలి జనులలో నొకానొకఁడుమాత్రమే దాని నెఱుంగఁగలఁడుగాని, తక్కినవారందఱు నజ్ఞానముచే నావరింపఁబడిన బుద్ధిగలవారలై యాకర్మయొక్క నిజస్వరూపమిట్టిదని యెఱుంగఁజాలక యహంకారయుక్తులై యాకర్మలను దామే స్వతంత్రించి చేయుచున్నామని తలంచెదరు. కాన నట్టిదుర్బుద్ధులు మదించిన యేనుఁగు తననెత్తినమట్టిఁదానే వేసికొనినట్లు భగవత్ప్రేరణమునఁ దముచేఁజేయఁబడిన కర్మలయొక్క కర్తృత్వమును దమయందే యారోపించుకొనుచున్నారుగాన నట్టివారల కాకర్మలయొక్క ఫలములగు పుణ్యపాపములంటక మానవు.

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాం ల్లోకా న్న హన్తి న నిబధ్యతే॥ 17

అర్థము:— యస్య=ఎవనికి (నేనీకర్మను జేయుచున్నాననెడి), అహంకృతః=అహంకారయుక్తమైన, భావః = భావము (తలంపు), న = లేదో, యస్య = ఎవనియొక్క, బుద్ధిః = బుద్ధి, న + లిప్యతే = (తాఁజేయుకర్మమునందు) ఆసక్తి నొందదో, సః = (అట్టి) వాఁడు, ఇమాన్ + లోకాన్ = (మనయెదుటనుండు) ఈజనులనందఱిని, హత్వా + అపి = చంపియు (చంపినను), న + హన్తి = చంపినవాఁడు కాఁడు, న + నిబధ్యతే = (ఆకర్మమువలన) బద్ధుఁడునుఁగానేరఁడు.

అట్లుగాక, ఎవఁడైతే అహంకారభావములేనివాఁడై తాఁజేయు కర్మలన్నియు భగవత్ప్రేరణవలననే చేయఁబడుచున్నవిగాని తనస్వబుద్ధిచేఁ జేయఁబడునవి కావనియు, వానికర్తృత్వము దనయందు లేదనియునెంచి యాకర్మలయం దాసక్తచిత్తుఁడు గాక ప్రవర్తించుచున్నాఁడో, అట్టివాఁడిపుడు మనయెదుటనుండు నీజనులనందఱిని జంపినను వారలఁ జంపినవాఁడు గానేరఁడు. వారలఁజంపుటవలనఁగలిగెడు పాపమును వాని కంటనేరదు.

అర్జు — అయ్యా! అట్లైనయెడల నెవఁడైననుసరే తాఁజేయుకర్మలన్నియు భగవత్ప్రేరేపణవలనఁదనచేఁ జేయఁబడుచున్నవేగాని తాఁజేయుటలేదనియెడు మనో నిశ్చయముతో నెట్టిఘోరకృత్యములైనను ఎట్టియకృత్యములైనను నిర్భయముగాఁ జేయవచ్చునుగదా? అందువలన వానికేమియు పాపమంటనేరదుగదా?

కృ — ఓయియర్జునా! ఇపుడు నీవడిగెడు ప్రశ్ననుబట్టిచూడఁగా నేఁజెప్పిన విషయమును నీవుసరిగా గ్రహించినట్లగపడదు. ఇపుడు నేఁజెప్పిన విషయము నీవు తలచునట్లంత సులభమైనదికాదు మఱియునిన నీవిషయమునకు సంబంధించిన ధర్మసూక్ష్మములు కొన్నిగలవు వానిఁగూడఁజేర్చి యాలోచించిననేగాని దీనితత్వమిట్టిదిగదాయని యెఱుఁగఁజాలవు. కాన వివరమును జెప్పెదవినుము.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః ॥ 18

అర్థము :— కర్మచోదనా = కర్మప్రేరక కారణము, జ్ఞానమ్ = తెలియుట యనియు, జ్ఞేయమ్ = తెలియఁదగిన విషయమనియు, పరిజ్ఞాతా = తెలియువాఁడనియు, త్రివిధా = మూఁడువిధములుగలవిగానున్నది. కర్మసఙ్గ్రహః = కర్మకాధారము, కరణమ్ = ఉపకరణము, కర్మ = చేయుట, కర్తా = చేయువాఁడు, ఇతి = అని, త్రివిధమ్ = మూఁడు విధములుగా నున్నది.

ఓయియర్జునా! కారణములేని కార్యముండదుగదా? కాఁబట్టియీలోకమున ప్రతిపురుషుఁడు జరిగించెడు ప్రతికర్మకును గారణభూతమగు విషయమొకటియుండవలెనుగదా? ఆవిషయమిట్టిదని ముందుగాఁ దెలిసికొనఁబడఁదగినది గనుక నది జ్ఞేయమనఁబడుచున్నది. ఆవిషయము సరియైనదియౌనా కాదాయని చక్కఁగ విమర్శించి తెలిసికొనుట యేదిగలదో, అది జ్ఞానమనఁబడుచున్నది. అట్లు పరిశీలించి యుక్తాయుక్తము నెఱిఁగెడువాఁడు పరిజ్ఞాతయనఁబడును. ఈమూఁడును సమకూడిననేగాని యొకకర్మను బ్రారంభించుటకుఁ బ్రేరేపణ గలుగనేరదుగదా? అట్లు ప్రేరేపింపఁబడిన కర్మనాచరించుటకుఁ దగిన పరికరములును, ఆపరికరములతోఁ బనిచేయువాఁడును నుండి యాపనిచేసిననేగాని యాకర్మ పరిసమాప్తి కానేరదుగదా? కాఁబట్టి ప్రతికర్మకును, జ్ఞానము, జ్ఞేయము. పరిజ్ఞాత, కరణము, కర్మ, కర్త, నీయాఱును నొనఁగూడిననేగాని యాకర్మ పరిసమాప్తి కానేరదు.

కనుక నెవఁడైతే యేకర్మనైన నాచరించునపుడు, అందుకుఁదగిన కారణముండి యాకారణము సరియైనదనియు, దానినాచరించుట యావశ్యకమనియు జెలిసి

కొన్నవాఁడై యందుకుఁదగిన పరికరముతో నాకర్మముయొక్క ఫలాఫలములయం దాసక్తచిత్తుఁడుగాక భగవదిచ్ఛానుసారముగఁ జేయుచున్నానని నిశ్చయబుద్ధితోఁ జేయుచున్నాఁడో, అట్టివానికా కర్మలయొక్క ఫలములగు పుణ్యపాపములంటనేరవు.

ఇందుకిపుడు నీకుఁదటస్థపడియుండెడు నీయుద్ధకర్మమే నిదర్శనముగనున్నది. అదెట్లనఁగా, మీయర్థరాజ్యమును దుర్యోధనుఁ డక్రమముగ నపహరించుటవలనఁ గదా యీయుద్ధము తటస్థించినది? కాననిదియే యీయుద్ధకర్మమునకుఁ గారణ భూతమైనవిషయమై యున్నది. ఈయుద్ధము చేయవచ్చునా చేయఁగూడదా యని పాండవులగు మీరు చక్కఁగఁబరిశీలించి, ఈయుద్ధముజరిగినయెడల బంధుమిత్రాదు లగు ననేకులకు మరణముగలుగునని చింతగలవారై యేవిధమునైన నీయుద్ధమును నివారించుట మంచిదనియెంచినవారై యందుకు దగు రాయబారములన్నిటిని జరిపియు దుర్యోధనుని మూర్ఖపుపట్టుదలచేఁ నవియన్నియు వ్యర్థములై తుదకు యుద్ధముసేయ వలసినట్లే యేర్పడెనుగదా? ఇట్లు తనంతటఁ దటస్థించిన యుద్ధమును జేయనొల్లక తానుకఁదియుట క్షత్త్రియధర్మమునకు లోపము గనుక నీయుద్ధమునకుఁ బాండవులగు మీరును బూనుకొని యందుకుఁ దగిన యుపకరణములను, అనఁగా, రథ, గజ, తురగ, పదాతులుగల చతురంగబలమును బంధుమిత్రసహితంబుగఁ గూర్చుకొనవలసి వచ్చెనుగదా? ఇపు డిచట యుద్ధమునకుఁ దలఁపడియున్న యీయుభయసైన్య ములంజూచి యందుండు బంధుమిత్రాదులం జంపఁజేతులాడక చింతింపుచున్నావు గదా? ఇట్లు చింతించియు నీకులధర్మమునుబట్టి యీయుద్ధమును జేయవలసినవాఁడవై యున్నావుగదా? ఇఁకను నీవేమి చేయవలసియున్నదనఁగా, ఇంతజన మేకకాల మున నీవిధముగ మరణమునొందవలసినట్లు భగవంతుఁడు నిర్ణయించియుండెఁగా నేనేమిచేయవచ్చును నా కులధర్మమునుబట్టి నేను యుద్ధముచేయక విధిలేదుగదా యనియెంచి జయాపజయములయందు దృష్టినుంచక భగవంతునియందు భారము వేసి యుద్ధము చేసితివేని నీచే నీజనమంతయుఁ జంపఁబడినను, అందువలన నీకే మియుఁ బాప మంటనేరదు.

కనుక నిట్లే ప్రతిపురుషుఁడును దాఁజేయఁబూనుకొనియెడు ప్రతికర్మకును గలిగియుండెడు కారణమును జక్కఁగఁబరిశీలించి యుక్తాయుక్తము నెఱుంగవల యును. అట్లెఱిఁగినపిమ్మట నాకర్త యన్యాయమైనదిగఁగాని, పరహింసాకరమై నదిగఁగాని, ఘోరమైనదిగఁగాని యుండునెడల సాధ్యమైనంతమట్టుకు దాని నివా రింపఁ బ్రయత్నించియు ననివార్యముగఁ జేయవలసినట్లే తటస్థించినయెడల నప్పుడు దైవముమీఁద భారము వేసి చేసినయెడల నాకర్మవలని పాపము వాని కంటనేరదని యెఱుంగుము.

అట్లుతగు కారణము లేకయు, ఉండినను, అదినివారింపఁదగినది యౌనా కాదా యని చక్కఁగ విమర్శింపకయు నెవఁడైన భగవంతునియందు భారమువేసి గుడ్డెద్దు చేలోఁబడిన ట్లైదైన నిట్టికర్మనాచరించినయెడల, వాఁడు సాత్త్వికజ్ఞానముతో నిట్టి పనిచేసినవాఁడు కాడుగనుక వాని కాకర్మఫల మంటకమానదు.

అర్జు — అయ్యా! జ్ఞానమునందు గూడ సత్త్వాదిగుణభేదము కద్దా?

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావ చ్ఛృణు తా న్యపి॥ 19

అర్థము:— జ్ఞానమ్=జ్ఞానమును, కర్మ+చ=కర్మమును, కర్తా+చ=కర్తయును, గుణభేదతః=ప్రకృతి గుణములవలనఁ గలిగెడు భేదమునుబట్టి, త్రిధా+ఏవ=మూడువిధములైనవిగనే, గుణసఙ్ఖ్యానే=గుణములనుగుఱించినసాంఖ్యశాస్త్రమునందు, ప్రోచ్యతే=చెప్పఁబడుచున్నది, తాని+అపి=వానినిగూడ, యథావత్=శాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నట్లు, శృణు=(చెప్పుచున్నాను) వినుము.

కృ — అవును కద్దు. ఒకజ్ఞానముమాత్రమే కాదు, కర్మయును కర్తయును గూడ సత్త్వాదిగుణభేదముచే మూడేసి విధములు గలవిగానున్నవి. ఈవిషయము గుణములనుగుఱించి చెప్పఁబడియుండు సాంఖ్యశాస్త్రంబున విపులముగఁ జెప్పబడి యున్నది. కాన నీకావిషయమునుగూడ నాసాంఖ్య శాస్త్రములోఁ జెప్పఁబడి యున్న ప్రకారముగఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ 20

అర్థము:— యేన = ఏజ్ఞానముచేత, విభక్తేషు = వేఱువేఱుగావిభజింపఁబడి యుండునట్టి, సర్వభూతేషు = సమస్తభూతములయందు (ఉండునట్టి), భావమ్ = ఆత్మసత్తను, అవిభక్తమ్ = విభజింపఁబడనిదియు, అవ్యయమ్=నాశరహితమైనదియును, ఏకమ్ = (ఆపరమాత్మ) ఒక్కటియే, (ఇతి) = అని, ఈక్షతే = చూచుచున్నాఁడో (తెలిసికొనుచున్నాఁడో), తత్+జ్ఞానమ్ = ఆజ్ఞానము, సాత్త్వికమ్= సాత్త్వికజ్ఞానమని, విద్ధి = ఎఱుఁగుము.

ఎవఁడైతే యీప్రపంచమునందలి పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తజంతువుల యందుండు జీవాత్మలు ప్రత్యేకములైనవి కావనియు, అనఁగా, నొక జంతువునందుండెడు జీవాత్మకును మఱియొక జంతువునందుండెడు జీవాత్మకును భేదములేద

నియు, అనఁగా, "మణికనకరజితతామ్రలోహ కాంస్యమృణ్మయఘటంబుల లోపల వెలుపల నంటక యాకాశంబు వ్యాపించియున్న చందంబున విమత్ప్రవన తేజోజల భూదేవమానవతిర్యక్స్థావరాది చరాచరంబులయందు బాహ్యాభ్యంతరంబుల నసంగుండనై నిండియుండుటంజేసి నాకు దేశకృతపరిచ్ఛేదంబులేదు" అని శ్రీరాములవారాంజనేయున కుపదేశించినట్లు, ఱాయి, బంగారము, వెండి, రాగి, ఇనుము, కంచు, మట్టి మొదలగువానిచేఁ జేయబడినవియు కొద్దివి గొప్పవియు నగు నన్ని పాత్రంబుల యందును నిండియుండెడు నాకాశంబొక్కటియే యెట్లైయున్నదో, అట్లే దేవ, మనుష్య, పశు, మృగ, పక్షి, క్రిమి, కీటకాది సమస్తజంతువులయందును నాపరమాత్మ యొక్కఁడే జీవస్వరూపముతో నున్నాఁడనియు, పైజెప్పఁబడినపాత్రలు పగిలి గాని విఱిగిగాని పోయినను, వానియందలి యాకాశమెట్లు చెడకుండునో, అట్లే యీసమస్త జంతువుల దేహములు నశించినను ఆదేహములయందుండెడు నాత్మ యెప్పటికిని నశించునది కాదనియును నెఱుఁగుచున్నాఁడో, అట్టివానికిఁగల యట్టిజ్ఞానము, సాత్త్వికజ్ఞాన మనఁబడును.

శ్లో॥ పృథక్త్వేనతు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్॥ 21

అర్థము :— యత్ + జ్ఞానమ్ + తు = ఏజ్ఞానమైతే, సర్వేషు + భూతేషు = సమస్తభూతములయందును, పృథగ్విధాన్ = వేఱువేఱురూపములతోనుండెడు, నానాభావాన్ = అనేకములగుజీవాత్మలను, పృథక్త్వేన = వేఱువేఱుజీవాత్మలనుగా, వేత్తి = ఎఱుఁగుచున్నదో, తత్ + జ్ఞానమ్ = ఆజ్ఞానము, రాజసమ్ = రాజసజ్ఞానమని, విద్ధి = ఎఱుఁగుము.

అట్లుగాక, ఎవఁడైతే యీప్రపంచమునందలి యెనుబది నాలుగులక్షల జీవరాసులలోనుండెడు జీవాత్మలును వేఱువేఱుజీవాత్మలనియు, ఆయాజంతువుల స్వరూపములకును పరిమాణమునకును దగినట్లు గొప్పవి కొద్దివిగనుండుననియు, అనఁగా ఏనుగునందుండు జీవాత్మ మిగుల గొప్పదిగా నుండుననియు, చీమయందుండు జీవాత్మ మిగుల స్వల్పమైనదిగా నుండుననియు, ఇట్లే ప్రతిజంతువునందుండెడు జీవాత్మయు నాజంతువుయొక్క పరిమాణమునకుఁ దగినట్లు గొప్పదిగగాని, కొద్దిపాటిదిగఁగాని యుండుననియు, ఇట్లు ప్రతిజీవరాసి యందుండు జీవాత్మ తక్కినజీవరాసులలో నుండు జీవాత్మల కంటె వేఱైనదియేగాక, ఆయొకజీవరాసిలోనైనను నెన్నిజంతువు

లున్నవో అన్నిటియందును అన్ని ప్రత్యేకజీవాత్మలుండుననియు నెంచుచున్నాఁడో అట్టివానిజ్ఞానము రాజసజ్ఞానమని యెఱుంగుము.

శ్లో॥ యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే స క్త మహైతుకమ్ ।
అతత్త్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్॥ 22

అర్థము :— యత్ + తు = ఏజ్ఞానమైతే, ఏకస్మిన్ + కార్యే = (ఏదేని) ఒక్కదానియందే, కృత్స్నవత్ = సమస్తమునున్నట్లెంచి, సక్తమ్ =(దానియందే) తగిలిన మనస్సుగలదియగుచున్నదో, తత్ =అట్టి, అహైతుకమ్=అ కారణమైనట్టియు, అతత్త్వార్థవత్ =తత్త్వమును తెలియనిదియు, అల్పమ్ + చ=స్వల్పమైనదియు నగు, (జ్ఞానమ్) = జ్ఞానము, తామసమ్=తామసజ్ఞాన మని, ఉదాహృతమ్=చెప్పఁబడినది.

ఇఁకను, తామసజ్ఞాన మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఈలోకమున నవివేకులగు కొందఱు సృష్టిస్థితిలయములకుఁ గర్తయగు నీశ్వరుఁడు సర్వత్రనంతర్యామిగా నున్నాఁడనియెఱుఁగఁజాలక యేదేని యొక వస్తువునందు లక్ష్యముంచి యందుమాత్రమేభగవంతుఁడున్నాఁడనియు తక్కినచోట్ల లేడనియు నెంచెదరు. అదెట్లనఁగా, కాశీపట్టణమునందలి యీశ్వరాలయమున విశ్వేశ్వర నామముతోఁ బ్రసిద్ధిఁ జెందియుండెడు లింగమే భగవంతుఁడుగాని మఱియెచ్చటను లేడనికొందఱును, రామేశ్వరములో రామలింగేశ్వర నామముతోఁ బ్రసిద్ధిఁజెందియుండెడు లింగమే భగవంతుఁడని కొందఱును, తిరుమలలో శ్రీ వేంకటేశ్వర నామముతోఁ బ్రసిద్ధిఁజెంది యుండెడు విగ్రహమే భగవంతుఁడని కొందఱును, శ్రీరంగములో శ్రీరంగనాథ నామముతోఁ బ్రసిద్ధిఁజెంది యుండెడు విగ్రహమే భగవంతుఁడని కొందఱును ఇట్లేదేని యొక్కొక్క స్థలమున నొక్కొక్క నామముతోఁ బ్రసిద్ధిఁజెందియుండు విగ్రహాదులలో నేదేనియొకదాని యందు గుఱియుంచి యచ్చటమాత్రమే యారూపముతో భగవంతుఁడున్నాఁడనియు, తక్కిన యేచోటను లేడనియు నెంచెదరు. ఇట్లెంచెడు వారలు, అచ్చటమాత్రమే యాభగవంతుఁ డుండుటకుఁ గారణమేమి ? అచ్చోట వలెనే తక్కినచోట్లనుగూడ సృష్టిస్థితిలయములు జరుగుచున్నవి గదా అట్టి సృష్టిస్థితిలయములకుఁ గర్తయెవఁడు ? ఒకచోట తాము గుఱి యుంచియుండెడు స్థలమునందుండెడు భగవంతుఁడే తక్కిన యన్నిచోట్ల జరుగుచుండెడు సృష్టిస్థితిలయములకుఁ గర్తయని యెంచునెడల నాభగవంతుఁడు దనచే సృజింపఁబడిన యన్నిచోట్లనుండి ఆచోట్లయందుండు నందఱకును సేవయొసఁగక యచ్చటి వారలకుమాత్రము సేవయొసఁగుచుండుటకుఁ గారణమేమి ? అను నీమొదలగు కారణముల నాలోచింపకయే యట్లు

నమ్ముచున్నారు. కాఁబట్టి వారలకుఁ గలజ్ఞానము అల్పమైనదియు కారణరహితమైన దియు నైయున్నది. కాన నట్టివారలజ్ఞానము తామసజ్ఞానమని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ నియతం సఙ్గరహిత మరాగ ద్వేషతః కృతమ్ ।
అఫలప్రేప్సునా కర్మ య త్త త్సాత్త్విక ముచ్యతే ॥ 23

అర్థము:— యత్ = ఏది, నియతమ్ = శాస్త్రములచే నియమింపఁబడినదై, అఫలప్రేప్సునా=ఫలాపేక్ష లేనివానిచే, సఙ్గరహితమ్=అసక్తిరహితముగను, అరాగద్వేషతః=రాగద్వేషములులేకయును, కృతమ్ = చేయఁబడినట్టి, కర్మ = కర్మగానుంచున్నదో, తత్=అది, సాత్త్వికమ్=సాత్త్విక కర్మయని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

ఓయియర్జునా! జ్ఞాన మెట్లు సత్త్వాదిగుణములచే మూఁడువిధములైనదియుఁ జెప్పితినికదా? ఇట్లే, కర్మయును సాత్త్వికకర్మయనియు, రాజసకర్మయనియు, తామసకర్మయనియు మూఁడువిధములు గలదియైయున్నది. అందు సాత్త్వికకర్మ యెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఈలోకమునఁగొందఱుబుద్ధిమంతులు తమతమ వర్ణాశ్రమాచారధర్మంబులకుఁదగినట్లు శాస్త్రవిహితములగు నిత్యనైమిత్తికాది కర్మలనాచరించుటలో నాకర్మలవలనఁ దమకొక ఫలము గలుగవలయునని యపేక్షింపక తమవర్ణాశ్రమాచార ధర్మమునుబట్టి తామాకర్మల నాచరించుట విధియనియెంచి శాస్త్రగర్హితములు గాకుండున ట్లాచరింతురు. అట్లాచరింపఁబడు కర్మలలోఁ గొన్నియితరప్రాణులకు హితకరములుగను, మఱికొన్ని యితరప్రాణులకు బాధకరములుగను నుండవచ్చును. అయితే, అట్లాచరించెడు వాఁడు తనకర్మలలో నేదియేప్రాణికి హితకరముగనుంచున్నదో దాని నాప్రాణియం దభిమానించియు, ఏది యేప్రాణికి బాధకరముగ నుంచున్నదో దాని నాప్రాణియందు ద్వేషించియుఁజేయఁడు. మఱియును, తనవర్ణాశ్రమాచార ధర్మమునుబట్టి యేయేకాలముననేయేకర్మ నాచరించవలసినది యుక్తమో, ఆయా కాలమున నాయాకర్మ నాచరించుటతనకు విధియనినమ్మి యితరయపేక్ష లేమియు లేనివాఁడై చేయుచుండును. కనుక నోయియర్జునా! ఇట్టివనిచే నేకర్మ యాచరింపఁబడుచున్నదో, ఆకర్మ సాత్త్వికకర్మ యనఁబడును. ఇందుకు నీవిపుడు చేయఁబోయెడు యుద్ధకర్మమే నిదర్శనముగా నున్నది.

శ్లో॥ య త్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం త ద్రాజస ముదాహృతమ్॥ 24

అర్థము :— యత్ + కర్మ + తు=ఏకర్మయైతే, కామేప్సునా=ఫలము నపేక్షించువాని చేతఁగాని, పునః=లేక, సాహఙ్కారేణ + వా=నేనుగర్తనని యహంకరించెడువానిచేతగాని, బహుళాయాసమ్=అధికప్రయత్నములతో, క్రియతే=చేయబడుచున్నదో, తత్=అది (ఆకర్మ), రాజసమ్=రాజసకర్మయని, ఉదాహృతమ్=చెప్పఁబడినది.

మఱికొంద ఱేమిచేయుదురనఁగా, తమ వర్ణాశ్రమాచార ధర్మములనుబట్టి తాము విధ్యుక్తముగ నాచరించవలసిన నిత్యనైమిత్తికాది కర్మల నాచరించుటలో, ఆకర్మలవలనఁ దమకేదేనియొక ప్రయోజనము గలుగవలయునని యధికప్రయత్నముతో నాచరించెడువారు కొందఱును, ఈకర్మను నేనాచరించుచున్నాను గదా నేనే ప్రయోజకుఁడను గదా యని గర్వించి తన ప్రయోజకత్వము నిరూపించ గనపఱచుటకై యధికప్రయత్నముతో నాచరించెడువారు కొందఱునైయున్నారు. అదెట్లనఁగా, ఎవని జననీజనక దారపుత్రాదులఁ బోషించుటవానికి విధ్యుక్తమైనపనియై యుండి యందుకుఁదగినట్లు భగవంతుఁడు సంకల్పించుచుండఁగా, కొందఱు తమ ప్రయోజకత్వముచే వారలఁబోషించుచున్నామని గర్వించుటయు, మఱికొందఱు అతిథ్యభ్యాగతులు మొదలగువారల నాదరించుట విధ్యుక్తమగు గృహస్థధర్మమై యుండఁగా, అందువలనఁదమకుఁ బరలోకమున బుణ్యమబ్బుననియెడు నపేక్షతోఁ జేసెడువారు కొందఱును, ఇహమునందు కీర్తిప్రతిష్ఠల నపేక్షించి చేయువారు కొందఱును, ఇట్లనేకవిధములగు కోరికలతోడను, గర్వముతోడను జేయుచుందురు. కాన నట్టికర్మలన్నియు రాజసకర్మలని చెప్పఁబడును.

శ్లో॥ అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్ ।
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే ॥ 25

అర్థము :— అనుబన్ధమ్ =(తాఁ జేయబోయెడు కర్మను) అనుసరించి కలుగఁగల, క్షయమ్=నష్టమును, హింసామ్=హింసను, పౌరుషమ్ + చ=తనశక్తిని, అనపేక్ష్య=ఆలోచించకయే, మోహాత్ =అవివేకమువలన, యత్ + కర్మ=ఏ కర్మము, ఆరభ్యతే=ప్రారంభింపఁబడుచున్నదో, తత్=అది, తామసమ్ = తామస కర్మ యని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

ఇఁకను, తామసకర్మ యెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఎవఁడైతే తాఁజేయఁబోయెడు కర్మవలనఁ దనప్రాణమానధనాదులకుఁ గలుగఁదగిన నష్టమును ఇతరప్రాణులకుఁ గలుగఁదగిన కష్టమును, ఆపనిని నెఱవేర్చుటకుఁ దగినశక్తి తనకుఁ

గలదా లేదా, అనేవిషయమును, ఆలోచించకయే అవివేకియై యేకర్మ నారంభించు చున్నాఁడో, అట్టికర్మ తామసకర్మయనఁబడును. ఈతామసకర్మకిపుడు దుర్యోధనుడు సేయఁబూనిన యీయుద్ధకర్మమే నిదర్శనముగ నున్నది. అదెట్లనఁగా, దుర్యోధనుఁడు నిర్నిమిత్తముగ మీయర్ధరాజ్యము నపహరించుటచేతఁగదా యీయుద్ధమునకుఁ గారణముగలిగినది? పాండవులరగు మీరీయుద్ధముఁ ఫలసఁ గలుగఁబోయెడు బంధుమిత్రాద్యనేక జననష్టము నాలోచించి దీని నివారించుటకెంత ప్రయత్నము చేసియు నాదుర్యోధనుఁడట్టి యోచనచేయక యుద్ధమునకే ప్రయత్నించెనుగదా? మంచిది, ఇదిగాక, ఇంతకుముందు తాను భీష్మద్రోణకర్ణాది యోధవరులతోఁ గూడి చతురంగబలసమేతముగ వచ్చి యుత్తర గోగ్రహణముఁ జేసినపుడు నీయొక్కనిచే నోటువడిన వాడిపు డేడక్షౌహిణుల సైన్యముతోఁగూడి నాసహాయమునుగూడఁ బొందియున్న నిన్నిపుడీ యుద్ధమున జయించవచ్చునా, లేదా, అని తనయొక్కయు నెదిరియొక్కయు బలాబలములనైన నాలోచించకయే యీయుద్ధమునకుఁ బూనుకొన్నవాఁడైనాఁడుగదా? ఇట్లుచేయుట కేవల యవివేకమువలననేకదా? కాఁబట్టి యిట్టిది తామసకర్మయనఁబడును.

శ్లో॥ ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26

అర్థము :— ముక్తసఙ్గః=విడువఁబడిన యాసక్తిగలవాఁడును, అనహంవాదీ=(నేనుగర్తను) అనెడు నహంకారమును వహించని వాఁడును, ధృత్యుత్సాహసమన్వితః=ధైర్యోత్సాహములతోఁగూడి పనిచేయువాఁడును, సిద్ధ్యసిద్ధ్యోః=సిద్ధ్యసిద్ధులయందు, నిర్వికారః=వికారమునొందనివాఁడును నగు, కర్తా=కర్త, సాత్త్వికః=సాత్త్వికకర్త యని, ఉచ్యతే=చెప్పఁబడుచున్నాడు.

ఓయిఅర్జునా! కర్మయొక్క భేదములను జెప్పియైనదిగదా; కర్తయు నట్లే సత్త్వాదిగుణములచే మూడువిధములుగ నున్నాఁడు. అందు సాత్త్వికకర్త యెట్టివాఁడనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఎవఁడైతే తాఁజేయుకర్మల యందనాసక్తచిత్తుఁడును, అహంకార రహితుఁడునై, అనఁగా, ఇపుడీకర్మ భగవదిచ్ఛానుసారముగ నాచేఁ జేయింపఁబడుచున్నది గాని నాప్రయోజకత్వమేమియు లేదనియెడు నిశ్చయబుద్ధిగలవాఁడై యాకర్మఫలము నందాసక్తచిత్తుఁడు గాకయుండుటయ కాక ఆకర్మ నెఱవేఱినయెడల సంతసించుట, నెఱవేఱకపోయినయెడల దుఃఖించుట మొదలగు మనోవికారములను బొందక

యాకర్మను ధైర్యముతోడను ఉత్సాహముతోడను జేయుచున్నాఁడో, అట్టివాఁడు సాత్త్వికకర్త యనఁబడును.

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ 27

అర్థము :— రాగీ=అనురాగముగలవాఁడును, కర్మఫలప్రేప్సుః=కర్మఫలమును గోరువాఁడును, లుబ్ధః=లుబ్ధుఁడును, హింసాత్మకః=పరులనుహింసించు వాఁడును, అశుచిః=చిత్తశుద్ధిలేనివాఁడును, హర్షశోకాన్వితః=సంతోషదుఃఖములతోఁగూడిన వాఁడుననగు, కర్తా=కర్త, రాజసః=రాజసకర్తయని, పరికీర్తితః=చెప్పఁబడును.

ఎవఁడైతే తాఁజేయు కర్మలయొక్క ఫలములను గోరుచునాకర్మలయం దాసక్తచిత్తుఁడైనవాఁడును, లుబ్ధుఁడును, అనఁగా, పరద్రవ్యాపేక్షయు, తనద్రవమును వ్యయము చేయుటయం దయిచ్ఛయుఁ గలవాఁడును, హింసాత్ముకుఁడును, అనఁగాపరులను హింసించుటయం దాసక్తిగలవాఁడును, చిత్తశుద్ధిలేనివాఁడును నై తాఁజేయుకర్మలు నెఱవేఱినపుడు సంతసించుచును, నెఱవేఱకపోయినపుడు దుఃఖించుచు నుండునో అట్టికర్త రాజసకర్తయని చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ అయుక్తః ప్రాకృత స్స్తబ్ధ శ్శఠో నైకృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ 28

అర్థము :— అయుక్తః=చపలచిత్తుఁడును, ప్రాకృతః=అవివేకియు, స్తబ్ధః=వినయవిహీనుఁడును, శఠః=కుత్సితుఁడును, నైకృతికః=వంచకుఁడును, అలసః=సోమరియు, విషాదీ=చింతాపరుండును, దీర్ఘసూత్రీ+చ = ఆలస్యముగఁ బనిచేయువాఁడుననగు, కర్తా=కర్త, తామసః = తామసకర్తయని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

ఇఁకను, తామసకర్త యెట్టి వాఁడనఁగాఁజెప్పుచున్నాను వినుము.

ఎవఁడైతే మనోనిగ్రహములేనివాఁడును, అనగా, చపలచిత్తుఁడును ; ప్రాకృతుఁడును అనఁగా, వివేకశూన్యుండును ; స్తబ్ధుఁడును, అనఁగా పరులయెడలవినయములేక ప్రవర్తించువాఁడును ; శఠుఁడు అనఁగా కుత్సితుఁడు ; వంచకుఁడును, అనఁగా రహస్యముగా నప్రియం బొనర్చువాఁడును ; అలసుఁడు, అనఁగా సోమరియు ; విషాదుఁడు, సంతతచింతాపరుఁడును ; దీర్ఘసూత్రియు, అనగా ఆలస్యముగఁబని చేయువాఁడునునై యుంచున్నాఁడో, అట్టి వాఁడు తామసకర్త యనఁబడును.

శ్లో॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధంశ్శృణు ।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ॥ 29

అర్థము:-- హేధనఞ్జయ! = ఓయియర్జునా, అశేషేణ = నిశ్శేషముగను, పృథక్త్వేన = వేఱువేఱుగను, ప్రోచ్యమానమ్ = (ఇఁక) చెప్పఁబడునట్టి, బుద్ధేః = బుద్ధియొక్కయు, ధృతేః + చ + ఏవ = ధైర్యముయొక్కయు, గుణతః = సత్త్వాదిగుణముల వలనఁగలిగిన, త్రివిధమ్ = మూఁడువిధములగు, భేదమ్ = భేదమును, శృణు = వినుము.

ఓయియర్జునా! ఇంతవఱకును సత్త్వాదిగుణములచే మూఁడువిధములగు జ్ఞానమును, కర్మయును, కర్తయును, వేఱువేఱుగఁజెప్పితినిగదా? అట్లేబుద్ధియును-ధైర్యమునుగూడ నాత్రిగుణములచేమూఁడువిధములు గలవిగానున్నవి. గాన వానింగూడ సంపూర్ణముగను వేఱువేఱుగను జెప్పఁబోవు చున్నానుగాన శ్రద్ధతో నాకర్ణింపుము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।
బన్ధం మోక్షం చ యావేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥ 30

అర్థము :- హేపార్థ = ఓయియర్జునా, యా + బుద్ధిః = ఏబుద్ధి, ప్రవృత్తిమ్ + చ = నిష్కామకర్మాచరణమార్గమును, నివృత్తిమ్ + చ = కర్మసన్న్యాసమార్గమును, కార్యాకార్యే = కర్తవ్యాకర్తవ్యములను, భయాభయే = భయాభయములను, బన్ధమ్ = సంసారబంధమును, మోక్షమ్ + చ = సంసారనివృత్తిని. వేత్తి = ఎఱుఁగుచున్నదో, సా = ఆబుద్ధి, సాత్త్వికీ = సత్త్వగుణమువలన గలిగినది.

ఓయియర్జునా! ఎవఁడైతే తన బుద్ధిబలముచేత ముముక్షువు లవలంబించెడు ప్రవృత్తి నివృత్తిమార్గములలోఁ బ్రవృత్తిమార్గము, అనఁగా, నిష్కామకర్మాచరణ మార్గమిట్టిదనియు, నివృత్తిమార్గము, అనఁగా, కర్మసన్న్యాసమార్గమిట్టిదనియు, ఆయా దేశకాల సమయ సందర్భములనుబట్టి యిపుడీకర్మ నాచరించవచ్చునవనియు, ఇపుడీకర్మ నాచరింపఁగూడదనియు, ఇపుడీకర్మ నాచరించినయెడలఁ బాపభయము గలుగుననియు, ఇపుడీకర్మ నాచరించినయెడల బాపభయము లేదనియు, ఇపుడీకర్మము నిట్లాచరించినయెడల నిది యుంమకు బంధకమగుననియు, ఇట్లు చేసినయెడల బంధకముగానేరదనియు, ఈమొదలగు యుక్తాయుక్తములను దెలిసికొనుచున్నాఁడో, అట్టివాని బుద్ధి సాత్త్వికబుద్ధి యనఁబడును.

శ్లో॥ యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ।
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ॥ 31

అర్థము :— హేపార్థ! = ఓయియర్జునా!, యయా = ఏబుద్ధిచేత, ధర్మమ్ = ధర్మమును, అధర్మమ్ + చ = అధర్మమును. కార్యమ్ + చ = చేయఁదగినదానిని, అకార్యమ్ + ఏవ + చ = చేయఁదగనిదానిని, అయథావత్ = ఉన్నదున్నట్లుగాక (పొరపాటుగా), ప్రజానాతి = ఎఱుఁగుచున్నాఁడో, సా + బుద్ధిః = ఆబుద్ధి, రాజసీ రజోగుణముఁగలఁగలిగినది.

అట్లుగాక, ఎవఁడైతే ధర్మాధర్మములను, అనఁగా, దేశకాలసమయసందర్భములనుబట్టి ఇపుడిట్లుచేయుట ధర్మమనియు, ఇట్లుచేయుట యధర్మమనియు కార్యాకార్యములను, అనఁగా, ఇపుడీపని చేయఁదగినదియనియు, నిపుడీపని చేయఁదగినది కాదనియుఁ దెలిసికొనుటలో పొరపాటుపడుచున్నాఁడో, అనఁగా, ఉన్నదున్నట్లెఱుఁగఁ జాలఁడో, అట్టివానిబుద్ధి రాజసబుద్ధియనఁబడును.

అర్జు — అయ్యా ఆపొరపాటనఁగా నెట్టిదియో వివరించిచెప్పుడు.

కృ — ఓయియర్జునా!

"క. ధర్మ మధర్మము భంగి న
ధర్మము ధర్మంబుమాడ్కి- తనయా తోఁచున్
నిర్మలమతి నెఱుఁగవలయు
ధార్మికతం గోరువారు తగ నేర్పడఁగన్." (భార. శాంతి. ఆ 3. ౭౧.)

అనునట్లు, కొన్ని సమయసందర్భములనుబట్టి శాస్త్రవిహితములగు కర్మలు అధర్మములుగను శాస్త్రవిరుద్ధములగు కర్మలు ధర్మములుగను నేర్పడును. కాన బుద్ధిమంతుఁడగువాఁడాయాసమయమునకుఁ దగినట్లాచరించవలయునని యింతకుముందు చెప్పియున్నానుగదా ? (చూ. 4. 17. 18). కొందఱట్టిధర్మసూక్ష్మము నెఱుంగఁజాలక ప్రవర్తింతురుగాన నట్టివారిబుద్ధి రాజసబుద్ధియని యెఱుంగుము.

శ్లో॥ అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసాఽవృతా।
సర్వార్థా న్విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ॥ 32

అర్థము :— హేపార్థ! = ఓయిఅర్జునా!, యా + బుద్ధిః = ఏబుద్ధి, తమసా = అజ్ఞానముచేత, ఆవృతా = కప్పఁబడినదై, అధర్మమ్ = అధర్మమును, ధర్మమ్ + ఇతి = ధర్మమనియు, సర్వార్థాన్ = సమస్తపదార్థములను, విపరీతాన్ + చ = వ్యత్యస్తములుగను, మన్యే = తలఁచుచున్నదో, సా = అది (ఆబుద్ధి). తామసీ = తమోగుణప్రధానమైనది.

ఇఁకను, తామసబుద్ధి యెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఎవనిబుద్ధియైతే కేవల మజ్ఞానావృతమై శాస్త్రవిహితములగు ధర్మములను గర్మములను నాచరింపఁ గూడని యధర్మములుగను, శాస్త్రవిరుద్ధములగు ధర్మములను గర్మములను నాచరింపఁ దగిన ధర్మములుగను ఇట్లే తక్కినయన్నివిషయములనుగూడ వ్యత్యస్తములుగఁ దలఁచునో, అట్టివానిబుద్ధి తామసబుద్ధి యనియెఱుంగుము.

ఓయియర్జునా! బుద్ధియొక్క భేదమును జెప్పితినిగదా? ఇఁకను ధైర్యముయొక్క భేదమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః। 33
యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ॥

అర్థము :— హేపార్థ! = ఓయర్జునా!, యయా = ఏ, అవ్యభిచారిణ్యా + ధృత్యా = చలింపనిధైర్యముతో, మనఃప్రాణేన్ద్రియాః = మనస్సు ప్రాణములు ఇంద్రియములు వీని వ్యాపారములను, యోగేన = యోగముచేత, ధారయతే = (తప్పుమార్గములఁ (బవర్తింపకుండ) నియమించుచున్నాఁడో, సా + ధృతిః = ఆ ధైర్యము, సాత్త్వికీ = సాత్త్వికధైర్యము.

ఎవఁడైతే యోగముచేత, అనఁగా, చిత్తైకాగ్రతతో, చలింపనిధైర్యము నవలంభించినవాఁడై, అట్టిధైర్యముచేత మనఃప్రాణేంద్రియ వ్యాపారములను దప్పుమార్గములఁబోనీక నియమించుచున్నాఁడో, అట్టివానిధైర్యము సాత్త్వికధైర్యమనఁబడును. ధైర్యముచేత మనఃప్రాణేంద్రియవ్యాపారముల నియమించుట యెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! ఈలోకమున నెవఁడైన నేదేనియొకగొప్ప మనోవ్యాకులమును గాని లేక, దేహబాధను గాని పొందినపుడు దిగులుపడుటయు, మనస్సౌఖ్యదేహసౌఖ్యములనుబొందినపుడు సంతసించుటయుఁ గలదుకదా? మఱియు నింద్రియవిషయముల యందుఁ దగులమునొందిన మనస్సుగలవాఁడై యావిషయములవలనఁ గలిగెడు సుఖదుఃఖముల ననుభవించుటయుఁగలదుకదా! సత్త్వగుణప్రధానుఁడగువాఁడట్టి సుఖదుఃఖములు గలిగినపుడవి యా యా కాలానుగుణ్యముగ వచ్చుచుఁబోవుచుండునవి యనియు క్షణభంగురములేగాని నిత్యములైనవి కావనియు నెఱిఁగినవాఁడై వానివలన నేలాటి మనోవికారములనొందక ధైర్యముగనుండును. కాననట్టి వానికిఁగల యట్టి ధైర్యము సాత్త్విక ధైర్యమనఁబడును.

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున!।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ! రాజసీ॥ 34

అర్థము :— హేఽర్జునా! = ఓయియర్జునుఁడా!, యయా + ధృత్యా + తు = ఏధైర్యముచేతనైతే, ఫలాకాఙ్క్షీ = ఫలాపేక్షగలవాఁడై, ధర్మకామార్థాన్ = ధర్మకామార్థములను, ప్రసఙ్గేన = మిక్కిలియాసక్తితో, ధారయతే = ధరించుచున్నాఁడో, సా + ధృతిః = అట్టి ధైర్యము, హేపార్థ = ఓయర్జునా!, రాజసీ = రజోగుణసంబంధమైనది.

ఇఁకను రాజసధైర్య మెట్టిదైనదియుఁ జెప్పుచున్నాను వినుము.

ఓయియర్జునా! ఈలోకంబునఁ బ్రతిపురుషుఁడు ననుష్ఠించవలసినవి ధర్మార్థకామమోక్షంబులనియెడు చతుర్విధపురుషార్థంబులుగదా? అందు మొదటి మూఁడగు ధర్మార్థకామంబుల నఫలాకాంక్షితుండై యనుష్ఠించిననేకాని నాలుగవదియగు మోక్షము సిద్ధింపనేరదుకదా? అట్లుండ నీలోకమునందలి జనులలో ననేకు లేమి చేయుచుందురనఁగా, అట్టి ధర్మార్థకామంబు లఫలాపేక్షతో నత్యాసక్తచిత్తులై యాచరింతురు. అట్లాచరించుటలో నెట్టి యంతరాయములుగలిగినను, వానిఫలమునందాసక్తచిత్తులగుటంజేసి యట్టి యంతరాయములకు వెనుకఁదీయక ధైర్యము నవలంబించి పూనికతోఁ బనిచేయుదురు. అట్టివారలవలంబించెడు నట్టి ధైర్యము వారలయందుండు రాజసగుణమువలనఁ గలుగునదిగనుక నాధైర్యము రాజసధైర్యమని చెప్పఁబడును.

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ।
న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ! తామసీ॥ 35

అర్థము :— హేపార్థ! = ఓయియర్జునా!, దుర్మేధా = దుర్బుద్ధిగలవాఁడు, యయా = ఏధైర్యముచేత, స్వప్నమ్ = నిద్రను, భయమ్ = భయమును, శోకమ్ = దుఃఖమును, విషాదమ్ = దిగులును, మదమ్ + ఏవ + చ = మదమును, న + విముఞ్చతి = విడువఁడో, సా + ధృతిః = అట్టి ధైర్యము, తామసీ = తామసధైర్యము.

ఇఁకను, తామసధైర్య మెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఓయియర్జునా! ఈలోకమునఁ గొందఱవివేకు లేమిచేయుదురనఁగా, తామేయే కాలములయం దేయేపనులఁ జేయవలయునో ఆయా కాలములయం దాయాపనుల నిర్వర్తింపక నిద్రతోఁ బ్రొద్దుపుచ్చుచునందువలనఁ దమకుఁ గలుగఁదగిన నష్టము నాలోచింపక ధైర్యముగనుందురు. ఇట్లే యేదేని యొకకారణముచే భయముగాని దుఃఖముగాని కలిగినపుడును, ద్రవ్యనష్టాదులచే దిగులుగలిగినపుడును, మదముచేఁ

గలుగు స్త్రీలోలత్వ మద్యపానాది దుర్వ్యసనంబు లలవడునపుడును, వానిని వెంటనే విడిచి తమ నిత్యకృత్యంబుల నెఱవేర్చికొనక వానియందే మగ్నమానసులై యందు వలనఁ దమకుఁ గలుగఁబోయెడు నష్టకష్టముల నాలోచింపక ధైర్యముగ నుందురు. కాన నట్టివారల ధైర్యము తామసధైర్యమని చెప్పఁబడును.

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి ॥ 36

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥ 37

అర్థము :— హేభరతర్షభ! = ఓయర్జునా!, ఇదానీమ్ = ఇప్పుడు (ఇఁకను), త్రివిధమ్ = మూఁడువిధములగు, సుఖమ్ + తు = సుఖమును, మే = నావలన, శృణు = వినుము, యత్ర = దేనియందు, అభ్యాసాత్ = యోగాభ్యాసమువలన, రమతే = రమించుచున్నాఁడో, దుఃఖాన్తమ్ + చ = దుఃఖనాశమునుగూడ, నిగచ్ఛతి = పొందుచున్నాఁడో, తత్ = అట్టి, యత్ + (సుఖమ్) = ఏసుఖము, అగ్రే = ఆరంభమునందు, విషమ్ + ఇవ = విషముపలెనుండునో, పరిణామే = పర్యవసానమందు, అమృతోపమమ్ = అమృతముఁబలెనుండునో, తత్ = అట్టి, ఆత్మబుద్ధిప్రసాదజమ్ = తన చిత్తస్వాస్థ్యముచేఁ గలిగిన, సుఖమ్ = సుఖము, సాత్త్వికమ్ = సాత్త్వికసుఖమని, ప్రోక్తమ్ = చెప్పఁబడినది.

ఓయియర్జునా! ఇట్లే సుఖముగూడ సత్త్వాది గుణభేదములచే మూఁడువిధములు గలదిగానున్నదిగాన దానింగూడ నిపుడే చెప్పుచున్నాను వినుము.

ఈలోకమునఁ గొందఱు తత్త్వజ్ఞాను లేమిచేయుదురనఁగా, ఐహికసుఖంబు లన్నియు నల్పంబులు నశాశ్వతంబులనియు జననమరణ రాహిత్యంబగు మోక్షసుఖ మొక్కటియే శాశ్వతసుఖమనియు నెఱింగినవారై యట్టి మోక్షసుఖమును బడయఁ గోరి యోగాభ్యాసము సేయుచు నందువలనఁగలిగెడు నాత్మానుభవసుఖము ననుభవింపుచుందురు. ఆసుఖమెట్టిదనఁగా, తక్కిన యన్నిసుఖములవలెఁ గొంతకాలముండి పిదప దుఃఖములకుఁ గారణమగునట్టిది కాదు. మఱేమనిన, దుఃఖముల నన్నిటి నంత మొందించునట్టిది, అనఁగా, దుఃఖస్వరూపములగు జననమరణాదులు లేనిదియు, నిత్యానంద పదవియునగు మోక్షమును గలుగఁజేయునట్టిదియై యున్నది.

అయితే, ఆసుఖము సులభముగఁ బడయఁదగినది కాదు. మఱేమనిన, అతికష్ట సాధ్యంబగు మనోబుద్ధీంద్రియ నిగ్రహంబుచే సాధింపఁదగినదిగాన దానింబడయఁగోరి

ప్రయత్నము సేయువారికది యారంభదశయందు విషతుల్యంబుగ నుండును. అనఁగా విషమెట్లు మ్రింగుటకుఁ గష్టసాధ్యమో అట్లే కష్టసాధ్యముగ నుండును. పర్యవసానమందు, అనఁగా. అభ్యసలితంబుగ మనోబుద్ధీంద్రియ నిగ్రహంబుచే నాచరింపఁబడిన యోగము సిద్ధిఁబొందినపుడు, శాశ్వతానందమును గలుగఁజేయును గాన నప్పుడది యమృతతుల్యంబుగ నుండును. కాన నోయియర్జునా! ఇట్టిసుఖ మేదికలదో యది సాత్త్వికసుఖ మనఁబడును.

శ్లో॥ విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ 38

అర్థము:— యత్ + తత్ = ఏయ్యది (ఏసుఖము), విషయేన్ద్రియసంయోగాత్ = ఇంద్రియములకు విషయసంయోగముగలుగుటవలన, అగ్రే = మొదట, అమృతోపమమ్ = అమృతతుల్యమైనదియు, పరిణామే = పర్యవసానమందు, విషమ్ + ఇవ = విషమువంటిదియు నైయుండునో), తత్ + సుఖమ్ = అట్టి సుఖము, రాజసమ్ = రాజససుఖమని, స్మృతమ్ = తలఁపఁబడినది.

ఇఁకను రాజస సుఖమెట్టిదనఁగా నిపుడు నేఁజెప్పిన సాత్త్వికసుఖమునకుఁ గేవలవిరుద్ధమైనది. అదెట్లనఁగా, ఇంద్రియములను విషయములనుండి మరలించుట వలనఁ గలుగునదిగదా సాత్త్వికసుఖమగుచున్నది? రాజససుఖమన్నచో, ఇంద్రియములను విషయములయందుఁ బ్రవర్తింపఁజేయుటవలన, అనఁగా, విషయానుభవము వలనఁ గలుగునదియైయున్నది. ఇదిగాక, సాత్త్వికసుఖము మొదటవిషతుల్యముగను తుదను అమృతోపముగను వుండునట్టిదిగదా? రాజస సుఖమన్నచో మొదట నమృతోపముగను, తుదను విషతుల్యముగ నుండునట్టిది. అదెట్లనఁగా, ఒకఁడు తనకంటె కింపైన యొక స్త్రీతో రమింపఁ గోరుచున్నాఁడు; అది తనభార్యగానుండినయెడల దానితో రమించుట న్యాయవిరుద్ధముగాకపోయినను, దానియందలి వ్యామోహముచే మిక్కుటముగ రమించినయెడల నట్లనుభవించునపు డారతి సుఖ మమృతోపముగ నుండినను పిమ్మట దేహమునందలి బలముడిగి యనేకవిధములగు జాడ్యముల కాస్పదమగును. ఒకవేళనది పరస్త్రీగా నుండినయెడల ప్రాణమాన ధనహానియుఁ గలుగఁదగియుండును కాన నప్పుడది విషతుల్యముగ నుండును. మఱియొకఁడు తనజిహ్వకు రుచికరమగు నొక పదార్థమును దానియందలి యాసచే మిక్కుటముగఁ దిన్నయెడల దానిం దినునప్పటి సుఖమమృతోపముగ నుండినను, దానివలనఁ గలిగెడు నజీర్ణాది బాధల ననుభవించు నపుడది విషతుల్యముగ నుండునుగదా? ఇట్లే తక్కిన విషయం

బులు నూహింపఁదగియున్నవి. కాన నోయి యర్జునా! ఇట్టి సుఖమేదిగలదో యది రాజససుఖమని యెఱుంగుము.

శ్లో॥ యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః।
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్॥ 39

అర్థము :— నిద్రాలస్యప్రమాదోత్థమ్ = నిద్ర-ఆలస్యము-ప్రమాదము-వీని వలనఁబుట్టిన, యత్ = ఏది, అగ్రే+చ = ఆదియందును, అనుబన్ధే+చ = అంత మందును, ఆత్మనః = తనకు, సుఖమ్=సుఖముగానున్నట్లు, మోహనమ్=భ్రమింపఁ జేయుచున్నదో, తత్ = అది, తామసమ్ = తామససుఖమని, ఉదాహృతమ్ = చెప్పఁబడినది.

ఇఁకను, తామస సుఖమెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఈలోకమున దమోగుణ ప్రధానులగు కొందఱు కేవల మందమతులును, ఎల్లప్పుడును నిద్రించుట యందాసక్తిగలవారును, తామాచరించవలసిన నిత్యనైమిత్తికాది కర్మంబులను సోమరి తనముచే సకాలములయం దాచరింపక యాలస్యము సేయువారును, మఱియుఁ దమ మందబుద్ధిత్వముచే నేవిషయమునైననుసరే, ఉన్నదున్నట్టుగాక పొరపాటుగ గ్రహిం చువారునునైయుండుటంబట్టి వార లేలాటి సుఖమును బడయనేరరుగదా? అయినను అట్టివారలుగూడఁ దామును సుఖము ననుభవించుచున్నట్లే తలంచెదరు. అదెట్లనఁగా, నిద్రాసక్తులగు వారలెప్పుడును నిద్రించుటే సుఖమనియు, సోమరితనముగలవార లెప్పుడు నేపనియును జేయక యూరకుండుటయే సుఖమనియు, మూర్ఖచిత్తులగు వారేవిషయమునైననుసరే తప్పుగ గ్రహించి, అనఁగా, ధర్మము నధర్మముగను, అధర్మ మును ధర్మముగను, సత్యము నసత్యముగను, అసత్యమును సత్యముగను ఇట్లే ప్రతి విషయమును వ్యత్యస్తముగ గ్రహించి తమయభిప్రాయమే సరియైనదనియు, తామే బుద్ధికుశలతగలవారమనియు, తలంచుచు నానందింతురు. కాన నట్టివారల బుద్ధి కిట్టి నిద్రవలనను, ఆలస్యమువలనను, ప్రమాదమువలనను దోపింపఁజేయఁబడునట్టి సుఖ మేదికలదో, అది తామససుఖమునఁబడును

శ్లో॥ న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభి స్స్యాత్త్రిభి ర్గుణైః॥ 40

అర్థము :— యత్=ఏది, ప్రకృతిజైః=ప్రకృతివలనఁబుట్టిన, ఏభిః+త్రిభిః+ గుణైః=ఈమూడుగుణములచేత, ముక్తమ్ + స్యాత్ = విడువఁబడినదగుచున్నదో, తత్+సత్త్వమ్=అట్టివస్తువు, పృథివ్యామ్+వా=(ఈ) భూలోకమునందుఁగాని,

పునః=మఱి (లేక), దివి+దేవేషు+వా=స్వర్గలోకమునందలి దేవతలలోగాని, న+అస్తి=లేదు.

కనుక నోయియర్జునా! ఈభూలోకమునందుగల మనుష్య, మృగ, పశు, పక్షి, క్రిమి, కీటకాది సమస్తజంతువులయందును, స్వర్గలోకమునందలి దేవతలు మొదలగునందఱియందును ఇపుడునేఁజెప్పిన ప్రకృతిజములగు సత్త్వరజస్తమోగుణములు మూడింటిలో నేదేనియొకటియైనను, లేక, రెండైనను, లేక, మూఁడును మిశ్రమములుగనైన నుండునేగాని, యీమూఁడు గుణములలో నొకటియైనను లేక యుండునట్టి జంతువొక్కటియైన నుండనేరదని యెఱుంగుము.

అర్జు — అయ్యా! ఇంతకుముందు, ఏజీవాత్మయైననుసరే త్రిగుణాతీతమైననే గాని మోక్షమున కర్హముకాదని చెప్పియుంటివిగదా! (చూ. 14. 20). ఇపుడీత్రిగుణములలో నొకటైన యుండని జీవాత్మ దేవమనుష్య తిర్యగ్జంతువులలో దేనియందు నుండదని చెప్పుచున్నావుగదా, అట్లైనయెడల నేజన్మమున నీజీవాత్మ త్రిగుణాతీతమైనదై ముక్తిని జెందఁగలదు?

కృ — ఓయియర్జునా! ఏజీవాత్మయైననుసరే త్రిగుణాతీతత్వసిద్ధిని బొంది మోక్షమున కర్హమగుటకు నీమానుషజన్మమునందుమాత్రమే వీలుపడును. అదెట్లనఁగా ఈమానుషజన్మమునందుండి పుణ్యకర్మలఁజేసిన వారలందుకుఁదగినట్లాయాయూర్ధ్వలోకములయందు దేవజన్మలనెత్తి యచ్చటసుఖముల ననుభవించియైనపిమ్మట "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" అనునట్లు మరలమనుష్యలోకముననే జన్మింతురని యింతకుముందు చెప్పియుంటినిగదా, అట్లే, పాపకర్మలఁ జేసినవారలును వారివారి పాపములకుఁ దగినట్లు తిర్యగ్జంతుయోనులం బుట్టి దుఃఖముల ననుభవింపుచు నాపాపము క్షీణించిన పిమ్మట మరల మనుష్యలోకమున జన్మింతురు. కాఁబట్టి,

"క. మానుషము దుర్లభము సో
పానంబగు నది విముక్తిపదము గనుటకున్
దానిఁ గని తొంటిచందము
రానీక సముద్యమమునఁ బ్రాఁకఁగవలదే."

(భార. శాంతి. ౬ ఆ ౨౩౭)

అనునట్లు, ఏజీవాత్మయైననుసరే మనుష్యజన్మయందుండునపుడే పునర్జన్మకారణములగు పుణ్యపాపములఁ జేయక మెలఁగువగలిగి ముక్తికిఁదగు ప్రయత్నము చేయవలయును.

అర్జు — అయ్యా! అట్లైనయెడల నీమనుష్యులుగూడ నీమూఁడు గుణములుగల వారలై యేయున్నారుగదా? అందువలననే యీమనుష్యులలో బ్రహ్మ-క్షత్రియ-వైశ్య-శూద్రజాతులు నాలుగు గల్పింపఁబడియున్నట్లు నీవే చెప్పియుంటివిగదా (చూ. 4.13). అట్లుండ నీమనుష్యజన్మనెత్తినపు డీనాలుగుకులములలో మొదటిదియగు బ్రాహ్మణ జన్మము నెత్తినవాఁడుమాత్రమే మోక్షమునుబొందుటకుఁ దగిన ప్రయత్నము చేయవలసినవాఁడై యుండునా? లేక యీనాలుగువర్ణములలో దేనియందు జన్మించినవాఁడై ననుసరే యిట్టిప్రయత్నము చేయవచ్చునా?

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః॥ 41

అర్థము :— హేపరన్తప!=ఓయర్జునా, బ్రాహ్మణక్షత్రియవిశామ్=బ్రాహ్మణ క్షత్రియవైశ్యులకును, శూద్రాణామ్+చ=శూద్రులకును, స్వభావప్రభవైః=వారి వారి స్వభావములవలనఁగలిగిన, గుణైః=త్రిగుణములచేత, కర్మాణి=వారు వారాచరించవలసినకర్మములు, ప్రవిభక్తాని=విభజింపఁబడినవి.

ఓయి యర్జునా! ముముక్షువగుటకును, మోక్షమునకుఁ దగుఁ బ్రయత్నము సేయుటకును, మోక్షమును బొందుటకును, జాతిభేదముతో నిమిత్తములేదు. ఏజాతివాఁడైననుసరే. తగియున్నాఁడు అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము. ఈమనుష్యలోకమునందలి జనులలోఁ గలిగియుండు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులు నాలుగును వారివారి స్వభావగుణముల ననుసరించి యుత్పన్నములైనవని యింతకుముందు చెప్పియున్నానుగదా; (చూ. 4. 13). అదెట్లనఁగా, కేవల సత్త్వ గుణప్రధానులు బ్రాహ్మణులుగను, సత్త్వరజోగుణములు మిశ్రమముగఁగలవారలు క్షత్రియులుగను, కేవలరజోగుణప్రధానులు వైశ్యులుగను, కేవలతమోగుణప్రధానులు శూద్రులుగను విభజింపఁబడియున్నారు. కాఁబట్టి వారివారి కులమునకును గుణమునకును దగినకర్మలే ఆయాకులస్థుల కేర్పరచఁబడియున్నవి. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవచ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥ 42

అర్థము :— శమః =అంతరింద్రియనిగ్రహమును, దమః = బహిరింద్రియనిగ్రహమును, తపః = తపస్సును, శౌచమ్ = శుచిత్వమును, క్షాన్తిః = ఓర్పును,

ఆర్జవమ్ = ఋజుభావమును, జ్ఞానమ్ = శాస్త్రజ్ఞానమును, విజ్ఞానమ్ = అనుభవ జ్ఞానమును, ఆస్తిక్యమ్ = భగవంతుఁడొకఁడున్నాడనెడునమ్మకమును, స్వభావజమ్ = స్వభావమువలనఁగలిగిన, బ్రాహ్మమ్ + కర్మ = బ్రాహ్మణకర్మయైయున్నది.

ఓయి యర్జునా! కేవల సత్త్వగుణప్రధానులుగా నుండెడువారలు, బ్రాహ్మణులని చెప్పఁదగినిగదా. కనుక. వారలకుఁదగిన కర్మలెట్టివనఁగా, ౧ శమము- అనఁగా- అంతరింద్రియనిగ్రహము; ౨ దమము - అనఁగా - బాహ్యేంద్రియ నిగ్రహము; ౩ తపము - అనఁగా-మనోవాక్కాయముల చేఁ జేయఁబడు పుణ్యకర్మము; ౪ శౌచము అనఁగా-చిత్తశుద్ధియు దేహశుద్ధియుఁ గలిగియుండుట; ౫ క్షాన్తి - అనఁగా - తనకపకారముఁజేసినవారికిఁ బ్రత్యపకారము సేయక యోర్పుకొనియుండుట; ౬ ఆర్జవమ్ - అనఁగా-కుత్సితములేకుండుట; ౭ జ్ఞానమ్ - అనఁగా - శాస్త్రములవలనను గురూపదేశమువలనను గలిగెడుజ్ఞానము; ౮ విజ్ఞానమ్ - అనఁగా-స్వానుభవమువలనఁగలిగెడు జ్ఞానము; ఇవి కేవల సత్త్వగుణప్రధానులకుఁ దగినకర్మలు గనుకను, అట్టి సత్త్వగుణము గలవారలు బ్రాహ్మణులుగనుకను, ఇవిబ్రాహ్మణకర్మలని చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ 43

అర్థము :— శౌర్యమ్ = శూరత్వము, తేజః = తేజస్సు, ధృతిః = ధైర్యము, దాక్ష్యమ్ = సామర్థ్యము, యుద్ధే + అపలాయనమ్ + అపి + చ = యుద్ధమునఁ బాఱిపోకుండుటయును, దానమ్ = దానమిచ్చుట, ఈశ్వరభావః + చ = ప్రభుత్వలక్షణముగలిగియుండుట (అనునవి), స్వభావజమ్ = స్వభావమువలనఁగలిగిన, క్షాత్రమ్ + కర్మ = క్షత్రియకర్మ (యైయున్నది.)

ఇఁకను, క్షత్రియ కర్మయెట్టిదనఁగాఁ జెప్పుచున్నాను వినుము. (1)శౌర్యము అనఁగా-యుద్ధమునకు భయపడకుండుట; (2) తేజము - అనఁగా - యశస్సు గలిగియుండుట; (3) ధృతి - అనఁగా - ఏలాటికష్టముగలిగినను దిగులుపడక ధైర్యముగా నుండుట; (4) దాక్ష్యము - అనఁగా - ఏపనినైన సమయస్ఫూర్తిగఁ జేయునట్టి నేర్పరితనమును; (5) యుద్ధమునభయపడి పలాయనముగాకుండుటయును; (6)దానము అనఁగా-దేహియని యాచించినవానికి నాస్తియని చెప్పక తనశక్తికొలఁది నిచ్చిపంపుట; (7) ఈశ్వరభావము - అనఁగా - ప్రభుత్వలక్షణము గలిగియుండుట. ఈ మొదలగునవి రజస్సత్త్వగుణములు మిశ్రమములుగఁ గల వారలకుఁ దగినవిగనుకను, అట్టి గుణములుగలవారలు క్షత్రియులుగనుకను నీకర్మలు క్షత్రియ కర్మ లనఁబడును.

శ్లో॥ కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44

అర్థము :— కృషిగోరక్షవాణిజ్యమ్ = వ్యవసాయము - గోసంరక్షణ - వ్యాపారము, స్వభావజమ్ = స్వభావమువలనఁగలిగిన, వైశ్యమ్+కర్మ= వైశ్యుల కర్మ (యైయున్నది), పరిచర్యాత్మకమ్ + కర్మ = పరిచర్యాత్మకమగుకర్మ, శూద్రస్య+అపి = శూద్రునకును. స్వభావజమ్ = స్వభావమువలనఁగలిగిన కర్మ (యైయున్నది).

ఇఁకను, వైశ్యకర్మయెట్టిదనఁగా, కేవలరజోగుణ ప్రధానులు వైశ్యులని చెప్పియుంటిని గదా. కనుక నావైశ్యులు ధనధాన్యాదులను మిక్కిలిగ సంపాదింపవలెననియెడు కోరికగలవారై యుందురుగాన నట్టివారలకు ధాన్యము నుత్పత్తి చేయుటకుఁ దగిన వ్యవసాయమును, జీవధనమువృద్ధి కాఁదగిన గోసంరక్షణయు, ఇతరధనము వృద్ధి కాఁదగిన వర్తకమును. స్వభావకర్మలుగానున్నవిగాన నాకర్మలు వైశ్యకర్మ లనఁబడును. ఇఁకను శూద్రకర్మయెట్టిదనఁగా, కేవలతమోగుణ ప్రధానులు శూద్రులని చెప్పియుంటిని గదా, కనుక నట్టివారలు కేవలమజ్ఞానులుగను, సోమరులుగను, నిద్రపోతులుగను నుందురు గనుక తాము స్వతంత్రించి యేపనియుఁ జేయశక్తులుగారు. కాబట్టి వారలితరులయధికారమునకులోఁబడి వారలచే నియమింపఁబడిన పనులఁజేయఁదగినవారై యున్నారు. కనుక వారలకు పరిచార్యాత్మకమగు కర్మయే స్వభావకర్మగా నున్నది. కాఁబట్టి యట్టి పరిచర్యాత్మకమగు కర్మ శూద్రకర్మయని చెప్పఁబడుచున్నది.

అర్జు — అయ్యా! దీనింబట్టిచూడఁగా, కేవల సాత్త్వికకర్మలుగల బ్రాహ్మణులును సాత్త్వికరాజస కర్మలు మిశ్రమములుగాఁగల క్షత్రియులలోఁ గొందఱును మాత్రమే తమతమ కర్మలవలన జ్ఞానోత్పత్తిగలవారలై మోక్షమార్గమును గనఁగలరనియు, కేవల రాజసకర్మలుగల వైశ్యులును, కేవల తామసకర్మలుగల శూద్రులును తమతమ కర్మలవలన నట్టి జ్ఞానోత్పత్తి నొందుటకుఁ దగిన వీలులేమగనుక వారలెప్పటికిని నట్టి జ్ఞానమును బొందఁజాలరనియుఁ దోఁచుచున్నదే. వారలగతి యంతేనా? లేక, వారలుగూడఁ గడతేరఁదగిన మార్గమేదైనఁ గలదా?

కృ — ఓయియర్జునా! నీవు తలఁచునట్లు బ్రాహ్మణులు క్షత్రియులుమాత్రమే కాదు, కేవలరాజస తామసకర్మలుగల వైశ్య శూద్రాదులు గూడఁ దరించుటకుఁ దగిన మార్గము గలదు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి త చ్ఛృణు ॥ 45

అర్థము :— నరః = మనుజుఁడు, స్వేస్వేకర్మణి = తనతనకర్మమునందు, అభిరతః + (సన్) = ఆసక్తుఁడై, సంసిద్ధిమ్ = (జ్ఞాన) సిద్ధిని, లభతే = పొందుచున్నాఁడు, స్వకర్మనిరతః = స్వకులోచితకర్మమునం దాసక్తుఁడైనవాఁడు, యథా = ఏప్రకారముగా, సిద్ధిమ్ = (జ్ఞాన) సిద్ధిని, విన్దతి = పొందుచున్నాఁడో, తత్ = దానిని, శృణు = ఆకర్ణింపుము.

ఎవఁడెవఁ డేయే కులమునందు జన్మించుచున్నాఁడో, వాఁడువాఁ డాయా వర్ణాశ్రమాచార విహితంబులగు కర్మంబుల నవలంబించి యథావిధిగ నాచరించుచు వచ్చినయెడల నందువలనఁ గ్రమక్రమముగ (మోక్షమార్గమునుజూపునట్టి) జ్ఞానసిద్ధినిఁ బొందఁగలఁడు.

అర్జు — అయ్యా! జ్ఞానమనఁగా, అమానిత్వాది యిరువదిసద్గుణములు చేరి జ్ఞానమనిపించుకొనుచున్నదని యింతకుముందు చెప్పియుంటివిగదా? (చూ 13. 8, 9, 10, 2, 12) ఇట్టి జ్ఞానసిద్ధిని, కేవల సాత్త్వికకర్మలుగల బ్రాహ్మణకులమునందును, సాత్త్విక రాజసకర్మలు మిశ్రమముగాగల క్షత్రియకులమునందును జన్మించినవారలు పొందుట కర్హులగుదురుగాని, కేవల రాజస, తామసకర్మలుగల వైశ్య, శూద్రకులముల యందు జన్మించినవార లెట్లుపొందుట కర్హులుగాఁగలరు?

కృ — ఓయియర్జునా! అట్టి వైశ్యులును శూద్రులును గేవలరాజస, తామస కర్మలే తమతమ కులోచితకర్మలుగాఁ గలవారలైనను, అట్టివారలుగూడ నట్టికర్మలనే యథావిధిగ నాచరించుచునే యట్టి జ్ఞానసిద్ధిని బొందుట కర్హులుగాఁగలరు. అదెట్లనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ యతఃప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్ ।
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥ 46

అర్థము :— యతః = ఎవనివలన, భూతానామ్ = (సమస్త) భూతములకు, ప్రవృత్తిః = ఉత్పత్తికలుగుచున్నదో, యేన = ఎవనిచేత, ఇదమ్ + సర్వమ్ = ఈసమస్తప్రపంచమును, తతమ్ = వ్యాపింపఁబడియున్నదో, తత్ = అట్టియీశ్వరుని, మానవః = మనుజుఁడు, స్వకర్మణా = తన కులోచితకర్మముచేత, అభ్యర్చ్య = పూజించి, సిద్ధిమ్ = జ్ఞానసిద్ధిని, విన్దతి = పొందుచున్నాఁడు.

ఓయి యర్జునా! ఈప్రపంచమునకు సృష్టిస్థితిలయకర్తయగు నాపరమాత్మయే పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తజంతువులయందు వ్యాపించియుండుటయ కాక సర్వసముఁడై యున్నాఁడుగదా? కాఁబట్టి యాభగవంతుఁడు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతుల వారందఱియందుండి వారందఱికిని సముఁడై యున్నాఁడుగదా? అట్లగుటచే నాభగవంతుఁ డానాలుగుజాతులలో నెవఁడెవఁ డేజాతియందుజన్మించి యున్నాఁడో, వాఁడువాఁ డాజాతికి విధింపఁబడియుండుకర్మలచే దన్నారాధించిన యెడల నట్టియారాధనమును గ్రహించవలసినవాఁడై యున్నాఁడుగదా? కనుక నేమానవుఁడైననుసరే, తా నేకులంబున జన్మించియున్నాఁడో, ఆకులాచార విహితంబులగు కర్మంబులచే నాభగవంతుని నిశ్చలభక్తితో నారాధించినయెడల నట్టివాఁడు కడతేరఁగలఁడు. ఇందుకు నిదర్శనమేమనఁగా, అట్టిభగవంతుఁడనగు నేను రామావతారంబున వనవాసముసేయు కాలమునందు కేవల నీచజాతియందు జన్మించిన శబరి నాయందలి భక్తిచే నర్పించిన యెంగిలి ఫలముల నత్యంత ప్రీతితో నంగీకరించి యాశబరికి మోక్షమొసంగినది ప్రసిద్ధమైనవిషయమే కదా? ఇదిగాక, ఈయవతారమునందుఁగూడ నిట్టిపూజల నంగీకరించియున్నాను. అవి యెవ్వియనఁగా, నేను బాల్యదశయందు కంసునిపంపున బృందావనమునుండి మధురానగరమునకుఁ బోవునపు డామధురాపురి సాలెవాఁడొకఁ డత్యంత భక్తితోఁ దానేసిన మంచివస్త్రముల సమర్పింపఁగా వాని నత్యంతప్రీతితో నంగీకరించి వానికిఁ గోరిన వరంబుల నొసంగి కృతార్థునిం గావించినదియు, అటుపిమ్మట సుదాముండను మాలాకారుని గృహంబున కేగిన నతం డత్యంతభక్తితోఁ బూజించి సుగంధపుష్పమాలల సమర్పించిన వాని నత్యంత ప్రీతిపూర్వకముగ నంగీకరించి యతనికిఁ గోరిన వరంబులనిచ్చి కృతార్థునింగావించినదియు, అటుపిమ్మట కంసునింటికి లేపనంబులంగొనిపోవుచుండు కుబ్జయను దాసి తాఁగొనిపోవుచుండెడు లేపనంబుల నాకత్యంతభక్తియుక్తంబుగ నర్పింప వానింగొని దానికిం గోరిన వరంబుల నొసంగి కృతార్థతం గావించినదియు నీవు వినియేయుందువుగదా, కనుక నిట్లెవఁడెవఁ డేకులంబున జన్మించి యాకులోచితంబగు నేవృత్తినవలంబించుచున్నాఁడో వాఁడు వాఁ డాకులోచిత కర్మంబులచేతను, ఆయావృత్తిదంబులగు ద్రవ్యంబులచేతను భగవంతుని భక్తితోఁ బూజించినయెడలఁ గడతేరగలఁడు. ఇందుకు దృష్టాంతంబుగ నొకకథగలదు. దానిం జెప్పెద నాకర్ణింపుము. సహోదరులగు నిద్దరు శ్రీవైష్ణవులు శిష్యసంచారము సేయుచు నొకగ్రామంబునకుఁ బోయి యచటఁ దమశిష్యకోటిలోఁ జేరిన యొక గొల్లవాఁ డుండఁగా వానిగృహంబునకేగిరి అపు డాగొల్లవాడు తన గురువుల రాకకు మిగుల సంతోషించి వారిచేఁ జక్రాంకితమంత్రోపదేశంబులం బడయఁగోరి యందుకు గావలసిన

గురుదక్షిణకుఁగాఁ దన భార్యతో నిట్లని యాలోచించెను. అదెట్లనఁగా, వాఁడది వఱకు రెండుపందుల సాకుచుండెను. అందొకటి పెద్దదియు మఱియొకటి చిన్నదియు నైనందున పెద్దదానికి పెద్దయ్యయనియు, చిన్నదానికి చిన్నయ్యయనియు నామము లిడి యాసంకేతములతో వాఁడును వానిభార్యయును వ్యవహరించుకొనుచుండిరి. అపుడు వానిచేత ద్రవ్యమేమియు లేకపోవుటచేతను, వేఱొండువిధమున ద్రవ్యమార్జింపవీలులేకపోవుటచేతను, ఆరెండుపందులలో నొకదానిని ఛేదించి దాని మాంసవిక్రయముచే లభ్యమగుద్రవ్యమును గురుదక్షిణ కుపయోగింప నిశ్చయించినవాఁడై యింటిలోనికింబోయి తనభార్యను బిలిచి దానికిఁ దన యుద్దేశ్యం బెఱింగించి 'ఓసీ, పెద్దయ్యను ముగింతమా, లేక, చిన్నయ్యను ముగింతమా' యని యడిగెను. తలవాకిటి యరుగుమీఁదఁ గూర్చుండియుండు నా యిరువురు వైష్ణవులు నీవార్తల విన్నవారై, 'ఓహో !' 'వీఁడు మూర్ఖుఁడుగా నున్నాఁడు మనకేమైన నివ్వఁబడుచున్నదని కొట్టి చంపివేయ నుద్యుక్తుఁడగుచున్నట్లున్నది. ఇక నిచటనుండఁగూడద'ని యాలోచించుకొనుచుండఁగా నింతలో వాఁడు తాఁ దలంచిన కార్యార్థమై యొక రోకలిని భుజమున ధరించి బైలువెడలుటంజూచి యా యిరువురును భయభ్రాంతులై లేచి పరుగిడసాగిరి. ఆ గొల్లవాఁడదిచూచి విస్మయమంది వారిం బిలుచుచు వెంటఁబడెను. వారదిచూచి భయం బినుమడింప మఱింత వేగముగఁ బరుగిడసాగిరి. అప్పుడావీధిని నడయాడుచుండు జనులీ వినోదంబునుజూచి విస్మితచిత్తులై యా యుభయ వైష్ణవులను నీగొల్లవానిని యాపి విచారించఁగా నిజస్థితి దేటపడుటంజేసి మరల నావైష్ణవులా గొల్లవాని గృహంబునకేగి వానికి మంత్రోపదేశము సేయుట కియ్యకొనిరి. అంతట నాగొల్లవాఁడు తా నుద్దేశించిన పందిని వధించి దానిమాంసమును విక్రయించి యా ధనమును గురుదక్షిణగ సమర్పించెను. అపుడా వైష్ణవులా గురుదక్షిణంగొని వాఁడు నిరక్షరకుక్షియు, మూఢుఁడు నగుటచే వానికిఁ దిరుమంత్రము పదేశించినయెడల దానియర్థమును గ్రహింపఁజాలఁడని యెంచి వానికి దగినట్లు "బొల్లిగద్దనెక్కిన నల్లనయ్యా! రావయ్యా! బోంచేసి పోవయ్యా!" అని యుపదేశించి. "ప్రతిదినమును స్నానముచేసి యూర్ధ్వపుండ్రములధరించి భోజనము చేయఁబోవునపుడు తొలిముద్ద నెత్తి చేతిలోనుంచుకొని యీ మంత్రము నుచ్ఛరించి పిదప భోజనము చేయుచుండు"మని యాజ్ఞాపించి వెళ్ళిపోయిరి. ఆగొల్లవాఁడదియే తారకమంత్రమనియు, భోజనకాలమందుఁ దొలిముద్దఁ జేతనెత్తికొని యామంత్రము నుచ్చరించినవెంటనే యాబొల్లిగద్దనెక్కిన నల్లనయ్యవచ్చి యాముద్ద నారగించుననియు, అటుపిమ్మట శేషించిన యన్నమును దాను భుజించవలసియుంటున్నదనియు నమ్మినవాఁడై మొదటిదినమున నాప్రకారమే, తనకంచములో

నుంచఁబడిన సంకటిముద్దలోఁ గొంచెమెత్తి కుడిచేతఁ బెట్టికొని యా మంత్రము నుచ్చరించెను. కాని వాడుతలఁచిన ప్రకారి మా నల్లనయ్య రాకపోయెను. అయితే ఏ వేళకైన నా తొలిముద్ద నా నల్లనయ్య వచ్చి గ్రహించుననియు, అటుపిమ్మట దాను భుజించవలసినదే కాని యంతకుముందు భుజింపఁగూడదనియెడు నిశ్చయబుద్ధి గలవాఁడై క్షుద్బాధకోర్చి యట్లే స్మరింపుచుఁ గూర్చుండెను. భగవంతుఁ డదిచూచి 'ఓహో వీని కిప్పు డీ రూపముతో దర్శన మొసంగకపోయినయెడల వీ డిట్లే మూర్ఖపు పట్టుదలతో నాహారమును వర్జించి కూర్చుండుననియు, అందువలన వానికిఁ బ్రాణహాని కలుగఁగలద'నియు నెంచి వాని కా రూపముతో దర్శనమిచ్చి వాని చేతిలోని ముద్ద నెత్తికొనిపోయెను. అందుపైని వాడు ప్రతిదినము నట్లే చేయుచుండగా భగవంతుఁడును బ్రతిదినము నట్టే తొలిముద్ద నెత్తికొనిపోవుచుఁ గొంత కాలమునకు వానికిఁ గైవల్య మొసఁగెను. కాన నోయి యర్జునా! ఎవఁడెవఁ డేయే కులంబునఁ బుట్టుచున్నాడో వాడువాఁ డాయాకులాచార విహితంబులు కర్మలచే నన్నారాధించి కడతేరంగలడు.

శ్లో॥ శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ 47

అర్థము :— స్వనుష్ఠితాత్ = చక్కఁగా నాచరింపఁబడిన, పరధర్మాత్ = ఇతర వర్ణాశ్రమాచార ధర్మముకంటె, విగుణః = గుణహీనమైన, స్వధర్మః = తన కులాచారధర్మము, శ్రేయాన్ = శ్రేష్ఠమైనది, స్వభావనియతమ్ = తన కులాచార ధర్మమునకుఁ దగిన, కర్మ = కర్మమును, కుర్వన్ = చేయుచు, కిల్బిషమ్ = పాపమును, న + అప్నోతి = పొందఁడు.

కనుక నోయియర్జునా! ఈలోకమునఁ బ్రతిపురుషుడును దనకులాచారధర్మ మెంతగుణహీనమైనదైననుసరే, ఎట్టిక్రూరకృత్యములతోఁగూడినదైననుసరే, దానినే యాచరింపఁ దగును గాని యితరకులాచారధర్మముల నాచరింపఁదగదు. తన కులధర్మముచే నియమింపఁబడు కర్మ మెంత హేయమైనదైననుసరే, ఎంతక్రూరమైనదైననుసరే దాని నాచరించుటవలన నొక పాపమును బొందఁడు. అట్లుగాక,

"తే. ఇట్లుగా కాత్మధర్మంబు లెడల విడిచి
వర్ణములు నాలుగింట నెవ్వారలైనఁ
దొలఁగఁ ద్రొక్కినఁ బాటిల్లు దుష్టగతులుఁ
మన్న కాలంబు, పదపడి చన్నయపుడు." (భార. అను. ౩. ఆ ౨౭౮.)

అనగ క్లైబ్యుఁడైనఁ దనవర్ణాశ్రమాచార ధర్మముల నతిక్రమించినయెడలఁ బాప మును బొందఁగలఁడు ఓయియర్జునా! పూర్వము మిథిలానగరంబున జనకచక్రవర్తి కాలంబున బోయకులంబునఁ బుట్టి మాంసవిక్రయవృత్తిచే జీవింపుచుండియు మహా జ్ఞానసంపన్నుడైయుండిన ధర్మవ్యాధుని చరిత్రమే యిందుకు నిదర్శనమైయున్నది. కనుకనే

" శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ "

అని యింతకుముందు నీకుఁజెప్పుటకుఁ గారణమైనది. (చూ. 3. 35).

శ్లో॥ సహజం కర్మ కౌన్తేయ! సదోష మపి న త్యజేత్ ॥
సర్వారమ్భా హి దోషేణ ధూమే నాగ్ని రి వావృతాః ॥ 48

అర్థము:-హేకౌన్తేయ != ఓయియర్జునా!, సహజమ్=సహజమైన. అనఁగా, తన వర్ణాశ్రమాచారధర్మము ననుసరించి చేయఁబడియెడు, కర్మ = కర్మము, సదోషమ్+అపి=దోషముతోఁ గూడినదైనను, న+త్యజేత్ = విడువఁగూడదు. హి = ఏలయనఁగా, సర్వారమ్భాః=సమస్తకర్మలను, అగ్నిః=నిప్పు, ధూమేన+ఇవ = పొగచే నావరింపఁబడియున్నట్లు, దోషేణ = దోషముచేత, ఆవృతాః = ఆవరింపఁబడి యున్నవి.

కనుక నోయి యర్జునా! చక్కఁగ నాలోచించి చూచినచో నీలోకమునం గల నాలుగు జాతులవారును తమ వర్ణాశ్రమాచార ధర్మము ననుసరించి యాచరించెడు ప్రతికర్మయును, నిప్పుపొగచే నావరింపఁబడియున్నట్లు ఏదేనియొక దోషముచే నావరింపఁబడియేయుండును గనుక నా కారణమునుబట్టి యాకర్మల నాచరించుట మాన గూడదు. ఏలయనఁగా నట్లు మానినయెడల నీప్రపంచనటనయే జరుగనేరదు. అదె ట్లనఁగా జెప్పుచున్నాను వినుము.

బ్రాహ్మణు లాచరించెడు యజ్ఞములయందు పశువధాది దోషములున్నవిగదా! క్షత్రియ ధర్మంబులగు వేట, యుద్ధము, దుష్టశిక్షణ మొదలగు వానియందు జీవ హింసాది దోషంబులున్నవి గదా? ఇఁకను వైశ్య శూద్రాదులాచరించెడు కృషి, గోరక్ష, వాణిజ్యాదులయం దనేక దోషములున్నవిగదా? ఇందేకర్మను మాన వచ్చునో నీవే యోచింపుము. ఓయియర్జునా! బ్రాహ్మణుఁడు యజ్ఞాది వేదకర్మల ద్యజించినయెడల నింద్రాదిదేవతలకుఁ బ్రీతిగలుగమిచే సకాల వర్షాదులులేక క్షామము గలుగునుగదా! క్షత్రియుఁడు వేటాడక పోయినయెడల నడవిమృగములు

బలసి సస్యములు మొదలగువానిని నాశముచేయునుగదా! యుద్ధమున శత్రుల వధింపక పోయినయెడలఁ దమరాజ్యమునకే మోసము వాటిల్లునుగదా! దుష్టుల శిక్షింపకపోయినయెడలఁ దక్కిన జనులకు ననేకవిధములగు బాధలు గలుగునుగదా! ఇఁకను వైశ్యాదులు భూమిని దున్నుట మొదలగు పనులచే ననేకజంతువులకు హాని కలుగుననియెడు భీతిచేఁ గృషిమానినయెడల సస్యములు పండనేరవుగదా! ఆవులు మొదలగువాని దూడలనోళ్ళుగొట్టి పాలు పితుకకపోయినయెడల జనులకు పాలు, పెరుగు, నెయ్యి మొదలగునవి చిక్కవుగదా? వాణిజ్యము జరుగకపోయినయెడల లోకుల కనేకవిధములగు కష్టములు గలుగునుగదా! వేయేల, ప్రతిదినమును బ్రతి యింటను బ్రాతస్సంధ్యాకాలంబులయం దనివార్యంబుగ నొనర్పఁబడు సమ్మార్జనాది కృత్యంబులచే తనే చీమలు మొదలగు ననేకజీవజంతువులకు హింస గలుగఁదగి యున్నదిగదా? ఆ కారణమునుబట్టి యాపనులఁజేయుటకు వీలులేదుగదా? కాబట్టి,

"క. తనతన తెరువునఁ గర్మం
బనుష్ఠితంబైన మేలు" (భార. శాంతి. ౫. ఆ. ౨౫౬.)

అనునట్లు, ప్రతిపురుషుఁడును దన వర్ణాశ్రమాచారధర్మము ననుసరించి యేయే కాలంబున నేయేకర్మ నాచరింపవలయునో, ఆయా కాలంబున నాయాకర్మ నాచరించియే తీరవలయునుగాని వానియందలి దోషము లెంచి మానఁగూడదు. కనుకనే, "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్" అని యింతకుముందు చెప్పుటకుఁ గారణమైనది.

అర్జు — అయితే స్వామీ! ప్రతివాఁడు నిట్లు తన కులాచారానుగుణ్యంబులగు కర్మల నాచరింపుచునే యుండినయెడల నాకర్మలవలని దోషంబులు వాని నావాదింపుచునే యుండునుగదా? ఇఁకను వాఁడు తరించుటయెట్లు?

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥ 49

అర్థము :— సర్వత్ర = సమస్తకర్మలయందును, అసక్తబుద్ధిః = అనాసక్తచిత్తుఁడును, జితాత్మా = మనోనిగ్రహముగలవాఁడును, విగతస్పృహః = ఆశలేనివాఁడును నై, సన్న్యాసేన = కర్మఫలత్యాగముచేయుటచే, పరమామ్ = శ్రేష్ఠమైన. నైష్కర్మ్యసిద్ధిమ్ = నిష్క్రియత్వమును, అధిగచ్ఛతి = పొందుచున్నాఁడు.

కృ — ఓయియర్జునా! ఎవఁడైతే తన కులాచార విహితంబులగు కర్మలనాచరించునపుడు, ఆకర్మలయం దనాసక్తచిత్తుడును, అనఁగా నాకర్మలఁ దనయుపయో

గార్థము చేయుచున్నానసెడు తలంపులేనివాఁడును, నిస్పృహుఁడును, అనఁగా, నాకర్మలవలనఁ దనకొక ప్రయోజనము గలుగఁబోవుచున్నదనెడు ఆశలేనివాఁడునునై తన కులాచార ధర్మముల ననుసరించి యాకర్మలఁ దానాచరించుట తనకు విధియనెడు మనోనిశ్చయముతోఁ జేయుచున్నాఁడో, అట్టివాఁడు నైష్కర్మ్యసిద్ధిని బొందు చున్నాఁడు. అనఁగా, అకర్మలు జేసియుఁ జేయని వాఁడగుచున్నాఁడు. కనుక నా కర్మ లెట్టిదోషయుక్తములైనవైనను, ఆదోషములు వాని నంటనేరవనుట.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా॥ 50

అర్థము:— హేకౌన్తేయ! = ఓయియర్జునా!, సిద్ధిమ్ = నైష్కర్మ్యసిద్ధిని, ప్రాప్తః = పొందినవాఁడు, జ్ఞానస్య = జ్ఞానయోగముయొక్క, పరా = శ్రేష్ఠమైన, నిష్ఠా = పర్యవసానము, యా = ఏదియో (అట్టి), బ్రహ్మ = పరబ్రహ్మమును, యథా = ఏవిధముగా, ఆప్నోతి = పొందుచున్నాఁడో (పొందఁగలఁడో), తథా = ఆవిధమును, సమాసేన = సంగ్రహముగా, మే + ఏవ = నావలననే, నిబోధ = తెలిసికొనుము.

ఇట్టి నైష్కర్మ్యసిద్ధిని బొందుటవలనఁగలిగెడు ప్రయోజన మేమనఁగాఁ జెప్పుచున్నానువినుము.

ఓయియర్జునా! "అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః" ఫలాసక్తిలేక కర్మనాచరించెడువాఁడు పరమపదమునుబొందునని యింతకుముందు చెప్పియుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 3. 19.)

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — కనుక నట్లు మోక్షమును బొందుట కర్హుఁడగుచున్నాఁడు.

అర్జు — స్వామీ! ఎవఁడైననుసరే జ్ఞానసిద్ధినిబొందిననేకదా మోక్షమున కర్హుఁడగును? అట్లుండ, నిష్కామకర్మాచరణమాత్రము చేతనే యెట్లు కాఁగలఁడు?

కృ — అవును జ్ఞానసిద్ధిని బొందినవాడుమాత్రమే మోక్షార్హుఁడగును. అయితే,

" చ. ఘనభుజ, యెల్ల చందములఁ
గాలముతోడివ సుమ్ము, వర్ణధ
ర్మనిరతి చిత్తపాకము గ్రమంబునఁ
దెచ్చుఁ గషాయపక్వతం;" (భార. శాంతి. ౨ ఆ. ౩౯౬)

అనునట్లు, ఇట్టినిష్కామకర్మాచరణ యోగమువలననే మనస్సు క్రమక్రమ

ముగఁ బక్వమై కాలక్రమమున జ్ఞానసిద్ధిని బొందఁగలడు. అట్టిజ్ఞానసిద్ధివలన మోక్ష మబ్బును. కనుకనే,

"శ్లో. న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి."

అని నేను నీకుఁజెప్పుటకుఁ గారణమైనది. (మా. 4 38.)

కనుక నోయియర్జునా! పరబ్రహ్మమును (మోక్షమును) బొందుటకు సాధన మగుజ్ఞానమును నిష్కామకర్మసిద్ధిని బొందినవాఁడెట్లు కాలక్రమమునఁ బొందగలఁడో దానింగూడ నీకు సంగ్రహముగఁ జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ బుద్ధ్యావిశుద్ధయాయుక్తో ధృత్యాఽఽత్మానంనియమ్యచ।
శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ 51

అర్థము:— విశుద్ధయా + బుద్ధ్యా + యుక్తః = నిర్మలమయిన మనస్సుగల వాఁడును, ధృత్యా + ఆత్మానమ్ + నియమ్య + చ = దృఢమైన మనోనిగ్రహముగల వాఁడును, శబ్దాదీన్ + విషయాన్ + త్యక్త్వా = శబ్దాదియింద్రియవిషయములయందలి యాసక్తిని విడిచినవాఁడును, రాగద్వేషౌ + వ్యుదస్య + చ = ఇష్టానిష్టముల వదలిన వాడునునై.

ఓయి యర్జునా! ఈలోకమున నెవఁడైతే నిష్కామకర్మానుష్ఠానమును జేయు చున్నాఁడో, అనఁగాఁ దన కులాచారవిహితములగు కర్మల ఫలాపేక్ష లేనివాఁడై చేయుచున్నాఁడో, వానిమన సెప్పుడును నిర్మలముగనే యుండునుగదా? మన సెప్పుడు నిర్మలమైనదగుచున్నదో, అప్పుడు దానిని దుర్విషయములయందుఁ బ్రవర్తింపనీక నిరోధించుట సులభసాధ్యముగదా? అట్లు నిరోధింపఁబడిన మనస్సుగలవాని కొక దానియందిష్టమును మఱియొకదానియం దయిష్టమును ఉండవలసిన కారణము లేదు గదా? కనుక నట్టినిష్కామకర్మానుష్ఠానపరుఁడు నిర్మలమైన మనస్సుగలవాఁడును, మనోనిగ్రహము గలవాఁడును, రాగద్వేషములు లేనివాఁడును, అగుచున్నాఁడు.

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52

అర్థము:— వివిక్తసేవీ = ఏకాంతస్థలనివాసియు, లఘ్వాశీ = మితాహారుఁడును, యతవాక్కాయమానసః = త్రికరణశుద్ధిగలవాఁడును, నిత్యమ్ + ధ్యానయోగపరః = సదా భగవద్ధ్యానము చేయుచుండుటయం దాసక్తిగలవాఁడును, వైరాగ్యమ్ + సముపాశ్రితః = వైరాగ్యశీలుఁడునునై.

ఇట్లు రాగద్వేషములు లేనివాఁడెప్పుడగుచున్నాఁడో అప్పుడట్టి రాగద్వేషములుగల వారితోఁగలసి మెలఁగుట కిష్టములేనివాఁడై విజనస్థలముల యందుండఁ గోరుచుఁ ద్రికరణశుద్ధిగలవాఁడైయుండును. అనఁగా, మనస్సును దుర్విషయముల యందుఁ బ్రవర్తింపనీకయు, శరీరముతో దుష్టపనుల జేయకయు, వాచాదుర్భాషలు అసత్యములు పలుకకయు నుండును. మఱియు నట్టివానికి జిహ్వాచాపల్యము లేదు గాన మితముగ, అనఁగా, తన దేహధారణ దేహారోగ్యములకుఁ గావలసినంతే తాను భుజింపుచుండును. ఇట్టి లక్షణములు గలవాఁ డెప్పుడగుచున్నాఁడో, అప్పుడు వాని మనసెల్లప్పుడును ధ్యానయోగమునందే నిలుచును. అనఁగా, భగవంతునే ధ్యానింపుచుండును. కనుక నపుడు వాని కైహికసుఖములలో నాకాంక్ష దానియందుఁ గ్రమక్రమముగ నిస్పృహగలుగుచుఁ నుదకు కేవల వైరాగ్యశీలుఁడు గాఁగలఁడు.

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53

అర్థము:— అహఙ్కారమ్= నేను అనెడు అహంభావమును, బలమ్ = నేను బలవంతుఁడను అను దురభిమానమును, దర్పమ్ =అట్టి దురభిమానముచేఁ గలిగెఁడు గర్వమును, కామమ్ = దేనినైనఁ గోరుటయు, క్రోధమ్=కోపమును, పరిగ్రహమ్= దేనినైనఁ బ్రియముతోఁబుచ్చుకొనుటయు, విముచ్య = విడిచి, నిర్మమః = మమకారములేనివాఁడును, శాన్తః = శాంతచిత్తుఁడునై, బ్రహ్మభూయాయ = బ్రహ్మైక్యమును బొందుటకు, కల్పతే = అర్హుఁడగుచున్నాఁడు.

అట్లెప్పుడగుచున్నాఁడో, అప్పుడు వానికి (అహంకారము) అనఁగా, ఇది నేఁజేయుచున్నాను అనే మొదలగు నహంభావమును; (బలము) అనఁగా, ఇది నాశక్తి వలన గలుగుచున్నది అనెడు అతిశయమును; (దర్పమ్) నేను కులవంతుఁడను, గుణవంతుఁడను, ధనవంతుఁడను అనే మొదలైన కారణములచే గర్వించుటయు;( కామమ్) ఈవస్తువు నాకుఁగావలెను అనెడు కోరికయు; (క్రోధమ్) వీడు నాకు శత్రువు, వీడు నాకు చెరుపుచేసినవాడు అనే మొదలైన కారణములతో నొకని ద్వేషించుటయు; (పరిగ్రహమ్) ఒకఁడేదైనఁ దన కిచ్చినచో దాని నాసక్తితోఁ బుచ్చుకొనుటయు; ఈలాటి లక్షణములుండనేరవు. కనుక నపుడు వాఁడు మమకారము, అనఁగా దార పుత్ర బంధు మిత్ర ధన కనక వస్తువాహనాదులలో దేనియందును మమత్వము, అనఁగా, ఇది నాదియనెడు దురభిమానము లేనివాఁడగును. అపుడు వాని మనస్సు శాంతినొందినదగును. అనఁగా, వానికట్టి సుఖదుఃఖములు సంప్రాప్తములైనను

వానిచే నేలాటి వికారము నొందక హాయిగానుండును. కాన నప్పుడువాఁడు బ్రహ్మైక్యమును (మోక్షమును) బొందుటకర్హుఁడగును.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ 54

అర్థము :— బ్రహ్మభూతః=జీవన్ముక్తుఁడగువాఁడు, ప్రసన్నాత్మా=ప్రశాంతచిత్తుఁడై, న+శోచతి=దుఃఖింపఁడు, న+కాఙ్క్షతి=దేనినికోరఁడు, సర్వేషు+భూతేషు=సమస్తప్రాణులయందును, సమః=సముఁడై, పరామ్ = శ్రేష్ఠమైన, మద్భక్తిమ్=నాయందలి భక్తిని, లభతే=పొందుచున్నాఁడు.

అట్లు మోక్షమును బొందఁదగిన యోగ్యతగలవాఁడైన పిమ్మటవాఁడు జీవన్ముక్తుఁడగుచున్నాఁడు. అనఁగా, జీవించియుండియు ముక్తినొందినవానితో సముఁడగుచున్నాఁడు. కాన నపుడు వాఁడు శాంతచిత్తుఁడై యుండును. అనఁగా, ఎట్టి కష్టము సంభవించినను దుఃఖింపకయు, ఏవస్తువునైనను సరే కోరకయు ఉండుట యేగాక శత్రుమిత్రాది సమస్తప్రాణుల యందును సమబుద్ధిగలవాఁడై నాయం దెడతెగని భక్తిసేయుచుండును. అనఁగా, సదానాస్వరూపమునే ధ్యానింపుచుండుననుట.

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ 55

అర్థము :— భక్త్యా=(అట్టి) భక్తిచేత, మామ్=నన్ను, యః + చ=ఎవఁడనైనదియు, యావాన్ + (చ)=ఎట్టివాఁడనైనదియు, తత్త్వతః = యథార్థముగా, అభిజానాతి = ఎఱుఁగుచున్నాఁడు, తతః = అట్లెఱుఁగుటవలన, మామ్+తత్త్వతః+జ్ఞాత్వా=నన్ను నిజముగాఁ దెలిసికొనినవాఁడై, తదనన్తరమ్=పిమ్మట (దేహమును విడిచినపిమ్మట), విశతే = (నాలో) ప్రవేశింపుచున్నాఁడు. (ఐక్యమగుచున్నాఁడు.)

ఇట్లునాయం దెడతెగని భక్తిచేయుటవలనఁ గ్రమక్రమముగ నా నిజస్వరూపమును, అనఁగా నేనెవఁడనైనదియు, ఎట్టి వాఁడనైనదియు, ఉన్నది యున్నట్లు తెలిసికొన్నవాఁడై పిమ్మట, అనఁగా, పాంచ భౌతికమగు నీదేహమును విడిచినపిమ్మట నాలో నైక్యమగును. అనఁగా, విదేహముక్తినొందుననుట.

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్। 56

అర్థము:- మద్వ్యపాశ్రయః=నన్నాశ్రయించెడివాఁడు, సర్వకర్మాణి=సమస్త కర్మములను, సదా=ఎల్లప్పుడును, కుర్వాణః + అపి = చేయుచున్నవాఁడైనను, మత్ప్రసాదాత్=నా యనుగ్రహమువలన శాశ్వతమ్=శాశ్వతమైనదియు, అవ్యయమ్=నాశములేనిదియు నగు, పదమ్ = స్థానమును (మోక్షమును), అవాప్నోతి = పొందుచున్నాఁడు.

ఇందువలన నేమి యేర్పడు చున్నదనఁగా, ఎవఁడైనను సరే నన్నాశ్రయించి నాయందే చిత్తమును జేర్చినవాఁడైనయెడల నట్టి వాఁడెల్లప్పుడును వాని వర్ణాశ్రమాచార విహితములగు నిత్య నైమిత్తికాది కర్మముల నాచరింపుచుండినను, నాయనుగ్రహమువలన వాఁడా కర్మలచేఁ బద్ధుఁడుగాక శాశ్వతమగు మోక్షపదవిని బొందఁ గలఁడని యేర్పడుచున్నదికదా?

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః ।
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ ॥ 57

అర్థము :- సర్వకర్మాణి = సమస్తకర్మములను, చేతసా = మనస్సుచేత, మయి + సన్న్యస్య=నాయందర్పించి, మత్పరః + (సన్) = నన్నే పరమప్రాప్యముగ నెంచినవాఁడవై, బుద్ధియోగమ్ + ఉపాశ్రిత్య = జ్ఞానయోగము నవలంబించి, సతతమ్ = ఎల్లప్పుడును, మచ్చిత్తః = నాయందుఁజేర్చిన చిత్తముగలవాఁడవు, భవ=అగుము.

కనుక నోయి యర్జునా! అట్లే నీవును నీవర్ణాశ్రమాచార విహితంబులగు నిత్యనైమిత్తికాది కర్మంబుల నాచరింపుచు నాకర్మఫలంబులయం దాసక్తచిత్తుఁడవు కాక వానిని నాకర్పితములుగఁ జేయుము. అనఁగా, ఆకర్మలన్నియు నా నియమనానుసారముగా జేయఁబడు చున్నవేగాని నీయిష్టానుసారముగాఁ జేయబడునవి కావనియు కనుక నాకర్మఫలములతో నీకు సంబంధము లేదనియు నిశ్చయించికొనుము. అట్లు చేసితివేని యందువలన నీకు జ్ఞానయోగసిద్ధి కలుగఁ గలదు. అట్టి జ్ఞానయోగసిద్ధిని బొందినపిదప సదా నాయందే చిత్తమును జేర్చియుండఁగలవు. కాన నట్లు చేయుము.

శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి ।
అథ చేత్త్వ మహఙ్కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి ॥ 58

అర్థము :- త్వమ్ = నీవు, మచ్చిత్తః = నాయందుఁ జేర్చినచిత్తముగలవాఁడవై తివేని, మత్ప్రసాదాత్ = నాయనుగ్రహమువలన, సర్వదుర్గాణి = సమస్తకష్టములను, తరిష్యసి = దాటఁగలవు, అథ = పిమ్మట (అట్లుకాక), అహఙ్కారాత్ =

అహంకారముచేత, నశ్రోష్యసిచేత్ = నామాట వినకుంటివేని, వినఙ్క్ష్యసి = చెడిపోదువు.

అట్లు నాయందు చిత్తము నుంచినవాఁడవై యుంటివేని నీవు నిర్గుణుఁడవు సమస్తదుఃఖములను నా యనుగ్రహమువలన దాఁటఁగలవు. లేక అహంకారయుక్తుఁడవై నా మాటలు వినకుంటివేని చెడిపోదువు కనుకనే, నిష్కాముఁడవై సమస్తకర్మములను నాయందర్పించి అహంకారమును విడిచి యుద్ధముచేయుమని యింతకుముందు నీకుఁ జెప్పఁబడుట గలిగినది. (చూ 3. 30)

శ్లో॥ య ద్యహఙ్కార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైవ వ్యవసాయ స్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥　　59

అర్థము :— అహఙ్కారమ్ + ఆశ్రిత్య = అహంకార యుక్తుఁడవై, నయోత్స్యే + ఇతి = యుద్ధము చేయను అని, మన్యసే + యది = తలఁచెదవేని, తే = నీయొక్క, ఏషః + వ్యవసాయః = ఈనిశ్చయము, మిథ్యా = అబద్ధముగను, ప్రకృతిః = స్వభావము, త్వామ్ = నిన్ను, నియోక్ష్యతి = (యుద్ధమునకు) నియమించును.

ఓయి యర్జునా! నేనింతదూరము చెప్పియు నీవు సర్వధర్మముల నెఱిఁగినవాఁడ ననని యహంకరించి నామాటవినక ఇంతకుముందు నీవుచెప్పినప్రకారము (చూ 1 46) "దుర్యోధనాదులు ఆయుధపాణులై నిరాయుధుఁడనగు నన్ను వధింపఁబూనినను వారలతో నెదిరించి యుద్ధము చేయను" అనే పట్టుదలతోనే యుంటివేని యా పట్టుదల వ్యర్థమగును. అనఁగా నెరవేరదనుట, ఏలయనఁగా, యుద్ధమును జేయుటకు నీ విష్టపడక పోయినను, నీప్రకృతియే అప్రయత్నముగ నైన నీచే నాయుద్ధమును జేయించును, అదెట్లనఁగా, జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ! నిబద్ధ స్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్య స్యవశోఽపితత్॥　　60

అర్థము :— హేకౌన్తేయ! = ఓయి యర్జునా! స్వభావజేన = స్వభావము వలనఁగలిగిన, స్వేన + కర్మణా = నీక్షత్రియకర్మముచేత, నిబద్ధః = బద్ధుఁడవగు నీవు, యత్ = దేనిని (ఏయుద్ధకర్మమును), కర్తుమ్ = చేయుటకు, మోహాత్ = అవివేకము వలన, న + ఇచ్ఛసి = ఇచ్ఛయింపకున్నావో, తత్ = దానిని(ఆయుద్ధకర్మమును), అవశః + అపి = పరతంత్రుఁడవై అయినను, కరిష్యసి = చేయుదువు.

ఓయి యర్జునా! శౌర్యము, తేజము, ధైర్యము, సమర్థత, యుద్ధమున వెనుక దీయకుండుట, దానము, ప్రభుత్వము అనునవి క్షత్రియునకు స్వభావసిద్ధములగు కర్మలుగదా? (చూ. 18. 43)

నీవు ఇట్టిక్షత్రియకులమునఁ బుట్టినవాఁడవగుటమాత్రమే కాక మహాశూరుఁడవని ప్రఖ్యాతినిగూడఁ గాంచియున్నావు గదా? కనుక నీకీ శౌర్య ధైర్యాదిగుణములు స్వభావసిద్ధము లైనవియే కదా?

అర్జు — అవును.

కృ — మంచిది. ఈలోకమున నెవఁడును ఎప్పుడును క్షణమాత్రమైనను కర్మలఁ జేయక యుండఁ జాలఁడనియు, ప్రకృతిగుణములచేఁ దనస్వాధీనములేకయే బలాత్కారముగఁ గర్మములఁ జేయింపఁబడుచుండుననియుఁ గూడ నింతకుముందు చెప్పి యుంటినిగదా, జ్ఞాపకమున్నదా? (చూ. 3. 5)

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ 61

అర్థము :— హే అర్జున ! = ఓయి అర్జునుఁడా !, సర్వభూతానామ్ = సమస్త ప్రాణులకు (జీవాత్మలకు), ఈశ్వరః = నియామకుఁడగు పరమాత్మ, యన్త్రారూఢాని = (దేహములనెడు) జంత్రముల నధిష్ఠించియున్న అనఁగా దేహధారులగు, సర్వభూతాని = సమస్తప్రాణులను (జీవాత్మలను), మాయయా = ప్రకృతియనెడు సూత్రముచేత, భ్రామయన్ = త్రిప్పుచు (ఆడింపుచు), హృద్దేశే = హృదయస్థానమునందు, తిష్ఠతి = ఉంచున్నాఁడు.

ఓయి యర్జునా! ప్రకృతియే సమస్తప్రాణులచే నన్నిపనులఁ జేయింపుచున్నదని చెప్పితినిగదా, ఆప్రకృతియన్నదో నాస్వాధీనమందుండి నాసంకల్పానుసారముగఁ బనిచేయునట్టిదియనియుఁగూడ నింతకుముందు నీకుఁ జెప్పియుంటినిగదా! కనుకఁ జక్కఁగఁ బరిశీలించినచో సమస్తప్రాణుల నాడించెడువాఁడు నేనేయనియు, ప్రకృతి సాధనమాత్రమేయనియు తెలుఁగఁగలవు. అదెట్లనఁగా నిందున కొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! నీవెప్పుడైన బొమ్మలాటను జూచియుందువుగదా, అవి యెట్లాడుచున్నవి?

అర్జు — ఆ బొమ్మలకుఁ గట్టఁబడియుండెడు సూత్రముల నొకఁడు చేతంబట్టుకొని తెరచాటుననుండి లాగుటవలన నా తెర బైటనుండెడు బొమ్మలాడుచున్నవి.

కృ — అవునుగదా? అట్లే. ఈలోకమునందలి దేహధారులగు సమస్త ప్రాణులును బొమ్మలవంటివనియు, ఆయా ప్రాణులకు సంబంధించియుండెడు సత్త్వ, రజ, స్తమస్సులనియెడు ప్రకృతిగుణములు సూత్రములనియు, ఆప్రకృతిని దనస్వాధీనమందుంచుకొని యుండెడు పరమాత్మ యాబొమ్మల నాడించెడు సూత్రధారుఁడనియు నెఱుంగుము. అయితే, బొమ్మల నాడించెడు సూత్రధారుఁ డాబొమ్మలఁ జూచుచుండెడువారి కగపడకుండఁ దెరచాటున నెట్లుండునో, అట్లే యీప్రాణుల నాడించెడు పరమాత్మయు నితరులకు గోచరము గాకుండునట్లు మనస్సునందుండి యాడింపుచుండును. అనఁగా, ఏయేదేహియొక్క మనస్సునందుండి యెప్పు డెప్పు డెట్లు సంకల్పించుచున్నాఁడో, ఆయా దేహి యప్పుడప్పుడు తనతనప్రకృతికిఁ (స్వభావమునకు) దగినపనులఁజేయుచుండుననుట. మఱియు, బొమ్మల నాడించెడువాఁడు తన చేతనుండెడు సూత్రములను లాగక యూరకుండునపు డాసూత్రము లాబొమ్మల నెట్లాడింపఁజాలవో, అట్లే, పరమాత్ముని సంకల్పములేకయే ప్రకృతి యేప్రాణిని నాడింపఁజాలదు.

శ్లో॥ త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥ 62

అర్థము :— హేభారత ! = ఓయర్జునా !, సర్వభావేన = అన్నివిధముల చేతను, తమ్ + ఏవ = ఆపరబ్రహ్మమునే, శరణమ్ + గచ్ఛ = రక్షకత్వము వేడుము, తత్ప్రసాదాత్ = ఆతనియనుగ్రహమువలన, పరామ్ + శాన్తిమ్ = మిక్కిలిచిత్త శాన్తిని, శాశ్వతమ్ + స్థానమ్ + (చ) = శాశ్వతమగు మోక్షపదవిని, ప్రాప్స్యసే = పొందఁగలవు.

కనుక నోయియర్జునా! అట్లాడింపుచుండెడు నాపరమాత్మనే శరణము పొందుము అనఁగా, ఆపరమాత్ముని రక్షకత్వమునే వేడికొనుము. అదెట్లనఁగా,

"మ. నను జన్మింపఁగఁజేసి యింద్రియముల న్నాయందుఁ గల్పించియా
పనులందుం దిరిగించి పాపముల నాపైఁజుట్టి నేతేరకాఁ
డనుచుం బోయెద వేని చెప్పెదను నీవాడించినట్లే నటిం
చిన కీల్బొమ్మను నీకుచిత్తమికనో శ్రీభావనారాయణా!"

అనునట్లు, నీయందేమియుఁ గర్తృత్వాభిమానముంచికొనక నీవాచరించెడు సమస్తకర్మలు నాతని సంకల్పానుసారముగఁ జేయఁబడినవియేయనియెడు నిశ్చయబుద్ధితో నాకర్మలన్నియు నాతనియందు సమర్పించి రక్షకత్వము వేడితివేని యతఁడు

నీయెడలఁగృపాళుఁడై నీమనస్సున నేలాటి సంకల్పములును బొడమకుండునట్లు చేయును. అట్లెప్పుడు సంకల్పరహితుఁడవగుచున్నావో అప్పుడు నీవుచిత్తశాంతియును, తద్వారా నిత్యానందపదవియగు మోక్షమును బొందఁగలవు.

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

అర్థము :— ఇతి = అని (పైఁజెప్పఁబడినప్రకారము), గుహ్యాత్ + గుహ్యతరమ్ = రహస్యములన్నిటిలోఁగొప్పదియగు (పరమరహస్యమగు), జ్ఞానమ్ = జ్ఞానము, తే = నీకు, మయా = నాచేత, ఆఖ్యాతమ్ = చెప్పఁబడినది, ఏతత్ = దీనిని, అశేషేణ = నిశ్శేషముగా (చక్కఁగా), విమృశ్య = విమర్శించి (ఆలోచించి), యథా = ఏప్రకారము, ఇచ్ఛసి = (చేయుటకు) ఇచ్ఛయించుచున్నావో, తథా = ఆలాగు, కురు = చేయుము.

ఓయి యర్జునా! నీకిపు డజ్ఞానమువలన నీబంధుమిత్రాదులయెడలఁ గలిగియుండెడు మోహమువిడిచి జ్ఞానోదయమగుటకుఁ దగిన విషయము లన్నియుఁ జెప్పియైనదికదా? ఇంతియకాక రహస్యము లన్నిటిలోఁ బరమరహస్యమునుగూడ నిపుడు చెప్పితినిగదా? వీనినన్నిటిని జక్కఁగ నాలోచించి చూడుము. అందుపైని నీబుద్ధి కెట్లుతోఁచుచున్నదో, అనఁగా, నేజెప్పినట్లు ఇపుడీ యుద్ధమునుజేయుట యుక్తమని తోఁచుచున్నదో, లేక నీవాలోచించినట్లు మానుటయే మేలనితోఁచుచున్నదో, అట్లు చేయుము.

శ్లో॥ సర్వగుహ్యతమం భూయశ్శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64

అర్థము :— సర్వగుహ్యతమమ్ = రహస్యములన్నిటిలో నతిగోప్యమైనదియు, పరమమ్ = శ్రేష్ఠమైనదియునగు, మే = నాయొక్క, వచః = (మఱియొక) వాక్యమును, భూయః = మరల, శృణు = వినుము. (త్వమ్) = నీవు, మే = నాకు, దృఢమ్ + ఇష్టః + అసి = మిక్కిలి ప్రియుఁడవైయున్నావు, ఇతి + తతః = అను నీకారణమునుబట్టి, తే = నీకు, హితమ్ = హితమును, వక్ష్యామి = చెప్పుచున్నాను.

అయితే, ఓయియర్జునా! నేనింతదూరము చెప్పియు నీకిపుడు నీబంధుమిత్రాదులయెడలఁ గలిగియుండెడు మోహముచేఁబరవశుఁడవై నావాక్యములన్నిటి నేటఁ గలిపి యుద్ధమును మానుటకే నిశ్చయించెదవేమోయనియెడు సందేహము నాకుఁ దోఁచుచున్నది. అట్లుమానినయెడల నీక్షత్రియకులధర్మము నాచరింపమిచే నిహము

నతను బనమునతను జెడిన వాఁడవగుదువు గనుకను, నాకుమిక్కిలి ప్రియుండవగు నీవు అట్లగుట నాకెంతమాత్ర మిష్టములేదు కనుకను, నీ మేలుకొఱకై రహస్య[illegible] [illegible] నతి [illegible] [illegible] [illegible] నతి [illegible] గాన దాని[illegible] [illegible]. [illegible] చేయుచున్నాను.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మా మే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ 65

అర్థము :— మన్మనాః = నాయందుఁ జేర్చినచిత్తముగలవాఁడవును, మద్భక్తః = నాయెడలభక్తిగలవాఁడవును, మద్యాజీ = న న్నారాధించువాఁడవును, భవ = అగుము, మామ్ + నమస్కురు = నాకు నమస్కరింపుము, మామ్ + ఏవ = నన్నే, ఏష్యసి = పొందఁగలవు, సత్యమ్ = (ఇది) యథార్థము. మే + ప్రియః + అసి = (నీవు) నాకుప్రియుఁడవై యున్నావు (కాఁబట్టి), తే = నీకొఱకు (ఈవిషయమున) ప్రతిజానే = ప్రతిజ్ఞ చేయుచున్నాను.

ఓయి యర్జునా! నేను నీకింతవఱకు రాజగుహ్యమును (పరమరహస్యమును) జెప్పియున్నాను. అదేమనఁగా, పూర్వోక్తమగు నెంతటిదైన నెట్టిదురాచారపరుఁడైనను సరే, ఎట్టినీచకులమునఁ బుట్టినవాఁడైనను సరే, అనన్యగతికుఁడై నన్నే భజించిన యెడల వాఁడు సాధువనియే యెంచఁదగి యున్నాఁడనియు, అట్టి నాభక్తుఁడు మోక్షార్హుఁడగునే గాని చెడఁడనియు, అట్లుండ సత్కుల ప్రసూతుండవును సదాచారసంపన్నుఁడవును నాకుఁ బ్రియుండవునగు నీవిషయములోఁ బ్రత్యేకించిచెప్పఁబని లేదనియు, కాఁబట్టి నాయెడలభక్తిగలవాఁడవై సదా నన్నే మనసాధ్యానింపుచు భజింపుచు నమస్కరింపుచుంటివేని నన్నే పొందఁగలవనియును జెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా ? (చూ. 9.30–31–32–33–34)

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — ఓయి యర్జునా! ఇదియే నీకిపుడు మరలఁ జెప్పఁబూనిన పరమరహస్యము కనుక నీవట్లుచేయుము. అనఁగా, నాకు భక్తుఁడవును సదా నాయందే చిత్తమును జేర్చినవాఁడవునై మనసా నన్నే ధ్యానింపుచుఁ బూజింపుచు నమస్కరింపుచుండుము. ఇట్లు చేసితివేని యింతమాత్రముచేతనే నన్నుఁబొందఁగలవు ఇందుకేమియు సంశయములేదు. ఓయి యర్జునా! నీవు నాకుప్రియుఁడవు గాన నిది సత్యమని నీకు నమ్మకము గలిగించుటకు గాను ప్రమాణమునుగూడఁ జేయఁగలను.

అర్జు — స్వామీ! సాక్షాద్భగవంతుఁడవగు నీవు చెప్పెడి యీవాక్యము నిజమైనదిగనే యుండునుగాని యబద్ధముగానేరదు. అయినను, అజ్ఞుఁడనగుటచే నాకొక సంశయము గలుగుచున్నది. దానిని విన్నవించెద నాకర్ణింపుము. అదేమనిన, నీవు నిర్గుణుఁడగు పరమాత్మవుగదా? ఇట్టి నిన్నుఁబొందుటకు నీవలెనే త్రిగుణాతీతుఁడైననేగాని సాధ్యపడదని యింతకుముందు నీవే చెప్పియుంటివిగదా? (చూ 14. 20) ఎవఁడైననుసరే సమస్తపాపములనుండి విముక్తుఁడైననేగాని యట్టిగుణాతీతుఁడుగానేరఁడుగదా? అట్లు పాపవిముక్తుఁడగుటకు జ్ఞానయోగముగాని లేక నిష్కామకర్మయోగముగాని యాచరించవలెనుగదా? లేక కామ్యకర్మముల నాచరించెడివాఁడైనయెడల నట్టి కర్మలయందలి పాపములనశింపఁజేయఁదగిన తపోయజ్ఞదానాదులనైనఁ జేయవలెనుగదా? ఇట్టియేధర్మముల నాచరింపనినేను నిన్ను ఊరక ధ్యానించి భజించినంతమాత్రముచేత నెట్లుపొందఁగలను అనియెడు సంశయము వొడముచున్నది. కనుక నన్ననుగ్రహించి నాయీసంశయమును తొలఁగింపఁ బ్రార్థించెద.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ॥ 66

అర్థము:— సర్వధర్మాన్ + పరిత్యజ్య = సమస్తధర్మములను విడిచి (అనఁగా నీప్రపంచంబునఁగల పాపనాశకరములగు ననేక ధర్మములలో నేదేని యొక్కదానినైన నాచరింపకపోయినను సరే అనిభావము), మామ్ + ఏకమ్ + శరణమ్ + వ్రజ = నన్నొకనిని మాత్రము శరణము పొందుము (అనఁగా, పాపములను దొలఁగింప సమర్థుఁడగువాఁడు నాకంటె మఱియొకఁడు లేఁడనియెడు నిశ్చయబుద్ధితో నా రక్షకత్వమును గోరితివేని—అనిభావము), అహమ్ = నేను, త్వా = నిన్ను, సర్వపాపేభ్యః = సమస్తపాపములనుండి, మోక్షయిష్యామి = విముక్తునిఁజేసెదను, మాశుచ = దుఃఖింపకుము, (సందేహింపకుము).

కృ — ఓయి యర్జునా! నీకిపుడు కలిగియుండు సంశయము సహజముగ నందఱికిని గలుగఁదగినదే కాని విపరీతమైనది కాదు. అయినను, నీవిదివరకెట్టి పాపములఁజేసి యుండినను సరే ఆపాపము లెంతఘోరములైన వైననుసరే వానిపరిహారార్థము జ్ఞాన, కర్మ యోగములనుగాని, తపోయజ్ఞదానాదులనుగాని చేయక పోతినే యెట్లు తరింపఁగలను అని చింతింపఁబనిలేదు. అట్టిధర్మము లేవియుఁ జేయకయే తరించుటకుఁదగిన సులభోపాయ మొకటిగలదు. దానిం జెప్పెదవినుము. అదేమనిన, నీపాపములను హరింపఁజేయుశక్తిగలవాఁడను నేనేగాని మఱియొకఁడు లేఁడనియెడు నిశ్చయబుద్ధితోఁ ద్రికరణశుద్ధిగా నన్నాశ్రయించి

" శ్లో॥ అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ "

అనియు, " సర్వాపరాధాన్ క్షమస్వ " అనియు, " మాంపాహి - మాంపాహి " అనియు నన్ను శరణము వేడి నానామమును స్మరింపుము. అట్లుచేసితివేని " బ్రహ్మహత్యానేక-పాపాటవులకగ్ని కీలలు హరినామ-కీర్తనములు " అనునట్లు నీ సమస్తపాపములను వెంటనే నశింపఁజేతును. అట్లు విగతకల్మషుఁడవెప్పు డగుచున్నావో అప్పుడు నీవునన్ను బొందుట కర్హుఁడవగుచున్నావుగదా? ఓయి యర్జునా! నీవే కాదుసుమా. స్త్రీహత్య, శిశుహత్య, గోహత్య, బ్రహ్మహత్య, గురుహత్యాదులును; రాజద్రోహ, స్వామిద్రోహ, మిత్రద్రోహ, మాతృద్రోహాదులును; పరస్త్రీగమన, పరధనాపహార, పరహింసాదులును ఇట్టి ఘోరపాతకముల నెన్నిటిని జేసినవాడైనను సరే ఆర్తుడై నన్నాశ్రయించి,

" శ్లో॥ అమర్యాద క్షుద్రశ్చల మతిరసూయా ప్రసవభూః
కృతఘ్నో దుర్మానీ స్మర వశపరో వఞ్చనపరః నృశంసః పాపిష్ఠః
కథమహమితో దుఃఖజలధే
రపారాదుత్తీర్ణ స్తవపరిచరేయం చరణయోః "

అని నైచ్యానుసంధానము చేసినపుడు నేఁజెప్పినప్రకారము, అనఁగా, " అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణంమమ " అనియు, " సర్వాపరాధాన్ క్షమస్వ " అనియు, " మాంపాహి మాంపాహి " అనియు శరణము వేడిన యెడల వాని పాపములన్నిటిని వెంటనే నశింపఁజేయుదును. అట్లుండ, సత్కులప్రసూతుండవును సదాచార సంపన్నుండవును నాకుఁ బ్రియుండవునగు నీదు పాపముల నశింపఁజేయుట యొక విషయమా? కాఁబట్టి నీవా విషయమునుగూర్చి యేమియుఁ జింతింపఁబనిలేదు. ధైర్యముగనుండుము. అయితే, ఓయియర్జునా! ఇట్టిమహాపాతకములఁ జేసినవాఁడింత సులభముగ నెట్లు పాపవిముక్తుఁడు కాగలఁడని నీవు సందేహింతువేని యిందుకీలోకమున ననుభవసిద్ధమగు నొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము. ఓయియర్జునా! ఈలోకమున సజ్జనుండగు నొకనికి నలుగురు పుత్రులుగలరనియు, అందొకఁడు కేవలము దుర్మార్గప్రవృత్తి నవలంబించి తండ్రి యాజ్ఞల నుల్లంఘింపుచు నిల్లువెడలిపోయి దుష్టులతోఁజేరి యనేకవిధములగు పాపకృత్యముల జేయుచున్నాఁడనియు యెంచికొనుము. అట్టివానియెడల వానితండ్రికి మిగులఁ గోపము గలిగియుండునా లేదా?

అర్జు — అవును. మిగులఁగోపము గలుగుట సహజమే.

కృ — మంచిది, అట్టివాఁడొకప్పుడొక గొప్పనేరము చేసి యందుకుఁగాఁ దన్ను

రాజభటులు పట్టుకొనగమనింప నాసడిగని భీతుఁడై యాభటులబారినుండి తన్నుఁ దప్పింపఁదగినవారి నెవరినిం గానక తనతండ్రియొద్దకుఁబోయి శరణాగతుఁడైన యెడల నాతఁడు పుత్రవాత్సల్యముచేఁ దప్పు క్షమించి కాపాడునని యెంచి పరుగిడుచువచ్చి యాతని పాదములపైఁబడి “ తండ్రీ! నేను అపరాధిని, నన్ను రాజభటులు పట్టుకొనిపోవ గమకించుచున్నారు వారిబారినుండి నన్నుఁ దప్పించి కాపాడఁదగినవాఁ డెవఁడును గానరాఁడు. నన్నుఁ గనిపెంచిన వాఁడవగుటచే నాతప్పిదములను క్షమించి కాపాడుటకు నీవొక్కఁడవుగాని యన్యులెవరుగాన నిన్ను శరణుసొచ్చినాను. నన్ను రక్షింపుము రక్షింపుము ” అని యతిదీనుఁడై వేడికొనుచున్నాఁడని యెంచికొనుము. అపుడు వానితండ్రి యేమిచేయును ? అట్లతిదీనుఁడై తన్నాశ్రయించి శరణమువేడిన పుత్రునియెడలఁ గరుణించి కాపాడునని యెంచెదవా, లేక, వానియెడల నదివఱకుఁ గలిగియుండెడుఁ గోపముచే వాని నిరాకరించునని యెంచెదవా ?

అర్జు — వాఁడెట్టి దుర్మార్గుఁడైనను వానియెడల నెంత కోపముండినను వానిం గనిపెంచిన తండ్రియగుటచే వాఁడత్యాపన్నుఁడై యంతదీనత్వముతోఁ దన్ను శరణము వేఁడుచున్నపుడు వానితండ్రికి పుత్రవాత్సల్యతచే నదివఱకుండిన కోపము పోయి కరుణ గలుగక మానదనియే తోఁచుచున్నది.

కృ — అవునుగదా, అట్లే యీలోకమునందలి సమస్తప్రాణులకును నేను దండ్రి నేగదా ?

అర్జు — అవును ఈసమస్తచరాచర ప్రపంచమునకును బ్రకృతి తల్లియనియు నీవు తండ్రిననియు నిదివఱకే చెప్పియుంటివిగదా !

కృ — మంచిది, అట్లుండ నొక మనుష్యమాత్రుఁడే శరణాగతుఁడగు తన పుత్రుని నేరములక్షమించి వానిం గాపాడఁజూచినచో, సర్వశక్తుండనై కరుణాసము ద్రుండను, శరణాగతవత్సలుండను, భక్తసులభుండను, అని బిరుదుల వహించి యుండు నన్ను నాసంతానములోఁ జేరినయొకఁడు పాపభీతిచే నతిదీనుండై తన్ను రక్షింప సమర్థులు నాకంటె నన్యులు లేరనియెంచి నన్ను శరణమువేడినచో నేను వాని నుపేక్షింతునని యెంచఁగలవా ? ఓయి యర్జునా! నేనేల, పూర్వము గజేంద్రుఁడు మకరిచేఁజిక్కి నన్నుగూర్చి యనేకవిధములు మొరలిడియు నేఁ బలుకకుండి తుదకు “ నీవేతప్ప యితఃపరంబెఱుఁగ మన్నింపందగుం దీనునిన్, రావేయీశ్వర! కావవే వరద ! సంరక్షించు భద్రాత్మకా ! ” అని శరణము వేడిన వెంటనే యతి త్వరితముగఁబోయి మకరిని వధించి యాకరిరాజును గాచియుండలేదా ! పూర్వము శ్రీరామావతారకాలంబున నాయెడల మహాపరాధము నొనర్చిన కాకాసురునిపై నొక

ర్భహోచ నభిమంత్రించి ప్రయోగింపఁగా నది యమోఘబాణంబై వెంటనంట వాఁడు పరుగిడుచు ముల్లోకములం దిరిగియుఁ దన్నా బాధనుండి తప్పింప సమర్థులగువారల నెందునుంగానక మరలివచ్చి నా పాదముల పయింబడి యత్యాపన్నుఁడై శరణము వేఁడి నంత మాత్రముచేతనే నానిం గాపాడియుండలేదా? మఱియు నజామిళుఁడను నొక బ్రాహ్మణుండొక శూద్ర స్త్రీనిమరగి తనకులాచార ధర్మములనన్నిటి నేటఁగలిపి యనేక ఘోరపాపముల నార్జించి [illegible]కవసాన కాలంబునఁ దన్ను బంధించికొని పోవచ్చిన యమభటులఁ జూచి "వికలేంద్రియుండును, వికంపితప్రాణుండును, [illegible]తలోచనుండును, విహ్వలాత్మకుండునునై" దూరముననాడుచుండిన తనబాలునిఁ బిలుచుటలో (నారాయణ) యనియెడు నానామమును మూడుమార్లుచ్చరించుటంబట్టి విష్ణుభటులు సందర్శనంబొసంగి యమభటుల నివారించుటంజేసి యజ్ఞానంబునాసి యప్పుడు తన ఘోరపాతకంబులందలంచి

"ఆ. పాతకుండ జడుఁడ బ్రహ్మఘాతకుఁడను
మానలోభ మోహమత్సరుండ
నాకు నెట్లు దొరకు నారాయణుని దివ్య
నామ విమలకీర్తనంబు మదికి?" (భాగ. ౬. స్కం. ౧౮౫.)

అని చింతించి చిత్తసమాధియుక్తుండై త్రికరణ శుద్ధిగా నన్ను శరణంబు వేఁడి నంత మాత్రముచే నతఁడు కృతార్థుఁడైయుండలేదా? ఇవియన్నియు లోకప్రసిద్ధములైన విషయములేకదా? ఓయియర్జునా! వీరలందఱు నెట్టిధర్మముల నాచరించుటచేఁ బాపములనుండి తొలఁగింపఁబడిరి? ఆర్తులై నన్ను శరణమునొందుట తప్ప నితరమైన యేధర్మము నాచరించినవారు కారుగదా? కనుకనట్లే నీవును నెట్టిపాపములఁ జేసిన వాఁడవైననుసరే, ఏ ధర్మము నాచరింపకపోయిననుసరే, నన్నుమాత్రము శరణము వేఁడితివేని నీపాపములనన్నిటిని బోఁగొట్టి రక్షించెదను భయపడకుము. ఓయి యర్జునా! ఇంతవఱకు నే నీకుఁజెప్పిన యన్ని విషయములలో నిది పరమరహస్యమును నా [illegible]వాక్యమునైయున్నది. ఇంతకంటె మిక్కిలి నే నీకుఁ జెప్పవలసిన దేమియు శేషము.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతి॥ 67

అర్థము:– ఇదమ్ = ఈపరమరహస్యము (అనఁగా, 66 శ్లోకములలోఁ జెప్పఁబడియుండువిషయము), అతపస్కాయ = తపములేనివానికొఱకు, న + వాచ్యమ్ = చెప్పఁదగినదికాదు. తే = నీకు (నీయెడల), అభక్తాయ = భక్తిలేనివానికొఱకును

అశుశ్రూషవే = శుశ్రూషచేయనివానికొఱకును, న+(వాచ్యమ్) = చెప్పఁదగినది కాదు. (అపి)+చ = మఱియును, యః = ఎవఁడు, మామ్ = నన్ను, అభ్యసూయతి = ద్వేషింపుచున్నాఁడో, (తస్మై) = వానికొఱకు, న+కదాచన = ఎప్పటికిని జెప్పఁదగినది కాదు.

అయితే, ఓయియర్జునా! నీవు నాకంతరంగభక్తుఁడవు గాన నీపరమ రహస్యము నీకుఁ జెప్పఁబడినదిగాని యందఱకును జెప్పఁదగినది కాదు. కనుక నీపీరహస్యమును అతపస్కునికిని, అనఁగా, తపస్సులేనివానికిని, నీయెడల భక్తిశ్రద్ధలు లేనివానికిని, చెప్పఁగూడదు సరేగదా, నన్ను ద్వేషించెడువారికి బొత్తిగనే చెప్పఁగూడదు.

అర్జు — స్వామీ! తపము లేనివానికిఁ జెప్పఁగూడదంటివిగదా, అందువలన నీయభిప్రాయమేమి? సర్వసంగ పరిత్యాగియై యడవిలోఁజేరి తపస్సు చేయనివానికిఁ జెప్పఁగూడదనియా నీ తాత్పర్యము?

కృ — కాదు కాదు.

“ఆ. అధ్వరంబుకంటె నధికంబు దపము ద
పంబునంగమేని ప్రన్నదనము
నివురఁజేతగా దహింసయు సత్య వా
క్యంబు దమముదయయుఁ గానియరయ.” (భార. శాంతి. ౨ అ. ౩౮౧.)

అనునట్లు, ఉపవాసాదులచే దేహమును కృశింపఁ జేసినంతమాత్రముచేతనే తపస్వులు గానేరరు. మఱెట్టివారు తపస్వులనఁగాఁ జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! దేవద్విజగురు ప్రాజ్ఞపూజనము – శౌచము – ఆర్జవము – బ్రహ్మచర్యము – అహింస – మొదలగునవి కాయిక తపో లక్షణములనియు, పరులకుఁ బ్రియకరములుగను హితకరములుగను నుండునట్లు చల్లదనముగ మాటలాడుట – సత్యము పలుకుట – వేదశాస్త్ర పురాణాదుల జదువుట – మొదలగునవి వాచిక తపోలక్షణములనియు, మనఃప్రసాదము – సౌమ్యత్వము – మితభాషిత్వము – మనోనిగ్రహము – చిత్తశుద్ధి – మొదలగునవి మానసిక తపోలక్షణములనియు, ఇంతకుముందు చెప్పియుంటినిగదా జ్ఞాపకమున్నదా? (చూ. 17. 14, 15, 16.)

అర్జు — అవును జ్ఞాపకమున్నది.

కృ — ఇట్టి లక్షణములు గలవాఁడెవఁడో వాఁడే తపస్వి యగునుగాని యట్టి లక్షణములు లేక యూరక కాయక్లేశకరములగు నుపవాసాది వ్రతముల నాచరించుటచేఁ దపస్వి కానేరఁడు. కనుక నట్టి లక్షణములు గలవాఁడే యిట్టి

పరమరహస్యమును గ్రహించి యందుల ఫలమును బొందఁగలఁడు గాని తదన్యుఁడు పొందఁజాలఁడుగాన నట్టిలక్షణములు లేనివానికీ పరమరహస్యమును జెప్పఁగూడదని నా తాత్పర్యము.

మఱియు, నీయెడల భక్తిశ్రద్ధలుగలిగి నీకు శుశ్రూష చేయనివానికిఁగూడ నీ పరమ రహస్యమును జెప్పరాదు. ఏల యనఁగా, గురువు నెడల భక్తి శ్రద్ధలులేని శిష్యున కాగురువు చెప్పెడు వాక్యములయందు నమ్మకము గలుగనేరదు. కాఁబట్టి నీయెడల భక్తి శ్రద్ధలులేనివాని కీరహస్యము నుపదేశించిన యెడల నదివ్యర్థము కాఁగలదు. కనుకనే, "తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అని నీ కింతకుముందు నేఁజెప్పుటకుఁ గారణమైనది. (చూ. 4. 34.)

ఇఁకను నాయెడల ద్వేషబుద్ధి గలవానికన్ననో, బొత్తిగనే చెప్పఁగూడదు. ఏలయనఁగా, నన్ను ద్వేషించెడువాఁడు నిరీశ్వరవాది యనఁబడుచున్నాఁడు. అనఁగా, ఈప్రపంచమునకు సృష్టి స్థితి లయకర్తయగువాఁడు లేడనియు, ఈ ప్రపంచము తనంతటనే యుత్పన్నమగుచున్నదనియు నెంచెడువాఁడైయున్నాఁడు. అట్లెంచని వాఁడైన యెడల నన్ను ద్వేషింపఁజాలఁడు గదా? కాఁబట్టి యట్టివాని కిట్టి పరమరహస్యమును జెప్పినయెడల వాఁడు దానిని నమ్మకపోవుట యటుండఁగా. మీఁదు మిక్కిలి యట్టి యుపదేశమును జేసినవానిని పరిహసించును. కాన నట్టివానికి బొత్తిగఁ జెప్పనే కూడదని నాతాత్పర్యము.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥ 68

అర్థము:— యః = ఎవఁడు, ఇదమ్ = ఈ, పరమమ్+గుహ్యమ్ = పరమ రహస్యమును, మద్భక్తేషు = నాభక్తులయెడల (నాభక్తులకు), అభిధాస్యతి = చెప్పుచున్నాఁడో, (సః) = వాఁడు, అసంశయః+(సన్) = సంశయరహితుఁడై, మయి = నాయందు, పరామ్+భక్తిమ్ = పరమభక్తిని, కృత్వా=చేసి, మామ్+ఏవ = నన్నే, ఏష్యతి = పొందఁగలఁడు.

అట్లుగాక, నాయెడల భక్తిగలవారల కీపరమరహస్యము నుపదేశించిన యెడల ద్విగుణంబగు ఫలము గలుగును. అదెట్లనిన, ఈ యుపదేశమును బొందెడువాఁడు అంతకుముందే నాయెడల భక్తిశ్రద్ధలు గలవాఁడై యుండుటంబట్టి నన్ను నమ్మి భజించెడువారి పాపములన్నియు నింతసులభోపాయముచే హరింపఁబడఁగలవనియు, అందువలన వారు మోక్షార్హులు గాఁగలరనియు నమ్మఁగలఁడు. అట్లు నమ్ముటచే వార లాయుపదేశమునందు గుఱిగలవారలై యాప్రకారమాచరించి కడతేరఁగలరు. ఇఁకను వారల కుపదేశించెడువాని కేమిఫలము గలుగుచున్న దనఁగా, వాఁడంతకుముందా విషయమున, అనఁగా, ఇంత సులభోపాయముచే నొకని పాపములన్నియు హరించి

వాఁడు మోక్షార్హుఁడు కాఁగలఁడా, అనేవిషయమున నేదేని కొంత సంశయము గలవాఁడైయుండినను, తనవలన నుపదేశముఁబొందిన నాభక్తులా యుపదేశమును నమ్మి యందువలనఁ గడతేరుటఁ జూచినవెంటనే ఆసులభోపాయము నెడలఁ దన కదివఱకుఁ గలిగియుండెడు కించిత్తు సంశయము గూడ విడిచిపోఁగలదు. కాన నట్లెప్పుడు సంశయరహితుఁడగుచున్నాఁడో, అప్పుడు వాఁడును నీపరమోపాయము నెడల సంపూర్ణనమ్మకము గలవాఁడగును. అట్లు సంపూర్ణమగు నమ్మకము గలవాఁ డెప్పుడగుచున్నాఁడో, అప్పుడువానికి నాయం దదివఱకు గలిగియుండెడు భక్తియతిశయించి నాకు పరమభక్తుఁడై నన్ను శరణువేడి యందువలన సమస్తపాపములనుండి విముక్తుఁడై నన్నుఁ జేరఁగలఁడు. ఈవిషయమునుగూర్చి యనుభవసిద్ధమగు నొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! ఈలోకమున నెట్టి ఘనౌషధములచేతనైనను గుదురని కుష్ఠు మొదలగు కొన్ని గొప్పవ్యాధులచేఁ బీడింపఁబడుచుండెడువారిలో నొకానొకనికి వాని యదృష్టవశమున నొక పరమహంస దర్శనము లభించి యాయనచే నుపదేశింపఁబడిన యొక స్వల్పమూలిక నుపయోగించుటచే నాగొప్పవ్యాధి నివర్తించి యారోగ్యవంతుఁడగుటను వినియుందువు గదా?

అర్జు — అవును. అట్లగుటను వినియున్నాను.

కృ — మంచిది. అట్టియొక గొప్పవ్యాధిచే బాధింపఁబడుచుండెడు నొకనికొకమహనీయుని దరిశనము లభించినపుడా మహనీయుఁడు వానియెడలఁ గరుణించి, “ఓయీ! నీవు ప్రతిదినమును ప్రాతఃకాలమునఁ బరగడుపున నాలుగు గుంటగలగరాకు దళములను భక్షింపుచుండుము. ఇట్లొకమాసము వఱ కాచరించితివేని నీకుఁ గల యీ జాడ్యము నిశ్శేషముగ నివర్తి కాఁగలదు” అని చెప్పుచున్నాఁడు. అది విన్నయారోగి యాయన మహనీయుఁడని యెఱిఁగియుండినను, ఆయిన యుపదేశించినమూలిక యే పెఁటదిబ్బ మీఁదఁ జూచినను మొలచియుండునదియు, అత్యల్పమైనదియు నైయుండుటచే దానియందుఁ గొంతగుణముండిన నుండవచ్చుగాని యేలాటి ఘనౌషధములచేతను గుదురని యీగొప్పజాడ్యమును గుదర్పఁగల శక్తి యుండునా? అని సందేహించి దాని నుపయోగించుట యందుపేక్షఁజేయుచున్నాఁడు. అట్లుండ నొకనా డీలాటి జాడ్యముచేతనే బాధపడుచుండెడువాఁడును, ఇట్టి వ్యాధులేవైన నొక పరమహంస క్రియచేతనేగాని యితరయౌషధముచేఁ గుదరనేరవని యితరులచే విని యట్టి పరమహంసక్రియ తనకెవనిచే నెట్లు తటస్థింపఁగలదని చింతింపుచుండువాఁడును నగు మఱియొకఁడు వీనికిఁ దటస్థపడి యాయిరువురును దమ స్థితిగతుల నొకనితో నొకఁడు చెప్పుకొనుటలో, మొదటివాఁ డంతకుముందు కొన్నిదినముల క్రిందటఁ దనకా మహనీయుఁ డుపదేశించిన మూలికసంగతి రెండవవానికిఁ జెప్పుచున్నాఁడు. అంతట నారెండవవాఁడు పెన్నిధిఁగన్న పేదవానివలె సత్యంతానంద

ఛరితుఁడై యామూలికను నెలదినము లాప్రకారము నుపయోగించి యందువలన నిరోగి యగుచున్నాఁడు అని యెంచికొనును. దానిం జూచినపిమ్మట, నామొదటివాని కదివరకు గలిగియుండిన సంశయమువిడిచి తానును నాప్రకారముగనే చేసి తన జాడ్యమునుగూడఁ బోగొట్టుకొనఁ బ్రయత్నించునని యెంచెదవా ? లేక మునుపటి వలెనే యూరకుండునని యెంచెదవా ?

అర్జు — ఆమూలికయొక్క ప్రభావము నెఱుఁగకపోవుటంబట్టి తొలుత సందేహించి యూరకుండినను, దాని ప్రభావము నెఱింగినపిమ్మటఁ దానును దనవలన నుపదేశము నొందినవానివలెనే దాని నుపయోగించి యంతుల మేలును బొందఁజూచునే గాని యూరకుండఁడు.

కృ — అవునుగదా, అట్లే యీపరమోపాయంబు నెఱిఁగియు దానియొక్క ప్రభావమునుగూర్చి యేదేనికొంత సంశయముగలిగియుండెడువాఁడా పరమోపాయంబును దా నవలంబింపకపోయినను, నాయందు నమ్మకముగల నాభక్తుల కుపదేశించిన యెడల నందువలన నాయుపదేశమును బొందినవారలు తరించుటమాత్రమే గాక, దాని నుపదేశించినవాని కదివఱకుఁ గలిగియుండిన కొద్దిసంశయముగూడ విడిచిపోయి వాఁడును నాయందు నమ్మకముగలవాఁడును, పరమభక్తుఁడును నై నన్నుఁ జేరఁ గలఁడు. కావునఁబట్టి యోయియర్జునా ! నీవిప్పరమోపాయంబును

"క. నియతియు దమమును నీదెస
భయభక్తులు గలిగినాకు భక్తుండై ని
శ్చయనిపుణుఁడైన వానికిఁ
బ్రియమున నెఱిఁగింపు వలదు పెఱవారలకున్." (భార.భీష్మ.౧ఆ.౨౨౭.)

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥ 69

అర్థము :— మే = నాకు, తస్మాత్ = వానికంటె, ప్రియకృత్తమః = అత్యంతప్రియమును జేయువాఁడు, మనుష్యేషు = మనుష్యులలో, కశ్చిత్ = ఒక్కఁడైనను, న + చ = లేనేలేఁడు, మే = నాకు, తస్మాత్ = వానికంటె, ప్రియతరః = ఎక్కుడు ప్రియుఁడు, అన్యః = మఱియొకఁడు, భువి = భూమియందు, భవితా + న + చ = కలుగనే కలుగఁడు.

ఓయి యర్జునా ! ఇట్లెవఁడు చేయుచున్నాఁడో. అనఁగా, ఇట్టి లక్షణములు గల నాభక్తులకీ పరమోపాయము నెవఁడుపదేశించుచున్నాఁడో, వాఁడే నాకుఁ బ్రియము సేయు వారందఱిలో నుత్తముఁడగుచున్నాఁడుగాన వానికంటె నెక్కుడు ప్రియుఁడు నాకీ భూలోకమున మఱియొకఁడుండఁడు. అదెట్లనఁగా నింతున కొక దృష్టాంతమును జెప్పుచున్నాను వినుము.

ఓయి యర్జునా! నీవు మిక్కిలి రుచికరములును శ్రేష్ఠములు నగు మామిడి పండ్లను మూటిని గొనివచ్చి నీ కిష్టులగు ముగ్గురికిచ్చుచున్నావు. ఆముగ్గురును ఆఫలములు భక్షించి యందుల రుచికి మిక్కిలి యానందించుచున్నారు. అయితే, అందొకఁడు తాఁదిన్న ఫలముయొక్క ముట్టెను (విత్తనమును) పారవేయుచున్నాఁడు. మఱియొకఁడు చవిటిభూమిలో నాటుచున్నాఁడు. మూఁడవ వాఁడట్లు వ్యర్థపుచ్చక మంచి రసవంతమగు భూమియందు నాటి యది మొలచినపిమ్మట దానికిఁ బ్రోదిచేసి యప్పుడప్పుడు నీళ్లుపోయుచుఁ గొంత కాలమువఱకు గాపాడుచున్నాఁడు. అట్లు చేయుటవలన నది గొప్ప వృక్షమై యనేక ఫలముల నిచ్చుటచే ననేకు లాఫలములం దిని యానందించుటకుఁ గారణమగుచున్నది అని యెంచికొనుము. ఈముగ్గురిలో నెవఁడు శ్రేష్ఠుఁడని యెంచెదవు?

అర్జు — మూఁడవవాఁడే శ్రేష్ఠుడని యెంచఁదగియున్నది. ఏలయనఁగా, వాఁడు తనకివ్వఁబడిన ఫలమును దా ననుభవించి యానందించుటయే గాక, దానివలన నట్టి ఫలము లనేకము లుత్పత్తియగునట్లును, ఆఫలముల ననేకులు భక్షించి తనవలెనే యానందించు నట్లును జేసిన వాఁడగుచున్నాఁడు. కాన వాఁడే ఆముగ్గురిలో మిక్కిలి శ్రేష్ఠుఁడగుచున్నాఁడు.

కృ — అవునుగదా, అట్లే యీ పరమరహస్యము నితరుల కుపదేశింపనివాఁడు పైఁ జెప్పఁబడిన దృష్టాంతములోని మామిడిపండును దిని దాని ముట్టెను బారవేసిన వాని వంటివాఁడును, ఈ పరమరహస్యమును శాంత శమ దమాది సుగుణసంపత్తియు, నాయెడల భక్తి శ్రద్ధలును లేనివాని కుపదేశించెడువాఁడు తాఁ దిన్నఫలముయొక్క విత్తనమును చవిటినేలను నాటిన వాని వంటివాఁడును, అట్లుగాక యిప్పరమోపాయంబును శాంత శమ దమాది సుగుణ సంపద్యుక్తుఁడై నాయెడల భక్తిశ్రద్ధలు గల వాని కుపదేశించెడువాఁడు, తాఁ దిన్నఫలముయొక్క విత్తనమును వ్యర్థపుచ్చక సారవంతమగు భూమియందు నాటినవాని వంటివాఁడును నగుచున్నాఁడు.

శ్లో॥ అధ్యేష్యతేచయఇమం ధర్మ్యంసంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మేమతిః॥ 70

అర్థము :— యః + చ = ఎవఁడైతే, ఆవయోః = మనయొక్క. ఇమమ్ = ఈ, ధర్మ్యమ్ = ధర్మవిరుద్ధము కాని. సంవాదమ్ = సంభాషణను, అధ్యేష్యతే = అధ్యయనము సేయుచున్నాఁడో, తేన = (అట్టి) వానిచేత, అహమ్ = నేను, జ్ఞానయజ్ఞేన = జ్ఞానయజ్ఞముచేత, ఇష్టః + స్యామ్ + ఇతి = పూజింపఁబడినవాఁడ నగుదునని, మే + మతిః = నాయభిప్రాయము.

ఓయి యర్జునా! ఇపుడు మనకు జరిగిన సంభాషణలో నే నీకుఁజెప్పిన విషయములలోఁ గొన్ని, అనఁగా, గురు, బంధు, మిత్ర, వధారూపకమగు నీయుద్ధమును

జేయవచ్చునని చెప్పుటయు. ఎట్టి దురాచారవంతుఁడైనను సరే నన్నచంచల భక్తిచే భజించినయెడల సదాచారసంపన్నునితో సముఁడగు చున్నాఁడనియు, ఒకఁడెంత హీనకులంబునఁ బుట్టిన వాఁడైనను సరే ఆకులాచారముల ననుసరించి యెట్టి క్రూర కృత్యంబులఁ జేసినవాఁడైననుసరే, ఫలాసక్తిరహితుఁడై నాయందు చిత్తముంచి చేసిన యెడల వాని కాపాపమంటదనియు, ఈ మొదలగు కొన్ని విషయములు ధర్మవిరుద్ధములుగా నున్నట్లు నీకొకవేళఁ దోఁచినను దోఁచియుండవచ్చును. అయితే, అవి యన్నియు ధర్మశాస్త్ర సమ్మతములైనవే గాని విరుద్ధములుగావని రూఢిగా నమ్ముము. వేయేల మనప్రస్తుతపు సంభాషణలోని విషయములన్నియు నెంతధర్మ్యములు (ధర్మశాస్త్రసమ్మతములు) అనఁగా. వాని నాచరించెడు వానికి సద్గతిగలుగుట యటుండఁగా, వానిం బ్రతిదినమును శ్రద్ధతో నధ్యయనము చేసినంతమాత్రముచేతనే జ్ఞానయజ్ఞముతో నన్నారాధించినవాఁడగుచున్నాఁడు. అనఁగా, జ్ఞానియైనవాఁడు నన్నుఁ బొందుటకెట్లర్హుఁ డగుచున్నాఁడో, అట్లే, ఈ మన సంభాషణరూపకమగు గ్రంథమును, పారాయణముచేసినవాఁడును నన్నుఁ బొందుటకు, అనఁగా, మోక్షపదవినిఁ బొందుటకుఁ అర్హుఁడగుచున్నాఁడనుట.

శ్లో॥ శ్రద్ధావా ననసూయా శ్చ శృణుయా దపి యోనరః ।
సోఽపిముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥ 71

అర్థము: యః+నరః = ఏనరుఁడు, శ్రద్ధావాన్ శ్రద్ధాయుక్తుఁడును, అనసూయః+చ=అసూయారహితుఁడును (అయి), శృణుయాత్ + అపి = వినుచున్నాఁడో, సః+అపి = అట్టివాఁడును, ముక్తః+(సన్) = పాపవిముక్తుఁడై, పుణ్యకర్మణామ్ = పుణ్యకర్మలఁ జేయు వారలయొక్క (పుణ్యాత్ములు పొందదగిన); శుభాన్+లోకాన్ = పుణ్యలోకమును, ప్రాప్నుయాత్ = పొందఁగలఁడు.

ఒకవేళ నెవఁడైన విద్యావిహీనుఁ డగుటచేతఁగాని, లేదా మఱి యేహేతువుచేతఁగాని తనంతటఁదాను పారాయణము సేయుటకు శక్తుఁడు గాకపోయినను, ఇతరులు పారాయణము సేయుచుండఁగా భక్తిశ్రద్ధలతో వినుచుండినయెడల నట్టివాఁడును, అట్లు విన్నంత మాత్రముచేతనే సమస్త పుణ్యకర్మల నాచరించినవారు పొందఁదగిన స్వర్గాది పుణ్యలోకముల సౌఖ్యములను బొందగలఁడు

శ్లో॥ కశ్చి దేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా ।
కశ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ! 72

అర్థము:— హే పార్థ=ఓయి యర్జునా!, ఏతత్=ఇది. (ఈగీతాశాస్త్రము). త్వయా=నీచేత, ఏకాగ్రేణ+చేతసా=నిశ్చలచిత్తముతో, శ్రుతం+కశ్చిత్=వినబడినదా యేమి?, హే ధనఞ్జయ! = ఓధనంజయుఁడా!, తే=నీయొక్క, అజ్ఞానసమ్మోహః=అజ్ఞానమువలనఁగలిగిన దుఃఖము, ప్రణష్టః+కశ్చిత్=నశించినదా యేమి.

ఓయియర్జునా! యింతవఱకు నేఁజెప్పిన విషయములన్నియు శ్రద్ధతో వింటివా లేదా? అట్లు శ్రద్ధతో విన్నవాఁడవైన యెడల నందువలన నీ కింతవఱకుఁ గు అజ్ఞానమువలనఁ గలిగియుండిన దుఃఖము విడిచినదా లేదా? చెప్పుము.

అర్జున ఉవాచ :

శ్లో॥ నష్టో మోహస్స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ ॥ 73

అర్థము :— హేఅచ్యుత=ఓకృష్ణమూర్తీ!, త్వత్ప్రసాదాత్=నీయనుగ్రహము వలన, మయా=నాచేత, స్మృతిః+లబ్ధా=జ్ఞానము పొందఁబడినది, మోహః+ నష్టః = అజ్ఞానము విడిచినది, గతసన్దేహః+స్థితః+అస్మి = సంశయరహితుఁడనై యున్నాను. తవ+వచనమ్+కరిష్యే=నీయాజ్ఞానుసారముగ నడుచుకొనుచున్నాను.

అర్జు :- స్వామీ! నీ యనుగ్రహమువలన నా కింతవఱకుఁ గలిగియుండిన యజ్ఞానమును, బంధుమిత్రాదులయెడలఁ గలిగియుండిన మమకారమును, వారల నెట్లు వధింపఁగల ననెడు సంశయమును విడిచి జ్ఞానోదయమైనది. కాఁబట్టి యోమహాప్రభో!

"ఉ. మోహాతమంబు వాసెఁ మదిముట్టిన నీదుప్రపత్తిపేతసం
దేహుఁడనైతి గాఢపరిదీప్తమహాకృతిఁ గాంచి బోధస
న్నాహనిరామయస్థిరమనస్థితిఁ బొందితి సర్వలోకని
ర్వాహవినోద నీవిమలవాక్యముచొప్పున నెల్లఁ జేసెదన్" (భార. భీష్మ. ౧ఆ. ౩౩౯)

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్ ॥ 74

అర్థము :— ఇతి=అని (పైజెప్పఁబడినవిధముగ), మహాత్మనః+వాసుదేవస్య= మహాత్ముఁడగు వాసుదేవునియొక్కయు, పార్థస్య + చ = పార్థునియొక్కయు, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు, రోమహర్షణమ్ = పులకాంకురమును గలుగఁ జేయునదియు నగు, ఇమమ్ + సంవాదమ్ = సంభాషణను, అహమ్ + అశ్రౌషమ్ = నేను వింటిని.

సంజయుఁడు :- ఓధృతరాష్ట్రమహారాజా! మహాత్ముండగు శ్రీకృష్ణభగవానులును, అర్జునుండును గురుశిష్యభావముల వహించి జరిగించిన యీయద్భుతసంభాషణంబను నమృతధారలను నాకర్ణపుటంబులచే గ్రోలినాఁడను. ఆ మహావాక్యములఁ దలచినపుడెల్ల నా దేహము పులకాంకురమగుచున్నది.

శ్లో॥ వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్యతమం పరమ్ ।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్ సాక్షాత్కథయతస్స్వయమ్॥ 75

అర్థము :— (అహమ్)=నేను, వ్యాసప్రసాదాత్ = వ్యాసానుగ్రహమువలన, గుహ్యతమమ్=అత్యంతగోప్యమైనదియు, పరమ్=శ్రేష్ఠమైనదియునగు, ఏతత్ + యోగమ్ = ఈయోగమును, స్వయమ్ = తానుగానే, కథయతః = (అర్జునునికి) చెప్పుచున్న, యోగేశ్వరాత్ = యోగేశ్వరుఁడగు, కృష్ణాత్ = శ్రీకృష్ణునివలన, సాక్షాత్ = ప్రత్యక్షముగా, శ్రుతవాన్ = వింటిని.

అత్యంత గోప్యంబగు నీయోగంబును యోగేశ్వరుండగు శ్రీకృష్ణభగవాను లర్జునునికి స్వయముగా నుపదేశించుచుండ నేనామహావాక్యంబులఁ బ్రత్యక్షముగ నాచెవులార వింటినిగదా, అహా! నాభాగ్య మేమని చెప్పవచ్చును? ఓ ధృతరాష్ట్ర మహారాజా! నాకిట్టిభాగ్యము "నీకుఁ గయ్యంబు తెఱంగు వినిపింప నన్ను వియోగించి నాకు నారెండు తెఱంగుల వారి దివారాత్ర ప్రవర్తనంబులు గనునట్లును రహస్య ప్రకార భాషణంబులు వినునట్లును మనోవృత్తంబు తెఱుంగు నట్లునుంగా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబు నొసంగి భారతసమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁకకుండు నట్టిప్రభావంబుఁ బ్రసాదించి దివ్యుల యాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడునట్టి మహనీయ బోధంబును గలుగ ననుగ్రహించిన" (భార. భీ. ౧. ౨ అనుసరణ.) వ్యాసమహర్షి యొక్క కృపవలనఁ గదా కలిగినది?

శ్లో॥ రాజన్! సంస్మృత్యసంస్మృత్య సంవాదమిమ మద్భుతమ్।
కేశవార్జునయోఃపుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ 76

అర్థము :— చ=మఱియును, హేరాజన్ != ఓధృతరాష్ట్రమహారాజా!, కేశవార్జునయోః = కృష్ణార్జునులయొక్క, అద్భుతమ్=ఆశ్చర్యకరమైనదియు, పుణ్యమ్ = పవిత్రమైనదియు నగు, ఇమమ్ + సంవాదమ్ = ఈసంభాషణ, సంస్మృత్య + సంస్మృత్య= తలఁచి తలఁచి, ముహుః + ముహుః = మాటిమాటికి, హృష్యామి = ఆనందించుచున్నాను.

ఓ మహారాజా! శ్రీకృష్ణార్జునులయొక్క యీ సంవాద మత్యద్భుతంబును పవిత్రంబునై యుండుటంజేసి యీ విషయంబున నాకెప్పటికిని మఱపురాక మాటి మాటికిని జ్ఞప్తికి వచ్చుచున్నది. అపుడెల్ల నా మనస్సానందముచే నుప్పొంగుచున్నది.

శ్లో॥ తచ్చ సంస్మృత్యసంస్మృత్య రూప మత్యద్భుతం హరేః।
విస్మయో! మే మహాన్ రాజన్ హృష్యామి చ పునఃపునః ॥ 77

అర్థము :— హేరాజన్ = ఓధృతరాష్ట్ర మహారాజా!, హరేః = శ్రీకృష్ణ మూర్తియొక్క, తత్ + అద్భుతమ్ + రూపమ్ + చ = ఆ యద్భుతవిశ్వరూపమును గూడ, సంస్మృత్యసంస్మృత్య = తలఁచితలఁచి. మే = నాకు, మహాన్ + విస్మయః =

అత్యాశ్చర్యము, (భవతి) = కలుగుచున్నది. పునః + పునః = మాటిమాటికి, హృష్యామి + చ = సంతోషించుచున్నాను.

అంతియగాక శ్రీకృష్ణమూర్తి యర్జుననకు దర్శింపఁజేసిన యా విశ్వరూపము గూడ మాటిమాటికి నాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. అట్లూరూపము నాకుఁ బొడగట్టి నపుడెల్ల నత్యాశ్చర్యమగ్న మానసుండను, పులకాంకిత శరీరుండను నగుచున్నాఁడను.

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ॥ 78

అర్థము :— యోగీశ్వరః = యోగీశ్వరుఁడగు, కృష్ణః = శ్రీకృష్ణమూర్తి, యత్ర = ఎచ్చట (ఏపక్షమందు) ఉన్నాఁడో, ధనుర్ధరః = గాండీవమును ధరించిన, పార్థః = అర్జునుఁడు, యత్ర = ఎచ్చట (ఏపక్షమందు) ఉన్నాఁడో, తత్ర = అచ్చట (ఆపక్షమందు), శ్రీః = సంపదయును, విజయః = జయమును, భూతిః = ఐశ్వర్యమును, ధ్రువా + నీతిః = దృఢమైన నీతియును (కలవని), మమ + మతిః = నాయభిప్రాయము.

వేయిమాటలేల, మహాయోగీశ్వరులకుఁ బ్రభువైనవాఁడు శ్రీకృష్ణమూర్తి గదా? గాండీవంబను నామఁబుచే నీ లోకంబున మిగులఁ బ్రసిద్ధినొందిన ధనస్సును ధరించినవాఁడు అర్జునుఁడుగదా? ఇట్టి యీ మహానుభావు లియవురు నెచ్చటనుంచు న్నారో అచ్చట సంపదయును - జయమును - ఐశ్వర్యమును - నీతియును గలుగు ననుట కేమి సంశయము? కాఁబట్టి,

"తే. అధిప! యోగీశ్వరేశ్వరుండైన కృష్ణుఁ
డును ధనుర్ధర పర్యుఁ డర్జునుఁడు నెచట
నిలిచి రచ్చట విజయంబు. నీతి, సిరియు.
భూతి నిత్యంబు లగునిది నాతలంపు." (భార. భీష్మ. ౧ అ. ౨౩౧)

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే మోక్షసన్న్యాసయోగో నామ అష్టాదశోఽధ్యాయః.

ఇది శ్రీకృష్ణభగవాను లర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పెడు
వ్యాజమున లోకోద్ధరణార్థమై కృపఁజేసిన యుప
నిషదర్థ ప్రతిపాదకంబగు భగవద్గీతాశాస్త్రము
నందలి మోక్షసన్న్యాసయోగం బను
అష్టాదశాధ్యాయము.